శ్రీః.

ముక్కు తిమ్మనార్య విరచిత

# పారిజాతాపహరణము.

శ్రీవిజయనగరమహారాజ సంస్కృతకళాశాలాంధ్రపండిత విద్వద్బిరుదాంకిత

శ్రీబూసి రామమూర్తిశాస్త్రి విరచిత

సురభివ్యాఖ్యాసహితము



ప్రకాశకులు:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే.

ప్రకటితము.

1933

శ్రీః.

ముక్కు తిమ్మనార్య విరచిత

# పారిజాతాపహరణము

## సురభివ్యాఖ్యాసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1933.

# భూమిక.

## కృతికాలము

దేశకాలపరిస్థితులతోఁ గవితావధూటి కడుంగడుఁ జెలిమిగలిగి వర్తిలుట సహజము. అందును నాంధ్రరాజులయండఁ జేరి యనితరసాధారణమగునభివృద్ధినందిన, పెద్దతనమునఁ గన్న నన్నయముద్దుపట్టి యానాయకులయాశయముల ననుసరించి మెలంగుటలోను, వారిదేశపరిస్థితుల నభివర్ణించుటలోను, వారికాలపరిస్థితులఁ బ్రకటించుటలోను, వారితోఁబాటుగ వృద్ధిక్షయములనందుటలోను, వారితో సమముగ సుఖదుఃఖములకు లోనగుటలోను నబ్బుర మేమున్నది? మతాంతరములచే వైదికమతము లుప్తప్రాయమగునను వెఱపు వెలయునాఁడు రాజరాజట్టిమతము నుద్ధరింప బద్ధశ్రద్ధుఁడై శ్రుతిస్మృతిసిద్ధసనాతనధర్మసర్వస్వమునకు ఖనియును, ముదముగొలుపు దనతాతముత్తాతలచరిత్రమునకుఁ దావలమైనదియును బంచమవేదమునాఁ బ్రణుతిగన్నదియును నగు వ్యాసభారతమును దనయాస్థానకవియగు నన్నయచే సర్వజనసంవేద్యము గావింపఁబూనుడుఁ దదనుసారిణియై యాంధ్రకవితాబాల తదాశయము ననుసరించి మెలంగుటయు, దేశము ప్రశాంతమై యలరారుదివసముల దేశాధినాథులు స్వస్థచిత్తులై యెలమిమీఱ వర్తిలురోజుల నాంధ్రకవితాయువతి యనన్యసామాన్యమగునందమున మించి తన యందచందముల నాయకుల ననురాగాంబుధి నోలలాడించుచుఁ దానును వారితోఁ గలిసి యోలలాడుటయు, దేశమును దేశాధినాథులును నారోధనాదులం జేసి యలజడినొందునాఁ డయ్యువతి చెలువేది రూపఱి తత్సమదుఃఖయై యొప్పుటయు, దేశకాలపరిస్థితులయలజడి యుడిగి మహీనాయకులు వంతలందలంగి యలరుకతన నేఁడు పూర్వామిత్రములు నాయకరత్నములు తొలంగినను నవ్వధూటి పలువన్నెలఁ బలుచిన్నెల నెఱపుచు జగన్మోహినియై నటించుటయుఁ, బైని పేర్కొన్న విషయములకుఁ బ్రమాణము లగుచున్నవి.

ఆంధ్రకవితాయువతి నాయకరత్నములతోఁ దానను రాగాంబుధి నోలలాడుననఁదనులఁ బతులమతుల కతులరాగముం గూర్చ వెలయించిన శృంగారవిలాసములే పారిజాతాపహరణమనుచరిత్రాదు లనుట కిసుమంతయు సందియములేదు. అందును బారిజాతాపహరణ మవ్వధూటీ విలాసములలో నింతింతనరానిసొరున మించు మొట్టమొదట వెలసిన విలాసమని తదనితరపూర్వాసమానసౌందర్యమును భావవీథి నిల్పి యే కాంత భావనసల్పుసహృదయులకుఁ దోఁపకపోదు.

కీ॥ శే॥ కం. వీరేశలింగము పంతులుగారించుమించుగా నీ రెండు కావ్యములును నొక్కకాలమందే యనఁగా క్రీ. శ. 1520 ప్రాంతమున రచింపఁబడియుండునని సిద్ధాంతీకరించిరి. కాని మనుచరిత్ర పారిజాతాపహరణములలో మనుచరిత్రమే మొట్టమొదట యుదయమంది తక్కఁగలపారిజాతాపహరణాదిప్రబంధరాశికి మార్గదర్శకమయ్యెనని పలువురువిమర్శకులు భావింతురు. కాని పారిజాతాపహరణమనుచరిత్రను లందలి నాయకమణికృతేతరనాయకరత్నవిజయప్రసంగముల నరయ నరయఁ బారిజాతాపహరణమే మనుచరిత్రమునకన్న మున్ను వెల్వడెనని విశదమగును క్రీ. శ. 1520-21 వత్సరప్రాంతమున జరిగినట్లు విమర్శకులనేకులు తలంచు కలబరిగివిజయమును "ప్రళయఘనాఘనఘాంకృతిభీమచపేటలుతత్కలబరిగిక్షితిరక్షక" అని మనుచరిత్రము నిరూపింప దక్షమై విచక్షణమీఱి వర్తిలుటయుఁ, బారిజాతాపహరణ మీవిషయమునఁ దటస్థముగనుండుటయు నిట్టి పైయూహను ధృఢపఱచుచున్నవి.

కీ॥ శే॥ కే. వి. లక్ష్మణరావుగారు తమపేరిట వెలయు వ్యాసావళిలో నీకలబరిగివిజయయాత్ర క్రీ. శ. 1510, 14, 21, వత్సరములలో నెపుడు జరిగెనో యనుమూఁడువికల్పములు గలవనియు, వీనిలో 1514 క్రీ. శ. వత్సర మనుసిద్ధాంతమే యధికగ్రాహ్యమనియు వ్రాసిరి. (చూ. లక్ష్మణరాయవ్యాసావళి పేజి 44) వారు వ్రాసినటుల నీవిజయయాత్ర రాయలపూర్వదిగ్జైత్రయాత్రకు మున్నే జరిగియుండునెడలఁ బూర్వదిగ్జైత్రయాత్రాప్రసంగములనెల్లఁ బూర్ణముగఁ బూస గ్రుచ్చి

నట్లు తెల్పుపారిజాతాపహరణ మానాయకమణి దగుసుద్విజయము నేల ప్రకటించి శ్లాఘింపకుండెనో యని సందేహింపవలసియున్నది. మఱియు క్రీ. శ. 1512 ప్రాంతమున దక్షిణదిగ్జైత్రయాత్రయు, క్రీ. శ. 1513-15 ప్రాంతమునఁ బూర్వదిగ్జైత్రయాత్రయు రాయ లొనరించి క్రీ. శ. 1515-20 వత్సరముల నడుమ కాలమున విశ్రాంతిఁగైకొనినట్లు విమర్శకులు వాఙ్మయపరిశోధన మొనరించి సిద్ధాంతీకరించియున్నారు. పైని వ్రాసిన విషయము ననుసరించి యవ్విజయమును బూర్వదిగ్జైత్రయాత్రానంతరమే రాయలు చూరఁగొనెననియు, నాకలబరిగి విజయయాత్ర కుఁ బూర్వమే పారిజాతాపహరణమును ముక్కుతిమ్మనార్యుఁడు రచించెననియు నంగీకరించుటయే యుచితమైనట్లు పారిజాతాపహరణప్రణాళిక యీసందర్భమునఁదెల్పుచున్నది. ఏది యెట్లైనను గళింగవిజయమును గటకవిజయమును, స్పష్టముగఁ దెల్పుచుఁ గలబరిగివిజయప్రసంగమును నిసుమంతయుఁ దలంపనికతనఁ, బారిజాతాపహరణనిర్మాణకాలమునకుఁ గలబరిగిని రాయలుజయింపలేదనియు నీవిజయయాత్ర, పూర్వదిగ్జైత్రయాత్రానంతర వృత్తమనియు, దాన నీప్రబంధము పూర్వదిగ్జైత్రయాత్ర ముగిసిన యనతి కాలములోనే, రాయలు గృహమునఁ బూర్వదిగ్జైత్రయాత్రానంతరము విశ్రాంతిగైకొనుసమయములోనే, విరచితమయ్యెననియు నంగీకరించుట కించుకైన సందియంబందఁ బనిలేదని తోఁచెడిని. ఇఁక నీయంశమును దిమ్మకవి పేర్కొనుట మఱచెనేమో యని కొందఱు తలంతురేమో! చిన్నచిన్నపల్లెలవిజయమును బెద్దగఁజేసి కీర్తించినతిమ్మకవి నాయకమణిదగు నీమహావిజయమును బేర్కొనుట మఱచెనుట యంతగ విశ్వాసపాత్రముగాని నమ్మాట నమ్మఁదగినది గాదనియే తలంపవలసియున్నది. కాఁగాఁ బారిజాతాపహరణము పైనివ్రాసినప్రకారము క్రీ. శ. 1515-20 నడుమను, మనుచరిత్రము కలబరిగివిజయానంతరము క్రీ. శ. 1521 విరచితములని ఫలితమును నిర్ణయింపవలసివచ్చినది.

మనుచరిత్రము ప్రబంధసంతతికి మార్గదర్శకమనియు, నట్టిదాని నాదిని రచించుటం జేసియే పెద్దన కాంధ్రకవితాపితామహబిరుదము

గుదిరెననియు ననుపండితప్రకాండులవిమర్శనవాక్యములకుఁ బైసిద్ధాంతము విరుద్ధమగును. కాని సంస్కృతహరివంశమున (68-76) నధ్యాయములలో విపులముగ వర్ణితమైన యీకథను దిమ్మకవి యనుసరించినటుల సంస్కృతాంధ్రీకృతులఁ జెఱియొకచేతంబట్టి పరిశీలించువారికి సుగోచరమగుటంజేసియు, సూర్యాస్తమయచంద్రోదయాది వర్ణనములందకక్కఁదక్కఁగల ప్రధానకథాసందర్భముల నెందును గవి స్వాతంత్ర్యమును వహించినట్లు విశదము గామింజేసియు, నొకొక్కచో మూలము నున్నదున్నటులను నొక్కచో సంగ్రహించియు ననుసరించినట్లు తెల్లమగుటంజేసియు, నీప్రబంధము మనుచరిత్రాదులను సానలుతీరిన జాతిరత్నములనుబోలునదికాదని చెప్పవలసియున్నది. కానఁ బురాణస్థమగు చిన్నకథ నాధారముగఁ గొనితమయిచ్చవచ్చిన పలురూపములగు మార్పులంజేసి పెంచి కూర్చిన వసుచరిత్రాదిప్రబంధములలో మనుచరిత్రము తొలుదొల్తఁ బొడమెననుటలోను, నద్దానఁ బెద్దన కాంధ్రకవితాపితామహబిరుదము గుదిరెననుటలోను వివాదమే లేదనవచ్చును. మఱియు మనుచరిత్రమును రచించుకాలమునకే యాంధ్రకవితాపితామహబిరుదము పెద్దన కల్గియున్నట్లు "ఆంధ్రకవితాపితామహ యల్లసాని పెద్దనామాత్య" అనురాయలవాక్యము స్పష్టపఱచుచుండుటంబట్టి మనుచరిత్రరచనమే పెద్దన కాంధ్రకవితాపితామహబిరుదమునకుఁ గారణమని యంగీకరింప నక్కఱలేదు. ఇంతియగాక యీప్రబంధమున మనుచరిత్రాదులందువలె షష్ఠ్యంతములపిదపఁ బట్టణచాతుర్వర్ణ్యచతురంగబల పుష్పలావికావర్ణనాదులును, నాయికావిరహావస్థ చంద్రమారుతోపాలంభాదివర్ణనములును నగపడకుండుటయు దీనిప్రాచీనతకు దృష్టాంతము గానోపును. తిమ్మకవి పైవర్ణనముల నేదోయొకసందుసేసికొని జొనుపుటకు యత్నించినవాఁడును గాఁడు. తిమ్మకవి యిట్లు తన కావ్యము ననితరసాధారణముగ నిర్మించుటకు మూలానుసృతి యొకటియుఁ, బ్రబంధరచనాసంవిధాన మక్కాలమునకుఁ జక్కఁగ నేర్పడకుండుటొకటియుఁ గారణములని తలంపవలసియున్నది. పైనివ్రాసినవిషయముల ననుసరించి పరిశీలింపఁ బారిజాతాపహరణము ప్రబంధవాఙ్మయసౌధనిర్మాణమునకై తొలుదొల్త నెలకొల్పినశంకుపనియుఁ, బ్రాబంధిక

నియమములఁ బూర్ణముగ వెదఁజల్లు మనుచరిత్రాదులు తదనంతరకాలిక సౌధములనియు నొక్కివక్కాణింపనగును. నడుమనడుమ మార్గమేర్పడుట సహజముగదా! పైనివ్రాసినయుక్తుల ననుసరించి యీ ప్రబంధరత్నము రాయలపూర్వదిగ్జైత్రయాత్రానంతరమే, యనఁగా రాయలు పూర్వదిగ్జైత్రయాత్రను ముగించి యింట విశ్రాంతిగైకొను నైదువత్సరముల కాలములోనే వెలువడి కృష్ణరాయరాజరత్నమునకు లభించెనని చెప్పవలసియున్నది. మనుచరిత్రమన్నో రాయల కలబరిగి విజయయాత్రానంతర ముత్పన్నమై రాయనాయకమణిచిహ్నిత మయ్యెనని తెల్లమగుచున్నది. కాన క్రీ. శ. 1516-20 నడుమఁ బారిజాతాపహరణమును, 1521 క్రీ. శ. తరువాత మనుచరిత్రమును విరచితములయ్యెనని నిర్ధారణ చేయుట కడ్డంకి లేదని తోఁచెడిని.

ఇఁక మనుచరిత్రరచనాసంవిధానమున కెంతయు మెచ్చి రాయలు పెద్దనను బెద్దగ సంభావించుటయుఁ దిమ్మనార్యు నంతగ నర్చింపకుంటయుఁ బారిజాతాపహరణమునకన్న మనుచరిత్రము ప్రాచీన మనుటలోఁ గారణములుగఁ గొందఱందురు. కాని యిది సరికాదు. పెద్దనను గౌరవించినట్లే తిమ్మనార్యుంగూడ రాయలు గౌరవించెనని తిమ్మన చెప్పికొన్న కావ్యాంతమునందలి "కృష్ణరాయక్షితీశకరుణాసమాలబ్ధఘనచతురంతయానమహాగ్రహారసన్మానయుతుఁడు" అను వాక్యమునుబట్టి మన మూహింపవచ్చును. మఱియు మనుచరిత్రము రచింపఁబడుకాలమునకు రాయలు పూర్ణముగ విజయశ్రీసనాథుఁడై యెలమిమీఱ నుండుటయుఁ, బారిజాతాపహరణనిర్మాణకాలమునకుఁ గలబరిగి మున్నగు దుస్సాధముల దుర్గముల జయింపఁదలంపుఁగొనియుండుట నంతగ సంతుష్టుఁడై యుండమియుఁ గారణములని తలంపవలసియున్నది. ఇంతియగాక రాయలు సంపూర్ణవిజయశ్రీని జేపట్టి తనరాజధాని నెలమిమీఱ వర్తిలురోజుల శత్రునాశము నిశ్శేషముగఁ జేసి దుస్సాధములఁ గలబగిర్యాదుల దుర్గములసాధించి యానందాబ్ధి నోలలాడుదివసములఁ బెద్దనయే మిగిలినయాస్థానకవులెల్లరిలోఁ బెద్దయై మిగిలియుండుటయుఁ, బారిజాతాపహరణమును మించునట్లు కొంగ్రొత్తపోకడలఁ బెద్దప్రబంధమును నిర్మించుటయు రాయకృతా

మితగౌరవమునకుఁ బెద్దన పాత్రుఁడగుటకుఁ గారణములని యూహింప నగును. ఎలమిమీఱ రాయలుండునాఁడు తిమ్మనార్యుఁడే యున్నఁ బెద్దన కన్నఁ బెద్దగ నాతనినే సంభావించి యుండుననియుఁ దలంపవచ్చును. మఱియుఁ బారిజాతాపహరణకథ విరివిగ వీరవృత్తమును విశదీకరించుటయు, మనుచరిత్రకథ కేవలము శృంగారమునకు సంబంధించి యమరుటయును, గ్రమముగఁ గృతిపతిదగు నక్కాలపు వీరవ్యాపారమునకును, నితరచింతారాహిత్యమున వెల్లివిరియుశృంగారవ్యాపారమునకును సూచకములనుట కవకాశముండుటం జేసి, పారిజాతాపహరణము రాయలపూర్వదిగ్జైత్రయాత్ర ముగిసినయనతికాలములోనె విరచితమయ్యెననియు, మనుచరిత్రము నిశ్శేషముగ జన్యములయలజడి తీరిన పిదప నుద్భవించినదనియు తీర్మానింపవలసియున్నది.

## కృతికర్త.

ఈ ప్రబంధమును రచించినకవితిలకుఁడు నందితిమ్మనార్యుఁడు. ఈతఁడారేవెలనియోగిబ్రాహ్మణుఁడు. మలయమారుతకవి యనుప్రశస్తివహించిన ఘంటసింగయకు మేనల్లుఁడు. గ్రంథాంతమందలి "కౌశికగోత్రుఁడు" అనుపద్యము పూర్ణముగ నీతనిచరితమును వెల్లడించుచున్నది. ఇతఁడాంధ్రభోజుఁ డనుప్రసిద్ధిఁ బడసిన విద్యానగరప్రభువగు శ్రీకృష్ణదేవరాయలయాస్థానమున నష్టదిగ్గజములను ప్రశస్తివహించిన కవివరులలో నొక్కఁడు. ఈతనియింటిపేరు నందివారు. అయిన నీతనిని ముక్కుతిమ్మన యనియే యెల్లరు వ్యవహరింతురు. "నానాసూనవితానవాసనల" అని ముక్కు నతిమనోహరముగ నీతఁడు వర్ణించినకతన నీతని కీనామముగల్గె ననునానుడి గలదు గాని యీపద్యమును రామరాజభూషణుఁడు తనగ్రంథమునఁ జేర్చికొనెననుకథ యద్దానికన్న మిన్నగఁ జెప్పిన లెక్కకు మీఱిన వసుచరిత్రపద్యములనుబట్టి యాలోచింప నెంతయు విశ్వాసపాత్రముగామిఁ, బైపద్యమును వసుచరిత్రకర్తయే రచించెననియు, ముక్కును ముడివెట్టుటకై పైగాథ నెవ్వరో కల్పించియుంట నది పరంపరగ వచ్చుచున్నదనియు, దీన నీపద్యరచనవలన నీతిని కీనానుడి గల్గెననుట నమ్మఁదగినమాటగాదనియుఁ జెప్పవలసియున్నది. కాని "ముక్కుతిమ్మనార్యుముద్దుపల్కు" అనునభియుక్తోక్తి బహుకాలమునుండియు

విననయ్యెడిని. ముఖ్యముగా నిట్టినానుడి గల్గుటకుఁ బెద్దలనుకొనినట్లు పెద్దముక్కు కారణమని యూహింపనగును.

## కృతినిర్మితికారణము.

శ్రీకృష్ణదేవరాయలు తనసతియగు తిరుమలదేవి తన దెస నొండొక ప్రణయాపరాధము గావింప నమ్మహీజాని యమ్ముగువమోముంజూడక నాఁటఁగోలెఁ గోపావిష్టుఁడై యుండెననియు, నాసతీపతులఁ గలుపుటకై ముక్కుతిమ్మనార్యున కీకృతి రచింపవలసివచ్చెననియు, నిందలిసత్యాకోప సంరంభమును సూచించునట్టియు శ్రీకృష్ణకృతసత్యానునయమును బ్రకాశితమొనర్చునట్టియు ముద్దులొల్కుపద్దెముల విన్నమాత్రమున రాయలు కోపమును విడనాడి ప్రియసతిని సంభావించెననియు నొక కింవదంతి విననయ్యెడిని. నిపుణముగఁ బరిశీలింప నికావ్యమునందలి కథాసంవిధానము పైకింవదంతి కనుకూలముగనే యుంట నట్లే యైయుండనగునని యూహింప ననువగుచున్నది. మఱియు మూలమున లేని సత్యావామపాదకృతశ్రీకృష్ణశిరస్తాడనరూపప్రసంగము నీతఁడు క్రొత్తగఁ గల్పించుటయు నట్టియపరాధిని శ్రీకృష్ణుఁ డభీప్సితదానమున నధికశ్రమకోర్చి సంభావించెనుటయు శ్రీకృష్ణదేవరాయలజాయయగు తిరుమలదేవిదైన యపరాధమునకును నామెను రాయలు సంభావించుటకును సూచకములై యమరుటం జేసియుఁ బైనానుడి సత్యమైయుండు నేమోయని సందియము పొడమెడి. మఱియు "ప్రతివర్షవసంతోత్సవకుతుకాగతసుకవినికరగుంభితకావ్యస్మృతిరోమాంచవిశంకితచతురాంతఃపురవధూప్రసాదనరసికా" అను విషయమును నిందులకు సూచకమే యగుననవచ్చును.

## నాయకుఁడు, నాయిక.

ఎవనివృత్తము ప్రధానముగఁ బ్రబంధమంతయు వ్యాపించి యుండునో యాతని నాయకునిగ నెన్నవలయుంగాన నికావ్యమున నానియమము ననుసరించి శ్రీకృష్ణుఁడు నాయకుఁ డగుచున్నాఁడు. అట్లే శ్రీకృష్ణభార్యలలో సత్యావృత్తము ప్రధానమై వెలయుఁగాన నామెను నాయికగా నంగీకరింపనగును. శృంగారప్రధానమగు నికా-

వ్యమునందలి యంగభూతవీరాది రసప్రకాశక కథాసందర్భముల నిపుణముగఁ బరిశీలింప శ్రీకృష్ణుఁడు ధీరోద్ధతనాయకుఁడు గానోపును. మఱియు "ఏమేవేళల నేసరోజముఖి, ఇది భోజాత్మజకిచ్చినన్ గినుకతో" అను మున్నగు శ్రీకృష్ణవాక్యముల ననుసరించిచూడ నీతఁ డందును దక్షిణనాయకుఁ డనఁదగియున్నాఁడు. శ్రీకృష్ణుఁడు పారిజాతమును శ్రమపడి స్వర్గమునుండి గొనివచ్చి సాత్రాజితి పెరటిచెట్టుగ నాటించి తదభీప్సితముం బూరించి యామెను సంభావించెనను ప్రధానకథ ననుసరించియు నీతఁడు దక్షిణనాయకుఁ డగుచున్నాఁడు. తనకుఁ గల దారలందఱియెడలను సముఁడై సంచరించువాఁడె దక్షిణనాయకుఁడని యాలంకారికసంకేతముగదా!

మగనిశిరసుఁ దన్నుట, పారిజాతప్రసంగమున వనపాలురతో నుద్ధతిమీఱఁ బల్కుట, మున్నగుసందర్భములఁ బరిశీలింప నీసత్యా నాయిక ప్రౌఢనాయిక యనియు, నీర్ష్యాకషాయితయై శ్రీకృష్ణుని మ్రోలఁ దుదకు బాలపల్లవగ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీ ధ్వని మీఱ నేడ్చినప్రస్తావన ననుసరించి ధీరాధీర యనియు, మానవతి యనియుఁ దెల్లమయ్యెడిని.

## మూలకథ. ముఖ్యములగుమార్పులు.

సంస్కృతహరివంశకథ నాధారముగఁ గొని యీప్రబంధమును దిమ్మనార్యుఁడు రచించెనని మొట్టమొదటనే యుక్తమయ్యె. మఱియు నందలిశ్లోకములకు సరియగునాంధ్రీకరణమునుగూడ నందందొనర్చుచు మహాకావ్యలక్షణలక్షితమగుట కుచితముగ సూర్యోదయాస్తమయ చంద్రోదయాది వర్ణనముల నందందుఁ జొనుపుచుఁ బాత్రోచితముగ మూలకథలోని కొన్నిసందర్భముల మార్చుచు నిక్కావ్యరత్నము నొనర్చెననియు మున్నె చెప్పఁబడినది.

శ్రీకృష్ణుఁడు తాను రుక్మిణియొద్ద నుండఁగ నారదుఁడు వచ్చి యక్కుసుమము నొసంగెననియు, దాన నేను దయమీఱ రుక్మిణి కద్దాని నిచ్చితిననియుఁ గానఁ దప్పు క్షమింపవలెననియు సత్యను వేడుకొని నట్లు మూలముననుండఁగ, నిందుఁ గృష్ణుఁడు సత్యాపాదములకు మ్రొక్కి

నట్లును నామె పతిశిరసును వామపాదమునం దాంచినట్లును గవి మార్చి నాండు. ఇందులకు నాయకుని మితిమీఱినశృంగారమును నాయికో ద్ధతిని గనుపఱుపం గవి సంకల్పించికొనుటయే గారణమని యెన్నవల యును. మఱియు "దాసే కృతాగసి." అనుసంస్కృతశ్లోకార్థము నను సరించిన నిట్టికృత్య మాలంకారికలక్షణలక్షితమే యనవలసియున్నది. ఇంతియగాక యిట్టియపరాధినినిగూడ నాయకుండు క్షమించుటయేగాక యామె కోర్కిని దుష్కరమైనదానిని నెఱవేర్చి యనునయించినట్లు వర్ణించుట కతన నాయికానాయకుల యన్యోన్యప్రేమాతిశయము సహృదయ హృదయఫలకములం జిత్రితమగుననియు దాన కావ్యరసము పరిపుష్టి నొందుననియు దాన నాయికోద్ధతి స్త్రీస్వభావముం దేటపడు ననియుం గవి కరం బెంచెనని చెప్పనగును. మఱియు నింతటి యపరాధి ని నే కృష్ణుండు క్షమించి యామెకోర్కిని నెఱవేర్చి యామె ననునయించు నపుడు తాము తమజాయను తిరుమలదేవిని నల్పాపరాధము గావించిన దానిని క్షమించి యనునయించు టెంతయు నుచితమని కవి కృతిపతి కేతన్మూలముగ బోధించి కావ్యరచనా ప్రదానోద్దేశము నీమూలముగ వెల్లడించెననియుం జెప్పనొప్పును.

సత్య పారిజాతసుమవృత్తాంతముం దెలిసికొన్నపిదపం గృష్ణు నితోం దాను దపమొనర్పం బోవుదుననియుం బతి యనుమతిలేక సతి చేయు వ్రతములు వితథములగుట నీయనుజ్ఞం గోరుచుంటిననియుం బల్కినట్లు మూలమున నుండంగ నిందాప్రసంగమే యగపడకున్నది. మానవతియు నుద్ధతిపొంగారం బోల్చునువిదయు నగు సత్యాదైనశీల మున కిమ్మాట లంతగం బనికిరావని యెన్ని యీప్రసంగమును గవి పరి త్యజించినట్లు తోంచెడిని.

శ్రీకృష్ణుండు నారదుని గల్పనగమును దనకొసంగున ట్లింద్రుని సమ్మతింపంజేయుమని కోరెననియు, నట్లాతం డీయకున్న గదతో నాతని యెద మోదెదననియు నటినట్లును, నారదుండు వెడలివచ్చి యింద్రుం డందులకు సమ్మతింపమిని దెల్పెననియుం, బిదపం గృష్ణుం డింద్రుని జన్య మున జయించి పారిజాతముం గొనెననియు మూలకథ గలదు. తుదకు జరిగినది జన్యమున పారిజాతముం గొనుటేగానం గవి శ్రీకృష్ణుండు నార

దుని మూలమున నింద్రుని సంప్రార్థించినట్లు గల కథాసందర్భమును నాయక గుణాపకర్షకుఁ గారణమగుదానిఁ బరిత్యజించి ధీరోద్ధతలక్షణ లక్షితుఁగాఁజేయ సంకల్పించెనని యీమార్పునకుఁ గారణము నూహింప వలసియున్నది. మఱియుఁ బెఱరాజులకుఁ బగతురకిట్లు వార్తనంపుట చెల్లుంగాని సర్వవిధములఁ దాను ప్రేమమీఱ నరయు నగ్రజునకిట్లు తమ్ముఁగుఱ్ఱ యొకమహామహునిమూలమున వార్తనంపుటసరికాదనియుఁ గవి భావించెనని తోఁచెడిని. ఇంతియగాక యదితికుండలముల నర్పింప నరిగె ననుటంజేసి నాయకుని పౌరుషాతిశయమును మాతృభక్తియు వెల్లడింపఁ గవి యత్నించి యిట్టిమార్పు నొనర్చియుండుననియుఁ జెప్ప నగును.

శ్రీకృష్ణుఁడు పారిజాతమునకై పరమేశుంగూర్చి తపమొనర్చి వరము వడసినట్లు మూలమునఁ గలదు. ఇందట్లుగాక సత్యాసమేతుఁడై స్వర్గమున కరిగి యుపేంద్రుఁ డింద్రసమ్మానితుండై యింద్రద్రుమము నపహరించి జన్యమున నింద్రు నోర్చి జయముం గొనెనని యున్నది. జగదీశుండును బరాత్పరుండును శ్రీమహావిష్ణ్వపరావతారుండును నగు శ్రీకృష్ణుఁ డింకొకదైవము నారాధించి వరమువడసినట్లు చెప్పినఁ బరమ వైష్ణవుండగు కృతిపతికృష్ణరాయలు మది నేమనుకొనునో యనియు, వైష్ణవమతము విజృంభించు నక్కాలమున విష్ణుమతాలంబకులతో నిండి యుండునారాయల నిండుకొలువున నమ్మాట లహృద్యములగుటఁ దన కావ్యమున కుత్కర్షచెడునేమో యనియుఁ గవి యనుమానించి, యిట్లు వైష్ణవమతానుకూలముగఁ గథాసందర్భమును మార్చెనేమో యని యను మానింపవలసియున్నది. ఇంద్రోపేంద్రులజన్యసంరంభముం గాంచి జగ ములు కడుంగడు భీతిం జెంద నజప్రేరితులై యదితికశ్యపులు పారి జాతముం గొనిపోవఁ గృష్ణున కనుజ్ఞయిడిరని మూలముననుండ నిందు జన్యమున జయముంగొని కొనిపోయినట్లే కథ యగపడును. నాయకుని పరాక్రమాతిశయప్రకాశనమే ముఖ్యప్రయోజనమనియు, నట్టిప్రయో జనము మూలకథ ననుసరించిన సిద్ధింపకుండుటేగాక పరాక్రమాపకర్షకుఁ గూడఁ గారణమగుననియు నెన్ని, కవి యిందిట్లు మార్చియుండనగును. తలిదండ్రులు దయదలఁచి యిచ్చిన కల్పనగముం గొనిపోయెనని

చెప్పినఁ గృష్ణుని పరాక్రమము ప్రకాశిత మెట్లగును? మఱియు శ్రీకృష్ణప్రతాపాతిశయ ప్రకాశనమూలమునఁ గవి కృతిపతి కృష్ణరాయ ప్రతాపాతిశయమును వ్యంగ్యమర్యాదను సూచింప నెంచిన ట్లూహింపవలసియుంటఁ, గవి తనయుద్దేశమున కనుగుణముగ నిట్లు మార్చియుండునని యందులకుఁ గారణము నూహింపవలసియున్నది.

ఇంతియగాక మూలమునఁ బ్రసన్నుఁడగు శ్రీకృష్ణుని నారదుఁడు దేవతలలోఁ దనకు బ్రహ్మత్వము సిద్ధించునట్లును నాభగవానునిసాలోక్యము సంప్రాప్తమగునట్లును వరము వేఁడినట్లున్నది. ఇం దట్టికథాసందర్భమే గానరాదు. బ్రహ్మ మానసపుత్త్రుండును పరమతపఃపవిత్రుండును నగునారదునిచేఁ దిరుగ బ్రహ్మత్వమును శ్రీకృష్ణుని యాచింపఁజేయుట వలన నొక్కింత ప్రయోజన ముండఁబోదనియుఁ, బురాణములు బ్రాహ్మణమహిమం దేటపఱచుటకును బ్రహ్మమతము నుద్ధరించుటకును నుదయించినవగుట నట్లువి చెప్పియుండుననియుఁ గవి యెన్ని పైకథాభాగమును బరిత్యజించియుండనగును.

మూలమున నంతగఁ బుణ్యకవ్రతము వర్ణితముగాకున్నను నిందు విస్తృతిగఁ బుణ్యకవ్రతవిధి వర్ణితమయ్యెను. ఇట్లు వర్ణించుటకు శ్రీకృష్ణభగవానునిభక్తపరాధీనతను నాతనివైభవసమృద్ధిని బ్రకాశితములం జేయుటయే పరమప్రయోజనమని తలంపవలసియున్నది. మఱియు సత్యాపాత్ర కొక లెస్సయగు విపరిణామముంగూర్చుటకును నిది సాధనమగుచున్నది. నారదకృతకృష్ణస్తవాదులు మూలమునఁ గానరావు. ఆకాలమున విష్ణుమతము విజృంభించుటం జేసియుఁ బరమవైష్ణవుండు కృతిపతియగుటం జేసియు, విరివిగ విష్ణుభక్త్యుద్రేకమును గల్గించుకథాసందర్భములఁ గవి కూర్చియుండునని యందులకుఁ గారణముల నూహింపవలసి యున్నది.

మూలమునఁ గానరాని చంద్రోదయసూర్యాస్తమయస్వర్గవర్ణనాదులను దనకావ్యము మహాకావ్యలక్షణలక్షితమగుటకు నాలంకారికసంప్రదాయము ననుసరించి సందర్భోచితముగఁ గవి కల్పించెనని తలంపవలసియున్నది. ఇంకను లెక్కకుమిాఱిన భేదములు మూలమున

కాంధీకరణమునకును గలవుగాని యవి యంతగ నెన్నవలసినవి గామిం జేసి యవి యనాదృతములయ్యెనని సహృదయులు తలంపవలయును.

## కథాసంవిధానము - పాత్రపోషణము.

సామాన్యముగఁ బ్రబంధములందుఁ గావ్యత్వసంపాదనమునకై సమకూర్పఁబడిన వర్ణనాదులవలనఁ గథాసరణి మృగ్యమగును. మఱియు నట్టివర్ణనలు కథావేగమున కడ్డంకి గల్గించుచుంటఁ బాఠకులకు విసువు జనించును. ఇంతియగాక ప్రబంధవాఙ్మయమును బరికింపఁ దత్కర్తలు కావ్యలక్షణములగు పురశైలాదివర్ణనములను సందర్భింపఁజేయుటకై కథాసందర్భమును బరిగ్రహింతురుగాని ప్రధానముగఁ గథ నడుపుటకుఁ గాదని విశదమగును. ఇందుఁ దిమ్మనార్యుఁ డట్లుగాక కథయును గథావేగమును బ్రధానముగఁ గొని వాని కడ్డంకిని నాయావర్ణనాదులఁ గల్పింపక సందర్భోచితముగ వర్ణనములఁ జేయుచు మొదటనుండి తుదవఱకు కథ నొక్కరీతిగనే నడిపినవాఁడు. దీనఁ బాఠకహృదయములకుఁ గథ సుబోధమగుటయేగాక చదువఁ దొరఁకొన నుత్తరోత్తర కథాజిజ్ఞాసయు మెండగుచుండును.

ఆంధ్రప్రబంధవాఙ్మయమునందలిపాత్రలు సామాన్యముగా నొకేస్వభావము గల్గియున్నవి. తత్తదవస్థావిశేషముల పాత్రముల శీలము భిన్నభిన్నముగా నుండవలసియుండ నొకేవిధముగ నున్నట్లగపడును. మానవస్వభావములు భిన్నభిన్నములనియు శృంగారక్రోధాద్యవసరముల వారిమాటలును వర్తనమును దన్మనోగతి ననుసరించి వేర్వేఱుగ నుండుననియు లోకానుభవజ్ఞులగు సహృదయులకుఁ దెల్లమే. అయినను బ్రబంధకవులు సామాన్యముగ గ్రంథానుభవమునే తమ గ్రంథములఁ బ్రకటించిరిగాని మానవలోకానుభవమును బ్రకాశితమొనర్ప యత్నించినవారు కారు. మఱియు సృష్టివైచిత్ర్యమును స్పష్టీకరింపఁ గవు లాదినుండియు నలవాటువడినవారు గారు. ఇఁక నీకృతికర్తయన్ననో సామాన్యముగ నన్నిపాత్రములకును నందును సత్యాకృష్ణాదిప్రధానములకును నొండొంటికి సరసముగ సహజమగుగతిని స్వభావభేదమును బాత్రోచితముగఁ బరికల్పించి కథాభాగమును గూర్చినవాఁడు. నారదాదిస్వతంత్రపాత్రలను దత్తత్సమయోచిత ప్రసంగప్రవ

ర్తనలమూలమున మెఱుఁగు వెట్టి సరసముగఁ జిత్రించినవాఁడు. ఇఁక నీకృతియందలి నాయక శ్రీకృష్ణపాత్రము నించుక పరికింతము.

శ్రీకృష్ణుఁడు భగవానునియపరావతారము. కాన నతనియందు దైవమానుషచర్యలు మేళవించి యుండవలయును. మఱియు నాతఁడు ప్రకృతము మానవుండై మహి నవతరించినవాఁడుగాన, నాతనిసతులు గాని యొరులుగాని భగవానుఁడని గుర్తింపకుండునట్లును మానవుని వలెఁ గష్టసుఖాదులకు లోనగునట్లును నాపాత్రను జిత్రింపవలయును. కాన ముక్కుతిమ్మనార్యుఁ డితరప్రబంధకర్తలవలె నాయకునికులాదులను సౌందర్యసౌష్ఠవాదులను నిరూపింప మొదలిడక సర్వవ్యాప్తిసమవాసి యగు మహాత్మునికులసౌందర్యాదులవర్ణనమును విడుచుటమూలమున, దేవత్వము గూఢముగఁ బ్రకాశితమొనర్చుచు నారదునిపంపున సౌఖ్యరసైకలోలుఁడై పదియాఱువేవుర లలనామణులను దన్ను వాంఛించు వారిని గూడి విహరించుచుండెనని మానవత్వముం బ్రకాశితముచేసి, మొట్టమొదట నాయకుని బాతకుల కెఱుకపఱచినవాఁడు. పిదప మాయాకల్పనాచాతురిచే నాసరోజముఖులనెల్లరిని సంతోషపెట్టుచుండెనని వర్ణించి తన్మానవత్వమును మఱికొంత వృద్ధిచేసి చూపినవాఁడు. రుక్మిణితో వినోదించునదనున నారదుఁడు విజయముచేయ శ్రీకృష్ణుఁడు, "నేను గృతార్థుఁడను, నాపైఁ గరుణ గలిగియుంట యిదియ కారణము" అను మున్నగుమాటలనాడినట్లును, మఱియు గృహస్థధర్మము ననుసరించి తనమందిరము పవిత్రమయ్యెననియుఁ గృతార్థుఁడనైతిననియుఁ బల్కినట్లును గవి నిరూపించి, శ్రీకృష్ణునిమానవత్వమును మఱికొంత పుష్టి నొందించి ప్రకాశితమొనర్చినవాఁడు. కలహాశనమునిచే శ్రీకృష్ణునవతార విశేషముల సంకీర్తింపఁజేసి నిగూఢముగఁ దన్మూలమున దేవత్వమును భాసిలఁజేయుచుఁ, బారిజాతసుమప్రదానవిషయమున నాయకున కుదయించిన యారాటముమూలమున నాతనిమానవత్వమును దేటతెల్లము గావించుచు, సత్యభామామందిరమున కరుగునపుడు నాయకుని తాల్మికేతనపటాంచలచంచలమైయుండెననియుఁ,దత్తరము తురగజవము మున్గడవఁ ద్రోయఁగడఁగుచుండెననియు, మానసము తిరిగెడుబండి కండ్లపగిది భ్రమించుచుండెననియుఁ దెల్పి, నాయకునిమానుషసహజ

స్వభావమును బ్రత్యక్షముసేయుచు, కోపగృహమునఁ దనకాంతకు నాయకుఁడు చెలులచేతనున్న తాళవృంతముం దానె పట్టి విసరి పేరలుకంజెందిన తనకాంత ననునయించెననియుఁ, దనకుఁ దనప్రియురాలిపైఁ గలకూర్మియు విధేయతయు నాజ్ఞావశవర్తిత్వమును మాయావాదిత్వము దోఁపఁ బ్రకాశితమైనర్చెననియుఁ దెల్లముగావించి, కాముకసహజస్వభావమును గన్నులయెదుట మూర్తిభవింపఁజేయుచుఁ, దాఁజేయుయత్నమంతయు వమ్మగుటఁ దుట్టతుదకు నాయకుఁడు జగన్నాటకసూత్రధారి భార్యపాదముల కర్మిలి మ్రొక్కెననియు, నామె కోపోద్వేగమున నాత్మీయవామపాదమున నాతనిశిరసును దొలఁగంద్రోయ నదియే తనకు మన్ననయనియు మీఁదుమిక్కిలి యామెపాదము స్వతను పులకాగ్రకంటకవితానము సోఁకి నొచ్చెనని విచారించెననియుఁ దెల్పి, కవి నాయకునిమానవత్వమును బరిపూర్ణతనందించుచు, నాపాత్రను జిత్రించెను ఇట్లే పారిజాతాపహరణసమయమునందలి యాతనిబలప్రతాపాదులను, బరాజితుఁడగు బలారి శరణువేఁడ నీమఱందలికొమ్మ వదాన్యభూరుహముకోరినఁ దెచ్చితిఁగాని కొమ్ము నీసొమ్మని వజ్రమిచ్చి మధుసూదనుఁ డాతరువీఁదలంచెనని వర్ణించి యాతని దాన వీరత్వమును, సత్య భారవోయఁ దా నారదుని యాజ్ఞావశుండయి మెలంగెనని వర్ణించి యాతనిభక్తపరాధీనతను బాఠకులహృదయఫలకములఁ జిత్రించినవాఁడు. నిపుణముగఁ బరికింపఁ బ్రథమాశ్వాసకథాసందర్భముంబట్టి శ్రీకృష్ణపాత్రమునకు శృంగారముతోడను, బంచమాశ్వాసకథాభాగమునుబట్టి వీరముతోడను, సంబంధమును ముఖ్యముగఁ గవి కూర్చినట్లు విశదమగుచున్నది. ఏపట్టునను గవి యితరపాత్రమూలముననే నాయకునిదేవత్వమును సూచించినవాఁడుగాని నాయకవర్తనాదుల మూలమున సూచించియుండలేదు. ఒక్క దేవేంద్రుని వజ్రముం జేతఁ దాల్చునదనునమాత్రము దేవత్వము పాత్రప్రవర్తనమూలముననే తెల్లమైనది. మొత్తముమీఁదఁ గవి శ్రీకృష్ణపాత్రమును 'గవికల్పితపాత్రమా నిక్కమైన మానవుఁడా' యనుసందియము డెందములకుఁ బొందుపఱచుచుఁ గావ్యమునఁ బొందుపఱిచినవాఁడని నొక్కి చెప్ప నొప్పును.

అట్లే సత్యాపాత్రముసుగూడ ననితరసాధారణముగనిర్మించి కవి తనచాతుర్యమును బ్రకటించినాఁడు. కవి శ్రీకృష్ణునిగుణాదిసంకీర్తన మొనర్పక పాఠకుల కెఱుకపఱచినట్లే సత్యభామనుగూడ నెఱుకపఱచిన వాఁడు. ఈకృతికర్త పాత్రము నెట్టిదిగా మొట్టమొదట ముడిమాట లతో నెఱుకపఱుచునో యమ్మాటల నన్వర్థములుగాఁ జేయుటకే యుత్తరకథాసందర్భముల యత్నించువాఁడు. కులమును రూపము న్మగనికూరిమియుం గలదాన ననుగరువతనముగలది సత్య యని తొలు దొల్తఁ గవి యీపాత్రమును గన్నులయెదుట నిడినవాఁడు. స్వాధీన పతిక ననుగర్వముగలది సత్య యని కవి ముఖ్యముగ నిరూపింప నెంచిన వాఁడు. మఱియు శ్రీకృష్ణభార్యలం దీమె మానవతిననియు మహనీయ సౌభాగ్యవతిననియు ననుకొనుచుండునని వర్ణితయయ్యె. ఇట్టిగుణములఁ గూర్చుచుఁ గవి యీపాత్రము నెట్లు చిత్రించెనో యిఁక నరయుదము.

తనశృంగారవనమునఁ జంద్రోపలవేదిపై సరసగోష్ఠిఁ బోటియుం దానుండఁగా నామెకు దక్షిణనేత్రస్పందమైనట్లును దోడనే యామె 'దక్షిణాంసచూచుకనయన ప్రకంపగుణసూచన లేమియు వల్లగావు సారెకు మది జాలిఁబొంది యొకరీతిఁ దలంకెడు. ప్రాణనాథుఁ డొండొక చపలాక్షిఁ గూడి యొల్లనిచెయిదము లేమిచేసెనో' అని వగఁజెందఁ జొచ్చెననియు నజ్ఞాతపారిజాతసుమవృత్తాంతను సత్యను గవి వర్ణించె. పారిజాతసుమవృత్తాంతము నెఱుంగనిసత్య కేవల దక్షిణనేత్రస్పందము మూలమున మఱియొక యనిష్టము నూహింపక మగనికూరిమి మఱి యొకమగువపైకిఁ బోయెనని యనుమానించుటకతన నామెకుఁగల మానవతీత్వమును మగనికూర్మి మిక్కిలి గలదనుగరువతనమును మిగులఁ బ్రకాశితములయ్యె. అనంతర మామెకుఁ బారిజాతసుమవృత్తాంతము తెల్లమగుడు వ్రేటువడ్డ యురగాంగనవలెను నేయివోయ బగ్గన దరి కొన్న భీషణహుతాశనకీలలీలనువిజృంభించి కనులఁ గోపారుణకాంతులు చెలంగఁ గలహాశనుని, శ్రీకృష్ణుని, సవతులను దూలనాడి తనస్వాధీన భర్తృకతను జెలితోఁ జెప్పికొనుచు మిగులఁ గుంది కోపసదనమున కేగెనని గవి సత్యను వర్ణించె. భర్త తనమాటఁ జవదాటఁడను నచ్చిక గలమచ్చెకంటి కపు డాపారిజాతసుమవృత్తాంతశ్రవణము మానహానిని,

మగనికూర్మికి భంగమును గూర్చినదగుటం జేసి, వ్రేటువడ్డ యురగాంగన వలెను నేయివోయ బగ్గన దరికొనుహుతాశనకీలవలెను సత్య విజృంభించుట సంభవించినదనుట తెల్లము. దీన నాయికామానవతీత్వము మగనికూర్మిగలదాన ననుగరువతనమును బ్రస్ఫుటములుగాఁ గవి యొనర్చెనని చెప్పనొప్పును. మఱియు నీసందర్భమునఁ గవి సత్య పారిజాతసుమవృత్తాంతము నాకర్ణించి యంతటిమానహానిని సహించి ప్రాణములు భరింపఁజాలనని యుఱక యుసురుల విడువఁదలంచెనని వర్ణించుచు నామెదగుమానవతీత్వమును గడుంగడుఁ బ్రకాశిత మొనర్చినవాఁడు. కులపతి మగనికూర్మి మఱియొకవనితయందుఁ బ్రసరించెనని తెలిసిన నోర్వఁజాలకుంటయు నందును మానవతికి సవతులయెదుట పరాభవముగల్గిన సహింప వీలులేకుంటయు సహజములుగదా! ఈసందర్భమునఁ గవి స్త్రీస్వభావమును జక్కఁగ సహజమగుగతిని బొందుపఱచి సత్యభామపాత్రను జిత్రించి తనయసమానప్రజ్ఞ్ఞ నైపుణిని జూపినవాఁడు. ఇట్లు సవతులయెదుట మగఁడు తన్నవమానించుటయు నారదుఁడు తన్నాసమయమున నూరకొనక తడవుటయు సత్యకు మిగుల సంతాపజనకములయ్యెనని వర్ణించుటవలన నామెగరువతనము సుప్రకాశితమయ్యెనని యెన్నవలయును. మగనికూర్మి నంతగఁ జూరఁగొనిన సౌభాగ్యవతికి మానవతి కంతటియవమానము గల్గిన నామెయలుక సామాన్యముగఁ దీరదుగానఁ, గవి నాయకునిచే నామెయలుకం జక్కదిద్దుటకై పలుపాటులఁబడఁజేసియుఁ బ్రయోజనముఁజూపక యాతనిచే నమ్మానవతికిఁ బ్రణామమునేయించి తగినశిక్ష గావించి పారిజాతముం బెరికి చిట్టుగ నొనర్తునని శపథమొనర్పించి యామెక్రోధాగ్నిం జల్లార్చినాఁడు. ఈ సందర్భమునఁ గవి కోపగృహమునందలి సత్యయునికిని, వర్తనమును, స్త్రీస్వభావమున కెంతయు ననుగుణమగురీతిని వర్ణించి పాఠకహృదయముల రంజిలఁజేసినవాఁడనుట యతిశయోక్తి గానేరదు. తన్నవమానించినవారికిఁ దగినశిక్ష యొనర్చినంగాని, మానినికోపము చల్లారకుండుట సహజమౌటను సత్యాపాత్రముమూలమునఁ గవి సూచించినవాఁడు. మఱియు నీసందర్భమునఁ గవి మానవతికి మానమే ప్రాణముకంటె నధికమని నిపుణముగ నిరూపించినవాఁడు. సురేశ్వరువనపాలకులతోఁ

సత్యయొనర్చిన ప్రసంగ మీామె వీరపతివ్రతయనుటకును గరువతనము మిక్కుటముగఁ గలదియనుటకును బ్రబల నిదర్శనములు. మఱియు నని కైనన్ బతి నిన్ను బాసి చనునో యన్న నారదునిమాటల నీసందర్భమునఁ గవి యన్వర్థములుగఁజేసి చూపినాఁడు. ఇట్టిమానవతిని గర్వము గలదానిని బుణ్యకవ్రతాచరణముమూలమునఁ గవి నిపుణముగ గర్వాదులం దొలఁగంద్రోసి యతుల భక్తియుక్తగా మార్చి మనకండ్లయెదుట పెట్టుటకతన నాతనిపాత్రపోషణనైపుణి యనితరసాధారణమైనదని చెప్పుట కేమిసందియము? మొత్తముమీఁదఁ దిమ్మనార్యుఁ డీపాత్రమును స్త్రీస్వభావమును జక్కఁగఁ బోషించుచు శ్లాఘ్యతమముగ నిర్మించెనను టకు సందియము లేదు.

ఇట్లే నారదపాత్రమునుగూడఁ దత్కలహతత్పరతను నుత్తమ భక్తత్వమును దేటతెల్లము గావించుచుఁ జిత్రించినవాఁడు. పట్టమహిషి యగురుక్మిణినిగూడ నుచితరీతిని జిత్రించినవాఁడు. పారిజాత మీామెకు భర్త యొసంగి గారవించుసందర్భము ననుసరించియు నీమె పుణ్యకవ్రతమునకుఁ బోవుటయె యుచితమని యెన్నుకొనుసందర్భమును బట్టియు నీమె సమయజ్ఞయనియు గరువతనము కొంచెమైనను లేని నిపుణయనియుఁ దెల్లమగును. తక్కుంగలపాత్రములనుగూడ నిట్లే తిమ్మనార్యుఁడు మనోహరముగఁ జిత్రించినవాఁడని పాఠకులు పరిశీలించి గ్రహింపవలెను.

ఇట్టిపాత్రపోషణ కథాపోషణాదినైపుణులతోఁబాటుగ నీకవి పుంగవునకు మృదుమధురపదరచనానైపుణి గుదిరియుంట కడుంగడు శ్లాఘింపఁదగినది. కథాసందర్భమునకును బాత్రస్వభావమునకును రసమునకును నుచితమగురీతిని బదజాలము నుపయోగించుట కితఁడు మిగుల యత్నించినవాఁడు.మఱియుఁ బ్రసన్నతాకలితములగుపదములనే తనప్రబంధమున వాడినవాఁడు. కావుననే 'ముక్కుతిమ్మనార్యు ముద్దు పలుకు" అనునానుడి యన్వర్థమని పండితపాఠకుల స్వాంతములకు విశదమయ్యె. పాఠకహృదయసీమల నాఁటుకొనంజాలుపాత్రములను, గథావేగమున కడ్డంకిని గల్గింపని హృద్యములగువర్ణనములను, గూర్చి ద్రాక్షాపాకమగుశైలితోఁ బ్రబంధము నుత్తమోత్తమముగ రచించిన యీా

తిమ్మనార్యునకుం బ్రబంధకవులలో నగ్రస్థాన మొసంగుట కడ్డంకి లేదన వచ్చును.

## వర్ణనలు - విశేషవిషయములు

ఇందలివర్ణనములు సంగ్రహములును భావగర్భితములును మనోహరములును నై కథావేగమునకు భంగమును గలిగింపనివియును, పాఠకులమదికి విసువునుబుట్టింపనివియును నై యున్నవి. కావ్యమున సాధారణముగ నష్టాదశవర్ణనములను జేయవలయునని యాలంకారికులు శాసింతురు. కాని వానిని సందర్భోచితముగనే చేయవలయునని వారభిప్రాయపడినట్లు "వానిలోఁ గొన్ని తక్కువయైనను నిష్టమే" అనువారివాక్యమే స్పష్టపఱచుచున్నది. కావుననే తిమ్మనార్యుఁడు సాయంకాలస్వర్గప్రయాణాదులం గొన్నింటిని కావ్యలక్షణము ననుసరించి సంగ్రహముగను స్వభావసిద్ధముగను నొనర్చినవాఁడుగాని ప్రయోజనశూన్యముగ వర్ణనములం జొనిపినవాఁడుగాఁడు. అందు ద్వితీయాశ్వాసమునందలి యంధకారనక్షత్రచంద్రచకోరాదివర్ణనములును, మేర్వాదివర్ణనములును, దృతీయాశ్వాసమందలి నందనోద్యానాదివర్ణనములును, జతుర్థాశ్వాసమందలి మధ్యాహ్నజలకేళీవర్ణనములును, బంచమాశ్వాసమునందలి యుద్ధాదివర్ణనములును సందర్భశుద్ధిగలవై మనోహరములై యలరారుచున్నవనుటకు సందియము లేదు.

కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజినుండి ప్రారబ్ధమైవచ్చుచున్న స్వప్నవృత్తాంత మిందుఁ బరిత్యక్తము. కవిబ్రహ్మకాలమునాఁడీవృత్తాంతము రసవంతముగ నుండియుండునేమోగాని యానంతరకాలికకవులకాలమునాఁ డిది నీరసమైయే యుండెడిదనియుఁ బాఠకులకు విసువుపుట్టించెడిదనియుఁ బరిశీలించిన విశదమగును. ఇట్టి స్వప్నవృత్తాంతముం గవులు తమగ్రంథముల కపూర్వమగుగౌరవము నాపాదింపఁ గూర్చికొన్నదని నిపుణముగఁ బరిశీలింపఁ దెల్లమగును. తిమ్మనార్యుఁడు తనగ్రంథమునకు గౌరవము సందర్భశుద్ధి, పాత్రపోషణము, కథాచమత్కృతి, రచనాపాటవము, రసస్ఫూర్తి మున్నగువానిమూలముననే సంపాదింప నెంచినవాఁడుగాసి లేనిపోనిపోకడలవలన సంగ్రహింపఁ

యత్నించినవాఁడు గామింజేసి, యట్టిలాంఛనమును బరిత్యజించె ననఁ దగును. మఱియుఁ బ్రబంధవాఙ్మయసౌధనిర్మాణమున కీగ్రంథము శంకు వగుటంజేసియు నిం దట్టిస్వప్నవృత్తాంతము పరిత్యక్తమనఁదగు.

ఇంతియగాక కవిలోకముచేఁ జర్వితచర్వణముగఁ జేయఁబడు సుకవిస్తుతి కుకవినిందలును నీకబ్బమునఁ గానరావు. కవితాకలితులగు కవులెల్లరును గుకవుల నిందించునపు డట్టినిందకు స్థానభూతులగు కాకవు లెవ్వరని యనుమానింపవలసియుండుటంజేసి, తిమ్మనార్యుఁ డట్టినిరర్థక మగు మార్గమును వదలినవాఁడని చెప్పఁదగు. మఱియు నీకృతికర్త తన గ్రంథమునకుఁగాని తనకుఁగాని గౌరవము పండితపాఠకులమూలము ననే గల్గునని యెంచి యట్టి యప్రస్తుతప్రశంసను విడిచియుండనగును. కుకవులమిషను బరుల నిందించుట పాడిగాదుగదా!

ఇతరప్రబంధములందువలె నిందుఁ గవివంశానుక్రమణికను దెల్పు పద్యములు గానరావు. సాధారణముగ నాంధ్రకావ్యములం దీసందర్భ మునఁ గవులు తమగుణాతిశయమును, గౌరవాతిశయమును, బాండి త్యాతిశయమును, దాతముత్తాతలగొప్పందనమును, వర్ణించికొని నిపుణ ముగ నాత్మశ్లాఘ చేసికొనుట యాచారమైయున్నది. ఏవానివంశగౌరవ మునకైనను, నేవానిగౌరవమునకైనను, నేవానిపాండిత్యోత్కర్షాదుల కైనను లోకము ప్రమాణముగాని వానివాక్యము ప్రమాణము గాకుంట సహజము. మఱియు నొకవేళ నవ్వాని నొకఁడు చెప్పికొన్నను నయ్యదాతనియాత్మశ్లాఘాపరతనే సూచించునదగును. కావుననే తిమ్మ నార్యుఁ డాప్రసంగ మనుచితమని యెంచి సంత్యజించి ప్రబంధాంతమున నతిసంగ్రహమున నొక్కసీసమునఁ దనవంశానుక్రమణిని సరసముగఁ బాఠకలోకమునకుఁ దెల్లముగావించె. మఱియు మనుచరిత్రాదులందు వలె నిందుఁ గృతిపతి కర్పూరతాంబూలాదులఁ దన్నర్చించి కృతి యొసంగుమని వేఁడినట్లు కవి చెప్పికొనలేదు. దీనఁ గవి కృతిని రచించి తానే కృష్ణరాయలను బతిగ నిర్ణయించికొన్నట్లును, గృతిని రచించి యుత్తమనాయకుని వెదకి యర్పించుటయే యుచితమని యెంచినట్లును దెల్లమగుచున్నది. గ్రంథాంతమున గృష్ణరాయదత్తబహుళాగ్రహార

సన్మానయుతుఁడననిమాత్రము చెప్పికొని కృతిపతికిఁ దనయందలి య త్యధికాదరమును గూఢముగ వెల్లడించికొనెను.

కృతిపతి వంశానువర్ణనమునఁ గూడ నీకవిపుంగవుఁ డందు ముఖ్యులును బ్రసిద్ధులును నగువారిని సరసముగను మనోహరముగను స్వభావావిదూరముగను వర్ణించి కృతిపతి నతిహృద్యములగు యథార్థములైనవచనములతోడ నుతించి నిపుణముగ వర్తించినవాఁడు. మొత్తము మీఁద నితరప్రబంధకర్తలవలెఁగాక నీతఁ డెల్లసందర్భములందును బ్రధానముగ నౌచిత్యమును గమనించుచునే వర్తించెననియు నిట్లు రసవంతముగఁ గబ్బమును రచించుట యన్యకవిసాధారణము గాదనియు నిట్టిహృదయంగమమగు శైలి యన్యకవిదురాపమనియు దాన నీకవి పుంగవునికబ్బ మెల్లభంగుల హృద్యమనియుఁ దెల్పుచు గ్రంథవిస్తర భీతిని విరమింతును. తక్కుఁగలవిశేషములఁ బాఠకసహృదయులు పరిశీ లింపనగును.

కృష్ణరాయలకాలమునఁ బ్రతివర్షమున వసంతోత్సవము జరుగు చుండెడిదనియు నాసమయమునఁ గవులు కబ్బములరచించి రాయలకుఁ గృతి యొసంగుచుండెడివారనియుఁ బ్రథమాశ్వాసాంతపద్యము (139) విశదపఱచుచున్నది. దీన నీకృతియుఁ గృష్ణరాయలు పూర్వదిగ్జైత్ర యాత్ర ముగించి యిలుసేరి వసంతోత్సవమొనర్చుసమయముననే విర చితమైయుండుననియు, మఱియు నాపద్యమునందలి "అంతఃపురవధూ ప్రసాదనరసికా" అనుదళము ననుసరించి యీకబ్బమంతఃపురవధూ ప్రసాదనమునకే విరచితమయ్యెనని నిపుణముగఁ గవి సూచించెననియు ననుమానింపవలసియున్నది.

ఇందలిద్వితీయాశ్వాసాదిపద్యమునందైన "మలయకూటప్రాసా దనివేశ" అనుదళము ననుసరించి కృష్ణరాయనివాసప్రాసాదనామము మలయకూటమని తెల్లమగు. ఇటులుండ మనుచరిత్రమున "తిరుమల దేవీచరణోదరలాక్షాకల్పితస్థలకమల స్ఫురదిందీవరబంధుర, హారిహీరమణివలయకూటహర్మ్యవిహారీ" అనుపద్యమున (3 ఆ 143) మణివలయ కూటయను నపపాఠ మంగీకృతమగుట యస్వరసమునఁదగును. హారి

హయమణిమయమగు మలయకూటమనుహర్మ్యమున విహరించువాఁడనుటయే సరసమని పారిజాతాపహరణమునందలి పైపద్యభాగము విశదీకరించుచుంట నిది సంస్కర్తల ప్రమాదమని చెప్పనొప్పును. హరిహయమణివలయములు గలశిఖరములతోడ నొప్పుమేడ యనుటకంటె నింద్రనీలమణిమయ మలయకూటాఖ్యప్రాసాదమున నుండువాఁడనుటయే యతిహృద్యమనియు మలయకూటమనున దాతని మేడ పేరని గమనింపక యేదే నొకయర్థమును ముడిపెట్ట మకారమునకుఁ బ్రక్కనున్న కొమ్మును సంస్కర్తలు తీసివేసియుందురనియుఁగాన "హరిహయమణిమలయకూటహర్మ్యవిహారీ" అనుపాఠమే కవ్యభిప్రేతమైనదనియుఁ బాఠకులు పరిగ్రహింపవలయును.

అచ్చతెలుంగు నుడులకూర్పు, నందమందందు డెందము నానందాబ్ధినోలలాడింప, బ్రసన్నతాకలితగీర్వాణపదసంధాన మొక్కొక్కచో స్వాంతమును సంతోషాయత్తమొనర్ప నిర్దుష్టమై యీతనిశైలి పండితహృదయంగమమై పరఁగెడిని. వ్యాకృతివిశేషములు వ్యాఖ్యనాయాయీతావుల విశదీకృతములగుట నియ్యవసరమున వానిఁదడవఁబనిలేమిఁ బరిత్యక్తములు. చకోరాదివర్ణనపద్యము లచ్చతెలుఁగుఁ బలుకులకూర్పులకును యుద్ధాదివర్ణనపద్యములు గీర్వాణరచనలకును నుదాహరణములుగఁ గైకొననగును. మఱియు నీకృతికర్త శార్దూలాదివృత్తములను దనయిచ్చకువచ్చిన గతినిగాక యాయాయీసందర్భములరసోచితముగ నెలకొల్పుట విశేషములలో నెల్లమేటివిశేషమని సహృదయులు సంభావింతురుగాక!

ఇట్లే పరిశీలించినకొలందిని విశేషములు వెల్వడుచునేయుండును గానఁ గావ్యరసాస్వాదతత్పరులును నిపుణులును నగుబుధజనులును గవిపుంగవులును బాఠకసహృదయులును గుణగ్రహణతత్పరులై తఱచి విశేషముల వెల్లడింతురుగాక!

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
విద్వాన్ దూశి రామమూర్తిశాస్త్రి.

విజయనగరము.
25-4-1933.

శ్రీరస్తు.

# పారిజాతాపహరణము

## సవ్యాఖ్యానము.

---

### పీఠిక.



మదికిం బ్రియం బెసఁగఁ జేర్చినయయ్యేలలీల వైజయం
తీమిళితాచ్ఛకౌస్తుభము నిద్దపుఁగాంతిఁ దనర్చి యాత్మవ
క్షోమణివేదిఁ బొల్పెసఁగఁ జూడ్కులపండువు సేయు వేంకట
స్వామి కృతార్థుఁ జేయు నరసక్షితినాథునికృష్ణరాయనిన్. 1

ఆంధ్రకవితల్లజుఁడును, ముక్కుతిమ్మనార్యాపరనాముండును నగు నందితిమ్మన 'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే', అనునాలంకారికోక్తి ననుసరించి, సమస్తశ్రేయస్సాధకమును, గాంతాసమ్మితమును నగుసత్కావ్యము నొనర్పం బూని వ్యాసమునిప్రణీతహరివంశము నందలి పారిజాతాపహరణపుణ్యకథ నాధారముగాఁ గొని పారిజాతాపహరణంబను నీశృంగారప్రబంధమును రచించెను. అందాదిని 'ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖమ్', అనునభియుక్తోక్తి ననుసరించి, కృతిపతియగు కృష్ణదేవరాయలకుఁ దదిష్టదైవతాశీస్సంఘటనరూపమగు నాశీర్వాదము ననుసంధించెను. మఱియు, 'దేవతావాచకాశ్శబ్దా యే చ భద్రాదివాచకాః, తే సర్వే నైవ నింద్యాస్స్యుర్లిపితో గణతోఽపివా', అను నార్యవాక్యమునుబట్టి, శ్రీశబ్దము దేవతావాచకమును, భద్రాదివాచకమును నగుటంజేసి యద్దాని నాదిని నెలకొల్పెను. ఇంతియగాక 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ కావ్యాని ప్రథంతే', అనునభియుక్తోక్తి ననుసరించి, కావ్యము నిర్విఘ్నముగఁ బరిసమాప్తి నొందుటకొఱకును, శిష్యశిక్షార్థమును, మంగళాదివాచకమగు శ్రీశబ్దమును గావ్యాద్యంతములఁ బ్రయోగించి కావ్యమున కుత్కర్షను సంపాదించెను. భగణము

చంద్రదేవతాకమగుటఁ గర్తృపతులకుఁ గల్యాణదాయకమనుతలంపునఁ గవి కావ్యాదిని నెలకొల్పెనని గ్రహింపవలయును.

టీక. శ్రీమదికిన్ = లక్ష్మీదేవియొక్క చిత్తమునకు, ప్రియంబు = సంతసము, ఎసఁగన్ = అతిశయించునట్లు, చేర్చిన = పొందించిన, వైజయంతీ...కౌస్తుభము - వైజయంతీ=వనమాలతో, మిళిత=కూడియున్న, అచ్ఛ=స్వచ్ఛమైన, కౌస్తుభము = కౌస్తుభమనుమాణిక్యము, నిద్దపుఁగాంతిన్ (నిద్దపు=స్నిగ్ధ)=తఱచైనకాంతితో, తనర్చి=అతిశయించి, ఆత్మ...వేదిన్-ఆత్మ=తనదైన, వక్షోమణివేదిన్=మణివికారమగుతిన్నెనుబోలు గుండెపై, పొల్పు=అందము, ఎసఁగన్=మిాఱఁగా, చూపుల్కులు = దృష్టులు, వేంకటస్వామి=వేంకటేశ్వరుఁడు, నరస...రాయనిన్=నరసరాజుకొడుకైన కృష్ణదేవరాయని, ఇచట షష్ఠికి జన్యజనకభావమర్థము. కవులు తండ్రిపేరులతోఁ గలిపి కృతిపతులనామముల నిరూపించుట యాచారమైయున్నది. కృతార్థున్=సఫలమగు కార్యములుగలవానినిగా (ధన్యుఁగా) చేయున్. 'చేయున్' అనునది తదర్థార్థకమగుటఁ ద్రికాలవాచిగా నెన్నవలయును. 'తనర్చు' అని పాఠము గలదు. అపుడు నిద్దపుఁగాంతితో నొప్పునది కౌస్తుభముగాకయెదయగును. సారస్య మిందుఁ జింత్యము.

భావము. శ్రీవేంకటేశునెద మణివేదివలెను, నందు మించు కౌస్తుభాంచితవనమాల యయ్యెదపై నెలకొనియున్న సిరికి నుయ్యెలరీతిని నొప్పుచుండెనని భావము. వనమాలాకృతి యుయ్యెలత్రాటివలెను, నందు నడుమమించుకౌస్తుభ ముయ్యెలనడుమనొప్పు ఫలకమువలెను నమరియున్నవని గ్రహింపవలయును. అట్లు కౌస్తుభాంచిత వనమాలాధరుండై యెదను లచ్చి వెలుంగ మించు నా శ్రీవేంకటేశ్వరుఁడు కృష్ణరాయల సఫలకార్యుంజేయుతమని యాశీర్వాదము.

వ్యాకరణవిశేషములు. ఉయ్యెల:—ఊయేల, ఊయెల, ఉయ్యాల, ఉయెల. ఇత్యాదులు రూపాంతరములు.'ఊయేలాదులం దొలియచ్చుమిాఁది హల్లునకు ద్విర్వచనంబొండెనగును' అని. నిద్దపుఁగాంతిన్:—రూ. అ. నిద్దంపుంగాంతిన్. 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకును బుంపులకును బరుషసరళములు పరంబులగునపుడు నుగాగమంబగు.' ద్రుతకార్యములు. నిద్దంపు గ్గాంతిన్, నిద్దంపుఁగాంతిన్ ఇత్యాదు లూహ్యములు. కృష్ణరాయఁడు. 'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసంబట్లయగు' అనుసూత్రమునుబట్టి యిందుఁ బూర్వపదము లుప్తవిభక్తికంబై యవికృతాంతంబగును. పండుగు. రూ. అ. పండువు. అపదాద్యంబైన గకారమునకు వకారంబగు.

విశేషార్థాదులు. కావ్యాదిపద్యములనుండి వ్యంగ్యమర్యాదను గావ్యేతివృత్తము నుద్ధరించుట యాచారమైయున్నది. ఆపద్ధతి నిందలి 'శ్రీమదికిం బ్రియంబెసఁగన్, ఆత్మ వక్షోమణివేదికన్' అనుమున్నగుపదములశక్తి ననుసరించి క్రమముగ శ్రీకృష్ణుఁడు సత్యాప్రీతిదాయకుండై యొప్పుటయుఁ, బారిజాతము నామె పెరటిచెట్టుగ నెలకొల్పుటయు గోచరించుచున్నవందురు. కాని సమగ్రముగఁ గావ్యార్థసూచన తొలిపద్యముననే చేసెననుటకంటె 'రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని', అనునార్యోక్తి ననుసరించి శ్రీరూపయగు రుక్మిణిని శ్రీకృష్ణుఁడు సంతుష్టంజేయుటను దొలిపద్యమునను దరువాతి పద్యమునఁ దన్మూలమున సత్యకుఁగల్గిన యీర్ష్యయు శ్రీకృష్ణకృతాశ్వాసాదికమును గవి వల్లడించి పైరెండుపద్యములమూలమున సమగ్రముగఁ గావ్యార్థమును సూచించెననుట సరసమును, సముచితమును, సాధారమును నగునని తోఁచెడిని. సంస్కృతకవు లీగతిని రెండుమూఁడుపద్యములమూలమునఁ గావ్యార్థమును నాటకాదులందు సూచించుటయుఁ గలదు. మఱియుఁ గృతిపతి వైష్ణవమతాశ్రయుఁడు గాన మహాలక్ష్మ్యంశసంభూతయగు రుక్మిణికి శ్రీకృష్ణుఁడు ప్రియముగూర్చుటను గృతిపతి మతతద్దైవతానుకూలవిషయనిరూపణమూలముగను, దాను శైవుఁడుగాన లక్ష్మ్యంశసంభూత కాని యీర్ష్యాకషాయితను సత్యను శ్రీకృష్ణుఁ డనునయించుటను, స్వమతానుకూలస్వేష్టదైవతప్రసంగద్వారముగను నిరూపించి పతిమతస్వమతానుకూలవిషయప్రసంగతిని గావ్యార్థమును మనోహరముగ సూచించెననుట యెంతయు నొప్పియుండును.

కవులు సామాన్యముగ సాపాదింపఁబోవువిషయమున కనుకూలించురీతి నిష్టదైవములకు రూపమును సంఘటించుట యరుదు. తిమ్మనార్యుఁ డట్లుగాక కృష్ణరాయనిఁ గృతార్థుంజేయుటకు లక్ష్మీయుతత్వకౌస్తుభాద్యమూల్యాలంకారవిశిష్టత్వాదులధర్మముల వేంకటేశ్వరునకు సమకూర్చి ప్రతిపాదితవిషయమున కనుకూలించుప్రసన్నరూపమును సంఘటించి సరసమగుగతిని విషయమును బోషించెను. అలం. ఉత్ప్రేక్షాముద్రాలంకారములకు సంసృష్టి.

మ. పొలఁతుల్గౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి తలఁబ్రాల్వోయించునవ్వేళ నాఁ
దల గంగం దనసీడఁ దాన కని మౌగ్ధ్యంబొప్ప వేఱొక్క తొ
య్యలి యంచు న్మది నెంచుపార్వతియసూయావాప్తికి న్నవ్వఁ గ్రొ
న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి సంధించు న్మహైశ్వర్యముల్. 2

టీ. పొలఁతుల్=స్త్రీలు, కౌఁగిటన్ = భుజమధ్యప్రదేశముచే, రూ. ఆ. కవుఁగిలి గ్రుచ్చి=కూర్చి, ఎత్తి=లేవఁదిసి, తలఁబ్రాలు=నూతనదంపతులు మంగళార్థము తలమీఁదఁ

బోసికొనుబియ్యము. అవ్వేళన్ =ఆసమయమున, రూ. అ. ఆవేళన్. పైఁదలన్ = తల మీఁద, తననీడన్ =తన ప్రతిబింబమును, మౌగ్ధ్యంబు = తెలివితక్కువతనము. వేఱొక్క తొయ్యలి = మఱియొకవనిత, అసూయావాప్తికిన్ =ఈర్ష్యనుబొందుటకు, (అసూయ + అవాప్తికిన్), క్రొన్నెలపూఁదాలుపు = క్రొత్తచందురుసిధరించువాఁడు (రాజశేఖరుఁడు), మహైశ్వర్యములన్ =గొప్పసంపత్తులను.

భావము. పార్వతి సిగ్గుచే నీశునితలపైఁ దలఁబ్రాలు పోయఁజాలకున్న స్త్రీ లామెను కౌఁగిటఁ గదియించి యెత్తి తలఁబ్రాలు పోయించిరనియు, నపు డామె శివజటాజూట వాసిని యగుగంగయందుఁ బ్రతిఫలించిన తననీడఁ దాను గని యజ్ఞతచే శివు డింతకు మున్ను వేఱొకతెను బరిగ్రహించియుండునని తలంచి యీర్ష్యాకషాయిత యయ్యె ననియు, నపు డీశుఁ డాపార్వతియొక్క యట్టితెలివితక్కువతనమునకై నవ్వెననియు భావము.

వ్యా—విశే. కౌఁగిలి. ఇది యౌపవిభక్తికము. ఇ టి తి వర్ణంబు లౌపవిభక్తికములు. ఇవి ద్వితీయాద్యేకవచనములు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిఁ బ్రాయికం బుగనగు. ఔపవిభక్తికములఁ దృతీయాసప్తముల కత్వంబాదేశంబు బహుళముగానగు. 'కౌఁగిటన్' పైఁదల. ఇయ్యది శబ్దరత్నాకరమున నిర్బిందుకముగనే యగపడును. సప్తమ్యర్థమున నవ్యయీభావము. ఇట్టిరూపము లాంధ్రవాఙ్మయమున కడుస్వల్పముగాఁ గానవగును. పెడతల, లోఁబొద ఇత్యాదులు. అవ్వేళన్. ఆ+వేళన్. ఆ ఈ ఏ యనుసర్వనామములు త్రికసంజ్ఞకములు. కర్మధారయంబు త్రికస్త్రీసమధాతుజవిశేషణ పూర్వపదంబై యుండు. త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఊష్మరేఫములకుఁ గలుగదు. అవ్వేళన్. క్రొన్నెల. క్రొత్త+నెల. పూవు. సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు. పరుషేతరములు పరంబులగునపుడు నుగాగమ ప్రాప్తిలేమిం జేసి ద్విత్వము కల్గును. క్రొన్నెల.

విశే. తొలిపద్యమున వివరించినరీతిగ నిందు సత్యాసూయ గమ్యమగుచున్నది. మఱియు, 'తననీడఁ దానుగని, మౌగ్ధ్యంబొప్ప' అనుపదములజాడ ననుసరించి సత్య యూరకే భ్రమఁజెంది యీర్ష్యఁ బూనెననియు, నిందు శ్రీకృష్ణుని తప్పేమియు లేదనియు వ్యంగ్యములు స్ఫురించుచున్నవి. శివుఁడు సంపత్ప్రదాతగాన, మహైశ్వర్యముల నొసంగుటలో నాతనికిఁ బ్రాధాన్యమిచ్చుట యెంతయు హృద్యమనఁదగును. చంద్రవంశమణియగు ఱేనికిఁ జంద్రచూడామణి యగుశివుఁడు మహైశ్వర్యముల నొసఁగుఁగాతమనుట యెంతయు సరసమగును. మఱియు మందాకిని మౌళింబూని

నూత్నచంద్రాలంకారమును ధరించి వివాహమంగళకౌతుకమువశమునహాసాలంకృతవద నుండై యెలమిమీఱ నుండు ప్రసన్నుఁడు మహైశ్వర్యసంధాతయగుఁగాకనుట మిగుల నుచితమనఁదగును.

అలం. భ్రాంతిమత్తు.

మ. తన దంతాగ్రముచేతఁ దీక్ష్ణమతి నుద్యత్కుంభయుగ్మంబుచే
త నితాంతోన్నతి దానవిస్ఫురణ నుత్సాహంబుశుండాముఖం
బున దీర్ఘాయువు నిచ్చుఁ గావుత గుణాంభోరాశికిం గృష్ణరా
యనికి న్వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై. 3

టీ. వారణరాజవక్త్రుఁడు = ఏనికమేటిమొగముగల గణనాథుఁడు, దంతాగ్రముచేతన్ = దంతంపుఁగొనచే (ఏకదంతుఁడుగాన నొకకొన యనెను), తీక్ష్ణమతిన్ = నిశితమగుబుద్ధిని, ఉద్యత్కుంభయుగ్మంబుచే-ఉద్యత్ = పైకిలేచిన, కుంభయుగ్మంబుచే= కుంభద్వయముచే, ఏనుఁగుతల నిరువంకలనుండు నెత్తగుప్రదేశముల రెండుకుంభము లనుట కవులయాచారము. 'ఘనకుచకుంభయుగ్మకము దార్కొని యొప్పునకై యసూయమై' అని నృసింహపురాణము. ఎ. ప్ర. నితాంతోన్నతిన్ = అత్యంతమగునున్నతిని. దానవిస్ఫురణన్ =మదముయొక్క ప్రకాశముచే, ఉత్సాహమును = పరిపాలనాశక్తిని, శుండాముఖంబునన్ =తొండముయొక్కకొనచే, దీర్ఘాయువును=చిరాయువును, గుణాంభోరాశికిన్ =సుగుణసముద్రునకు, కృపా...అబ్జుఁడై-కృపా=దయకు, ఆయత్త=అధీనమైన, ఏక=ముఖ్యమైన, చిత్తాబ్జుఁడై=మనఃపద్మముగలవాఁడై.

విశే. తైక్ష్ణ్యముగలసాధనముచేఁ దైక్ష్ణ్యమును, నౌన్నత్యముగలదానిచే నున్నతిని, నుత్సాహయుతమగుదానిచే నుత్సాహమును, దైర్ఘ్యముగలదానిచే దైర్ఘ్యమును, బ్రసాదించుఁగాతమని చెప్పుట మిక్కిలి హృద్యముగను, సారస్యముగను నున్నది. ఉత్సాహము. ప్రభుమంత్రోత్సాహములను శక్తిత్రయములో నిది యొకటి. అలం. పరికరము.

చ. సరసపుటల్కఁ దీర్చుతఱి శార్ఙ్గసుదర్శననందకాబ్జసం
భరణగుణాప్తి నెన్నడుముపైఁ గటిపై జడపై గళంబుపై
హరినలుగేలుఁ బైకొన సుఖాంబుధి నిచ్చలు నోలలాడునిం
దిర కృపఁ జూచుఁ గాత నరదేవశిఖామణి కృష్ణరాయనిన్. 4

టీ. సరసపుటల్కన్ =పొలయలుకను, తీర్చుతఱిన్ =దిద్దుసమయమున, శార్ఙ్గ...గుణాప్తిన్ - శార్ఙ్గ = ధనువు (విష్ణుదేవునివే యీనాలుగును.) సుదర్శన = చక్రము,

నందక = కత్తి, అబ్జము = శంఖము అనువీనియొక్క, సంభరణ = ధరించుటయును, గుణ = గుణముయొక్క, ఆప్తిన్ = ప్రాప్తితో, నలుగేలున్ = నాల్గుచేతులును, (క్రమముగా) హరి = శ్రీవిష్ణువు, నెన్నడుముపైన్ = మనోహరమగుకౌనుపైని, కటిపైన్ = జఘనముపైని, జడపైన్ = జడపైని, గళంబుపైన్ = మెడమీఁదను, పైకొనన్ = చేర్పఁగా, సుఖాంబుధిన్ = సుఖమనుసముద్రమున, నిచ్చలున్ = నిత్యము, ఓలలాడు = ఈదులాడు, ఇందిర = లక్ష్మి, నరదేవశిఖామణిన్ = భూపాలశ్రేష్ఠుని, కృష్ణరాయనిన్ = కృష్ణదేవరాయని, కృపన్ = దయతో, చూచుఁగాతన్ = దర్శించునుగాక.

భా. పొలయలుకందీర్ప శ్రీమహావిష్ణువు శార్ఙ్గమును ధరించిన యొకచేతిని దన నడుముమీఁదను, సుదర్శనమునుబట్టిన యొకచేతిని దనకటిపైని, నందకమును బూనిన చేతిని తనజడమీఁదను, శంఖమునుదాల్చినచేతిని దనగళముపైని జేర్చి యుపలాలింప నెంతయు సుఖించులక్ష్మి కృష్ణరాయల దయతోఁ జూచుఁగాతమని భావము.

విశే. ఇట్లు చెప్పుటవలన నడుము ధనువువోలె ముష్టిగ్రాహ్యమై యున్నదనియుఁ, గటిచక్రమునుబోలియున్నదనియు, జడ యసిలతంబోలి యొప్పుననియు, గళము శంఖము భాతి నమరియున్నదనియుఁ దోఁచును. సరసపుటలుకన్ - సరసము+అలుకన్, కర్మధారయంబులందు మువర్ణకంబునకుఁ బుంపులగు. కర్మధారయంబులం దుత్తున కచ్చుపరమగు నపుడు టుగాగమంబగు, సరసంపుటలుక ఇత్యాదులు రూపాంతరము లూహ్యములు. నలుగేలు, ద్విగువున నేకవచనంబు ప్రాయికంబుగానగు. మిశ్రంబునకుఁగాదు. నాలుఁగు యొక్క రూపాంతరమునలు. నెన్నడుము - నెఱి+నడుము ప్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణములకెల్ల లోపంబు బహుళంబుగానగు. పరుషేతరంబులు పరములగునపుడు నుమాగమప్రాప్తి లేమిం జేసి వానికి ద్విత్వముకలుగును. కవి యీపద్యమునఁగూడ లక్ష్మికి వక్తవ్యవిషయమున కనుకూలించునాకృతి నుల్లాసమును ననుసంధించినాఁడు. శ్రీకృష్ణకృత సత్యానునయమును దాన సత్యభామకుఁగల్గినసంతసమును ననుఁ గావ్యార్థము నిందుఁ గవి పొందుపఱచెనని తోఁచెడిని. అలం. యథాసంఖ్యము.

చ. తనమృదుగీతికాపరిణతధ్వనివైఖరిఁ బల్కుమంచు మిం
చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు గీఁటుచు నేర్పుచున్నదో
యన నఖరాంకురంబుల నయమ్మునఁ దంత్రులు మీఁటి గానమిం
పొనరఁగఁ జేయువాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 5

టీ. తన...వైఖరిన్ - మృదుగీతికా=మృదువైనపాటయొక్క, పరిణత=పరిపక్వమైన, ధ్వని=శబ్దముయొక్క, వైఖరిన్=రీతివంటిరీతితో, నఖరాంకురంబులన్ = గోటి

మొలకలచే, ఇంపు=సొగసు, ఒనరన్=ఒప్పునట్లుగా, తంత్రులు=వీణతీఁగెలు, ప్రతిభోన్న తున్-ప్రతిభా=అనుక్షణము వికసించుబుద్ధిచే, ఉన్నతున్=అధికునిగాఁ 'నించినరహిన్' అని పాఠాంతరము. మించిన యను కంటె నించిన యనుటలో నర్థవిశేష మెద్దియుఁ గానరాదు. మఱియు 'చున్నదోయను, లీలనొయ్యన' 'నయమ్మున,రయమ్మున' అనుపాఠము లగపడును

భా. తనగళస్వనమునకు సరియగుగలిని బల్కుమని కడురయమునఁ దనచేతి యందలి వీణియకుఁ జెక్కులుగీఁటుచుఁ గఱపుచున్నదో యన గోటిమొలకలచే నేర్పు మీఱ వీణతీఁగెల మీటుచు మనోహరముగ గానము సేయుసరస్వతి కృష్ణరాయని మించిన ప్రతిభగలవానిం జేయుఁగాతమని భావము. ప్రతిభాప్రదాత్రి సరస్వతిగాన నిట్లు చెప్పుటయెంతయు నుచితమగును.

వ్యా—విశే. వీణియ-రూ. అ. వీణె. ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగును. అలం. ప్రతీపము.

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించినపూవుగుత్తి వే
ల్పులగమిజీవగట్టి యుడివోవనిచల్వలటెంకి వెన్నెల
ల్మొలచినపాదు పాల్కడలిముద్దులపట్టి నృసింహుకృష్ణరా
యలఁ గరుణారసంబునినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్. 6

టీ. వలిమలయల్లువాఁడు-వలిమల=మంచుకొండ (హిమాలయము) అల్లువాఁడు= అల్లుఁడు, తలయందు ... గుత్తి = కొదలయందలియేటితోధరించిన పుష్పగుచ్ఛము, వేల్పుల...కట్టి = దేవతలసమూహమునకు జీవనాధారము, ఉడి...టెంకి = తఱుఁగని శైత్యములకుఁ దావగువాఁడు. వెన్నె...పాదు=వెన్నెలలుపుట్టుటకు స్థానమైనవాఁడు. పాల్క...పట్టి = పాలసంద్రము నకుఁగుసుతుఁడు, కరుణారసము = దయారసము, ఇనుపారెడు=ద్విగుణీకరింపఁజేయు 'వలిమలయల్లువాని తలవాఁకదనర్చిన లేక తలర్చిన' అనుపాఠమగపడు. ఇం దన్వయము సరళముగ నొప్పును.

భా. శివజటాజూటమున మిన్నేటితోఁగూడి పుష్పగుచ్ఛమువలె వెలుంగువాఁడును, దేవతాబృందమునకు జీవనాధారమును దఱుఁగనిజలువలకుఁ దావలమైనవాఁడును బాల కడలి ముద్దుపట్టియును నగుచంద్రుఁడు కృష్ణరాయని విస్తారమగుదయం దిలకించుఁ గాత మని భావము. చంద్రుఁడు కృష్ణరాయనివంశమునకు మూలపురుషుఁడు.

విశే. అమ్మూలపురుషు నీశుఁ డౌదలఁదాల్చెననియు, నతఁడు బుధజీవనాధారమై పరఁగెననియు, శైత్యములకుఁ దావలమైనవాఁడనియు, క్షీరసాగరసుతుండనియు విశేషించి పేర్కొనుటంజేసి, క్రమముగ సత్పురుషసమ్మాన్యుఁడనియు,సత్పండితసంపూజ్యుఁడనియుఁ,

శాంత్యాదిసుగుణసమేతుఁడనియు, సద్వంశసంభూతుఁడనియు వ్యంగములు వెల్లడియగుచున్నవి. అట్టియుత్తమునివంశమునఁ బుట్టుటంజేసి, కృష్ణరాయలును నట్టివాఁడే యగునని కవియూహ. ఆంధ్రకవిసంప్రదాయమును గణింపక యీకృతికర్త సుకవిస్తుతి కుకవినిందల నేలొకో పరిత్యజించెను. చూ. ఉపోద్ఘాతము.

వ్యా—విశే. జీవగఱ్ఱ. ఇట్లు సంస్కృతాంధ్రములకు సమాసముకూర్చుట దుష్టమగుటంజేసి యీరూపము గ్రామ్యమైనది. కాని మహాకవిప్రయుక్తమగుటంజేసి యనింద్యగ్రామ్యము నాఁదగును. మహాకవిప్రయుక్తములకుమాత్రమే యీయసాధుత్వకల్పనముగాని మఱికొన్ని యిట్టివి కల్పించి కవులు ప్రయోగింపరాదని బుధులయభిప్రాయము. ఈపద్యమున మూఁడుపాదములు ముద్దులొల్కు నచ్చతెనుంగుపదములతోఁ గూర్పఁబడినవి.

### కృతిపతివంశావళి.

ఉ. ఆయమృతాంశునందుదయమయ్యె బుధుండతఁడార్తరక్షణో
పాయుఁ బురూరవుం గనియె నాతనికాయువు పుత్త్రుఁడయ్యె న
య్యాయతకీర్తికిన్నహుషుఁ డాత్మజుఁడై యిలయేలెఁ దత్సుతుం
డై యలరెన్యయాతి యతఁడాహవదోహలుఁ గాంచెఁ దుర్వసున్. 7

టీ. ఆయమృతాంశునందున్ = అయ్యమృతకిరణుండగుచంద్రునందు, ఉదయమయ్యెన్=పుట్టెను. ఆర్తరక్షణోపాయున్-ఆర్త=సంకటపాటునొందువారలను, రక్షణ = ప్రోచుటయందు, ఉపాయున్=ఉపాయములుగలవానిని, ఆయతకీర్తికిన్=విశాలమగు యశముగలవానికి 'ఆయతశక్తికిన్' అని పా. అ. ఆపక్షమున ఆయతశక్తికి=విస్తారమగు సామర్థ్యముగలవానికి, ఆహవదోహలున్=యుద్ధోత్సాహముగలవానిని.

విశే. ఆ+ఆయతకీర్తి = అయ్యాయతకీర్తి త్రికంబుపైద్విత్వము.

క. ఉర్వీశమౌళి యగునా, తుర్వసువంశంబునందు దుష్టారిభుజా
దుర్వారగర్వరేఖా, నిర్వాపకుఁ డీశ్వరాఖ్యనృపతి జనించెన్. 8

టీ. ఉర్వీశమౌళి=రాజశ్రేష్ఠుఁడు, దుష్టారి...నిర్వాపకుఁడు-దుష్ట=దుర్మార్గులైన, అరి=శత్రువులయొక్క, భుజా=భుజములసంబంధమైన, దుర్వార=నివారింపరాని, గర్వరేఖా=గర్వాకృతికి, నిర్వాపకుఁడు=నాశకుఁడు.

ఉ. తామసవృత్తి లేదు సతతంబును నుగ్రుఁడు గాఁడు పౌరుషం
బేమియు వెల్తిగాదు తన కెందును బైమఱి రాజు లేఁడు సం
గ్రామములోన నొక్కనరుగాసికి వాసి దొలంగఁ డీశ్వర
క్ష్మామహిళామనోహరునిసాటియె యీశ్వరుఁ డెన్నిభంగులన్. 9

టీ. తామసవృత్తి—తామస = కోపాధిక్యముయొక్క. శివపర. తమోగుణము యొక్క, వృత్తి = వర్తనము. ఉగ్రుఁడు = భయంకరుఁడు. శివుఁడు సతత ముగ్రశబ్ద వాచ్యుఁడు. పౌరుషము=మగఁటిమి. శివుఁ డర్ధమున నారిం దాల్చువాఁడగుట నాతనికి బుంస్త్వము వెలితియే. పైన్=మీఁదను, రాజు లేఁడు. తన్ను శాసింపఁగల నధికుఁడగు రాజు లేఁడనుట, ఈశ్వరున కుత్తమాంగమునఁ బైని రాజుగలఁడనుట. సంగ్రామములోనన్ =యుద్ధములో, ఒక్కనరు గాసికి=ఒక్కమనుజుని బాధకు. శివ. ఒక్కయర్జునుని బాధకు, వాసి=ప్రసిద్ధి, లోఁగుఁడు=వినువఁడు. తా నొక్కనరుని బాధనంది తన ప్రసిద్ధిని గోలు పోలేదని యీశ్వరనృపతిపరము. ఒక్కయర్జునుని చేఁ గాసినంది వాసితో లోఁగినవాఁడు శివుఁడని శివపరము. ఈశ్వరక్ష్మా...వారుని=ఈశ్వరభూసతీనాథుని.

భా. తామసవర్తనుండగుటను, సంతత ముగ్రుఁడగుటను, పౌరుషము వెలితియగుటను, బైని రాజుండుటను, నొక్కనరుగాసికి వాసిఁ దొలంగుటను, నీశ్వరుఁ డీశ్వరనృపతికి సాటి గాఁజాలఁడని భావము. మాయాకిరాతరూపుఁ డీశుఁడు పందికై సమరము సేయు నపు డర్జునున కోడెననుభారతగాథ నిచట ననుసంధింపవలయును.

అలం. శ్లేషోత్థాపితవ్యతిరేకము.

ఉ. రాజులనెత్తుటం బరశురాముఁడు ప్రంతలు సేసె రెండుమూఁ
డీజగతిన్ గణింప నది యెంతటివిస్మయ మబ్జినీసుహృ
త్తేజుఁడు కందుకూరికడఁ దిమ్మయయీశ్వరుచే జనించె ఘో
రాజి బెడందకోట యవనాశ్వికరక్తనదీసహస్రముల్. 10

టీ. రాజులనెత్తుటన్=రాజులరక్తముచే, ప్రంతలు=మడుఁగులు, రెండుమూఁడు:- ఇది యల్పార్థద్యోతకము. మఱియు రెంటను మూఁ డైదనియు గ్రహింపవలయును. విస్మయము=ఆశ్చర్యము. అబ్జినీసుహృత్తేజుఁడు - అబ్జినీసుహృత్ = సూర్యుఁడు. వాని యొక్క కాంతివంటి కాంతిగలవాఁడు. తిమ్మయయీశ్వరుచే=తిమ్మరాజుకొడుకగు నీశ్వర రాజుచే, ఘోరాజిన్ = భయంకరమైనయుద్ధమున, బెడందకోట...సహస్రముల్ = బెడందకోటయందలి తురకరౌతులసంబంధమగు రక్తరూపములగు నదులఁ బెక్కింటిని.

భా. పరశురాముఁడు రెండుమూఁడు (ఐదు) రక్తపుమడుఁగుల రాజులరక్తముచేఁ గావించెనుగాని యయ్యది యొకయద్భుతకార్యము గాదు. తిమ్మయ యీశ్వర నృపతి బెడందకోటయందలి తురుష్కులగు నాశ్వికులరక్తముల నసంఖ్యములగు నదీ ప్రవాహములఁ బుట్టించుట యత్యద్భుతకార్యము.

వ్యా-విశే. సెత్తురు-షౌవవిభక్తికము. తృ. సెత్తుటన్. పరశురాముఁ డిరువదియొక్క మాఱులు క్షత్రియవీరులఁ జంపి కురుక్షేత్రమున నైదుమడుఁగులు త్రవ్వించి వానిని రాజులరక్తముతో నింపి పితృతర్పణము గావించెను. ఇవియే శ్యమంతపంచకము నాఁబరగు. అను బ్రహ్మాండపురాణగాథ నిచట ననుసంధింపవలయును. అలం. అతిశయోక్తి.

క. శాశ్వతవిజయుఁడు తిమ్మయ
యీశ్వరనృపతికిని గౌరి కెనయగు తత్ప్రా
ణేశ్వరి లక్కాంబికకు
న్విశ్వాతిగయశుఁడు నరసవిభుఁ డుదయించెన్. 11

టీ. తత్ప్రాణేశ్వరి=ఆయీశ్వరరాజుభార్య, విశ్వాతిగయశుఁడు-విశ్వ=లోకములను, అతిగ=దాఁటిపోవు, యశుఁడు=కీర్తిగలవాఁడు, ఎన=సాటి. ఇందు 'లక్కాంబిక' అనుచో 'బుక్కాంబిక' అని పాఠాంతర మగపడును. మనుచరిత్రాదుల ననుసరించిన 'బుక్కాంబిక' అనియే యుండునని చెప్పవలెను.

సీ. ఎవ్వానివిజయంబు లెకిఁగించుశాసనస్తంభంబు లాశాంతశైలవితతు
లెవ్వానియరిగాఁపు లేపారుకాళింగ యవనాది వివిధదేశాధినాథు
లెవ్వానినిత్యదానైకవిలాసంబు లారూఢతరతులాపూరుషంబు
లెవ్వానిచిరకీర్తి యింద్రలోకాంగనాభోగినీగీతికాభోగపదము
తే. వాఁడు వొగడొందు సర్వసర్వంసహాధి
దేవతాముఖదర్పణద్విజయనగర
భద్రసింహాసనస్థుఁ డున్నిద్రతేజుఁ
డీశ్వరాధిపునరసభూమీశ్వరుండు. 12

టీ. ఆశాంతశైలవితతులు-ఆశాంత = దిగంతములందైన పర్వతసమూహములు, అరిగాఁపులు=పన్నును జెల్లించుసామంతరాజులు, నిత్యదానైకవిలాసంబు=సర్వదా చేయుసీవియొక్క ముఖ్యమైనవిలాసమును, ఆరూఢతరతులాపూరుషంబులు = మిగులఁ బ్రసిద్ధమైన తులాపురుషాదిదానములు, ఇంద్రలోక...పదము-ఇంద్రలోక = స్వర్గమునందలి, అంగనా=స్త్రీలయొక్కయు, భోగినీ=నాగలోకస్త్రీలయొక్కయు, గీతికా = పాటలయందు, ఆభోగ=విస్తారమైన, పదము=స్థానముగలదో, సర్వసర్వం...సింహాసనస్థుఁడు-సర్వ=సమస్తమైన, సర్వంసహా=భూమియొక్క, అధిదేవతా = అధిష్ఠానదేవతయొక్క, ముఖ=మొగమునకు, దర్పణత్=అద్దమువలె నాచరించునట్టి, విజయనగర=విజయనగరమునందలి, భద్రసింహాసన=మంగళసింహాసనమున, స్థుఁడు=ఉండువాఁడు, ఉన్నిద్రతేజుఁడు

=నిద్రవోనికాంతిగలవాఁడు. అనఁగా సర్వదా ప్రజ్వరిల్లు ప్రతాపముగలవాఁడనుట. ఇందు 'ఆరూఢతర' అనుచో 'ఆరూఢబహు' అనుపాఠ మగపడును. అర్థవిశేషము దీన నెద్దియులేమిఁ ద్యక్తము.

భా. నరసరాజు దిగంతములవఱకుఁ గలభువినంతను జయించుటంజేసి, దిగంతములం గలపర్వతములే యాతనిజయములఁ దెల్పుజయస్తంభములయ్యెననియు, కాళింగయవనాదివివిధదేశాధీశులు సామంతరాజు లాతనికిఁ గప్పముఁ గట్టువారైరనియు, నాతఁ డొనర్చిన తులాపురుషాదిదానము లాతనినిత్యదానోన్నతి నెఱింగించుచున్నవనియు, నాతనికీర్తిని దేవకామినులును నాగాంగనలును గానముచేయుచుందురనియు, నాతఁడు భువి సర్వోత్కృష్టతంబరఁగు విజయనగరమున భద్రసింహాసనస్థుఁడై పాలుచుననియు భావము.

వ్యా-వి శే. వాఁడు వొగడొందు. ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు. తానందుల నొక్కప్రక్కఁ గూర్చుండి వేఱొకప్రక్క బంగారు, వెండి, ముత్యములు, మాణిక్యములు లోనగువానిలో నేవేని తనయెత్తు పోసి వాని నొక సత్పాత్రకు దానముసేయుట తులాపూరుషమండ్రు. అలం. అతిశయోక్తి.

సీ. కుంతలేశ్వరుఁడు సిక్కు వడంగ విద్యాపు
రంబు గైకొని నిజప్రౌఢి నెరపెఁ
బారసీకునకు దుర్భరమానపత్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకు సురవధూమధురాధ
రము లిచ్చి మధురాపురంబుఁ గొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీవి
నోదంబు యావనేంద్రునకుఁ జూపె
తే. నతఁడు నుతికెక్కె రామసేత్వంతరాళ
కలితషోడశదానవిఖ్యాతయశుఁడు
మండలీకరమేఘమార్తాండబిరుదుఁ
డీశ్వరాధిపునరసపృథ్వీశ్వరుండు. 13

టీ. కుంతలేశ్వరుఁడు=కుంతలదేశపురాజు, సిక్కు=చిక్కు. విద్యాపురము = బీజపురము. నెఱపెన్ = వ్యాపింపఁజేసెను. కుంతలశబ్దము కేశవాచకమగుటను, 'సిక్కుపడంగ' అనుపదము అల్లిబిల్లిగ నయి చీకాకుఁజెందుట అనునర్థముగలదగుటను, కుంతల

ములు చిక్కువడి చీకాకుఁజెంది శోభావిహీనములయ్యెనను నర్థాంతర మిచట స్ఫురించుచున్నది. దుర్భరమానవత్వము=భరింపరానిమనుష్యభావము. సుర...అధరము = దేవతాస్త్రీలయొక్క తీయనిమోవులను (మధురాధరముల నొసంగి మధురఁగొనుట యెంతయుం నొప్పియున్నది) శ్రీరంగ...సీమన్=శ్రీరంగపట్టణప్రాంతమున, ఖడ్గనటీవినోదంబు = కత్తియను నటియొక్క వినోదము-యావనేంద్రుఁడు=యవనదేశపురాజు. రామసేత్వంత...యశుఁడు = రామసేతుమధ్యమునఁ జేయఁబడిన పదునాఱుదానములచేనైన ప్రసిద్ధమైనకీర్తిగలవాఁడు. 'మండలీకరమేఘమార్తండ' ఇది బిరుదవాచకము. ఈశ్వరా...శ్వరుండు=ఈశ్వరరాజుకొడుకగు నరసరాజు.

భా. నరసరాజు కుంతలేశుని జిక్కుపఱిచి విద్యాపురమును గొని తనప్రౌఢత్వమును గనుపఱిచెననియు, పారసీకుని జంపెననియుఁ, జోళరాజు నాహవమునఁ దునిమి వీరస్వర్గమును బొందించి మధురను లాఁగికొనెననియుఁ, దనకత్తి త్రిప్పుటయందలి నైపుణిని యవనదేశపురాజునకుఁ జూపెననియు, షోడశదానముల నొనర్చుమహాదాత యనియుం భావము.

విశే. షోడశదానములు:—బంగరు, వెండి, రాగి, కంచు, ఆవులు, ఏనుఁగులు, గుఱ్ఱములు, ఇల్లు, భూమి, వృషభము, బట్టలు, శయ్య, క్షేత్రము, పాదుకలు, దాసి, అన్నము.

క. ఆనరసమహీమహిళా
జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం
బా నాగాంబిక లిరువురు
దానవదమనునకు రమయు ధరయును బోలెన్. 14

టీ. మహీమహిళాజాని = భూమియనుస్త్రీ భార్యగాఁగలవాఁడు, కులసతులు = కులకాంతలు, పుణ్యచరితలు=పవిత్రమైననడవడిగలవారు, దానవదమనుఁడు = రాక్షసుల మర్దించువాఁడు శ్రీవిష్ణువు. శ్రీభూదేవులు మహావిష్ణుజాయలు.

వ్యా-విశే. బహువ్రీహిని దుదినుండుజాయాశబ్దములోని 'యా' అనుదానికి 'జాయాయానిఙ్' అనుదానిచే 'ని' అనునది వచ్చి 'జానిః' అయినది.

క. వారలలోఁ దిప్పాంబకుమారుఁడు పరిపంథికంధిమంథాచలమై
వీరనరసింహరాయఁడు వారాశిపరీతభూమివలయముం బేలెన్. 15

టీ. పరిపంథికంధిమంథాచలము = శత్రువులను సముద్రమునకు మందరపర్వతమై, అనఁగా శత్రుసమూహమును సంక్షోభము నొందించువాఁడనుట. వారాశి...వలయము = సముద్రముచేఁ జుట్టువాల్కొనఁబడిన వలయాకృతిని మించుభూమిని.

## కృష్ణదేవరాయలవర్ణనము.

శా. వీరశ్రీనరసింహశౌరిపిదప న్విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమునన్ జనంబు ముదమందన్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులున్గహనశైలారోహముం జేయఁగన్. 16

టీ. విశ్వ...ధర్యమునన్ = సమస్తమైనభూమండలముయొక్క భారమును మోయుటచే, గహనశైలారోహముఁ=వనములను గొండలను నెక్కుటను.

వ్యా-విశే. నాగమాంబాసుతుండు 'నాగమ' అనుసంజ్ఞావాచకమును సంస్కృత పదముగనే గ్రహించి 'అంబా' అనుదానితో సమాసము చేయఁబడెను. ఇట్లు సంజ్ఞా వాచకములకు సంస్కృతపదములతో సిద్ధసమాస మొనర్చుట కలదు. 'లక్ష్మమావర తనయా' అని పాం. మ.

సీ. యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి
పరకామినీసహోదరతఁ జూప
మఱి జరాసుతునకై మథుర డించుటఁ జేసి
పరవర్గదుర్గము ల్బలిమిఁ గొనఁగఁ
బారిజాతము నాసపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగుపఱుపఁ
తే. గోరి తొలుమేనఁ దన కైనకొదువ లెల్ల
మాన్చుకొన వచ్చి భువనైకమాన్యలీల
నవతరించినకృష్ణుఁ డౌననఁగ మించె
నరసవిభుకృష్ణరాయభూనాయకుండు. 17

టీ. యాదవత్వమున=యదువంశమునఁ బుట్టినవాఁడగుటను, చెన్ను = సొగసు, కోడిగించుట = సవిలాసముగఁ గ్రీడించుట, పర...దరత = పెఱవనితలకు సోదరుఁడగుటను, డించుట=విడుచుట, ఔదార్యము=ఈవి, అడుగుపఱుపఁ=క్రిందు సేయ, తొలుమేనన్ = పూర్వజన్మమున, కొదువలు=లోపములు, మాన్చుకొనన్ = పోఁగొట్టుకొన, భువనైకమాన్యలీలన్=లోకముచే ముఖ్యముగా గౌరవింపఁదగిన విలాసముతో, నరస...నాయకుండు = నరసరాజుకొడుకైన కృష్ణరాయభూపతి.

భా. తాను దొలిపుట్టువున యాదవుఁడౌట సింహాసనము నెక్కనర్వాత లేక పోవుటంజేసి, యట్టికొఱంత నపనయింప నిపుడు సింహాసనస్థుఁడయ్యెననియు, నపుడు గోపికలతోఁ గ్రీడించుటంజేసి, యాలోపమును సవరించుకొన నిపుడు పెఱవనితల నక్కచెల్లెండ్రవలె నరయుననియు, నాఁడు జరాసంధుని కోడి మధురవిడుచుటంజేసి వాటిల్లిన యపయశమును నిర్మూలింప, నేఁడు శత్రుదుర్గముల బలాత్కారముగఁ బరిగ్రహించు ననియు, నానాఁడు పేరాసను బారిజాతమును దెచ్చుటంజేసి కల్గినదూఱును మాయఁజేయ, నీనాఁ డీవిచే నర్థాని గ్రందు సేయుననియును, నిట్లు పూర్వజన్మమున నైన కొఱంతల మాపుకొన యత్నించుటకతన, నా శ్రీకృష్ణుఁడే యీకృష్ణరాయభూనాయకుఁడుగా నవతరించెనని యనవలయుననియు భావము.

వ్యా-విశే. కామి-అగుధాతువునకు వ్యతిరేకభావమున మిజేయు మిజే పరముగా 'అగునకుననుకనులకు ముజ్జీత్తులు పరములగునపుడు కానాకానలు విభాషనగు' అని కాదేశమును గల్గెను. కోడిగించుటఁజేసి-కోడిగించుటను + చేసి 'కోడిగించుటను' అను ద్వితీయ 'కోడిగించుటచే' అనుతృతీయార్థమున 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగానగు' అనునియమము ననుసరించి కల్గెను. పిదప 'కొన్ని యెడలఁ జేత విభక్త్యర్థకవర్ణకంబులకును వలన వర్ణకంబునకును జేసి యనుప్రయుక్తంబగు' అనునియమము చొప్పునఁ జేసి యనుప్రయుక్తమయ్యె. తక్కంగల ప్రక్రియ యూహించి తెలిసికొనునది. అలం. రూపకకావ్యలింగములకు సంకరము.

శా. శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంటెఁ జోళేంద్రత
న్వీరాజత్కుచపాళి*మంజరులకంటె న్సహ్యభూభృత్తటీ
నీరంధ్రీకృతగైరికద్రవముకంటె న్వన్నెఁ గావించెఁ గా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్తప్రభన్. 18

టీ. శ్రీరంగేశ్వర...శ్రీకంటెన్ = శ్రీరంగనాయకుని బొడ్డుయందలి తమ్మిదినపరాగముయొక్క-శోభకంటె, చోళేంద్ర...మంజరులకంటెన్ = చోళరాజభార్యలయొక్క ప్రకాశించుస్తనప్రదేశములందలి పుష్పగుచ్ఛములకంటె, సహ్య...ద్రవముకంటెన్ =సహ్యపర్వతప్రదేశములందైన దట్టమైన గైరికాదిధాతురసముకంటె, కావేరీతోయమున్ = కావేరీనద్యుదకమును, అహితోర్వీనాథరక్తప్రభన్ = శత్రురాజులసంబంధమైననెత్తుటికాంతిచే.

* కుంకుమముకంటె. అని పాఠాంతరము.

భా. కృష్ణరాయలు శ్రీరంగనాయకునిపాక్కిలియందలి తమ్మిదగుపుప్పొడి కాంతిని మించునట్లును, చోళరాజస్త్రీల స్తనములందలి పువ్వుగుచ్ఛములవన్నెను మీఱు నట్లును, సహ్యాచలభూములందైన గైరికాదిద్రవప్రభ నతిశయించునట్లును శత్రురాజరక్త కాంతిని గావేరీతోయము నరుణమును గావించెనని భావము. దీనఁ గృష్ణరాయలు తొలు దొల్త శ్రీరంగమును, బిదపఁ జోళదేశమును, దరువాత సహ్యాచలభూములను, ననంత రము కావేరీతీరస్థశత్రుసమూహమును జయించి జయశ్రీని జూఱగొనెనని తోఁచును.

వ్యా-విశే. 'కంటెవర్ణకము నిర్ధారణపంచమికగు' అనునియమము ననుసరించి వచ్చినదగుట, రక్తప్రభావిషయమునఁ గావేరీతోయము పైమాఁటిని మించియున్నదనుట నిశ్చయము. అలం. అనుగుణము.

సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు
చెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు
గోరక్షణఖ్యాతిఁ గుదురు పఱిచె
సాధుబృందావనసరణి నాఁడును నేఁడు
వంశానురాగంబు వదలఁడయ్యె
సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు
నాకల్ప మవని నింపార నిలిపె
తే. నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మందెను వసుదేవమనుజవిభుని
కృష్ణుఁ డనుపేర నరసేంద్రుకృష్ణదేవ
రాయఁ డనుపేర నాదినారాయణుండు. 19

టీ. నాఁడును = కృష్ణావతారమునను, నేఁడును = కృష్ణరాయావతారమునను, చక్రవర్తిమహాప్రశస్తి—చక్రవర్తి=కృ. చక్రముతోనుండువాఁడు (చక్రి), కృ. రా. మూర్ధాభిషిక్తుఁడు సార్వభౌముఁడు అనుగొప్పదగుఖ్యాతితో, చెలఁగి = ఒప్పి, ధర్మక్రమస్థితిన్-ధర్మ=కృ. ధర్మరాజుయొక్క, కృ. రా. ధర్మముయొక్క, క్రమస్థితిన్ = రీతియొక్కయునికిని, ఘటించెన్ = కూర్చెను. భూభృదుద్ధరణవిస్ఫూర్తి—భూభృత్. కృ. గోవర్ధనగిరియొక్క, ఉద్ధరణ=ఎత్తుటయొక్క, విస్ఫూర్తి=ప్రకాశము, కృ. రా. భూభృత్ = రాజులయొక్క, ఉద్ధరణ=సంహరించుటయొక్క, విస్ఫూర్తి=ప్రకాశము, గోరక్షణఖ్యాతిన్—కృ. గోపాలుఁడనుప్రసిద్ధిని, కృ. రా. గో = భూమియొక్క,

రక్షణ=పాలనముయొక్క, ఖ్యాతిన్=ప్రశస్తిని, సాధుబృందావనసరణి-కృ. సాధు=లెస్సయైన, బృందావనసరణి=బృందావనమార్గము, కృ. రా. సాధుబృంద=సజ్జనసమూహముయొక్క, అవనసరణి=రక్షించుమార్గము. వంశ-కృ. వెదురునందు (పిల్లనగ్రోవి.) అనురాగము=ఆసక్తి, వంశానురాగంబు = కృ. రా. తనవంశమునఁబుట్టినవారియందుఁ బ్రేమ, సత్యభామాభోగసక్తి-కృ. సత్యభామాసంబంధమగు భోగమునందైన యాసక్తిచే, కృ. రా. సత్య=సత్యముయొక్కయును, భామా=నిజదారలయొక్కయును లేక, సత్య=సత్యమనెడు భామా=స్త్రీయొక్క, భోగ=అనుభవమునందైన, సక్తి=ఆసక్తి, ఆకల్పము=కృ. ఆపారిజాతమును, అవనిన్=భూమిపై, కృ. రా. ఆకల్పము = కల్పాంతమువఱకు, యాదవాన్వయమునందు=కృ. యాదవకులమున, కృ. రా. యయాత్యగ్రసుతుండగు యదువుయొక్కవంశమున.

భా. చక్రవర్తియను గొప్పప్రసిద్ధి కల్గియుండి ధర్మక్రమస్థితిని ఘటించుటం జేసియు, భూభృదుద్ధరణ మొనర్చి గోరక్షణఖ్యాతి పాదుకొల్పుటంజేసియు, సాధుబృందావనసరణిని మించి వంశానురాగము వదలమింజేసియు, సత్యభామాభోగసక్తిని మీఱి యాకల్ప మవని నిలుపుటంజేసియు, నవ్వసుదేవసుతుండే యయ్యాదినారాయణుండే నరసరాజునకుఁ గొడుకై కృష్ణదేవరాయఁడను పేరితోఁ బుట్టెనని భావము. కృష్ణావతారమునఁ జక్రమునుదాల్చి ధర్మజునకు న్యాయమును గూర్చెను. కృష్ణరాయావతారమున చక్రవర్తి యనుప్రఖ్యాతిని బడసి ధర్మమును సరిగఁ బాదుకొలిపెను. చక్రవర్తిత్వము, ధర్మక్రమస్థితిసంఘటనము-ఇయ్యవి రెండవతారములకుఁ గల సమాన ధర్మములు. కృష్ణావతారమున గోవర్ధనగిరి నెత్తి గోవులఁ గాపాడెను. కృష్ణరాయావతారమున భూపాలురఁ జంపి భువిని లెస్సగఁ బాలించెను. భూభృదుద్ధరణగోరక్షణము లీరెండవతారముల సమానములు. కృష్ణావతారమున రమ్యమగు బృందావనమందును (మురళి) వేణుయష్టియందును నధికమగునురాగము కల్గియుండెను. కృష్ణరాయావతారమున సత్సమూహమునందును దనవంశీయులందును నధికాదరము కల్గియుండెను. సాధుబృందావనవంశానురాగములు నిందు నందుఁ దుల్యములు. కృష్ణావతారమున సత్యభామాభోగమునందైన ప్రీతిచేఁ బారిజాతవృక్షము నిలకుఁ గొనితెచ్చెను. కృష్ణరాయావతారమున సత్యమునందును నిజభార్యలందును నైన ప్రేమచే నవని నాకల్పము నిలిపెను. సత్యభామాభోగసక్తియు నాకల్పస్థాపనమును నీరెంటను సదృశములు. కాన నాకృష్ణుఁడే యీకృష్ణరాయఁడని భావము.

విశే. కృష్ణునితండ్రి నందుఁ డొకసమయమున నింద్రయాగము సేయ సమకట్టఁగాఁ, గృష్ణుఁ డాతని వలదని వారించెను. దాన నింద్రుఁడు కోపించి శిలావర్షమును

...ను. అప్పుడు తల్లడమందు గోపాలురను గోవులను శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి ... ఛత్త్రముగా నొనర్చి దానిక్రింద గోవుల గోపాలుర నిల్పి యాయుపద్రవము ... గాపాడెను. అనుపురాణగాథ నిచట ననుసంధింపవలెను. బృందావనము శ్రీకృష్ణుని ...గ్యనము. అలం. శ్లేషానుప్రాణితరూపకము.

చ. అలఫణిభోగరత్నములు నాదిగిభోత్కటగండగంధము
లలఁపునఁ బాఱె నవ్వ వసుధాసతి దా భుజకీర్తిమౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయనృపచంద్రునిబాహువునందు భూషణో
జ్జ్వలమణులన్మృగీమదమువాసనయుంగని ధూర్తలంగనల్. 20

టీ. అలఫణిభోగరత్నములుఁ = ఆప్రసిద్ధములగు శేషునిపడగలయందలి రత్నములును, ఆదిగి...గంధములు = ఆదిగ్గజముల యధికమగు చెక్కిళ్లయందలి పరిమళములు. తలఁపునఁ=జ్ఞప్తియందు, వసుధాసతి= భూదేవి, కృష్ణ...బాహువునందు= కృష్ణరాయఁడను రాజశ్రేష్ఠునిబాహువునందు, భూషణోజ్జ్వలమణులఁ = అలంకారము ...దుఁ బ్రకాశించు మాణిక్యములను, మృగీమదమువాసనయుఁ = కస్తూరియొక్క గంధమును, భుజకీర్తిమౌక్తికచ్ఛలమునఁ - భుజకీర్తి = అంగదములందైన, మౌక్తిక= ముంచిముత్తియములయొక్క, ఛలమునఁ=మిషచే, ధూర్తలు=దుశ్శీలలు.

భా. భూదేవి తన్నిపుడు బుజముపైనిడి కృష్ణరాయలు భరించుటంజేసి, యాతని బాహువునందలి యంగదములందైన మణులను గస్తూరిసుగంధమును గని, మున్ను తన్ను మోచిన శేషుని పడుపడగలందలిమణులును దిగ్గజముల గండములందలి మదసుగంధమును దలంపునకు రాఁగా, నవి కృష్ణరాయాంగదములందలి మణులను సుగంధమును బోలఁ జాలమి భుజకీర్తులందలి ముత్తియములను మిషను బరిహసించెనని భావము. నాయకాంతరాశ్రయమును బొంది తొల్లి తన్నుఁ బ్రేమమీఱ భరించిన శేషదిగ్గజనాయకుల వగు రత్నపరిమళములఁ బరిహసించుటంజేసి భూసతీదుశ్శీలత ప్రకటిత మగుచున్నది. ...సము ధవళముగా నుండునట్లు వర్ణించుట కవిలోకసంప్రదాయము. ఇందు 'వాసనయుఁ' అనుచో వాసనలు అనుపాఠాంతర మగపడును. విశేషార్థద్యోతకము గామి, గాని యర్థవివరణము త్యక్తము. అలం. అర్థాంతరన్యాసము.

చ. మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు కృష్ణనందను
న్మనసిజుని న్జయించె నది మానుషమే నరసేంద్రుకృష్ణరా
యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁ డగువీరభద్రుఁ గరుణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్. 21

టీ. మునుకొని=పూనిక వహించి, రుద్రుఁడు=ఈశ్వరుఁడు, కృష్ణనందనుఁ=శ్రీకృష్ణునికొడుకైన, మనసిజునిఁ=మన్మథుని, మానుషమే=పౌరుషమా? ఆహవభూమిఁ=యుద్ధభూమిని, కొండవీటికడఁ=కొండవీఁడను పట్టణముయొక్క ప్రాంతమందు, ప్రతాపరుద్రనంద...భద్రుఁ = ప్రతాపరుద్రునికొడుకైనవీరభద్రుని, కరుణామతిఁ=దయతోఁగూడినబుద్ధితో, జగత్ప్రసిద్ధిగఁ = లోకప్రఖ్యాతమగునట్లుగా, కాచెఁ=రక్షించెను.

భా. తొల్లి యీశుఁడు పూనికమై కృష్ణసుతుండగు మన్మథుని కొండవీటికడ జయించెను. నేఁడు కృష్ణరాయలు కొండవీటిసమీపమున ప్రతాపరుద్రసుతుండగు వీరభద్రుని దయతో రక్షించెను. తనసుతుని జంపినవానియొక్క సుతుని దాను జంపక దయమీఱ రక్షించుటంజేసి కృష్ణరాయపరాక్రమమే శూరజనశ్లాఘ్యమగు పౌరుషమగుననియు, రుద్రపరాక్రమ మట్టిదికాదనియు భావము.

చ. నెలకొని కృష్ణరాయధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
  గలన నెదిర్చి హస్తికరకాండతతుల్మసకంపుఁబాములై
  మలసినచోటఁ గూడినసమగ్రయశోవసనంబు గప్పి తా
  వలవఁగఁజేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడుగాన నేర్పునన్. 22

టీ. నెలకొని. రూ. అ. నెలవుకొని. ఉత్కలభూమిపాలుతోఁ=ఉత్కలదేశపు రాజుతో,కలనఁ=యుద్ధమున, హస్తికరకాండతతుల్=కాండములవంటి యేనికతొండములయొక్క సమూహములు. మసకంపుఁబాములై=సంభోగేచ్ఛతో మించుసర్పములై, మలసినచోటఁ = కూడినచోట, సమగ్రయశోవసనంబుఁ = సంపూర్ణమైన కీర్తియను వస్త్రమును, వలవఁగఁ=ప్రేమించునట్లు, వశ్యవిధిజ్ఞుఁడు=పరుల వశముపఱచుకొనువిధుల నెఱింగినవాఁడు.

భా. కృష్ణరాయ లుత్కలనాథునితో నెదుర్చునాఁడు పోరు ఘోరంబగుట, గజములతుండములు తెగి సంభోగేచ్ఛమీఱ వర్తిలుపాములవలెఁ బరస్పరముగఁ గలసి మెలసి పడెననియు, నట్టియుద్ధముకతనఁ గృష్ణరాయల కనంతయశంబుఁ గల్గెననియు భావము. పైవిషయమునే కవి యిట్లు చమత్కరించి వర్ణించెను. కీర్తి తెల్లగానుండును గాన నద్దానిని వస్త్రముగాను, హస్తికరతతుల నద్దాన నెలకొనుమసకపుఁబాములఁగాను, నాకీర్తి భువిపైనంతట వ్యాపించియుండుట నద్దాని భూసతిని వశముపఱచుకొన నామె పైఁగప్పినసంభోగేచ్ఛను వర్తిలుసర్పమిథునములఁ గూడినవస్త్రముగాను జమత్కరించెను. కామినుల వలవంజేయఁ గాముకు లిట్లొనర్తురని ప్రసిద్ధి.

వ్యా-విశే. మసకంపుఁబొములు-మసకము=సంభోగేచ్ఛ, కర్మధారయసమాసంబుల ముపర్ణకమునకుఁ బుంపులగు. వానికిఁ బరుషములు పరములగునపుడు నుగాగమము. త్రుత కార్యములు. వలవఁగన్. ప్ర. వలచు+ను. 'ఆగమాన్యచకారంబులకద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవలగు.' అనుపద్ధతి ననుసరించి యయ్యాదాగమముగాక యన్యము సిద్ధమునగుటను జెపరముగా వకారము. వలవన్-దీనిపై 'కాన్' అనున దనుప్రయుక్తమై దానికి వికల్పముగా హ్రస్వము కల్గెను.

సీ. ఉదయాద్రి వేగ యత్యుద్ధతి సాధించెఁ
          వినుకొండ మాటమాత్రన హరించెఁ
    గూటము ల్చెదరంగ కొండవీ డగలించె
          బెల్లముకొండయుచ్చెల్లఁ జెఱిచె
    దేవరకొండయుద్వృత్తి భంగము సేసె
          జల్లిపల్లె సమగ్రశక్తి డులిచెఁ
    గినుక మీఱ ననంతగిరి క్రిందుపడఁ జేసెఁ
          గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె
తే. బలనికాయము కాలిమట్టులనె యడఁచుఁ
    గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
    డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
    రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు. 23

టీ. ఉదయాద్రి వేగన్ = ఉదయాద్రియొక్క-వడిని, (ఆలోపమును) అత్యుద్ధతిన్=మిగుల గర్వముతో, వినుకొండన్=వినుకొండ యనుదానిని, వినునట్టికొండగాన మాటయాడినంతమాత్రమున నే భయపడి వశమయ్యెననుట. కూటములు = శిఖరములు, అగలించెన్=పెల్లగించెను. కొండవీడుగాన శిఖరములు చెదరున ట్లున్మూలించెననుట. చెఱిచెన్=చెడున ట్లొనర్చెను. బెల్ల మచ్చుతోఁ దయారగునుగాన నద్దానిం జెఱిపెననుట. ఉద్వృత్తిన్ = ఉద్ధతిని, భంగము = నాశము, సమగ్రశక్తిన్=సంపూర్ణమైన సామర్థ్యముతో, కినుక = కోపము, గ్రక్కున = శీఘ్రముగ, బలనికాయము = బలములగుంపు, కాలిమట్టులన్=పాదముల త్రొక్కుడులచే, ఉత్కలమహీశుఁడు=ఉత్కలదేశపురాజు.

భా. ఉదయాద్రి, వినుకొండ, కొండవీడు, బెల్లముకొండ, దేవరకొండ, జల్లిపల్లె, అనంతగిరి, కంబముమెట్టు, కటకము - ఇవి రాయలు జయించినప్రదేశములు. రాయల పూర్వదిగ్జైత్రయాత్ర సమగ్రముగ నిందు సూచితమయ్యెను.

వ్యా-విశే. చెఱిచె. చెడునకుఁ జుక్కు పరమగునపుడు డాకలఘురేఫంబగును. అడఁచు. రూ. అ. అణఁచు. వేగ. ఇయ్యది కళయైనట్లు 'ధృతరాష్ట్రుం డవినీతి నేసినను సంధింపంగరాదంచువేగ తెగంబాఱకు' అను తిక్కనభారతప్రయోగము తెల్పుచున్నది. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి 'ఆవేళ నరిగె నాకులజీవాతువువేగ' అనుస్థలము నరయునది. చూ. హరి. పీఠిక.

ఈసీసమున నొక్కొక్కప్రదేశమును సాధించెనని చెప్పుటలోఁ గవి సాభిప్రాయములగుపదముల నిల్పిన ట్లూహింపనగును.

సీ. బాహుసౌధక్రీడఁ బరఁగుపంటవలంతి
  తొయ్యలినిడుదకస్తూరిబొట్టు
వైరిసైన్యాబ్ధిలో వచ్చు గెల్పులనావఁ
  గడఁజేర్చు ప్రాఁకుడుఁగడపుఁజేయి
యరికుంభికుంభముక్తాక్షరాంకితమగు
  జయరమాకన్యక చదువుపలక
శత్రురాజులకు నచ్చరల నాకర్షించు
  సమరేంద్రజాలపింఛంపుఁగుంచె
తే. మేనుసగము యశోమహేశానునకును
శౌర్యరవిఁ గోరి వచ్చినచాయలేమ
నరసవిభుకృష్ణరాయభూనాథచంద్రు
చేత ననిలోన మించుకౌక్షేయకంబు. 24

టీ. బాహుసౌధక్రీడన్ = బాహువనెడు మేడయందలి యాటయందు, పరఁగు=ఒప్పు, పంటవలంతితొయ్యలి = భూమియను వనితయొక్క, నిడుద=నిడుపుగానున్న, కస్తూరిబొట్టు=కస్తూరితిలకము,వైరిసైన్యాబ్ధిలోన్ =శత్రుసేనయనుసముద్రములో గెల్పులనావన్ = విజయనౌకను, కడఁజేర్చు = దరిఁజేర్చు, ప్రాఁకుడుఁగడపుఁజేయి = పాఁచిఁబట్టినచుక్కాను, (అరిత్రము) అరి...అంకితము-అరి=శత్రువులయొక్క, కుంభి=ఏనుఁగులయొక్క, కుంభ=కుంభస్థములందుండైన, ముక్త = మంచిముత్తియములను, అక్షర = వర్ణములచే, అంకితము=చిహ్నితము. జయరమాకన్యక చదువుపలక = జయలక్ష్మియను బాలికయొక్క చదివెడుబల్ల, శత్రురాజులకు=వైరిభూమీశులకు, అచ్చరలన్=అప్సరలను, ఆకర్షించు=తిగుచునట్టి, సమర...కుంచె = యుద్ధమనుగారడిసంబంధమైన నెమిలి

...నముయొక్క కుంచె. యశోమహేశానునకున్ =కీర్తియనునీశ్వరునకు, మేనుసగము= ...ర్ధము. భార్య యని భావము. శౌర్యరవికిన్=పరాక్రమమనుసూర్యుని, చాయలేమ= ఛాయాదేవి, చేతన్=హస్తమున, మించు=ప్రకాశించు, కౌక్షేయకము = కత్తి. ఇది ...ర్గ్యపదము.

భా. కృష్ణరాయనిచేతనుండుకత్తి యాతనిభుజసౌధమున నాటలాడుభూసతికి ...స్తూరికాతిలకమువలెను, వైరిసేనాసముద్రమున నడయాడు గెల్పునావ నొడ్డునకుఁ ...ర్చు పాఁచిపట్టిన యరిత్రమువలెను, శత్రువుల యేనుంగులకుంభముల భేదించుటకతన ...ముత్తెములతోఁగూడి జయలక్ష్మి యనుబాలిక చదువు ...లపముపలకవలెను, శత్రురాజులకు నచ్చరల నాకర్షించి కూర్చుయుద్ధమనుగారడి ...మైన నెమిలిపించపుఁగుంచెవలెను, గీర్తి యనునీశ్వరున కర్ధాంగివలెను, బరా ...మసూర్యుని బడయఁగోరివచ్చిన ఛాయాదేవివలెను బ్రకాశించుచున్నదని భావము.

విశే. రాజు భుజమున నిడి భువి మోయుననుట కవిలోకసంప్రదాయముగాన, ...సతి భుజముననుండెననుటయుఁ, గస్తూరికాతిలకము నల్లనై యుండునుగాన నల్లనియసి ...మె తిలకముగా నూహించుటయు సరసముగా నున్నవి. అసి నల్లగా నుండునుగాన ...త్రము పాఁచిపట్టినదనుట యెంతయు హృద్యమగు. నల్లనికత్తిపైఁ దెల్లనిముత్తి ...ము లంటియుండుటంజేసి, తెల్లనియక్షరములతో నొప్పు చదువుబల్లగా దాని నూహిం ... లెస్సయగు. భువిపైనుండు రాజన్యులకు దివిపైనుండు నచ్చరలఁ దిగిచి కూర్చు ...మగుననిగాన, దీనిని గారడిసంబంధమగు నెమిలి యీకలకుంచెగాఁ జెప్పుట ...ప్పగు. కీర్తి తెల్లగా నుండును. ఈశ్వరుఁడును దెల్లనివాఁడే. పార్వతి నల్లనిది. కత్తి ...లుపు. కానఁ గీర్తి నీశ్వరునిగాను, గత్తి నాతనియర్ధాంగిగాను బేర్కొనుట సముచిత ...గ నున్నది. సూర్యునికాంత ఛాయాదేవి. శౌర్యరవి గాన నీఛాయ యాలినినే ... పొందినది. మఱియు ఛాయాశబ్దమునకు నీడ యనియు నర్థము గలదు. నీడ ...ల్లగా నుండును. కాన నల్లనికత్తిని ఛాయగా నిరూపించుటయుఁ, బ్రతాపఖనిని ...ములను రవిగా నూహించుటయు మిగులఁ దగియున్నవి. అలం. రూపకము. ...ల్లము.

## షష్ఠ్యంతములు.

క. ఏవంవిధగుణఖనికిని, దేవవనితాప్రార్థ్యమానధూర్తారిధరి
త్రీపరిసంగతసుభగం, భావుకరణముదితకలహాపారణమునికిన్. 25

టీ. ఏవం...ఖనికిని-ఏవంవిధ = యీరూపములైన, గుణ = మంచిగుణములకు, ...గనియైనవానికిని, దేవ...మునికిన్ - దేవవనితా = దేవతాస్త్రీలచే, ప్రార్థ్య

మాన = కోరఁబడుచున్న, ధూర్త=దుష్టులైన, అరిధరిత్రీవర = శత్రురాజులయొక్క, సంగతి=కలయికకు, సుభగంభావుక = మనోహరమగు, రణ=యుద్ధముచేత, ముదిత= సంతుష్టుఁడగు, కలహ=కలహమే, పారణ=భోజనముగాఁగల, మునికిన్=నారదుఁడుగల వానికి, కృష్ణరాయనికి.

విశే. 'కలహపారణమునికిన్' అనుపదముచేఁ బారిజాతసుమ సమర్పణమూలక మగు నారదకృతకలహవృత్తాంతము సూచితము. అలం. పర్యాయోక్తి. ముద్రాలంకారము.

క. రాధాతనయాంధారిత, గాధాధఃకరణనిపుణకరసదయునకున్
మేధావదసాధారణ, బోధాకరహృదయునకు విబుధసదయునకున్.

టీ. రాధా...యునకున్ - రాధాతనయ=కర్ణునియందు, ఆధారిత = నిల్పఁబడిన, గాధా=కథను (అనఁగాఁ 'దానకర్ణుఁడను ప్రఖ్యాతిని) అధఃకరణ = క్రిందు చేయుటయందు, నిపుణ=నేర్పుకల, కర=హస్తముగల్గిన, సదయునకున్ = దయతో నొప్పువానికి, లేక, కర=హస్తముయొక్క, సత్=యోగ్యమైన, అయునకు = శుభావహవిధిగలవానికి, 'నిపుణకరణశయునకున్' అని పాఠాంతరము. నిపుణ = నైపుణ్యముగల, కరణ=సాధనమైన, శయునకున్ = హస్తముగలవానికి, మేధా...హృదయునకున్ - మేధావత్=ప్రజ్ఞగలపండితులకు, అసాధారణ=సాధారణముగాని, బోధా=జ్ఞానమునకు, ఆకర=స్థానమైన, హృదయునకున్=మదిగలవానికి, విబుధసదయునకున్=పండితులవిషయమై దయతోఁగూడినవానికి. ఇందలియమకమును గమనించిన సదయున కనునదియు సత్స్వరమగును గాని తక్కుంగలపద్యములలో నొక్కొకపర్గమునకే వ్యావృత్తి యుగపడుట నట్లనుట సరికాదని తోఁచెడిని.

భా. కృష్ణరాయఁడు దానముచేఁ గర్ణుని గ్రిందుపఱుచువాఁడనియుఁ, బండితుల కంటె మించినజ్ఞానముగలవాఁడనియుఁ, బండితులయెడల దయాళుఁడనియు భావము.

క. నాగాంబికాకుమారున, కాగామిగతాధునికనృపాలభ్యయశో
*శ్రీగుంభహసితహిమగుచి, శ్రీగజతనుకటజసన్న్యసంభావునకున్.

టీ. నాగాంబికాకుమారునకున్ = నాగాంబాసుతునకు, ఆగామి...సంభావునకున్-ఆగామి=పుట్టఁబోవునట్టియు, గత = చనినట్టియు, అధునిక = ప్రకృతమునున్నట్టియు, నృప=రాజులచే, అలభ్య=పొందశక్యముకాని, యశశ్శ్రీ = కీర్తిసంపదయొక్క, గుంభ=కూడికచే, హసిత=నవ్వఁబడిన, హిమగు=చంద్రునియొక్కయు, దిశా

* 'శ్రీగలహసితహిమగు' పాఠాంతరము.

గజ=దిగ్గజములయొక్కయు,(క్రమముగా)తను=శరీరమునుండియు (ఈశరీరము చంద్రునిది), కట=గండములనుండియు, జ=పుట్టిన, నైల్య=నీలత్వముయొక్క, సంభారునకున్=సంపూర్ణతగలవానికి.

భా. కృష్ణరాయలయశస్సు త్రికాలములయందైన రాజన్యులకీర్తిని మించినదనియు, నాకసమును దిగంతములను నాక్రమించి మించెననియు భావము.

క. సామర్షదళితపరభట, సామజహయకూలముద్రుజక్షతజధునీ
కాముకితాఖిలజలధికి, నాముష్యాయణసుధీగృహాంగణనిధికిన్. 28

టీ. సామర్ష...జలధికి-సామర్ష=కోపముతో, దళిత=బ్రద్దలుచేయఁబడిన, పరభట=శత్రుభటులయు, సామజ=శాత్రవులయేనుఁగులయు, హయ=గుఱ్ఱములయు, కూలముద్రుజ=ఒడ్డును బెల్లగించి పడఁద్రోయుటవల్లనైన (నిర్మూలించుటచేనైన) క్షతజధునీ=రక్తప్రవాహములచేత, కాముకిత=విటులుగాఁజేయఁబడిన, జలనిధికిన్=సముద్రములుగలవానికి, ఆముష్యా...నిధికిన్-ఆముష్యాయణ=సద్వంశసంజాతులగు, సుధీ=పండితులకు, గృహాంగణ=ఇంటిముంగిలివాకిలియందైన, నిధికిన్=నిధియైనవానికి. ఇందు 'కూలముద్రుజ' అనుచో 'కూటమూర్ధజ' అను పాఠ మగపడును. కూలముద్రుజపదము ప్రసిద్ధపదమగుటను, బాఠాంతరము విశేషార్థబోధకముగామిని బరిత్యక్తము.

భా. కృష్ణరాయలు శత్రువులభటులను, నేనుఁగులను, గుఱ్ఱములను జంపుటకతన నెత్తుటేరులు వెల్వడి సముద్రమునఁ గలియుచుండెననియు, నాతఁడు పండితులకు నింటనుండు పెన్నిధి యనియు భావము.

క. కోదండద్రోణునకును, వేదార్థస్థాపనప్రవీణునకు సమి
న్నేదిష్ఠవిమతతరసా, స్వాదనవశతుందపరిమృజకృపాణునకున్. 29

టీ. కోదండద్రోణునకున్=ధనువువిషయమై ద్రోణునింబోలువానిని (ధనుశ్శబ్దము లక్షణచే ధనుర్విద్యాబోధకమగునని గ్రహింపవలయును) వేదార్థ=వేదవిహితకార్యముల, స్థాపన=నెలకొల్పుటయందు, ప్రవీణునకున్=నేర్పుగలవానికి, నేదిష్ఠ...కృపాణునకున్-నేదిష్ఠ=సమీపముననున్న, విమత=శత్రువులయొక్క, తరస=మాంసముయొక్క, ఆస్వాదనవశ=భుజించుటకతన, తుందపరిమృజ = కడుపునుదడవికొను (సోమరియైన) కృపాణునకున్=కత్తికలవానికి, ఇందు 'వేదార్థ' అనుచో 'వేదాధ్వ' అను పాఠ మగపడును. వేదమార్గస్థాపనమను సరసార్థము సరళముగ బోధించుటఁ బాఠాంతరము హృద్యమని తోఁచెడిని.

భా. కృష్ణరాయలు విలువిద్యను ద్రోణునిబోలువాఁడనియు, వేదార్థముల నెల కొల్పునుత్సాహము గలవాఁడనియు, శత్రురాజులరక్తములం గడుపునిండ భుజించుట కతన సోమరియైనకత్తి చేతధరించు నకుంఠితపరాక్రమము గలవాఁడనియు భావము.

క. అసుహృదసుపవనవిసర, గ్రసనరసవ్యసనవశవికసదసిరసనా
ప్రసరణశయఫణివిలసన, విసృమరమరువకితసమరవీథీస్థలికిన్. 30

టీ. అసుహృ...స్థలికిన్-అసుహృత్=శత్రువులయొక్క, అసుపవన=ప్రాణ వాయువుల, విసర=సమూహములయొక్క, గ్రసన=మ్రింగుటయందలి, రస=రుచియును, వ్యసన=ఆసక్తికి, వశ=అధీనమైన, వికసత్ = విడియున్న, అసి = కత్తియను, రసనా = నాలుకయొక్క, ప్రసరణ=చాచుటనుగల్గిన, శయ = హస్తమను, ఫణ=పడగయొక్క, విలసన=విలాసము చేత, విసృమరమరువకిత=వ్యాపించునట్టి భయముగలదిగాఁ జేయఁబడిన, సమరవీథీస్థలికిన్ = యుద్ధరంగముగలవానికి.

భా. కృష్ణరాయలకత్తి యనుపాము నాలుక యాతని యరచేయి యనుపడగ నుండి వెల్వడి శత్రురాజుల ప్రాణవాయువులఁ ద్రాగుటయం దాసక్తమై చలించుచు యుద్ధరంగమున సమస్తమునకు వెఱపును బుట్టించుచు మించెనని భావము. ఇట్లనుటచే బానూవునకు సర్పత్వము గమ్యమగుచున్నది. అలం. రూపకము. వృత్త్యనుప్రాసము.

క. వైంధ్యద్విపగంధనిబ, ద్ధాంధ్యాళిప్రతిపదోదితాలయవిభవా
వంధ్యప్రబంధకృతిసం, బంధ్యనుభావునకు బుధితమనుభావునకున్.

టీ. వైంధ్య...భావునకున్-వైంధ్య = వింధ్యపర్వతమునఁబుట్టిన, ద్విప=ఏనుఁగులయొక్క,గంధ=పరిమళముచేత, నిబద్ధ=కూర్పఁబడిన, ఆంధ్య=గ్రుడ్డితనముగల్గిన, అళి=తుమ్మెదలచేత, ప్రతిపద=అనుక్షణమందు, ఉదిత=పలుకఁబడిన, ఆలయ=ఇంటియొక్క, విభవ=వైభవముగలవాఁడును, అవంధ్య=మొక్కవోని, ప్రబంధ = కావ్యములయొక్క, కృతి=నిర్మాణమునకు, సంబంధి=సంబంధించిన, అనుభావునకున్ = మహిమగలవాఁడును నగువానికి, బుధితమనుభావునకున్=తెలిసికొనఁబడిన మనువుయొక్క ధర్మములుగలవానికి, లేక మను=మంత్రముల, భావునకున్=ధర్మముగలవానికి, మంత్రార్థముల నెఱింగినవాఁడని భావము.

భా. కృష్ణరాయలయింట వింధ్యోద్భవములగు మంచియేనుఁగులు కలవనియు, వానిమదముంగ్రోలి తుమ్మెదలనుక్షణము మత్తిలి ఝాంకృతినొనర్చుచుండుననియు,దాన నాతనిగృహవైభవము సర్వాతిశాయియై మించుచుండుననియు, నాతఁడు సరసములగు

కృతులఁ బొగడ్తనుగాంచినవాఁడనియు, మనువు పాలించుపద్ధతిని ప్రజాపరిపాలనాపద్ధతిని నడపువాఁడనియు లేక మంత్రార్థవేదియనియు భావము.

క. వనితాజనతాస్మరునకు, ఘనతాపనితారకాభికద్యుచరగవీ
ఘనతాయనకారకసత్పనితాత్మనితాంతదానపరతంత్రునకున్. 32

టీ. వనితాజనతాస్మరునకు = స్త్రీసమూహమునకు మన్మథుఁడైనవానికి, ఘనతాప...తంత్రునకున్-ఘన=గొప్పదగు, తాప=సంకటములను, నితారక=నిశ్శేషముగఁ బోగొట్టుటయందు, అభిక=ఆదరముగల, ద్యుచర = సురలయొక్క, గవీ = ఆవుయొక్క (కామధేనువు), ఘన=గొప్పదైన, తాయన=వృద్ధికి, కారక=హేతువైన, 'తారక' అని పాఠాంతరము. సత్=సజ్జనులచే, పనిత = స్తోత్రము చేయఁబడిన, ఆత్మ = తనయొక్క, నితాంత=అత్యంతమైన, దాన=ఈవికి, పరతంత్రునకున్ = స్వాధీనుఁడైనవానికి, ఘన= మేఘునియొక్కయు, తాపని=కర్ణునియొక్కయు, తారకాభిక=చంద్రునియొక్కయు, ద్యుచరగవీ = కామధేనువుయొక్కయు అని చెప్పనగు. దేవతలకుఁ గళల నొసుదిన మిచ్చుటకు జంద్రుఁడును దాతయగుచున్నాఁడు.

భా. కృష్ణరాయలయీవి కామధేనువునీవిని గూడ మించినదని భావము. 'తారక' అనుపాఠమున వానియొక్క, ఘనతా=పెద్దతనమునకు, అయన=త్రోవను, తారక=చూపునది, అని యర్థము చెప్పవలెను.

క. పరిపంథిదోర్బలసమిత్పరివర్ధిష్ణుప్రతాపదహనారణికిన్
సరసకళాధోరణికిన్, నరసాధిపకృష్ణరాయనాయకమణికిన్. 33

టీ. పరిపంథి...రణికిన్ - పరిపంథి = శత్రువులయొక్క, దోర్బల=బాహుబలమనే, సమిత్=సమిధలచే, పరివర్ధిష్ణు=అభివృద్ధిఁ జెందుస్వభావముగల, ప్రతాప = శౌర్యమను, దహన=అగ్నికి, అరణికిన్=మంథనదారువైనవానికి, సరసకళాధోరణికిన్-సరస= రసయుక్తములైన, కళా=విద్యలయొక్క, ధోరణికిన్=పద్ధతిగలవానికి. అలం. రూపకము.



# ప్రథమాశ్వాసము.

## కథాప్రారంభము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన పారిజాతాప హారణం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 34

టీ. అభ్యుదయపరంపరాభివృద్ధిగాన్ -అభ్యుదయపరంపర = శ్రేయస్సులసమూహము, అభివృద్ధిగాన్ =అభివృద్ధియగునట్లుగా, నాయొనర్పన్ = నేను జేయుటకు, పూనిన= వహించిన, పారిజాతాపహారణంబను = పారిజాతాపహారణమనునట్టి, మహాప్రబంధంబునకున్ =మహాకావ్యమునకు, కథాక్రమంబు=కథయొక్క సొరిది.

వ్యా-విశే. నాయొనర్పంబూనిన:—ధాతుజవిశేషణభావార్థకపూర్వవ్యవహితావ్యవహితకర్తృపదప్రథమకుఁ దఱుచుగ యొక్క-షష్ఠియగు ననుపద్ధతిని 'నేనొనర్పంబూనిన' అనుచో నేననునది ధాతుజవిశేషణపూర్వవ్యవహితకర్తృపదప్రథమ యగుటం జేసి యొక్క షష్ఠిరాఁగా నద్దానికి యొక్కకులోపంబు బహుళంబనుదానిచే లోపముకల్గి 'నాయొనర్పంబూనిన' అని యయ్యెను.

పారిజాతాపహారణమునుగూర్చి యైనప్రబంధమగుట దీనికీపేరుకల్గెను. కావ్యకథను సమగ్రముగఁ జెల్పుపేరగుట నిది దీని కెంతయుం నొప్పియున్నది. పురాణప్రసిద్ధమగుకథనుగాని లేక స్వకపోలకల్పితకథనుగాని యాధారముగఁ గొని పురశైలాద్యష్టాదశవర్ణనములలోఁ గథకు సంబంధించినవానిం గొన్నివర్ణనలఁగూర్చి రచించిన గ్రంథము ప్రబంధము నాఁబడు. కావ్యమనియుఁ జెప్పనొప్పును.

క. జనమేజయనృపవల్లభుఁ,డనుదినమును హరికథాసుధాస్వాదమునం
దనివి సనక వైశంపా,యనముని కిట్లనియెఁ గౌతుకాయత్తమతిన్.

టీ. జనమేజయనృపవల్లభుఁడు=జనమేజయుఁ డనుమను జేశుఁడు, అనుదినమును= ప్రతిదినము, హరికథాసుధాస్వాదమునన్ -హరి=విష్ణునియొక్క, కథా = కథయును, సుధా=అమృతముయొక్క, ఆస్వాదమునన్ =పానముచేతను, తనివి=తృప్తి, చనక = పొందక, కౌతుకాయత్తమతిన్ -కౌతుక=పైపైహెచ్చినవలె ననుసంతసమునకు, ఆయత్త = అధీనమైన, మతిన్ =బుద్ధిలో.

భా. హరికథల సతతము వైశంపాయనుండు విన్పింప జనమేజయుం డత్యాదరమున వానిని వినుననియు, నింకను వినవలె ననునాసమిాఱ నొప్పుననియు భావము.

వ్యా-విశే. అనుదినము. వీప్సార్థకావ్యయీభావము. అలం. రూపకము.

సీ. హరివంశకథ లెల్ల నానుపూర్విగ నిట్టు
వినికృతార్థుఁడ నైతి మునివరేణ్య
యాదానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యాయదువంశమున జనించి
యతఁడు గ్రమ్మఱ వారి కాధార మగుపారి
జాతంబు పుడమి కేరీతిఁ దెచ్చె
ననుమతి నిచ్చిరో యావేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి
తే. తెలియ నానతి యిమ్ము సందియము దీఱ
వినఁగ వేడుక య య్యె సవిస్తరముగ
ననిన నావ్యాసమునిశిష్యుఁ డతనితోడ
నధిప వినుమని పలికె నత్యాదరమున. 36

టీ. మునివరేణ్య=మునిశ్రేష్ఠ, హరివంశకథలెల్లన్=హరివంశమునకు సంబంధించిన కథలనెల్లను, ఆనుపూర్విగన్=ఒకటితరువాతనొకటి, కృతార్థుఁడను = చేయఁబడిన కార్యములుగలవాఁడను (ధన్యుఁడను) ఆదానవారాతి=ఆరాక్షసశత్రువగువిష్ణువు, అమరులన్=దేవతలను, ప్రోవంగన్=రక్షించుటకై, పూని=యత్నించి, ఆయదువంశమున = అయ్యాదవకులమున, జనించి=పుట్టి, క్రమ్మఱన్=మఱల, వారికి=ఆసురలకు, పారిజాతమును=కల్పవృక్షమును, పుడమికి=భువికి, ఏరీతిన్=ఏతీరుగ, అనుమతిన్ = సమ్మతితో, ఆవేల్పులు=ఆసురలు, ఒండేని=కాదేని, బలిమిన్=బలాత్కారముగ, చేకొనియెనో = స్వాధీనముచేసికొనెనో, పాడి=న్యాయము, తొఱఁగి=విడిచి, ఆనతి=ఆజ్ఞ, సందియము=సందేహము, వేడుక=సంతసము, సవిస్తరముగన్=విస్తృతితోఁగూడునట్లు, వ్యాసముని శిష్యుఁడు=వైశంపాయనుఁడు, అత్యాదరమునన్=మిగులుమన్ననతో.

వ్యా-విశే. ఆజ్ఞప్తి. ప్ర వి. ఆనతి. సందేహము. ప్ర వి. సందియము. పృథివి. ప్ర. వి. పుడమి. హరివంశము. హరివంశచరిత్రాదులను జెప్పునది. దీనిని సంస్కృతమున వ్యాసుఁడు రచించెను. కవిత్రయములోనివాఁడైన యెఱ్ఱన పురాణమార్గమున దీని నాంధ్రీకరించెను. పారిజాతము:-''మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము'' అని వేల్పులమ్రాను లైదు.

చ. హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రునియింట నున్నయ
చ్చరలకొలంబువారి నెలజవ్వనముం బొలివోనివారిఁ ద
న్వరునిఁగఁ గోరువారి లలనామణులం బదియాఱువేవురం
బరిణయమయ్యె నారదునిపంపున సౌఖ్యరసైకలోలుఁడై. 37

టీ. హరి=శ్రీకృష్ణుఁడు, అద్దనుజేంద్రునియింటన్ = ఆరాక్షసరాజగృహమున, అచ్చరలకొలంబువారిన్=దేవవేశ్యలవంశమునఁ బుట్టినవారిని, ఎలజవ్వనమున్ =లేఁత యౌవనమును. (ఇచ్చో 'నెఱలేక నెలి' అనుపాఠములు కానంబడును. 'నెఱ=పూర్ణము. నెలి-రమ్యము' అని వానికర్థములు. ఈపాఠములే సరసములని తోఁచెడిని. 'ఎల=స్వల్పము' అనియె యర్థ మగపడును. లేక నెల=చంద్రుఁడు. అనఁగా నిండుచందురుఁడనియు వానింబోలుయౌవనమనియు నర్థమును గ్రహించి యెట్లో 'నిండు'అనునర్థము నుద్ధరింపవలయును.) పొలివోనివారిన్=చెడనివారిని, వరునిగన్=భర్తగా, లలనామణులన్=స్త్రీరత్నములను, నారదునిపంపునన్=నారదునియాజ్ఞచే, సౌఖ్యరసైకలోలుఁడై-సౌఖ్య=సుఖమను, రస=రసమునందే, ఏక=ముఖ్యముగా, లోలుఁడై = ఆసక్తికలవాఁడై, పరిణయమయ్యెన్=వివాహమయ్యెను.

భా. శ్రీకృష్ణుఁడు నరకాసురుని జయించి యాతఁడు తనయింట సంగ్రహించి యుంచికొనిన పదియాఱువేల స్త్రీరత్నములను నారదునియాజ్ఞ ననుసరించి పెండ్లిచేసికొనెను.

వ్యా-విశే. అప్సరాః-ప్ర. వి. అచ్చర. ఆ+దనుజేంద్రుఁడు=అద్దనుజేంద్రుఁడు. ఇల్లు. ఔపవిభక్తికము. దీని సప్తమ్యేకవచనరూపము ఇంటన్. వేగురు:—వేయిశబ్దముయొక్క మహన్మహత్యర్థకబహువచనరూపము. వేయి+రు. "సంఖ్యావాచకములకు రురవర్ణకములు పరమగునపుడు సాధారణముగ గువర్ణంబు పూర్వాగమంబగును.సంఖ్యావాచకములకు విభక్తి పరమగునపుడు కొన్నింటియంత్యాక్షరమునకు లోపంబగు" అను పద్ధతుల ననుసరించి వేయిలోని తుది యికారమునకు లోపమును గువర్ణాగమంబునుగలిగిన 'వేగురు' అని యగును. పిదప 'గ'కారమున కపదాద్యమునకు వకారము. వేవురు. ఇందు శ్రీకృష్ణుఁడు స్త్రీరత్నములు తన్ను వరునిగఁ గోరుటచేతనే వరించెనుగాని వారియౌవనాదులం గాంచి కామించి బలాత్కారముగఁ బరిగ్రహింపలేదనువిషయము ప్రస్ఫుటమగుచుండుటంబట్టి యుత్తమనాయకత్వము సూచితము. అదియు మహాముని నారదుని యాజ్ఞ ననుసరించియేకాని యొండుగాదని దానికిం గవి మెఱుఁగువెట్టెను.

విశే. నరకాసురుఁడు. "వరాహరూపముననున్న విష్ణువువలన భూదేవియందుఁ బుట్టినవాఁడు. ఈతనిరాజధాని ప్రాగ్జ్యోతిషము. ఈతఁడు తల్లియైన భూదేవియొక్క

దయచే శ్రీవిష్ణునివలన వైష్ణవాస్త్రము నందఁగల్గెను. ఈతఁడు పదియాఱువేవురను స్త్రీలను జెఱపెట్టెను. అదితికర్ణకుండలములను వరుణునిఛత్త్రమును నపహరించెను. శ్రీకృష్ణుఁడు సత్యభామంగూడి కదలి యుద్ధమున నరకుని జయించి స్త్రీలను జెఱవిడిపించి స్వర్గమున కేగి యదితి కుండలములను సమర్పించెను." అనుభారతభాగవతగాథల నిచట ననుసంధింపవలెను.

తే. మఱియు రుక్మిణి, సత్య, జాంబవతి, మిత్ర
వింద, భద్ర, సుదంత, కాళింది, లక్ష్
ణ, యనఁగా మున్న కల రబ్జనాభునకును
మహిషు లెనమండ్రు సమతాభిమానవతులు. 38

టీ. మున్న=మొదటనే (అనఁగాఁ బదియాఱువేవురను బరిగ్రహింపకముందే) సమతాభిమానవతులు = సమత్వముతోఁగూడిన యభిమానముగలవారు అనఁగా 'నేనె తగినదానను, నేనె తగినదానను' అను నభిమానముగలవారనుట. మహిషులు=దేవేరులు.

వ్యా-విశే. ఎనమండ్రు-ఎనిమిదియొక్క మహన్మహత్త్వార్థకబహువచనరూపము. రుక్మిణి.—ఈమె విదర్భదేశపురాజగు భీష్మకన్యపాలునికూఁతురు. ఈమెయన్న రుక్మి యీమెను శిశుపాలునకిచ్చి కల్యాణముగావింపఁ దలంప, నీమె యొకబ్రాహ్మణునిచేఁ దన యనురాగమును గృష్ణునకుఁ దెలిపె. అంతఁ గృష్ణుఁడు రుక్మిణీసందేశమును విని వెడలి వచ్చి శిశుపాలాదుల జయించి రుక్మికి గర్వభంగముగావించి రుక్మిణిని రాక్షసోద్వాహ విధిని బరిగ్రహించి పురంబునకుఁ దోడ్కొని జనియెను.

విశే. సత్య,జాంబవతి—ఈమెకు సత్యభామ యని నామాంతరము గలదు. ఈమె సత్రాజిత్పుత్త్రిక. సత్రాజిత్తుతమ్ముఁడు ప్రసేనుఁ డొకనాఁడు తనయన్నకు సూర్యానుగ్రహమున లబ్ధమైన స్యమంతక మనురత్నరాజమును దాను మెడందాల్చి యాఖేటోత్సాహమున నటవిం జేరె. అట నొక సింహ మాతనిం జంపి యారత్నమును గొనెను. దాని నొక ఋక్షరాజము పొలియించి యారత్నమును గొని తనగుహం జేరెను. పూర్వమొకానొకపుడు శ్రీకృష్ణుఁ డమ్మహారత్నమును దనకొసంగుమని సత్రాజిత్తును గోరెనుగాని యర్థలోభమున నాతఁ డద్దానిం గృష్ణునకు నొసంగలేదు. ఇక్కారణమున నాప్రసేనుఁ డట్టరణ్యమున రత్నసహితముగ మాయముగా శ్రీకృష్ణుఁడే వానిం జంపి యమ్మహామణిని బరిగ్రహించియుండు ననుదూఱు నగరమునం దంతటను, సత్రాజిత్తు నిట్లు వ్యాపించి, కృష్ణుని చెవిం బడెను. అంతఁ దదపనోదార్థము కృష్ణుఁడు పయనమై యటవిం జేరి గుఱ్ఱపుటడుగులజాడంబట్టి పోయిపోయి క్రమముగ జాంబవంతునిగుహం జేరి పదునెనిమిది

వాసరములు జాంబవంతునితోఁ గయ్యమొనర్చెను. జాంబవంతుఁడు కడ కాతని భగవంతునిగా నెఱింగి నుతియొనర్చి రత్నమును, జాంబవతీ కన్యారత్నమును గృష్ణున కర్పించి, వేఁడుకొని వరములంబడసెను. శ్రీకృష్ణుఁడంత మఱలి పురిం జేరి యాస్యమంతకమును బేరోలగమున సత్రాజిత్తున కొసంగి జనాపవాదమును బాపికొనెను. సత్రాజిత్తంత నూరకే జనులట్లు దూఱుటకును, దానట్టినింద నాతనిపై నారోపించుటకును మిగుల వగచి, యమ్మహారత్నములోఁగూడ దనపుత్రికను సత్య నాతనికి ధర్మపత్నిగా నొసంగి, తాఁగావించిన మహాపరాధమును క్షమింప వేఁడుకొనెను.

శ్రీకృష్ణుఁడమ్మణిని దాఁ గ్రహింపక మఱల దాని సత్రాజిత్తునకే యొసంగి సత్యను మాత్రమే పరిగ్రహించి పరిణయమయ్యెను.

మిత్రవింద.—అవంతిదేశాధీశులైన విందానువిందులచెలియలు. ఈమె రాజాధిదేవియను కృష్ణునిమేనత్తకూఁతురు. ఈమె కృష్ణుని వరింపఁగోర నీమెయన్న లామెను వారించి స్వయంవరముచాటించి దుర్యోధనునివరింప నుద్బోధించిరి. శ్రీకృష్ణుఁడు స్వయంవరమున రాజలోకమును సరకుసేయక యీమెను గొని రథముపైనిడికొని మఱలి పురముం జేరి పరిణయమయ్యెను.

భద్ర.—శ్రుతకీర్తికూఁతురు. కృష్ణునకు మేనమామకూఁతురు.

సుదంత.—ఈమెకు నాగ్నజితియని నామాంతరము. ఈమెతండ్రి నగ్నజిత్తు. నగ్నజిత్తు కోసలదేశాధీశుఁడు. ఈతఁడు తనయూరఁ బ్రజలకపాయము సేయుచు దుర్దాంతములై నేరికిని బట్టువడక చెలరేఁగువృషభములఁ బట్టినవారికిఁ దనకూఁతు నిత్తునని ప్రతినచేసెను. శ్రీకృష్ణుఁ డవ్వానింబట్టి పొలియించి నాగ్నజితిని బరిణయమయ్యెను. సత్యయనియు నీమెకు నామాంతరము కలదండ్రు.

కాళింది.—సూర్యునికొమరిత. ఈమె విష్ణుని వరునిగాఁ గోరి తపస్సుచేసెను. పిదప నొకప్పుడు సముద్రతీరమునఁ గృష్ణార్జునులు విహరించుచుండ మనోహరాకృతి నీమెవచ్చి తనకోర్కెని శ్రీకృష్ణునకు నివేదించుకొనియెను. శ్రీకృష్ణుఁడీమెను బురికిఁ గొనిపోయి పరిణయంబయ్యె.

లక్షణ.—ఈమె మద్రరాజుకూఁతురు. సర్వలక్షణసంపన్నయై యన్వర్థసంజ్ఞను మించు నీమెను స్వయంవరమున శ్రీకృష్ణుఁ డపహరించి వివాహమయ్యెను.

ఉ. ఆరమణీలలామముల నందఱఁ గూడి యదూద్వహుండు త
ద్ద్వారవతీపురోపవనవాటికలం గృతకాద్రిసీమల

న్వారిధితీరకుంజసదనంబులఁ గేళితరంగిణీతటీ
కై రవిణీసహాయమణికల్పితసౌధముల న్వసించుచున్. 39

టీ. యదూద్వహుండు = యదువంశోద్ధారకుఁడగు శ్రీకృష్ణుఁడు, ఆరమణీలలామములన్ = ఆయుత్తమస్త్రీలను, తద్ద్వార...వాటికలన్-తత్=ఆ, ద్వారవతీపుర=ద్వారకాపట్టణసంబంధమైన, ఉపవన=ఉద్యానవనములయొక్క, వాటికలన్=ప్రదేశములందు, కృత...సీమలన్-కృతక=కల్పితములైన, అద్రి = కొండలయొక్క, సీమలన్=ప్రదేశములందు,వారిధి...సదనంబులన్-వారిధి=సముద్రముయొక్క, తీర=ఒడ్డునందైన, కుంజసదనంబులన్=పొదరిండ్లయందును, కేళి...సౌధములన్-కేళి = విలాసార్థమైన, తరంగిణీ=నదులయొక్క, తటీ=ఒడ్లయందైన, కైరవిణీసహాయమణి=చంద్రకాంతమాణిక్యములచే (కలువలకు సహాయమైనవాఁడు చంద్రుఁడు) కల్పిత=నిర్మింపఁబడిన, సౌధములన్=మేడలందును, వసించుచున్=నివసించుచు.

భా. శ్రీకృష్ణుఁడు పదియాఱువేలస్త్రీరత్నములను, ఎనమండ్రుమహిషులను, గూడి ద్వారకాపట్టణోద్యానవనములందును, కేళిశైలములందును, సముద్రతీరమందలి పొదరిండ్లయందును, గేళితరంగిణులతీరములందైన చంద్రకాంతమణి నిర్మితసౌధములందును వసించునని భావము.

విశే. ఉద్యానములు, కేళిశైలములు, సముద్రతీర కుంజసదనములు, విహారనదీ తీరస్థ చంద్రకాంతసౌధములును జలువ కాకరములై మనోహరములై శృంగారోద్దీపకములై కాముకునకుఁ గడుంగడు కామాసక్తిని గల్గించును. కానఁ గవి పదియాఱువేలయెనమండ్రనుగూడిన శ్రీకృష్ణునకు వీనిని విహారప్రదేశములుగ వర్ణించుట యెంతయుఁ దగియున్నది.

శా. ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయంజూచినఁ దానయై మెలఁగుచున్సౌఖ్యాబ్ధినోలాడుభో
గాయత్తుండయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్. 40

టీ. ఏయేవేళలన్ = ఏయేసమయముల, ఏసరోజముఖి=ఏవనిత, ఏయేలీలలన్=ఏయేవిలాసములను, తాను=శ్రీకృష్ణుఁడు, ఆయాలీలలన్=ఆయా విలాసములచే, తేల్చి=సంతోషపెట్టి, ఏచాయన్=ఏవైపును, తాన ఐ=తానే యగపడువాఁడై (తాను+అ), మెలఁగుచున్=సంచరించుచు, సౌఖ్యాబ్ధి=సుఖమనుసముద్రమున, భోగాయత్తుండు=భోగములకధీనుఁడు, పెక్కురూపములన్ = పలువిధములగు నాకృతులతో, మాయా...,

చాతురిఁ=మాయాకల్పనమునందైన నైపుణ్యముచే, ఓలలాడుఁ=తేలియాడును. 'ఓల' ఇది నీట నీదులాడునపు డగుధ్వన్యనుకరణము.

భా. శ్రీకృష్ణుఁడు పదియాఱువేల యెనమండ్రను వారువారు కోరినరీతిని దన్పుచు, మాయాకల్పనాచాతుర్యమునఁ బలురూపములందాల్చి యందఱకు నన్నిరూపముల మెలంగుచు భోగాసక్తుండై వారింగూడి మెలంగునని భావము. ఇందు నెల్లరకనుకూలుఁడై చాతుర్యమిమీఱ మెలంగుననుటచే శ్రీకృష్ణునకు దక్షిణనాయకత సూచితమైనది.

క. హరి యిట్లు సతుల నందఱ
సరిగాఁ జూచియును భోజజనపాలసుతం
దరుణీమణి సాత్రాజితి
నిరువుర మన్నించి మిగుల నిచ్చుం జనవుల్. 41

టీ. సతులఁ=భార్యలను, సరిగాఁ=సమానముగా, భోజజనపాలసుతఁ=రుక్మిణిని, తరుణీమణిఁ=స్త్రీరత్నమగు, సాత్రాజితిఁ = సత్రాజిత్పుత్రికయగు సత్యభామను, మన్నించి=గౌరవించి, మిగులఁ=మిక్కిలియును, చనవుల్=ప్రేమయుక్తమగు స్వాతంత్ర్యములను.

భా. శ్రీకృష్ణుఁడు భార్యలెల్లరియెడలను సముఁడెకాని యందు రుక్మిణీ సత్యభామల నందఱిలోఁ బెద్దదగుప్రేమమీఱఁ జనవిచ్చి మన్నించునని భావము.

విశే. రుక్మిణి లక్ష్మ్యంశసంభూతురాలుగాన వాసనావశమున నామెను బెద్దగ సమ్మానించును. తరుణు లెల్లవారిలో నీమె యన్నిటను మణివంటిదగుట నీమెనుగూడ రుక్మిణితో సరిగ సమ్మానించునని సారస్యము తేలుచున్నది. సాత్రాజితి: సత్రాజిత్తుయొక్క సంతానమైన స్త్రీ. తద్ధిత. అణ్.

చ. కులమును రూపము న్మగనికూరిమియుం గలదాననంచు నీ
వల నలరుక్మిణీరమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగనికూరిమియుం గలదాననంచు నా
వలఁ బచరింపఁగా రవరవ ల్వొడమె న్మది వారికెంతయున్. 42

టీ. కులమును = అభిజాత్యమును, రూపమును=చక్కందనమును, మగనికూరిమియున్=పతియొక్క చెలిమియును, ఈవలన్=ఈవైపు, వాసిన్=ఆధిక్యముతో, చెలంగఁగన్=ఒప్పుచుండ, ఆవలన్=ఆవైపు,పచరింపఁగాన్=ప్రవర్తింపఁగా, రవరవలు=స్పర్ధలు, మదిన్=చిత్తమున, ఎంతయున్=మిక్కిలి, పొడమెన్=పుట్టెను.

భా. 'నేనె సద్వంశసంజాతను, నేనె చక్కనిదానను, నేనె మగనిచెలిమిగల దానను' అని రుక్మిణి యొక్కప్రక్కను సత్యభామ యొక్కప్రక్కను బ్రవర్తించుటంజేసి, యియ్యిరువురకును మనస్సులలో స్పర్ధలు పుట్టెనని భావము. శ్రీకృష్ణుఁడీయిరువురనే కడుం గడు సమ్మానించుటంజేసి వీరికే రవరవలు కల్గెననియుఁ, దక్కంగలవారలకుఁ గలుగఁ బ్రసక్తి లేకపోయెననియు గ్రహింపవలయు.

వ్యా-విశే. ఈవలన్, ఆవలన్.—వృత్తియందు వలనుశబ్దముతుదినుండు 'ను' అనునది లోపించె. మంచికులమునఁబుట్టుట, మంచిరూపమునుగల్గియుండుట, నాపై మగనికూరిమి గనుట యనునివి యొకటొకటే స్త్రీకి గర్వజనకముగా, నన్నియు నొక్కట నమరియున్న జెప్పెడిదేమి! మగువలకు ముఖ్యముగ మగనికూరిమియె వాంఛనీయము. సౌందర్యముతోఁబాటుగ మగనికూరిమి యొప్పినమగువ గర్వింపకుండునా? అదియుంగాక వనితలు సామాన్యముగఁ బతి మఱియొకతెను సమ్మానింపఁ జూడఁజాలరు. కాన, స్త్రీజనసహజమగు నట్టియీర్ష్యనే బూని లోకము పాడి రుక్మిణీసత్యభామలు పరస్పరము స్పర్ధనూనిరని గ్రహింపవలయును.

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోదకేలిమెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగన్. 43

టీ. అంతటన్=(ఇట్లు రవరవలు పొడముసమయమున) ధవళాంబుజనేత్రుఁడు-ధవళ=తెల్లనైన, అంబుజ=పద్మములవంటి, నేత్రుఁడు=కన్నులుగలవాఁడు, శశికాంత... వేదిమీఁదన్-శశికాంతశిలామయ = చంద్రకాంతశిలాప్రచురమైన, వేదిమీఁదన్ = తిన్నెపై, ఏకాంతమునందున్=రహస్యమున, మృగాయతనేత్రలు-మృగ=లేడియొక్క, ఆయత=దీర్ఘములైన, నేత్రలు=కన్నులవంటి కన్నులుగలవారు, జూదము=ద్యూతము, అత్యంతవినోదకేలిమెయిన్ = మిక్కిలి ప్రొద్దుపుచ్చుటకొఱకైన యాటయొక్కవిధములో, అద్భుతంబుగన్=ఆశ్చర్యముగా.

భా. రుక్మిణీసత్యలకు రవరవలు పొడముకాలమున నొక్కనాఁడు శ్రీకృష్ణుఁడు రుక్మిణీగృహమున కేతెంచి చంద్రకాంతరత్ననిర్మితమగు తిన్నెపై నొకరహస్యప్రదేశమునఁ దన్ను గొందఱు వనితలు గొల్చుచుండ సుఖసుఖోక్తికై జూదమాడుచుండెనని భావము.

వ్యా-విశే. ధవళాంబుజనేత్రుఁడు.—తెల్లందన మంబుజములకు వికసించినఁగాని కలుగఁబోదు. కావున నీవిశేషణమహిమవలన శ్రీకృష్ణుఁడు వికసితనేత్రుఁడనియు, తెలిమిమీఱనియ్యదనున రుక్మిణీగృహమున కేతెంచినవాఁడనియుఁ దెలియవచ్చును. ఇట్లే 'మృగాయతనేత్రలు' అనుపదముగూడ స్త్రీలసంతోషాతిశయమును సూచించును. మఱియు, శ్రీకృష్ణుఁ డేకాంతముననే జూదమును సాగించుచుండెననుటచే, ముందు సంభవించు నారదాగమనాదుల గుర్తెఱింగియే రహస్యప్రదేశమున శ్రీకృష్ణుఁ డుండెనని తేలుచున్నది. దీన శ్రీకృష్ణుని త్రికాలవేదిత్వము పరిస్ఫుటమగుచున్నది. నారదాగమనాదివృత్తాంతము సత్యకుఁ దెలియుఁ నవకాశము సంఘటించుటకును, శ్రీకృష్ణుని భోగాతిశయము సూచించుటకును, రహస్యరక్షణమున నసమర్థలగు మృగాయతనేత్రల నట్టి రహస్యప్రదేశమున శ్రీకృష్ణునకు సేవఁజేయువారినిగాఁ గూర్చినాఁడని యెన్నవలయును. జూద. వి. ద్యూతము. ప్ర.

## శ్రీకృష్ణునియొద్దకు నారదుఁడు వచ్చుట.

సీ. సరిగమపధనిస సంజ్ఞస్వరంబుల
  మహతి నభోవాయునిహతిఁ మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణమణికమం
  డలువు హస్తంబునఁ జెలువుమిగులఁ
బ్రణవమంత్రావృత్తిపావనస్ఫటికాక్ష
  వలయంబు కర్ణశష్కులిక వ్రేల
సమరనృత్యోచితచమరవాలంబును
  గక్షపాలయు భుజాగ్రమున మెఱయ
తే. దేహకాంతు లకాలచంద్రికల నీన
జడలు మోక్షద్రుపల్లవశంక సేయ
గగనమునుండి వచ్చె నాకస్మికముగ
నారివేరంపుఁదపసి ద్వైత్యారికడకు. 44

టీ. సరి...స్వరంబులన్='స, రి, గ, మ, ప, ధ, ని, స,' అనుసంజ్ఞలుగల స్వరములచేత, మహతి=మహతియను నారదునివీణె, నభోవాయునిహతిన్-నభః=ఆకాశమందైన, వాయు=గాలియొక్క, నిహతిన్=అత్యంతమగుదెబ్బచే, మొరయన్=శబ్దింపఁగా, భాగీరథీ...కమండలువు-భాగీరథీ=మిన్నేటిసంబంధమైన, పయః=నీటిచే, పరిపూర్ణ=నిండిన, మణికమండలువు=మణినిర్మితమగుగిండివంటిపాత్రము, హస్తంబునన్=చేతి

యందు, చెలువు=అందము, మిగులన్=అతిశయింపఁగను, ప్రణవ...వలయంబు-ప్రణవమంత్ర=ఓంకారరూపమంత్రముయొక్క, ఆవృత్తి=వల్లెవేయుటచే, పావన=పవిత్రమైన, స్ఫటికాక్షవలయంబు=స్ఫటికమణులచే నిర్మితమైనజపమాల, కర్ణశష్కులికన్=చక్కిలమువంటిచెవిని, వ్రేలన్=వేలాడియుండఁగా, సమర...వాలంబు-సమర=యుద్ధమునందలి, నృత్య=నాట్యమునకు, ఉచిత=తగిన, చమరవాలంబును = చామరమును, కక్షపాలయుం=బుజమున బద్ధమై వ్రేలాడుసంచియు, మెఱయన్=ప్రకాశింపఁగా, దేహకాంతులు=శరీరసంబంధమైనతేజస్సులు, అకాలచంద్రికలన్ = వేళకానివేళయందైన వెన్నెలలను, ఈనన్=కనుచుండఁగా, జడలు=జటలు, మోక్షద్రుపల్లవశంకన్-మోక్షద్రు=అపవర్గమనువృక్షముయొక్క, పల్లవ=చిగురులయొక్క, శంకన్=సందేహమును, చేయన్=ఒనర్పఁగా, గగనముననుండి=ఆకాశమునుండి, ఆకస్మికముగన్=తటాలున, అరివేరంపుఁదపసి-అరివేరము+తపసి=కలహప్రియుండగుముని-నారదుఁడు, దైత్యారికడకు=రాక్షసశత్రువగు శ్రీకృష్ణునికడకు.

భా. మింటిగాలితాఁకున మహతియను తనవీణె సప్తస్వరముల శబ్దించుచుండ, మిన్నేటినీట నాపూర్ణమైన మణికమండలువు తనహస్తమున చెలువుమీఱ నుండ, నోంకారావృత్తిచే నత్యంతపూతమైన స్ఫటికజపమాల దక్షిణకర్ణమునంటి వ్రేలాడుచుండ, యుద్ధసమయనృత్యమున కర్హమగుచామరమును సంచియు భుజమునగ్రమ నంటి వ్రేలుచుండ, శరీరధవళకాంతులు కాలముకానికాలమునందైన చంద్రికలంబోలి వర్తిలుచుండ, నెఱ్ఱనిజడలు మోక్షవృక్షసంబంధమగు చిగురులను సందియము నొందించుచుండఁ, గలహప్రియుండగు నారదుండు మింటినుండి శ్రీకృష్ణునికడ కాకస్మికముగ నేతెంచెనని భావము.

వ్యా-విశే. స్వరములు.—షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము. మహతి నారదునివీణెకుఁ బేరు. శష్కులిక. వి. చక్కిలము. ఆకృతివిషయమునఁ జెవులను జక్కిలములతోడను, శ్రీకారములతోడను, గవులంబోల్తురు. విప్రునిదక్షిణకర్ణము మిగులఁ బూతమైనదిగా స్మృతులు పలుకునుగాన, నందే జపమాల యమర్పఁబడినదని గ్రహింపవలయును. స్ఫటికము మోక్షాద్యుత్కృష్టఫలముల నొసంగ సమర్థము గాన, మోక్షార్థియగుమౌని తన్నిర్మితాక్షవలయమును ధరించెనని యూహించునది. నారదుఁడు కలహప్రియుండుగాన, యుద్ధము జరుగుసమయముల సంతోషముమీఱ నాట్యము సల్పుననియు, నపుడు కల్గుశ్రమము నపనయింపఁ జామరము సముచితమగుననియుం గ్రహింపవలసియుండును. నారదుఁడు తెల్లనివాఁడౌటంజేసి యాతని శరీరసంబంధమగు ధవళకాంతులు వెన్నెలలంబోలి యొప్పెననియు, నుత్కృష్టవస్తువులఁ

గవులు తెల్లనివానిఁగా నిరూపించుట యాచారముగానఁ దెల్లనినారదుని హంసవృత్తముగను, నాతని యెఱ్ఱనిజడలను బల్లవములుగను గవి నిరూపించెననియుం గ్రహింపవలయును. అరివేరము+తపసి.—కర్మధారయమున ముపర్ణకమునకుఁ బుంపులును నుగాగమమును ద్రుతకార్యములును గల్గి 'అరివేరంపుఁదపసి' అయ్యెను. నారదుఁడు కలహప్రియుండను నన్వర్థనాముండు. నిక్కముగ మానవుల ప్రాకృతమును బట్టియే యాతనికి వారిపక్షమునఁ గలహముంగూర్ప బుద్ధిపొడమును. కాని, యిందు మున్ముందుఁ బారిజాతకుసుమదానమునఁ గూర్పఁబోవు కలహపువిషయమును సూచించుటకై, యాతని యన్వర్థనామమునే కవి యిందుఁ బేర్కొనెనని గ్రహింపవలయును. 'గగనముననుండి.' గగనమువలనః—ఉండిపదంబు వలనవర్ణకమున కనుప్రయుక్తమగు. అయ్యది పరముగా వలనవర్ణకమునకు ద్వితీయాసప్తములు ప్రాయికముగాఁ గల్గు' అను పద్ధతుల ననుసరించి యీరూపము కల్గెను. 'ఆకస్మికము=అకస్మాద్భవము' అని శబ్దరత్నాకరము. ఆకస్మికముగన్=అకస్మాద్భవమగునట్లుగా, ఇచ్చో 'అకస్మాత్తుగా' అనునర్థమున నిది ప్రయుక్తమయ్యెను. ఇందు జడదారివేసము మనోహరముగ సహజమగుపద్ధతిని వర్ణించెను. అందును నారదునియాకృతిని బురాణప్రసిద్ధమగు నాతనియాకృతిని మది భావించి హృద్యముగఁ జిత్రించెను. మఱియుం నీవర్ణనము మాఘకావ్యప్రథమసర్గమందలి నారదవర్ణనమును జ్ఞప్తికిం దెచ్చుచున్నయది. అలం. అతిశయోక్తి. విభావన. రూపకము. ఉత్ప్రేక్ష.

క. వచ్చినమునిపతి కెదురుగ
వచ్చి నమస్కృతు లొనర్చి వనితయుఁ దానుం
బొచ్చెంబు లేనిభక్తి వి
యచ్చరరిపుభేది సలిపె నాతిథ్యంబున్. 45

టీ. మునిపతికి=మునీశ్వరునకు, నమస్కృతులు=నమస్కారములు, ఒనర్చి=చేసి వనితయు (రుక్మిణియుం) పొచ్చెము=తక్కువ, వియచ్చరరిపుభేది-వియచ్చర=గగనమునఁ దిరుగు దేవతలకు, రిపు=శత్రువైనరాక్షసులకు, భేది = సంహర్త (శ్రీకృష్ణుఁడు) ఆతిథ్యంబున్=అతిథిసత్కారమును, సలిపెన్=చేసెను.

భా. శ్రీకృష్ణుఁ డమ్మహాముని రాఁగ నమస్కారము లాచరించి, రుక్మిణియుం దాను నతిథిసత్కారము నతిభక్తి నొనర్చనని భావము.

వ్యా-వి శే. 'అత్యార్థ మభిహితమగునపుడు తల్లింగసంఖ్యాభిధాయివచనంబు తద్విశేషణక్రియలకగు' అనుపద్ధతిని క్రియ తానుపదమునకు సంబంధించి యేకత్వమును

బొందినది. వృద్ధు గృహమునుగూర్చి వచ్చిన, యువకునిప్రాణము లూర్ధ్వముగఁ బాఱు ననియుం, నావృద్ధు నుచితముగఁ బ్రత్యుత్థానాభివాదనముల గారవించినయనంతర మా యువకునిప్రాణములు మఱల స్వస్థానముం జెందుననియు నార్యవచనము. కావుననే యతి భక్తిని సజానిస్సైె యాతనిం బ్రత్యుత్థానాభివాదనముల నాతిథేయమున సంతుష్టుని శ్రీకృష్ణుఁ డతిభక్తిని గావించెనని తెలుచున్నది. మఱియు శ్రీకృష్ణుఁడు పరమాత్ముఁడును సకలవంద్యుఁడునునైనను, బ్రకృతము మాయామానుషరూపధారియై యువకుఁడై యున్న వాఁడుగాన, లోకంబునపాడి నాతని బ్రత్యుత్థానాదుల గారవించెనని గ్రహింప వలయును.

తే. అపుడు రుక్మిణికనుసన్న నబ్జముఖులు
రత్నసింహాసనంబు నారదున కిడిరి
హరియు నమ్మౌనియనుమతి నర్హపీఠ
మున సుఖాసీనుఁ డయి కరంబులు మొగిడ్చి. 46

టీ. కనుసన్నన్=నేత్రసంజ్ఞచే, అమ్మౌనియనుమతిన్ = ఆమునీశ్వరునియొక్క యంగీకారముచే, సుఖాసీనుఁడు=సుఖముగఁ గూర్చున్నవాఁడు. మొగిడ్చి = ముడిచి, అబ్జముఖులు=పద్మములవంటి మోములుగలవారు.

భా. రుక్మిణి కనుసన్నచే వనితల నాసనము వేయుండని యానతీయ, వారు మణి మయసింహాసనము నిడిరనియుం,నందు నారదుఁడు గూర్చుండ నాతని సెలవంది శ్రీకృష్ణుఁ డును నుచితాసనమున సుఖముగఁ గూర్చుండెననియుం భావము.

వ్యా-విశే. సన్న. ప్ర. సంజ్ఞ. రుక్మిణి రాజ్ఞియొక్కశీవి యిందుఁ జూపినది. తానుస్వయముగ సింహాసనమిడక యితరవనితల కానయిడుటయే యిందులకు నిదర్శనము.

క. సురసంయమివర! మీ రిట
కరుదేరఁగ నిప్డు నేఁ గృతార్థుఁడ నయితిన్
నిరతంబు మీరు నాపయిఁ
గరుణ గలిగి యునికి యిది యకారణము *సుమీ. 47

టీ. సురసంయమివర=దేవర్షిశ్రేష్ఠుఁడా! ఇటకు=ఇచ్చటికి, అరుదేరఁగన్=రాఁగ, ఏను=నేను, కృతార్థుఁడను=చేయఁబడినకార్యములుగలవాఁడను (ధన్యుఁడను), నిరతంబు= మిగుల నాసక్తికొన్నటులుంగా, ఈపదము సాధారణముగ సంతతమనునర్థమునఁ బ్రయు క్తమైన ట్లూహింపనగు. కరుణ=దయ, అకారణముసుమీ = హేతుశూన్యముసుమా!

* సుఁడీ. పాఠాంతరము.

ఇందు 'మీరు' అని బహువచన మగపడుటంజేసి 'చుఁడీ' అని యుండిన లెస్స యని తోఁచెడెని.

భా. మీరాకచే నే ధన్యుఁడనైతిని. సంతతము మీరు నాపై దయకలిగియుండు టకుఁ గారణ మెద్దియులేదు. (నిర్హేతుకజాయమానకరుణకలవాఁడవు)

వ్యా-వి శే. అరుగుదెంచు.—అభ్యాగతి నరుగాద్యుదులకుఁ దెంచుధాతు వనుప్రయుక్తమగు. అగుచో గువర్ణంబు విభాషను లోపించు. అరుదెంచు+నుజె ఆద్దానికి ముజ్జీత్తులు పరమగునపుడు తేతేరులగును. జీత్తు పరమగునపు డుత్వంబున కత్వంబగు. అరుదేరన్.

క. నావుడు శౌరికి నిట్లను, నావేలుపుఁదపసి మర్త్యుఁ డాడెడిరీతిన్
నీవిట్లు పలుక నుచితమె?, యే విశ్వజనీనచరిత! యెఱుఁగనె నిన్నున్?

టీ. నావుడున్=అనినపిదప, ఆవేలుపుఁదపసి = ఆదేవర్షి, మర్త్యుఁడు = మనుష్యుఁడు, ఆడెడురీతిన్=మాటలాడుపద్ధతితో, ఇట్లు=ఈరీతిని, ఉచితమె=తగునె? ఏను=నేను, విశ్వజనీనచరిత=సర్వజనులకు హితమైనచరిత్రముగలవాఁడా!

వ్యా-వి శే. నావుడున్=అనుధాత్వానంతర్యార్థకరూపము. 'అనవుడు, అనుడు' అనునవి దీనిరూపాంతరములు. లాతిచో సహితము కాదేశాదులు గానంబడియెడి. విశ్వజనీనము. విశ్వజనహితమనునర్థమున తద్ధితరూపము.

నారదుఁడు శ్రీకృష్ణుని నుతించుట.

సీ. ప్రామినుకులదొంగఁ బాతాళకుహారంబుఁ
జొరఁబాఱి చీఱినచోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటి
చవిఁ దేల్చినట్టి కచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ము
కొన నుబ్బ నెత్తిన ఘ్రోణి వీవ
మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు న
క్కఱఁ గాచినట్టి సింగంబ వీవ
తే. దితిజుమెట్టిన యాపొట్టిదిట్ట వీవ
పుడమిఱేఁడుల నడఁచిన ప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చిన గబ్బి వీవ
యిపుడు ద్వారక వసియించునీవు నీవ.

టీ. ప్రామినుకులదొంగన్-ప్రామినుకులు = వేదములయొక్క, (ప్రాఁతమాటలు) దొంగన్=చోరుని, పాతాళకుహరంబున్=పాతాళబిలమును, చొఱఁబాఱి=ప్రవేశించి, చీఱిన=బ్రద్దలుచేసిన, చోఅవు=మత్స్యమవు, తరిగొండన్=కవ్వపుఁగొండను (మంథరమును), వెన్నుపైన్=వీపుపై, తాల్చి=ధరించి, వేల్పులన్=దేవతలను, కూటిచవిన్=అన్నపురుచిచే, తేల్చినట్టి=సంతోషపెట్టినట్టి, కచ్ఛపమవు=కూర్మమవు. నేలచేడియన్ = భూదేవిని, కొమ్ముకొనన్=దంష్ట్రాగ్రమున, ఉబ్బన్=పైకిలేచునట్లుగా, ఘోణివి=వరాహమవు. మునిమాపు=సాయంసంధ్యాకాలమున, బలుగంబమునన్=పెద్దస్తంభమున, అక్కఱన్ = కోర్కెతో, బంటున్=భృత్యుఁడైన ప్రహ్లాదుని, కాచినట్టి = రక్షించినట్టి, సింగంబవు= సింహమవు. దితిజున్=దితికొడుకైన బలిచక్రవర్తిని, మెట్టిన=అడఁచిన, పొట్టిదిట్టవు= వామనధీరుఁడవు, పుడమిఱేఁడులన్ = రాజులను, ప్రోడవు=ప్రౌఢుఁడవు, కడలిన్ = సముద్రమును, కోలకున్=బాణమునకు, తెచ్చిన=వచ్చునట్లుచేసిన, గబ్బివి = గర్వివి (శూరుఁడవు), ద్వారకన్ = ద్వారకాపట్టణమున, వసించు = ఉండు, నీవు, నీవ=నీవే. అనఁగాఁ బూర్వోక్తకార్యముల నాచరించిన యాపరమాత్మవే యనుట.

విశే. 1. సోమకుఁడను నసురుఁడు వేదముల దొంగలించి సముద్రముం జొరఁబాఱ, నాతని మత్స్యరూపముం దాల్చి మహావిష్ణు వాతని సంహరించె ననుపురాణగాథను బ్రథమపాదమున ననుసంధింపవలయును. 2. మహావిష్ణువు మంథరమును గవ్వముగాఁ జేసి, వాసుకిని త్రాడుగాఁ జేసి, సముద్రమును సురలంగూడి మథించి, యపుడందు మునింగినమంథరమును గూర్మరూపమునఁ దెచ్చెననియు,నందుఁబుట్టినయమృతమును దేవతలకుఁ బంచి కొన్నియుత్కృష్టవస్తువులఁ దాను గ్రహించి,కొన్నిటిని దేవేంద్రునకు నొసంగె ననుపురాణకథను ద్వితీయపాదమున ననుసంధింపవలెను. దూర్వాసునిశాపవశమునఁ గల్గిన తాపము నాపికొనంజాలక భువి జలధింబడ నద్దాని మహావిష్ణువు కూర్మరూపముందాల్చి తేల్చెనని కొన్నిగాథలు నుడువును. 3. హిరణ్యాక్షుఁడు భువిని జాఁపచుట్టుగఁ జుట్టు నపుడు విష్ణు వాతనివరాహరూపముం దాల్చి సంహరించి భూదేవిని సంరక్షించెనను పౌరాణికకథను తృతీయపాదమున గమనింపవలెను. 4. భక్తుఁడగు ప్రహ్లాదుని రక్షించి యాతనిపలుకును సత్యముగాఁ జేయఁ, గంబమున నుద్భవించి మహావిష్ణువు హిరణ్యకశిపుని సింహరూపమున సాయంసంధ్యాసమయమున సంహరించె ననుకథను జతుర్థపాదమున ననుసంధింపవలయును. దేవతలచేతఁగాని మనుష్యులచేతఁగాని మృగాదులచేతఁగాని యవధ్యత్వమును, బవలుగాని రేయిగాని చావకుండుటను వరములుగా హిరణ్యకశిపుఁడు బ్రహ్మను గోరి పడసియుండుటచే, శ్రీమహావిష్ణు వాతని నరమృగరూపమిళితమగు నాకృతిం దాల్చియుం, రేయింబవలుగాని సంజను సంహరించెనని దెలియునది. 5. బలి ముల్లోక

ముల నాక్రమించి తాన యేలుచుండెను. దాన నింద్రుఁడు పదభ్రష్టుఁడయ్యెను. పిదప దేవతలు బ్రహ్మనుగూడి విష్ణువుకడకేగి జరిగినదానిం దెల్పికొని రక్షింపుమని వేఁడికొనిరి. అంత విష్ణువు వామనావతారముం దాల్చి వదాన్యచక్రవర్తి యగుబలికడ కేతెంచి మూఁడడుగులభువిని యాచించెను. ఆడితప్పనియాబలి తనగురువు శుక్రాచార్యుఁ డెన్ని భంగుల బోధించినను వినక మూఁడడుగులయిల నొసంగ, నావామనుండు వెచ్చు పెరిగి భువినిండి భువి నొకపాదమున దివి నొకపాదమున నాక్రమించి,వేఱొకపాదమునకుఁ దావులేమి నాతనిశిరసుపై నిడి పాతాళమున కడఁగఁద్రొక్కె ననుగాథను గీతప్రథమపాద మున ననుసంధింపవలయును. 6. కార్తవీర్యునిసుతుఁడు తనతండ్రిం జంపెననుకోపము మీఱఁ బరశురాముఁడు ముయ్యేడుమాఱులు రాజుల వధించి, తద్రక్తమునఁ బితృతర్ప ణముగావించెనను పౌరాణికగాథను గీతద్వితీయపాదార్థమును గమనించునప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చికొనవలయును. 7. శ్రీరాముఁడు లంకం జేరుటకు సముద్రుఁడు దారినీయకుంట నాతనిపై బాణమేసి లోఁగఁజేసె ననుగాథను గీతతృతీయపాదమున ననుసంధింపవలెను. 8. ఈచతుర్థపాదమునఁ గృష్ణావతారము కీర్తింపఁబడినది. అవతారక్రమమున బలరామా వతారమే యవతారములలోఁ గీర్తితమైనది. కాని బలరామకృష్ణుల నొక్కయవతార ముగనే పురాణాదులు నుడువుచుంట నిట్లుండుట యవిరుద్ధము. ఇందుఁ గృష్ణస్తుతిప్రస క్తముగానఁ గృష్ణావతారమే పేర్కొనఁబడియె. కంబము. ప్ర. స్తంభము. సింగము. ప్ర. సింహము. ప్రోడ. ప్ర. ప్రౌఢ. గర్వి. వి. గబ్బి.

క. రక్కసిమగువలయాలువు
మొక్కపటిచె దీవ పాపములగమిఁ గాలం
ద్రొక్కెదవు నీవ యింకిట
నిక్కముగా నిన్నుఁ బొగడ నేర్తునె కృష్ణా! 50

టీ. రక్కసిమగువలయాలువుఁ=రాక్షసస్త్రీలపాతివ్రత్యమును, మొక్కపటి చెదు=నశింపఁజేయుదువు, పాపములగమిఁ=పాపసమూహమును, నిక్కముగాఁ = నిజముగా, నేర్తునె=ఓపుదునె?

విశే. రక్కసి. ప్ర. రాక్షసి. ఇందు మొదటివిషయము బుద్ధావతారసూచక మందురుగాని యది విచారణీయము. రెండవవిషయము కల్క్యవతారసూచకమనుట యెట్లో సరిపెట్టుకొనవలసియుండును.

క. ద్వారక వైకుంఠపురం
బీరుక్మిణి లక్ష్మి మీర లిచ్చట నునికిన్

సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర! ముకుంద! మురారీ! 51

టీ. సారెకు=మాటిమాటికి, కొల్వఁగన్=సేవింపఁగన్, కంసహర=కంసుని సంహరించినవాఁడా! మురారీ=మురద్వేషీ!

భా. ఈద్వారక వైకుంఠమును, నీరుక్మిణి లక్ష్మియు, నీవు సాక్షాద్విష్ణువు నగుట, మాటిమాటికి మిమ్ముల సేవింప వచ్చుచుందునని భావము. అనఁగా భగవంతుఁడవను జ్ఞానముతో నిను సేవింప నేతెంతుననుట.

వ. అని యిట్లు బహుప్రకారంబులం బ్రశంసించి యవ్విరించినందనుం డమందానందంబు డెందంబునం గ్రందుకొన నిజవాసనాబిరుదగాథా కథనవందిబృందాయమానేందిందిరంబును, నుచితోపయోగజనితా నందబాష్పసందోహశంకావహమకరందబిందుతుందిలంబును, నిఖిల మనోరథప్రదానకీర్తిశంకాకరవిశదప్రభానిచుళితంబును నగుపారి జాతంపుఁగ్రొన్నన మిన్నేటిపసిండినెత్తమ్మిచిగురుటాకునం బొదివి యిచ్చి... 52

టీ. బహుప్రకారంబులన్=అనేకవిధముల, ప్రశంసించి=కొనియాడి, అవ్విరించినందనుండు=ఆబ్రహ్మపుత్రుండగు నారదుండు, అమందానందంబు=అధికమైన సంతోషము, డెందంబునన్=మనస్సునందు, క్రందుకొనన్=వ్యాపింపఁగా, నిజ...నేందిందిరంబును-నిజ=తనదైన, వాసనా=పరిమళమునకు సంబంధించిన, బిరుద=ప్రసిద్ధియొక్క, గాథా=కథలను, కథన=చెప్పుటయందు, వందిబృందాయమాన=స్తుతిపాఠకసమూహమువలె నాచరించు, యిందిందిరంబును=తుమ్మెదలుకలదియు, ఉచితోప...తుందిలంబును-ఉచిత=అర్హమైన, ఉపయోగ=ఒదవుబడిచే, జనిత=పుట్టిన, ఆనందబాష్ప = సంతోషమువలని కన్నీళులయొక్క, సందోహ=సమితియొక్క, శంకా=సందేహమును, వహ=తాల్చునట్టి, మకరందబిందు=పూవుందేనెబొట్టులచే, తుందిలంబును=బలసినదియు, నిఖిల...నిచుళితంబును-నిఖిల=సమస్తమైన, మనోరథ=కోర్కెలను, ప్రదాన=ఇచ్చుటచేనైన, కీర్తి = యశస్సుయొక్క, శంకా=సందియమును, కర=చేయునట్టి, విశదప్రభా=తెల్లని తేజస్సుచే, నిచుళితంబును=దట్టమైనదియు, అగు=ఐనట్టి, పారిజాతంపుఁగ్రొన్ననన్=పారిజాతవృక్ష సంబంధమైన క్రొత్తపుష్పమును, (క్రొత్తయనుటచే నపుడపుడే వికసించినదనియు, నపుడే కోయంబడినదనియుఁ దెలియవచ్చెడిని.) మిన్నేటి...టాకునన్-మిన్నేటి=ఆకాశగంగ

యందలి, పసిండిచెత్తమ్మి=బంగారుసొగసైన తామరసంబంధమైన, చిగురుటాకునన్=పల్లవమునందు, పొదివి=చుట్టి.

భా. ఆవ్విరించిసుతుం డింతింతనరానిసంతసము స్వాంతమునఁ జెలంగఁ దనపరిమళంపుఁబ్రసిద్ధిని బొగడ బట్టులగుతుమ్మెదలుగలదియుఁ, బ్రకృతము మహామహుండగు శ్రీకృష్ణునకుఁ దానర్పింపఁదగియుంటఁ దగినయుపయోగము తనకుఁ దటస్థించెఁగదా యని తద్దయు సంతోషమునందుటకతన గల్గినయానందబాష్పము లేమో యను సందియమును గల్గించుమకరందబిందువులఁ జెలువుమీఱునదియుఁ, నెల్లకోర్కుల నొసంగుటకతనఁ గల్గినవిమలయశం బేమో యనుసంశయము నాపాదించు విమలప్రభను మించునదియు నైనపారిజాతనూత్నసుమమును వియన్నదీసువర్ణపద్మపత్రమునఁ బొదివి శ్రీకృష్ణునకర్పించెనని భావము.

వ్యా-విశే. ఆ+విరించినందనుండు-త్రికంబుమీఁది హల్లునకు ద్విత్వము వికల్పముగఁ గల్గును. శ్రోత్ర+నన-పాత్రాదుల తొలియచ్చుమీఁది వర్ణములకెల్ల లోపమును, వానికిఁ బరుషేతరములు పరములుగా ద్విత్వమును గల్గును. శ్రోన్నన. చిగురుటాకు-రూ. అ. చిగురాకు-కర్మధారయంబునఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. మిన్ను+ఏఱు-సమాసమున 'టి' ఔపవిభక్తిక ప్రత్యయము కల్గెను. బృందాయమాన—'బృంద ఇవాచరమాణ' అనునర్థమునఁ గల్గిన క్యజంతరూపము. మతుబర్థమున 'తుంద+ఇల' 'తుందిల' అని యయ్యెను. తుమ్మెదలు స్తుతిపాఠకు లగుచున్నవనుటచేఁ బరిమళాతిశయమును, కీర్తిశంకను గలుగఁజేయుచున్నదనుటచే విశదప్రభాధిక్యమును సూచితములగును. సుమము మనోహరమగుటకుఁ బరిమళమును గాంతియు నావశ్యకములు. మఱియుఁ బూఁదేనె నిండియుండుట పరిమళమునకుఁ బోషకమును వికాసమునకు నూత్నతను దెల్పునదియు నగు పైనినిరూపించిన విశేషణత్రయమునఁ బుష్పము నధికమనోహరముగ నొనర్చి, యద్దాని శోభామహిమాతిశయములఁ బాఠకులకుఁ దేటపఱిచెను. మున్యాగమనపుష్పప్రదానములు ప్రబంధకథావృక్షమునకు బీజావాపములని యెఱుంగవలయును.

క. వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు మాధవుఁ డాశ్రో
న్ననఁ గయికొని భీష్మకనం
దనఁ గనుఁగొని సత్యభామ తలఁపున నిలువన్. 53

టీ. వినయంబున్=అణఁకువయు, విస్మయంబును=అపూర్వవస్తుదర్శనమునఁ గల్గుచిత్తవిస్తారమును, మనమునన్=మనస్సున, పెనన్=పెనుపును, కొనఁగన్=స్వీకరింపఁగ,

మాధవుఁడు=కృష్ణుఁడు, ఆక్రొన్ననన్=ఆయపూర్వసుమమును, కయికొని = స్వీకరించి, భీష్మకనందనన్=రుక్మిణిని, కనుఁగొని=చూచి, తలఁపునన్=మదియందు.

భా. అట్లాముని యవ్విరి నొసంగ దాని వినయమును నపూర్వసుమదర్శనమున విస్మయమును మదిఁ బెనంగఁ గైకొని చెంతఁగలరుక్మిణిం గాంచి వెనువెంటనే మదిని సత్యభామ తోఁపఁ గృష్ణుఁడు పరఁగెనని భావము.

వ్యా-విశే. 'వినయము' 'సత్యభామ తలఁపున నిలువన్' అనుపదములు శ్రీకృష్ణునకుఁ బెద్దలయందుఁగల వినయమును, రుక్మిణీసత్యలందుఁగల సమానానురాగమును సూచించునవి. దీన నుత్తమనాయకత ధ్వనితము. నిలుచు+నుజే. ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు ప వ ల గు. నిలువన్.

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకొ యౌలెమ్మిందు నే నున్కిఁ జె
ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్. 54

టీ. ఇది=ఈపారిజాతపుఁగ్రొన్ననను, భోజాత్మజకున్=రుక్మిణికి, కినుకతోన్=కోపముతో, ఏమంచు=ఏమనుచు, ఊహించునో=తర్కించునో? సాత్రాజితి=సత్యభామ, దానికి=ఆసత్యకు, ఏను=నేను, ఇపుడు=ఈసమయమున, ప్రేమన్=అనురక్తితో, పంపినన్=పంపినట్లైన, దీనిన్=ఈరుక్మిణిని, ఎల్లిదమున్=చులకనను, చేసినజాడ=ఒనర్చిన రీతి, తోఁచునొకో=ప్రత్యక్షమగునొకో? ఔనులెమ్ము=ఔలెమ్ము-సరియే కాని. ఇందున్=ఈరుక్మిణీగృహమున, నేను, ఉన్కిన్=ఉండుటచే, ఏరికిన్=ఏవారికిని, పంపఁగాన్=పంపుటకు, చెల్లదువో (చెల్లదు+వో)=తగదు. అనుచున్ = అనుకొనుచు, లీలన్ = విలాసముతో.

భా. ఈపారిజాతపుష్పమును రుక్మిణికొసంగినఁ గోపమువహించి సత్యభామ మది నేమనుకొనునో, లేక దీని నాసత్యకే యంపించిన రుక్మిణిని దాఁ జులకనగాఁ జూచినరీతి స్పష్టపడునేమో. నిక్కముగ నే నిందుండియుంట నేరికిని దీనింబంపుట తగవు కాదు. అని సవిలాసముగ దానిం గృష్ణుఁడు రుక్మిణి కిచ్చెనని యుత్తరపద్యముతో నన్వయము.

వ్యా-విశే. ఏమి+అంచు - ఏమాద్యులయిత్తునకు సంధి వైకల్పికము. అంచున్. రూ. అ. అనుచున్-చువర్ణకము పరమగునపు డన్వాదుల కుత్వలోపం బేని నుస్థానంబున బిందు వేని విభాషనగు. అంచున్. ఔను. రూ. అ. అగును. అవును. ఆచ్ఛికంబునందయి

యవులకు వక్రతమంబులు బహుళంబుగానగు. ఔను+లెమ్ము. లేచుధాతుసంబంధమైన మధ్యమపురుషైకవచనరూపము చేర. చెల్లదువో. పోవుధాతుసంబంధమైన మధ్యమపురుషైకవచనరూపాంతరము 'చెల్లదు' అనుదానికి నిశ్చయార్థద్యోతకమై చేరెను. శ్రీకృష్ణునకు రుక్మిణీసత్యలందుఁగల సదృశానురక్తి సూచితము.

చ. కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁక న్మునినాథునికన్నుసన్న ని
చ్చినఁ దగ భోజనందనయుఁ జేకొని మౌనికి మ్రొక్కి యవ్విరిం
దననెఱికొప్పునం జెరివిన న్వలిగుబ్బలిముద్దుపట్టి లేఁ
తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహనకాంతిసంపదన్. 55

టీ. కనుఁగవన్=నేత్రద్వంద్వమున, పిన్ననవ్వు=చిఱునగవు, తొలఁకన్=అతిశయింప, మునినాథునికన్నుసన్నన్=నారదుని నేత్రసంజ్ఞను, ఇచ్చినన్, తగన్=ఒప్పునట్లుగా (తానేరీతి యణఁకువను బుచ్చుకొనవలెనో యారీతి తోఁచునట్లుగ) చేకొని=గ్రహించి, మ్రొక్కి=నమస్కరించి, అవ్విరిన్=ఆపారిజాతసుమమును, తననెఱికొప్పునన్=తనరమ్యమైన కేశబంధమున, చెఱివినన్=ముడువఁగా, వలిగుబ్బలిముద్దుపట్టి-వలిగుబ్బలి=చల్లనికొండ (హిమవంతుఁడు) వానియొక్క, ముద్దుపట్టి = గారాబుకూఁతురు, లేఁతనెలన్=బాలచంద్రుని, ధరించినట్లు=తాల్చినరీతిని, తద్దయున్=మిక్కిలి, మోహనకాంతిసంపదన్=మోహింపఁజేయునట్టి తేజస్సంపత్తితో, అమరెన్=ఒప్పెను.

భా. వికసితనేత్రుఁడై శ్రీకృష్ణుఁడు నారదుననుజ్ఞ నాతని కనుసన్నుబడసి యాసుమమును రుక్మిణీదేవి కొసంగ, నామెయుఁ దగురీతిని బరిగ్రహించి, యమ్మునివరునకు నమస్కరించి, కొప్పున ముడిచికొని లేఁతచందురునిదాల్చినగౌరివలె మనోజ్ఞమైనకాంతి సంపద నలరారెనని భావము.

విశే. శ్రీకృష్ణుఁడు మహామహుండు నారదుండు తనదరినుండుటంజేసి, యణఁకువ సూచించుటకును, దాను దానికిత్తునా దీనికిత్తునా యనుసందియమునకు లోఁబడియు, దగ్గరనున్నదానికే విరినొసంగుటయందభిముఖుండౌట, నాభావమును మఱుఁగుపఱచుటకును, సంతోషమువిూఱనే యవ్విరి నిచ్చినటుల దేవేరికి దెల్పుటకును, జిఱునగవానన మునఁగాక కన్నుదోయియందె తొలఁకఁజేసెనని తోఁచును. నిక్కముగఁ గృష్ణుఁడు దాను సమయోచితముగఁ బ్రవర్తింపఁదలంచినను నవ్విరిందెచ్చిన నారదునియాశయ మెటులుండునో యెఱుంగకున్న బాగుగానేరదు. మఱియుఁ దాను పక్షపాతమువిూఱ మెలంగినటుల విశదమగును. కాని యింత నారదుఁడును నేత్రసంజ్ఞను శ్రీకృష్ణునవ్విరిని భోజాత్మజకీయ సూచించె. తనకింక భారము తలఁగెను. మున్యాజ్ఞపడసియే యాసుమ

రాజమును రుక్మిణి కొసంగినటుల నెల్లరకు స్పష్టమయ్యెను. దయతో సుమము తనకిమ్మని యమ్ముని కనుసన్నయొనర్చుటకతనను భక్తికతనను నమ్మౌని కామె ప్రణమిల్లెను. పారిజాతము తెల్లనిదౌట లేనెలవలె నమరునని గ్రహింపవలయును. రుక్మిణి కిద్దాని నొసంగుటంజేసి ముందుముందు సత్యకు నీర్ష్యపొడమునను నంశ మమ్ముని యెఱింగియే యట్లాదేశించెనని గ్రహించునది. అలం. ఉపమ.

సీ. మగమీల నగఁ జాలు తెగఁ గీలుకొను వాలుఁ
గనుఁగవ కొకవింతకాంతి యొదవె
వలిజక్కవల పెక్కువలు దక్కువగ నిక్క
చనుదోయి కొకవింతచాయ దోఁచె
నెలతుమ్మెదలదిమ్ము వెలిఁజిమ్ము చెలువమ్ము
గలవేణి కొకవింతనలువు మీఱె
నలచెందొవలవిందుచెలువెందు వెదచిందు
మొగమున కొకవింతజిగి దొలంకెఁ
తే. జక్కఁదనమున కొకవింతచక్కఁదనము
జవ్వనంబున కొకవింతజవ్వనంబు
విభ్రమంబున కొకవింతవిభ్రమంబు
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి. 56

టీ. మగమీలన్ = గండుమీలను (మీలు = చేఁపలు) నగన్ = పరిహసించుటకు, చాలు తెగన్ = సమర్థమగువిధమున, కీలుకొను = అమరియుండు, కనుఁగవకు = నేత్రద్వంద్వమునకు, ఒకవింత కాంతి = అపూర్వమగు సొగసైనశోభ, ఒదవెను = సంభవించెను. వలిజక్కవల పెక్కువలు = గుండ్రమైన చక్రవాకపక్షులయభివృద్ధులు, తక్కువగన్ = హైన్యము గాఁగ, నిక్క = పైకుబ్బునట్టి, చనుదోయికిన్ = స్తనద్వంద్వమునకు, ఒకవింతచాయ = ఒకయపూర్వకాంతి, తోఁచెన్ = సంభవించెను, ఎలతుమ్మెదలదిమ్ముఁ = లేఁదేంట్లగర్వమును, వెలిన్ = పైఁగా, చిమ్ము = పాఱఁదోలునట్టి, చెలువమ్ము = అందము, కల = కల్గిన, వేణికి = జడకు, ఒకవింతనలువు = ఒకయపూర్వమగునందము, మీఱెన్ = అతిశయించెను. అలచెందొవలవిందుచెలువున్ = ఆయెఱ్ఱకలవలకుఁ బంధువైనవానియందమును, అనఁగాఁ జంద్రునిసంబంధమైనయందమును, ఎందున్ = ఏచోటను, వెదచిందు = వ్యాపింపఁజేయు, మొగమునకు = ముఖమునకు, ఒకవింతజిగి = ఒకవిధమగునూతనకాంతి, తొలంకెన్ = అతిశయించెను. చక్కఁదనమునకున్ = సౌందర్యమునకు, ఒకవింతచక్కఁదనము = ఒకయపూర్వమగుసౌందర్యమును, జవ్వనంబునకున్ = యౌవనమునకు, ఒకవింతజవ్వనంబున్ = ఒకనూతనతారుణ్యా

మును, విభ్రమంబునకున్=విలాసమునకు, ఒకవింతవిభ్రమంబున్ = ఒకయపూర్వవిలాసమును, అద్దివ్యకుసుమంబుకతనన్=ఆదేవపుష్పకారణమున, (అనఁగా నాదివ్యసుమధారణవశముననుట) సతికిన్=పతివ్రతయగు నారుక్మిణీదేవికి, కలిగెన్=సంభవించెను.

భా. ఆపారిజాతకుసుమమును ధరించుటకతన గండుమీలఁ బరిహసించు రుక్మిణి కన్దోయి కొకయపూర్వశోభాతిశయ మొదవెననియు, గుండ్రనిచక్రవాకములయభివృద్ధులఁ గ్రిందుపఱచు నామెచన్దోయి కొకభూతపూర్వముగాని కాంతికల్గెననియు, లేఁబ్రాయంపుఁదేంట్లగర్వమును దూరముగాఁ బాఱఁదోలునందముగల యామెవేణి కొక చెప్పరానిసౌందర్యము సంభవించెననియు, చంద్రునియందము నెందును వ్యాపింపఁజేయు నామెమోమున కొకవింతకాంతి యతిశయించెననియు, నామె చక్కఁదనమున కొక వింతసౌందర్యమును, నామెయౌవనమున కపూర్వమగుతారుణ్యమును, నామెవిలాసమున కొకయపూర్వవిలాసమును గలిగెననియుం భావము.

వ్యా-విశే. జక్కువ. రూ. అ. జక్కవ. 'జక్కువ' అను నుకారమధ్యరూపము నిందలి 'క్క' అను ననుప్రాసము దృఢపఱచుచున్నది. చనుదోయి. రూ. అ. చన్దోయి. అఁట ఇఁక చుఁడు శబ్దములందప్పు నుడి తొలిహ్రస్వముమీఁద ఖండబిందువును ద్రుతమునకు లోపమును లేవు. 'చన్దోయి, కన్దోయి' అనువానిలోని నకారము ద్రుతమగునా యనుసంశము విచారణీయము. సీసతృతీయపాదమున 'నలుపు' అని పాఠాంతర మగపడు. అపూర్వమగునందమును బ్రత్యంగమునకుఁ గూర్చుటకే కవి యత్నించినట్లు దీని పూర్వోత్తరపాదములందలి 'కాంతి, చాయ, జిగి' అనుపదములు తెల్పుటంబట్టి జడ నల్లందనముం దెల్పుపాఠ మిచ్చోఁ బ్రసక్తముగాదనియే తోఁచెడిని. మఱియుం నల్లందనమునుసూచింప నెలతుమ్మెదేత్యాదితద్విశేషణమే సమర్థమగును. చెన్ను+తావ=చెందావ. ప్రాఁతాదుల తొలియచ్చులమీఁదివర్ణములకెల్ల లోపంబు బహుళంబుగానగును. పిదపఁ బరుషములు పరముగా నుగాగమము. చక్కఁదనము. రూ. అ. చక్కందనము. సమాసంబుల నుదంతస్త్రీసమంబులకును, బుంపులకును, నదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు. ద్రుతకార్యములు. జవ్వనము. ప్ర. యౌవనము. అలం. శబ్ద. అనుప్రాసము.

క. కలకంఠకంఠి యీగతిఁ, బులుగడిగినముత్తియంపుఁబోలుపొందంగా
నెలనవ్వొలయఁగఁ బలికెను, జలజాసనుపట్టి కలహసంభ్రమపరుఁడై.

టీ. కలకంఠకంఠి=కోకిలకంఠమువంటి కంఠము గలయారుక్మిణి, యీగతిన్=ఈ రీతిగ, పులు=మాలిన్యము, కడిగిన=తొలఁగించిన, ముత్తియంపుఁబోలుపు = మంచిముత్తి

యపుసొగసును, ఒందంగాన్=పడయఁగా, ఎలనవ్వు=చిఱునగవు, ఒలయంగన్=వ్యాపించఁగ, జలజాసనుపట్టి=బ్రహ్మకొడుకైననారదుఁడు, కలహసంభ్రమపరుఁడై-కలహసంభ్రమ=జగడపువేగిరపాటునందు, పరుఁడై=ఆసక్తిగలవాఁడై, పలికెను.

వ్యా-విశే. ముత్తియము. రూ. అ. ముత్తెము. ముత్యము. ప్ర. మౌక్తికము. జగడముపెట్ట నున్నవాఁడుగాన నెలనవ్వొలసెనని గ్రహింపవలయును. కలహసంభ్రమపరత మీఁద స్పష్టపడును.

నారదుఁడు పారిజాతప్రభావంబు రుక్మిణీదేవికిఁ జెప్పుట.

సీ. జలజాక్షి! యిది పారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిది సూవె
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యును శిరంబునఁ దాల్తు రనుదినంబు
హరిబహిఃప్రాణంబ వగుట నేఁ డెఱుఁగంగ
వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన
వెలఁదులు పదియాఱు వేవురలో నెన్న
సరి లేదు సౌభాగ్యగరిమ నీకు
తే. నీవు దాల్చినకతన నీపూవు నేఁడు
భాగ్యము వహించె సుచితోపయోగ్యవృత్తి
నీప్సితార్థంబు నొడఁగూర్చు నిది లతాంగి
దీనిమహిమంబు చెప్పెదఁ దెలియ వినుము. 58

టీ. జలజాక్షి=పద్మములవంటి నేత్రములుగలదాన! విశాలనేత్రత సౌందర్యప్రకాశకము. పారిజాతప్రసూనంబు=పారిజాతపుష్పము, నరులకు=మనుష్యులకు, ధరియింపన్=తాల్చుటకు, అరిదిచూవె=దుర్లభముసుమా, పౌలోమి=ఇంద్రునిభార్యయగుశచీదేవియు, పార్వతి= హిమవంతునికూఁతురగునగజయు, పద్మ=పద్మోద్భవయగులక్ష్మియు, పద్మజురాణియును=బ్రహ్మదేవేరియగు సరస్వతియు, శిరంబునన్ = ఉత్తమాంగమున, అనుదినంబున్=ప్రతిదినమును, తాల్తురు = ధరింతురు. హరిబహిఃప్రాణంబవు-హరి = కృష్ణునియొక్క, బహిఃప్రాణంబవు=వెలుపలిప్రాణమవు, అగుట=ఐయుండుట, ఎఱుగంగన్=తెలియుటకు, వచ్చెను (తెలిసెను) నీకు, ఇపుడు, ఇది = ఈపారిజాతపుష్పమును, ఇచ్చెన్ కాన=ఇచ్చుటచే (ఇది పైవాక్యమునకు హేతువు) వెలఁదులు, పదియాఱువేవురలోన్=పదియాఱువేలస్త్రీలలో, ఎన్నన్=లెక్కసేయఁగా, సౌభాగ్యగరిమన్ =

సౌందర్యాతిశయమువిషయమున, నీకున్, సరిలేదు=సాటిలేదు. తాల్చినకతనన్=ధరించినకారణమున, భాగ్యము=అదృష్టమును, వహించెన్=పొందెను, ఉచితోపయోగ్యవృత్తిన్=తగినయుపయోగింపఁదగిన వ్యాపారముచే, ఈప్సితార్థములు = కోరినకోర్కెలను, ఒడఁగూర్చున్ = చేకూర్చును, లతాంగి = తీగఁబోఁడి, మహిమంబున్ = మాహాత్మ్యమును.

భా. ఓరుక్మిణి! ఈపారిజాతమునుధరింప నరుల కలవిగాదు. దీనిం బ్రతిదినమును శచియుఁ, బార్వతియు,లక్ష్మియు, సరస్వతియుమాత్రమె ధరింతురు. అట్టి సర్వోత్కృష్టలగువారిచేఁ దాల్పఁబడు దీని నీకు శ్రీకృష్ణుఁ డొసంగుటంజేసి నీ వాతని బయటిప్రాణమవని తెలియనయ్యెను. మఱియు నితరజాయల కొసంగక దీని నీకొసంగుటంబట్టి యెల్లరిలో సౌభాగ్యాతిశయమున మించినదానవని తేటపడియెను. ఇట్టి నీవు ధరించినకతన నీసుమ మెంతయో యదృష్టముకలదని చెప్పవలసియున్నది. తగురీతి నుపయోగించిన నిది కోర్కెలనెల్లఁ జేకూర్చును. దీనిమహిమ మిఁకఁ దెల్పుదును వినుము.

వ్యా-విశే. వెలఁదులుపదియాఱువేవురలో.—సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యంబులం దెయ్యది ముందు ప్రయోగింపఁబడు దానిద్వితీయాదులకుఁ బ్రథమ బహుళంబుగానగును. చూవె:—చూడవు+ఎ. రూ. అ. చూవే. పౌలోమి, పార్వతి, పద్మ, పద్మజురాణియును;-నామసర్వనామంబులకును,కళలగునవ్యయములకును గడపలసముచ్చయార్థకవిశేషపాదపూరణములందు నుశబ్దంబు దఱచుగనగు. ఇది కళలగు ననుదంతశబ్దముల మీఁద యువర్ణపూర్వకముగ విభాషనగును. మఱియు నిది పెక్కుచోట్ల నుండఁదగియుండినను నొక్కచో నుండినఁజాలును. ఒడఁగూడు+చు. అడోదుకూడులడకారమునకుఁ ఱుక్కు పరంబగునపుడు రేఫంబగు. ఒడఁగూర్చు+ను:—తద్ధర్మార్థక క్రియ. 'నరులకు ధరింపరానిదియు, శచీపార్వతీలక్ష్మీసరస్వతు లనుదినము ధరించునదియుం నగుసుమము' అని చెప్పుటచే సుమమునుత్కృష్టత తెల్లమయ్యెను. అయ్యుత్కృష్టసుమరాజమును నీకిచ్చెనుగాన నీవు కృష్ణుని వెలుపలిజీవంబవును, బదియాఱువేలమందివనితలలో సాటిలేని సౌభాగ్యగరిమగలదానవును నైతివనుట, తక్కుంగల యెల్లవారిలో నీమెను నెక్కువసేసి తన్మూలమున నితరవనితాతతి కీర్ష్యను బుట్టించి జగడమునకు దారితీయుటకే యని యెన్నవలయును. మఱియు నీవు ధరించుటకతననే నీసుమమదృష్టము వహించెననుటయుం, నిది నీకే ధరింపఁదగినదికాని యితరవనితలకుఁ దగినదికాదని యనుటయుఁ బెఱరామల కసూయఁగూర్చి కలహము ననుసంధించుటకే యని పరిగ్రహింపఁదగు. తగినరీతి నుపయోగించెదేని కోర్కెలనెల్లఁ గూర్చుననుట నింక నీకు దేనఁ గొఱంతలేదని తెల్పుచుఁ,

గభామల కసూయఁబుట్టించుటకే యనవలయు. ఇట్లే యిప్పద్యము మొదలుకొని యుయువదేడవపద్యమువఱకునుగల నారదప్రసంగమునఁ గలహాసంభ్రమపరత గానవగును.

౫౯. క. పరిమళము సెడదు వాడదు, పరువము దప్పదు పరాగభరభరితంబై
నిరతము జగదేకమనో, హరమగు నీ కుసుమరాజ మంబుజవదనా!

టీ. అంబుజవదనా=పద్మముఖీ, పరిమళము=తావి, వాడదు=మ్లానత్వమునందదు, పరువము=పరిపాకము. (అనఁగా సంపూర్ణవికాసము.) పరాగభరభరితంబై = పుప్పొడి యొక్క భారముచే నిండినదై, నిరతము=సంతతము, జగదేకమనోహరము = లోకమునందుఁ గేవలము తానే మనోజ్ఞమై, ఈకుసుమరాజము=ఈపుష్పశ్రేష్ఠము.

భా. దీనిసుగంధ మెప్పుడును జెడదనియుఁ, బరాగమును వికాసమును గోల్పోక నిండువికాసమున సర్వమనోహరమై యెల్లవానిమించి వర్తిలుననియు భావము.

విశే. పుష్పమునకు సర్వోత్కృష్టత ననుసంధించుచుఁ, దన్మూలమున రుక్మిణికిఁ బెద్దగౌరవమును గూర్పఁ, దక్కుంగలవనితలకు నీర్ష్యను సంపాదింప, నారదుఁ డీగతిని బ్రసంగించుచున్నాఁడని యెన్నవలయును. మఱియుం నాజగదేకమనోహరమగు కుసుమమును దాల్చుటకతన నీవును జగదేకసుందరి వగుదని యాంతరాశయము.

మ. అలినీలాలక! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకుర మై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్. 60

టీ. అలినీలాలక=తుమ్మెదలంబోలు నల్లనినెఱికురులుగలదాన, రహస్యక్రీడన్ = ఏకాంతక్రీడను, వర్తించువేళన్=ఉండుసమయమున, లతాంతాయుధసంగరంబునకున్ - లతాంత=పుష్పములే, ఆయుధ=బాణములుగాఁగల మన్మథునిదగు, సంగరంబునకున్ = యుద్ధమునకు (రతిక్రీడకనుట), ఉల్లాసంబు=సంతోషము, కల్పించు=చేయు, ఉజ్జ్వలదీపాంకురమై=ప్రకాశించుదివ్వెమొలకయై, రతి...ఘర్మలవంబుల్ - రతి = సంభోగమువలని, శ్రమ=ఆయాసముచే, తనూ=శరీరమునందు, జాత=పుట్టిన, ధారాళ=అడ్డపాటులేని, ఘర్మలవంబుల్=చెమటబొట్టులు, తొలఁగింపఁగాన్=నిర్మూలింపఁగ, సురటియై = వీవనయై, ఇచ్ఛాగతిన్=కోర్కికనుకూలించురీతిని, రంజిల్లున్=ప్రకాశించున్.

భా. నీవును నీభర్తయు నేకాంతక్రీడకు లోనగునదనున సంభోగమునకు సంతోషాతిశయమును గల్పించు మహాజ్యోతియై వెలుంగుచు, నిది మీకు రతివలనఁ గల్గిన స్వేదబిందువుల నపనయింప వీవనయు నగునని భావము.

వ్యా-విశే. ఇద్దానిందాల్చుటకతన, నీకొక్కదానికే యిట్టివైభవముకల్గుఁగాని పెఱవారలకుఁ గల్గఁబోదని నారదుని కలహాసంభ్రమపరత విశదమగును. రంజిల్లు.—రంజాదుల యించుక్ప్రకారంబునకు ప్రేరణంబున ద్విరుక్తలకారంబగు. నిరీహుఁ డగుమహాముని, నారదుఁ డీగతిని శ్రీకృష్ణుని దేవేరితోడ రుక్మిణితోడఁ బ్రసంగించుట సముచితము గాదని యనవచ్చును. కాని, వక్త నిరీహుఁడగుటను వక్తవ్యము సుమమూలకసుఖాతిశయప్రకాశకము కావలసియుండుటను, దన్మూలమున నితరవనితల కసూయంగూర్ప మాని తలంచియుంట, నిట్టిప్రసంగమే తలఁచినదానింగూర్ప సమర్థమైయుండుటను, బైప్రసంగము దుష్టము గాదని యెన్నవలయును. సంస్కృతహరివంశమున నీప్రసంగము గానరాదు. స్వాశ్రయులగురాజులకుఁ గలశృంగారాసక్తినిగాని యక్కాలమునఁ గవులకుఁగల శృంగారప్రియత్వమునుగాని కవి వెల్లడించెనేమో!

చ. అడిగినయంతలోన సరసాన్నముల న్సమకూర్చు నాఁకట
న్బడలికఁ జెందనీక యశుభంబు లడంచు జగత్త్రయంబునం
బడయఁగరాని సర్వగుణభవ్యము సుమ్మిది దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావముల్. 61

టీ. అడిగినయంతలోన=కోరినవెంటనే, సరసాన్నములన్ = రుచ్యములగునన్నముల (అన్నము=తినఁదగినదంతయు నన్నమె యగు) ఆఁకటన్=తూత్తుచే, బడలికన్ = శ్రమను, చెందన్ ఈక=పొందనీక,సమకూర్చున్=చేకూర్చును. అశుభంబులు=కష్టములు, అడంచున్=నశింపఁజేయును. జగత్త్రయంబునన్=ముల్లోకముల, పడయఁగన్=పొందుటకు, రాని=శక్యముగాని, సర్వగుణభవ్యము-సర్వ=సమస్తమైన, గుణ=మంచిగుణములచే, భవ్యము=శుభప్రదమైనది. ఇది=ఈపారిజాతము, సుమ్ము=చుమా, దీనిన్=ఈపారిజాతసుమమును, తాల్చి=ధరించి, ఇప్పడఁతులలోన్=ఈవనితలలో, (పదియాఱువేవురిలో) అపార......అనుభావముల్-అపార=అనంతములైన, మహత్=గొప్పదైన, మహిమ=ఐశ్వర్యముయొక్క, అనుభావముల్ = ప్రభావములను, కనుంగొనుము = కాంచుము (పొందుము).

భా. ఈపారిజాత మడిగినతోడనే రుచ్యములగునన్నముల నిడి యాఁకటివలని బాధనందనీదు. ముల్లోకముల నిట్లు సర్వసుగుణముల కాలవాలమును క్షేమంకరమును నగునది లేదు. కాన, నిట్టిభవ్యసుమమును ధరించి సవతులెల్లరిలో నైశ్వర్యమహిమను మించిమిన్నవగుదుగాక అని భావము.

వ్యా-విశే. సమకూర్చు.—సమకూడు. ప్రే. చు. సమకూర్చు. లోకమున నాఁక లియుం నశుభములయు బాధ సంభవింపకుండుటనే సర్వముంగోరును. కాని యవ్వానిబాధ సతతము దప్పకుండును. ప్రకృత మారెండింటి నపయింపఁగలసుమరాజ మీామెకు లభించెను. మీాఁదు మిక్కిలి సర్వశుభములకాస్పదము. దీన రుక్మిణి యైశ్వర్యప్రభావమును గాంచుటయుం, నెల్లరిలో మిన్నయగుటయుం నేల సంభవింపకుండును? మఱియు నిద్దాని మూలమున నితరవనితలకు మాత్ర మీార్ష్య యేల జనింపకుండును! 'పడఁతు లెల్లరిలో మహోమహిమానుభావములు గనుఁగొనుము' అను తుదిపలుకు నారదునికలహాసంభ్రమపరతను సూచించును.

చ. కువలయపత్త్రనేత్ర! నెఱిగొప్పున నీకుసుమంబు దాల్చుటన్
సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁ డలిలేనికూర్మి జవదాఁటక నీపలు కాదరింపఁగా
నవిరళభోగభాగ్యమహిమాన్వితవై విహరింతు గావుతన్. 62

టీ. కువలయపత్త్రనేత్ర = నల్లకలువరేకులంబోలు కన్నులుగలదాన! నెఱిగొప్పునన్ = రమ్యమైనకొప్పున, ఈకుసుమంబున్ = ఈ పారిజాతపుష్పమును, తాల్చుటన్ = ధరించుటచే, సవతులు = సపత్నులు, వచ్చి, నీచరణసారసయుగ్మమున్ = నీసంబంధమైన పాదపద్మద్వంద్వమును, ఆశ్రయింపఁగా = అండఁగొనఁగా, ధవుఁడు = భర్త, అలిలేనికూర్మిన్ = కొలంతలేనియనురాగముతో, జవదాఁటక = అతిక్రమించక, నీపలుకు = నీమాట, ఆదరింపఁగాన్ = మన్నింపఁగా, అవిరళ... మహిమాన్వితవై - అవిరళ = తక్కువకాని, భోగ = సుఖములయొక్కయు, భాగ్య = అదృష్టముయొక్కయుం, మహిమ = ప్రభావముతోడ, అన్వితవై = కూడినదానవై, విహరింతుగావుతన్ = విహారమొనర్తువుగాత. (అని యాశీస్సు.)

భా. ఓరుక్మిణి! నీమనోజ్ఞకేశబంధమున నీ పారిజాతసుమమును ధరించుటకతన, నీసవతులు నీ పాదములంబడి నిన్ను గొల్చుటయుం, నీపతి నిను బూర్ణమగుననురాగమున నీమాట జవదాఁటక మెలంగుటయుం సంభవించు. కాన, నట్లు పతిదగు మితిలేనియాదరమునకును, సపత్నీసంసేవకును బాత్రమవై భోగములను సుఖములను గాంతువుగాతమని భావము.

విశే. సవతులు పాదసరోజముల సేవించుట, పతి మితిలేనియనురాగమున జవదాఁటకుండుట యనునివి భోగభాగ్యచిహ్నములుగదా! సపత్నులు నీ పాదములపైఁ బడుదురనియుం, నీపతి నీమాటను దాఁటక మెలంగుననియుం, నీవె యధికభోగభాగ్యములనుఁ దావగుదనియుఁ బలుకుట యితరతరుణుల కీర్ష్యాసంధానార్థముగాక వేఱగునా? ఇట్లు నారదుని కలహాసంభ్రమపరత ప్రతిపద్యమునుండియుం నద్ధరింపనగును.

క. నెలకొని వేసవిఁ జలువయుఁ, జలివేళల నుష్ణగుణము సముచితభంగిం
గలిగించు నీలతాంతము,కొలఁదులు చెప్పంగ నిచ్చక్రొత్తలు సుమ్మీ.

టీ. నెలకొని=నిలిచియుండి (కొప్పున), వేసవిన్=ఎండకాలమున, చలువయున్=చల్లందనమును, చలివేళలన్=శీతకాలమున, ఉష్ణగుణమున్=వేఁడిమిని,సముచితభంగిన్=ఉచితమగురీతిని, కలిగించును=ఒదవించును, ఈలతాంతముకొలఁదులు=ఈపుష్పపుశక్తులను (పరిమితి), చెప్పంగన్, నిచ్చ=సదా, క్రొత్తలుసుమ్మీ=నూతనములుసుమా.

వ్యా-విశే. నిచ్చ. ప్ర. నిత్య.

క. అలరుంబోఁడులలోపల, నలరుం బోఁడుములు నీకు నగ్గలమగుచున్
దలపూ వాడక యుండుము, తలపూవు ధరించి వికచతామరసాక్షీ!

టీ. అలరుంబోఁడులలోపలన్=పుష్పములవలె మనోజ్ఞలైనతరుణులలోపల, నీకు, అగ్గలమగుచున్=అధికమగుచు, పోఁడుములు=ఒప్పిదములు, అలరున్=ఒప్పును. తలపూ=తలయందలిపూవు, వాడక=మ్లానముగాక, తలపూవు=శిరసునందు కుసుమము ధరించి, వికచతామరసాక్షీ=వికసించినపద్మములంబోలు కన్నులుగలదాన! ఉండుము.

వ్యా-విశే. లేదా, తలఁపు=చింతితము,ఊఁవాడక, ఊఁగు+ఆడక=చలింపక(స్థిరముగాఁగ) తరువాతఁ బూర్వమువలెనేయని యెన్నవలయును. కొన్నిప్రతులలో 'తలపూవాడక' అని నిర్బిందుకముగఁ బాఠము గానంబడును. తలపూవు వాడక యనుపదము మహాభోగసూచకముగఁ గవులు వాడుట గలదు. 'తలపూవువాడనిభోగి' యని వసుచరిత్రము. 'పూపూవు' అని పూవుశబ్దమున కసమాసమున 'పూ' అని రూపాంతర మున్నట్లు 'శిరస్సుపూ' అను నుదాహరణ మొసంగి సీతారామాచార్యులుగారు సమర్థించిరి. కాన 'తలపూ'అను పదమునకు 'తలపూవు' అమనర్థము చెప్పవచ్చును. మఱియు, 'తలపూవు' అనుదాని రూపాంతరమే 'తలపూ' అనియు నంగీకరింపనగును. 'ఊఁగు' ధాతువునందలి గకారమునకు వకారముకల్గినరూపముల కంతగఁ బ్రయోగములు లేమింజేసియు, 'తలపూవాడక' అనుదాని మహాభాగ్యద్యోతకముగఁ గవులు ప్రయోగించియుండుటం జేసియు, నిచ్చోఁ బారిజాతకుసుమధారణమున రుక్మిణికిఁ గలుగఁబోవు మహాభోగమును బ్రకాశింపఁజేయుటయే వక్తయాశయ మగుటంజేసియు, 'తలపూవు వాడక' అనునర్థమే చెప్పనొప్పునని తోఁచెడిని. శబ్దరత్నాకరమున 'ఊఁవాడు' అనుపదమున కర్థము వ్రాయుచు, నీపద్యమునందలి యీపదమునే 'ఊఁవి+ఆడు=ఊఁవాడు' అని యుదాహరించిరి. కాని యీసుమము వాడనిదొట తలపూవు వాడకయుండుమనుటయే యెంతయు హృద్యమగును. అలరుంబోడులు. అలరు+పోడి. ఇయ్యది బహువ్రీహియని చిన్నయ

సూరి. అపుడు మేనుశబ్దమునకుఁ బోఁడి యాదేశమని వారిమతము. 'పోఁడి, బోఁడి' అనుపదములలో 'పోఁడి' అనునదియే యాదేశముగవచ్చునని సూరియాశయమైనట్లు సమర్థింపనగును. ఇది యుపమానపూర్వపదకర్మధారయమనియు, నిందలిపోఁడిశబ్దమే 'అలరు' మున్నగువానితో సమసించుననియు, నపుడు దీనికి 'మనోజ్ఞమైనది' అని యర్థమనియుఁ బ్రౌఢవ్యాకరణము చెప్పును. తారతమ్యపరీక్షలేకయే తన్మతములసామంజస్యవిచారణ యిట ననావశ్యకమగుటఁ వ్యక్తము. పూవు. రూ. అ. పువు. పువ్వు. పూ.

ఉ. ఇన్నిదినంబులుం సవతు లిందఱిలో నలసత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన విందుఁ గాని యో
కన్నియ! నీయెడం గలుగుగారవ మెయ్యెడఁ జూచి కాన లే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చెనే? 65

టీ. ఇన్నిదినంబులుం=ఇన్నిరోజులును, సవతులిందఱిలోన్ = ఇంతమంది సపత్నులలో, అలసత్యభామకన్నన్నలన్=ఆసత్రాజిత్పుత్త్రికయొక్క నేత్రసంజ్ఞలను, హరి=కృష్ణుఁడు, వశంవదుఁడై=వశవర్తియై (స్వాధీనుఁడై), త్రిమ్మరున్=సంచరించును,అనన్=అనఁగా, విందున్, కాని, ఓకన్నియ=ఓరుక్మిణి, నీయెడన్=నీవిషయమున, గలుగు గారవము=ఉన్నగౌరవము, ఎయ్యెడన్=ఏచోటను, చూచి కానన్=చూచియుండలేదు. లేకున్న=అట్లేకాకున్న, (అందఱిలో నిను నెక్కుడుగారవమునఁ జూడకున్న) అనర్ఘ్యదివ్యకుసుమోత్తమము-అనర్ఘ్య=అమూల్యమైన, దివ్యకుసుమోత్తమము = అసురపుష్పశ్రేష్ఠమును, ఏరికినైనన్=ఏవారికైనను, ఇచ్చెనే=ఒసంగెనే?

భా. తడవులంబట్టి హరి సత్యభామకు స్వాధీనుఁడై యామెయాజ్ఞను జవదాఁటక నంచరించు నను నానుడి వినంబడు. కాని, ప్రకృతము నీకే యద్దివ్యకుసుమరాజము నొసంగి యాదరించుటకతన, నమ్మాట వమ్మగుటయేగాక నీయెడంగలగారవ మేచాననెడ లను లేదని విశదమయ్యె.

విశే. ఇంతవఱకుఁ బారిజాతమహిమాప్రకాశనపురస్సరముగ నారదుఁడు తన కలహసంభ్రమపరతను సూచించి యిఁకఁ గలహమునే వారలకుఁ బరస్పరముఁ గూర్పవలెనని సంకల్పించెనో యాఁగతినను సరించి యిఁకఁ బలుకుచున్నాఁడు. నారదుఁడు రుక్మిణీదేవితోడఁ బ్రకృతము నీయెడఁ జూపినగారవ మన్యనారీదుర్లభమనెను. సత్యావశవర్తి కృష్ణుఁడను జనశ్రుతి దీన నసత్యమని తేల్చెను. స్పష్టముగ సత్యభామనామమును వచ్చి యామెను గ్రిందుపఱచెను. ఇఁకఁ గలహము కల్గుట కడ్డేమి? మానినులకు మత్సరము సహజము. అందును సవతులు. అందునుఁ జేరఁత్తిన చెప్పెడిదేమి? ఇట్లు కలహబీజము లింక సంపూర్ణముగా నాటఁబడును.

ఉ. చక్కనిదాననంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాననంచుఁ బతి యెంతయు నాకనురక్తుఁడంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కక యున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్. (66

టీ. చక్కనిదానను = సౌందర్యవతిని, ఎలజవ్వనిని = లేఁబ్రాయముగలదానిని, జగంబులోనన్ = లోకమున, పేరెక్కినదానను = ప్రసిద్ధినిగన్నదానను, అనురక్తుఁడు = అనురాగముగలవాఁడు, తాను, సత్య = సత్యభామ, నిక్కుచున్ = అతిశయించుచు, విఱ్ఱవీఁగుచున్ = మిక్కిలి గర్వించుచు, కాంతలన్ = పెఱవనితలను, ఇంతకున్ = ఇప్పటికిని, నీమహిమన్ = నీప్రాభవమును, చూచినన్, బోటులు = చేడియలు, విన్నవించినన్ = మనవి చేసిన, స్రుక్కక = దుఃఖింపక, ఉన్నె = ఉండునా?

భా. సౌందర్యవతిననియు, లేఁబ్రాయముగలదాననననియుఁ, బతి యెంతయుఁ దనయం దనురక్తుఁడనియు మిగుల గర్వమునందు సత్య యిప్పటి నీమహిమం గాంచినను, జేడియలు తెల్పినను వంతనొందక మానదని భావము.

వ్యా-విశే. నాకనురక్తుఁడు.—'నాయందనురక్తుఁడు' అనుదానికి బదులుగాఁ బ్రయుక్తము. ఇట్లు షష్ఠి పెక్కువిభక్తులకు మాఱుగ నాంధ్రవాఙ్మయమున నగపడును. ఉన్నె, ఉండును+ఎ. విన్నవించు. ప్ర. విజ్ఞాపించు. ప్రకృత మీకుసుమమును ధరించిన కతన నీకుఁ గల్గినమహిమం జేసి సత్య తన కితఃపూర్వము సౌందర్యవిషయమునఁ బత్యనురాగవిషయమున యౌవనవిషయమునఁ గలగర్వమంతయుఁ దలఁగి స్రుక్కుననుట, మీఁది మాఁటివిషయమున నీవె యిక్కుసుమమును ధరించుటకతన నామెను మింతువనియుం, నామె యట్లనుకొనుట గర్వసూచకమే యిఁక నగుననియుఁ దెలుపుటకని గ్రహింపనగు. మఱియు 'బోటులు విన్నవించినన్' అనుదానింబట్టి బోటులు సత్యకు విన్నవించుటకే నారదుఁ డీరీతిఁ బ్రసంగించెనని యెన్నవలయు. మఱియు నుత్తరకథాసూచకమును నిది గానోపును. 'దీనిందాల్చి యిప్పడఁతులలోఁ గనుంగొన మపారమహామహిమానుభావముల్' 'సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము లాశ్రయింపఁగాన్', 'అలరుంబోఁడులలోపల నలరుంబోఁడుములు', 'నీయెడంగలుగు గారవ మెయ్యెడంగానన్', 'ధవుఁడఱలేని కూర్మి నీపలుకాదరింపఁగాన్' అను మున్నగుమాటలమూలమున నితరతరుణుల కీమెపై నసూయను నెలకొనం జేయుచు నంతతోఁ దనివిసనక, 65, 66 పద్యముల సత్యభామ నగ్గలమగు కోపమునకు నీర్ష్యకును బాలుగాఁ జేయ నామె పేరెత్తి దూషించుటయుం, రుక్మిణీసతిని భూషించుటయు నొనర్చె. ఇంక కలహబీజములు మొలవక మొక్కవోవునా?

క. ధరియించిన మొద లొకవ,త్సరమాత్రము తావకీనధమ్మిల్లములో
నిరవుకొని మగుడ నివ్విరి, తరుణీ! యలపారిజాతతరువున కరుగున్. 67

టీ. ధరియించినమొదలు=తాల్చినదిమొదలుకొని, ఒకవత్సరమాత్రము = ఒక సంవత్సరకాలముమాత్రమె, తావకీనధమ్మిల్లములోన్ = నీదగుకొప్పులో, ఇరవు = స్థానము, కొని=స్వీకరించి, (ఉండి) మగుడన్=మఱల, ఇవ్విరి=ఈపుష్పము, తరుణీ = ఓయువతీ ! అలపారిజాతతరువునకున్ = ఆపారిజాతవృక్షమునకు, అరుగున్ = పోవును.

భా. ఓయువతీ! దీనిందాల్చినదిమొద లొకసంవత్సర మిది నీకొప్పున నొప్పియుండి మఱల నాగడువుదాటఁగనే పారిజాతవృక్షముం జెందును.

వ్యా-వి శే. తావకీన-యుష్మదస్మచ్ఛబ్దములకు ఖఞ్, అణ్ ప్రత్యయములును నాశబ్దములకుఁ గ్రమముగ 'తవక, మమక, అనునాదేశములును, 'ఈన' అనునది ఖఞ్నకాదేశమును, శబ్దముల కాదివృద్ధియుఁ గల్గి 'తావకీన, మామకీన' అనురూపములు గలుగు.

తే. అనుచు నారదుఁ డాడినయట్టిపలుకు
లచటివృత్తాంత 'మంతయు నరసి పోయి
వేఱువేఱన సఖులు దేవేరులకును
విన్నవించిన వారును జిన్నవోయి. 68

టీ. ఆడినయట్టిపలుకులు=పలికినమాటలు, అచటివృత్తాంతము = అచ్చోటనైన సమాచారము (రుక్మిణీకాంతగృహంబులోన నేకాంతమున నైనదానిని), అరసి = విచారించి, వేఱువేఱన=భిన్నభిన్నముగా సంకలితముగానట్లు, సఖులు=చెలికత్తెలు, దేవేరులకును=మహిషులకును, విన్నవించినన్=మనవిసేయఁగా, వారును, చిన్నవోయి=ఖిన్నలయి. ఉత్తరపద్యముతో నన్వయము.

భా. ఈరీతిగ నారదుం డాడినమాటల నచ్చో నున్నచెలికత్తెలు విని యొక్కొక్క-రే పోయి సంకలితముగానిరీతిని శ్రీకృష్ణునిమహిషులకుఁ దెల్పిరని భావము.

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణి గానఁ *బూవు గో
విందుఁడు దాని కిచ్చెఁ దగవే యని లక్షణ యోర్చె సైఁచెఁ గా
ళింది శమించె భద్ర యవు లె మ్మని యూరడిలెన్ సుదంత లోఁ
గుందుట మానె జాంబవతి కోప మడంచెను మిత్రవిందయున్. 69

* యామె కిం, పొందఁ బ్రసూనమీఁ దగవ పొమ్మని లక్షణ. అని. పా. అ.

టీ. తగవే=న్యాయమే, ఓర్చెన్=సహించెను, శమించెన్=శాంతించెను. ఊరడిలెన్=ఆశ్వాసమునందెను, లోన్=మనస్సులో, కుందుట=దుఃఖించుట, అడంచెన్ = అణఁగఁజేసికొనెను.

భా. రుక్మిణి దేవేరు లెల్లరిలోఁ బెద్దదిగాన నామెకుఁ బారిజాతకుసుమమును శ్రీకృష్ణుఁ డొసంగుట యుచితమే యని లక్షణ, కాళింది, భద్ర, సుదంత, జాంబవతి, మిత్రవిందయును నలుకను నీర్ష్యను బూనరైరి.

తే. వారిలోపల సౌందర్యవతియు మాన
వతియు మహనీయసౌభాగ్యవతియు నైన
సత్య యంతట నేమొకో శౌరికడకుఁ
బోయి రా దయ్యెఁ జెలి ప్రొద్దు వోయె ననుచు. 70

టీ. వారిలోపలన్=అష్టమహిషులలో, సౌందర్యవతియున్=చక్కఁదనముగలదియు, మానవతియున్ = అభిమానముగలదియు, మహనీయసౌభాగ్యవతియున్ = గొప్పదగు ప్రియవాల్లభ్యముగలదియు, ఐనసత్య=సత్యభామ, నామైకదేశముచే నామమంతయుఁ బరిగ్రహింపనగును. అంతటన్=వెనువెంట, శౌరికడకున్=శ్రీకృష్ణుని చెంతకున్, పోయి=అరిగి.

వ్యా-విశే. మహనీయసౌభాగ్యవతి.—ఇందుఁ గర్మధారయముపై మతుప్ప్రత్యయము గననగు. ఇట్లు కర్మధారయమున మతుప్ప్రత్యయముకల్గుట విరుద్ధమని సంస్కృతలాక్షణికాశయము. కాని 'సర్వధని' అనుభాగ్యప్రయోగము ననుసరించి బహుళముగ రాఁదగునని కొందఱందురు. ఏది యెట్లయినను నిట్టి ప్రయోగములు విరళములని చెప్ప నొప్పును. సౌందర్యవతి, మానవతి, మహనీయసౌభాగ్యవతి, కావుననే సత్య ముమ్మం దీర్ష్యఁబూనుట సంభవించెనని గ్రహింపవలయు. రుక్మిణికి సుమరాజ మొసంగుటం జేసి, తనచక్కఁదనమునకును, మానమునకును, మహనీయసౌభాగ్యమునకును భంగము వాటిల్లెనని సత్య యభిప్రాయపడి యలుకఁబూనెనని గ్రహింపవలెను.

మ. తనశృంగారవనంబులో* నగరిపొంతం జక్కఁగా దిద్ది తీ
ర్చిన పూఁదేనియయేటికాలువదరిం జెంగల్వపుప్పొళ్లు నిం
చిన చంద్రోపలవేదిపై సరసగోష్ఠిన్ బోటియుం దాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి వర్ణించుచున్. 71

టీ. తనశృంగారవనంబులోన్ = తనయుద్యానవనమున, నగరిపొంతన్ = పట్టణముదరిని, చక్కఁగాన్ = లెస్సగా, దిద్ది = ఏర్పఱచి, తీర్చిన = అమర్చిన,

* లోన గిరిపొంతన్. అని పా. అ.

పూఁదేనియయేటికాలువదరిన్ = మకరందపునదిసంబంధమైన కుల్యయొక్క సమీపమున చెంగల్వపుప్పొళ్లనించినచంద్రోపలవేదిపై = చెంగల్వలసంబంధమైన పరాగముచే నిండియున్న చంద్రకాంతపురాలచేఁ గట్టఁబడినయరుఁగుపై, సరసగోష్ఠిన్ = వినోదప్రసంగమున, బోటియున్ = చెలియు తానున్, అబ్జవనజాతాయతనేత్ర = ఆపద్మములవంటి విశాలములగుకన్నులుగలయామె, శౌరిగుణముల్ = శ్రీకృష్ణునిగుణముల, వాక్రుచ్చి = పేరుచెప్పి, వర్ణించుచున్ = కొనియాడుచు.

విశే. తనశృంగారవనంబులోన, "గిరిప్రాంతన్" అనుపాఠము గాననగును. ఆ పక్షమున, గిరిప్రాంతన్ = క్రీడాశైలప్రాంతమున, అని చెప్పనగు. లేదా శృంగారవనంబులో 'నగరుప్రాంతన్' నగరు = రాజసౌధము, దానిచెంతను' అని యర్థముచెప్పిన బాగు. "నగరి, నగిరి, నగరు," అనువానిలో 'నగరు' అనునదియే యిచ్చో నుచితపాఠమని చెప్పనొప్పును. ప్రకృతిము స్త్రీ తనసౌధమున నుండుటయుం రాజసౌధమునకు నగరుశబ్దము పర్యాయమగుటయును నందులకుఁ గారణములు, 'న, గిరి' అనుపర్వతపక్షపాఠమును, క్రీడాపర్వతములు రాజగృహములఁ గలవని వర్ణించుకవులయాచారముంబట్టి హృద్యమే యగును. కాని 'నగరి' పాఠమున కంతగ సారస్యముగానరాదు. 'పూఁదేనియయేటికాల్వ' అనుటంజేసి యుంద్యానమునందుఁ గలకుసుమవృక్షబాహుళ్యము, నందలిసుమసమృద్ధియుం, నుద్యానపువిస్తృతియు సూచితములు. స్థల ముద్దీపనకరమగుట స్పష్టము.

చ. అలికులరావముల్ గిసలయాకులకోకిలకాకుకాకలీ
కలకలనాదముల్ సెలఁగఁ గమ్మనితమ్మికొలంకుతెమ్మెరల్
వొలయఁగఁ దొంటిచందమున బుద్ధికినేమియు నింపుగామికిం
గలఁగుచు సత్యభామ చెలిఁ గన్గొని యించుక సంశయించుచున్. 72

టీ. అలికులరావముల్ = తుమ్మెదమూఁకలరొదలు, కిసల...నాదముల్ - కిసలయ = చిగురులయందు, ఆకుల = చెదరియున్న, కోకిల = పికములసంబంధమైన, కాకు = భిన్నధ్వనులతోనొప్పు, కాకలీ = సూక్ష్మమగు నవ్యక్తమధురధ్వనులయొక్క, కలకలనాదము = కలకలధ్వనులు, చెలఁగన్ = ఒప్పఁగా, కమ్మని = సుగంధములైన, తమ్మికొలంకుతెమ్మెరల్ = పద్మములుగలసరస్సునకు సంబంధించినగాలులు, పొలయఁగన్ = వ్యాపింపఁగా, తొంటిచందమునన్ = పూర్వమువలె, బుద్ధికిన్ = మదికి, ఏమియున్ = ఒక్కించుకయు, ఇంపు = మనోహరము, కామికిన్ = కాకుండుటకు, కలఁగుచు = కలఁతనందుచు, సత్యభామ, చెలిన్ = చెలికత్తెను, కన్గొని = కాంచి, యించుక = కొంచెము, సంశయించుచున్ = సందియమందుచు, ఉత్తరపద్యముతో నన్వయము.

భా. సత్యభామ తుమ్మెదలగానములును, చిగురులం దిని మధురముగఁ గూయు కోకిలధ్వనులును, చల్లనికమ్మగాలులును దనకుఁ దొల్లింటిచందమునఁ గొంచెమైనను హాయి పుట్టింపమిఁ జెలిరామి నేలాకో యని డెందమున సందియమందుచుండెను.

వి శే. తుమ్మెదలపాటలు, కోకిలలకూజితములు, కమ్మనిగాలులు మనోరంజకము లగుట ప్రసిద్ధము. గాలికి శైత్యసౌరభ్యమాంద్యములం గూర్చుట కవులయాచారము. ఇందు కొలంకు తెమ్మెరలనుటచే శైత్యమును, 'కమ్మనితమ్మి' యనుటచే సౌరభ్యమును, పొల యుననుటచే మాంద్యమును సూచితములు.

చ. అకట! యదేమియో యెఱుఁగనయ్యెదఁ దొయ్యలి దక్షిణాంసచూ
చుకనయనప్రకంపగుణసూచన లేమియు వల్లగావు సా
రెకు మది జాలి వొంది యొకరీతిఁ దలంకెడుఁ బ్రాణనాథుఁ డొం
డొకచపలాక్షిఁ గూడి ననునొల్లనిచెయ్దము లేమి సేసెనో. 73

టీ. అకట=అయ్యో! ఇది సంతాపసూచకము. అది, ఏమియో, ఎఱుఁగనయ్యె దన్ = తెలిసికొనఁదలంతును. తొయ్యలి! దక్షిణాంస...సూచనలు_దక్షిణ = కుడిదైన, అంస=భుజముయొక్కయు, చూచుక=స్తనాగ్రముయొక్కయు, నయన = నేత్రము యొక్కయు, ప్రకంపగుణ=అధికచలనగుణముయొక్క, సూచనలు = జాడలు, ఏమి యున్ =ఇంచుకైనను, వల్లగావు=మంచివిగావు. సారెకున్ =మాటిమాటికి, మది=మనస్సు, జాలి=విచారమును, పొంది=అంది, ఒకరీతిన్ =ఒకవిధముగా, తలంకెడున్ =భయపడును, ప్రాణనాథుఁడు=ప్రాణేశ్వరుఁడగుకృష్ణుఁడు, ఒండొకచపలాక్షిన్ =వేఱొకచంచలాక్షిని, కూడి, ననునొల్లనిచెయ్దములు=ననువలవనిచేష్టలను, చేసెనోయేమి=చేసియుండునో?

వి శే. 'దక్షిణాంసచూచుకనయన' అనుదానిలోని దక్షిణపదమునకు 'అంస, చూచుక, నయన' అనుమూఁడుపదములతోడను సంబంధమును గల్పింపవలెను. స్త్రీలకు దక్షిణభాగమునందలి యీయంగము లదరుటయుఁ, బురుషులకు వామభాగమునందలి యివియదరుటయు నశుభసూచక మనునభియుక్తోక్తి ననుసరించి, సత్యభామ తలఁకెనని గ్రహించునది. మఱియు నశుభమురానున్నపుడు మది విన్నఁదనమునంది సంతోషముకల్గి యుండకుండుటయు, నెట్టిమనోహరవస్తువును మనోరంజకము గాకుండుటయు, మదిలో భయము పొడముచుండుటయు సహజములు. ఇందుఁ బ్రథమపాదమున 'నయ్యెద ననుచో నియ్యెడ' ననియున్న లెస్స.

క. అని సత్యభామ తనవిధ
మనుఁగుందొయ్యలికిఁ జెప్పునవసరమునఁ జ

య్యన వచ్చి యొక్క నెచ్చెలి
కనుఁగవ నెఱసంజ వొడమఁగా నిట్లనియెన్. 74

టీ. తనవిధము=తనరీతిని, అనుఁగుందొయ్యలికిన్=గారాబుచెలికి, చెప్పనవసరమునన్=చెప్పెడుసమయమున, చయ్యన = వేవేగ, నెచ్చెలి=చెలికత్తె, కనుఁగవన్ = నేత్రద్వంద్వమునుండి, నెఱసంజ=సంపూర్ణసంధ్యాకాలము, లేక నేత్రద్వంద్వమునం దెఱ్ఱనిసంధ్యయనియైన చెప్పనగు. కాని నేత్రములనుండి సంపూర్ణసంధ్య పొడమెనను టయే కనులందలి యత్యధికారుణ్యమును దెల్పునని తోఁచెడిని. పొడమఁగాన్=పుట్టఁగా, ఇట్లు, అనియెను=పలికెను.

వ్యా-విశే. కనుఁగవన్=కనుఁగవనుండి. వలన కాదేశంబగు. ద్వితీయాసప్తముల మీఁది యండికి లోపము బహుళముగఁ గల్గును. 'విచ్చేయు మదితిగర్భము వెలువడి' ఇత్యాదులు కవిప్రయోగము లిట్టివి గలవు. అంద్వితరసప్తమ్యర్థములమీఁదనుండు ఉండి పదమునకుమాత్రము లోపము గలుగదు. శ్రీకృష్ణుఁడు పారిజాతమును రుక్మిణి కొసంగుటయుఁ బిదప నారదుఁ డాత్మసఖిని బెక్కుగతులఁ దూలనాడుటయుఁ నెచ్చెలికను లరుణములగుటకుఁ గారణములని గ్రహించునది. సంజ. ప్ర. సంధ్య.

క. అమ్మా! యే మని చెప్పుదు, నెమ్మి న్నీవిభుఁడు రుక్మిణీసతిమణిసౌ
ధమ్మున నుండఁగ సురముని, గ్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చుటికిన్. 75

టీ. అమ్మా!=తల్లీ! ఇది ప్రేమసూచకము. ఏమి అని చెప్పుదును=ఏమని పలుకుదును? నెమ్మిన్ = అనురాగముతో, నీవిభుఁడు = నీప్రాణేశుఁడు, రుక్మిణీసతిమణిసౌధమ్మునన్=రుక్మిణీదేవియొక్క మణివికారమైన మేడయందు, ఉండఁగన్=నివసించియుండఁగా, సురముని=దేవముని యగునారదుండు.

వ్యా-విశే. ద్రుతంబునకు సరళస్థిరంబులు పరములగునపుడు లోపసంశ్లేషములు విభాషనగు. నెమ్మిన్నీధవుఁడు. ఈపద్యమున 'క్రమ్మఱన్' అనుపదమునకు 'మఱలన్' అనునర్థము ప్రసక్తముగామి సారస్యము విచార్యము.

క. చనుదెంచి యమ్మురారికి
ననఘమ్మమరైకయోగ్య మతిసౌఖ్యకర
మ్మనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్కదివ్యకుసుమ మ్మొసఁగెన్. 76

టీ. చనుదెంచి=వచ్చి, అమ్మురారికిన్=ఆకృష్ణునకు, అనఘమ్ము=పుణ్యమైనదియు, అమరైకయోగ్యము=దేవతలకే ముఖ్యముగాఁదగినది, అతిసౌఖ్యకరము=మిగుల సుఖ

ముల నొసంగునది, అనితరసులభము=ఇతరులకుదుర్లభము, ఇది = ఈదివ్యసుమము, అని, కొనియాడుచున్=పొగడుచు, ఒక్కదివ్యకుసుమమ్మును = ఒకానొక దేవతాకుసుమమును, ఒసఁగెన్=ఇచ్చెను.

విశే. విష్ణునకుఁ జెందునామములన్నియుఁ గృష్ణునకు వాడుట యాచారము. ఇందలి విశేషణములు నాల్గును సుమప్రభావద్యోతకములు.

క. మిన్నంది వేగ గయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిఁ దాల్చెన్. 77

టీ. మిన్ను=ఆకాశమును, అంది=పొంగి, (ఉప్పొంగి) వేగ = త్వరగా, కయికొని=స్వీకరించి, కన్నులన్ ఒత్తికొని=కన్నులనద్దుకొని, భక్తిపూర్వకపరిగ్రహసూచకము. మ్రొక్కి=నమస్కరించి, గారవము ఒసఁగన్=గౌరవమొప్పఁగా, వెన్నుఁడు = కృష్ణుఁడు, రుక్మిణికిన్, ఒసఁగెన్=ఇచ్చెను. అన్నెలఁతయు=ఆమెయు, కొప్పులోనన్= ధమ్మిల్లములో, అవ్విరిన్=ఆకుసుమమును, తాల్చెన్=ధరించెను.

వ్యా-విశే. గారవము. ప్ర. గౌరవము. వెన్నుఁడు. ప్ర. విష్ణుఁడు. మిన్నందుటయుఁ గన్నుల నొత్తికొనుటయు, నపూర్వసుమలాభసంజనితసంతోషమునకును, భక్త్యతిశయయుతపరిగ్రహమునకును, సుమమదృష్టపూర్వతేజోభరముకల్మి మనోహరమగుటకును సూచకములు. ఇట్లు కుసుమసంబంధమగునుత్కృష్టతను సూచించి 'గారవమెసఁగన్' వెన్నుఁడు రుక్మిణి కొసఁగెనని చెప్పుచుఁ గృష్ణునకుఁ గల రుక్మిణియందలి యత్యనురాగమును వెల్లడించెను.

తే. అంతలోనన యద్భుతం బావహిల్లఁ
గొలఁది యిడరాని యొకవింత చెలువు గలిగి
రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁబట్టిన మకరాంకుశస్త్ర మనఁగ. 78

టీ. అంతలోనన, అద్భుతము=ఆశ్చర్యము, ఆవహిల్లన్=సంధిల్లఁగా, కొలఁది = పరిమితి, ఇడన్=ఉంచుటకు, రాని=వీలులేని (ఇంతింతనరాని), ఒకవింతచెలువు = ఒక యపూర్వమగుచక్కఁదనము, కలిగి, రాజబింబాస్య = చంద్రబింబమువంటిమోముగల, రుక్మిణి, సానన్=నూఱురాతియందు, పట్టిన=నూరిన, మకరాంకుశస్త్రము = మన్మథుని బాణము, అనఁగన్=అనునట్లు, ఇది యుత్ప్రేక్షావాక్యము. తేజరిల్లెన్ = ప్రకాశించెను.

భా. అకుసుమము నొదలదాల్చినతోడనే యామె యొకయపూర్వలావణ్యము కల్గి సానఁబట్టిన మన్మథునిబాణమో నా నొప్పెనని భావము.

వి శే. "కుసుమమును బువ్వుమాత్రమని భావింపకుము. దానిం దలధరించుటకతన నీసవతి కపూర్వసౌందర్యముకల్గె. సానతీరిన మన్మథబాణమో నా నామె యొప్పుటంజేసి యామెయే యింక మన్మథబాణముచేయుపనిని జేసి ప్రియుని యనురాగముంజూరగొను. నీసౌందర్య మింక నెందులకును బనికిరాదు" అని వ్యంగ్యవృత్తిని జెలికత్తె సత్యకసూయ నుదయింపఁజేయ యత్నించుచున్నది.

ఉ. ఆకుసుమంబు దాల్చినమహామహిమంబునఁ దోడికామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁ దొఱంగి భజించుచుండ న
స్తోకనిజప్రభావములు సూపెడు గద్దియమీఁద నెక్కి ము
ల్లోకము దాన యేలుగతి లోలవిలోచన యేమి సెప్పుదున్. 79

టీ. లోలవిలోచన=ఓచంచలాక్షీ! ఆకుసుమంబుదాల్చినమహామహిమంబునన్ = ఆపారిజాతపుష్పముధరించుటవల్లనైన గొప్పమహిమచే, తోడికామినీలోకము=తనతో సదృశలగుస్త్రీజనులు, (సపత్నులు) మచ్చరంబున్=మాత్సర్యమును, తొఱంగి = విడిచికొని, భజించుచుండన్ = సేవించుచుండఁగా, గద్దియమీఁదన్ = ఆసనముపై, ఎక్కి, అస్తోకనిజప్రభావములు-అస్తోక=అధికమైన, నిజ=తనవైన, ప్రభావములు=ప్రాభవములను, ముల్లోకము=మూఁడులోకములను, తాన=తానే, ఏలుగతిన్ = పాలించురీతిని, చూపెడున్=అగపఱిచెడును.

భా. ఆపారిజాతపుష్పమును దాల్చుటకతన సవతులెల్లరును మచ్చరమును విడిచికొని రుక్మిణీపాదసరోజముల సేవించుచుండ, రుక్మిణి గద్దియ నధిరోహించి యీజగత్త్రయంబును దానె బాలించురీతిఁ దనప్రాభవమును గనపఱచునని భావము.

వి శే. సవతులెల్లరును రుక్మిణీపాదసరోజముల మచ్చరమునువీడి సేవించుచుండిరనియు, నస్తోకనిజప్రభావములు గద్దియమీఁదనెక్కి చూపెడుననియు ననుటచే, నీవును నట్లింక సేవింపవలసినదేయనియు, నింక నీప్రాభవ మొకమూలఁబడవలసినదే యనియుఁ, జెలి సత్యకు వ్యంగ్యమర్యాదం దెలిపెను. మఱియు నిట్టిమహిమం దనరారుసుమరాజము నీకు లభింపకపోయెఁగదా యనియుం మొత్తముమీఁద బోధించెనని గ్రహించునది. 'లోలవిలోచన' ఇది సత్యనుగూర్చి నిల్పఁబడినసంబుద్ధి యనుపక్షమున చెలిచెప్పెడు మాటలవలన భీతి యుదయించెననియుఁ దన్మూలమునఁ జంచలనేత్ర యయ్యెననియుఁ గ్రహింపవలయును. లేక దానికి రుక్మిణియే యర్థమగునెడలఁ దనప్రాభవముం జూట్టు

పట్టులనున్నవారలకుం జెల్వొట్లకై సొగసుగనేత్రములం ద్రిప్పుచుఁ గలయఁ దిలకించు చుండెనని గ్రహింపవలెను. ఎట్లైనను నీపదము సాభిప్రాయమే యగును.

వ్యా-విశే. మచ్చరము. ప్ర. మత్సరము. ముల్లోకము.—సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డుజ్వర్ణకమునకు లోపంబును మీఁదిహల్లు నకు ద్విత్వంబునగు. ఒక్కొ-కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబునగు.

ఉ. ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
*వంతుకు వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్లదటంచు మానినీ. ౬౦

టీ. ఎంతకులేఁడు=అంతకుముగలఁడనుట. (అనఁగా నెంతలేసి సాహసకార్యముల నైనను జేయఁగలఁడని భావము) పలికెన్ కూర్చుదానన్ = భర్తకు మేలుకూర్చుదానను లేక ప్రియపడుదానను (ప్రియవాల్లభ్యముగలదాన ననుట) అహంకృతిన్=గర్వముచే, విఱ్ఱవీఁగుచున్=మిగుల గర్వించుచు, వంతుకున్=పోటికివచ్చు (పోటిచేయు), సత్యగరు వము=సత్యభామయొక్క- గొప్పందనము, ఇఁకన్, చెల్లదు=కొనసాగదు.

భా. నారదుం డెంతలేసి సాహసకార్యములనైనను జేయఁగలండు. నీచెలి నగు నేను వినుచుండ నీసవతియగురుక్మిణి వినుచుండ, "నేనెంతయు ప్రియవాల్లభ్యముగల దానను. నాయంతటివారు లేరు. అని యహంకారమున సత్య సర్వదా మిగుల గర్వించును. దానిగొప్పందన మింక సాగదు" అని పల్కె-ను.

విశే. ఇందు 'వంతున' అని యొకపాఠ మగపడును. అపుడు 'వంతున' అను దానికి సామ్యము విషయమున నని యర్థము చెప్పనగును. అనఁగా సామ్యమునకువచ్చు 'సాటికివచ్చు' అని యర్థము. మఱియుఁ బైనివ్రాసినట్లు పోటిసేయువిషయమున వచ్చు ననియు చెప్పనగు. అనఁగాఁ బోటిసేయుననని భావము. ఇచ్చో, "వంతుకువచ్చు=అతి ప్రౌఢిమతో మెలంగు" అని యర్థము కొందఱు చెప్పుదురు. అదియుం 'పోటీచేయు' అనునర్థమునుండి వచ్చినభావార్థ మని తోఁచెడిని. ఇఁక 'వంతకువచ్చు' అనుదానికంటె 'వంతున' అనునదియే సాధుపాఠమని కొందఱందురు. 'వంతుకు' అనుచో నగాగమము రాకుండుటం జేసియే యసాధు వనవలెనుకాని యిట్టి ప్రయోగము లనేకము లగపడుట నద్దానిం దప్పుగాఁ దలఁపరాదు. కాన నసాధువనువారిమత మేమో తెలియరాదయ్యెను.

* వంతునవచ్చు, పా. అ.

విశే. నారదునిసాహసము సత్యాసఖి వినుచుండఁ గృష్ణుఁడు వినుచుండ, సత్యభామను నిందించుటవలననే తెలియనగును. 'మానిని' అనుసంబుద్ధి సాభిప్రాయమని యెఱుంగునది. "నీవభిమానవతివిగాన, నీయవమానము నెట్లు సహించెదో? శీఘ్రము యీయవమానముం దీర్చికొనఁ గడంగుము." అని చెలి సత్యను బ్రోత్సహించెనని తెలియునది. శౌరి వినంగ ననెననుటచే, ఈమాటలు శౌరికిఁగూడ నిష్టములయ్యెనని సూచించుటకని గ్రహించునది. రుక్మిణీకాంతవినంగ ననుటచే, నీసవతిముందర నీకవమానముగల్గెనని తెల్పుటకని తెలియవలయును. 'కూర్చు' దీనికి మేలును జేకూర్చు అనునర్థమున భారతమునఁ బ్రయోగములు గననగును.

క. ఆరణభోజనుమతకము, లారుక్మిణినటన లామురాంతకుచెయ్వుల్
చేరి కనుంగొనుచోనె, వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా! 81

టీ. ఆరణభోజనుమతకములు=ఆకలహభోజనుఁడు నారదునియొక్క మాయలు, ఆమురాంతకుచెయ్వుల్=అమ్మురద్వేషియగు కృష్ణునియొక్క కార్యములు, ఆరుక్మిణినటనలు=ఆరుక్మిణీదేవిప్రవర్తనములు, వారిజనేత్రా = పద్మములంబోలు కన్నులుగలదాన. సంబుద్ధి.

విశే. "దగ్గరనుండి చూచిన నాకే కోపముగలిగెను. నీకుఁ గోపము గలుగకుండునా? నీవు చూడలేదుగాని చూచినచో నెంత మండిపడుదువో" అని చెలి సత్యకుఁ గోపోద్రేకమును గలిగింపఁ బ్రసంగించెను. మఱియు, మొట్టమొదట నారదుఁడు కపటంపుమాటలాడి మాయచేసెననియుఁ, గృష్ణుఁడు తదనుసారముగ మెలంగెననియుఁ, బిదప రుక్మిణి తననిండుఠీవిం జూపెననియుఁ, జెలి సత్యకుఁ దెల్పి మువ్వురివలనితప్పును సూచించెనని తోఁచెడిని. 'వారిజనేత్ర' అనుపద మచ్చెరువున ఱెప్పవేయక సత్య కాతరయైచూచుటను సూచించుటను సాభిప్రాయమని యెఱుంగవలయును.

సత్యభామ చింతనొందుట.

చ. అన విని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి హె
చ్చినకనుదోయికెంపు దనచెక్కులఁ గుంకుమపత్త్రభంగసం
జనితనవీనకాంతి వెదచల్లఁగ గద్గదఖిన్నకంఠి యై. 82

టీ. వ్రేటు=దెబ్బను, వడ్డ=పొందిన, ఉరగాంగనయుంబలెన్=ఆఁడుపామువలె, భగ్గు+అనన్, ఇది యాకస్మికముగ మండుమంట కనుకరణము. భగ్గుమనట్లుగా, దరికొన్న = మండునట్టి, భీషణహుతాశనకీల = భయంకరమైన యగ్నిహోత్రజ్వాల,

హెచ్చిన=అధికమైన, కనుదోయికెంపు=రెండుకన్నులయొక్క యెఱుపు, తనచెక్కుల౯=తనకపోలముల, కుంకుమపత్ర......కాంతి౯-కుంకుమపత్రభంగ=కుంకుమము చేసిన మకరికాపత్రరచనలచే, సంజనిత=పుట్టినట్టి, నవీనకాంతి౯=క్రొందళుకును, వెదచల్లఁగ౯=వ్యాపింపఁజేయఁగా, గద్గదఖిన్నకంఠియై=డగ్గుత్తికచే సన్నగిల్లినయెలుంగుగలదై, ఉత్తరపద్యముతో నన్వయము.

భా. చెలి యట్లుచటివృత్తాంతముం దెలుప దండతాడితభుజగివోలె నేయిపోయ భగ్గనిమండు భయంకారాగ్నిజ్వాలవలె లేచి కనులందైన యరుణకాంతిఁ జెక్కుల వ్యాపించి కుంకుమరచితములగు మకరికాపత్రరచనలయందము నావహిల్లంజేయ డగ్గుత్తికచే నెలుంగు డీలుపట ని ట్లనెను.

వి శే. సహజముగ సత్య మానిని. ఆపైఁ బ్రియుఁడు వేఱొకతెంగూడి యొల్లని చెయ్దములు తన్నుగూర్చి చేసెనేమో యని యపశకునములంబట్టి యనుమానించునది. ఇంతఁ జెలి పారిజాతసుమచరితమును నామెమనం బెరియునట్లు విన్నవించినది. ఈవిన్నపము ప్రియకృతస్వవిషయకానిష్టము ననుమానించుచు నురగాంగనంబోలు సత్యకుఁ దాడనసదృశంబయ్యెను. అట్లే ప్రియుఁడు తన్నుఁగూర్చి యనిష్టము నొనర్చెనేమోయని యనుమానించుచు మండిపడునగ్నిహోత్రజ్వాలంబోలు సాత్రాజితి కివ్వార్త నేయివంటి దయ్యెను. ఆఁడుపామునకు సాహసమెక్కుడగుటను స్త్రీవిషయకోపమ యగుటను, 'ఉరగాంగన, కీల' అను స్త్రీలింగపదములు ప్రయుక్తములయ్యెను. నారదప్రసంగమును, శ్రీకృష్ణునిచెయ్దములును, రుక్మిణినటనలును సత్యకుఁ గన్నుల నెఱుపు నావహిల్లఁజేసెనని యెన్నవలయును. కోపముచే నారక్తనేత్రయయ్యెనని గ్రహించునది. చెలిచెప్పిన ప్రసంగము వినుటకతన, భయదుఃఖములు పెనఁగొనెననియుఁ, దస్మూలమున డగ్గుత్తికచేఁ గంఠస్వరము క్షీణించెననియు నెన్నఁదగును. మోము పైకెత్తి చూచినచో దృష్టులు చెక్కులపైఁబడుట సంభవింపదు. కుంకుమరచనలభంగి నెట్టనిచూపు చెక్కుల నెలకొల్పు ననుటం జేసి మోము వాంచి దృష్టిని గ్రిందుగాఁ బ్రసరింపఁజేయుటను సూచించెడిని.

శా. ఏమేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాట ల్చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డేమేమాడెను రుక్మిణీసతియు నీవింకేటికి౯ దాఁచెదే
నీమోమోటలు మాని నీరజముఖి! నిక్కం బెఱింగింపవే. 83

టీ. కలహాశనుఁడు = జగడమే భోజనముగాఁగల నారదుఁడు, ఆగోపికావల్లభుఁడు=ఆప్రేతలమగఁడు, నీమోమోటలు=నీదాక్షిణ్యములు, నీరజముఖీ=పద్మమువంటి మోముగలదాన, నిక్కము=నిజము, ఎఱింగింపవే= తెలుపవే.

వ్యా-విశే. జగడమే తిండిగాన నాతఁడట్లే యాడునని 'కలహాశన' పదము సాభిప్రాయము. ముగ్ధలగుగోపికలంగూడుగొల్లఁడుగాన నన్మాట నాదరమున వినెనని గోపికావల్లభపదము సాభిప్రాయము. చెవియొగ్గి వినెననుట నాదరాతిశయశ్రవణ సూచకము. చెలికాన, మోమోటమిఁ జెప్పుటకు జంకునేమో యని సత్య యూహించి 'మోమోటమి మాని' అనిపల్కె. ఏమేమి.—సంభ్రమమున ద్విరాభావము. అచటి కై.—షష్ఠ్యర్థమునఁ జతుర్థి.

చ. అతులమహానుభావ మని యవ్విరిఁ దా నొకపెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చెకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చెఁగాక
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్. 84

టీ. అమ్మతకరివేలుపుందపసి=అమ్మాయావియైనసురముని, అతులమహానుభావము=సాటిలేని గొప్పప్రభావముగలది, అని=పల్కి, అవ్విరిన్=అపుష్పమును, తాను, ఒక పెద్దచేసి=ఒకానొకగొప్పవస్తువుగానొనర్చి, ఇచ్చకము=ముఖస్తుతివలనిప్రేమ, ఒదవన్=ఉద్భవించునట్లుగ, సూడిద=కానుక, ఇచ్చినన్ ఇచ్చెఁగాక = ఒసంగిన నొసంగనిమ్ము. తాను, అతఁడు=ఆశ్రీకృష్ణుఁడు, ప్రియంబు=ప్రీతి, కల్గునెడకు=ఉన్నచోటికి, అర్పణ=ప్రదానము, చేసినన్ చేసెఁగాక=ఒనర్చిన నొనర్పనిమ్ము. అచ్చటన్ = ఆచోటను, మమ్మున్=నన్నును, తలంపఁగనేల=తలవనేల.

భా. అవ్విరిం గొప్పవస్తువుగా వర్ణించి మహామహిమాన్వితమని యిచ్చకమునకై నారదుండు కృష్ణున కిచ్చునుగాక. ఆతఁడును దనకుఁ బ్రియమైనవారి కద్దాని నొసంగుఁగాక. కాని యామాయజడదారి మమ్మేల యచ్చోఁ దలంపవలెను?

వ్యా-విశే. పుష్పమునందలి యనాదరమును సూచింప ఒకపెద్దచేసెనని యనెను. సవతిసంబంధమగుపేరును నోటఁబల్కుటగూడ నిష్టముగాకుండుటను దెలుపుటకై ప్రియంబుగల్గునెడ కని వాక్రుచ్చెను. స్వాభిమానాతిశయమును సూచింప 'మమ్ము' అని ప్రయుక్తమయ్యెను. "ఇచ్చిన నీవచ్చును, సమర్పణచేసిన చేయవచ్చును. మమ్ముఁదలఁపనేల." అనుపదములజాడంబట్టి తన్ను సవతిదరిని మాయజడదారి తలంచుటయే సత్యకమ్మూఁటిలోనెంతయుఁ గష్టముగాఁ దోఁచెనని తెలియును. 'అర్పణచేసెను' అనుపదముగూడ సత్యాసూయను వెల్లడించును. మతకము+అరి. మతుబర్థకమున నరివర్ణకము. ములోపము. అర్పణచరిత్ర మున్నగువానికివలె దీనికిఁ బ్రథమైకవచనలోపము కల్గెను.

క. పలుదెఱఁగుముల్లమాటలు
కలహామె కల్యాణమని జగంబులవెంటన్

మెలఁగెడుమౌనికి సహజము
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్. 85

టీ. పలు తెఱఁగుముళ్లమాటలన్=అనేకవిధములగుముడిపెట్టు (కలహముపెట్టు) మాటలచేనైన, కలహమె=జగడమె, కల్యాణము=శుభము, జగంబులవెంటన్=లోకములవెంటను, మెలఁగెడు=సంచరించెడు, మౌనికి, సహజము=స్వభావసిద్ధము. వలదు=వద్దు (కూడదు) అని, వల్లభుఁడు=పతియగుకృష్ణుఁడు, వారింపన్=అడ్డుపెట్టుటకు, వలదె=యత్నింపవద్దె.

భా. జగడములుపెట్టుచు లోకములం ద్రిమ్మరుట నారదునకు సహజము. విభుఁడగు శ్రీకృష్ణుఁ డమ్మాటలఁ జెవియొగ్గి వినుట తప్పుగాదె? నాయెదుట నట్లాడరాదనిన నాతఁ డాగలిననునే? కాన నిందు శ్రీకృష్ణునిదే తప్పని భావము.

వ్యా-విశే. ఒకరిమాటకును వేఱొకరిమాటకును ముడివెట్టుమాటలే ముళ్లమాటలని యెన్నవలయును. ముళ్లు.— ముడి+లు. ఇత్తునకు బహువచనంబు పరంబగునప్పు డుత్వంబగు. 'ముదులు' బహువచనము పరమగునపుడు డ ల ట ర ల యుత్వమునకు లోపంబు బహుళంబుగానగు. బహువచనశ్లిష్టంబులై యద్విరుక్తంబులైన డకార లకారంబుల కలటు లకారంబు నిత్యంబుగానగు. ముళ్లు. ఇందు 'జగంబులవెంటన్' జగములవేఁటనుగూర్చి అనఁగా "గలహముపెట్టి లోకములఁ బీడింపఁగా" అనియైనను జెప్పనొప్పునని తోఁచెడిని. ముడి.—నానా. కలహము. బంధము.

క. ముని యేమి సేయు? రుక్మిణిఁ
గొనఁ గారణ మేమి ధూర్తగోపాలుఁడు సే
సినచెయిదమేమి చెప్పుదు?
మన మెరియదె ప్రాణ మైనమగఁ డిట్లయినన్. 86

టీ. ముని, ఏమి, సేయున్ = నారదుఁడేమిచేసెను. రుక్మిణిన్ = రుక్మిణీదేవిని, కొనన్=నిందింపఁగా, కారణమేమి=హేతువేమి? ధూర్తగోపాలుఁడు = మోసకాఁడగు పసులకాపరి, చేసినచెయిదము=ఒనర్చినచేష్టను, మనము=మనస్సు), ప్రాణమైనమగఁడు=జీవమే యగుపతి, ఎరియదె=మండదె?

భా. నారదుఁడేమిచేసెను. అతనికిఁ గలహమె కల్యాణమగుట నాతనిపైఁ దప్పు మోపరాదు. శ్రీకృష్ణుఁడు పారిజాతము నొసంగెనుగాన, రుక్మిణి స్వీకరించెను. దాన నామెనుగూడ నీవిషయమున నిందింపఁబనిలేదు. ఆడినమాటలఁ జెవియొగ్గి యాలకించుటయు, సుమము నద్దేవి కర్పణసేయుటయుఁ, గావించినయాపసులకాపరినే నిందింపవలెను. ప్రాణమే యగుపతి యిట్లొనర్చిన మది మండకుండునా?

వ్యా-విశే. మోసకాఁడును బసులకాపరియుఁ గావుననే యీవిషయమున నౌచిత్యముం గనలేకపోయెనని ధూర్తగోపాలపదము సాభిప్రాయము. భార్య, పతికర్ధశరీరయగుటను, దనశరీరము పతిశరీరార్ధమే యగుటను, భర్త భార్యకుఁ బ్రాణమే యగును. ఈపద్ధతి ననుసరించియే భర్త చనిన భార్యయు నాతనితోఁ జనుట తొల్లింటియాచారమై యుండె. వలదు+ఎ-వలదె. వలయుంధాతు వ్యతిరేకరూపము. రూ. అ. వలవదు.

క. పరికింపరు తమజాడలు
తరుణులతగులములు నమ్మఁ దగదండ్రు మదిన్
శరదంబుదచలచిత్తులు
పురుషులె పో వారినమ్మఁ బోలునె చెలియా! 87

టీ. పరికింపరు = పరీక్షింపరు, తరుణులతగులములు = యువతులయాసక్తులను, నమ్మన్=విశ్వసింపఁగా, తగదు=కూడదు, శరదంబుదచలచిత్తులు=శరత్కాలమేఘముల వలె సంచలించుమనస్సుగలవారు, పురుషులెపో=మగవారలేసుమ్ము. పోలునె=తగునె?

భా. మగవారు తమప్రవర్తనముల మంచిచెడ్డలపరీక్షింపరు. యువతుల యనురాగముల నమ్మకూడదండ్రు. ఇంతియకాని తమప్రవర్తనమునుబట్టియే యువతులవర్తనము నుండుననుకొనరు. నిక్కముగ నాలోచింపఁ బురుషులె మిగులఁ జపలచిత్తులనియుఁ, దానవారి నేవిషయమునను విశ్వసింపరాదనియు, ముమ్మాటి కెంచవచ్చును.

వ్యా-విశే. పరికించు. ప్ర. పరీక్షించు. అనుదురు. అందురు. అండ్రు. అండ్రు.
'పో' 'పొమ్ము' అనుదానిరూపాంతరము. ఇయ్యది నిశ్చయార్థప్రకాశకము.

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలోఁ గడు గారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండి యీ
వన్నెయు వాసియుం దఱిఁగి వాఁడు ననుం దలయెత్తి చూడఁగా
సన్నలఁ జాయలం బలుక నైఁతునె ప్రాణము *లెంత తీపొకో!

టీ. సవతులిందఱిలోన్ = ఇందఱు సపత్నులలో, కడుగారవంబునన్ = మిగుల గౌరవమున, వల్లభుఁడు=ప్రియుఁడు, కన్నులన్ = నేత్రములందు, కప్పుకొనంగన్= మిఱుఁగుపఱచికొనియుండఁగా, అంతటిగారాబమునఁ జూచికొనుచుండఁగా నని భావము. వన్నెయు=అందమును, వాసియు=ప్రసిద్ధియు, తఱిఁగి=తగ్గి, తలలు,ఎత్తి, చూడఁగాన్, ఇది నిర్భయముగఁ జూచుటను దెలుపును. సన్నలన్=సంజ్ఞలచేతను, చాయలన్=జాడలచేతను, ప్రకృతవిషయమున కనుకూలించుగతిని వేఱొకవిషయము నుద్దేశించి పల్కు-

* లింత తీపొకో.

టను జాయలఁబల్కుటగా నెన్నవలెను. పలుకన్, సైఁతునె=సహింతునె? ప్రాణములు ఎంత తీపు ఒకో?=ప్రాణము లెంతమధురములోగదా.

భా. ఇంతకాలము వల్లభుని బలువాల్లభ్యమునకుఁ బాత్రమనై యాతఁ డతి గారాబమున నను జూచుకొనుచుండ సవతులెల్లరలో ఖ్యాతింగాంచితి. ప్రకృతము నను విభుఁ డిట్లవమానించుట వారు నిర్భయముగ ననుఁ గాంచి యాంగికములగు సంజ్ఞల చేతను, గాకిమీఁదను బిచ్చుకమీఁదనుబెట్టి నను నిందింతురు. ఇట్టి యవమానమును నట్టి ఖ్యాతిని గాంచిననేను వన్నెవాసులు తఱుఁగ నెట్లు సహింతు? ప్రాణములపై మక్కువ యెక్కువగుట విడువనైతినిగాని లేకున్న నిపుడె విడిచియుందును.

వ్యా-విశే. సవతి=ప్ర. సపత్ని. గారవము. ప్ర. గౌరవము. కన్నియ. ప్ర.కన్య. రూ. అ. కన్నె. వన్నె. ప్ర. వర్ణము. రూ. అ. వన్నియ. సన్న. ప్ర. సంజ్ఞ. చాయ. ప్ర. ఛాయ. సైఁచుధాతుసంబంధమగు లాడర్థకోత్తమపురుషైకవచనరూపము. సైఁతును. సైఁచు+దు+ను. చువర్ణంబుతోడి దుగకారము తకారంబగు. రూ. అ. సయిఁచు ప్రాణము లెంతతీపొకో.—ఒక్కో, ఒకో, ఒకొ; ఇవి సందేహార్థముం దెలుపునవ్యయములు. సత్యభామానూనాతిశయమును 'సైఁతునె' ప్రాణము లెంతతీపొకో? అనుపదములు సూచింపఁబడియున్నవి

ఉ. నా మొగమోటకై *వలనినాటకముల్ గటియించి రుక్మిణీ
కామినిమీఁదటం గలుగుగౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁ గానసీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చెనో
తామరసాక్షి! మెచ్చవలదా మురదానవభేదికృత్యముల్. 89

టీ. ఓతామరసాక్షి=ఓతమ్మికంటీ! నా మొగమోటకై=నా మోమోటకై, వలని నాటకములు = అక్కఱలేనివర్తనములను, గటియించి = కూర్చుకొని, రుక్మిణీకామిని మీఁదటన్=రుక్మిణీకాంతపై, కలుగుగౌరవమున్ = ఉన్నగారవమును, కృపయున్ = దయయు, ప్రియంబున్=అనురాగమును, తాను, ఏమియున్=కొంచెమైనను, కానసీక= కనుపడనీక, (ప్రకాశముగానీక) ననున్, తేల్చెన్=ఉబ్బఁజేసెను. (సంతోషపెట్టెను.) మురదానవభేదికృత్యముల్ = మురాసురునిజంపిన యాశ్రీకృష్ణుని కార్యములను, మెచ్చ వలదా=శ్లాఘింపవద్దా? ఆతనికుశలవర్తనమున కెంతయు మెచ్చుకొనవలెనని భావము.

భా. నా మోమోటకై యెన్నెన్నో నటనలం గనుపఱచి తనకు రుక్మిణిపైఁగల యాదరమును, దయను, ననురాగము నిసుమంతైనఁ బ్రకాశముగానీక యిచ్చో నిన్ని

* వలయునాటకముల్; వలసినాటకముల్.

దినంబులు నను సంతోషపెట్టెను. ప్రకృత మిట్లొనర్చెను. కావున, నాతని నైపుణవర్తనము లెంతయుం శ్లాఘ్యములు.

వ్యా-విశే. 'వలయునాటకములు' అనియు 'వలసి' అనియుఁ బాఠాంతరము లగపడును. 'వలయునాటకములు=కావలసినవర్తనములు ఆవశ్యకములగు ప్రవర్తనములని భావము. 'వలసి=కావలసి' నామొగమోటకై కావలసి, యనఁగా, నా మొగమోటకై యావశ్యకమగుటచే నని భావము. 'వలని=ఉపాయముతోడి' అనియు 'వలని' అను పాఠమున కర్థము చెప్పనగు. 'రుక్మిణీకామిని' అనుపదము ప్రియసంగమమం దత్యాదరము గలపడఁతి కామిని యగుట సవతిని నిందించుటకును శ్రీకృష్ణున కామెయందలి యత్యనురక్తిని సూచించుటకును నిల్పఁబడినది. గటియించి. ప్ర. ఘటియించి. ఈక.— ఇచ్ఛుధాతుసంబంధమగు వ్యతిరేకార్థకకజెరూపము.

ఉ. ఓచెలి! శౌరి కిచ్చెనఁట యొక్కలతాంతము దెచ్చి నారదుం
డాచపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్విరి యిట్టిమాట లా
హా! చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా
నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయి నున్నదాననో. 90

టీ. లతాంతము=పుష్పము, లత తుదినుండునదిగాన నీపేరన్వర్థము. అవ్విరిన్=ఆకుసుమమును, ఆచపలాక్షికిన్=ఆలోలనేత్రకు, ఇట్టిమాటలు, ఇట్టి విన సహింపనికష్టపు బలుకులని భావము. మేనన్=శరీరమున, ప్రాణములు=జీవముల (అసువుల), తాల్చెదన్=ధరించెదను. ఇంతగాన్=ఇంతటియవమానము సంభవించునట్లుగా నని భావము. నోఁచితిని=నోమునోచితి ననుట. ఇంకన్=మీఁదను, ఎమ్మెయిన్=ఏవిధముగా, ఎట్టివి = ఎట్టి పరాభవములను, కనుంగొనన్=కాంచుటకు, ఉన్నదాననో=జీవించియున్నదాననో.

వ్యా-విశే. ఆ+విరి=అవ్విరి. ఆహా.—సంతాపసూచకావ్యయము. మేనునన్.—ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబగు. 'మేనన్'. చెవుల వినంబడియుఁ బ్రాణము తాల్చెద. మేన-అనుటంజేసి చెవులఁబడఁగానే ప్రాణముల విడువ పలసినదనియు, 'ఇంక నెట్టివి కనుంగొననున్నదాననో' అనుటంజేసి యింతకుమించిన యవమానము లెన్నికలుగునో యనియు, నవ్వాని ననుభవించుటకే జీవించియున్నదానవని యును, 'ఇంతగానోఁచితిని' అనుటంజేసి నానోముఫల మింతే యనియును నర్థములు స్ఫురించును. వీనిమూలమున సత్యభామాసంబంధమగు కొలఁదిలేనిమానిసిత్వము ప్రస్ఫుటమగుచున్నది. శౌరి, ప్రాణేశుఁడు, పతి మున్నగుపదముల వాడక దీనిని వాడుట యనాదరసూచకము.

క. పూనుకొని మేలుగీళ్లను
లోనయి విహరించువారి లోకమెఱుఁగదో
యానరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగదో కో. 91

టీ. పూనుకొని=యత్నించి (శ్రద్ధవహించి) మేలుఁకీళ్లనుక్ = మేలునకును గీడునకును, లోనయి=లోఁబడి, విహరించువారిక్ = సంచరించువారిని, లోకము = జనము, ఎఱుఁగదో=తెలియదో? ఆనరకాసురదమనుఁడు=ఆనరకాసురునిమర్దించిన శ్రీకృష్ణుఁడు, భోజకన్య=రుక్మిణి (భోజునికూఁతురు.)

భా. ఎవరు మేలుచేయువారో యెవరు కీడుచేయువారో యెవ రేరీతిగ నెవరి విషయమున నుపకారబుద్ధిని బ్రవర్తించిరో యనువిషయములు లోకు లెఱుంగుదురు. మఱియు నేను మేలుచేయుదాననో కీడొనర్చుదాననో యనునంశ మానరకాసురహంత శ్రీకృష్ణుఁ డంతయు నెఱుంగు. ఆభోజసుతయుఁ బూర్ణముగ నెఱుంగును. నేనేల వాని నిపుడు పేర్కొనవలెను?

విశే. ఇందు 'నరకాసురదమనుఁడు, భోజకన్య' అనుపదములు సాభిప్రాయములు. నరకాసురసంహారసమయమునఁ దాను శ్రీకృష్ణునకుఁ గడుంగడుఁ దోడ్పడి మేలుకూర్చుటయుం, నట్టియెడను నక్షత్రియకన్య రుక్మిణి యింటఁ గూర్చుండి తోడ్పడకుంటయును సూచించుచు, సత్య రుక్మిణి నెత్తిపొడుచుచున్నది. మఱియుఁ గృష్ణుఁడును నంతమాత్ర మెఱుంగక నేఁడు వర్తించినవాఁడగుట, నైనవారి కాకులలోను, గానివారికిఁ గంచములలోను బెట్టిన సామెతను జ్ఞప్తికిందెచ్చుచుఁ, దనపతిదగు చేసిన మేలును మఱచుటను నజ్ఞతను బ్రకాశింపఁజేసినది. ఇందలి 'తాను' పదములు నామపునర్గ్రహణంబున నామకుఁ బర్యములగ నభిహితములయ్యె.

ఉ. ఆసరసీరుహాక్షినిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం
జేసి యొసంగెఁ బో తగవు సేకొని యొక్కలతెంత మింతలో
వాసియు వన్నెయుం దగవు వైభవముం జలము న్వివేకముక్
బో సవతు ల్భజించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమిసెప్పుదుక్. 92

టీ. ఆసరసీరుహాక్షినిలయంబునక్=అత్తమ్మికంటియింట, పంకజనాభుఁడు=పద్మము బొడ్డునఁగలవాఁడు, ఉండుటంజేసి=నివసించుటచేత, తగవు=ఔచిత్యమును (తగుట) చేకొని=పట్టి, ఒసంగెఁబో = ఇచ్చెనుజుమ్ము. ఇంతలో = ఈపాటివిషయమునకై, వాసియుక్=గొప్పఁదనమును, వన్నెయుక్=అందమును, తగవుక్=ఔచిత్యమును, వైభవ

ముక్ =ప్రాభవమును, చలమ్మున్ =పంతమును, వివేకముక్ = యుక్తాయుక్తజ్ఞానమును, పోక్ =నశింపఁగా, సవతుల్ =సపత్నులు, భజించుటకుక్ = సేవించుటకై, పోక్ =వెళ్లుటకు, వెఱఁగు=ఆశ్చర్యము, అయ్యెడుక్ =పుట్టెడును.

భా. శ్రీకృష్ణుఁ డత్తమ్మికంటియింట నపుడుంట నక్కుసుమము చిన్నవోవునని యాచితిం బాటించి యామె కొసంగెను. ఇట్టిస్థితిలో నింతమాత్రమున సవతులు తమ యున్నతిని, వైభవమును, మానాదులను నీటఁగలిపి యామెను సేవింపఁబోవుట యేలొకో తెలియకున్నది. పూవు నామె కొసంగుట నాకంతవింతగఁ దోఁపదు కాని, వీరామెను సేవింపఁబోవుటమాత్ర మచ్చెరువుం జేసెడును. సత్యతోడి చేడియ లట్లామెను సేవింపఁ బోవుటను నీచకృత్యముగా నిందెన్నెను. శ్రీకృష్ణుఁ డొనర్చినదానిం దగవనెను.

వ్యా-విశే. ఉండుటం జేసి.—కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకునువలన వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తమగు. 'ఉండుటను' అనుద్వితీయ తృతీయా విభక్త్యర్థకమగుటచే దీనికి 'చేసి' అనునది యనుప్రయుక్తమయ్యెను. పిదప ద్రుతకార్యములు రా 'ఉండుటఁజేసి, ఉండుటంజేసి', అనురూపములయ్యెను. ఇచ్చెనుబో.—బో:-బొమ్ము యొక్కరూపాంతరము. ఇది నిశ్చయానాదరములం దెల్పుచుఁ బదములమీఁద నగును.

క. కలకాల మొక్కగతిఁ బూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనక్
మెలఁగెడు *పురుషుఁడు గలుగుట
తొలుజన్మమునోముఫలము తోయజనేత్రా! (93)

టీ. కలకాలము=ఎల్లపుడు, ఒక్కగతిక్ =ఒక్కరీతిగా, దారంబుమాడ్కిక్ = దారమువలె, సతిమదిలోనక్ =పతివ్రతయగు వనితయొక్క మనస్సులో, మెలఁగెడు = సంచరించెడు, పురుషుఁడు=మగవాఁడు, కలుగుట = సంభవించుట (స్త్రీకి మగఁడగుట) తొలిజన్మము నోముఫలము=తొలిపుట్టువునఁ జేసిన వ్రతముయొక్క ఫలము.

భా. సర్వదా తన్నెడఁబాయక తనమనస్సును దనయధీనము గావించుకొనం గలుగుపురుషుఁడు తొల్లింటిపుట్టువున నెన్నియోనోములు నోచినంగాని యాఁడుదానికి మగఁడుగ దొఱకనేరఁడు. అనఁగా ననుకూలుఁడగుభర్త స్త్రీకి దుర్లభుఁడని భావము.

విశే. 'పూసలలో దారము, తలలో నాలుక,' అనుపదములు నిరంతరసంబంధసూచకములు. వనిత మదికెక్కినపుడే పురుషుఁ డుత్తముఁడును, నాయికానురాగపాత్రుఁడును నగును. మఱియు నట్లు తనమదికి నచ్చినమగఁడు సంభవించినపుడే వనిత

---

* పురుషులు.

పతివ్రతయు నాసతీపాతివ్రత్యము పొగడ్తంగనుటయుఁ బొసఁగును. కావున నిక్కముగ నీరెండును సతీపతుల నుత్తములుగఁ జేయు నుత్తమకృత్యము లనక తీరదు. ఈరెండును లోకమున నొక్కచోనుంట దుర్లభము. ప్రకృతము కొంతకాలము కృష్ణుఁడు సత్య మదిలో మెలంగఁగలిగెను గాని, నేఁటిపారిజాతకుసుమవృత్తాంతముకతన నది పొసఁగ దయ్యెను. దాన నొక్కగతిఁ గలకాలము మెలఁగుట యని సత్య యనవలసివచ్చెను. 'పురుషులు' అని బహువచనపాఠ మగపడు. అద్దానికి సారస్యము చింత్యము. లేదా 'సతి' అనునది 'స్త్రైణము' అనునర్థమున జాత్యేకవచనముగఁ బ్రయుక్తమయ్యెనని తలంపవలసియుండును. పతివ్రతయగుమానిని తనమదిని నిరంతర మెవని స్మరించు వాఁడే యుత్తమపురుషుఁడని తెలుప సతిపదము ప్రయుక్తము. మఱియు సత్యయే తన్మూలముగఁ దనసతీత్వమును వెల్లడించెననియుఁ దోఁచెడిని.

సీ. కలలోన నైన నవ్వుల కైన నామాట
  జవదాఁట వెఱచునో చంద్రవదన!
యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
  యెవ్వారి కొసఁగఁడో యిగురుఁబోఁడి!
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
  లంచంబు లిచ్చునో చంచలాక్షి!
తోడిచేడియలు నాతోడివంతులకు రా
  సయిరింపఁజాలఁడో సన్నుతాంగి!
తే. యరమరలు లేనికూరిమి నసఁగి పెనఁగి
కొదలు దీఱనికోర్కులఁ గూడి మాడి
కపట మెఱుఁగనిమమతలఁ గలసి మెలసి
యున్నవిభుఁ డిట్లు సేయునే యోలతాంగి! 94

టీ. ఓచంద్రవదన=చంద్రబింబమునుబోలు మోముగలదాన, కలలోననైనను = స్వప్నముననైనను, నవ్వులకైనన్=పరిహాసములకైనను, జవదాఁటన్ = అతిక్రమింపఁగా, వెఱచున్=భయపడును, ఏపదార్థంబున్=ఏవస్తువును, పెట్టకమున్న = ఇడకముందు, ఒసఁగఁడు=ఈఁడు, ఇగురుఁబోఁడి = చిగురువలెమనోజ్ఞమైనదాన. లంచంబులు.— తనపనిం జక్కఁబెట్టుకొన నొరునకు రహస్యముగా నొసఁగుధనాదికమును, తోఁడిచేడియలు = సవతులు, వంతులకున్ = సామ్యములకు, (భాగములకు ననియైనఁ జెప్పనగు) అరమరలు=సందియములు లేక భేదములు, కూరిమిన్=చెలిమితో, అసఁగి పెనఁగి=కలసి మెలసి, కొదలు=కొఱంతలు, తీఱని=పోనట్టి, (కొఱంతలింకనుగల్గినట్టివనిభావము)

'అనఁగిపెనఁగి, కూడిమాడి, కలసిమెలసి' జాతీయములగు నీజంటలు సమానార్థకములు. కపటము=కైతవము, మమతలన్=అభిమానములతో, సేయుచునే=చేసెనే!

వ్యా-విశే. పూర్వపద్యమునఁ జెప్పినచొప్పున విభుఁడు తనమదిలో మెలఁగుట నిందుసత్య సూచించుచుఁ, బ్రకృతమున కనుకూలించుగలిని బ్రసంగించెను. స్వప్నమునం గూడ నవ్వులకైనఁ దనమాటమీఱ వెఱచువాఁడు నేఁడు వెఱపించుకేని లేక మెలంగుట కును, నేపదార్థమునైనను మున్నుగ దనముందిడి యితరుల కొసంగువాఁడు నేఁడు తన ముందు మున్నుగఁ బారిజాతము నిడక రుక్మిణి కొసంగుటకును, జెలు లేమి చెప్పుదురో యని లంచము లొసంగునాతఁడు నేఁడు తనచెలి యెదుటనుండఁగనే యట్లు ప్రవర్తించు టకును, దోడిచేడియలు వచ్చుటకు వచ్చునపుడు సైరింపనివాఁడు నేఁడు రుక్మిణీసతిం బెద్దగాఁ దలఁచి పారిజాతసుమప్రదానమున సంభావించుటకును, సెంతయుం నకురక్త దగుపతి యభిమానముఁ బ్రోద్రోచి తన్నును, తనయం దితఃపూర్వముగలయనురాగమును మఱచి యట్లు సవతి కధీనుఁడగుటను సత్య యాశ్చర్యమునందెనని గ్రహించునది.ఇందుఁ జెప్పినచొప్పున మెలంగుపురుషుఁడు సతికి మదిలో మెలంగువాఁడుగాక యన్యుఁ డెట్లు కాఁజాలును? చేయున్=ఏ+చేయునే: తదర్థారకము త్రికాలవాచియగు. తోడిచేడి యలు, తోడన్+చేడియలు 'తోడన్' ఇది యపదమని యనఁగాఁ బ్రత్యయము లోనగునదని శబ్దరత్నాకరము. దీనికిఁ బ్రత్యేకప్రయోగముగలదని ప్రౌఢవ్యాకరణము. సమాసమునందువలెనే 'కూడ' అనునక్షరమునఁగూడ నిత్యముకాదేశమగునని గ్రహింప వలెను.

సీ. కృతకాద్రికందరాకేళీనిగూహనవేళా¹పరస్పరాన్వేషణములు
పోషితమాధవీపున్నాగపరిణయోత్సవకల్పితానేకసంభ్రమములు
చాతురీనిర్జితద్యూతపణాదాన కలితచేలాంచలాకర్షణములు
సాయంసమారంభచక్రవాకద్వంద్వ విరహా²వలోకన³విభ్రమములు
తే. సాంద్రతరచంద్రికా³కేళిచంక్రమములు
విధుశిలామయవేదికావిశ్రమములు
ఫలకచిత్రితనిజరూపభావనములు
మఱచెనో కాక రుక్మిణిమాయఁ దగిలి. 95

టీ. కృతకాద్రి......న్వేషణములు-కృతక=కృత్రిమములైన, (మనుజనిర్మితములు) అద్రి=కొండలయొక్క, కందరా=గుహలయందలి, కేళీ=ఆటలయందైన, నిగూ

1 పరస్పరాన్వేషణములు. 2 విహరణములు. 3 వళీ.

హాన=దాఁగుటలయొక్క, వేళా=సమయములందలి, పరస్పరాన్వేషణములు=అన్యోన్యము వెదకికొనుటలు. (అనఁగా నాగుహలందు దాఁగుడుమూఁత లాడుకొనునపుడొకరినొకరు వెదకికొనుచుండిరనుట) పోషిత......సంభ్రమములు-పోషిత=పెంపఁబడిన, మాధవీ= బండిగురువిందలతకును, పున్నాగ=సురపొన్నవృక్షమునకును, నైన, పరిణయ=పెండ్లి యొక్క, ఉత్సవ=వేడుకలందు, కల్పిత=చేయఁబడిన, సంభ్రమములు=వేగిరపాటులును (మాధవీపున్నాగములఁ బెండ్లి వేడుకలందలి సంభ్రమకృత్యములనుట) చాతురీ......కర్షణములు-చాతురీ = నైపుణిచే, నిర్జిత=గెలువఁబడిన, ద్యూతపణ = జూదమునకైయొడ్డిన పందెపుధనముయొక్క, ఆదాన=పరిగ్రహవిషయమున, కలిత=ఒనర్పంబడిన,చేలాంచల= వస్త్రపుకొనలయొక్క, ఆకర్షణములు=లాఁగికొనుటలు. (పందెపుధనమును బడయఁ జేల చెఱఁగునుబట్టి నిర్బంధించికొనుట యనుట) సాయంస......విభ్రమములు-సాయంసమారంభ=సాయంకాలారంభమునందైన, చక్రవాకద్వంద్వ=జక్కవకవలదగు, విరహ= వియోగముయొక్క, అవలోకన = చూచుటయందలి, విభ్రమములు = విలాసములు, (అనఁగాఁ జక్కవజంటలు భావివియోగమునకై పరస్పరముఁ గలసిమెలసి చింతించుచుఁ దమిఁదీర్చుకొనుచుండ వానిని సానురాగమునఁ గనుచుండిరనుట) సాంద్రతర...... చంక్రమములు-సాంద్రతర=మిగులఁదఱచగు, చంద్రికా=వెన్నెలయందైన, కేళి=ఆటల యందలి, చంక్రమములు=దాఁటుటలు. (అనఁగాఁ బండువెన్నెలలఁ దిరుగుడాటల నాడుకొనుచుండిరనుట) విధుశిలామయవేదికావిశ్రమములు = చంద్రకాంతశిలాప్రచురమైన యరుఁగులందలి కూర్చుండుటలు, ఫలకచిత్రితనిజరూపభావనములు=పలకయందు వ్రాయంబడిన తమతమరూపముల ధ్యానించుటలు. (అనఁగాఁ దమరూపముల ఫలకమునఁ జిత్రించి యాబింబములు లెస్సగ నందముగఁ జిత్రితములైనవో లేవో యని సవిలాసముగ నరయుచుండిరనుట) రుక్మిణీమాయన్=రుక్మిణిసంబంధమగుమాయయందు, తగిలి=చిక్కి, మఱచెనో కాక=విస్మరించియుండునో కాక.

వి శే. 94-వ సీసపద్యపుగీతమునందలియర్థ మీపద్యమున విపులీకరించి వర్ణించి కవి ఆరమరలులేనికూర్మిని, కొదలుతీఱనికోర్కులను, కపటమెఱుఁగనిమమతలను, విశదీకరించినాఁడు.

క. పతి ప్రాణసదృశబంధువు, పతి దైవం బేడుగడయుఁ బతి సతులకు న
ప్పతియ కడు మేర దప్పిన,గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా.

టీ. పతి=భర్త, సతులకు=పతివ్రతలగుస్త్రీలకు, ప్రాణసదృశబంధువు=ప్రాణములతో సమానమైనచుట్టము. పతి, దైవంబు=దేవుఁడు, ఏడుగడయున్=రక్షకుఁడును.

అప్పతియ=అట్టిభర్తయే, కడున్=మిక్కిలి, మేర=హద్దు, తప్పినన్, కులకాంతలకున్=కులపాలికకు, వేఱు=మఱియొక, గతి=త్రోవ, కలదే=ఉన్నదే.

భా. వనితలకుఁ బ్రాణమువంటిచుట్టమును దేవుఁడును సప్తవిధరక్షకులును నగు భర్తయే తానుగాని మార్గమువట్టి జాయను గారించిన నింక నాసలికి వేఱొకగతి లేదని భావము.

విశే. ఏడు+కడ=సప్తవిధమగుదిక్కు. 'గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత,' అని సప్తప్రకారము గలరక్షకము. ఇందు సత్య తనకులకాంతాత్వమును బ్రశంసించికొనినది.

క. ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చుఁ మగఁ డింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె యింక నేటిమాటలు చెలియా!. 97

టీ. ఓర్వంగన్=సహించుటకు, వచ్చున్=వీలగును, చనవు=అనురాగమును లేక చెల్లుబడిని, మనన్=జీవింపఁగా, వచ్చునె=వీలగునె.

వ్యా-విశే. ఓర్వన్+కాన్, ఒర్చు+నుజి 'అగమాన్యచకారముల కద్విరుక్తములకు ముత్తు పరమగునపుడు ప వ ల గు. 'ఓర్వన్' 'కాన్' అగు+ను, అగునకు ననుకనులకు ముజ్జీత్తులు పరములగునపుడు కానాకానలు విభాషనగు, నుజ్యంతంబగు నగుధాతువు, క్రియావిశేషంబులకగు. ఓర్వఁగాన్. రూ. అ. ఓర్వంగాన్. తనకొసంగిన యనురాగములేక చెల్లుబడి రుక్మిణికి పారిజాతప్రసూన మొసంగి తన్ను క్రిందుసేయుటకతనఁ గృష్ణుఁడు పుచ్చుకొన్నయట్లే సత్య భావించెనని గ్రహింపవలయును.

క. అని వగల మిగులఁబొగులుచు, జనితామర మునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచందనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్.

టీ. వగలన్=దుఃఖములచే, మిగులన్=కడున్, పొగులుచున్=పరితపించుచు, లతాంగి=అతివఁబోఁడి, జనితామర్ష మునన్=పుట్టినకోపముతో, కోపసదనంబునకున్=క్రోధాగారమునకు, హరిచందనకోటరమునకున్ = పసుపువన్నెగల చందనవృక్షసంబంధమగుతొఱ్ఱకు, నాగతరుణియుంబోలెన్ = ఉరగయువతివలె (ఆఁడుపామువలె) చనియెను.

విశే. పురుషనాగమునకన్న నాఁడుపాము మిగుల నుద్ధతి కల్గియుండునఁట. అందును బ్రాయముననున్న నాఁడుపాముమాట చెప్పనేల? ప్రకృతము తరుణి సత్య, పారి

జాతసుమవృత్తాంతశ్రవణమునఁ గల్గినక్రోధావేగముకతన నాగతరుణిం బోలియున్నది. సర్పములకుఁ జందనవృక్షకోటరములు నివాసమున కెంతయుఁ బ్రీతిదాయకములు. అచటి గంధమునకు లోనై యయ్యవచ్చో నివసించు. ప్రకృతము సర్పాంగనంబోలు సత్యకు సర్పాంగనకు చందనకోటరముబలెఁ గ్రోధాగారము సంప్రీతిదాయకమయ్యెను. మఱియుఁ జందనగంధఘ్రాణమువలన సర్పమున కుద్ధతి హెచ్చగు. అట్లే సత్యకును గ్రోధాగార వాసము పరితాపాద్యావేగమునే కల్గించునని తేలుచున్నది. క్రోధాగారము రాజగృహములఁ బ్రత్యేకముగ నిర్మితమై యుండునని కావ్యాదులవలనఁ దెలియుచున్నది. ఇందు స్త్రీలే కోపమువచ్చినపుడు వానియందు వసింతురని తెలియవచ్చెడునుగాని పురుషులు నివసించియుండునట్లు తెలియరాదయ్యెను. స్త్రీలుగూడ భర్తలపై నలిగినయపుడే యందు వసించుట కన్పట్టునుగాని యెండొకతఱి నున్నట్లు గానరాదు. కోపముకల్గునపుడు పరిజనము తమస్వామినికిఁ గోపముకల్గినట్లు పోల్చుట కిది యొకచిహ్నము. హరిచందనపదమునకుఁ గల్పవృక్ష మనునర్థమును నొప్పియుంట, భావిసత్యాకల్పవృక్షసమీపగమనము ధ్వనిత మగుచున్నది. అలం. ఉపమ. ముద్ర.

ఉ. మాసినచీర గట్టికొని మౌనముతోడ నిరస్తభూష యై
వాసెనకట్టు గట్టి నిడువాలికకస్తురిపట్టు వెట్టి లో
గాసిలి చీఁకటింటికడకంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగి యె పొరలె గాఢమనోజవిషాదవేదనన్ 99

టీ. మాసిన=మలినమైన, నిరస్తభూషయై=త్రోసివేయఁబడిన నగలుకలదై, వాసెనకట్టు=వాసెనగుడ్డకట్టువంటికట్టు, తలచుట్టును నొకగుడ్డ బిగించికట్టెనని భావము. నిడువాలికకస్తురిపట్టువెట్టి, వెడలుపైన దీర్ఘమైన కస్తూరిపూఁతనుబూసి, తలనొప్పి కలుగునపుడు నొసటవేయఁబట్టువంటిపూఁత. లోగాసిలి=మదిశ్రమనంది, చీఁకటింటికడకంకటిపైన్=చీఁకటింటికొననున్న మంచముపై, జలదాంతచంద్రరేఖాసదృశాంగియై-జలద = మేఘము యొక్క, అంత=నడుమనుండు, చంద్రరేఖా=చంద్రరేఖతో, సదృశ=తుల్యమైన, అంగియై=శరీరముగలదై, గాఢమనోజవిషాదవేదనన్=తీక్ష్ణమైన మన్మథదుఃఖమువలని బాధచే, మౌనముతోడన్=మూకీభావముతో, పొరలెను=దొరలెను.

భా. మాసినచీరను గట్టి, యాభరణములన్నిఁ దీసివైచి, తలకువాసెనకట్టునుగట్టి, తలనొప్పిని సూచించుటకై వెడఁదనిడుపుకస్తూరిపట్టువెట్టి, చీఁకటింటికడనున్న మంచముపై మేఘాచ్ఛాదితచంద్రరేఖంబోలి గాఢమన్మథవేదనం బొరలుచుండెను.

వ్యా-విశే. చీఁకటి+యిల్లు+కడ=చీఁకటింటికడ, ఔపవిభక్తిక మగుటం జేసి 'యిల్లు' శబ్దమునందలి 'ల్లు' అనుదానికి 'ంటి' ఆదేశమయ్యెను. (సమాసమున) 'ఔపవిభక్తిక

షష్ఠ్యాష్టింట్యాదయో భవంతీహ రల్వాదేర్నామ్నాంస్యుస్తేహివిభక్తౌ సమాసే చ' అను చింతామణిసూత్రము ననుసరించి యాపవిభక్తములు సమాసమునఁగూడఁ గల్గునని తెలియుచున్నది. అమర్షవశమునఁ దాల్చినవేషముకతనఁ జంద్రరేఖాసదృశాంగి యయ్యె ననియుఁ, జీఁకటింటనుంట జలదమధ్య చంద్రరేఖంబోలె ననియుం నెన్నవలయును. అలం. ఉపమ. మగనిపై నలుకఁబూనినమానిని యొనర్చుకృత్యము లిందు సహజముగ వర్ణితములు.

చ. బిసరుహపత్త్రలోచనకుఁ బెల్లగు మోహము, సంఘటిల్లె వె
క్కసమగు నెవ్వగల్వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మా
నసమున విన్నఁబాటొదవె నాటెఁ గడుం బరితాపవేదనల్
మసకపుఁబాముకాటుగతి మచ్చరమన్విస మగ్గలింపఁగన్. 100

టీ. బిసరుహపత్త్రలోచనకున్ = ఆపద్మదళాక్షికి, పెల్లు = అధికము, అగు, మోహము, సంఘటిల్లెన్ = కల్గెను. వెక్కసమగు=సహింపరాని, నెవ్వగల్ =పూర్ణమైనదుఃఖములు, పొడమెన్ =పుట్టెను, కంపము=అంగచాంచల్యము, పుట్టెను=సంభవించెను, మేను =శరీరము, చెమర్చెన్ =చెమ్మటపట్టెను, మానసమునన్ =మనస్సులో, దీనికి 'పరితాపవేదన కలిగె' అనుదానితో నన్వయము. విన్నఁబాటు=వైవర్ణ్యము, ఒదవెన్ =సంభవించెను, పరితాపవేదనల్ =సంతాపమువలనిబాధలు, నాఁటెన్ =గ్రుచ్చుకొనెను, మసకపుఁబాముకాటుగతిన్ -మసకము = సంభోగేచ్ఛయను, పాము=సర్పముయొక్క, కాటుగతిన్ = దంశనవశమున (కఱచుటచే నని భావము) మచ్చరమన్విసము = మాత్సర్యమనువిషము, అగ్గలింపఁగాన్ =అధికముగాఁగ, విష మగ్గలించుటకతనఁ బైని నిరూపించినకార్యములు కల్గెనని యెన్నవలయును.

వ్యా-విశే. మసకము+పాము=మసకపుఁబాము. రూ. అ. మసకపుంబాము, నెఱ+పగ, నెవ్వగ. 'మానసమున' అనుదానిని దూరముననున్న 'పరితాపవేదనల్' అనుదానితో నన్వయించుటకన్న 'చెమర్చె మేను మానసమున విన్నఁబాటొదవె' అని పాఠమును గ్రహించి మొగమున వైవర్ణ్యమొదవెననుట సరసమని తోఁచెడిని. 'మచ్చరమన్విసము' అనుచో రూపకము కన్పట్టుటంజేసి తదనురూపముగ 'మసకపుఁబాము' అనుచోఁగూడ 'సంభోగేచ్ఛయనుపాము' అని యర్థము సేయుటయే యుచితము. కామమోహితమగు పాయని యర్థము చేసిన నుత్తరముననున్న 'మచ్చరమన్విస' మనురూపకము నిరాధారమగును. కంపము, స్వేదము, వైవర్ణ్యము. ఇయ్యవి సాత్త్వికభావములు. మోహము= మూర్ఛ, ఇందుఁ బాముకాటువలనఁ గలుగుధర్మములను విరాళివలని ధర్మములను సరిపెట్టి చూపినాఁడు.

చ. వెడవెడ గన్నుమూయుఁ గనువిచ్చు నగుం దలయూఁచుఁ బాన్పు
బడు నుసురంచు లేచుఁ దడఁబాటును దత్తఱముం జలంబు లోఁ
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తిహస్తగతపద్మినియుంబలె సొంపు పెంపఱన్. (101)

టీ. వెడవెడ=కొంచెముకొంచెము, కనువిచ్చున్ = కన్నుఁదెఱచును, నగున్ = నవ్వును, తలయూఁచున్=తలపంకించును, పాన్పుపైన్=శయ్యపై, ఉసురంచున్=ఉస్సురనుచు, తడఁబాటున=స్ఖలనమును, తత్తఱపాటును=సంభ్రమమును, చలంబు=పంతము, లోన్=మదిని, అడరఁగన్=వృద్ధినందఁగ, కోపవేగమునన్=క్రోధంపుఁద్వారను, అగ్గలమైన =అధికమైన, మనోజవేదనన్=మన్మథబాధయందు, పడి=క్రుంకి, మదహస్తిహస్తగత పద్మినియుంబలెన్=మత్తగజముయొక్క తుండమునుబొందిన పద్మలతవలె, సొంపు పెంపు = అందముయొక్కయతిశయము, అఱన్ = నశింపఁగా, ఉత్తరపద్యముతో నన్వయము.

విశే. ఇందు వ్యభిచారిభావములు సరసగలిసి నిరూపితములయ్యెను. పూర్వపద్యములఁ గోపముకతన వగలు గలిగెనని వర్ణించినకవి 99, 100, 101 పద్యముల సత్య మన్మథవేదనపాలైనట్లు వర్ణించుట పొసఁగునా? సందర్భశుద్ధి కలదా? యనునంశముల విచారింపవలయును. పారిజాతసుమమును రుక్మిణికి శ్రీకృష్ణుఁ డర్పించుటంజేసి, సత్యకుఁ గోపముకల్గె. మఱియు నకోపము ప్రియవిషయకమగుటంజేసి యింకఁ దనకుఁ బ్రియుఁడు దుర్లభుఁడనియుఁ, నన్యకాంత కధనుఁడయ్యెననియు భావములు పొడమెను. దాన నీర్ష్యయుం మనోజవేదనయు సంభవించెనని గ్రహింపవలెను. మత్తేభము పద్మలతం బెకలించి తుండముచేఁ జీకాకుపఱచి దాని రూపుమాపును. అట్లే కోపవేగమునంగల్గిన మనోజబాధ సత్యను రూపఱంజేసెనని యెన్నవలయును. అలం. ఉపమ. 'పద్మిని' స్త్రీలింగగ్రహణము సత్యాసాదృశ్యసంపాదనార్థమని సారస్యము గ్రహించునది. అలం. సముచ్చయము.

క. ఈపగిదిన్ సాత్రాజితి, కోపోద్యోగమున వగలఁ గుందుచు ఘనసం
తాపంబు పెర్మి నితరవ్యాపారము మాని యుండె హరియును నచటన్.

టీ. సాత్రాజితి=సత్రాజిత్పుత్రిక, ఈపగిదిన్=ఈరీతిగ, కోపోద్యోగమునన్ = కోపోచితప్రయత్నముచే, (అనఁగాఁ గోపమువచ్చినట్లు తెలియుటకై యొనర్చిన ప్రయత్నముచే నని భావము) 'కోపోద్వేగమునన్' అని యిచోఁ బాఠాంతరముండిన లెస్స. 'కోపవేగము' అని పూర్వపద్యములలోఁ గన్పట్టుచుంట నిదియే సాధుపాఠమని యంగీ

గరింపనగు. మఱియుఁ గోపవేగమె వగలఁబొగిలించెనుగాని కోపోద్యోగము కామినఁ ప్పాతమె సరసమగును. వగలన్=దుఃఖములచే, కుందుచు = దుఃఖించుచు, ఘనసంతాపంబుపేర్మిన్=గొప్పదైన పరితాపముయొక్క యతిశయముచే, ఇతరవ్యాపారమును = ఒండొకపనిని.

## సత్యభామకడకు శ్రీకృష్ణుఁడు వచ్చుట.

మ. ముని నాకిచ్చినపూవుచందమును నే మున్నాడి యీభోజనం
దన కర్పించినజాడయుం దెలియఁ జెంతం బొంచి వీక్షించి పో
యినసాత్రాజితిబోటి నావలనఁ దా నేమేమి కల్పించెనో
యని ప్రద్యుమ్నుని మౌనిదండనిడి చింతాయత్తచిత్తంబునన్. 103

టీ. చందమును=విధమును, మున్నాడి=తొలుత, జాడయున్=రీతియు, తెలియన్=తెలియునట్లు, చెంతన్=దగ్గఱ, పొంచి=దాగి, వీక్షించి = చూచి, పోయిన = అరిగిన, సాత్రాజితిబోటి=సత్యాసఖి, నావలనన్=నావైపున, (నావిషయమున) ఏమేమి కల్పించెనో (కల్పించుశబ్దసారస్యమున నేమేమి కొండెములు చెప్పెనో యని భావము గ్రహింపవలయును) మౌనిదండన్=నారదునిసమీపమున, ఇడి=ఉంచి, చింతాయత్తచిత్తంబునన్=విచారాధీనమైన మనస్సుతో.

విశే. సత్యకును వెఱచుటకతన శ్రీకృష్ణునియందుఁగల దక్షిణనాయకత సూచితము.

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచలమైనతాల్మితోఁ
దురగజవంబు మున్నడవఁ ద్రోచి కడంగెడుతత్తఱంబుతోఁ
దిరిగెడుబండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సనుదెంచె సత్యసముదంచితకాంచనసౌధవీథికిన్. 104

టీ. ఆహరి=(చింతాధీనచిత్తముగల) ఆశ్రీకృష్ణుఁడు, అరదమున్ = రథమును, ఎక్కి=అధిష్ఠించి, కేతన...చంచలమైన-కేతనపట=టెక్కెపుగుడ్డలయొక్క,అంచల= కొనలవలె, చంచలమైన=కదలునదైన, తాల్మితోన్=ధైర్యముతో, తురగజవంబున్ = గుఱ్ఱములవేగమును, మున్నడవన్=మీఱుటకు, త్రోచి=వడిగొని, కడంగెడు = యత్నించెడు, తత్తఱంబుతోన్=వేగిరపాటుతో, తిరిగెడు=భ్రమించెడు, బండికండ్లపగిదిన్ = (రథ) చక్రములవలె, భ్రమియించు=భ్రమణమునొందునట్టి, మనంబుతోడన్ = మదితోడ, సత్య......వీథికిన్=సత్యభామయొక్క యొప్పునట్టిబంగారుమేడలవరుసకు,చనుదెంచెన్=వచ్చెను.

భా. శ్రీకృష్ణుఁ, డరదపుటెక్కుపుగుడ్డలకొనలకంటె నెక్కుడుగ ధైర్యము చలించుచుండ, హయవేగమునుమించిన తత్తరపాటు చెలంగ, రథచక్రభ్రమణవేగమును మీఱి మది భ్రమింప, సత్యయింటికి నేతెంచెను.

వ్యా-విశే. ఇందు రథవేగమును నిరూపింపక తాల్మి మున్నగువానిచలనము రథవేగమును మించియున్నదని చెప్పుటంజేసి, రథవేగాతిశయము ధ్వనితనుగుటయేగాక తన్మూలమున శ్రీకృష్ణునకు సత్యావిషయమునఁ గలభీతిప్రీతులును వ్యంగములగుచున్నవి. "అరదము నెక్కు".—జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగానగును. "బండికండ్లపగిదిఁ".—బండికండ్లయొక్కపగిదిఁ. ఔపవిభక్తికంబుల వివర్ణసలలు వర్ణంబులకు బహువచనము పరంబగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగును. కల్లు=మద్యము. ఈయర్థమున నీవిధి వర్తింపదు.

తే. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ
దారుకుని నుండ నియమించి తాన యొకఁడు
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలము లేనినగ రెల్ల నరసి చూచి. 105

టీ. డిగ్గి=దిగి, తద్ద్వారసీమఁ=ఆ (సత్యాసౌధ) ద్వారదేశమున, దారుకునిఁ=రథముగడపువాని, నియమించి=ఆనయిడి, తాన=తానే, (తానయొకఁడు=తానొక్కఁడే) కక్ష్యాంతరములు=తొట్టికట్టులమేరలను, కడచి=దాఁటి, అలబలము=కలకలము, నగరెల్లఁ=రాజసౌధమంతయు, అరసి=వెదకి.

వ్యా-విశే॥ డిగ్గి=రూ. అ. దిగి:-దకుృలోనగువానిదాకు డకారంబు విభాషనగును.
అలబలములేమి నిందుఁ దెల్పుచున్నాఁడు.—

సీ. కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు
కరతాళగతులఁ మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు
క్రొవ్వాఁడిగోళ్లఁ దంత్రులు మీటి వీణియ
ల్వాయింప రేలొకో భామ లిపుడు
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిపుడు

తే. ఇన్ని దినములవలె నుండ దేమి నేఁడు
చిన్నబోయిన దీమేడ చెన్ను దఱఁగి

పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱిఁగింపఁబోలునొక్కొ. 106

టీ. కనకపంజరశారికలకున్ = బంగారుపంజరమున నున్నగోరువంకలకు, చక్కెర = శర్కర (పంచదార), పెట్టి = యిడి, సకియలు = చెలులు, చదివింపరేలొకో, చదివింపరు + ఏల + ఒకో = ఏల చదివింపరో? అతివలు = స్త్రీలు, కరతాళగతులన్ = చప్పటలయొక్క రీతిచే, మందిరమయూరంబులన్ = ఇంటినెమిళ్లను, (పెంచిననెమిళులను) ఇపుడు, ఆడింపరేలొకో = ఎందులకాడింపరో, భామలు = స్త్రీలు, క్రొవ్వాఁడిగోళ్లన్ = క్రొత్తలును నిశితములునైన నఖములచే, తంత్రులు = వీణతీఁగెలను, మీటి = ఎగఁజిమ్మి, వీణియల్ = వీణెలను, పలికింపరేలొకో = శబ్దింపఁజేయరేమొ? పడఁతులు = వనితలు, కలికిరాయంచబోదలనెల్లన్ = మనోహరములగు రాజహంసలపిల్లలనెల్లను, ఎలయించి = చేర్చి, నడిపింపరేలొకో = ఎందులకు నడిపింపరో? చెన్ను = అందము, ఎవ్వరేన్ = ఎవరైనను, పారిజాతపుష్పవృత్తాంతము = పారిజాతపుష్పచరిత్రమును, ఎఱిఁగింపఁబోలునొక్కొ, ఎఱిఁగింపన్ + పోలును + ఒక్కొ = తెలియఁజేసియుందురేమో?

వ్యా-విశే. చక్కెర. ప్ర. శర్కర. సకియ. ప్ర. సఖి. బోద. ప్ర. పోత. ఇట్లు వర్ణించుటకతన, సత్యచెలులు విదుషులనియు, నాట్యకళాభిజ్ఞలనియు, వీణాగానవిశారదలనియు, నంచయానలనియుఁ దేలుచున్నది.

క. అని యనుమానించుచు నో
య్యనఁ గోపగృహంబు సేరి యాసత్రాజి
త్తనయ ముసుంగిడి యుండఁగ
ననువు మెఱయఁ జొచ్చి మాయ యచ్చుపడంగన్. 107

టీ. అనుమానించుచున్ = ఊహించుచు, ఒయ్యనన్ = మెల్లఁగా, కోపగృహంబున్ = క్రోధాగారమును, చేరి = పొంది, ముసుంగు = అవకుంఠనము, ఇడి = చేసి, అనువు = ఉపాయము, మెఱయన్ = ప్రకాశించునట్లు, చొచ్చి, మాయ = కపటము, అచ్చుపడంగన్ = స్పష్టపడునట్లు.

మాయ నిం దచ్చుపఱచుచున్నాఁడు.—

ఉ. కొందఱ మంతనంబులను గొందఱ జంకెనవాఁడిచూపులం
గొందఱఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచుఁ జేరఁబోయి మ
ధ్యందినభానుమండలకరావళిహావళి వాడి యున్నతీఁ
గం దలఁపించునమ్ముగుదఁ గన్గొని యెంతయు విస్మితాత్ముఁడై. 108

టీ. కొందఱన్, మంతనంబులన్ = రహస్యములచేతను, (రహస్యాలాపములచే ననుట) జంకెనవాఁడిచూపులన్ = బెదరించుతీక్ష్ణములగు దృష్టులచేతను, చేలిసన్నలన్ = హస్తసంజ్ఞలచేతను, తగుల్పడన్ = వశమగునట్లుచేయుచు (వశపఱచుకొనుచు) స్వాధీనులం జేసికొనెనని భావము. చేరన్ = దగ్గఱగా, పోయి = అరిగి, మధ్యందిన......హావళిన్ - మధ్యందిన = మట్టమధ్యాహ్నమునకైన, భానుమండల = సూర్యమండలసంబంధమైన, కరావళి = కిరణపంక్తియొక్క, హావళిన్ = ఉపద్రవముచే, వాడి యున్న = మ్లానమైయున్న, తీఁగన్ = తీవను, తలపించు = జ్ఞాపకమునకుఁదెచ్చు, అమ్మగువన్ = ఆ సత్యభామను, కన్గొని = కాంచి, ఎంతయున్ = మిక్కిలియు, విస్మితాత్ముఁడై = ఆశ్చర్యమునందిన మది కలవాఁడై.

భా. రహస్యాలాపములఁ గొందఱను, బెదరింపుఁజూపులఁ గొందఱను, హస్త సంజ్ఞలఁ గొందఱను నీరీతిగ సత్యాసౌధమునందలి పరిజనుల స్వాధీనము చేసికొనుచుఁ బోయి మట్టమధ్యాహ్నమునందలి తీక్ష్ణసూర్యాతపమునఁ గడుంగడు వాడియున్న తీవం బోలు సత్యభామంగని యెంతయు నాశ్చర్యమునందెను.

విశే. పరిజనులఁ దత్తత్క్రియల స్వాధీనము చేసికొనుటవలన శ్రీకృష్ణునిమాయ యచ్చుపడుచున్నది.

ఉ. ఈలలితాంగిచంద మొకయించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొకభామిని సత్యపిఱుంద నుండి మం
దాలసలీలమై విసర నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలితపంచసాయకశిఖిం దరికొల్పుచు నున్నకైవడిన్. 109

టీ. ధూర్తగోపాలుఁడు = మాయావియగు శ్రీకృష్ణుఁడు. (ధూర్తుఁడు = మోస కాఁడు), ఈలలితాంగిచందము = ఈ యందమైన మేనుగల సత్యభామయొక్క విధము, ఒకయించుక = ఒకకొంచెము, చూచెదను, అంచు, ఒకభామిని = ఒకస్త్రీ, సత్యపిఱుందన్ = సత్యభామయొక్క వెనుకను, ఉండి, మందాలసలీలమైన్ = అత్యంతము మందమగు విధముతో, తాలవృంతము = విసనకఱ్ఱ, విసరన్ = వీవఁగా, ఆదటన్ = ప్రీతితో, కైకొని = పుచ్చుకొని, తద్వపుః...శిఖిన్ - తత్ = ఆసత్యభామయొక్క, వపుః = శరీరమునందు, కీలిత = ఉండునట్టి, పంచసాయకశిఖిన్ = మన్మథాగ్నిని, దరికొల్పుచున్ = ప్రజ్వలింపఁ జేయుచు, ఉన్నకైవడిన్ = ఉన్నరీతిగ, వీచెన్ = విసరెను.

భా. మోసకాఁడగుకృష్ణుఁ డీమెచందముం గొంచెము చూతుఁగాకని వీవన చేఁబూని విసరు నొకకాంతయొక్క చేతినుండి యావీవనందీసికొని తానె సత్యకు విసరెను.

వి శే. మున్ను తన్ను వంచించినయాధూర్తగోపాలుఁడే ప్రకృతము వీవనం జేఁబూని తనకు విసరుటను సత్య గాంచినచో మఱింత మండిపడును. దాన శ్రీకృష్ణుని యీసేవ సత్య కెంతయుఁ సంతాపమును జేయునదే యగుంగాని యున్న సంతాపమును దొలఁగింపనేరదు. మఱియుఁ దరువాతిపద్యమునందలి ప్రస్తావనంబట్టి పారిజాతసుమసౌరభమును వెదఁజల్లి సత్య కెంతయు నీర్ష్యఁ గలిగించుటకే కృష్ణుఁడు తాళవృంతముంబట్టి విసరెనని తెలియవచ్చునుగాన, నిదియు నధికసంతాపముంగూర్చుటకే యేర్పడినక్రియ యని తెలియును. కావుననే యావిసరుట మున్నున్నమన్మథాగ్నిని దరికొల్పునటుల నున్నదని కవి యూహించెనని యెన్నునది. ఎక్కుడుగ వీచిన సత్యకు బాధయగునేమో యని చెలి యత్యంతము మందమగుగతిని వీచెనని 'మందాలసలీలమై' యనుపదమునకు సారస్యము నెన్నునది. పంచసాయకములు.—అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము. ఈయైదును బాణములుగాఁగలవాఁడు మన్మథుఁడుగాన 'పంచసాయకుఁడు' అనునుడి కల్గెను. అలం ఉత్ప్రేక్ష.

ఉ. అంతటఁ బారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనల్
 వింతలు సేయఁ [1]దావి యిది విస్మయమంచు ముసుంగుఁ ద్రోచి [2]యే
 కాంతగృహంబు నల్గడలు నారసి సంభృతతాలవృంతునిం
 గాంతునిఁ జూచి [3]బాష్పకళికాతరళీకృతలోచనాంత యై. 110

టీ. అంతటన్ = అనంతరమున, పారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనల్ కల్పవృక్షపుష్పమునుండివచ్చిన క్రొత్తలగుశ్రేష్ఠములైన పరిమళములు, వింతలు సేయన్ = ఆశ్చర్యములంగలిగింపఁగా, ఇది తావి = ఈపరిమళము, విస్మయము = ఆశ్చర్యకరము, అంచున్, ముసుంగు = అవకుంఠనమును, త్రోచి=తీసివైచి, ఏకాంతగృహంబునల్గడలున్ = రహస్యాగారముయొక్క నలుప్రక్కలను, అరసి=విచారించి (వెదకి), సంభృతతాలవృంతునిన్ = పట్టుకొనినవీవనగలవాని, కాంతునిన్ = మనోహరుని, చూచి = కాంచి, బాష్పకళికాతరళీకృతలోచనాంతయై = మొగ్గలవంటికన్నీళ్లచేఁ జంచలములుగాఁ జేయఁబడిన కన్నులకొనలుగలదై; ఉత్తరపద్యముతో నన్వయము.

భా. అట్లు కృష్ణుఁడు వీవనం జేఁబూని సత్యకు విసర, నపు డింతకుమున్న కృష్ణునకంటియున్న పారిజాతసుమసౌరభము తాళవృంతసంచాలనమువలని గాలింగలిసి పొలయ, నక్కాంత యపూర్వ మీసౌరభ మెటనుండి యేతెంచెనని యచ్చెరువునంది తా నివ

1 దావి యది. 2 యక్కాంతగృహంబు నల్గడలు గన్గొని. 3 బాష్పకణికా.

సించుగృహమును నల్గడలం బరికించి వీవనం జేతంబూని విసరువిభుం గాంచి తోడనే ముకుళములంబోలు బాష్పములు జాలుకొన వెనువెంటనే ముసుంగిడెనని భావము.

విశే. ఇందు 1 'తావియది' 2 'కాంతగృహంబునల్గడలుగన్గొని' 3 'బాష్పకణికా' అను పాఠాంతరములు గాననగును. ఈ పాఠమున నంతగ విశేషము గానరాదు. కాని 'ఈ తావి' అనుటయే సరసమని తోఁచెడిని. 2 'కాంతగృహంబునల్గడలు నారసి' అను ప్రామాదికపాఠము నీరీతిని సవరించిరి. కాని, నల్గడలు కన్గొని యనుటకన్న 'వెదకి' అను నర్థముగల 'ఆరసి' అనుపదమే యిచ్చోఁ గవి ప్రయోగించెననియుఁ, బ్రకృతము సత్యక్రోధాగారమున నుండుటంజేసి, 'యేకాంతగృహంబు' అనియే ప్రయుక్తమైయుండు ననియుం గ్రహింపనగును. మఱియు 'ఏకాంత' అనుశబ్దములోని కకారమునకును, దాని పైఁగల యచ్చునకును నుభయయతి వేయవచ్చునుగాన, నీపక్షమున నచ్చునకు యతి చెల్లె ననుట నిర్బాధము. 3 'బాష్పకణికా' అని యనినఁ గేవలము బాష్పకణములుమాత్రమే యర్థమగును. 'కళికా' అనియన్న ముకుళములంబోలు బాష్పములని బాష్పములకుఁ గొంత వన్నె కల్గును. కాని, యిందు బాష్పములు చాలుకొన్నట్లు కవి వర్ణించిన ట్లగపడదు. కన్నీళ్లచేఁ గన్నులు కలఁతనొందినట్లు మాత్రమే చెప్పినాఁడు. కావున, బాష్పములు బింద్వనంతరము బిందువు చాలుకొనునపు డేర్పడురూపము నిచట గవి బాష్పముల కనుసంధించెననుట యంత హృద్యముగఁ గానరాదు. కన్నులు తరళములగుటకుఁ గన్నులనిండఁ బాష్పకణము లేర్పడినంజాలునుగదా! మఱియుఁ దరువాతిపద్యమున మగుడ ముసుఁగిడినతరువాత బాష్పములు చాలుకొన్నట్లు వర్ణించుటంజేసి, యిందు బాష్పోదయము మాత్రమే గవి వర్ణించెనని తోఁచెడిని.

క. తల వాంచి మగుడ ముసుఁగిడెఁ
గొలుకుల డిగజాఱి జాలుకొనుబాష్పంబుల్
పలుచనిచెక్కుల లవలీ
దళపతితమరందబిందుతతిఁ బురుడింపన్. 111

టీ. కొలుకులన్ = కనుకొనలనుండి, చాలుకొను=వరుసనుగొను (ప్రవహించు), బాష్పంబుల్=కన్నీళ్లు, పలుచనిచెక్కులన్ = సన్నఁదనమునందిన గండస్థలములందు, లవలీదళపతితమరందబిందుతతిన్ = లవలియను లతయొక్క యాకునందుఁబడిన పూఁదేనె బొట్టులసమూహమును, పురుడింపన్ = అనుకరింపఁగా, మగుడన్=మఱలన్, ముసుఁగు, ఇడెన్ = పెట్టెను.

విశే. అలం. ఉపమ.

ఉ. ఓర్పొకయింత లేనివికచోత్పలలోచనచిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే చనుదెంచెనంచుఁ గం
దర్పహుతాశను న్వెలికిఁ దార్చుసఖుండునుబోలె వేఁడిని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంతమై. 112

టీ. ఒకయింత = కొంచెము, ఓర్పు=సహనము, లేని, వికచోత్పలలోచనచిత్తవీథిన్=విరిసిననల్లకలువలంబోలు కన్నులుగలసత్యభామయొక్క మనోవీథిని, చల్లార్పఁగన్=ఉపశమిల్లఁజేయుటకు, నీలనీరదశుభాంగుఁడు=నల్లమబ్బువంటి మంగళదేహముగల వాఁడు (శ్రీకృష్ణుఁడు) వే=శీఘ్రముగ, చనుదెంచెన్=వచ్చెను, అంచు, కందర్పహుతాశనున్=మన్మథాగ్నిని, వెలికిన్=బయటికి, తార్చు=చేర్చు, సఖుండునుబోలెన్ = చెలికానివలె;గాలివలె, అగ్నికి మిత్రము (వాయువుకదా), వేఁడినిట్టూర్పు=వేఁడియైననిశ్వాసము, దళంబుగాన్=దట్టముగా, ఉన్నమిత...కాంతమై-ఉన్నమిత=ఎత్తఁబడిన, ఆవరణాంశుక = ముసుఁగిడినచీరయొక్క, అంతమై = చెఱఁగుకలదై, నిగిడెన్ = విజృంభించెను.

భా. సత్యమనోవీథిని సంతాపముపాలుచేయు మన్మథాగ్నిం జల్లార్ప శ్రీకృష్ణుఁడనుకాళమేఘ మేతెంచుటంగని యగ్నిసఖుండగువాయువు తనమిత్రునగ్నిని వెలికిఁ దార్చుచున్నాఁడో యన వేఁడినిట్టూర్పు లవకుంఠనవస్త్రాంచలముఁ బైకెత్తుచు విజృంభించెను. వేఁడినిట్టూర్పుల నామె చీరచెఱఁగు పైకెగురుచుండెనని భావము.

వ్యా-విశే. 'నీలనీరద' అనుపద మిందు సాభిప్రాయము. కాఱుమబ్బు వర్షించుటయును నగ్నిని జల్లార్చుటయును ప్రసిద్ధమేకదా. నిడు+ఊరుపు=నిట్టూరుపు, కుఱుచియు నిడుదనిడుశబ్దముల అడల కచ్చుపరమగునపుడు ద్విరుక్తటకారమగు. అలం.ఉత్ప్రేక్ష.

చ. వనితకుచద్వయంబుపయి వ్రాసినకుంకుమపత్త్రభంగముల్
జనితనితాంతఘర్మకణజాలముచేతఁ గరంగి మెల్లమె
ల్లన వెలిపట్టుపయ్యెదకెలంకుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్నక్రోధరసము *న్వెడఁగట్టుచు నున్నకైవడిన్. 113

టీ. వనితకుచద్వయంబుపయిన్ = సత్యయొక్కచందోయిమీఁదను, వ్రాసిన కుంకుమపత్త్రభంగముల్=కుంకుమచేసైన మకరికాపత్త్రరచనలు, జనితనితాంతఘర్మకణజాలముచేన్ = పుట్టినట్టి యధికమైన చెమటబొట్టులసమూహముచేత, కరంగి=ద్రవీభవించి, మెల్లమెల్లన = ఒయ్యొయ్యన, వెలిపట్టుపయ్యెదకెలంకులన్ = తెల్లనైన పట్టుపయఁట

* న్వడఁబెట్టుచు; న్వెడఁబెట్టుచు; న్వడవెట్టుచు.

యొక్క-పార్శ్వములనుండి, జాఱుట; కర్త. మానసంబునన్=మదిలో, నెలకొన్న=నిల్చియున్న, క్రోధరసమును = కోపరసమును, వడిఁగట్టుచున్ = వడఁబోయుచు, ఉన్నకైవడిన్=ఉన్నరీతిగ, ఒప్పెన్=అమరెను.

భా. అధికములైన చెమటబొట్టులచే సత్యచన్ద్రోయిపై వ్రాసినకుంకుమపత్త్రరచనలు కరంగి పైఁటచెఱఁగుకొనలనుండి జాఱుట రక్తవర్ణమగుక్రోధరసమును సత్య వడఁబోయుచున్నదో యన్న ట్లమరెనని భావము.

వ్యా-విశే. 'మెల్లమెల్లన' గుడ్డయందు వడఁబోయునపుడు నీరు మెల్లనజాఱుట సహజముకాన నిది సాభిప్రాయము. క్రోధరసమ్ము రక్తవర్ణమని యాలంకారికసంకేతము. పైఁ+ఎద. పయ్యెద. రూ. అ. పయ్యద. అలం! ఉత్ప్రేక్ష.

క. మానపతి యిట్లు మానని, మాన క్రోధముల చేఁ గుమారిలి చింతా
దీనగతి నుండ మదిలో, నూనినప్రేమమున నంబుజోదరుఁ డనియెన్.

టీ. మానపతి=అభిమానవతియైన యాసత్య, ఇట్లు=ఈరీతి, మానని = విడువని, మానక్రోధముల చేన్ = భర్తయెడఁగల్గిన పట్టుదలచేతను గోపము చేతను, కుమారిలి = దుఃఖించి, చింతాదీనగతిన్ = విచారమునకు లోనైనవిధమున, ఉండన్, మదిలోన్, ఊనిన=ధరించిన, ప్రేమమున = ప్రీతితోడ, అంబుజోదరుఁడు = దామోదరుఁడు, అనియెన్=పల్కెను.

వ్యా-విశే. అనియెను. వచ్యర్థమున భూతంబున లాద్రూపము.

### శ్రీకృష్ణుఁడు సత్యభామ ననునయించుట.

ఉ. ఇందునిభాస్య ! మైతొడవు లేల ధరింపవు *సన్నకావు లీ
వెందును మాన లేవు దెలు పేటికిఁ గట్టితి వీటికారుచుల్
కెందలిరాకుమోవిఁ దులకింపఁగఁ జేయక యున్కి యేమి నీ
చందము వింతయయ్యెడు నిజంబుగ నా కెఱుఁగంగఁజెప్పుమా. 115

టీ. ఇందునిభాస్య=ఓచంద్రముఖీ, మైతొడవులు=మేనునాభరణములు, ధరింపవేల=తాల్పవేల? సన్నకావులు=పలిపములగుకావిబట్టలు, ఈవు=నీవు, ఎందును = ఏసమయమునను, మానన్=విడువఁగా, లేవు=సమర్థువుగావు, తెలపు=తెల్లనిబట్ట, ఏటికిన్ = ఎందులకు, కట్టితి=ధరించితివి. వీటికారుచుల్ = తాంబూలపుఁగాంతులు, కెందలిరాకుమోవిన్ = ఎఱ్ఱనిచిగురుటాకుంబోలు పెదవియందు, తులకింపఁగన్ = ప్రకాశించునట్లుగ, చేయక=ఒనర్పక, ఉన్కి=ఉండుట, ఏమి=ఎందులకు? నీచందము = నీవిధము,

* నున్నగావు.

నింత=ఆశ్చర్యకరము, అయ్యోడుల్, నిజంబుగల్=నిక్కముగ, నానుల్, ఎఱుఁగంగల్= తెలియునట్లు, చెప్పుమా.

విశే. 'నున్న కావులు' అని పాఠాంతరము. నున్న నిబట్ట లనుటకంటె సన్న నిబట్ట లనుటయే సరసమని తోఁచెడిని. అక్కాలమున యువతులు కావివలిపములంగట్టుటయు, నవి వారికి మిగుల సౌందర్యమును గలుఁగఁజేయునవని యప్పటివారు తలంచుటయుఁ గలఁదని పారిజాతాపహరణమనుచరిత్రములందలి సత్యాపరూఢినీవర్ణనములంబట్టి తెలియవచ్చెడిని.

చ. మన మరయందలంచి యొకమ్మార్గము వన్నితొ నవ్వటాలకో
నను వెఱపించెదో యకట నాయెడ [1]నిక్కము దప్పు గల్గెనో
వనజదళాయతాక్షి! పగవాఁడనె నన్నిటు లేల చూడ వొ
క్కనిమిష మైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వ నేర్తునే? 116

టీ. మనము=మనస్సును, అరయఁల్ = పరీక్షింపఁగా, ఒకమార్గము=ఒకత్రోవను, వన్నితొ = విర్పఱచితివొ? నవ్వటాలకో = పరిహాసములకో? ననుల్, వెఱపించెదో = భయపెట్టెదవొ? అకట, నాయెడల్=నాయందు, తప్పు=దోషము, నిక్కము = నిజముగా, కల్గెనో? వనజదళాయతాక్షి = ఓపద్మపత్రవిశాలాక్షీ, పగవాఁడనె=శత్రుఁడనా? నన్ను, ఇటులు, చూడవేల? ఒక్కనిమిషమైనల్=ఒకనిముసమైనను, నీవు, దయల్ = కరుణతో, కన్గొనక = చూడక, ఉండినల్, నిల్వల్ = జీవింపఁగా, నేర్తునే = ఓపుదునె?

చ. పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁ డిది [2]యేల వాలుఁగ
న్నుల నునుసిగ్గు నూల్కొనఁ గనుంగొన వేల యురఃస్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగికౌఁగిటఁ జేర్పవేటికే
చిలుకలకొల్కి! యెవ్వ రెడ సేసిరి నీ కిటు లేల చింతిలన్? 117

టీ. పలుకులల్=మాటలనుండి, తేనెలు=మధువులు, ఉట్టి=కాఱి, పడల్ = నలుకఁగా; లేదా మాటలందుఁ దేనె లలితయింపఁగా, నేఁడు పల్క విదియేల? వాలుఁగన్నులల్=సోఁగకన్నులందు, నునుసిగ్గు=అల్పమగులజ్జ, నూల్కొనల్=కుదురుకొనఁగా, కనుంగొనవేల=చూడవేల? ఉరఃస్థలంబుల్ = వక్షఃప్రదేశమును, చన్నులల్=స్తనములచే, ఎదురు ఒత్తి=ఎదురుగానదిమి, మక్కువల్ = అనురాగముతో, ననుల్-బిగికౌఁగిటల్ = బిగువైనకౌఁగిలియందు, ఏటికే=ఎందులకే, చేర్పవు? చిలుకలకొల్కి =

1 నిక్కపుఁదప్పు. 2 యేమి క్రాలుఁగన్నుల.

ఓ చిలుకముక్కునంటిన కంటిమూలలవంటి కంటిమూలలుగలదాన, ఎవ్వరు, ఎడ = భేదము, చేసిరి. నీకున్, ఇటులు=ఈరీతిగ, చింతిలన్=విచారింపఁగా, ఏల?

విశే. 'ఎడ' అనుదానికిఁ బ్రకృతము సత్యకుఁ గృష్ణునిపైఁ గోపము జనించుటం జేసియుం, నిక్షేపము సత్యాసఖి చెప్పినమాటలచేఁ గల్గినదని కృష్ణునకుఁ దెలిసియే యుండుటంజేసియు, 'భేదము' అనియే యర్థమును జెప్పి 'ఎవ్వరు భేదమును గలుగఁ జేసిరే' అని కృష్ణుఁ డనినట్లు గ్రహించుటయే సరసము. ఇందుఁ గల శృంగారప్రస్తావన యక్కాలపువారికి హృద్యమై యుండనోపును. కాని, ప్రకృతము సహృదయుల కిది మోటుగాఁ దోఁచకపోదు. ఇట్టియలవాటు గీర్వాణభాషాకవులనుండియే యాంధ్రకవులకుఁ గల్గెనని వాఙ్మయపరిశోధనమువలన విశదముకాఁగలదు.

చ. మనమున మాటలం గ్రియల మన్నన లీనొకనాఁడు నెట్టికా
మినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁ గాని పా
యని యనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచినపంపు సేయుటయ ప్రాభవ మౌటది నీ వెఱుంగవే? 118

టీ. మనమునన్=మనస్సుచేతను, మాటలన్ = పల్కులచేతను, క్రియలన్ = పనులచేతను (మనోవాక్కర్మములచే), మన్ననలు=సమ్మానములను, ఎట్టికామినులకున్= ఎట్టియువతులకును, ఈను=ఒసంగను, గారవంబున్=సమ్మానమును, మెఱమెచ్చులకై = మిక్కిలి మెప్పులకై, పచరింతున్ = చేయుదును. కాని, పాయని = ఎడతెగని, అనురక్తి=అనురాగము, నీయెడన=నీయందే, అగ్గలమై=అధికమై, కనుపట్టున్=చూపట్టును. నాకు, నీపనిచినపంపు = నీవు దేని నాజ్ఞాపించిన నాయాజ్ఞను, చేయుటయ = ఒనర్చుటయే, ప్రాభవము = ప్రభుత్వము, ఔట=అగుట, అది, నీవు, ఎఱుంగవే= తెలియవే?

భా. మనోవాక్కర్మములను నిన్నె సంభావింతును. ఆంగికములగు క్రియలచే నేనితరకామినులవిషయమున నగపఱచుగారవము మెప్పునకేగాని యన్యము గాదు. నీయాజ్ఞను నెఱవేర్చుటయే నేను బ్రభుత్వముగ మదినెన్నుదు ననునంశము నీ వెఱుంగనిది కాదు.

విశే. మనోవాక్కాయకర్మములలో నాంతరంగికములగు మనోవాక్కర్మముల మూఁటినిమాత్రమే పేర్కొని కాయమును బరిత్యజించుటంజేసి, శరీరద్వారముగనే వెఱవనితలవిషయమునఁ బ్రేమంజూపుదుననియుం, నదియుం ముఖప్రీతికేగాని యన్యము గాదనియుం, శ్రీకృష్ణుఁడు సత్యకుఁ దెలియఁబల్కెనని గ్రహించునది. నీయాన నను సరించి పారిజాతముం బ్రాభవమునఁ దెత్తునని శ్రీకృష్ణుఁడు సాభిప్రాయముగఁ బల్కినట్లు

'నీపనిచినఖంపునేయుటయె ప్రాభవము' అనుమాటలవలనఁ దెలియవచ్చెడిని. ఘటియుఁ బారిజాతమును రుక్మిణి కిపు డర్పించుట యనునది ముఖప్రీతికై యొనర్చినదిగాని, నిందు ప్రేమంజేసినది కాదని శ్రీకృష్ణుఁడు సత్యకు నెఱిఁగించినాఁడు.

మ. పడఁతీ! నీమధురాధరామృతము నీబాహాపరీరంభముం
బడయక్ ధన్యుఁడఁ గాకయుండిన నునుంబాటించి యొక్కింత నీ
నిడువాలుంగడగంటఁ జూడుమనుచు న్నిల్పోపమిం బైచెఱం
గొడియం జేవిరిదమ్మి వ్రేయుటకునై యుంకించి జంకించినన్. 119

టీ. పడఁతీ=ఓయువతీ, నీమధురాధరామృతము = నీదగుతీయనిమోవిసుధను, నీబాహాపరీరంభమున్=నీచేతులచేనైన యాలింగనమును, పడయక్=పొందుటను, ధన్యుఁడన్=కృతార్థుఁడను, కాక+ఉండినన్=కాకున్న, ననున్, పాటించి = లెక్కఁగొని, ఒక్కింత=ఒకకొంచెము, నీనిడువాలుంగడగంటన్=నీదగువిశాలమైన దీర్ఘమైనకటాక్షముచే, చూడుము, అనుచున్, నిల్పోపమిన్=ఓర్పులేమిని, పైచెఱంగున్=ఉపరిభాగమున నున్న (చీర) కొనను (పైఁటకొనను) ఒడియన్=లాగఁగా (సత్య) చేవిరిదమ్మిన్=చేతియందలివిరిసిన (లీలా) పద్మముచే, వ్రేయుటకున్+ఐ = కొట్టుటకునై, ఉంకించి = ప్రయత్నించి, జంకించినన్=బెదరింపఁగా.

విశే. కామినులు చేత విలాసార్థము పద్మముం దాల్తురని 'హస్తే లీలాకమల మలకే' అనుమున్నగు కవివాక్యములవలనఁ దెలియవచ్చెడిని.

ఉ. పాటలగంధిచిత్తమునఁ బొటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి పన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారియదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్. 120

టీ. ఆజగన్నాటకసూత్రధారి=ఆప్రపంచమను నాటకమునకు సూత్రధారియైన, యదునందనుఁడు=యాదవకుమారుఁడు(శ్రీకృష్ణుఁడు), పాటలగంధిచిత్తమునన్=పొగడపూవుతావింబోలు తావిగలసత్యయొక్క మనస్సున, పొటిలు=సంభవించిన, కోపభరంబున్=కోపభారమును, ఎప్పాటను=ఏవిధముచేతను, తీర్పన్=పోఁగొట్టుటకు, పాటు=సాధ్యము, కామిన్ = కాకుండుటచేతను, మృదు......కాంతి-మృదుపల్లవ = మెత్తనిచిగురులవలె, కోమల=మృదువైన, తత్=ఆసత్యభామయొక్క, పదద్వయీ=పాదద్వయసంబంధమైన, పాటలకాంతి=ఎఱ్ఱనికాంతి, మౌళిమణిపంక్తికిన్ = శిరస్సునందలిమాణిక్యముల

చాలునకు, వన్నియ=కాంతి, పెట్టన్=ఇడఁగా, అర్మిలిన్=ప్రేమతో, మ్రొక్కెన్ = నమస్కరించెను. మ్రొక్కినన్=నమస్కరింపఁగా.

భా. సత్యమదిని నెలకొన్నకోప మేపాటను బోఁగొట్టుటకు శక్యము గాకుండుటం జేసి, శ్రీకృష్ణుఁడు పల్లవారుణములైన యామెపదములయరుణకాంతి యాత్మ మౌళి మణుల యరుణదీధితికి వన్నియవెట్ట నమస్కరించెను. అనఁగాఁ బాదములపై నెరఁగెనని భావము.

విశే. జగన్నాటకమును నడుపఁ బ్రధానుఁడుగావుననే యిట్లు నటించినంగాని యీనాటకము చక్కఁబడ నేరదని యెంచి యీగతిని నటించెను. మఱియు నిట్లు నటించుటయు జగన్నాటక మిట్లుండునని తెల్పుటకే యని గ్రహింపవలెను. కావున, భార్యపాదములపై నొరగుట కృష్ణున కొకకళంకముం గూర్చునది కాదని యెన్నవలయును. మఱియుఁ గామశాస్త్రపద్ధతిని, నలంకారశాస్త్రసరణిని, నాయకునిదగు నీకృత్యము మిగుల రసమును బోషించునదే యగుటం జేసియు నిది యనింద్యమే యనవలయును. సత్యపదములు మృదుపల్లవకోమలము లగుటం జేసియే యామెతాఁపు శ్రీకృష్ణునకు సంతాపకరము గాకుండుటయు, మీఁదు మిక్కిలి కృష్ణుఁ డామెపాదములు నొచ్చెనేమో యని యనుటయు మీఁద సంభవించును. అలం. వృత్త్యనుప్రాసము.

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనం బై తన
ర్చులతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి; యట్ల యగు నాథుల్నేరముల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే? 121

టీ. లతాంగి = తీవఁబోఁడియగుసత్య, జలజాతాసన...భాజనంబై-జలజాతాసన=బ్రహ్మ, వాసవ=ఇంద్రుఁడు, ఆది=మొదలైన, సుర=దేవతలయొక్క, పూజా=పూజకు, భాజనంబై = పాత్రమై, తనర్చు = ఒప్పు, లతాంతాయుధుకన్నతండ్రిశిరము = పుష్పాయుధుండగు మన్మథునిజనకపితయొక్కశిరస్సును, అచ్చోన్ = ఆసమయమున, వామపాదంబునన్ = ఎడమకాలిచే, తొలఁగన్=అపసరిల్లునట్లుగ, త్రోచెన్=త్రోసివైచెను, అట్లయగును=అదియుక్తమే. నాథుల్=భర్తలు, నేరముల్=తప్పులను, చేయన్ = ఒనర్పఁగా, పేరలుకన్ = పెద్దదగుకోపమును, చెందినయట్టికాంతలు=పొందినట్టికామినులు, ఉచితవ్యాపారముల్=అర్హములైనపనులను, నేర్తురే=నేర్చియుందురే?

విశే. లతాంగి కావుననే యామెతాఁపు శ్రీకృష్ణునకు నొప్పిని గలుగఁజేయలేదు. భర్తృకృతాపరాధమునఁ బేరలుకం గాంచినది కావుననే సత్య స్త్రీజనసహజభావమున నిట్టి

యనుచితవ్యాపారము నొనర్పఁ బాల్పడియెఁగాని లేకున్న నట్లెన్నఁడు నొనర్చునదికా దనియు, నిక్కారణము నామెకుఁ బతిభక్తిలేదనికాని, చెడెననికాని యూహింప నలవి గాదనియు, 'పేరలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్నేర్తురే' అనునర్థాంతర న్యాసవాక్యమూలమునఁ గవిఁ దెలిపెను. కావున, నిది నాయిక కపకర్ష నాపాదించునది కాదని యెన్నవలయు.

క. కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపితమన్మథ రాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలు పడంగన్. 122

టీ. కోపనపదహతిన్ = ప్రణయకోపముగలభార్యయొక్క పాదతాడనమును, కుహనాగోపాలుఁడు=కార్యాపేక్షచేనైన కపటచర్యంబూనిన శ్రీకృష్ణుఁడు, కాంచి= పొంది, మెయి=శరీరము, గగుర్పొడువఁగన్ = పులకింపఁగా, ఉద్దీపిత...ప్రాపితుఁడై= ప్రకాశించుమన్మథరాజ్యమును బొందింపఁబడినవాఁడై, కూర్మి = అనురాగము, బయలు పడంగన్=ప్రకాశమగునట్లుగ, పలికెన్.

విశే. సత్యకూడికకై తహతహనందువాఁడు కావుననే, యామె తాపు కృష్ణునకు గౌరవహానికరమైనట్లు తోఁపకపోవుటేగాక మీఁదు మిక్కిలి మన్మథోద్రేకమునుగూడఁ గలుగఁజేయునదయ్యెనని కుహనాగోపాలపదమునకు సారస్యము నెన్నవలయును.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చినయది నాకు మన్ననయ చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము *దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁకనైన నరాళకుంతలా! 123

టీ. అరాళకుంతలా=కుటిలములైన కుంతలములుగలదాన! భవదీయదాసునిన్ = నీ సేవకుని, ననున్, మనంబునన్=మదిలో, నెయ్యపుఁగిన్కన్ = ప్రణయకోపమును, పూని=వహించి, తాఁచినయది=తన్నినయది, (తన్నుట) నాకున్, మన్ననయ = సమ్మానమే, చెల్వగు=అందమైన, నీపదపల్లవంబు=నీపాదమను చిగురు, మత్తను...వితానము= నాశరీరమందలి రోమాంచముకొనలనెడి ముండ్లగుంపులను, తాఁకినన్ = అంటినచో, నొచ్చును, అంచున్, ఏను, అనియెదన్=పల్కెదను, ఇఁకనైనన్, అల్కన్ = కోపమును, మానవుగదా=విడువవుగదా?

* నాటిన.

విశే. నీకుంతలము లెంత వక్రములో నీస్వభావమును నంత వక్రమే. కాకున్న నింతగఁ బ్రార్థించినను నీవలుక విడువవేల అనునభిప్రాయముతో 'అరాళకుంతలపదము' ప్రయుక్తమయ్యెనని గ్రహించునది. ముల్లుపైఁ బడినచోఁ జిగురు చిరుగుటయుం దాన దానిశోభ చెడుటయుం సహజములు. కంటకవితానమనుటంజేసి రోమాంచాతిశయము ప్రకటితమయ్యెను. నాయికాపాదతాడనమునందియు నాయకుఁ డిట్లు పలుకుటయుం నాయకోత్కర్షకే కారణమని యాలంకారికాశయమైనట్లు సాహిత్యదర్పణమునందలి యీ క్రిందిసందర్భము తెల్పుచున్నది. "దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం పాదప్రహార ఇతి సుందరి నాస్మి దూయే, ఉద్యత్కఠోరపులకాంకురకంటకాగ్రైర్యద్భిద్యతే మృదుపదం నను సా వ్యథా మే" ఇంచుమించుగ దీనికి భాషాంతరీకరణమే యీపద్యమనుట స్పష్టము. ఇఁక సత్యభామ కృష్ణునిశిరముపైఁ దాఁచెనని 121-వ పద్యమున వర్ణించినకవి, యిందు 'నీపదపల్లవము మత్తనుపులకాగ్రకంటకవితానము సోఁకిన నొచ్చునంచు' శ్రీకృష్ణుఁడన్నట్లు వర్ణించుట యెట్లు పొసఁగునని కొందఱందురు. కాళ్లపై నుత్తమాంగమును మోపి సాష్టాంగనమస్కార మాచరించునపుడుగదా సత్య కృష్ణునిశిరమును దొలఁగంద్రోచెను? అపుడా మెపదము త్రోచుటయందైన సంరంభమువశమున శరీరమునకుఁ దాఁకెననియుఁ, ద్రోయునపుడు శరీరముం దాఁకెననుట కీపద్యమే సాక్ష్యమనియుఁ, సమాధానము చెప్పుదురు. కాని, శ్రీకృష్ణుఁడు నామేనియందలి కంటకములంబోలు పులకాగ్రములను నీపాదము తాఁకినచో నొచ్చియుండునని మాత్రమే పల్కెననియుఁ, బాదము మేనునుదాఁకినట్లు పల్కలేదనియుఁ జెప్పనొప్పునుగాన, నట్లాశంకింప నవకాశమే లేదని విశదమగుచున్నది. తాఁకినన్ = అంటినచో; ఇది చేదర్థకరూపము. మఱియుం నేతత్స్థలమున శ్రీకృష్ణుఁడు తనమోహాతిశయమును సత్యకుఁ దెలిపెననియుం ధ్వనించెడు. నొచ్చును. నొచ్చియుండును. అనఁగాఁ దాఁకినచోఁ దప్పక పాదమునకు నొప్పి కల్గియుండునని భావము. ఇది తద్ధర్మార్థకరూపము. అక్కపటనాటకసూత్రధారి శ్రీకృష్ణుఁడు తనమేనంగల్గిన సాత్త్వికచిహ్నములను ననురక్తిని సత్యకుఁ బ్రకాశము సేయుం నెపమున "ఈయొడలిపై నెక్కొనుకంటకాగ్రములంబోలు పులకాంకురములందాఁకిన నీపదపల్లవము నొచ్చియుండును. తెలివితక్కువదానవు. నీకుఁ గల్గుకష్టమునుగూడ నీవు కోపవశమున గాంచవైతివి. నీపదము చిగురాకునొప్పిదముగలదిగాన నాకు నొప్పికలుగఁజేయఁజాలదు" అని యీరీతిని బ్రసంగించెననుటయే సరసమగుటఁ, నైశంక కవకాశమే గానరాదు. ఇట్లుగాక కవ్యాశయము కొంద ఱనుకొనినట్లే యైనచో 'తాకుట నొచ్చెను' అనియే పదప్రయోగము చేసియుండును. పురుషులకుఁగూడ సాత్త్వికోదయమును వర్ణించుట కవులయాచారమైయున్నది. "పాటలగంధి, జలజాతాసన, కోకనపదహాతి, నను

భవదీయదాసుని" ఈనాల్గుపద్యములును నేతత్కృతికర్తయైన శ్రీకృష్ణదేవరాయమహీ జాని తనప్రియురాలగు తిరుమలదేవి ప్రణయకోపవశమునఁ దన్నుఁ బాదతాడనము పాల్సేయఁ, దజ్జనితావమానభరముకతనఁ గొన్నిదినంబు లామెమందిరమునకుఁ బోవుట మానఁగ, నామె యరణపుఁగవియగు ముక్కుతిమ్మన యావిషయము నెఱింగి పారిజాతాపహరణమును రచించి, యందు సత్య శ్రీకృష్ణునిశిరమును దన్నినట్లు విషయమును గల్పించి, తన్మిషను గృష్ణదేవరాయల కినుక నపనయించి యిర్వురనుగూర్చె ననుజనశ్రుతికి సూచకములండ్రు. తదనుసారముగ 122 లోనుండు, కుహనాగోపాలుఁడు= మాయాకృష్ణుఁడు. ఇది కృష్ణదేవరాయనామద్యోతకమని యండ్రు.

సత్యభామ శ్రీకృష్ణుని దూఱుట.

చ. అన విని మానినీతిలక మప్పుడు మేయఱ దోఁప నిక్కి వీ
డిన కచపంక్తిఁ బల్మఱు ముడి న్వెడ దోపుచుఁ బైఁ జెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింప జం
కెననెఱిచూపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై. 124

టీ. అనన్, విని, మేయఱ=శరీరార్ధము, తోఁపన్=ప్రకాశముకాఁగ, నిక్కి=లేచి, వీడిన, కచపంక్తిన్=కేశములవరుసను, ముడిన్=ముడియందు, వెడ=వ్యర్థముగా, (ఊఱకే) దోపుచున్=తూర్చుచు, పైచెఱంగున్=పైఁటచెఱఁగును, చనుదోయిన్=స్తనద్వయమున, గ్రక్కునన్=శీఘ్రముగ చేర్చుచు, మొగంబునన్, లేఁజెమరు=చిఱుచెమట, అంకురింపన్=పుట్టఁగా, జంకెననెఱిచూపు=బెదరింపుగల సొగసగుచూపు, చూచి, చలితాధరపల్లవాగ్రయై=తూలెడుచిగురువంటి మోవికొనగలదై, పలికెన్.

భా. సత్య శరీరార్ధ మగపడురీతినిలేచి వీడినకేశములముడినమర్చుచుఁ బైఁట సవరించుకొనుచు, బెదరింపుచూపునఁ గృష్ణునిం గాంచి యధరపల్లవము చలింప నీగలినను.

విశే. సత్యభామ యొనర్చిన యీచేష్టలు సంభ్రమవశమున నారీజను లొనర్చునవియు, వారు గాముకుని లోఁగొనునదనుఁగూడ నిట్టివాని నొనర్తురనియుఁ దెలియ నయ్యెడు.

ఉ. ఈనయగారవుం బ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే
లా నిను నమ్మియుండినఫలం బిదె తోడన కల్గె నాకు నీ
యాన సుమీ ననుం జెనకి యాఱడిపెట్టిననవ్వువారలం
గాన *వెలుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్? 125

* నెలుంగునే.

టీ. ఈనయగారవుం బ్రియములు=ఈమృదుత్వముతోడి ప్రియవచనములు, ఈ పసలు=ఈచాతుర్యములు, ఈ మొగమిచ్చుమాటలు=ఈముఖస్తుతివచనములు, ఏలా=ఎందులకు? నిను నమ్మియుండినఫలంబు=నిన్ను విశ్వసించినఫలము, తోడనె=వెంటనె, నాకున్, కల్గెన్=సంభవించెను. నీయానసుమీ=నీతోడుసుమా, ననున్, చెనకి=తాఁకి (నన్నుద్దేశించి) ఆఁడిపెట్టినవవ్వారలన్=నిందించినపరిహాసకులను, కానవు=ఎఱుంగవు. (తెలిసికొనవు) 'కానను' అని పాఠాంతరము. అపుడు సత్య కర్తయగు. కానను=చూడలేను. పసులకాపరి=గోపాలుఁడు, భావజమర్మకర్మముల్=మదనతంత్రములను, ఎఱుంగునే=తెలియునే?

విశే. "పసులకాపరివి కావుననే నను నారదుఁడు దూఱుచుండ నీవును వీనులకు విందుగ వింటివి. మఱియుం నరసికశిఖామణివి కావుననే నాకు నీపొందు తగదు." అని సత్య కృష్ణుని గ్రామ్యజనతను, నరసికతను బ్రకటించుచుఁ బ్రసంగించెనని యెన్నునది.

ఉ. ఇంకిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకము గాని [1]నీవలనిబొంకులు మాఁచవి గావు రుక్మిణీ
పంకజపత్త్ర నేత్త్రకును బ్రాణపదంబులు గాని వల్లవీ
కింకర! చాలుఁ జాలు [2]నుడికింపకు నింపకు లేనికూరుముల్. 126

టీ. ఇంకన్=ఈపైని, ఇటు=ఈరీతిగ, నిన్నున్, నమ్మన్=విశ్వసింపను. ననున్, ఏమిటికిన్=ఎందులకు, కెరలించెదు=చెలరేఁగింతువు. ఎంతయున్=మిక్కిలి, పొంకము=పొందిక, కాని (నిరుపయోగములు) నీవలనిబొంకులు=నీవానుకూల్యమునకై యాడిన కల్లమాటలు, మాఁచవి=మాకురుచి, కావు. వల్లవీకింకర=వ్రేతలసేవకుఁడా! రుక్మిణీపంకజపత్త్రనేత్త్రకును, సత్యభామకే, ప్రాణపదంబులు=ప్రాణతుల్యములు, చాలుఁజాలున్, ఉడికింపకు=పరితపింపఁజేయకుము, లేనికూరుముల్=లేనిస్నేహములను, నింపకు=నిండింపకుము.

విశే. '1 ఈవలనిబొంకులు, 2. నడికింపకు' అనుపాఠాంతరములు గాననగును. 1 అర్థవిశేషస్ఫూర్తిలేమి నిందు విశేషమెద్దియుఁ గానరాదు. 2 నడికింపకు మనఁగాఁ గలపింపఁజేయకుమని యర్థము. దీనికన్న నాఁడువారిమాటలగతి ననుసరించిన, నుడికింపకు మనునదియే సాధుపాఠమని తోఁచెడిని. 'మాఁచవి' అని మాశబ్దప్రయోగ మభిమానాతిశయ సూచకము. వల్లవీకింకరపదము గ్రామ్యవనితాసక్తిప్రకాశనపురస్సరముగ నరసికతాద్యోతనార్థము.

---

1 యీవలనిబొంకులు. 2 నడికింపకు.

ఉ. *గట్టివచేఁతలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేని పలుపోకలమాయలు నీకు వెన్నతోఁ
బెట్టిన వౌ టెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్? 127

టీ. గట్టివచేఁతలున్=ధూర్తకృత్యములును, పసలున్=చాతుర్యములును, కల్లదనంబులున్=బెడ్డనడతలును, నీవు పుట్టఁగాఁ బుట్టినవి (నీపుట్టుకతోడనే పుట్టినవనుట) ఎందున్=ఎచ్చటను, లేని, పలుపోకలమాయలు=అనేకవిధములైనమాయలు, నీకు వెన్నతోఁ బెట్టినవి. (నీకుగ్గుతోఁ బట్టినవని భావము) ఔట=అగుట, ఎఱింగియును=తెలిసియుం, బేలతనంబునన్=అవివేకమున, నిన్ను నమ్మి=నిన్ను విశ్వసించి, నాగుట్టును=నామానమును, తేజమును=ప్రభావమును, మిగులన్=మిక్కిలియు, కోల్పడిపోయితిన్=పోఁగొట్టుకొంటిని. ఏమిచేయుదున్?

విశే. గట్టి+వా=గట్టినోరుగలవాఁడు=ధూర్తుఁడు. గట్టివ. 125, 126, 127 పద్యముల భగవత్పక్షమగు నొకానొక నర్థవిశేషమును స్ఫురించెడు:—"125 ప్రియములును ముఖప్రీతికరములును నగుమాటలేల? నిన్ను భక్తిని నమ్మినందులకు వెంటనె ఫలముకల్గెను. నన్ను ద్దేశించి నిందసేసినపరిహాసకుల నీవు దయమీఱఁ గాంచవు. ఓగోపాల! మది నుదయించుమర్మకర్మముల నీ వెంతయుం నెఱుంగని సరళస్వభావుఁడవు. 126. ఇఁక నేనజ్ఞానమున నిన్నిదినములు భావించుగతిని నిన్ను భావింపను. నన్నేల యీగతిని గెరలంజేయుదువు? పొందికకానిబొంకులు పలుకఁజాలను. లక్ష్మ్యంశసంభూతురాలగు రుక్మిణికి నిక్కమముగ నీమాటలు ప్రాణపదములే. ఓగోపాల! నన్ను బాములపాల్సేయక యకృత్రిమమగుకూరిమిం గాంతువుగాక. 127 సత్త్వరజస్తమోగుణముల నేర్పడుకృత్యముల మాయారూపుఁడవై జగత్తును మోహింపఁజేయునిన్ను నే నజ్ఞానవశమున సామాన్యగోపాలునింగాఁ దలంచితి. దాన నామానప్రభావములు డిందుపడియెను. అయ్యో! నే నింక నేమి యొనర్తును." అని యీగతి నీపద్యత్రయమున భగవానుని త్రిగుణాత్మకుని బొగడి, తద్భక్తవాత్సల్యాతిశయమును నిపుణముగఁ బ్రకటించి, కవి వైష్ణవమతాశ్రయుండగుకృతిపతి కింపు పుట్టించి, తనయభేదభావమును వెల్లడించెనని సరసహృదయులు తలంతురు. ఇట్టి యాశయము మదినిడికొనియే యీసందర్భమున 'జగన్నాటకసూత్రధారి' 'కుహనాగోపాలుఁడు' అని శ్రీకృష్ణరూపము భగవానుని మాయారూపమే యని సూచించెను.

---

* గట్టిన చేఁతలుం,

చ. మునిపతి వచ్చి పూవొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగన
న్వినుతి యొనర్పఁగా వినినవీనుల మాచవిగానిమాటల
న్వినవలసెంగదా యిపుడు నీ విట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె చెప్పుమా. 128

టీ. మునిపతి=మునిరాజు (నారదుఁడు), మోదముతోడన్=సంతోషముతో, భవత్ప్రియాంగనన్=నీప్రియురాలిని, వినుతి=స్తుతి, ఒనర్పఁగాన్=చేయఁగా, వినిన వీనులన్=విన్న చెవులచే, మాచవిగానిమాటలన్=మారుచింపనిపల్కులను, వినవలసెంగదా=వినవలసివచ్చెనుగదా? ఇపుడు=ఈసమయమున, నీవు, ఇటన్, వచ్చుట, పారిజాత వాసనన్=పారిజాతపుష్పపుఁదావిని, ప్రకటించి=వెల్లడించి, నాకున్, ఎకసక్కెము సేయనకాదె=పరిహాసము సేయుటకేకదా! చెప్పుమా.

వ్యా-విశే. 'భవత్ప్రియాంగన'యనుటంజేసి,యామెయే నీయొక్కడు మక్కువకుఁ బాత్రముగాని నేను గానని ధ్వనించెడు. మాశబ్దము చిత్తౌన్నత్యద్యోతకము 'నాకు నెక సక్కెము' అనుచో 'నన్ను నెకసక్కెము' అనుటకు మాఱుగా షష్ఠ్యంతనాశబ్దము ప్రయుక్తము. ఇట్లు షష్ఠి పెక్కువిభక్తులకు మాఱుగఁ గల్గుట ప్రసిద్ధము.

క. మానం బె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిలస
న్మానములకు మూలం బగు
మానరహిత మయిన బ్రదుకు మానిని కేలా? 129

టీ. సతులకున్=పతివ్రతలగుస్త్రీలకు, తొడవు=అలంకారము, ప్రాణాధికంబు=ప్రాణమునకన్న నెక్కుడైనది. అఖిలసన్మానములకున్=సమస్తమైన గౌరవములకును, మూలము=కారణము, మానరహితమైన=చిత్తౌన్నత్యములేని. అలం. ఉల్లేఖము.

తే. తనదుకోడండ్రలోనఁ బెద్దయుఁగ నన్ను
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁజేసి యాసాధ్వి సేవ
సేయఁ బోవంగ నా కింక సిగ్గు గాదె? 130

టీ. పెద్దయుఁగ=మిగులపెద్దదానినిగా, మన్నించున్=సన్మానించును, చనవు=ప్రేమతోడిస్వాతంత్ర్యము. సాధ్వి=పతివ్రత.

సీ. ఉవిద యెవ్వతె నోఁచి యున్నదో యీస్యమం
తకరత్న మింక నౌఁదల ధరింప
నీరైవతకశైలచారుకూటవిటంక
కేలి కిం కెవ్వతె పాలుపడునొ
యెవ్వతె కబ్బునో యీవసంతారామ
కర్పూరకదళికాగారవసతి
లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁ గలదొ
తే. యకట నేఁ బెంపఁ బెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ-
నన్ను నాతోడిసవతులు నగక మున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ *గాక. 131

టీ. ఈస్యమంతకరత్నము=ఈస్యమంతకమను పేరుగలరత్నమును (దీని సత్రాజిత్తు సూర్యవరప్రభావమునఁ బడసి కూఁతున కరణ మొసంగెను.) ఇంకన్=ఈపైని, ఔఁదలన్=తలపైని, ధరింపన్=తాల్పఁగా, ఎవ్వతె, ఉవిద=ఏస్త్రీ, నోఁచి=వ్రతమొనర్చి, ఉన్నదో, ఈరైవతక......కేలికిన్=ఈరైవతకాద్రిసంబంధమైన సుందరములైన శిఖరములందలిగువ్వగూడుల విహారమునకు, ఎవ్వతె, ఇంకన్, పాలుపడునో=లోఁబడునో?, ఈవసంతారామ......వసతి=వసంతోద్యానమందలి కర్పూరపుటరఁటిచెట్లనడుమనైన గృహమందలియునికి, ఎవ్వతెకున్, అబ్బునో=లభించునో? లీలన్ = విలాసముతో, ఈమణిసౌధజాలకంబులన్=ఈరత్నాలమేడలగవాక్షములందు, నిన్నున్ గూడి, ఎవ్వతె, వార్ధిన్=సముద్రమును, చూడన్ కలదో, అకట=అయ్యో! నేను, పెంపన్ = పోషింపఁగా, పెరిఁగిన=అభివృద్ధినందిన, శుక...బృందము=చిలుకలయు నెమిళులయు గోరువంకలయుఁ గుంపు, ఎవతెను, చేరునొక్కొ=పొందునొకో? నాతోడిసవతులు=నాతోడివారలైనసపత్నులు, నగకమున్న=నవ్వకమునుపే, పంతము=ప్రతిజ్ఞ, అలరంగన్= ఒప్పునట్లు, నిన్ను, మెప్పింతుఁగాక=తప్పక మెచ్చఁజేయుదును.

విశే. ఇందు సత్యభామ తనమరణమును గృష్ణునకు సూచించెను. 'మెప్పింతుఁగాన' అని పాఠాంతరము. ఆపక్షమున 'కాన' అనుదాని హేత్వర్థకావ్యయముగ గ్రహించి యుత్తరపద్యముతో నన్వయించుట యుచితము. 'సామికాన' అనుమున్నగుప్రయోగ

*గాన.

ములందుపలెఁగాక యిందు 'కాన' అనునది స్వతంత్రముగ సంబోధనమునఁ బ్రయుక్తమయ్యెనని కొందఱు వ్రాసిరి. కాని దీని కిందుఁదక్క నెందును స్వతంత్రప్రయోగ మగపడమి నట్లు గ్రహింప నవకాశములేదని తోఁచెడు.

క. నను నెవ్వతెఁగాఁ జూచితి,వని యంతర్బాష్పయగుచు నవనతముఖియై
ఘనతరగద్గదికాని,స్స్వనమున మఱి మాటలాడ శక్యము గామిన్. 132

టీ. ననుఁ ఎవ్వతెఁగాఁ చూచితివి = నన్ను సామాన్యవనితనుగా నెంచితివా! ఇది యాఁడువార లను గర్వోక్తి. అని, అంతర్బాష్ప=లోనున్నకన్నీరుగలది, అగుచున్, అవనతముఖియై = వంచిన మోముగలదై, ఘనతరగద్గదికానిస్స్వనమునన్ = గొప్పదైన డగ్గుత్తికగలస్వరముతో, మఱి=మఱియు, మాటలు+ఆడన్ = పల్కుటకు, శక్యము = వీలు, కామిన్=కాకుండుటచే, ఉత్తరపద్యముతో నన్వయము.

వ్యా-విశే. కామి: అగుధాతువ్యతిరేకభావార్థకరూపము.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్. 133

టీ. లలితాంగి=సుందరమైన శరీరముగలసత్య, ఈసునన్=ఈర్ష్యచే,పుట్టి, డెందమునన్=మదిని, హెచ్చిన=వృద్ధినందిన, శోకదవానలంబుచే = శోకమనుదవాగ్నిచే, గాసిలి=బాధనొంది, ప్రాణవిభుకట్టెదుటన్ = ప్రాణేశ్వరుఁడగు శ్రీకృష్ణు నెట్టయెదుట, పంకజశ్రీసఖమైన=పద్మశ్రీకిమిత్రమైన, మోముపయిన్=ముఖముమీఁద, చేలచెఱంగు= వస్త్రాంచలమును,ఇడి=ఉంచి, బాల...ధ్వనిన్-బాల=లేఁతయైన,పల్లవ=చిగురులయొక్క, గ్రాస=తిండిచే, కషాయ=మధురమైన, కంఠ=గుత్తుకకల, కలకంఠవధూ=ఆఁడుకోయిలల యొక్క, కల=అవ్యక్తమధురమైన, కాకలీ=సూక్ష్మమైన, ధ్వనిన్ = శబ్దముంబోలుశబ్దముతో, ఏడ్చెన్.

వ్యా-విశే. చేల. ప్ర. చేలము. ఇచ్చో 'చీర' అనుపాఠాంతర మగపడును. కాని యిది వాడుకయందే స్త్రీవస్త్రమాత్రపర్యాయముగ నగపడుట నిందర్థవిశేష మేమియులేదు. కడు+ఎదురు=కట్టెదురు. ఇది యోగవిభక్తిమగుట టవర్ణమును సప్తమ్యర్థమున నత్వముం గల్గెను. ఇట్లే మనువసుచరిత్రముల స్త్రీరోదనము హృద్యమగుగతిని వర్ణితమయ్యెను. ఈమూఁడుపద్యములయర్థమును గమనించియే 'ముక్కుతిమ్మన ముద్దు

ముద్దుగను నల్లసానిపెద్దన నల్లనల్లను, భట్టుమూర్తి బావురుమనియుఁ నేడ్చె' నని పెద్ద లందురు. నిక్కముగ నాలోచించిన, నీవర్ణనము ముద్దుముద్దుగనే యొప్పుచున్నది. "భవన్ముఖాంకురము సోఁకెఁ గనుంగొనుమంచు వేదనవెపంబిడి కలస్వనంబుతో మీఁటిన విచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువాఁదగా" వరూథిని నేడ్పించిన యల్లసాని వాని వర్ణన మల్లనల్లనే యగపడును. మఱియుఁ గిరిక "గాంభోజీరాగవిపంచికాకలన సెల్గెత్తి మోమునఁ బటాగ్రంబొత్తి" యేడ్చినట్లు వర్ణించినమూర్తికవి వర్ణనము బావురుమని యేడ్చుటనే తెలుపును. ఇట్లే క్రమముగ నొకవర్ణనము నానంతరకాలికులు తమయిచ్చ వచ్చినగతిని మెఱుఁగువెట్ట నెంచుట చూపట్టెడిని.

ఉ. ఆరమణీలలామ మది నంటినకోపభరంబు నిల్పఁగా
నేరక నెవ్వగం బొగుల నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం
జేరిచి బుజ్జగించి నునుఁజెక్కులఁ జాలుకొనంగ జాలుక
న్నీరు కరంబునందుడిచి నెయ్యముఁ దియ్యముఁ దోఁప నిట్లనున్.134

టీ. ఆరమణీలలామ=ఆస్త్రీరత్నము, మదిన్=మనస్సున, అంటిన = లగ్నమైన, కోపభరంబున్ = కోపభారమును, నిల్పఁగాన్, నేరక, నెవ్వగన్ = నిండుదుఃఖమున, పొగులన్=దుఃఖింపఁగా, నీరజనాభుఁడు=కృష్ణుఁడు, నిండుఁగౌఁగిటన్=నిండైనభుజాంతరమున, చేరిచి, బుజ్జగించి=ఓదార్చి, నునుఁజెక్కులన్, చాలుకొనంగన్ = వరుసగను నట్లు, జాలు=లొఱఁగు, కన్నీరు, కరంబునన్=హస్తముచే, తుడిచి, నెయ్యము=స్నేహము, తియ్యమున్=మాధుర్యమును, తోఁపన్ = ప్రకాశితమగునట్లు, ఇట్లు = ఈరీతిగ, అనున్=అనెను. వచ్యర్థమున భూతమున లాడ్రూపము.

వ్యా-విశే. కౌఁగిలి. ఔపవిభక్తికము.

ఉ. ఓలలితేంద్రనీలశకలోపమకైశిక! యింత వంత నీ
కేల లతాంతమాత్రమునకేఁ గలుగ న్విను నీకు దేవతా
కేలివనంబు సొచ్చి యనికి న్బలసూదనుఁ డెత్తి వచ్చినన్
దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్. 135

టీ. ఓలలి...కైశిక=ఓసొగసైన యింద్రనీలమణిఖండములంబోలు కేశభారము గలదాన! లతాంతమాత్రమునకే=పుష్పమాత్రమునకే, ఇంతవంత = ఇంతయధికమైన దుఃఖము, నీకున్, కలుగన్=సంభవించుట, ఏల=ఎందులకు, విను=వినుము, దేవతాకేలి వనంబు=దేవతలవిహారవనం బగునందనమును, చొచ్చి=ప్రవేశించి, అనికిన్=యుద్ధము

నకు; బలసూదనుఁడు=బలాసురహంతయగు దేవేంద్రుఁడు, ఎత్తి = దండెత్తి, వచ్చినన్, దీలుపడంగన్ = భయపడునట్లు, తోలి=పాఱఁద్రోలి, ఇటన్ =ఇచ్చోటికి, పారిజాతమున్=పారిజాతవృక్షమును, తెచ్చెదన్, నీకున్, ఇచ్చెదన్.

విశే. ఒక్క సుమమునకై నీవింత వగవనేల! సుమసమూహమున కంతకును నాధారమగు పారిజాతమునే నీపాలు సేయుదునని 'మాత్ర' పదమునకు సారస్యము. అబలాసురహంతయగు దేవేంద్రుఁడంతటివాఁ డెత్తివచ్చినను, నాతనిం బాఱఁద్రోలుదునని యాత్మశక్త్యతిశయమును, నెంతటిదుష్కరకార్యమునైన నీవిషయమున నీకొఱకే నొనర్తునని తనప్రేమాతిశయమును బ్రకాశితమొనర్పఁ గృష్ణుఁ డిట్లు ప్రసంగించెనని 'బలసూదనుఁ డెత్తివచ్చినన్' అనుపదములకు సారస్యమును గ్రహింపనగును.

'తెచ్చెద ఇచ్చెద' అనుపదములు భావ్యర్థమున వాడఁబడిన 'ఎద'రూపములు.

తే. వామలోచన! నీకేలివనములోనఁ
జలువ వెదచల్లుచెంగల్వకొలనికెలన
సరసకర్పూరకదళికాతరులనడుమఁ
బెరటిచెట్టుగ నాటింతుఁ బెంపు గనుము. 136

టీ. వామలోచన = ఓమనోజ్ఞములగు కన్నులుగలదాన, నీకేలివనములోనన్ = నీవిహారవనమున, చలువన్ =శైత్యమును, వెదచల్లు = వ్యాపింపఁజేయు, చెంగల్వకొలని కెలనన్ = ఎఱ్ఱకలువలుగల సరస్సుయొక్కపార్శ్వమున, సరసకర్పూరకదళికాతరుల నడుమన్ = సరసములగుకర్పూరపు టరఁటులమధ్యమునందు, పెరటిచెట్టుగ = ఇంటి వెనుకదొడ్డిలో నుండువృక్షమగునట్లుగ, నాటింతున్=పాతింతును. పెంపున్ =సమృద్ధిని, కనుము=పొందుమా.

విశే. వృక్షము బాగుగఁ బెరుఁగుటకును, వాడకుండుటకును, నధికమనోజ్ఞమగుటకును, నిత్యానందదాయకమగుటకును నిందలి ప్రదేశములు సూచకములు. పారిజాతముం దెచ్చి మఱల నింద్రునకుఁగాని, యితరవనితలకుఁగాని యీనని తెల్పుటకును, కేవలము దాని శాశ్వతముగ నీస్వత్వముం గావింతునని తెల్పుటకునుఁ బెరటిచెట్టుగ నాటింతునని శ్రీకృష్ణుఁడు సత్యతోఁ బల్కెనని సారస్యము నెన్నునది. కెలను. రూ. అ. కెలఁకు.

క. అని పలుకునంబుదశ్యాముని గర్జితమధురవాక్యముల సత్యామా
నిని నీపలతికవోలెం, గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్. 137

టీ. అని, పలుకు = మాటలాడు, అంబుదశ్యాముని...వాక్యములన్ = నీల మేఘశ్యామునియొక్క గర్జితములబోలు తీయనిమాటలచే, సత్యామానిని=మానవతియైన సత్యభామ, నీపలతికవోలెన్ = కడిమిచెట్టువలె, సఖీమయూరికలు = చెలికత్తెలను నాఁడునెమిళ్లు, చెలరేఁగన్ = విజృంభింపఁగా, కనుపట్టెన్=చూపట్టెను.

విశే. వర్షాకాలమున మేఘగర్జనము కల్గినతోడనే కడిమిచెట్లు పుష్పించుటయు' నెమిళులు పురివిచ్చికొని యాడుటయుఁ బ్రసిద్ధమగుట, నంబుదశ్యాము మధురగర్జితవాక్యములకలిమిని సత్యామానిని నీపలతికవోలి యగపడుటయుం, సఖీమయూరికలు చెలరేఁగుటయు సంభవించెనని సారస్యము నెన్నునది. బలసూదనులోడ యుద్ధమొనర్చు సంకల్పమువలని యుత్సాహముమీఱఁ బ్రసంగించుటకతన శ్రీకృష్ణవాక్యములు గర్జితములంబోలె గంభీరములయ్యెనని గ్రహించునది. ప్రియసఖ కవమానము తీరి యాప్సితార్థప్రాప్తి మిన్నగ నగుటంజేసి చెలికత్తెలకును సంతసము కల్గెనని గ్రహించునది. పూఁచినకడిమివలె సత్యయు మేటివికాసమున మించెనని తెల్పుటకు నీపలతికపదము ప్రయుక్తము. అలం. రూపకోపమలు.

మ. దయమానాక్షివిలోక! లోకహితకృత్ప్రారంభ! రంభాకుచ
ద్వయదుర్గాధిపతిద్విషత్పతితగాథావ్యక్తదోస్సార! సా
రయశస్సాంద్రదిశాంత! శాంతహృదయారజ్యన్నయాచార! చా
రయుతోపాయవిచార! చారణగణప్రస్తూయమానోదయా! 138

టీ. దయ...విలోక-దయమాన = కనికరమువలెనొప్పు, అక్షి=కన్నులయొక్క, విలోక=చూపుగలవాఁడ, లోక...ప్రారంభ-లోక=ప్రజలకు హిత=ఇష్టమును, కృత్ = చేయునట్టి, ప్రారంభ=కార్యారంభములుగలవాఁడ!, రంభా...దోస్సార-రంభా = రంభయొక్క, కుచద్వయ=స్తనద్వంద్వమనెడు, దుర్గ = కోటలకు, అధిపతి=ప్రభువులైన, ద్విషత్=శత్రువులచే, పతిత=చదువఁబడిన, గాథా=చరిత్రములచే, వ్యక్త=విశదమగు, దోస్సార=బాహుబలముగలవాఁడ, సార...దిశాంత-సార=శ్రేష్ఠమైన, యశః=కీర్తిచేత, సాంద్ర=తఱచైన, దిశాంత=దిగంతములుగలవాఁడ, శాంత...చార-శాంత=ప్రశాంతమైన (క్షాంతియుక్తమైన), హృదయ=మదియందు, ఆరజ్యత్=పూర్ణముగఁ బ్రకాశించు, నయాచార=నీతితోడినడతగలవాఁడ! లేదా! శాంతహృదయులను రంజింపఁజేయు నీతితోడినడవడికలవాఁడ, చార...విచార-చార = మర్మజ్ఞులగువారితో, యుత=కూడిన, ఉపాయ=సామాద్యుపాయములయొక్క, విచార = విమర్శనముగలవాఁడ! చారణ...

దయా-చారణగణ=చారణులసమూహముచే, ప్రస్తూయమాన=నుతింపఁబడు, ఉదయా= అభివృద్ధిగలవాఁడ.

భా. కృష్ణరాయనిచూపులనుండి దయ యొల్కుచుండుననియు, నాతఁ డేపని సైనను బ్రజాహితముంగోరియే చేయుచుండుననియు, నాతఁ డనిం జంపినపగతురు వీరస్వర్గముం జూరఁగొని రంభాపరిరంభసుఖము ననుభవించుచు నాతనిచరితముం గొని యాడుచుందురనియు, నాతనికీర్తి దిగంతవిశ్రాంతమయ్యెననియు, నాతనినడవడి సజ్జన సంస్తూయమానమనియు, నాతఁడు జారచక్షువై సామదానభేదదండోపాయముల నర యుననియు, నాతనియభివృద్ధి చారణజేగీయమానమనియు భావము.

విశే. ఇయ్యది ముక్తపదగ్రస్తము. పదాంతమున విడువఁబడినపదమును మఱల స్వీకరించుచు నడుపుటకే ముక్తపదగ్రస్తమని పేరు. పాదాదినారబ్ధమైనపదము తుదిపా దపుఁ దుది నట్లే మఱల నావృత్తిచేసినచో, నదియే సింహావలోకన ముక్తపదగ్రస్తమగు. ఆనియమము ననుసరించి యిది సింహావలోకనముక్తపదగ్రస్తమే కాదగుంగాని ప్రథమ పాదాదిని 'దయ' అనియుండ నంతిమపాదాంతమున 'దయా'అని గుర్వంతముగ నుండు టఁజేసి చింత్యము.

క. ప్రతివర్ష వసంతోత్సవ, కుతుకాగతసుకవినికరగుంభితకావ్య
స్మృతిరోమాంచవిశంకిత,చతురాంతఃపురవధూప్రసాదనరసికా! 139

టీ. ప్రతివర్ష ...రసికా-ప్రతివర్ష = ప్రతిసంవత్సరమునసైన, వసంతోత్సవ = వసంతోత్సవమునందైన, కుతుక=సంతోషాతిశయముతో, ఆగత=వచ్చిన, సుకవినికర = సుకవిసమూహముచే, గుంభిత=కూర్పఁబడిన, కావ్య=కావ్యములయొక్క, స్మృతి = స్మరణముచేసైన, రోమాంచ=గగుర్పాటుచే, విశంకిత = మిగులసందియమందు, చతుర= నిపుణలైన, అంతఃపురవధూ = అవరోధజనముయొక్క, ప్రసాదన = తేర్చుటయందు, రసికా=సరసుఁడవైనవాఁడా.

భా. ప్రతిసంవత్సరమున వసంతోత్సవమొనర్చువేళలఁ గవు లేతెంచి సరసము లగుకావ్యములు నొనర్చుచుందురనియుఁ, దత్కావ్యరసాస్వాదముం జేసి కృష్ణరాయలకు రోమాంచము కలుగ, నది వెఱవనితలయందలియనురాగముకతనఁ దన కీరీతిని సాత్వి కోదయముకల్గెనని వారు భావింతురేమో యనుభయమున, నాతఁడు వారిసందియమును దొలఁగించి సరసగతినిఁ దేర్చుచుండుననియు భావము.

విశే. ఆశ్వాసాంతపద్యమగు నిందుఁ గవి యీయాశ్వాసమునందైన శ్రీకృష్ణ కృతసత్యానునయరూపమగు సంపూర్ణకథను 'చతురాంతఃపురవధూప్రసాదనరసికా'

అనుదానిమూలమున సూచించెను. మఱియుఁ గృష్ణరాయలు గోపము విడనాడి తనయెడం బ్రణయాపరాధము గావించిన తిరుమలదేవిని దేర్చుటనుగూడ నిందుఁ గవి సూచించె ననఁదగును. ఆతేర్చుటయుఁ దనకావ్యనిర్మితి మూలముననే జరిగెననునంశమును గవిఁ 'ప్రతివర్షవసంతోత్సవ ... సుకవిగుంభితకావ్యస్మృతి...' ఇత్యాదిపదములమూలమున నిపుణముగఁ బ్రకటించెను. మఱియుఁ దనకావ్యముగూడ వసంతోత్సవవేళనే సృష్టమయ్యె ననునంశమునుగూడఁ దెలియఁబఱచెను. మఱియుఁ గృష్ణరాయలపాండిత్యమును రసజ్ఞతనుగూడఁ బ్రకాశమొనర్చెను. రాజులకాలముననేగాక ప్రాచీనకాలమునుండియుం వసంతోత్సవము జరపువాడుకయున్నట్లు సంస్కృతకావ్యాదులవలనఁ దెలియవచ్చెడు.

నర్కుటము.——

> ప్రసృతివిలోచనాకుసుమబాణ ! దిశాలలనా
> ఘుసృణపటీరలేపకృతికోవిద! బాహుతటీ
> [1] విసృమరకీర్తిజాల ! రణవీక్షితవైరినృప
> త్యసృగతిపంకిలాసిముఖ! [2] ఐందవవంశమణీ! 140

టీ. ప్రసృతి...బాణ-ప్రసృతివిలోచనా = చేరెడుకన్నులుగలస్త్రీలకు, కుసుమబాణ = పుష్పాయుధుఁడా! (మన్మథుఁడా!), దిశా...కోవిద-దిశాలలనా = దిగంగనలకు, ఘుసృణపటీర = కుంకుమపూవుతోడి మంచిగంధమును, లేప=పూయుటయును, కృతి=కార్యమందు, కోవిద=పండితుఁడా ! బాహు...జాల-బాహుతటీ = బాహుప్రదేశమునుండి, విసృమర=ప్రసరించునట్టి, కీర్తిజాల=కీర్తిసమూహముగలవాఁడ, రణ...ముఖ-రణ=యుద్ధమునందు, వీక్షిత=చూడఁబడిన, వైరినృపతి = శత్రురాజులయొక్క, అసృక్=రక్తముచే, అతిపంకిల = మిక్కిలి బురదగలదిగాఁజేయఁబడిన, అసి = కత్తియొక్క, ముఖ = అగ్రముగలవాఁడ. ఐందవవంశమణీ! = చంద్రవంశశ్రేష్ఠుఁడా ! చంద్రవంశమనేవంశము (వెదురు) నకు మంచియుత్తియమైనవాఁడా! (చంద్రవంశముక్తాఫలమా!)

విశే. 'వీక్షిత' అనుచో 'విక్షత' అని యుండిన లెస్స. పరాక్రమముకతన సంభవించుటంజేసి కీర్తి బాహుతటినుండి ప్రసరించుచున్నదనెను. సామాన్యముగఁ గవులు కీర్తిని దెల్లఁగా నున్నట్లే వర్ణింతురు. ఇచ్చో నాసంప్రదాయము ననుసరించి పటీరలేప

---

1 విసృమరశౌర్యకీర్తిభరవిక్షతవైరి; 2 యాదవ.

మనినం జాలును. కాని, కృష్ణరాయలకీర్తి యతులప్రతాపసంభూతమగుటంజేసి రక్తవర్ణమిశ్రితపటీరలేపముతోఁ బోల్చెను. మఱియుఁ జందనమునఁ గుంకుమపూవుంగూర్చుటయు నాచారమైయుంట నీవర్ణన మెంతయు హృద్యమనఁదగును.

ఇది నర్కుటవృత్తము. కొందఱు దీనినే కోకిలకాకమందురు. న.జ.భ.జ.జ.వ. గణములు. 11 అక్షరము యతిస్థానము.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైనపారిజాతాపహరణం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



సదనలోచనాబ్జద
యాసారమరందపోషితార్థిభ్రమరో
ల్లాసగుణమలయకూట
ప్రాసాదనివేశ! కృష్ణరాయమహీశా. 1

టీక. శ్రీసదన...నివేశ-శ్రీ=లక్ష్మికి, సదన=స్థానములగు, లోచన = నేత్రములను, అబ్జ=పద్మములసంబంధమైన, దయాసార=కృపావృష్టియను, మరంద=పూఁదేనెచే, పోషిత=పోషింపఁబడిన, అర్థి=యాచకులను, భ్రమర=తుమ్మెదలయొక్క, ఉల్లాసగుణ = వికాసగుణముగల, మలయకూటప్రాసాద = మలయకూటమనుమేడ, నివేశ = వాసముగాఁగలవాఁడ!, కృష్ణరాయమహీశా = కృష్ణరాయభూమీశ, మీఁదిపద్యముతో నన్వయము.

భావము. భ్రమరములు పద్మమరందముం గ్రోలి యెలమిమీఱఁ బద్మగృహమున విహరించురీతిని, గృష్ణరాయల కనుదమ్ములనుండి వెల్వడుదయావృష్టి యన్మరందముం గ్రోలి యాచకభ్రమరము లాతనిమేడయం దెలమిమీఱ విహరించుచుండుననియుఁ, దాదృశయాచకభ్రమరవిహారాస్పదమగు మేడను గృష్ణరాయలు నివసించుననియు భావము. అనఁగాఁ గృష్ణరాయలు దయమీఱ నర్థుల నాదరించువాఁడనియుఁ, దాన వారెల్లపుడు నాతనిమేడయం దెలమిమీఱ వర్తిలుదురనియుఁ దాత్పర్యము.

విశేషార్థాదులు. కృష్ణరాయలనేత్రములు మహాభాగ్యలక్షణలక్షితములై విరిసిన తమ్ములంబోలి యొప్పుటయుఁ, గృష్ణరాయల కర్థులపైఁ గలయత్యాదరమును గమ్యములు. కృష్ణరాయఁడు - కర్మధారయం బిత్యాది సిద్ధసమాసంబట్ల యగును. కావున నిట్టిసంజ్ఞావాచకములకు మీఁదిసంస్కృతపదములతో సిద్ధసమాసము రాఁదగును. 'లక్ష్మమావర తనయా, చల్లమాంబాసుతా' అనుమున్నగునవిట్టివి కవిప్రయుక్తములు గాననగును. అలం. రూపకము.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
పారిజాతంబు దే నిట్లు ప్రతిన*వట్టి, చంద్రశాలకు నేతెంచి చక్రధరుఁడు.

టీ. అవధరింపుము= శ్రద్ధగా వినుము, జనమేజయక్షితీశవరునకున్ =జనమేజయుఁ డను రాజశ్రేష్ఠునకు, అమ్మౌనివల్లభుండు = ఆమునీశుఁడు, తేన్ = తెచ్చుటకు, ప్రతిన= ప్రతిజ్ఞ, చంద్రశాలకున్ = శిరోగృహమునకు, ఏతెంచి=వచ్చి.

వ్యా-వి శే. ఆ + మౌనివల్లభుఁడు. త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వము కల్గును. ఊష్మ రేఫంబులకుఁ గలుగదు. ప్రతిన. ప్ర. ప్రతిజ్ఞ.

ఏతెంచు=ఏగు తెంచు, అభ్యాగతి నరుగ్వాదులకుఁ దెంచుధాతు వనుప్రయుక్త మగును. అగుచో గువర్ణము విభాషను లోపించును.

మ. సరసాలాపముల న్వినోదకథలన్ సాత్రాజితీ దేవిఁ బ్రే
మరసాంభోనిధి నోలలార్చి కడు సమ్మానంబు గావించి ని
ర్భరకౌతూహలవృత్తి నుండ ఘటికాపర్యాప్తిఘంటారవాం
తరనిర్ణీతములై వినంగఁబడియె న్మధ్యాహ్నశంఖధ్వనుల్. 3

టీ. సరసాలాపములన్ =రసము చిప్పిలుమాటలచేతను, వినోదకథలన్ =ఉబుసు పోకకై చెప్పుకొనెడుకథలచేతను, సాత్రాజితీదేవిన్ = సత్రాజిత్పుత్రికయగు సత్యభామను, ప్రేమరసాంభోనిధిన్ = అనురాగరససాగరమున, ఓలలార్చి = ఈఁదులాడఁజేసి, సమ్మానము=గౌరవము, కావించి=చేసి, నిర్భరకౌతూహలవృత్తిన్ = సంపూర్ణసంతోష వ్యాపారముతో, ఘటికా...నిర్ణీతములై-ఘటికా = గడియలయొక్క, పర్యాప్తి = నిండుట చేసైన, ఘంటారవ=గంటలచప్పుడులయొక్క, అంతర=నడుమను, నిర్ణీతములై= నిర్ణయింపఁబడినవై, మధ్యాహ్నశంఖధ్వనుల్ = మధ్యాహ్నకాలముననైన శంఖముల మ్రోఁతలు.

వ్యా-వి శే. ఓలలార్చి ప్ర. ఓలలాడు. ఆడోడుకూడుల డకారమునకుఁ జుక్కు పరమగునపుడు రేఫంబగు. కావించి-ఇంచుక్ప్రత్యయాగమములు పరములగునపు డాగమాదేశలోపంబులు పెక్కుతెఱంగులం గానంబడియెడి.

తే. సమయకృత్యంబు లప్పుడు సలుపఁ దలఁచు
నలిననాభునిచిత్తంబు దెలిసి సత్య
భామకనుసన్ననుడిగంపుఁబద్మముఖులు
నిలిచి రంతంత వినయంబు దోలఁక నెదుట. 4

*వలికి.

టీ. సమయకృత్యంబులు = కాలోచితకార్యములు, ఉడిగంపుఁబద్మముఖులు = సేవకురాండ్రు, కనుసన్నన్ = నేత్రసంజ్ఞను, అంతంతన్ = దగ్గఱదగ్గఱఁగా.

వ్యా-విశే. ఉడిగంపుఁబద్మముఖులు-కర్మధారయంబున మువర్ణకమునకుఁ బుంపు లగును. వానికిఁ బరుషములు పరములుగా నుగాగమమును సరళాదేశాదులును నగును.

క. తలిరాకుఁబోఁడి యొక్కతి, జలకమునకు వేళయనుచు శౌరికి వీణా
కలకలములఁ గలకలనగు, పలుకుల మెలపొలయ విన్నపముగావించెన్.

టీ. తలిరాకుఁబోఁడి = చిగురాకువలె మనోజ్ఞురాలైనపడఁతి, జలకమునకున్ = స్నానమునకు, వీణాకలకలములన్ = వీణాధ్వనులను, కలకల=ఇది హాసధ్వన్యనుకరణము. నగు=నవ్వునట్టి, పలుకులన్ = మాటలతో, మెలపు=మృదుత్వము, ఒలయన్ = వ్యాపించునట్లు, విన్నపము=విజ్ఞప్తిని, కావించెన్ = చేసెను.

భా. ఒకయువతి స్నానమునకు వేళయయ్యెనని శ్రీకృష్ణునకు వీణాధ్వనిని దిరస్కరింపఁజాలు మృదువులగుమాటలతో విన్నవించెనని భావము.

వ్యా-విశే. తలిరాకుఁబోఁడి-తలిరాకు = కర్మధారయంబునఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరమగునపుడు టుగాగమంబు విభాషనగు. రూ. అ. తలిరుటాకు. అలరుఁబోఁడిత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు.

ఉ. ఇంచినవేడ్కఁ నాత్మహృదయేశ్వరిఁ గన్గొని శౌరి మందహా
సాంచితనేత్రుఁడై జలకమాడఁగ లెమ్మని పైఁడిచేలకొం
గించుక జాఱ నొక్కతరళేక్షణహస్తముఁ గేల నూఁదుచుం
గంచుకిసంచయంబు సముఖా యన గద్దియ డిగ్గ డిగ్గినన్. 6

టీ. ఇంచినవేడ్కన్ = అతిశయించినయానందముతో, శౌరి = శ్రీకృష్ణుఁడు, ఆత్మహృదయేశ్వరిన్ = తనప్రాణేశ్వరియగు సత్యభామను, కన్గొని = చూచి, మందహాసాంచితనేత్రుఁడై=చిఱునగవుతో నొప్పుకన్నులుగలవాఁడై, జలకమాడఁగన్ = స్నానము చేయఁగా, లెమ్ము అని, పైఁడిచేలకొంగు = బంగరుబట్టయొక్క చెఱఁగు, ఇంచుక = కొంచెము, జాఱన్, ఒక్కతరళేక్షణహస్తమున్ = ఒక్కచంచలాక్షిచేతిని, కేలన్ = చేతితో, ఊఁదుచున్ = నొక్కిపట్టుకొనుచు, కంచుకిసంచయంబు = అంతఃపురపుఁగావలివారు, సముఖా=పరాకు, అనన్, గద్దియన్ = ఆసనమును, డిగ్గన్ = దిగెను, డిగ్గినన్ = దిగఁగా. ఉత్తరపద్యముతో నన్వయము.

వ్యా-విశే. కేలన ఇది యాపవిభక్తికము. ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబగు.

క. ప్రామినుకులపూఁబోఁడుల
సీమంతపుఁజెందిరంబుచే బలె నరుణ
శ్రీమించు నతనిపదముల
భామామణి యొూర్తు పయిఁడిపావలు దొడిగెన్. 7

టీ. ప్రామినుకుల...బలె-ప్రామినుకుల = వేదములనెడు, పూఁబోఁడుల=స్త్రీల యొక్క, సీమంతపు = పాపటలసంబంధమైన, చెందిరంబుచే బలెన్ = ఎఱ్ఱనిరంగుచే వలె, అరుణశ్రీన్ = ఎఱ్ఱనైనకాంతితో, మించు=ప్రకాశించు, అతనిపదములన్ = ఆశ్రీకృష్ణునిపాదములందు, పైఁడిపావలు = బంగరుపాదుకలను, తొడిగెన్ = కూర్చెను.

వ్యా-విశే. భగవానుఁడు శ్రీకృష్ణుఁ డుపనిషన్మౌళిలాలితుఁడు కాన, నాతని పాదము లాయుపనిషద్భామలపాపటలందలి యారుణ్యమున నరుణములయ్యెనని యెన్నునది. ఇందు శ్రీకృష్ణునివేదాంతవేద్యతను గవి సూచించెను. ప్రాఁత+మినుకులు=ప్రామినుకులు. ప్రాఁతాదులతోలియచ్చుమీఁది వర్ణములకెల్ల లోపంబు బహుళంబుగా నగును. అలం. రూపకము; ఉత్ప్రేక్ష.

తే. కేళిగతి మీఱి మజ్జనశాల కరిగి
శాతమన్యవమణిమయాసనమునందుఁ
గౌస్తుభాదివిభూషణోత్కరము నెల్ల
నొయ్య నొయ్యన సడలించి యున్నయంత. 8

టీ. కేళిగతిన్=సవిలాసమగునడకతో, మజ్జనశాలకున్ = స్నానగృహమునకు, అరిగి=ఏగి, శాతమన్యవ...నందు-శాతమన్యవమణిమయ=ఇంద్రనీలమణిమయమైన, ఆసనమునందున్ = గద్దియయందు, కౌస్తుభాది...త్కరము నెల్లన్=కౌస్తుభము మున్నగు నాభరణములనెల్లను, ఒయ్యనొయ్యన = మెల్లమెల్లగా, సడలించి = వదలించి, ఉన్నయంతన్=ఉన్నమీఁద.

వ్యా-విశే. శతమన్యోరిదం శాతమన్యవమ్, అణ్=ఇంద్రసంబంధమైనది.

## శ్రీకృష్ణుని మాధ్యాహ్నికస్నానము.

ఉ. కంపనలీలమై నసదుఁగా నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిన్. 9

టీ. కంపనలీలమైన్ = చలనవిలాసముచే, అసదుఁగౌను = అల్పమగునడుము, ఆసియాడన్ = మిగులఁజలింపఁగా, లలాటరేఖ=నొసలిరేక, చెమరింపఁగన్ = చెమ్మగిలఁగా, హారలతాగుళుచ్ఛముల్=హారములను లతలయొక్క గుంపులు, తుంపెసలాడన్= నటింపఁగా, కంకణమృదుధ్వని = కంకణములయొక్క మెలపైనసవ్వడి, తాళగతిన్ = లయయొక్క రీతితో, చెలంగఁగాన్=ఒప్పఁగా, ఒకచంద్రనిభానన = ఒకచంద్రముఖి, కంసవైరికిన్ = శ్రీకృష్ణునకు, సంపెఁగనూనెన్ = సంపెంగతైలమును, అంటెన్ = రాచెను.

వ్యా-విశే. కంపనలీలమైన్ - తృతీయావిభక్తిప్రత్యయమగు చేతపర్ణకమునకు బదులుగా 'మెయి, మై' అనునవి వికల్పముగఁ గల్గును. ఆసదుకౌను-ఉదంతంబు లగుస్త్రీసమంబులకును, బుంబులకును బరుషసరళములు పరములగునపుడు నుగాగమంబగు. ద్రుతముమీఁదికార్యములు సమాసంబుల ద్రుతమునకు స్వత్వములేదు. అసదుఁగౌను. అలం. స్వభావోక్తి.

ఉ. తామరదోయిలోఁ దగిలి దాఁటెడు తేఁటులఁబోలఁ బెన్నెఱుల్
వేమఱు చేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రెడఁ జల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్. 10

టీ. తామరదోయిలోన్ = పద్మద్వంద్వమున, తగిలి = చిక్కుకొని, దాఁటెడు తేఁటులన్=దాఁటుచున్న తుమ్మెదలను, పోలన్=పోలఁగా, పెన్నెఱుల్ = పెద్దవెండ్రుకలగుంపును, వేమఱు=మాటిమాటికి, చేతులన్=హస్తములచే, పిడిచి, విప్పి, విదిర్చి = వదలునట్లుచేసి, నఖాంకురంబులన్ = గోరుమొలకలచే, కోమలలీలన్ = మృదువైన రీతితో, దువ్వి, తెలిగొజ్జఁగినీరు=తెల్లనిపన్నీరు, ఎడన్ = నడుమనడుమ, చల్లిచల్లి = చిలికిచిలికి, గంధామలకంబు = పరిమళించునుసిరికముద్దను, ఒకయంగన = ఒకస్త్రీ, కాళియనాగభేదికిన్ = కాళియుంనడఁచినశ్రీకృష్ణునకు, పెట్టెన్.

వ్యా-విశే. పెద్ద+నెఱులు=పెన్నెఱులు; సమాసంబునఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణముల కెల్ల లోపంబు బహుళంబు. పరుషేతరములు పరములగునపుడు వానికి ద్విత్వము కల్గును. తేఁటులు. రూ. అ. తేంట్లు. చేతులన్-ఇటి తివర్ణము లాపకవిభక్తికములు. అవి ద్వితీయాద్యేకవచనములు పరములగునపుడు కొన్నిశబ్దములకుఁ బ్రాయికముగ నగును. "కాళియుండు కద్రువకుమారుఁడు. జనులు పెట్టినభక్ష్యముల సర్పము

లన్నియుం గరుడున కిచ్చుచుండఁ గాళియుఁడు వానిని గరుడున కొసంగకుండుటంజేసి, గరుడుఁ డాతనిపైఁ గోపమునూని వానిం దఱిమెను. దానంజేసి భయపడి కాళియుఁడు సౌభరిశాపవశమున గరుడునకుఁ జొరరాని కాళిందిమడువుం జొచ్చెను. అతఁ డందుఁ బ్రవేశించుటంజేసి యందలిజలము విషమయమగుటయు, జీవకోటి చచ్చుటయు సంభవింపఁ, గృష్ణుఁ డక్కొలనుఁ బ్రవేశించి కాళియునిశిరముం దనపాదమునఁ ద్రొక్కి, తజ్జాయలసంప్రార్థనము ననుసరించి వానింజంపక పాతాళమున కణఁగఁ ద్రొక్కెను." అని తులాకావేరీమాహాత్మ్యము. అలం. ఉపమ.

మ. చెలువ ల్గొందఱు హేమకుంభములతోఁ జేసే నొసంగన్విని
ర్మలదోర్మూలరుచు ల్వెలిం బొలియఁ దోరంబైనచన్దోయిసం
దొలయ న్వేనలి జాఱ నిక్కి యరమే నొయ్యారమై వ్రాలఁగా
జలకంబార్చె లతాంగి యోర్తు యదువంశస్వామికి న్వేడుకన్. 11

టీ. కొందఱు చెలువలు = కొందఱుస్త్రీలు, హేమకుంభములతోన్ = బంగరు గిండ్లతో, చేసేన్=ఒకరొకరి చేతిమీఁదుగా, ఒసంగన్ = ఈయఁగా, వినిర్మలదోర్మూల రుచుల్ = స్వచ్ఛములైన బాహుమూలముల కాంతులు, వెలిన్=బయటికి, పొలయన్= వ్యాపింపఁగా, తోరంబైన=స్థూలమైన, చన్దోయిసందు = స్తనద్వంద్వముయొక్క సందర్భము, ఒలయన్=వ్యాపింపఁగా, వేనలి=కొప్పు, జాఱన్=వీడఁగా, నిక్కి=ఉబ్బి, అరమేను=సంకోచశరీరము, ఒయ్యారమైన్=అందమైనరీతితో, వ్రాలఁగా=వంగఁగా, ఓర్తు లతాంగి=ఒకతీవఁబోఁడి, వేడుకన్=ఉత్సాహముతో, యదువంశస్వామికిన్ = యదుకులభర్తయగుశ్రీకృష్ణునకు, జలకంబార్చెన్=స్నానముచేయించెను.

వ్యా-విశే. చేసేన్ - 'చేసేతన్' అనుదాని క్షప్తరూపము. 'చన్దోయి' ఇందలి నకారము ద్రుతమనునంశము చింత్యము. నకారమాత్రము ద్రుతమనిన సరిపడును. అలం. స్వభావోక్తి.

సీ. చంద్రికపూపన్నె జిలుఁగుదువ్వలువను
దడియొత్తె నొక్క కాంతాలలామ
కొనగోళ్ల నెఱులు సిక్కులు వాపి మెలపున
శిర సార్చె నొక్క లేఁజిగురుఁబోఁడి
వెన్నెలనిగ్గులు వెదచల్లెడుమడుంగు
లందిచ్చె నొక్క పూర్ణేందువదన
నవరత్నమయభూషణవ్రజంబులు మేనఁ
గీలించె నొక రాజకీరవాణి

తే. విరులసరు లిచ్చె నొకయరవిందగంధి
యలఁదెఁ జందన మొక ధవళాయతాక్షి
సుదతి యొక్కతె కపురంపుసురఁటి విసరె
నిలువుటద్దంబు నొకయింతి నిలిపె నెదుట. 12

టీ. చెంద్రికపూ...వలువను = కుసుంబపుష్పవర్ణముగల సన్ననికట్టుకోకను, ఒక్కకాంతాలలామ = మిక్కిలియందకత్తెయగు నొకతె, తడియొత్తెను. కొనగోళ్లన్ = గోరులకొనలచే, నెఱులు=వెండ్రుకలు, చిక్కులు = అల్లికొనుటలు, పాసి=పోఁగొట్టి, మెలపునన్ = మృదువుగా, ఒకలేఁజిగురుఁబోఁడి = ఒకలేఁజిగురువలె మనోజ్ఞమైన యొప్పిదముగలపడఁతి, శిరసు, ఆర్చెన్ =ఆరఁజేసెను. వెన్నెలనిగ్గులు = వెన్నెలయొక్క యుత్కృష్టకాంతులను, వెదఁజల్లెడు=వ్యాపింపఁజేసెడి,మడుంగులు=వస్త్రములను, ఒక్క పూర్ణేందువదన=పూర్ణచంద్రునింబోలు మోముగల యొకవనిత, అందిచ్చెన్ =సమర్పించెను. నవరత్న...వ్రజంబులు = తొమ్మిదిజాతులరత్నములచే బహుళములైన యలంకారసమూహములను, ఒకరాజకీరవాణి = శుకరాజముయొక్క పలుకులంబోలుపలుకులుగల యొకయువతి, కీలించెన్ =అమర్చెను. విరులసరులను=పూదండలను, ఒకయరవిందగంధి=పద్మపరిమళమువంటిపరిమళముగల యొకవనిత, ఇచ్చెన్. చందనము, ఒకధవళాయతాక్షి = తెల్లనిదీర్ఘములైనకన్నులుగల యొకతరుణి, అలఁదెన్ =పూసెను. కపురంపుసురఁటిన్ = కర్పూరపువీవనను, ఒక్కతె సుదతి = మంచిదంతములుగలయొకతె, విసరెన్ =వీచెను. ఒక ఇంతి=ఒకస్త్రీ, నిలువుటద్దంబున్ = నిలిచియుండు పెద్దయద్దమును, ఎదుటన్ =అభిముఖముగా, నిలిపెన్ =ఉంచెను.

విశే. అందకత్తెలలో మిన్నగాన నందమగువలువ నొసంగెననియు, చిగురువలె మనోజ్ఞమైన యొప్పిదముగలదిగానఁ జిగురులకొనలంబోలు కొనగోళ్లచే మెలపునఁ జిక్కుఁదీర్చుట శిరసార్చుట నొనర్చెననియుఁ, బూర్ణచంద్రునింబోలు మోముగలదిగావున వెన్నెలనిగ్గులవెదఁజల్లు వస్త్రముల నొసంగఁగలిగెననియు, రాజకీరవాణి (రాజపుత్రి) కావుననే రత్నాభరణరాజిఁ జక్కగ నమర్చెననియుఁ, బద్మగంధి కావుననే కమ్మవిరుల నొసంగెననియుఁ, దెల్లనిదీర్ఘములగుకన్నులు గలదికావుననే తెల్లనిచందనమును మేనఁ బూసెననియు, కప్పురపుఁబలుకులంబోలు మేలిదంతములుగలది కావుననే కర్పూరపుసురఁటి విసరెననియుం, యౌవ్వనపు మేనితళుకుల మించు నింతికావునసే తళతళ మెఱయు నద్దమును నిల్పెననియు, నిట్లిందలి యుపలీక్రుతకృత్యములు తత్తరుణీరూపనిలాసానురూపములై, సాభిప్రాయములై వెలయుచున్నవి.

వ్యా-వి శే. కప్పురము+సురఁటి - కర్మధారయంబుల ముపర్ణకమునకుఁ బుంపులగు. నిలువు+అద్దము. కర్మధారయంబునఁ బేర్వాదుల కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు. నవరత్నములు.—1 మౌక్తికము, 2 పద్మరాగము, 3 వజ్రము, 4 ప్రవాళము, 5 మరకతము, 6 నీలము, 7 గోమేధికము, 8 పుష్యరాగము, 9 వైడూర్యము.

క. కలికినిడువాలుఁగన్నుల, తళుకులు మణిదీపశిఖలుఁ దడఁబడ లక్ష్మీ
నిలయున కిచ్చిరి కొందఱు, నెలఁతలు మౌక్తికవిచిత్రనీరాజనముల్.

టీ. కలికి...తళుకులు=మనోజ్ఞములగు వాల్గన్నులతళతళలును, మణిదీపశిఖలున్ = మణిదీపాగ్రములును, తడఁబడన్=వ్యత్యాసపడఁగా, కొందఱునెలఁతలు = కొందఱు వనితలు, మౌక్తికవిచిత్రనీరాజనముల్ = అణిముత్తెములరూపమైన యాశ్చర్యకరము లగుహారతులను, లక్ష్మీనిలయునకున్ = లక్ష్మీదేవికి స్థానమైనవానికి (శ్రీకృష్ణునకు) ఇచ్చిరి=ఇడిరి.

వ్యా-వి శే. "ఇయ్యవి మణిదీపాగ్రములు. ఇయ్యవి కన్నులతళుకులు" అని యేర్పడ లేదనుటంజేసి కన్నులతళుకుల కసాధారణకాంత్యతిశయము సూచితమయ్యెను. కప్పురపుటారతులుగాక మౌక్తికనీరాజనములగుట విచిత్రనీరాజనము లనెను. లక్ష్మీనిలయుండనుట సాక్షాన్నారాయణత్వము సూచితము. వాలు+కన్నులు-సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకును, బుంపులకును బరుషసరళములు పరములగునపుడు నుగాగమంబగు. సమాసముల ద్రుతమునకు స్వత్వలోపసంశ్లేషములు గలుగవు.

మ. జలకం బాడి మడుంగు గట్టి మణిభూషాదీప్యమానాంగియై
కలపం బెంతయు వింతగా నలఁది చెంగల్వ ల్నెఱిన్మించ వే
నలి: గీల్కొల్పి పసిండియం దెరపళి న్రాయంచ లంతంత రాఁ
జెలులుందానును సత్యభామ సను దెంచెన్నాథుఁ డుప్పొంగఁగన్. 14

టీ. జలకంబాడి=స్నానముచేసి, మడుంగు=ధౌతవస్త్రము, కట్టి=ధరించి, మణిభూషాదీప్యమానాంగియై = మణిమయములగునలంకారములచేఁ బ్రకాశించుశరీరము గలదై, కలపంబు=మైపూఁత, ఎంతయున్=మిక్కిలి, వింతగాన్, అలఁది=పూసి, చెంగల్వల్=ఎఱ్ఱకలువలు, నెఱిన్=మనోహరముగా, మించన్=ప్రకాశించునట్లు, వేనలిన్=కొప్పును, కీల్కొల్పి = తుఱిమి, పసిండియందెరవళిన్ = బంగరుటందియసవ్వడిచే, రాయంచలు=రాజహంసలు, అంతంతన్=దగ్గఱదగ్గఱగా, రాన్=రాఁగా, సత్యభామ, చెలులునుదానును, నాథుఁడు=పతియగు శ్రీకృష్ణుఁడు, ఉప్పొంగఁగన్=సంతసింపఁగా, చనుదెంచెన్=విచ్చేసెను.

వ్యా-విశే. "ఆత్మార్థంబభిహితమగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయివచనంబు ధాతువిశేషణంబులకగు." అనుపద్ధతి నిచ్చో తాను శబ్దప్రధానముగనే క్రియ ననుదెంచెనని యేకవచనమున నమరియున్నది. రాయంచలంతంతరాననుటంజేసి హంసగమనముల మించి యమ్మందయానవడక లమరియుంటఁ దెలియనయ్యెడు. రాయంచ. ప్ర. రాజహంస. ఇందుఁ బ్రియవాల్లభ్యపాత్రమును సమయోచితమును నగురీతిని సత్యాశృంగారవేషమును గవి నిరూపించినాఁడు.

సీ. మాత్సర్యఘనమేఘమాలికాపగమప్రకాశితహిమధామకళ యనంగ
విరహనిశీథినీవిరమసంప్రాపితోన్మీలనామోదపద్మిని యనంగఁ
గ్రోధదంతావళక్షోభవిభ్రమపునస్సంజాతనైర్మల్యసరసి యనఁగ
సంతాపనైదాఘసమయనిర్గమకోరకితనవమాలతీలతిక యనఁగఁ
తే. గాంతిఁ జెన్నారి వికసితస్వాంత యగుచుఁ
గలఁక యెంతయు దిగఁద్రోచి చెలువమెసఁగఁ
జేర వచ్చినప్రియభామ గారవించి
యున్నయత్తఱి మురవైరిసన్నిధికిని. 15

టీ. మాత్సర్య...కళ-మాత్సర్య = ఈర్ష్యయను, ఘన = గొప్పదగు, మేఘమాలికా=మేఘపంక్తియొక్క, అపగమ = పోకచే, ప్రకాశిత = ప్రకాశింపఁజేయఁబడిన, హిమధామ=చంద్రునియొక్క, కళ, అనంగన్=అనునట్లుగ, విరహ...పద్మిని, విరహ=వియోగమను, నిశీథినీ = రాత్రియొక్క, విరమ = తెగుటచేత (పోవుటచేత), సంప్రాపిత=పొందింపఁబడిన, ఉన్మీలన=వికాసమును, ఆమోద=పరిమళమునుగల, పద్మిని=పద్మలత, అనంగన్, క్రోధ...సరసి-క్రోధ=కోపమను, దంతావళ=ఏనుఁగుసంబంధమైన, క్షోభ=కలఁతయొక్క, విభ్రమ=విభ్రాంతిచే (తొలఁగుటచే), పునః=తిరుగ, సంజాత = కలిగిన, నైర్మల్య=నిర్మలత్వముకల, సరసీ = సరస్సు, అనంగన్, సంతాప...లతిక - సంతాప=కాఁకయను, నైదాఘసమయ=గ్రీష్మకాలముయొక్క, నిర్గమ = పూర్ణమగు పోకచే, కోరకిత=మొగ్గతొడిగిన, నవ=క్రొత్తదగు, మాలతీలతిక=మాలతీలత, అనంగన్, కాంతిన్=ప్రకాశముతో, చెన్నారి=సొగసునంది, వికసితస్వాంత అగుచున్=వికసించినమదికలదై, కలఁక=కలఁతను, ఎంతయున్=మిక్కిలి, దిగన్ త్రోచి=విడిచి, చెలువము=అందము, ఎసఁగన్=ఒప్పఁగా, చేరన్ = దగ్గఱకు, వచ్చిన = ఏతెంచిన, ప్రియభామన్=ప్రియకాంతను, గారవించి = సమ్మానించి, ఉన్నయత్తఱిన్ = ఉన్నయాసమయమున, మురవైరిసన్నిధికిని = శ్రీకృష్ణునిసమీపమునకు. ముందటిపద్యముతో నన్వయము.

భా. మబ్బుతొలఁగుటచే ప్రకాశించు చంద్రకళయట్లు మాత్సర్యము తొలఁగుటకతన సత్య ప్రకాశించెననియు, రేయికడచుటచే జెందిన వికాసపరిమళములుగల పద్మినివిధమున విరహావిరామమున సత్య ప్రకాశసంతసములనంది చెలువారెననియు, దంతావళసంక్షోభము తొలఁగుటకతన మఱల నతిస్వచ్ఛమై మించు సరసుకరణి సత్యభామక్రోధాపగమమున తిరుగ నెప్పటిరీతిని నైర్మల్యమునందెననియు, గ్రీష్మకాలము చనుటచేమొగ్గతొడిగినమాలతీలతికచందమున సాత్రాజితి సంతాపము పోవుటంజేసి యత్యుత్సాహముకలదయ్యెననియు భావము. సత్య మనసునకు వికాసమును నంగమునకుఁ ప్రకాశము గల్గెనని తాత్పర్యము.

వ్యా-వి శే. అ+తఱిన్ = అత్తఱిన్. త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వము బహుళముగఁ గల్గును. ఊష్మరేఫంబులకుఁ గలుగదు. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష, ఉల్లేఖము.

సత్యభామకడకు నారదుఁడు వచ్చుట.

క. చనుదెంచెఁ గలహభోజన,ముని రుక్మిణి వీడుకొల్ప మున్నీటిజలం
బున మజ్జనాదిమాధ్యం,దినకృత్యము లాచరించి నిష్ఠాపరుఁడై. 16

టీ. కలహభోజనముని = జగడముతిండిగాఁగలజడదారి, రుక్మిణి, వీడుకొల్పన్ = పంపఁగా, మున్నీటిజలంబునన్ = సముద్రోదకమున, మజ్జనాదిమాధ్యందినకృత్యములు= స్నానముమున్నగు మధ్యాహ్నసమయమునఁ జేయనగుకార్యములు, ఆచరించి = చేసి, నిష్ఠాపరుఁడై=నియమపరుండై, చనుదెంచెన్=వచ్చెను.

వ్యా-వి శే. ముందు+నీరు=మున్నీరు. మున్నీరు+జలము=మున్నీటిజలము. సమాసమునఁ బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణములకెల్ల లోపమును వానికిఁ బరుషేతరములు పరములగునపుడు ద్విత్వమును బిదప వృత్తి నాపవిధ్త్తికటివర్ణము నీరు శబ్దములోని రువర్ణమునకుఁ గల్గెను.

చ. అతనికి సత్యభామయు మురాసురవైరియు నాతిథేయస
త్కృతు లొనరించి యుండఁగ సతీమణు లిద్దఱు పళ్లెరంబు వె
ట్టితి మని విన్నవించినఁ దటిల్లతయు న్జలదంబు యామినీ
పతి వెనుకొన్నకైవడిఁ దపస్వియుఁ దాముసు భుక్తికాలకున్. 17

టీ. అతనికిన్ =ఆ నారదునకు, ఆతిథేయసత్కృతులు = అతిథియోగ్యములగు సత్కారములు, ఒనరించి=చేసి, ఉండఁగన్, ఇద్దఱు సతీమణులు=ఇరువురు వనితారత్నములు, పళ్లెరంబు పెట్టితిమి = భోజనపాత్రములనమర్చితిమి, అని, విన్నవించినన్ = విజ్ఞాపనసేయ, తటిల్లతయున్ = మెఱుపుఁదీఁగయు, జలదంబున్ = మేఘమును, యామినీ

పతిఁ=చంద్రుని, వెనుకొన్న కైవడిన్=వెంబడించినరీతిని, భుక్తిశాలకున్=భోజనగృహమునకు, (మహానసమునకు.)

విశే. తెల్లనినారదుఁడు చంద్రునివలెను, నాతని వెన్నంటిచను మెఱుఁగుఁబోడి సత్యయుం నీలనీరదగాత్రుఁడు కృష్ణుఁడును విద్యుల్లతాజలదములభంగిని నుండిరని తాత్పర్యము. భార్యాభర్తలఁ దటిన్మేఘములుగను, దదనుసరణముగల ధవళదేహుని నారదుం జంద్రునిగను బోల్చుట యెంతయు హృద్యమైయున్నది. అలం. ఉపమ.

మ. చని గారుత్మతరత్నపాత్రికలఁ గంసద్వేషి సాంబాదినం
దనులు న్సాత్యకిముఖ్యసోదరులు నానాబంధుసంతానముం
దనమ్రోల న్వసియింప మౌనిపతిచెంతం దాను నర్హాసనం
బున నుండె న్భుజియింప వీవనల నంభోజేక్షణ ల్వీవఁగన్. 18

టీ. చని=ఏగి, కంసద్వేషి=కంసవైరి శ్రీకృష్ణుఁడు, గారుత్మతరత్నపాత్రికలన్=గరుడపచ్చలచేసైన పాత్రలందు, సాంబాదినందనులున్ = సాంబుఁడుమొదలగు కుమారులును, సాత్యకిముఖ్యసోదరులు=సాత్యకిమొదలగు నన్నదమ్ములును, నానాబంధుసంతానముఁన్=వివిధబంధులసమూహమును, తనమ్రోలన్=తనసన్నిధిని, వసియింపన్=నివసింపఁగా, తాను, మౌనిపతిచెంతన్=మునీశునిసమీపమున, అర్హాసనంబునన్ = ఉచితాసనమున, భుజియింపన్ = భోజనము సేయఁగా, వీవనలన్=తాళవృంతములచే, అంభోజేక్షణల్=పద్మేక్షణలు, వీవఁగన్=విసరఁగా, ఉండెన్.

వ్యా-విశే. భుజియింపన్. రూ. అ. భుజింపన్.

సీ. శాకపాకంబులచవులు వక్కాణించు
గతిఁ గంకణంబులు గల్లుమనఁగ
నతివేగ మిడుఁడు మీ రనుమాడ్కి మేఖలా
కీలితరత్నకింకిణులు మొరయఁ గజ్జలు.
గలమాన్నరుచితోడఁ గలహించుజాడ దు
వ్వలువ[1]పింజెలు ఫెళఫెళ యనంగ
నారగింపుఁడు మీర లని ప్రియం బాడెడు
పోలుపున మెట్టియ [2]ల్గులుకరింప

తే. నలరుఁబోఁడులు వడ్డింప నచటఁ గలహ
భోజియును దాను బహుభక్ష్యభోజ్యలేహ్య

1 పింజలు. 2 గిలుకరింప.

చోష్యపానీయముల మధుసూదనుండు
సారెఁ గొనియాడుచును వేడ్క నారగించె. 19

టీ. శాకపాకంబులచవులు = కూరలయొక్కయు వంటకములయొక్కయు రుచులు, వక్కాణించుగతిన్=చెప్పెడురీతిని, కంకణంబులు=ముంజేతినగలవిశేషములు, గల్లుమనఁగన్=గల్లుమని శబ్దింపఁగా, అతివేగము=మిగులవేగము, ఇడుఁడు=పెట్టుఁడు, మీరు, అనుమాడ్కిన్=అనువిధముగ, మేఖలాకీలితరత్నకింకిణులు-మేఖలా=నడుమున కిడిన యాభరణవిశేషమందు,కీలిత=స్థాపింపఁబడిన, రత్న=రత్నవికారములగు, కింకిణులు=చిఱుగంటలు, మొరయన్=ధ్వనిచేయఁగా, కలమాన్నరుచితోడన్=వరియన్నపుఁగాంతితో, కలహించుజాడన్=వాదులాడురీతిని, దువ్వలువపింజెలు=కట్టుబట్టయొక్కకుచ్చెలు, పెళపెళయనంగన్=పెళపెళయనఁగా, పెళపెళధ్వన్యనుకరణము. మీరలు, ఆరగింపుఁడు=భుజింపుఁడు, అని, ప్రియము=ప్రియవాక్యము,ఆడెడుపోలుపునన్=పల్కెడుచందమున, మెట్టియలు=మట్టెలు (పాదపువ్రేళులకమర్చునాభరణవిశేషములు) గులకరింపన్=శబ్దింపఁగా, అలరుఁబోఁడులు = పుష్పమువలె మనోజ్ఞమైనయొప్పిదముగల యువతులు, వడ్డింపన్ = కావలసినశాకపాకములఁ బాత్రములనిడఁగా, అచటన్ = అచ్చోట, కలహభోజియును = జగడముతిండిగాఁగల జడదారియు, తాను, మధుసూదనుండున్=శ్రీకృష్ణుఁడును, బహు...పానీయములన్-బహు=అనేకములగు, భక్ష్య=కొఱికితినఁదగిన వానిని, (అప్పడములు వడియములు మొదలగునవి) భోజ్య=భుజింపఁదగినవానిని,(అన్నాదులు) లేహ్య=నాలుకచేనాస్వాదింపఁదగినవానిని, (పచ్చడులుమున్నగునవి) చోష్య=పీల్చఁదగినవానిని (ఫలరసములుమొదలైనవి) పానీయములు=త్రాగఁదగినవానిని, (పాయసమున్నగునవి) సారెన్=మాటిమాటికి, కొనియాడుచున్=పొగడుచు, వేడ్కన్ = సంతసమున, ఆరగించెన్=భుజించెను.

భా. యువతులు వడ్డించునపుడు కల్గిన కంకణములగల్లనుశబ్దము శాకపాకముల రుచులం దెల్పురీతినుండెననియు, మేఖలయందలి చిఱుగంటలమ్రోఁత యతివేగ వడ్డింపుఁడని పల్కుచున్నట్లుండెననియు, దువ్వలువపింజెలపెళపెళలు వరియన్నపుఁగాంతితోఁ గలహించుగతి నొప్పెననియు, మెట్టియలమ్రోఁతలు భుజింపుఁడని ప్రియముఁబల్కుచున్నట్లుండెననియు భావము.

వ్యా-విశే. కలహభోజియును దాను నారగించె. ఆత్మార్థంబభిహితమగునపుడు తల్లింగసంఖ్యాభిదాయివచనంబు తద్విశేషణక్రియలకగు ననుపద్ధతి ననుసరించి యిచ్చోఁ గ్రియ తానుశబ్దమునకే సంబంధించురీతి నేకవచనముగఁ బ్రయుక్తమయ్యెను. ఆత్మార్థకమగు తాను శబ్దము నామతదేత ద్వ్యతిక్రమర్థంబులకుఁ బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యం

తంబై పూర్వపరంబులుగ నభిహితమగుననుపద్ధతి నిచ్చో నామవాచకమగు మధుసూదన పదమునకుఁ బూర్వమునఁ బ్రయుక్తమయ్యెను. ఇందు 'పింజలు' అనిపాఠము గానంబడెడి. 'పింజ'అనుదానికి 'కుచ్చె' అనునర్థము కోశముల గానరాదు. కాన 'పింజెలు' అని పాఠముండఁదగును. అలం. ఉత్ప్రేక్ష.

తే. వామనేత్రాకరాంచలావర్జ్యమాన
కనకభృంగారుకర్కరికాముఖాగ్ర
గళితగంధోదకంబులఁ గంసవైరి
చేతులను[1] దేల్చె బాంధవశ్రేణితోడ. 20

టీ. కంసవైరి=శ్రీకృష్ణుఁడు, వామనేత్రా...కంబులన్-వామనేత్రా = చక్కని కన్నులుగలవనితలయొక్క, కర=హస్తములయొక్క, అంచల=కొనలనుండి, ఆవర్జ్యమాన వంచఁబడుచున్న, కనక=బంగారువికారములగు, భృంగారు=గిండ్లయొక్క, కర్కరికా ముఖ=ద్వారాగ్రముయొక్క, అగ్ర=కొసనుండి, గళిత=జాఱినట్టి, గంధోదకంబులన్= పరిమళోదకములను, చేతులను, తేల్చెన్=కడుగుకొనెను.

వ్యా-విశే. వామనేత్ర-అంగాదులకుఁ దక్క సంయోగోపధంబులగు జీప్ప్రత్యయము రామింజేసి 'వామనేత్ర' అనియే యగును. 'వామనేత్రి, మీననేత్రి' అను మున్నగునవసాధువులు.

క. అప్పుడు తాంబూలంబులు, గప్పురమును జాలవల్లికలఁ బడఁతులచే
నిప్పించె బంధుకోటికి, నప్పద్మదళాయతాక్షుఁ డంతట సతియున్. 21

టీ. అప్పద్మదళాయతాక్షుఁడు = ఆతమ్మిరేకులంబోలె దీర్ఘములైనకన్నులుగల శ్రీకృష్ణుఁడు, జాలవల్లికలన్=చిత్రంపుఁబనులుచేసిన తమలపాకులపళ్లెరములతో, బంధుకోటికిన్=చుట్టములగుమికి, తాంబూలంబును, కప్పురమును, ఇప్పించెన్ = ఇచ్చునట్లు చేసెను.

వ్యా-విశే. కప్పురము. ప్ర. కర్పూరము.

తే. అంతిపురమున నుచితకృత్యములు దీర్చి
చంద్రశాలాస్థితుం డైనశౌరికడకు
సంతసంబున వచ్చి [2]యాసంయమీంద్రు
నడుగులకు నెఱఁగుడు నతఁ డాదరమున. 22

టీ. అంతిపురమునన్=శుద్ధాంతమున, ఉచితకృత్యములు=అర్హములగుకార్యములను, తీర్చి=చక్కఁబెట్టుకొని, చంద్రశాలాస్థితుండైన=శిరోగృహమందున్న, శౌరికడ

1 వార్చి; దార్చు. 2 వాచంయమీంద్రు, నడుగుల కెఱఁగుడును నతఁ.

కుక్=శ్రీకృష్ణునిసమీపమునకు, సంతసంబునన్=సంతోషముతో, వచ్చి, సత్యభామ కర్త యధ్యాహార్యము. సంయమీంద్రు నడుగులకున్=మునీశునిపాదములకు, ఎఱఁగుడున్= నమస్కరింపఁగా, అతఁడు=ఆనారదుఁడు, ఆదరమునన్=మన్ననతో, ముందట 'ఇట్లని యెన్' అనువాక్యముతో నన్వయము.

వ్యా-విశే. సంతసము. ప్ర. సంతోషము. సంయమీంద్రునడుగులకున్=షష్ఠీసమాసమున నుకార బుకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు.

వ. ఇట్లనియె. 23

మ. పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంత ల్చూచి లజ్జింపఁగా
నతులప్రాభవవైభవోన్నతులప్రోవై యిట్లు వర్తించునీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెద న్మానినీ! 24

టీ. మానినీ=మానవతీ! ఇయ్యది సాభిప్రాయము. పతి=భర్త, నీవు+ఐ = నీవై, విహరింపఁగా, అనన్యసామాన్యమగు భర్తృవాల్లభ్యము సూచితము. జనము = లోకము, సంభావింపఁగాన్ = మన్ననసేయఁగా, లోకశ్లాఘ్యచరిత్రము సూచితము. బంధుసంతతి= చుట్టములసమూహము, కొనియాడఁగాన్=నుతింపఁగా, బంధ్వాదరణము సూచితము. సవతికాంతలు=సపత్నులు, లజ్జింపఁగాన్ = సిగ్గుపడఁగా, సవతులెల్లరిలో నెల్లవిషయముల గొప్పందనము కల్గియుండుట సూచితము. అతుల...న్నతులప్రోవు—అతుల = సాటిలేని, ప్రాభవ=ప్రభుత్వముయొక్కయు, వైభవ=విభవముయొక్కయు, ఉన్నతుల అభివృద్ధులయొక్క, ప్రోవు=పోక, లేదా ప్రభుత్వవిభవాభివృద్ధుల పోక, ఐ=అయి, ఇట్లు=ఈగతిని, వర్తించు=ఉండునట్టి నీకున్, ఇతరస్త్రీజనబుద్ధిన్=అన్యవనితాజనసంభావనను, దీవనలు=ఆశీస్సులు, నేను, ఏమిచ్చెదన్=ఏమీయఁగలను?

భా. పతి నీవై విహరించుటంజేసి నీకు భర్తృవాల్లభ్యమా నిండుగఁగలదు. జనము నిను బహూకరించుటంజేసి జనశ్లాఘయూ యమరియున్నది. బంధుసంతతి నిను బొగడుటంజేసి చుట్టాలసురభివై యొప్పియుంటివి. సవతులు నినుగాంచి సిగ్గుపడుచుండుటంజేసి సపత్నులెల్లరిలో మేటివగుట స్పష్టము. ఇట్లు స్త్రీకిఁ గావలయు ప్రాభవవైభవోన్నతులన్నియు నమరియుంట సామాన్యవనితాబుద్ధిని నేనేమి నీకు దీవనలిత్తును?

విశే. పతి నీవైయనుటంజేసి స్వాధీనభర్తృకతయు, నతులప్రాభవవైభవోన్నతుల ప్రోవనుటంజేసి తత్సమృద్ధ్యతిశయమునుగల్గి విఱ్ఱవీగుటయు వ్యంగ్యములగుచున్నవి. మానినియనుట ప్రకృతావస్థాసూచకము.

మ. అనికైనం బతి నిన్నుఁబాసి చనెనో ప్రాణంబు ప్రాణంబుగా
నిను మన్నింపఁడొ నీమనోరథములన్నెయ్యంబుతోఁ జేయఁడో
చనవుల్నీవలె నెవ్వరేఁ గనిరొ నీసౌభాగ్య మింతంతయే
నినుఁ బోలంగల రబ్జగంధు లన వింటే యెందు సాత్రాజితీ. 25

టీ. పతి=మగఁడు, అనిక్+ఐనన్ = యుద్ధమునకైనను, నిన్నున్+పాసి = నిన్నువిడిచి, చనెనో = వెళ్లెనో ? ప్రాణంబు ప్రాణంబుగాన్ = ప్రాణాధికముగా, నినున్ మన్నింపఁడో=సమ్మానింపఁడో? నీమనోరథములన్ = నీకోర్కులను, నెయ్యంబుతోన్=స్నేహంబుతో, చేయఁడో=ఒనర్పఁడో? నీవలెన్, ఎవ్వరేన్ = ఎవ్వరైనను, చనవుల్ = ప్రేమతోడిస్వాతంత్ర్యములను, కనిరో=పొందిరో? నీసౌభాగ్యము = నీ ప్రియవాల్లభ్యము, ఇంతంతయే=ఇంత ప్రమాణ మంత ప్రమాణమా? కొలఁదిలేనిదనుట. అబ్జగంధులు = పద్మగంధులు, నినున్, పోలన్+కలరు, అనన్=అనఁగా, సాత్రాజితీ= సత్యభామా! ఎందున్=ఎచ్చటనైనను, వింటివి+ఏ-వింటే=వింటివా!

విశే. నరకాసురునిపై నలనాఁడేగునదనున నిను విడువలేదు. నేఁడు పారిజాతము గొనునదనునఁగూడ నిను శ్రీకృష్ణుఁడు విడువఁబోఁడు. అని "అనికైనన్ బతి నిన్నుఁబాసి చనెనో" అనువాక్యమువలన జరిగినదానిని జరుగఁబోవుదానిని గథాంశమును సూచించె. నీవలనాఁడు నరకాసురయుద్ధమున నొనర్చిన యుపకృతిననుసరించి నిను బ్రాణాధికగాఁ జూచుట సంభవించె. మఱియు నీవెద్దాసింగోరిన నద్దానిం దప్పక కూర్చుననుటంజేసి పారిజాతము నీకు సులభమే యనునంశము సూచితము. శ్రీకృష్ణుని చనవును జూరఁగొనిన నిండుసౌభాగ్యమున మించునీకుఁ బారిజాతము దుర్లభముగాదు సుమా యనియు నుత్తరార్థమున సూచించెను.

వ్యా-విశే. వింటివి+ఏ. లిడ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. ఎవ్వరేన్ = ఎవ్వరేని, అపిశబ్దార్థక హ్రస్వేకారమునకు లోపంబగు. లోపింపఁగా మిగిలిన నకారపొల్లు ద్రుతమని యంగీకరింపవలయు.

క. అటులైనను గాని మ్మో, కుటిలాలక! నీకు మగఁడు గోరినకోర్కుల్
ఘటియించుఁగాక తా నెం,తటికార్యం బైన *డించి నాదీవనలన్.

టీ. అటులైనను = పనితలకు వలయునన్నియుఁ గలిగియున్నను, ఓకుటిలాలక= ఓవక్రములైన కుంతలములుగలదాన! మగఁడు, నీకు, కోరిన, కోర్కులు, తాను, ఎంతటి

* దీర్చి.

కార్యంబైనను = ఎంతగొప్పపనియైనను, డించి=దించి, విడిచి, నాదీవనల్ = నా యాశీర్వాదములచే, ఘటియించుఁగాక=సమకూర్చుఁగాక.

విశే. వక్రకుంతలయనుటంజేసి వక్రబుద్ధిగలదానవనియుం, దాన నిను ఋజుస్వాంతంజేయఁ మగఁడితరములవీడిగూడ నీకోర్కుల సర్వథాపూర్వకమానఁడనియుం,నొకవేళ యందేమేని పొరపాటు కల్గునని నీవు సందేహముగలదేమో యట్టి సందియముగూడనవి తథ్యవచనుఁడనగు నా యాశీః ప్రభావమున నడుగంటుననియుం, సత్యాశీలముచు, దన ప్రభావమును బ్రకటించుచు, మాని ప్రసంగించె. దీనఁ బారిజాతసుమము నీకుఁ గరస్థమను మాటయు సూచితమయ్యె. రుక్మిణీసత్యలయొద్దనాడిన పైవాక్యములు కలహప్రియతం జాటుచు, నారదునకుఁగల కలహాశనసంజ్ఞ నన్వర్థముగఁ జేయుచున్నవి.

క. అని పలికి శౌరిఁ గనుఁగొని
దనుజాంతక! పోయివచ్చెదను మఱవకుమీ
నను నావుడు గోపవధూ
జనవంచకుఁ డనియెఁ గార్యసంఘటనేచ్ఛన్. 27

టీ. శౌరిన్ =శ్రీకృష్ణుని, కనుఁగొని=చూచి, దనుజాంతక = రాక్షసాంతక, పోయివచ్చెదను=వెడలివత్తును, ననున్, మఱవకుమీ = విస్మరింపకుమీ, నావుడున్ = అనినపిదప, గోపవధూజనవంచకుఁడు = వ్రేతలమోసగించువాఁడు, శ్రీకృష్ణుఁడు, కార్యసంఘటనేచ్ఛన్ = (తలఁచిన)పనిని కూర్చుకోర్కెతో, అనియెన్.

వ్యా-విశే. పారిజాతాపహరణరూపకార్యసంఘటనము నన్ను మఱచిన మఱుఁగుపడుం గాన నన్ను మఱవకుమనియె. మఱియుం రుక్మిణీసత్యలయొద్దఁ దా నొనర్చిన ప్రసంగము శ్రీకృష్ణునకుఁ గోపకారణమై తన్నుపేక్షించునేమో యనియుఁ, దన్ను మఱవకుమని యమ్మౌని పల్కె. పోవుదుననిపలుక్కుట యమంగళమాటఁ బోయివత్తుననుట లోకవ్యవహారప్రసిద్ధము. నావుడు. అనుధాత్వానంతర్యార్థకరూపము.

చ. అదితి మొఱంగి కుండలము లానరకుండు హరించె వాని నేఁ
గదనములోనఁ ద్రుంచి యవి గైకొని దాఁచితి నాఁటనుండియుం
బదిలముగాఁగ నన్నడుగఁ బంపనికారణ మేమి లేఁతినే
యిదె చనుదెంచి యిత్తుననుమీ శతమన్యునితోడ సంయమీ! 28

టీ. అదితిన్ =దేవతలతల్లిని, మొఱంగి=ఆమెను వంచించి-మోసపుచ్చి, ఆనరకుండు=ఆనరకాసురుఁడు, కుండలములు=కర్ణాభరణములు, హరించెన్ =దొంగిలించెను, వానిన్, నేను, కదనములోనన్ =యుద్ధములోపల, త్రుంచి=చంపి, అవి=ఆకుండలములు,

గొని=తీసికొని, నాఁటనుండియుఁన్ = నాఁడు మొదలుకొని, వదిలముగాఁగన్ = బాగ రూకముగాఁగ, దాఁచితిన్, నన్నున్, అడుగన్ = (వానినీయుమని) అడుగుటకున్, పంపని=(ఏవానికైన) అనుపని, కారణమేమి=హేతువేమి? లాఁతినే = అన్యుఁడనా? సంయమీ=ఓమునీ, ఇదె=ఇదిగో, త్వర సూచితము, చను దెంచి=వచ్చి, ఇత్తును=ఇచ్చె దను, అని, శతమన్యునితోడన్=దేవేంద్రునితో, అనుమీ=పల్కుమీ!

వి శే. మఱువకుండుమని పల్కిన నారదున కీశ్రీకృష్ణప్రసంగము సంతోషదాయక ముగుంగదా! శతమన్యుఁడు-నూఱుయజ్ఞములు చేయువాఁడే యింద్రపదార్హుఁడగుట, దేవేంద్రునకు శతమన్యుసంజ్ఞ సంభవించె.

చ. అని వినయంబుతోడఁ గలహాశనసంయమి వీడుకొల్పి యం
గనయును దాను నచ్చట జగత్పతి జూదపువేడ్క నున్నచో
దినకరమండలం బపరదిగ్గిరికూటముఁ జేరె [1]యాదవీ
జనమదిరారసారుణవిశాలదృగంచలవంచకచ్ఛవిన్. 29

టీ. అని, వినయంబుతోడన్=అడఁకువతోడ, కలహాశనసంయమిన్ = జగడము నిండీగాఁగలమునిని (నారదుని) వీడుకొల్పి = పోవననుజ్ఞనిడి, అంగనయును = సత్యభామయు, తానున్, జగత్పతి=జగన్నాథుఁడగు శ్రీకృష్ణుఁడు, అచ్చటన్=అచ్చోట, జూదపువేడ్కన్=ద్యూతోత్సాహమున, ఉన్నచోన్=ఉన్నసమయమున, దినకరమండలము= సూర్యమండలము, యాదవీజన......ఛవిన్-యాదవీజన=యాదవాంగనాసమూహము యొక్క, మదిరారస=మద్యరసముచే, అరుణ=ఎఱ్ఱనైన, విశాలదృగంచల = వెడల్పగు దృష్టులకొనలను, వంచక=వంచించు (తిరస్కరించు), ఛవిన్ = కాంతితో, అపరదిగ్గిరి కూటమున్=అస్తాద్రిశిఖరమును, చేరెన్=పొందెను.

భా. ఇట్లని నారదుని వీడుకొల్పి శ్రీకృష్ణుఁడు సత్యభామతో జూదమాడుచు నచ్చో నుండునదనున, సూర్యమండలము మద్యరసాస్వాదమున నరుణములగు యాద వాంగనల కనుకొనలఁ దిరస్కరించు కాంతిఁగల్గి యస్తాద్రిం జేరెను.

—— సాయంకాలవర్ణనము. ——

ఉ. ఆయతతేజము ల్దఱిఁగి యంబుజబాంధవుఁ డస్తసీమకుం
బోయినఁ జూచి [2]వేచినతమోవిభుఁ డంప దినాంతయోధుఁ డీ
ఛాయఁ దదీయపత్నిఁ [3]బెలుచం బడ నీడిచికొంచుఁ బోయెడిం
కో యనుమాడ్కి నంతట శకుంతరవంబు సెలంగె నెల్లెడన్. 30

1 ఘూర్ణ కీ. 2 లేచిన. 3 న త్తఱి.

టీ. అంబుజబాంధవుఁడు=పద్మబంధువగుసూర్యుఁడు, ఆయతతేజముల్=దీర్ఘములైన కిరణములు, తఱిఁగి=తగ్గి (నశించి) అస్తసీమకున్=అస్తాద్రిప్రదేశమునకు, పోయినన్=పోఁగా, చూచి, వేచిన=కాచికొనియున్న, తమోవిభుఁడు = చీఁకటియనురాజు, అంపన్=పంపఁగా, దినాంతయోధుఁడు=సాయంకాలమనెడుజోదు, తదీయపత్నిన్ = ఆసూర్యపత్నిని, ఈచాయన్=ఈఛాయాదేవిని (ఈనీడను) పెలుచన్ = క్రూరముగా, పడన్=భూమిపైఁబడునట్లు, ఈడిచికొంచున్=లాఁగికొనుచు, పోయెడిన్=పోవుచుండెడిని. అంతటన్=ఆసమయమున (ఆమె) కోయనుమాడ్కిన్=కోయని కుయిపెట్టునట్లు, ఎల్లెడన్=అంతటను, శకుంతరవంబు=పక్షులధ్వని, చెలంగెన్=ఒప్పెను.

భా. తనకుఁ బగతుఁడగు ప్రభాకరుఁ డెపుడు నిస్తేజస్కుఁడగు నెపుడాతనిపైఁగల కసిఁదీర్చికొందునని కాచికొనియున్న చీఁకటిరాజు, ప్రభఁ దఱిఁగి పగటిరా జస్తాద్రిని మఱుఁగుపడఁగా, నప్పగతుని జాయనుచాయను గ్రూరముగ భువింబడఁద్రోసి లాఁగికొనిపోవుచుండెననియు, నయ్యెడనున నామె పెట్టుకుయియో యనుమాడ్కి పక్షులరవ మంతటఁ జెలంగెననియు భావము. సాయంకాలమైనతోడనే ఛాయలు దూరదూరములై నశించుటయుఁ, బక్షులరవము లెల్లయెడల మిక్కుటముగ రేఁగుటయు నైజమగుటం జేసియు, చాయశబ్దమునకు ఛాయానాతపము లర్థము లగుటంజేసియు, ఛాయ సూర్యపత్నిగాఁ జెప్పుట ప్రసిద్ధవిషయ మగుటంజేసియుఁ, తేజస్తిమిరములు పరస్పరవిరోధు లగుటం జేసియుఁ, గవి యట్లూహింప నవకాశముగల్గెనని గ్రహించునది.

అలం. శ్లేషమూలకరూపకోత్థాపితోత్ప్రేక్ష.

చ. ఇనుదెసఁ జూడ నోడి తల లెత్తక నీటఁ దదీయబింబముం
గని వగ జక్కవల్మొగమొగంబులు సూచుచుఁ గుంది మూర్ఛఁ జెం
దినదెసఁ జూడలేక జలదేవత హా! యని కన్ను మోడ్చెనా
వనరుహముల్ముడింగె సహవాసులదుఃఖము నెయ్యు రోర్తురే? 31

టీ. జక్కవలు=చక్రవాకద్వంద్వములు, ఇనుదెసన్=సూర్యునివైపు, చూడన్=చూచుటకు, ఓడి=అసమర్థములై, తలలు=శిరస్సులు, ఎత్తక=మీఁదికెత్తక, నీటన్ = ఉదకమున, తదీయబింబమున్=ఆసూర్యునిబింబమును, కని=చూచి, వగన్ = దుఃఖముతో, మొగమొగంబులు=ఒకరిమొగమునొకరు, చూచుచు, కుంది=దుఃఖించి, మూర్ఛన్=నిస్మృతిని, (నిశ్చేష్టతను) చెందినదెసన్ = పొందినదిక్కును, జలదేవత=జలాధిదేవత, చూడలేక=చూడఁజాలక, హా=అయ్యో అని, కన్ను = నేత్రము, జాత్యేకవచనము. మోడ్చెన్=మూసికొనెను. నాన్=అనునట్లు, వనరుహముల్ = నీటఁబుట్టినపద్మ

ములు, ముడింగెన్=ముకుళించెను. నెయ్యురు=స్నేహితులు, సహవాసుల, దుఃఖమున్= తమతోఁ గలసిమెలసియున్నవారివగను, ఓర్తురే=సహింతురా?

భా. తమ్మును గలిపి సుఖముం జేకూర్చు తమహితుఁడు సూర్యుఁడు తేజముతఱిగి యుండ నాతనిం గాంచలేక చక్రవాకద్వంద్వములు తలలు దుఃఖమున దించికొని నీట నుండెననియు, నైన నపుడు నీటఁ బ్రతిబింబించిన సూర్యబింబము కనులఁబడఁ దమహితు నకుఁ గల్గినవ్యసనమునకై పరస్పరము మొగములంజూచికొని దుఃఖించి మూర్ఛఁజెందె ననియు, నట్లు మూర్ఛనందిన గలసిమెలసి మెలంగు మిత్రముల జలదేవత కన్నులఁ గాంచఁజాలక తననేత్రపద్మముల మూసికొనెనో యనుగతిని తామరలు ముకుళించె ననియు భావము.

చక్రవాకములకుఁ బవలు సంయోగమును రేయి వియోగమును గల్గుట ప్రసిద్ధము. మఱియు రేయి పద్మములు ముకుళించుటయు నైజము. కావునఁ బైవిషయములను గవి పైరీతిగఁ జమత్కరించి వర్ణించెను. నేత్రముల పద్మములతోడఁ బోల్చుట సంప్రదాయమగుట, జలాధిదేవతకు వానిం గన్నులఁగాఁ జెప్పుట సంభవించెను.

అలం. అర్థాంతరన్యాసోత్ప్రేక్షలు.

చ. తనువున నంధకారపుమదం బలమిన్నను భద్రదంతికి
న్మొనసినఁ జిందరేఁగి తపనుం డనుమావుతుఁ గ్రుంకుమెట్టలో
య నురల వైచినన్నొగిలి యచ్చట నెత్తురు గ్రక్కెనో యనం
గనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్జ్వలసాంధ్యరాగముల్. 32

టీ. తనువునన్=శరీరమున, అంధకారపుమదంబు = చీఁకటియనుమదము, అల మిన్ను = అప్రసిద్ధమగునాకాశము, అను=అనునట్టి, భద్రదంతికిన్ = భద్రగజమునకు, మొనసినన్=క్రమ్మఁగా, చిందరేఁగి=విజృంభించి, తపనుండనుమావుతున్ = సూర్యుఁడను మావటివానిని, క్రుంకుమెట్టలోయన్=అస్తాద్రికోనలో, ఉరల = బ్రద్దలగునట్లు, వైచినన్=పడఁద్రోయఁగా, నొగిలి=నొచ్చి, అచ్చటన్ = ఆకోనలో, నెత్తురు=రక్తమును, గ్రక్కెనో, అనన్=అనునట్లు, కనుఁగవ=నేత్రద్వంద్వము, కోరగింపన్=మూసికొనునట్లు సముజ్జ్వలసాంధ్యరాగముల్ = దేదీప్యమానములగు సంధ్యాకాలపు నరుణకాంతులు పొడకట్టెన్=చూపట్టెను.

భా. ఆకాశమను భద్రగజము మేన మదము వ్యాపించుటకతన మదించి విజృంభించి తన్నధిరోహించియున్న మావటీని సూర్యునస్తాద్రిలోయం జిదుగఁద్రోయ నమ్మావటీఁడు నొచ్చి నెత్తురు గ్రక్కుకొనెననియు, నారక్తకాంతులే యివియేమో యనునట్లు సాయంసంధ్యారుణకాంతులు చెలంగెననియు భావము.

సాయంసమయమున నాకాశమునఁ జీఁకటి యలముకొనుటయు, నరుణరాగములు చెలంగుటయుఁ బ్రసిద్ధములగుట, నవ్వానినే యీగతిని గవి చమత్కరించి వర్ణించెనని యెన్నునది.

మ. ఒకభృంగంబు పరాళినీమదనతంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి తాఁ బోయి సం
జకడ న్వచ్చి తదానమ్ముకుళ మేజాడం జొర న్రాక యా
మికుఁడో నాఁ దిరిగెం గొలంకురమకు న్మేలెంతహీనంబొకో! 38

టీ. పరాళినీమదనతంత్రోన్మాది = పరకీయయగు నాఁడుతుమ్మెదతోడి మదన వ్యాపారములచే వెఱ్ఱిదైన, ఒకభృంగంబు=ఒకతుమ్మెద, మకరందాసవమత్తన్=పూఁదేనె యనుమద్యపానముచే మదించినదానిని, ప్రాణేశ్వరిన్ = భార్యను, అబ్జగృహసీమన్ = పద్మమను నింటియొక్కకడను, పెట్టి=ఉంచి, తాన్, పోయి=వెడలి, సంజకడన్ = సంధ్యాసమయమున, వచ్చి, తదానమ్ముకుళము=ఆవంగియున్న తమ్మిమొగ్గను, ఏజాడన్= ఏతీరుగను, చొరన్ =ప్రవేశించుటకు, రాక=వీలులేక, కొలంకురమకున్ = సరోలక్ష్మికి, యామికుఁడో=తలవరియో, నాన్ =అనఁగా, తిరిగెన్ =భ్రమించెను. మేలు=ఉపకారము, ఎంతహీనంబొకో=ఎంతశూన్యమోకదా!

భా. ఒకతుమ్మెద పరకీయయగు నాఁడుతుమ్మెదతోడి మదనక్రీడలందవిలి తన జాయను దమ్మియింట నిడిపోయి సాయంకాలమున రాఁగా నత్తమ్మి యపుడు ముకుళించుటకతన నందుఁ జొరరామి రేయి తలవరి యూరిచుట్టుం దిరుగునట్లు సరస్సుచుట్టును బరిభ్రమించి సరోలక్ష్మికిఁ గాపరియగుతలవరి యయ్యెనని భావము. మఱియు సరోలక్ష్మి కుపకారబుద్ధియే యున్నయెడలఁ దన్ను యామికుఁడై యరయుఁవాని నెట్లేని ప్రాణేశ్వరితోఁ గూర్పకుండునా యని యర్థాంతరన్యాసముమూలమున సరోలక్ష్మికిఁ గల యుపకారబుద్ధిశూన్యతను వెల్లడించె. దేహళీదత్తదీపన్యాయమున కొలంకురమపదము రెండుపక్షముల నన్వయించును. తుమ్మెద యొకపద్మమున నిలువక పరిభ్రమించుట సైజము. సాయంసమయమునఁ బద్మములు ముకుళించుటయు నందుఁ దుమ్మెదలు తగుల్కొనుటయు వెలుపలనుండునవి చొర వీలులేమియు సైజము. వానినే కవి యీరీతిగఁ జమత్కరించె.

అలం. ఉత్ప్రేక్ష. అర్థాంతరన్యాసము.

### అంధకారవర్ణనము.

సీ. దినవారిధాశి మాఁపనుమాని గ్రోలంగ
నడుగునఁ గనుపట్టునస లనంగఁ

గ్రుంకుమెట్టడవిఁ గార్కొనినసంధ్యావహ్నిఁ
  బొడమినదట్టంపుఁబొగ యనంగఁ
దనమణి వడిపోవ ధరణీతలంబున
  నెమకంగ వచ్చిన నింగి యనఁగ
నలచుక్క లనియెడివలరాజుగెలుపువ్రా
  ల్దెలియఁ బూసినమషీలేప మనఁగ
తే. వృద్ధవారవిలాసినీవిసరమునకు
నపలితంకరణౌషధం బనఁగ జార
నలినముఖుల కదృశ్యాంజనం బనంగ
నంధకారంబు జగ మెల్ల నాక్రమించె. 34

టీ. దినవారిరాశిన్=పగలనుసముద్రమును, మాపనుమౌని = రేయియనుముని, క్రోలఁగన్=త్రావఁగా, అడుగునన్=క్రిందను, కనుపట్టు=కనుపడెడు, అసలు = బురద, అనంగన్=అనునట్లుగాను, గ్రుంకుమెట్టడవిన్=అస్తాద్రివనమున, కార్కొనిన=క్రమ్మిన, సంధ్యావహ్నిన్=సంజయనునగ్నియందు, పొడమిన=పుట్టిన, దట్టంపుఁబొగ = తఱచైన ధూమము, అనఁగన్, తనమణి=తనమాణిక్యము, వడిపోవన్=జాఱిపోఁగా, ధరణీతలంబున=భువియందు, నెమకంగన్ = వెదకుటకు, వచ్చిన, నింగి = ఆకాశము, అనఁగన్, (సూర్యుఁడు నభోమణిగదా) అలచుక్కలు = ఆనక్షత్రములు, అనియెడు, వలరాజుగెలుపువ్రాలు=మన్మథునివిజయాక్షరములు, తెలియన్=విశదమగుటకు, పూసిన=రాఁచిన, మషీలేపము=మసిపూఁత, అనఁగన్, వృద్ధవారవిలాసినీవిసరమునకున్ = ముసలివేశ్యలకు, అపలితంకరణౌషధము=నెరయకుండున ట్లొనర్చుమందు, అనఁగన్, జారనలినముఖులకున్=వ్యభిచారిణులకు, అదృశ్యాంజనము = అగపడకుండఁజేయుకాటుక, అనంగన్, అంధకారంబు=చీఁకటి, జగమెల్లన్=లోకమంత, ఆక్రమించెన్.

భా. వెలుఁగుతఱిగి చీకఁటియే భువి నగపడుటంజేసి బురదంబోలె నున్నదనియుం, పశ్చిమాద్రిం బొడకట్టు నరుణకాంతులందును గొలఁదిగఁ జీఁకటి తోఁచుటంజేసి నగ్నియం దుద్భవించినపొగను బోలియున్నదనియుం, భువిఁ జీఁకటి యలముకొనుట నల్లని నింగి భువి కేతెంచినట్లున్నదనియుఁ, జుక్కలకాంతినిగూడ ధిక్కరించుచు క్రమ్ముటకతన తెల్లయక్షరములు బాగుగా నగపడుటకుఁ బూసినమసిపూఁతవలె నున్నదనియుం, నెఱసినవెండ్రుకలనుగూడ నల్లగా నొనర్చునంతటి నల్లందనముగలదిగాన నపలితంకరణౌషధమనియుం, నొకరిమో మొకరికగపడకుండురీతిని గాఱుకొనియున్నదిగాన నదృశ్యాంజనముగను గవి యూహించెను. అలం. ఉల్లేఖము. ఉత్ప్రేక్ష.

సీ. చిలుక తేరును నల్ల చెఱకువిల్లును గల్వ
విరితూపు నిత్తుము మరుఁడ! నీకు
వనమాలికయు నూత్న వంశనాళమును బిం
ఛము సమర్పింతుము శౌరి! నీకుఁ
గప్పుఁగప్పడమును గస్తూరియును గాటు
కయు నివేదింతుము కాళి! నీకు
నేరేడుఁబండ్లు వినీలచామరలు దూ
ర్వలు నొసంగుదు మిభవక్త్ర! నీకు
తే. నిట్టిలోకోపకారికి నిరులుదొరకుఁ
జంద్రసూర్యాదిదుర్దోషశాంతి వొదలి
నిత్యత వహింపఁ జేయంగ నేర్తురేని
యనుచుఁ బ్రార్థించి రభిసారికాబ్జముఖులు. 35

టీ. అభిసారికాబ్జముఖులు = ప్రియునిగూర్చి సంకేతమున కేగు స్త్రీలు. ఇట్టి లోకోపకారికిన్=ఇటువంటి లోకోపకారమొనర్చువాఁడైన, ఇరులుదొరకున్=చీఁకటి తేనికి, చంద్రసూర్యాదిదుర్దోషశాంతి=చంద్రుఁడు సూర్యుఁడు మొదలగువారను, దుర్దోష=దుష్టదోషములయొక్క, శాంతి=నివారణము, పొదలి=ఒప్పి, సంభవించి, నిత్యతన్= శాశ్వతస్థితిని, వహింప=పొందునట్లు, చేయంగన్=చేయుటకు, నేర్తురేని = ఓపుదురేని, మరుఁడ=మన్మథుఁడ, నీకున్, నల్లచెఱుకువిల్లును=అసితేక్షుచాపమును, చిలుకతేరును= శుకరథమును, కల్వవిరితూపును=కలువపూబాణమును, ఇత్తుము=ఒసంగుదుము, శౌరి = కృష్ణ,నీకున్, వనమాలికయు=ఆకులను సుమములనుగూర్పఁబడిన తోమాలె. (వనమాల= విష్ణుని మెడయందలి పుష్పమాల) నూత్నవంశనాళంబును=క్రొత్తపిల్లనఁగ్రోవిని, పింఛమును =నెమిలికుంచెను, సమర్పింతుము=ఇచ్చుకొందుము. కాళి!, నీకున్, కప్పుఁగప్పడమును= నల్లనియాచ్ఛాదనమును (దుప్పటి) కస్తూరియున్=మృగమదమును, కాటుకయున్ = అంజనమును, నివేదింతుము=సమర్పించికొందుము. నేరేడుఁబండ్లు = జంబూఫలములు, వినీలచామరలు=నల్లనిచామరములు, దూర్వలు=గడ్డిపోఁచలు, ఇభవక్త్ర=గజానన! నీకున్ ఒసంగుదుము=ఇత్తుము. అనుచున్, ప్రార్థించిరి=వేఁడిరి.

విశే. ఇట నభిసారికలు తత్తద్దేవతలకుఁ గానుకగా వారివారి కిష్టములగునల్లని వానినే యిత్తుమని వేఁడుటకు నల్లనివాని నొసంగినచో వారును దమకట్టివానినే ప్రసాదింపఁగలంతురనియుఁ, దన్మూలమున స్వాభీష్టాంధకారశాశ్వతిని వారు తప్పక కూర్చవలసి

వచ్చుననియు, వారు మది నెంచుటయే కారణమని యెన్నవలయును. 'ఇరులు' చీఁకటి యనునర్థమున నియ్యది బహువచనముగానే ప్రయుక్తమగును. 'ఇరులు గెలిచినయంతః పురేందు ముఖుల' కురులు, అని శ్రీనాథుఁడు. నైష. 'ఇరులఁ గెలిచినతుమ్మెదగుఱులఁ దెగడు' అని పోతన భాగ. చిలుకరంగు పచ్చనిదైనను దాని నలుపుగానే వర్ణించుట కవిసమయ మైయున్నది.

ఉ. మొనసినదీపికానికరము ల్గృహకార్యగతాభిసారికా
వనితలయూర్పుగాడ్పులనెపంబునఁ గంపమునొంద నోడకుం
డని తిమిరంబు తా నభయహస్తము లిచ్చె ననంగ వానిపైఁ
గనుఁగొనఁ బొల్చె నంకురితకజ్జలముల్నవధూమమాలికల్. 36

టీ. గృహకార్య ... నెపంబున-గృహకార్య = గృహకృత్యములందు, గత=ప్రవర్తించిన, అభిసారికావనితల=అభిసారికాస్త్రీలయొక్క, ఊర్పుగాడ్పుల=నిశ్వాసవాయువులయొక్క, నెపంబునన్=మిషచే, మొనసినదీపికానికరము=ఉండినదీపముల మొత్తము, కంపమున్=చలనమును, పొందన్, తిమిరంబు=చీఁకటి, తాను, ఓడకుండు = భయపడకుఁడు, అని, అభయహస్తముల్ యిచ్చెన్=భయముమాన్పుటకై హస్తావలంబములిచ్చెను. అనంగన్=అనునట్లు, వానిపైన్=ఆదీపములపై, కనుఁగొనన్ = చూడఁగా, అంకురిత ...మాలికల్-అంకురిత=పుట్టిన, కజ్జలముల్=కాటుకకల, నవ=క్రొత్తవైన, ధూమమాలికల్=పొగచాలులు, పొల్చెన్=ఒప్పెను.

భా. నాయకులయొద్దకుఁబోవ సమయముగామింజేసి యభిసారికలు నిశ్వసించుచుఁ గృహకృత్యముల నిర్వర్తించుచుండిరనియు, నవ్వారినిశ్వాసమారుతహతి నపుడుంచఁబడిన దీపములు కంపము నందుచుండెననియు, నట్లు కంపించునీపముల భయపడవలదని యభయహస్తప్రదానమునఁ జీఁకటి యోహార్చుచున్నరీతి నాదీపములపైఁ జూపట్టు ధూమమాలికలు పొల్చుచుండెననియు భావము.

అలం. ఉత్ప్రేక్షాపహ్నవములు.

నక్షత్రవర్ణనము.

సీ. కారొక్కన్నకటికిచీఁకటిమొగుల్మొత్తంబు
గురిసినవడగండ్లగుంపు లనఁగఁ
గాజక్కపలు వాయఁ గరనాళములఁ జందు
రుం దూఁడు పటికంపుటుండ లనఁగ

నెల్లెడ మిన్నేటియిసుమున నచ్చర
కొమ లిడ్డ వెన్నెలకుప్ప లనఁగఁ
దెలివివెన్నెల[1]వెండితీవెలు నిగిడించు
చదలుకమ్మచ్చుబెజ్జము లనంగ
తే. జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద
లీల రతి చల్లుదీవనఁబ్రా లనంగ
వేఁడివెలుఁగెండఁ గ్రాఁగినవిన్ను మేన
[2]నెక్కొను చెమటబొట్లునాఁ జుక్క లమరె. 37

టీ. చుక్కలు=నక్షత్రములు, కార్కొన... మొత్తంబు-కార్కొన్న=క్రమ్ముకొనిన, కటికిచీఁకటి=గాఢాంధకారమను, మొగుల్మొత్తంబు=మేఘసమూహము, కురిసిన=వర్షించిన, వడగండ్లగుంపులు=కరకలగుంపులు, అనంగన్=అనునట్లు, కవజక్కవలు=చక్రవాకద్వంద్వములు, పాయన్=విడిపోవుటకై, కరనాళములన్=కిరణములను గొట్టములచే చందురుండు, ఊఁదు = చిమ్మునట్టి, పటికంపుటుండలు=స్ఫటికపుగుండ్లు, అనంగన్, ఎల్లెడన్=ఎల్లచోటులను, మిన్నేటియిసుమునన్=ఆకాశగంగానదియొక్కయిసుకయందు, అచ్చరకొమలు=అప్సరస్త్రీలు, ఇడ్డ=పెట్టిన, వెన్నెలకుప్పలు=వెన్నెలప్రోవులు, అనఁగన్, తెలివివెన్నెల=స్వచ్ఛమైనవెన్నెలయను, వెండితీవెలు = వెండితీఁగలను, నిగిడించు=సాగించునట్టి, చదలుకమ్మచ్చు=ఆకాశమనుకమ్మచ్చుయొక్క (కమ్మచ్చు=కంసాలి తీఁగెలఁదీయ నుపయోగించుపనిముట్టు) బెజ్జములు=రంధ్రములు, అనఁగన్, జగమున్=లోకమును, గెల్వంగన్ = జయింపఁగా, దండెత్తుమగనిమీఁదన్ = దండెత్తినభర్తపై, లీలన్=విలాసముగా, రతి, చల్లు, దీవనఁబ్రాలు=ఆశీర్వాదాక్షతలు, అనంగన్, వేఁడివెలుఁగెండన్=సూర్యాతపముచే, క్రాఁగిన=తప్తమైన, విన్నుమేనన్ = ఆకాశముయొక్క శరీరమున, నెక్కొను=తావుఁగొన్న, చెమటబొట్లు=స్వేదబిందువులు, నాన్=అనఁగా, అమరెన్=ఒప్పెను.

భా. సాయంసమయమునఁ జీఁకటిందోఁచిన తారకలు, కటికిచీఁకటి యనుమేఘబృందము వర్షించు వడగండ్లవలెను, జక్రవాకద్వంద్వముల నెడఁబాపఁ జంద్రుఁడు కిరణములను గొట్టములద్వారమునఁ జిమ్మిన స్ఫటికగుళికలవలెను, నచ్చరలు మిన్నేటియిసుకం బఱపిన వెన్నెలప్రోవులవిధమునను, స్వచ్ఛమైనవెన్నెల యను వెండితీవల సాగించు నాకాశమను కమ్మచ్చుయొక్క రంధ్రములవలెను, దనభర్త మన్మథుఁడు లోకముం గెల్వ

1 వెండితీఁగలు. 2 నెక్కొనిన చెమ్మబొట్లునాఁ.

దండె త్తఁగా రతి, పతిపై సలీలాసము గాఁ జల్లు నేసఁబ్రాలువలెను, సూర్యాతపసంతప్తమగుట కతన నాకాశము మేనందోఁచిన స్వేదబిందుసమితివలెను చెలంగెనని భావము.

వ్యా-వి శే. మొగులు-ప్ర. మేఘ. చందురుఁడు. ప్ర. చంద్రుఁడు. పటిక. ప్ర. స్ఫటిక. అచ్చర. ప్ర. అప్సర. పటికము+ఉండలు=పటికంపుటుండలు. కర్మధారయం బుల మువర్ణకమునకుఁ బుంపులగు. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరమగునపుడు టుగాగమంబగు. కమ్మి+అచ్చు = కమ్మచ్చు. మిన్నేరు+ఇసుము = మిన్నేటియిసుము. సమాసమున నొపవిభక్తికటివర్ణము కల్గెను. అలం. ఉత్ప్రేక్షోల్లేఖములు.

చంద్రోదయాదివర్ణనము.

ఉ. యామవతీకళత్రునుదయావసరంబునకంటెఁ బాండిమ
శ్రీ మును దోఁచెఁ దూర్పుదెస సిద్ధము కృష్ణుఁడు పారిజాతముఖ్
భామినికై హరించు నని పాయనినెవ్వగ నింద్రరాజ్యల
క్ష్మీముఖమండలంబున వసించినవెల్లఁదనంబుకై వడిన్. 38

టీ. సిద్ధము=నిశ్చయముగా, కృష్ణుఁడు, పారిజాతముఖ్ = కల్పవృక్షమును, భామినికై=సత్యభామకై, హరించును = తీసికొనును, అని, పాయనినెవ్వగన్ = కూడిన నిండుదుఃఖముచే, ఇంద్రరాజ్యలక్ష్మీముఖమండలంబునన్ = ఇంద్రరాజ్యలక్ష్మియొక్క ముఖమండలమున, వసించిన=కూడిన, వెల్లఁదనంబుకైవడిన్=పాండిమమురీతిని, తూర్పు దెసన్ = తూర్పుదిక్కున, యామ...సరంబునకంటెన్ = చంద్రోదయసమయమున కంటె, మును = ముందుగా, పాండిమశ్రీ=తెల్లనికాంతిసంపద, తోఁచెన్=సంభవించెను (చూపట్టెను.)

భా. తనరాజ్యమందలికల్పకము నింక సత్యకై కృష్ణుఁడు హరింపక మానఁడని యెంచి యింద్రరాజ్యలక్ష్మి నెవ్వగఁ జెందుటకతన నామెమోమున వెల్లందనము కల్గెనో యనునట్లు ప్రాచిని బాండురచ్ఛాయ చంద్రోదయమునకన్న మున్నుగఁ జూపట్టెనని భావము.

వ్యా-వి శే. అవసరంబునకంటె-అవసరము+కంటె. కంటెవర్ణకము పరమగునపు డును గొన్ని యెడల నగాగమంబు చూపట్టెడిని. అలం. ఉత్ప్రేక్ష.

సీ. కెరలి చీఁకటిమ్రాను గెడపంగ నిక్కిన
సమయగజంబుదంతము లనంగఁ
జదలు గేదఁగితూర్పుతుదకొమ్మ నరవిరి
యై కానిపించు పూరేకు లనఁగఁ

పొడుపుగుబ్బలి నేలపురిటింటియిడుపునఁ
జఱచినగంధంపుఁజట్ట లనఁగ
మరునిముందఱ బరాబరి సేయుకంచుకి
కులము చేతుల వెండిగుదె లనఁగఁ

తే. కైరవములకు వెన్నెలనీరు వఱుపఁ
బూని చేర్చిన పటికంపుదోను లనఁగఁ
గ్రమముతో శీతకరమయూఖములు గగన
భాగమునఁ గొన్ని యల్లనఁ బ్రాఁకుదెంచె. 39

టీ. కెరలి=విజృంభించి, చీఁకటిమ్రాను=అంధకారమనువృక్షమును, కెడపఁగన్=నశింపఁజేయుటకై, నిక్కిన=చాఁచిన, సమయగజంబుదంతములు=కాలమను నేనుఁగుయొక్క దంతములు, అనఁగన్, చదలుగేదఁగితూర్పుతుదకొమ్మన్=ఆకాశమను మొగిలిచెట్టుయొక్క తూర్పుదిక్కునందైన శాఖయొక్క తుదిని, అరవిరియై=సంగోరు విడినదై, కానిపించు=అగపడునట్టి, పూరేకులు=పూరెమ్మలు, అనఁగన్, పొడుపు...పురిటింటియిడుపునన్=ఉదయాద్రియనుచంద్రసూతికాగృహముయొక్క గోడయిరుపార్శ్వముల మీఁదిభాగములందు, చఱచిన=అంటించిన, గంధంపుఁజట్టలు=గంధముయొక్క పూఁతలు, అనఁగన్, మరునిముందఱన్=మన్మథునిముంగల, బరాబరి సేయు = హెచ్చరిక చేయు, కంచుకికులము=కావలివారియొక్క, చేతులన్=హస్తములందైన, వెండిగుదెలు = వెండిబెత్తములు, అనఁగన్, కైరవములకున్=కలువలకు, వెన్నెలనీరు = వెన్నెలనునుదకము, వఱుపన్=పాఱించుటకై, పూని=యత్నించి, చేర్చిన = కూర్చిన, పటికంపుదోనులు = స్ఫటికవికారములగునరిణలు (నీరుపాఱించుటకై యేర్పడు సాధనవిశేషము) అనఁగన్, క్రమముతో, శీతకరమయూఖములు=చంద్రకిరణములు, గగనభాగమునన్=ఆకసమున, కొన్ని, అల్లన=మెల్లఁగా, ప్రాఁకుదెంచెన్=ప్రాఁకెను.

భా. కాలమనుగజ మంధకారమనువృక్షమును నిర్మూలింపఁగాఁ జాచిన దంతములో యనునట్లును, నాకాశమను మొగిలిచెట్టుదైన తూర్పుకొమ్మను సంగోరువిడి కానిపించుపుష్పముయొక్క రేకులవలెను, నుదయాద్రియను చంద్రసూతికాగృహమున గోడలమీఁదంబూసిన గంధపుఁబూఁతలవిధమునను, మన్మథునిముందు బరాబరుల నొనర్చు సేవకులయొక్క చేతులందలి వెండిబెత్తములవలెను, గలువలకు వెన్నెలనీరుపాఱింప నేర్పఱచినస్ఫాటికపుదోనులవలెను జంద్రకిరణము లేర్పడెనని భావము. (గజము చీఁకటిచెట్టును దమాలమును నిర్మూలించుటయుం సహజము.) అలం. ఉత్ప్రేక్షోల్లేఖములు.

తే. అమరు లమృతాంబునిధిలోని యమృతరసము
వెండిచేరులఁ బటికంపుఁగుండ కట్టి
చేఁదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెఱుఁగుమెయితోన యల్లన మిన్ను ప్రాఁకె. 40

టీ. అమరులు=దేవతలు, అమృతాంబునిధిలోని యమృతరసమున్ = అమృతసముద్రమునందలి యమృతరసమును, వెండిచేరులన్ = వెండిత్రాళ్లతో, పటికంపుఁగుండన్ = స్ఫటికపాత్రను, కట్టి, చేఁదుకొనియెదరో = తోడుకొనెదరో, నాన్ = అనఁగా, శీతరోచి = చల్లనికిరణములుగల చంద్రుఁడు, మెఱుఁగుమెయితోన = తళతళమను దేహముతో, అల్లనన్ = మెల్లఁగా, మిన్ను = ఆకాశమును, ప్రాఁకెన్ = ఎక్కెను.

విశే. వెండిత్రాళ్లవలె కిరణములును, స్ఫటికపాత్రవలెఁ జంద్రబింబమును మించెనని గ్రహించునది. చేఁదుట స్త్రీలుచేయుపనిగాన 'అమరులు=సురవనితలు' అనియుం నర్థము చెప్పనగును. అమరి. ఏ. రూ. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

ఉ. అమరులబోనపుట్టిక సహస్రమయూఖునిజోడుకోడె సం
తమసము వేరువిత్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మిదొలంగుబావ కో
కములకు గుండెతల్లడము కైరవమిత్రుఁడు దోఁచెఁ దూర్పునన్. 41

టీ. అమరులబోనపుట్టిక=దేవతలభోజనపదార్థములగంప, సహస్రమయూఖునిజోడుకోడె=సూర్యునకు సమానమగుకోడె, సంతమసము వేరువిత్తు = చీఁకటియొక్కనాశకుఁడు, కుముదంబుల చక్కిలిగింత=కలువలకు నవ్వఁజేయువాఁడు, పుంశ్చలీసమితికిన్ = జారిణీసమూహమునకు, చుక్కవాలు = ఎదుటిచుక్క, నవసారసలక్ష్మి = నూతనపద్మలక్ష్మిని, తొలంగుబావ = మఱలఁజేయునట్టిబావ, కోకములకున్ = చక్రవాకములకు, గుండెతల్లడము=గుండెదడ, ఐన, కైరవమిత్రుఁడు=చంద్రుఁడు, తూర్పునన్, తోఁచెన్ = కన్పట్టెను.

వ్యా-విశే. సురలు రోజున కొక్కకళచొప్పున వంతుననుసరించి చంద్రకళను ద్రావుదురని పురాణములు నుడువునుగానఁ జంద్రుఁడు దేవతలయాహారముల గంపయయ్యెను. సూర్యుఁడు చనినపిదప జగమును వానివలె దీపింపఁజేయువాఁడు చంద్రుఁడుగాన సూర్యునిజోడుకోడె చంద్రుఁడగు. చంద్రోదయమగుడుం గలువలు వికసించుఁగానఁ జంద్రుఁడు కలువల నవ్వఁజేయువాఁడయ్యె. చంద్రుఁ డాకసమునఁ బ్రకాశించుచుఁ బ్రియసంకేతముల కేగుజారిణుల నెల్లర కగపడంజేసి వారి కరిష్టమును గూర్చువాఁడగు

టయుం నెదుటిచుక్కయుఁ నరిష్టముంగూర్చునదౌట నీవిషయమునఁ జంద్రబింబమునట్టి దానింగా నూహించుట సంభవించె. బావ యన భర్త యన్న. అతఁడు వచ్చునపుడు క్రొత్తమఱదలు దూరముగ ప్రాసాదుల వీడి తొలంగునట్లు చంద్రుఁడు రాఁగా నవసారసక్ష్మీ వికాసముమాని యొప్పుటకనఁ జంద్రుఁడు సారసలక్ష్మికి బావగా భావితుఁ డయ్యె. చంద్రునిరాకంజేసి చక్రవాకములకు వియోగము కల్గును. దాన వానికి గుండెదడంజేయుం వాఁడు చంద్రుఁడని యెన్నవలయు. బోనము. ప్ర. భోజనము. వేరువిత్తు=నాళకము.

✓ఉ. పొందుగఁ బశ్చిమాబ్ధితటభూస్థలి నంశుమదంశుమత్ఫలా
కందము వాసరాంతహాలికప్రవరుం డిడ సాంధ్యవారిభృ
త్కందళము ల్తమోదళయుతంబులు నై గెల పండి వ్రాలెఁ బూ
ర్ణేందునిపేరఁ బ్రాచి నది హేతువు వెన్నెలకల్మికల్మికిన్. 42

టీ. పొందుగన్=చక్కఁగా, పశ్చిమాబ్ధితటభూస్థలిన్=పశ్చిమసముద్రతీరదేశమున్న, అంశుమదంశుమత్ఫలాకందము - అంశుమత్=సూర్యుఁడను, అంశుమత్ఫలా = అరఁటియొక్క, కందమున్=దుంపను, వాసరాంతహాలికప్రవరుండు=దినాంతమనుకృషీవలశ్రేష్ఠుఁడు, ఇడన్=నాటఁగా, సాంధ్యవారిభృత్కందళములు-సాంధ్య=సంధ్యాసమయమునందైన, వారిభృత్=మేఘములను, కందళములు=మొలకలు, తమోదళయుతంబులునై-తమః=చీఁకటియను, దళ=ఆకులతో, యుతంబులునై=కూడినవియునై, పూర్ణేందునిపేరన్=పూర్ణచంద్రుఁడనుమిషతో, గెల, పండి, ప్రాచిన్=తూర్పున, వ్రాలెన్=బలిసెను, వెన్నెలకల్మికల్మికిన్=వెన్నెలయనుసంపదయొక్క కలుగుటకు, అది=ఆతూర్పున గెల పండి వ్రాలుట, హేతువు=కారణము.

భా. అరఁటిచెట్టు తూర్పునకు గెలవేయుట సంపదకల్గుటకుఁ గారణమని యార్యులందురు. పశ్చిమసముద్రతీరమను వ్యవసాయభూమిని వాసరాంతమనుకృషీవలుఁడు రవి యనునరఁటిమొక్కను నాట, సంధ్యాకాలారుణమేఘములను మొలకలెత్తనది చీఁకటి యనుపర్ణములతో మించి తూర్పుదెసం గెలవేసెననియు, నాగెల పండుటంజేసి వ్రాలెననియుఁ నట్లు తూర్పుదెస నాచెట్టు గెలవేయుటకతననే వెన్నెలయనుసంపద సంభవించెననియుఁ భావము. అనఁగాఁ బశ్చిమసముద్రతీరము వ్యవసాయభూమివలెను, సాయంసమయము కృషీవలునివలెను, నస్తమించుసూర్యుఁ డరుణుండై యరఁటిగడ్డవలెను, వాని యస్తమించుట కృషీవలుఁ డరఁటిదుంపను నాటుటవలెను, సంధ్యాకాంతిప్రసారమున నరుణములగుజలదములరఁటిమొలకలవలెను, నపుడలమినచీఁకటు లరఁటియాకులవలెను,

నరుణకాంతులు చెలంగ నుదయించుచంద్రబింబము పండినయరఁటిగెలవలెను నుండెనని గ్రహింపవలయును. అట్టిగెల తూర్పునం దోఁచుటంజేసి వెన్నెల యనుసంపద సంభవించెనని యెన్నవలయును.

అలం. రూపకోత్థాపితోత్ప్రేక్ష. కావ్యలింగము.

చ. సమయవిలాసి శోణమణిసంగతమౌక్తికచారుహారముం
క్రమమునఁ గూర్చుచో నరుణరత్నముఁ దా మును సాంధ్యరశ్మిసూ
త్రమునఁ బొసంగ గ్రుచ్చి యెడతప్పునఁ ద్రోచి పిఱుందఁ జేర్చుము
క్తైముక్రియఁ దోఁచె నయ్యమృతదీధితి లాంఛనరంధ్రసంగతిన్. 43

టీ. తాను, సమయవిలాసి = కాలమనువిలాసవంతుఁడు, శోణమణిసంగతమౌక్తికచారుహారమున్ - శోణ=ఎఱ్ఱనైన, మణి=మాణిక్యములతో (కెంపులు), సంగత=కూడిన, మౌక్తికహారమున్ = ముత్యాలహారమును, క్రమమునన్=వరుసగా, కూర్చుచోన్ = గ్రుచ్చునపుడు, మును=ముందుగా, అరుణరత్నమున్ = సూర్యుఁడనుమాణిక్యమును, సాంధ్యరశ్మిసూత్రమునన్-సాంధ్య = సంధ్యాకాలమందైన, రశ్మి=వెలుఁగను, సూత్రమునన్=దారమున, పొసంగన్=ఒప్పునట్లుగా, గ్రుచ్చి, ఎడ=స్థానము, తప్పుటంజేసి= తప్పిపోవుటచే, త్రోచి=త్రోసివైచి, పిఱుందన్=వెనుకను, చేర్చు=చేర్చిన, ముక్తైముక్రియన్ = మంచిముత్తెమురీతిగ, అయ్యమృతదీధితి=ఆయమృతకిరణుఁడగుచంద్రుఁడు, లాంఛనరంధ్రసంగతిన్ - లాంఛన = (నల్లమచ్చయను, రంధ్ర = బెజ్జముయొక్క, సంగతిన్=కూడికతో, తోఁచెన్=కన్పట్టెను.

భా. కాలమను విలాసి కెంపులను ముత్యములంగూర్చి యొకహారముంగూర్చుచుండెననియు, నందు సాంధ్యకిరణసమేతుండగురవి తొలుత గ్రుచ్చఁబడినమాణిక్యమువలె నొప్పియుండెననియు, నపుడైనసూర్యాస్తమయ మెడతప్పుట దానిం దొలఁగఁద్రోసినట్లుండెననియుఁ, దరువాతఁ దోఁచిన నల్లనిమచ్చగలచంద్రుఁడు బెజ్జముతోఁగూడిన మంచిముత్తెమువలెను నాతనినుండి వెలువడుకిరణములు దారములవలెను నమరియుండెననియు భావము.

విశే. అరుణుఁ డనునరుణరత్నమనియు శ్లిష్టరూపకము గ్రహింపనగును. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచి తగం గయినేయువేడుక
న్వనరుహమిత్త్రబింబ మనువర్తులలాక్షకపట్టికం బయో

ధినడుమఁ దోఁచి సాంధ్యనవదీప్తిరసంబు హరించి పాఱవై
చిన వెలిదూదియో యనఁగ శీతకరుం డుదయించె నత్తఱిన్. 44

టీ. ప్రతీచి=పశ్చిమదిశ (ఒకానొకయువతి), దినపరిణామలక్ష్మికిన్ = సాయంకాలమనులక్ష్మికి, తగన్=ఒప్పునట్లు, కయిసేయువేడుకన్ = అలంకరించు నుత్సాహముతో, వనరుహ......పట్టికన్ = సూర్యబింబమను గుండ్రని లత్తుకపట్టెను, పయోధినడుమన్ = సముద్రమధ్యమున, తోఁచి=ముంచి, సాంధ్యనవదీప్తిరసంబున్-సాంధ్య=సంధ్యాకాలమందైన, నవ=క్రొత్తదైన, దీప్తి=ప్రకాశమను, రసంబున్ = రసమును, హరించి=తీసికొని, పాఱవైచినవెలిదూదియో=పాఱవేసిన తెల్లనిదూదియో, అనఁగన్=అనునట్లు, అత్తఱిన్ = ఆసమయమున, శీతకరుండు=చంద్రుఁడు, ఉదయించెన్.

భా. అస్తంగతుఁడుగా నున్నరవి ప్రతీచి యనువనిత సాయంసంధ్యాలక్ష్మి నలంకరించునుత్సాహమున గ్రహించినలాక్షికపట్టికవలెను, సూర్యాస్తమయ మాపట్టికను సంద్రమునముంచుటవలెను, సంధ్యారుణప్రభలు పిండఁగా దూదినుండివెలువడురక్తోదకముల వలెను, జంద్రుఁడు లత్తుకనీరు పిండఁగా శేషించిన తెల్లనిదూదివలెను నుండెనని భావము. అలం. రూపకోత్థాపితోత్ప్రేక్ష.

మ: కడఁక న్రేచలిగట్టుపట్టిఁ దను వేడ్కం గూర్పఁ నేతెంచి పై
జడిగాఁ జుక్కలతూపు లేయఁ గినుక న్జాబిల్లిముక్కంటి దాఁ
బొడుపుంగెంపను వేఁడికంట నిరు లన్పూవిల్తుమే నేర్చి చొ
ప్పడఁ దద్భూతి యలందెనానపుడు బింబంబొప్పెఁ బాండుద్యుతిన్.45

టీ. కడఁకన్=పూనికతో, రేచలిగట్టుపట్టి-రే=రాత్రియను, చలిగట్టుపట్టి = శీతాచలపుత్రిని, (పార్వతిని), తనున్ = ఈశ్వరుని, వేడ్కన్ = ఉత్సాహముతో, కూర్పన్=కలుపుటకు, ఏతెంచి=వచ్చి, పైన్=మీఁదను, చుక్కలతూపులు = నక్షత్రములను బాణములను, ఏయన్=ప్రయోగింపఁగా, కినుకన్ = కోపముతో, జాబిల్లిముక్కంటి=చంద్రుఁడనుత్రిలోచనుఁడు (ఈశ్వరుఁడు) తాను, పొడుపుంగెంపు=ఉదయరాగము, అను=అనునట్టి, వేఁడికంటన్ = వేఁడిగలకంటిచే (మూఁడవకన్నుచేత), ఇరులన్ పూవిల్తుమేను=చీఁకటి యనుపుష్పబాణునిశరీరమును, ఏర్చి=దహించి, చొప్పడన్=అనువుగా, తద్భూతిన్ = ఆమన్మథశరీరసంబంధమైనబూడిదను, అలందెనాన్=పూసికొనెనో యనునట్లు, అపుడు = ఆసమయమున, బింబము = చంద్రబింబము, పాండుద్యుతిన్ = తెల్లనికాంతితో, ఒప్పెన్=అమరెను.

భా. రాత్రి పార్వతివలెను, జంద్రుఁడు ఫాలాక్షునివలెను, చీఁకటి మదనుని వలెను, నక్షత్రములు పార్వతిని బరమేశునితోడంగూర్ప మదనుఁడేసిన పుష్పబాణముల వలెను, జంద్రునియందుదయరాగము పరమేశునిఫాలాక్షానలారుణజ్వాలవలెను, నంధకార వినాశము మన్మథనాశమువలెను, జంద్రునిపాండురప్రభ యీశునిమేన మించు భస్మావలేపమువలెను నుండెనని భావము. ఈశ్వరుఁడు పార్వతితోఁ దన్ను సురలప్రార్థన ననుసరించి కూర్ప నెంచువాని. మదనుని ఫాలాక్షాగ్నిజ్వాలచే దహించెననుపురాణగాథ నిట ననుసరింపవలెను.

వ్యా-విశే. పార్వతి నల్లనిదిగాన నల్లటిరేయిని బార్వతిగా నెన్నుట సరసము. మదనుని బాణములు సుమములగుటను బారకాసుమములకు సాదృశ్యము సహజమాటను దారకల మన్మథబాణములుగాఁ జెప్పుట హృద్యము. ఇట్లే తక్కుంగలవర్ణనవిషయమును సహజమధురమై సమయోచితగతి కల్గియుంట నెంతయు హృదయంగమమగును. 'ముక్కంటి' బహువ్రీహిని సమాసాంతకార్యంబులు చూపట్టెడిని. మూఁడు+కన్నుఁ డువర్ణలోపద్విత్వములు. అలం. రూపకోత్థాపితోత్ప్రేక్ష.

చ. తొలుమలతాతితో నొరయుతూరుపుఁదొయ్యలిముత్తియంపుఁగుం
డలమున మానికంబు పడినం గనుపట్టెడులక్కగూఁడునాఁ
జలువలతేనియప్పొడుపుఁజాయఁ దొలంగినకందు దోఁచె రే
చెలువ కనుంగవంగమియఁ జెందినకాటుకకప్పుకైవడిన్. 46

టీ. తొలుమలతాతితోన్ = తూర్పుకొండయొక్క శిలతో, ఒరయు=రాపాడు, తూరుపుఁదొయ్యలిముత్తియంపుఁగుండలమునన్ = తూర్పుదిక్కనువనితయొక్క ముత్తామయకర్ణాభరణమునందలి, మానికంబు = మాణిక్యము, పడినన్ = జాఱిపోఁగా, కనుపట్టెడు=అగపడెడు, లక్కగూఁడునాన్=లక్కగలచోటు అనునట్లు, చలువలతేని... చాయన్-చలువలతేని=చంద్రునియొక్క, యప్పొడుపుఁజాయన్ = ఆయుదయరాగమును, తొలంగినకందు=తొలఁగినమచ్చ, రేచెలువ = రాత్రియనుయువతి, కనుంగవన్ = నేత్రద్వంద్వమున, కమియన్ = క్రమ్మునట్లుగా, చెందిన = పొందిన (పెట్టుకొనిన) కాటుకకప్పుకైవడిన్ = అంజనముయొక్క నలుపువలె, తోఁచెన్=అగపడెను.

భా. ఉదయరాగము పూర్ణముగఁ దొలంగినపిదప నగపడునట్టి చంద్రునియందైన మచ్చ ప్రాచీదిగంగనాకర్ణాభరణమునందలి మానికము జాఱి పడిపోఁగా నగపడు లక్కగూడువలెను, రాత్రీరామనేత్రద్వయము కమియ నిడికొనిన కాటుకదైన నలుపువలెను మించెననిభావము. చంద్రబింబము, ప్రాగ్రామాకర్ణాభరణముగలెని, వానియుదయరాగము కర్ణాభరణమందలి మానికమురీతిని వర్ణితములయ్యెనని గ్రహించునది.

మ. అమృతంబాసవ మంగరాగముదయోద్యత్కాంతి చేలంబు చి
హ్నముసుంగా శశి రేవతీరమణుఁ డున్మాదంబు మీఱం దమో
యమున న్భంగము నొంది పాఱఁ గరసీరాలోడితం జేయ వ
చ్చె మరుద్వాహిని దానిఁ దేర్పనన మించెం జంద్రికాపూరముల్. 47

టీ. అమృతంబు=సుధ, ఆసవము=మద్యముగాను, ఉదయోద్యత్కాంతి=ఉదయకాలమందొప్పు కాంతి, అంగరాగము = మైపూఁతగాను, చిహ్నము=మచ్చ, చేలంబునుగాన్ = వస్త్రముగాను, (కాన్ అనుదాని కాసవాంగరాగచేలపదములతో సంబంధముం గల్పించునది.) శశిరేవతీరమణుఁడు=చంద్రుఁ డనుబలరాముఁడు, ఉన్మాదంబు = కైపు, మీఱన్ = అతిశయింపఁగా, తమోయమునన్ = అంధకారమను యమునానదిని, భంగమున్=అవమానమును, ఒంది=పొంది, పాఱన్=పరుగెత్తునట్లు, భంగమున్ = అలలను, ఒంది-పాఱన్ = ప్రవహించునట్లు, (అని నదీపరమగునర్థము), కరసీరాలోడితన్-కర=కిరణములను, సీర=లాంగలముచే, ఆలోడితన్ = క్షోభపెట్టఁబడినదానినిగా, చేయన్=చేయఁగా, కర=చేతియందలి, సీర=నాఁగలిచే, ఆలోడితన్ = సంక్షోభపెట్టఁబడినదానినిగా, అని బలరామపరమగునర్థము. దానిన్=ఆయమునానదిని, తేర్పన్ = ఆశ్వాసింపఁగా, మరుద్వాహిని = గంగానది, వచ్చెన్=ఏతెంచెను, అనన్ = అనునట్లు, చంద్రికాపూరముల్=వెన్నెలలప్రవాహములు, మించెన్=ప్రకాశించెను.

భా. చంద్రికాపూరములు గంగాప్రవాహమువలె ధవళములై యతిశయించెనని భావము.

విశే. చంద్రుఁడు తెల్లనివాఁడు. బలరాముఁడును ధవళగాత్రుఁడే. కావునఁ జంద్రుని బలరామునిగా నూహించుట హృద్యము. అట్లే చంద్రసుధను మద్యముగను, నుదయరాగమును మైపూఁతగను, జంద్రకిరణములు చీఁకటులం బాఱఁద్రోలుటను బలరాముఁడు తరంగములతోడి యమునానదిని దనహలాయుధముచే లేవనెత్తుటగను, నంధకారము నశింపఁగాఁ జెలంగు వెన్నెలలపూరము యమునానదికి సంభవించిన విపత్తును గాంచి యామె నాశ్వాసింప నేతెంచిన తత్ప్రియసఖి గంగానదిగను, దలంచుట యెంతయుం మనోహరము. అలం. రూపకశ్లేషమూలకోత్ప్రేక్ష.

తే. తారకాధీశుకిరణకదంబకంబు
చిలికెఁ బలుచనివలిపంపుజిలుఁగు మంచుఁ
గైరవశ్రీవధూకరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మిన సాత్త్వికస్వేద మనఁగ. 48

టీ. తారకాధీశుకిరణకదంబకంబు = చంద్రునికిరణములగుమి, కైరవశ్రీ... వేళక్ - కైరవశ్రీ = కువలయలక్ష్మియను, వధూ = స్త్రీయొక్క, కరగ్రహణవేళక్ = పాణిగ్రహణకాలమున, వెలికిక్ = బయటికి, క్రమ్మిన = వ్యాపించిన, సాత్త్వికస్వేదము = సాత్త్వికభావమగుచెమట, అనఁగక్ = అనునట్లు, పలుచని...మంచు - పలుచని = దట్టముగాని, వలిపంపు = ధవళమైన, జిలుంగు = సూక్ష్మమైన, మంచు = నీహారము, చిలికెక్ = చల్లెను.

భా. చంద్రకిరణములనుండి వెలువడు పలుచనిమంచు చంద్రుఁడు కువలయలక్ష్మి పాణిగ్రహణమును జేయుచునవసరమున వెలికిఁగ్రమ్మిన సాత్త్వికస్వేదమో యన నొప్పెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

సీ. విరహులమైసోఁకి వేఁడి యౌ వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి
కలువపుప్పొళ్లచేఁ గసరైనవెన్నెల
వలిపవెన్నెలలోన వడిచి తేర్చి
చంద్రకాంతపునీట జాలైనవెన్నెల
ముదురువెన్నెల జొత్తిఁ బదను చేసి
సతులమైపూఁతం బిసాళించువెన్నెలఁ
దనుపువెన్నెల రసాయనము గూర్చి
తే. చిగురువిలుకానిజాతర సేయఁ బూని
కొలముసాముల నందఱఁ గూడఁబెట్టి
వంతు గలయంగ బువ్వంపుబంతివిందు
పెట్టి రెలమిఁ జకోరపుఁబేరఁటాండ్రు. 49

టీ. ఎలమిక్ = సంతోషముతో, చకోరపుఁబేరఁటాండ్రు = చకోరములయైదువలు, (చకోరజాయలు), చిగురువిలుకానిజాతర = మన్మథోత్సవము, చేయక్ = చేయుటకు, పూని = యత్నించి, విరహులమైక్ = వియుక్తులశరీరమును, సోఁకి = స్పృశించి, వేఁడియౌ = ఉష్ణమైన, వెన్నెలక్ = చంద్రాతపమును, పచ్చివెన్నెలక్ = (చల్లని) తడిగల వెన్నెలతోడ, (కూర్చి) నులివెచ్చక్ = కవోష్ణముగా, చేసి = ఒనర్చి, కలువపుప్పొళ్లచే = కుముదపరాగములచే, కసరైనవెన్నెలక్ = మలిన(కలుష)మగు వెన్నెలను, వలిపవెన్నెలలోనక్ = సన్ననివెన్నెలలోపల, వడిచి = వడియఁగట్టి, తేర్చి = స్వచ్ఛముగాఁజేసి, చంద్రకాంతపునీటక్ = చంద్రకాంతమణులసంబంధమగు నుదకముచే, జాలైనవెన్నెలక్ = ప్రవాహమైనవెన్నెలను, ముదురువెన్నెలక్ = (తీక్ష్ణమైన) పండువెన్నెలచేత, జొత్తిక్ = త్రావు

టకు, పదను=అనువుగా చేసి, సతులమైపూఁతన్ = స్త్రీలయంగరాగముచే, పిసాళించు= పరిమళించు, వెన్నెలన్, తనుపువెన్నెలన్=తృప్తినందించుచంద్రికతో, రసాయనమున్= ఔషధవిశేషమును (ద్రవాహారము) కూర్చి, ఘటించి, కొలముసాములన్ అందఱన్= కులముపెద్దలనెల్లను, కూడన్ పెట్టి=ఒక్కచోఁ జేర్చి, వంతు=వరుస, కలయంగన్ = కూడునట్లుగా, బువ్వంపుబంతివిందున్=చుట్టములైనయాఁడువారును మగవారును గలిసి భుజించుట యనువిందును, పెట్టిరి=ఇడిరి.

విశే. చకోరములు వెన్నెలలం ద్రావుననుట ప్రసిద్ధము. దానినే కవి యీగతిని జమత్కరించి వర్ణించినాఁడు.

సీ. కామినీమానమేఘశ్రేణి విరియంగఁ
    దొగతెల్లుగుంపులు దొంగలింప
సాంధ్యరాగావిలచంద్రికాంబులు దేఱి
    నిరులుమొత్తపుటస లివురఁ బాఱ
యువజనరాగపయోరాసు లుప్పొంగ
    వెలిదమ్మి జాజిపువ్వులు ముడుంగ
మదచకోరమరాళమండలి చెలరేఁగఁ
    బఱచుచేడియ లనుమెఱుపు లడఁగ
తే. నభినవశరత్సమాగమం బనఁగ మించు
నట్టిరాకానిశావేళ నలరువింట
గొనయ మెక్కించి వలరాజు కినుక మీఱ
విరహిజనములపై దండువెడలె నపుడు. 50

టీ. కామినీమానమేఘశ్రేణి-కామినీ = మదవతులగు వనితలయొక్క, మాన = పురుషులయెడఁగల్గు కోపవిశేషమను, మేఘ = మేఘములయొక్క, శ్రేణి=పంక్తి, విరియంగన్=విడిపోఁగా, తొగతెల్లుగుంపులు = కలువలనుతెల్లుపూవులగుములు, తొంగలింపన్=ప్రకాశింపఁగా, సాంధ్య...అంబులు-సాంధ్యరాగ = సంధ్యాకాలరక్తిమచే, ఆవిల=కలుషములైన, చంద్రికాంబులు = వెన్నెలయనునీళులు, తేఱన్=స్వచ్ఛముగా, ఇరులుమొత్తపుటసలు=చీఁకటులగుంపనుబురద, ఇవురఁబాఱన్=ఇంకఁబాఱఁగా, యువజన...రాసులు-యువజన = యౌవనవంతులయొక్క, రాగ=అనురాగమను, పయోరాసులు=సముద్రములు, ఉప్పొంగన్=పొంగఁగా, వెలిదమ్మిజాజిపువ్వులు = తెల్లదామరలను జాజిపూవులు, ముడుంగన్=ముకుళింపఁగా, మదచకోరమరాళమండలి = మత్తి

లినచకోరములను హంసలగుంపు, చెలరేఁగన్ = విజృంభింపఁగా, పఱచుచేడియలను మెఱపులు = (ప్రియసంకేతమునుగూర్చి) పరువులిడువనితలను విద్యుత్తులు, అడఁగన్ = వశింపఁగా, అభినవశరత్సమాగమంబు = క్రొత్తశరత్కాలపురాక, అనఁగన్ = అనునట్లు, మించు = ప్రకాశించునట్టి, అట్టిరాకానిశానేళన్ = అటువంటి పూర్ణిమారాత్రిసమయమున, అలరువింటన్ = పుష్పకోదండమున, గొనయము = నారిని, ఎక్కించి, వలరాజు = మన్మథుఁడు, కినుక = కోపము, మీఱన్ = అతిశయింపఁగా, విరహిజనములపైన్ = వియుక్తులమీఁదికి, అపుడు = ఆసమయమున, దండువెడలెన్ = యుద్ధము సేయఁబోయెను.

విశే. శరత్సమయమునఁ దెల్లనై జలదములు విరియఁబాఱుటయుం, తెల్లపూవులు పెల్లుగనొప్పుటయుఁ, జంద్రికలచ్ఛములై యమరుటయుం, జలమమలంబై మించుటయుఁ, బయోనిధు లుప్పొంగుటయుఁ, జాజిపూవులు ముకుళించుటయుం, వెన్నెలంద్రావఁగోరు చకోరములును నమలజలము నాశించునంచపిండును సంతసముమీఱ విజృంభించుటయుం, మెఱపులుడుగుటయుఁ, నైజములు. అట్టి శరత్కాలసహజధర్మములతోఁ జంద్రోదయ ధర్మములు పోల్పఁబడి హృద్యములై వర్ణితములయ్యెను.

ఉ. ఆనలినాయతాక్షుగడియారమునం దభిసారికాజిఘాం
సానిరతప్రసూనశరచాపగుణధ్వనులో యనంగ ఘం
టానినదంబు లయ్యెడ వినంబడియెం గుపితాబ్జలోచనా
మానసము ల్చలింపఁ బ్రథమప్రహరాపగమప్రశంసులై. 51

టీ. ఆనలినాయతాక్షు గడియారమునందు = ఆపద్మములవలె దీర్ఘములగు కన్నులుగల శ్రీకృష్ణుని కాలప్రమాణముందెల్పు యంత్రవిశేషమున, ఘంటానినదంబులు = గంటలచప్పుడులు, అభిసారికా...ధ్వనులు + ఓ - అభిసారికా = కాంతులంగలయఁబోవు కాంతలయొక్క, జిఘాంసా = హింసించుటయందు, నిరత = మిక్కిలియాసక్తిగల, ప్రసూనశర = పూవిలుకానియొక్క, చాప = ధనువుయొక్క, గుణ = అల్లెత్రాటిసంబంధమైన, ధ్వనులో = శబ్దములో, అనంగన్ = అనునట్లుగా, కుపిత...మానసముల్ - కుపిత = కోపించిన, అబ్జలోచనా = స్త్రీలయొక్క, (తమ్ములంబోలుకనులుగలవారు) మానసముల్ = మనస్సులు, చలింపన్ = సంక్షోభమునందఁగా, ప్రథమ...ప్రశంసులై - ప్రథమ = తొలిదైన, ప్రహార = యామముయొక్క, అపగమ = అతిక్రమించుటను, ప్రశంసులై = తెల్పునవియై, అయ్యెడన్ = ఆసమయమున, వినంబడియెన్ = విననయ్యెను.

భా. తొలిజాము పోకడం దెల్పు గడియారపుచప్పుడులు కాంతులంగవయ సంకేతమునకేగు కాంతల హింసింప మదనుఁడు ధనువుచేఁబూని చేయు నారిటంకారధ్వనులో

యనంగ నమరిప్రణయకలహాకలుషితాంతఃకరణలగు కాంతలమదుల నల్లలనాడించు నదై చెలంగెనని భావము.

విశే. ప్రథమ యామ మతిక్రమించెఁగాన నభిసారికలు తమిమీఱ నభిసరణ మొనర్పఁబోవుటయుఁ గుపితల మదిచలించుటయు సహజములనఁదగు. అట్టితఱిని గల్గిన గడియారపుచప్పుడుల మదనధనుష్టంకారములుగను గుపితమానినీమానసచంచలన కారణములుగను నూహించుట యెంతయు హృద్యము. ఆకాలమునఁగూడ కాలప్రమాణ సూచకములగు గడియారములు కల్గుట దీన సూచితము. అలం. ఉత్ప్రేక్ష.

## చంద్రికావిహారములు.

చ. వలిపము గట్టి హారములు వైచి పటీరము మై నలంది జా
దులు నెఱిగొప్పునందుఱిమి త్రోవనె పోయితిమేని తాఁకియుం
దలఁచెడువారు లేరని మనంబుకలంకలు దేర్చి జారకాం
తల సమయస్థలంబులకుఁ దార్చిరి దూతిక లట్టివెన్నెలన్. 52

టీ. వలిపము = సన్నని తెల్లనిబట్టను, కట్టి=ధరించి, హారములు = ముత్యాల హారములను, వైచి=వేసికొని, పటీరము = మంచిగంధము, మైన్ =శరీరమున అలంది= పూసికొని, జాదులు=జాజీసుమములు, నెఱిగొప్పునన్ =రమ్యమైనతుఱుమున, తుఱిమి= ముడిచి, ('నెఱి=నిండు' అనిన లెస్స) త్రోవనె=మార్గమందె, పోయితిమేని=ఏఁగితిమేని, (పోయినను) తాఁకియున్ =తగిలియు, తలఁచెడువారు=తగిలె నిదియేమి యని భావించువారు, లేరు=ఉండరు. అని, దూతికలు = ప్రియులంగలుపుచెలులు, మనంబుకలంకలు= మనస్సునందైన సందియములను, తేర్చి=పోఁగొట్టి, జారకాంతలన్ = జారిణులను, సమయస్థలంబులకున్ = నిర్ణీతప్రదేశములకు, అట్టివెన్నెలన్ =ఆవెన్నెలలో, తార్చిరి= పొందించిరి.

భా. ధవళములగు నలంకారముల ధరించి ధవళమగు వెన్నెలలో రాజమార్గమునఁ బోయినను నందొకపు డెవరేని తాఁకినను, మీరు వారిచూడ్కికి లక్ష్యముగాకయే పోఁగలరని దూతికలు జారిణులమదినైన సందియములఁబాపి ధవళాలంకారముల ధరింపఁ జేసి సంకేతస్థలములను బొందించుచుండిరని భావము. ఇట్లు ధవళాలంకారముల ధరించి, వెన్నెలల జారిణులు విహరించుట కావ్యప్రసిద్ధవిషయము.

వ. వెండియుం దుహినకరమండలంబునం గురియు నప్పండువెన్నెలలు సాయంతననటనచటులమహానటవికటాట్టహాసభాసంబుల కనుప్రాసంబులై, పూర్వాపారావారపులినతలవిహారమాణైరావణకరపుష్క

రోద్ధూతవాలుకాధూళిపాళికలకుం బ్రత్యాదేశంబులై, యంధకార బలీంద్రనిర్బంధనధురంధర సమయమధుమథనచరణాంగుష్ఠనిష్ఠ్యూత గగనసరిదంబుపూరంబుల కనుబింబంబులై, చంద్రకాంతమణినిర్మిత హర్మ్యహిమవన్మహీధరశృంగపతితంబు లగుచుం బెనువెల్లువలు గట్టి యతివిషమమానినీమానప్రతీరంబు లురలం ద్రోయుచు, వియోగవేదనాభరాక్రందద్రథాంగకంఠగుహా కుహరముఖంబుల ముంపుకొని [1]మెఱయుచు, నరవిరిచెందొగమొగడలం బడి [2]సుడియుచుఁ, [3]దనుకరువలిం గదలువిరులం దొరుఁగుపుప్పొడితిప్పలం బొరలి తెట్టువ గొంచుఁ, గనకడోలావిహారలీలాయత్తమత్తకాశినీకపోలధాళధళ్యంబుల [4]పెల్లునం గడలుకొని యుప్పొంగుచుఁ, గటికిచీఁకటితరులం జెరలం జేయుచు, సకలభువనతలాప్లావనంబు గావించి, యజాండకరండంబు [5]వెండిజలపూఁత గావించిన తెఱంగున నంగీకరించె నప్పుడు దమయందు నెప్పుడెప్పుడు నింతురో యనుచు నువ్విళ్లూరుచందంబునఁ జంద్రికాకిరణకందళికలం గరంగు రేవెలుంగు రాచిప్పలం గప్పురంపుఁగుప్పెలం గొప్పరించిన సరసమధురసంబులు నించి యించినవేడ్కల నొండొరువులకెంజిగురాకుమోవినంజలం జవిగొనుచుఁ గ్రోలి సోలి పూఁజవికలఁ బొంపిరివోవు కామినీకాముకులును, వలరాచకేలి సలుపునెడల [6]నంగంబుల చకచకలు వెలివోవకుండ నిండార లేపంబులు సేయుచొప్పునఁ గర్పూరకస్తురికాసంకుమదమిళితచందనపంకంబు లొకొళ్లొకళ్ల మేనులం గలయ నలందుకొని చలువచప్పరంబులందీర్చిన పుప్పొడితిన్నెల విశ్రమించుసతీపతులును, బ్రోడలగు నెచ్చెలులు జీరాడుసిగ్గుల నీడిగిలంబడ నెట్టకేలకుఁ ద్రోపుత్రోపాడుచుం దార్చి కూర్చి మరలుటయు మరుండొనర్పఁ గలకొత్తలకుం దివురుతమకపుముంగలిపోఁజులు నిగిడించు క్రొవ్వాఁడి తూపులరూపున నొండొరువుల మఱుపెట్టి చూచునెలగోలుచూపుల నితరేతరధైర్యంబులు గంటివడ నొంటిం బచ్చెనయోవరుల వసియించువధూవరులును, బేరుకొనుకోరికలు దారుకొన డాయునెడం

1 మొఱయుంచు. 2 సుడిగొనుచుఁ. 3 జిఱుకరువలిం. 4 పైజల్లువం. 5 వెండిజల పోసనంబు. 6 నందంబుల తెగలు పొలివోవ.

పొంగినయంగంబులం బరస్పరబాహుపాశంబుల బిగియారం గౌఁగిలించుకొని కరంగినడెందంబుల రెంటి నొక్కటిగ నత్తించుపోలిక నత్తమిల్లి పగలు తమపాసిన [1]యెడలం బొడము మనోజవికారంబుల నవిరళతరకపోలంబుగాఁ జెప్పికొనుచు హంసతూలికాతల్పంబుల నల్పేతరానందంబులం బొరలు తరుణీతరుణులును, దోలుతటిపాలయలుకయెడం జనించినవియోగశిఖి నిండారు రేయెండ వేఁడిమి నగ్గలించినం దాలిమి దెమలందమక తామ తమకించి కలసికొని నెచ్చెలులకు బేలువెట్టి తొట్టినవేడ్కలం బొదరిండ్లకందువలం బొదలు రమణీరమణులును, మబ్బుకొను వయసు [2]గుబ్బల నిబ్బరంబుగ నివుడు తివుటలం బెచ్చుపెరుఁగుమచ్చరంబుల నొక రొకరి మెచ్చక పచ్చవిలుతుండు విచ్చలవిడిం దనకై దువులు ముప్పదిరెంటం దోడుసూపె నన బహువిధకరణాసనభేదంబులం బెనఁగుచు మణిసౌధంబులం గ్రీడించు యువతీయువజనంబులును, గ్రిక్కిఱిసిన మక్కువల నిక్కువలఁ గమియం [3]జొక్కులచెయ్వులఁ ద్రొక్కుడు[4]వడి రతిశాస్త్రరహస్యతత్త్వానుభవంబున వెలి మఱచినవలరాచతపసులపోలికం దెలిరాకట్టునెలవులం బవ్వళించి యున్న నాయికానాయకులును, నెడపడనివేడుకపసుల నలసి జడియునవయవంబులపై సొలయు నెమ్మనంబులతో నొయ్యనొయ్యనం గదలు తూఁగుటుయ్యెలలం గన్ను మొగిచి యున్నవిలాసినీవిలాసులునుం గలిగి యన్నగరంబు శంబరాంతకుసామ్రాజ్యంబు ననుకరించె; నయ్యెడ నయ్యదువల్లభుండు సత్యయుం దాను ననర్ఘ్యమణిదీపితంబును విమలదుకూలవితానసందానితంబును బ్రాలంబముక్తాగుళుచ్ఛచ్ఛవిచ్ఛాదితవలభివిలసితంబును వివిధ విచిత్రపటఘటితస్ఫటికభిత్తిభాగభాసురంబును మృదులహంసతూలికాకల్పిత తల్పసంఛన్నమణిమంచకాంచితంబును ధవళఫణిలతాదళక్రముకఖండమండిత మరకతమణిభాజనవిభ్రాజితంబును మృగమదమిళితపటీరపంకాంకితమౌక్తికశుక్తిపరికల్పితంబును దరవికచలతాంతతాలవృంతకాంతంబును గోమలబిసతంతుసంతాన

1 యడలునం బొడముచెయ్వులనవిరళ. 2 గబ్బుల. 3 జిక్కుల. 4 వడ నన్నుకొని వలరాచ.

నిబద్ధకుసుమదామ రమణీయంబును సురభికృష్ణాగరుధూపధూపితంబును బరిమళమిళితశిశిరసలిలపూర్ణకనకగళంతికా సమంచితంబును మంజుగుంజత్పారావతపతంగగళరవభరితంబును మాణిక్యసమున్నతాదర్శ దర్శనీయంబును నగు శయనాగారంబున వినోదకేళిం దేలి నిద్రాముద్రితనేత్రుండై శయనించె నయ్యవసరంబున. 53

టీ. వెండియుఁ = మఱియు, తుహినకర మండలంబునన్ = చంద్రమండలమునుండి, కురియుఁ=జాఱునట్టి, అప్పండు వెన్నెలలు=ఆముదురు వెన్నెలలు, సాయంతన......భాసంబులకున్ - సాయంతన = సాయంకాలమందైన, నటన=నృత్యముచే, చటుల=కదలునట్టి, మహానట=శివునియొక్క, వికట=విశాలమైన, అట్టహాస=పెద్దనవ్వుయొక్క, భాసంబులకున్=కాంతులకు, అనుప్రాసంబులై=సవర్ణములై; అనఁగాఁ బండు వెన్నెలలు నాట్యావసరమున శివునినుండి వెలువడువిశాలాట్టహాస కాంతులంబోలియున్నవని భావము. శివుఁడు తెల్లనివాఁడు. చంద్రుఁడును ధవళగాత్రుఁడే. కావుననే చంద్రబింబమునుండి వెలువడుపండువెన్నెలలు శివుని యట్టహాసకాంతులంబోలి యున్నవని చెప్పుట కనుపడియె. పూర్వపారావార...పాళికలకున్-పూర్వపారావార = తూర్పుసంద్రముయొక్క, పులినతల = ఇసుక దిబ్బలతావుల, విహారమాణ = విహరించునట్టి, ఐరావణ=ఐరావతముయొక్క, కరపుష్కర=తుండాగ్రముచే, ఉద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, వాలుకాధూళి = ఇసుకసంబంధమైన పరాగములయొక్క, పాళికలకున్ = పంక్తులకు, ప్రత్యాదేశంబులై=బదులుగాఁగల్గినవై (అనఁగా వానిని మించినవై యని భావము) ఐరావణము దేవేంద్రునిపట్టపుటేనుఁగు. దేవేంద్రుఁడు ప్రాగ్దిగధిపతి. కావుననే యాతనిగజము ప్రాక్సముద్రపులినతలములవిహరించును. మఱియు నైరావతము ధవళము. అది చిమ్ము వాలుకాధూళియు ధవళమే. కావుననే తెల్లనియైరావతము తుండాగ్రమునఁ జిమ్ము వాలుకాధూళి పాళికలవలె ధవళగాత్రుండగుశశినుండి వెలువడుధవళములగు వెన్నెలలు మించియున్నవనుట సంభవించె. పుష్కరము కరిహస్తాగ్రవాచకమైనను, మఱల హస్తిహస్తవాచకమగుకరశబ్ద మిందుఁజేర్చుట స్పష్టార్థము. కాని యైరావణతుండసామ్యమును జంద్రకిరణములకుఁ దోఁపఁజేయ నట్లు కవి కరశబ్దము నిందుఁగూర్చె నేమోయని యూహించుట కవకాశ మొక్కింతగలదు. అంధకార...పూరంబులకున్-అంధకార=చీఁకటి యను, బలీంద్ర=బలిచక్రవర్తియొక్క, నిర్బంధన = బంధించుటయొక్క, ధురంధర = భారమునువహించు, సమయ=కాలమను, మధుమథన=విష్ణునియొక్క, చరణాంగుష్ఠ = కాలిబొటనవ్రేలినుండి, నిష్ఠ్యూత=వెడలునట్టి, గగనసరిత్=మరున్నదియొక్క, అంబుపూరంబులకున్=ఉదకప్రవాహములకు, అనుబింబంబులై=ప్రతిబింబములై; గంగానది

తెల్లనిది. దానిపూరములును దెల్లనివే. బలిని బంధింపఁ గాలు గట్టిగాఁ బూనుటకతన నాతనియంగుష్ఠమునఁ గలగంగకు బహిః ప్రసారము కల్గెను. ప్రకృతము తెల్లనిగంగానదీ ప్రవాహములవలెఁ బండువెన్నెల లమరెనని భావము. చీఁకటిని రాక్షసరాజగుబలీంద్రుని గాను, దానియడఁగుటను వానిబంధనముగాను, వెన్నెలలయమరుటను వానిబంధించు భారము బూనియున్నవిష్ణుని కాలిబ్రొటనవ్రేలినుండి జాఱుగంగాపూరముగాను జెప్పుట యెంతయు సరసము. చంద్రకాంత...పతితంబులు - చంద్రకాంతమణి=చంద్రకాంత మాణిక్యములచే, నిర్మిత=కట్టఁబడిన, హర్మ్య=మేడలను, హిమవన్మహీధర=హిమవత్పర్వతముయొక్క, శృంగ=శిఖరములనుండి, పతితంబులు = పడునట్టివి, అగుచున్, వెను వెల్లువలు=పెద్దప్రవాహములు, కట్టి=ఏర్పడి, అతివిషమ...ప్రతీరంబులు-అతివిషమ = మిగులఁ గఠినములగు, మానినీ = స్త్రీలయొక్క, మాన=మానమను, ప్రతీరంబులన్ = తీరదేశములను, ఉరలన్ = పడునట్లు, త్రోయుచున్ = కూల్చుచు, చంద్రకాంతమణినిర్మితములగుసౌధముల యున్నతశిఖరదేశములనుండి జాఱు నీటివెల్లువలంగూడి క్రిందికిఁ బడుటకతన వెన్నెలలు హిమవన్నగశిఖరముల నుండి జాఱుప్రవాహములవడువున మించెనని యెన్నవలయును. ప్రవాహము తీరము నురలంద్రోయుట ప్రసిద్ధము. ఈచంద్రికా రూపప్రవాహమును మానినీమాన రూపమగు ప్రతీరమును గూలఁద్రోయుచున్నది. కావుననే దీనికిఁ బ్రవాహతౌల్యము కవి సంఘటించె. చంద్రోపలములు చంద్రకరస్పర్శను ద్రవించుటయు మానినులు మానమునువీడి చంద్రోదయముగాఁ బ్రియులఁ గలిసికొనుటయుఁ నైజములు. వానినే కవి యీ గతిని వర్ణించె. వియోగ...ముఖంబులన్ - వియోగవేదనా = విరహబాధయొక్క, భర=భారముచే, ఆక్రందత్=పరిదేవనము సేయు, రథాంగ = చక్రవాకములయొక్క, కంఠ=కుత్తుకలయొక్క, గుహాకుహర = గుహాలంబోలు బిలములయొక్క, ముఖంబులన్=అగ్రముల, ముంపుకొని=ముంచి, మెఱయుచున్ = ప్రకాశించుచు, (లేక) మోఱయుచున్=శబ్దించుచు; నదీపూరము పర్వతములనుండి భువిఁబడునపుడు తద్గుహాముఖంబుల ముంచి ధ్వనించును. అట్లే చంద్రికాపూరమును విరహవేదన నెలుఁగెత్తి యఱచుచక్రవాకముల కంఠకుహరములఁ బ్రవేశించి మోఱయుచున్నదివలె నుండెనని యెన్నవలయును. కావునఁ బ్రవాహసామ్యము సార్థకమయ్యెను. చక్రవాకములకు రేయి వియోగము కలుగుట ప్రసిద్ధము. కావున నవి రాత్రుల నెలుఁగెత్తి యాక్రందించు. అపు డవ్వాని తెఱువఁబడిననోళులఁ జంద్రికలు ప్రవేశించుట సంభవించును. అరవిరి చెందొగ మొగడలన్=సంగోరువిడిన యెఱ్ఱకలువ మొగ్గలందు, పడి, సుడియుంచున్=తిరుగుచు; ఇపుడే చంద్రోదయమగుటఁ గలువమొగ్గలు సంగోరుమాత్రమే

వికసించెననియు, నట్టి సంగోరువిడినవానింజొచ్చి శీఘ్రము మఱలి రాఁజాలక చంద్రికలు వానిలోఁ దిరుగుచుండెననియు భావము. తనుకరువలిన్ = పిల్లగాలిచే, కదలువిరులన్=చలించుపూవులనుండి, తొరఁగుపుప్పొడి తిప్పలన్=జారుపరాగముల తిన్నెలందు, పొరలి=దొర్లి, తెట్టువన్=తెఱను; మిసిమిననుట, కొంచు=స్వీకరించుచు; మందమారుతాహతిని విరులు మెల్లఁగఁ గదలుచుండెననియు, నట్టిచలనముకతన, విరుల పరాగము జాఱి తిప్పలుగా నేర్పడెననియు, నట్టిధవళములగు పుప్పొడితిప్పలఁ బొర్లుట కతన ధవళములగు వెన్నెలలకు మఱింత ధావళ్యము సంభవించెననియు భావము. కనకడోలా...పెల్లునన్-కనకడోలా = బంగారపుటుయ్యెలల సంబంధమైన, విహారలీలా=విహారవిలాసమందు, ఆయత్త=అధీనలైన, మత్తకాశినీ = మదవతులయొక్క, కపోల=చెక్కిళుల సంబంధమైన, ధాళధళ్యంబుల = తళతళలయొక్క, పెల్లునన్= అతిశయముచే, కడలుకొని=వృద్ధినంది (దిక్కులముట్టి) ఉప్పొంగుచున్ = అతిశయించుచు; అమ్మనోహర చంద్రోదయకాలమున యువతులు బంగరపుటుయ్యెలల సంతసము మీఱ విహరించుచుండిరనియు, నమ్మానినుల యచ్ఛములగుచెక్కిళుల తళతళలతో మేళవించుట కతనఁ జంద్రికలు మిగుల ధవళములై వెంపొందెననియు భావము. కటికిచీఁకటితెరలన్ = గాఢాంధకారమనువృత్తములను, తెరలన్=కూలునట్లు, చేయుంచు=ఒనర్చుచు; ప్రవాహమెడ్డులంగలచెట్టులఁ గూలఁద్రోయునట్లు చంద్రికాపూరము గాఢాంధకారము నున్మూలించుచున్నదని భావము. సకలభువనతలాప్లావనంబున్=సమస్త భూతలముయొక్క ముంచుటను, కావించి=చేసి, అజాండకరండంబున్=బ్రహ్మాండమను బరిణెను, వెండిజలపూఁత=వెండిమొలాము, కావించిన తెఱంగునన్=చేసినవిధమున, అంగీకరించెన్=సమ్మతించెను. బరిణెకు వెండిగిల్టువేసినచందమున వెన్నెల యజాండమనుకరండమును ధవళముగఁ జేసెనని భావము. అప్పుడు=ఆసమయమున, తమయందు = రేవెలుంగు రాచిప్పలందు, ఎప్పుడెప్పుడు = ఇది కాలాతిక్రమణమును సహింపలేకపోవుటకు సూచకము. నింతురో=నిండింతురో, అనుచు, ఉవ్విళ్లూరుచందంబునన్ = ఊటలూరువిధమున, చంద్రికాకిరణకందళికలన్ = వెన్నెలవెలుంగుమొలకలచే, కరంగు=ద్రవీభవించునట్టి, రేవెలుంగురాచిప్పలన్ = చంద్రకాంతశిలాపాత్రములందును, కప్పురంపుఁ గుప్పెలన్=కర్పూరపాత్రవిశేషములందును, కొప్పరించిన = అతిశయించిన, సరసమధురసంబులు=సరసములగుమద్యములు, నించి=నింపి, ఇంచిన వేడ్కలన్ = మీఱినయుత్సాహములతోడ, ఒండొరువుల...నంజలన్-ఒండొరువుల = అన్యోన్యముయొక్క, కెంజిగురాకు మోవి = ఎఱ్ఱనిచిగురుటాకులంబోలు నధరములునట్టి, నంజలన్=ఉపదంశములచే (నంజుకొనువస్తువు), చవిగొనుచు=రుచిచూచుచు, గ్రోలి=త్రావి, సోలి=వివశులై

వ్రాలి, పూఁజవికలన్ = పూఁజప్పరములందు, పొంపిరివోవు = సంతోషించునట్టి, కామినీ కాముకులును = యువతీయువకులును; చంద్రకిరణములతాఁకునఁ జంద్రకాంతశిలలు ద్రవీభవించుట సైజము. ప్రకృతము చంద్రకిరణస్పర్శమునఁ గరంగు చంద్రకాంతపాత్రములు తమయందు మద్యము నెపుడు నింపుదురో యని యువ్విళ్లూరువిధమున నుండెనని గ్రహించునది. అటు లూటలూరు చంద్రకాంతపాత్రములందును గప్పురపుఁగుప్పె లందును మధురసమును నింపి కామినీకాముకు లొండొరులయధరములను ముద్దుఁగొనుచుఁ ద్రావి వివశులై పూఁజప్పరముల సుఖించుచుండిరని భావము. భుజించునపుడు పచ్చడులు మున్నగువానిని నంజుడుగా నుపయోగించురీతి నొండొరులయధరములను మద్యపాన సమయమునఁ గామినీకాముకులు నంజుడుగా నుపయోగించికొనిరని తెలియునది. వలరాచకేలి = మన్మథక్రీడ, సలుపునెడలన్ = చేయుసమయమున, అంగంబులచకచకలు = అవయవముల ప్రవహించుశోభావిశేషము, వెలివోవకుండన్ = బయలుపాటుగాకుండ, నిండారన్ = (మేను)నిండునట్లు, లేపంబులు = పూఁతలు, సేయంచొప్పునన్ = చేయురీతిగ, కర్పూర...పంకంబులు - కర్పూర = ఘనసారము, కస్తూరికా = కస్తురి, సంకుమద = జవ్వాది; వీనిచే, మిళిత = కూడిన, చందనపంకంబులు = చందనపుటడుసులు, ఒకొళ్లొకళ్లమేనులన్ = పరస్పరగాత్రములందు, కలయన్ = అంతటను, అలందుకొని = పూసికొని, చలువచప్పరంబులన్ = చలువపందిళులందు, తీర్చిన = దిద్దినట్టి, పుష్పాపడితిన్నెలన్ = పుష్పపరాగవేదికలపై, విశ్రమించు = ఊరడిల్లు, సతీపతులును = దంపతులును; దంపతులు తమయంగములశోభావిశేషములు బయలుపాటుగాకుండఁ బూసికొనినపూఁతలవలెఁ గర్పూరము కస్తూరి జవ్వాదిఁగలిపిన చందనపంకమును బూసికొనుట యొప్పెనని భావము. అట్లు మైపూఁతలంబూసికొని చలువపందిళులంగల పుష్పాపడితిన్నెలపై విశ్రమించిరనియుఁ దాత్పర్యము. ప్రోడలగు నెచ్చెలులు = ప్రౌఢలైనచెలికత్తెలు, (కర్తలు) జీరాడుసిగ్గులన్ = పొరలిపడునట్టిలజ్జలచే, ఈడిగిలంబడన్ = ముందునకుఁబోవక వెనుకకుఁ దగ్గుచుండఁగా, (నూత్నవధూ వరులనుట) ఎట్టకేలకున్ = అతిప్రయాసమున, త్రోపుత్రోపాడుచున్ = బలాత్కారముగాఁ ద్రోయుచు, తార్చి = చేరువం జేర్చి, కూర్చి = కలిపి, మరలుటయున్ = పోయినతరువాత, మరుండు = మన్మథుఁడు, ఒనర్పంగలకొల్లలకున్ = చేయంగలయుద్ధసన్నాహములకు, తివురు = త్వరపడునట్టి, తమకపుముంగలిపోఁజులు = తమకముకల ముందున్న సేనలు, నిగిడించు = ప్రసరింపఁజేయు, క్రొవ్వాఁడితూపులరూపునన్ = అతినిశితబాణములవిధమున, ఒండొరువులన్ = అన్యోన్యము, మఱువెట్టి = మఱుఁగువెట్టి (కప్పియనుట) చూడు, ఎలగోలుచూపులన్ = ముందునడచుదృష్టులచే, ఇతరేతరధైర్యంబులు = ఒండొరులధైర్యములు, గంటిపడన్ = గంటుపడఁగా, (నశింపఁగాననుట)

ఒంటిన్ = అసహాయముగా, బచ్చెనయోవరులన్ = రంగులలోపలిగదులందు, వసియించు = ఉండునట్టి, వధూవరులును = నూత్నదంపతులును; నూత్నవధువులు సిగ్గుచేఁ బ్రియుల దగ్గఱం గొంకి రాక యీడిగిలంబడుచుండఁ బ్రౌఢలగుచెలికత్తెలు వారి నెట్లో యెట్టకేలకుఁ ద్రోయుచుఁ దీసికొనిపోయి ప్రియులతోడఁ గలిపి చనిరనియుఁ, బిదప నన్యోన్యము పఱిగించికొనువాఁడిచూపుల వారిధైర్యము తఱిగి చిత్రవర్ణచిత్రితములైన శయ్యాగృహములం జేరిరనియుఁ దాత్పర్యము. మరుండు తమపైకిదండెత్తివచ్చి సేనాసమూహముచేఁ బ్రయోగింపించుబాణముల సమూహమునన ట్లవ్వధూవరులదృష్టులు మించెనని గ్రహించునది. మన్మథబాణములవలె దృష్టుల వర్ణించుట ప్రసిద్ధము. పేరుకొను = ఘనీభవించిన, కోరికలు = వాంఛలు, తారుకొనన్ = కదియఁగా, డాయునెడన్ = సమీపించుసమయమున, పొంగినయుంగంబులన్ = ఉబ్బినయవయవములతో, పరస్పరబాహుపాశంబులన్ = ఒండొరుల త్రాళులంబోలుచేతులతో, బిగియారన్ = బిగువగునట్లు, కౌఁగిలించుకొని = ఆలింగనము చేసికొని, కరంగిన డెందంబులన్ = ద్రవించినమనస్సులను, రెంటిన్ = రెండింటిని, ఒక్కటిగన్ = ఏకమగునట్లు, అత్తించుపోలికన్ = అంటించువిధమున, అత్తమిల్లి = అంటుకొని (ఒఱఁగి) పగలు = పగటిభాగమున, తమ పాసినయెడలన్ = తా మెడఁబాయుసమయమున, పొడము = పుట్టిన, మనోజవికారంబులన్ = మదనవికారముల, అవిరళంబుగాన్ = సాంద్రముగా, చెప్పికొనుచున్, అల్పేతరానందంబునన్ = అధికసంతోషముతో, హంసతూలికాతల్పంబులన్ = హంసలమృదురోమములచే నిర్మితములైనశయ్యలందు, పొరలు = దొరలునట్టి, తరుణీతరుణులును = యువతీయువకులును; యువతీయువకులు కోరికలు మీఱఁ దమపగలింటివిరహమువిధమును బరస్పరము ముచ్చటించుకొనుచు మేనున మేనుం జేర్చుకొని యొక్కటై హంసతూలికామృదుతల్పముల నధికానందమున శయనించిరని తాత్పర్యము. తొలుతటి పొలయలుకయెడన్ = పూర్వపుఁ బ్రణయకలహముయొక్క కాలమున, జనించిన = పుట్టిన, వియోగశిఖి = విరహాగ్ని, నిండారు రేయెండ వేఁడిమిన్ = పూర్ణమగు వెన్నెలకాఁకచే, అగ్గలించినన్ = అధికముగాఁగ, తాలిమి = ధైర్యము లేక సహసము, తమలన్ = పోఁగా, తమకతాను = స్వయముగా, తమకించి = త్వరపడి, కలసికొని = కూడి, చెచ్చెలులన్ = చెలికత్తెలను, బేలువెట్టి = వంచించి, తొట్టిన వేడ్కలన్ = అతిశయించినయుత్సాహములతో, పొదరిండ్లకందువలన్ = లతాగృహరహస్యప్రదేశములందు, పొదలు = వర్తించు, రమణీరమణులును = కాంతాకాంతులును; తొల్లి సంభవించిన ప్రణయకలహమువలన వియోగాగ్ని రమణీమణులకుఁ గల్గెననియుఁ, దాన వారు ప్రియులం దగ్గఱకయుండిరనియు, రేయెండ తాఁకున నవ్విరహాగ్ని యతిశయింప చెలికత్తెలవంచించి వారం డటవారే చని పొదరిండ్ల రమణులంగూడి సుఖించిరనియు భావము. మబ్బుకొను = మదిం

చిన, వయసుగుబ్బలన్ = ప్రాయపుస్తనములందు, నిబ్బరంబుగన్ = అధికముగా, నివుడు = సాగునట్టి, తివుటలన్ = కోర్కులచే, పెచ్చుపెరుఁగు = మిక్కిలి యభివృద్ధినందిన, మచ్చరంబులన్ = మాత్సర్యములతో, ఒకరు + ఒకరిన్ = పరస్పరమును, మెచ్చక = మెచ్చుకొనక, పచ్చవిలుతుండు = మన్మథుఁడు, తనకైదువులు ముప్పదిరెంటన్ = తనముప్పదిరెండాయుధములతో (మదనున కాయుధములై దేయైనను వీరసామాన్యముగ పరశుపట్టిసభిండివాలాదులాయుధములు ముప్పదిరెండుండుననుట ప్రసిద్ధమగుటంజేసి యిట్లు చెప్పెననియుఁ గాన నియ్యది వీరసామాన్యోక్తియనియు గ్రహించునది. మఱియు నిది యనంగసంగరమగుట మదనుని వీరవరునిగఁ జెప్పుట యుచితమె.) తొడుసూపెన్ = తోడ్పడెను, అనన్ = అనునట్లు, బహువిధకరణాసనభేదంబులన్ = అనేకవిధములగు గాత్రాసనాదిభేదములను, (అనఁగా రతిబంధాదులనుట) పెనంగుచు = పెనఁగొనుచు, ప్రాయపుమదమున కామినీకాముకులు బహువిధబంధవిశేషములఁ గ్రీడించుచుండిరని భావము. మణిసౌధంబులన్ = రతనంపుమేడలను, క్రీడించు, యువతీయువజనంబులును = తరుణీతరుణులును, క్రిక్కిఱిసినమక్కువలన్ = సాంద్రమగుననురాగములతో, ఇక్కువలన్ = సంకేతస్థలములను, కమియన్ = పొందఁగా, జిక్కులవెయ్యులన్ = కష్టములగుచేష్టలచే, త్రొక్కుడుపడి = నలఁగి, రతిశాస్త్రరహస్యతత్త్వానుభవంబునన్ = కళాశాస్త్రరహస్యతత్త్వముయొక్క యనుభవముచే, వెలి = బాహ్యమును, మఱచిన, వలరాచతపసులపోలికన్ = మదనమౌనులవిధమున, (అనఁగా, మదనపరతంత్రులగు మౌనులవిధముననుట) తెలిరాకట్టుసెలవులన్ = చంద్రకాంతశిలాప్రదేశములందు, పవ్వళించియున్న = శయనించియున్న, నాయికానాయకులును = దంపతులును; తాపసులు రతిశాస్త్రరహస్యతత్త్వానుభవమున బాహ్యమును మఱచినవిధమున, మదనతంత్రములచేఁ బ్రేమ పైకొనఁ గ్రీడించి నాయికానాయకులలసి సొలసి చంద్రకాంతశిలాస్థలుల శయనించిరని భావము. ఎడపడనివేడుకపనులన్ = అంతరములేని వినోదకృత్యములచే, అలసి = ఆయాసమునంది, జడియు = వడఁకునట్టి, అవయవంబులతోన్ = అంగములతో, సొలయు = మూర్ఛనందు, నెమ్మనంబులతోన్ = హృదయములతోడ, ఒయ్యనొయ్యనన్ = మెల్లమెల్లఁగ, కదలు = తూఁగాడు, తూఁగుటుయ్యెలలన్ = డోలలయందు, కన్నుమొగిచి = కనుమూసి, ఉన్న, విలాసినీవిలాసులును = సుందరీసుందరులును, కలిగి, అన్నగరంబు = ఆపట్టణము, శంబరాంతకుసామ్రాజ్యంబున్ = మన్మథసామ్రాజ్యమును, అనుకరించెన్ = పోలెను. (శంబరుఁడను నసురుం జంపుటకతన మన్మథున కీనామముకల్గెను.) అయ్యెడన్ = ఆసమయమున, అయ్యదువల్లభుండు = ఆశ్రీకృష్ణుఁడు, సత్యయున్ = సత్యభామయును, తానున్, అనర్ఘ్యమణిదీపదీపితంబును = అమూల్యములగు మణులదీపములచేఁ బ్రకాశితమగునదియును, విమల...దానితంబును-

విమల=స్వచ్ఛమైన, దుకూలవితాన=పట్టుమేలికట్టులచే, సందానితంబును = కూర్పఁబడినదియును, ప్రాలంబ......విలసితంబును-ప్రాలంబ=వ్రేలాడు, ముక్తాగుళుచ్ఛ = ముత్తియంపుకుచ్చులయొక్క, ఛవి=కాంతిచే, ఛాదిత=కప్పఁబడిన, వలభి=కొణిగలచే, విలసితంబును = ప్రకాశించునదియును, వివిధ...భాసురంబును-వివిధ = పలురకములగు, విచిత్ర=విచిత్రములైన, పట=చిత్రపటములతోడ, ఘటిత=కూర్పఁబడిన, స్ఫటిక=స్ఫటికవికారములగు, భిత్తి=గోడలయొక్క, భాగ=ప్రదేశములచే, భాసురంబును=ప్రకాశించునదియును, మృదుల...చితంబును-మృదుల = మిక్కిలిమెత్తనైన, హంసతూలికా=హంసలవెండ్రుకలచే, కల్పిత=నిర్మింపఁబడిన, తల్ప=పఱుపుచే, సంఛన్న = కప్పఁబడిన, (పఱుపఁబడిన.) మణిమంచక = రతనంపుమంచముతో, అంచితమును = కూడినదియు, ధవళ ..భ్రాజితంబును-ధవళ = తెల్లనైన, ఫణిలతాదళ=నాగవల్లీదళములతోడను, తెల్లనితమలపుటాకులనుట. క్రముకఖండ = (పోఁక)వక్కలతోడను, మండిత=అలంకరింపఁబడిన, మరకతమణిభాజన = మరకతమణినిర్మితపాత్రములచే, విభ్రాజితంబును = ప్రకాశించునదియును, అనఁగాఁ బంగుతములపుటాకులును బోఁకలును గలపళ్లెరములుగలవనుట. మృగమద...పరికల్పితంబును-మృగమద = కస్తూరితో, మిళిత = కూడిన, పటీరపంక=చందనపంకముచే, అంకిత=కూడియున్న, మౌక్తికశుక్తి=ముత్తెపుఁజిప్పలచే, పరికల్పితంబును=అలంకృతమైనదియు; కస్తూరితో చందనమును గలిపి యాచందనమును ముత్తెపుఁజిప్పలలో నిడి యాశయ్యాగృహమున నిడిరని భావము. దరవికచ...కాంతంబును-దర=కొంచెము, వికచ=వికసించిన, లతాంత=పుష్పములచే నిర్మితమైన, తాలవృంత=వీవనలచే, కాంతంబును=సుందరమైనదియు; ఇంచుకవిడినపూవులచే నిర్మితములగు వీవనలందుఁగలవని భావము. కోమల...రమణీయంబును-కోమల = మృదువైన, బిసతంతుసంతాన = తామరతూండ్లదారములగుంపుచే, నిబద్ధ = కూర్పఁబడిన, కుసుమదామ=పూవులదండలచే, రమణీయంబును=సొగసైనదియు; మృదువైనతామరతూండ్లదారములచేఁ బూలదండలం గూర్చి యందుంచిరని భావము. సురభి...ధూపితంబును-సురభి=పరిమళించునట్టి, కృష్ణాగరుధూప=కాలాగరుధూపముచే, ధూపితంబును = పరిమళింపఁజేయఁబడినదియు, పరిమళ...సమంచితంబును-పరిమళ = సుగంధముతో, మిళిత=కూడిన, శిశిరసలిల=చల్లనినీటితో, పూర్ణ=నిండిన, కనకగళంతికా=బంగరుజాడీలతో(పాత్రవిశేషములు) సమంచితంబును=ఒప్పునదియు; పరిమళించు చల్లనినీట నింపి హేమపాత్రవిశేషముల నందిడిరని తాత్పర్యము. మంజు...భరితంబును-మంజు=సొగసుగా,గుంజత్=ధ్వనిచేయు, పారావతశకుంత=పావురములు మొదలగుపక్షులయొక్క, గళరవ=కంఠధ్వనిచే, భరితంబును=నిండినదియు; ఆశయ్యాగృహమునఁ బావురములు మొదలగుపక్షులకలరవము నిండియుండె

నని భావము. మాణిక్య...దర్శనీయంబును-మాణిక్య =రత్నవికారములైన, సమున్నత= ఎత్తైన, ఆదర్శ=అద్దములచే, దర్శనీయంబును = చూడఁదగినదియుఁ; మణివికారములైన నిలువుటద్దము లందుఁ గలవని భావము. అగు=అగునట్టి, శయనాగారంబున=పడకటింటి యందు, వినోదకేలిన్ = వినోదక్రీడను, తేలి = ఓలలాడి, నిద్రాముద్రితనేత్రుఁడై= నిద్రచే మూసికొనంబడిన నేత్రములుగలవాఁడై, శయనించెన్=నిద్రించెను. ఆయ్యవసరంబునన్=ఆసమయమున.

మ. నలినాప్తుండు మదీయబంధులని తా నక్షత్రసంఘంబులం
గలఁప న్వచ్చుచు నున్నవాఁ డనుచు మున్గల్గంగ నాత్మీయశి
ష్యుల మందేహులఁ బోరొనర్పఁ జనుఁడంచుం బంపి యేతెంచెనాఁ
బొడమె న్వేగురుఁజుక్క కాలఫణభృద్భోగోల్లసద్రత్నమై. 54

టీ. నలినాప్తుండు=సూర్యుఁడు, తాను, కర్త. మదీయబంధులను=నాచుట్టాలను; అనఁగాఁ దనసంతతివారనుట. నక్షత్రసంఘంబులన్=చుక్కలగుమిని, కలఁపన్ = క్షోభ పెట్టుటకు, వచ్చుచునున్నవాఁడు = ఏతెంచుచున్నవాఁడు, అనుచున్, మున్గల్గంగన్= ముందుగా, ఆత్మీయశిష్యులన్=తనశిష్యులను, మందేహులన్ = మందేహులను రాక్షసులను, పోరు=యుద్ధము, ఒనర్పన్=చేయుటకై, చనుఁడు=పోవుఁడు, అంచున్, పంపి= పంపించి, ఏతెంచెనాన్ = వచ్చెనోయనునట్లు, వేగురుఁజుక్క = వేఁకువజామున నుదయించుచుక్క, కాలఫణభృత్...రత్నమై-కాల = కాలమను, ఫణభృత్ = సర్పము యొక్క, భోగ=పడగయందలి, ఉల్లసత్=ప్రకాశించు, రత్నమై = మాణిక్యమై, పొలిచెన్=ఒప్పెను.

భా. సూర్యునిరాకను నక్షత్రములు శోభావిహీనములగుట సహజము. సాధారణముగ వేకువం దూర్పునఁ బొడముచుక్క శుక్రగ్రహమై యుండును. ప్రకృతము నక్షత్రరూపుఁడగుశుక్రుఁడు తనసంతతివగు నక్షత్రముల రవి గలంపవచ్చుచుంట నెఱింగి మున్ముందు తనశిష్యుల మందేహుల నాతనితోఁబోరొనర్ప నంపి పిదప తానే తెంచెనేమో యన్నట్లును, కాలసర్పశిరస్థితమాణిక్యమో యన్నట్లును వేగుఁజుక్క యుదయించెనని భావము. కాలగతి ననుసరించి గ్రహతారకలగతియుఁ గల్గుచుండుటంజేసి, కాలమును సర్పముగాను వేగుఁజుక్కను దచ్ఛిరోమాణిక్యముగాను గవి దలంచె. మఱియు మందేహులనురాక్షసులు సూర్యుని పైఁబడుదురనియుం, వారలబారిని ద్విజదత్తార్ఘ్యముల రవి వారించుకొనుననియుం శ్రుతులు నుడువును. కావున నిచ్చోట మున్ముందు మందేహుల నంపి పిదప తానే తెంచె వేగుఁజుక్కనుట యెంతయు హృద్యమగు. అలం. ఉత్ప్రేక్ష

శ్రీకృష్ణుని మేల్కొలుపుట.

క. వైతాళికు లప్పుడు మృదు
గీతామృతవచనరచన గీలుకొన యశో
దాతనయు మేల్కొలుపఁ బ్రా
భాతికరమణీయరాగఫణితులు *సెలఁగెన్. 55

టీ. అప్పుడు = ఆసమయమున, వైతాళికులు = వందిమాగధులు; ప్రభాతమునఁ బ్రభువుల మేలుకొలుపుస్తుతిపాఠకులు. గీతామృతవచనరచన-గీత = గానరూపములగు, అమృత=అమృతమయములైన, వచనరచనలు = పలుకులరచనలు, కీలుకొనఁ = ఒప్పునట్లుగా, యశోదాతనయుఁ=శ్రీకృష్ణుని, మేల్కొలుపఁ = ప్రబోధింపఁగా, ప్రాభాతిక...ఫణితులు-ప్రాభాతిక = ఉదయకాలముననగు, రమణీయ = సొగసైన, రాగ= భూపాలాదిరాగయుతములగు, ఫణితులు=మాటలు, చెలఁగెఁ=ఒప్పెను.

విశే. భూపాలరాగాదులు ప్రాభాతికములని సంగీతశాస్త్రవేత్తలందురు.

మ. జయ గోవింద! ముకుంద! చక్రధర! కంసద్వేషి! సాత్రాజితీ
ప్రియ! నారాయణ! కౌస్తుభాభరణ! కుంభిత్రాణపారీణ! కా
ళియదర్పఘ్న! పతంగవాహ! వనమాలీ! కృష్ణ! వైకుంఠ! శౌ
రి! యశోదాత్మజ! భక్తవత్సల! మురారీ! గోపికావల్లభా! 56

టీ. జయ=సర్వోత్కర్షను మీఱి వర్తింపుము. గోవింద, ముకుంద, ఇవిమున్నగునవి శ్రీకృష్ణునకు సంబుద్ధులు, చక్రధర = చక్రముందాల్చువాఁడ! కంసద్వేషి = కంసహంత, సాత్రాజితీప్రియ = సత్యభామాప్రియుఁడ ! ప్రకృతము సత్యాప్రియుఁడై వరలుటంజేసి యిట్లనుట హృద్యము. నారాయణ = ఉదకమునకుఁ దావైనవాఁడా! గంగ విష్ణుపాదోద్భవయగుటంజేసియుఁ, శ్రీకృష్ణవిష్ణువు లభిన్నులగుటంజేసియుఁ, నిట్లనుట పొసంగెను. కౌస్తుభాభరణ = కౌస్తుభ మలంకారముగాఁగలవాఁడ! కుంభిత్రాణపారీణ=ఏనుఁగును, అనఁగా గజేంద్రుని రక్షించుటయందు సమర్థుఁడా! గజేంద్రుఁడు మొసలిబారింబడి మొరపెట్ట విష్ణు వాతని రక్షించెంగాన నిట్లు నుతించుట పొసంగెను. కాళియదర్పఘ్న = కాళియునిగర్వమును బోఁగొట్టినవాఁడా! పతంగవాహ = గరుడవాహన, వనమాలీ= వనమాలగలవాఁడ, కృష్ణ, వైకుంఠ, శౌరి, యశోదాత్మజ = యశోదాతనయ, భక్తవత్సల=భక్తులయందు వాత్సల్యముగలవాఁడ, మురారీ = మురద్వేషి, గోపికావల్లభా = గోపికాప్రియ!

* ప్రా॰ చెలఁగె.

విశే. జయపదం బనుకరణరహితముగను బ్రయోగింపనగును.

మ. శరధిక్రోడనివేశ! శార్ఙ్గధర! శిష్టధ్యేయ! శీతాంశుభా
స్కరనేత్రద్వయ! శుభ్రపంకరుహభాస్వన్నాభ! శూరాన్వయా
భరణా! శేషశయాన! శైలధర! శోభారమ్యసర్వాంగ! శౌ
ర్యరసోదంచిత! శంఖచక్రధర! శర్వాణీసహాయప్రియా! 57

టీ. శరధిక్రోడనివేశ-శరధి = సముద్రముయొక్క, క్రోడ = నడుమభాగము, నివేశ=ఆవాసముగాఁగలవాఁడ, శార్ఙ్గధర = శార్ఙ్గమనుచాపవిశేషమునుదాల్చినవాఁడ, శిష్టధ్యేయ = సజ్జనులచే ధ్యానింపఁదగువాఁడ! శీతాంశు...ద్వయ=చంద్రసూర్యులు నేత్రములుగాఁగలవాఁడ! శుభ్ర...నాభ=స్వచ్ఛమైనతమ్మిచేఁ బ్రకాశించుబొడ్డుగలవాఁడ! శూరా...భరణా=శూరకులమున కలంకారమైనవాఁడా! శేషశయాన=శేషునిపైఁ బవ్వళించువాఁడ! శైలధర=గోవర్ధనోద్ధార! శోభారమ్యసర్వాంగ = కాంతిచే మనోహరమగు సర్వావయవములుగలవాఁడ! శౌర్యరసోదంచిత=శూరత్వముచే నొప్పువాఁడ! శంఖచక్రధర=శంఖచక్రములను ధరించువాఁడ! శర్వాణీసహాయప్రియా = ఈశ్వరునకుఁ బ్రియమైనవాఁడ!

విశే. ఇందు గుణితక్రమము ననుసరించి ప్రతిసంబుద్ధ్యాదిమవర్ణములు సెలకొల్పఁబడినవి.

క. మేల్కనుము దేవ! యివె రా
చిల్కలు కను మొగిచియున్న చెలువలఁ దమకుం
బల్కులు నేర్పఁగ ముద్దులు
గుల్కెడుపల్కులను మేలుకొలిపెడుఁ గృష్ణా! 58

టీ. దేవ=ప్రభూ! మేల్కనుము=ప్రబుద్ధుఁడవుకమ్ము. ఇవె, రాచిల్కలు=మగచిలుకమిన్నలు, కను మొగిచి=కనుమూసి, ఉన్న, చెలువలన్=స్త్రీలను, తమకున్, పలుకులు=మాటలు, నేర్పఁగన్=నేర్పుటకై, ముద్దులు, గుల్కెడు, పలుకులను=మాటలతో, కృష్ణా! మేలుకొలిపెడున్=మేలుకొలుపుచున్నవి.

విశే. తెల్లవారుసమయమునఁ జిలుకలు మున్నగుపక్షులు కలకలరవము గావించుట సహజమాట నిట్లు చెప్పెను.

సీ. చరమూద్రిదావాగ్నిసంప్లుష్టసురసౌర
భేయీకిశోరైకపిండ మనఁగ

బహుచకోరకదంశపరిపీతచంద్రికా
　　క్షౌద్రనీరసమధుచ్ఛత్ర మనఁగఁ
ప్రత్యఙ్ముఖోచ్చలద్రాత్రివర్షీయసీ
　　పలితపాండురకేశబంధ మనఁగ
గగనసౌధాలేపకరకాలశిల్పిని
　　ర్ముక్తసుధావస్త్రముష్టి యనఁగ
తే. సుమహితజ్యోత్స్నికాలతాసుమగుళుచ్ఛ
మనఁగ నతిధూసరచ్ఛాయ నబ్జవైరి
చెలువు వోనాడి బింబావశిష్టుఁ డగుచు
నల్లనల్లన వ్రాలెడు నంబుజాక్ష! 59

టీ. అబ్జవైరి=చంద్రుఁడు, చరమాద్రి...పిండము-చరమాద్రి = పడమటికొండ యందైన, దావాగ్ని = దవాగ్నిచేత, (కార్చిచ్చు) సంప్లుష్ట=బాగుగఁ దగులఁబెట్టఁబడిన, సురసౌరభేయీ = కామధేనువుయొక్క, కరీషైకపిండము=పేడముద్ద, అనఁగన్=అనునట్లుగను, బహు...ఛత్రమున్-బహు=అనేకములైన, చకోరక = చకోరపక్షులనెడు, దంశ=తేనెటీఁగలచే, పరిపీత=త్రాగఁబడిన, చంద్రికా=వెన్నెలయనెడు, క్షౌద్ర=తేనెగల దగుటంజేసి, నీరస=నిస్సారమైన, మధుచ్ఛత్రము=తేనెపట్టు, అనఁగన్, ప్రత్యఙ్ముఖ... బంధము-ప్రత్యఙ్ముఖ = పశ్చిమదిశనుగూర్చి, ఉచ్చలత్=చనుచున్న, రాత్రి = రేయి యను, వర్షీయసీ=వృద్ధాంగనయొక్క, పలిత = నెరసిన, పాండుర=తెల్లనైన, కేశబంధము=శిరోజములముడి, అనఁగన్, గగన...ముష్టి-గగన=అంతరిక్షమనెడు, సౌధ=మేడకు, ఆలేపకర = పూఁతఁబూయువాఁడగు, కాల=కాలమను, శిల్పి=శిల్పకారునిచే, నిర్ముక్త=విడువఁబడిన, సుధావస్త్రముష్టి = సున్నపుగుడ్డముద్ద, అనన్, సుమహిత...గుళుచ్ఛము-సుమహిత=శ్రేష్ఠమైన, జ్యోత్స్నికా = వెన్నెలయనెడు, లతా=తీఁగయొక్క, సుమగుళుచ్ఛము = పుష్పగుచ్ఛము, అనఁగన్, అతిధూసరచ్ఛాయన్=మిగుల బూడిద రంగైనకాంతితో, చెలువున్=చక్కఁదనమును, పోనాడి,= పోఁగొట్టుకొని, బింబావశిష్టుఁడు = బింబమే మిగులుగాఁగలవాఁడు, అగుచున్, అంబుజాక్ష = శ్రీకృష్ణ! అల్లనల్లనన్=మెల్లమెల్లగ, వ్రాలెడున్=అస్తమించెడును.

భా॥ ఇందు చంద్రునియస్తమయసమయము వర్ణింపఁబడినది. అస్తాద్రియందలి కార్చిచ్చుచే దగ్ధమై మించు వేల్పుటావుపేడముద్దవలెనుండెను, చకోరములను దేనెటీఁగలు వెన్నెలయను తేనెం ద్రావి నిస్సారముగ నొనర్చిన తేనెపట్టుచందమునను, పశ్చిమదిక్కు

నకుఁ బ్రయాణమొనర్చు రాత్రి యనువృద్ధాంగనదైన పలితకేశబంధము పోల్కిని, జడలను సౌధమునకుఁ గాలమనుశిల్పి సున్నపునీటఁబూఁతఁబూసి పిండిపాఱవైచిన గుడ్డముద్దవలెను, వెన్నెలయనులతదైన సుమగుచ్ఛమువిధమునను జంద్రుఁడు చెలువేది బూడిదరంగుఁ గల్గి బింబావశిష్టుఁడయ్యెనని భావము.

విశే. కాలినపేడముద్ద ధూసరవర్ణమై యొప్పుటయుఁ, దేనెలేనితేనెపెర వెలవెలఁబాఱుటయుం, వృద్ధాంగనాకేశబంధము నెరయుటకతన బూడిదరంగును దాల్చుటయుం, సున్నమునముంచి పిండి పాఱవైచినగుడ్డ వెలవెలంబాఱి ముద్దగా నేర్పడుటయుం, సుమగుచ్ఛమచ్ఛమై యొప్పుటయు, నైజములగుటం జేసి, కవి వానిని జెలువేది దూసరచ్ఛాయం బోలుచు చంద్రునకు సాటిచేయుట యెంతయుఁదగియున్నది. మఱియుఁ గార్చిచ్చు కొండలందుండుటయుఁ, జకోరములు వెన్నెలంద్రావుటయుఁ, దూర్పున వెలుంగులు తోఁపఁ జీఁకటులు పశ్చిమదిశకరుగుటయుఁ, బ్రభాతమునఁ జదలు ధవళకాంతిని దేదీప్యమానమగుటయుం, వెన్నెలతీవవలె సోఁగగ నుండుటయు సహజములగుట, నిందలి రూపకములు హృద్యములై వెలయుచున్నవి. అలం. రూపకోత్ప్రేక్షలు.

చ. జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీఁకటిబందెకానికిం
గలఁగుచు వీనిలోన నిడి కైకొనె నమ్మికకాఁపు లంచుఁ జు
క్కలదొర యెండదాడి విని గ్రక్కునఁ దానును గాంతి వీనిలో
పల నెలకొల్పె నాఁ బలుకఁబాఱె నిశాంతనిశాంతదీపముల్. 60

టీ. జలరుహమిత్రుఁడు=సూర్యుఁడు, ఆత్మరుచిసంపదన్ = తనకాంతియనుధనమును, చీఁకటిబందెకానికిన్ = అంధకారమనుదొంగకు, కలఁగుచున్ = భయపడుచు, వీనిలోనన్ = ఈనిశాంతదీపములందు, ఇడి=ఉంచి, కైకొనన్=స్వీకరింపఁగా, చుక్కలదొర=చంద్రుఁడు, ఎండదాడిన్ = ఎండదండెత్తుటను, విని, నమ్మికకాఁపులు = నమ్మకమైనరక్షకులు, అంచున్, గ్రక్కునన్=శీఘ్రముగా, తానును, కాంతిన్=తనకాంతిని, వీనిలోపలన్=ఈనిశాంతదీపములలో, నెలకొల్పెన్=నిల్పెను, నాన్=అనునట్లు, నిశాంతనిశాంతదీపముల్ = వేఁకువజామునందైన గృహదీపములు, పలుకఁబాఱెన్ = వెల్లనయ్యెను.

భా. సూర్యుఁడు తానస్తమించునపుడు తనతేజము నగ్నియందుంచి యరుగునని శ్రుతులు పలుకును. మఱియు వేకువను దీపములు చెలువేది వెలవెలఁబాఱుట నైజము. ఈవిషయములనే కవి యీగతిం జమత్కరించి వర్ణించుచున్నాఁడు. సూర్యుఁడు చీఁకటి యనుతస్కరునకు భయపడి తనతేజస్సంపదను గృహదీపములకడఁ దాఁచుకొని మఱలఁ బ్రభాతమునఁ దీసికొనఁగాఁ, జంద్రుఁడును ఎండదాడికడలి, విశ్వసింపఁదగిన రక్షక

లగుటను సూర్యసంపదం దిరుగ వానికిఁ జెక్కుచెదరకుండున ట్లర్పించుటంబట్టి గ్రహించి తాను దన తేజస్సంపద నవ్వానిలోపలనె దాఁచుకొనెనో యనునట్లు వేఁగుఁబోక గృహదీపములు వెలవెలంబాఱెనని భావము. అలం. ఉత్ప్రేక్ష. కావ్యలింగము.

మ. దరమీలన్నయనంబులై గృహబహిర్ద్వారంబుల న్యామకుం
జరము ల్గండమదభ్రమద్భ్రమరికాఝుంకారసంగీతవి
స్ఫురణ ల్చూపుచుఁ గర్ణతాళనినదంబు ల్మించ నీమాగధో
త్కరముం బోలుచుఁ జూడ నొప్పె నివె హస్తన్యాసముల్మీఱఁగన్.

టీ. దరమీలన్నయనంబులై = ఇంచుకమూసినకన్నులుగలవై, గృహబహిర్ద్వారంబులన్ = ఇంటివెలుపటివాకిళులందు, యామకుంజరముల్ = జాములందుఁ గాఁపుండు నేనుఁగులు, గండ...స్ఫురణల్-గండ = చెక్కిళులందలి, మద = మదమునకై, భ్రమత్=తిరుగునట్టి, భ్రమరికా = ఆఁడుతుమ్మెదలయొక్క, ఝుంకార = ఝుంకారమనెడు, సంగీత=గానములయొక్క, విస్ఫురణల్ = ప్రకాశములను, చూపుచున్ = అగపఱచుచు, కర్ణతాళనినదంబుల్=చెవులచప్పుడులను తాళములశబ్దములు, మించన్= అతిశయింపఁగా, హస్తన్యాసముల్ = తుండములచాలనములు, మీఱఁగన్=మించఁగా, ఈమాగధోత్కరమున్ = ఈస్తుతిపాఠకసమూహమును, పోలుచున్ = అనుకరించుచు, చూడన్=చూచుటకు, ఒప్పెన్=అందమయ్యెను.

భా. వేఁగుఁబోకను స్తుతిపాఠకులు గీతములను బాడుచుఁ దాళధ్వనులు చెలఁగఁ జేతులన్యాసములు మించ మించుగతిని బ్రతియామమునను నింటివెలుపలఁ గాపుండు గజములు తమగండములందలి మదము నాస్వాదింప మూఁగిన భ్రమరులఝుంకార మను గానములు చెలఁగఁ, జెవులు కదల్చునపుడు కల్గినచప్పుడులను తాళధ్వనులు మించఁ, దుండములచాలనములను హస్తన్యాసము లతిశయింప నొప్పుచు, స్తుతిపాఠకులనే పోలి యమరెనని భావము. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

మ. సమయాభీరకుమారుఁ డేపునఁ దమిస్రారూపనక్తంచరిం
గమలారిస్తనమండలాంకవిషసంక్రాంతప్రభాదుగ్ధపూ
రముతో రూపఱఁజేయ శోషిలుచుఁ దారల్సోల నిట్టూర్పు సాం
ద్రముగా నూర్చెననంగఁ బెల్లెసఁగెఁ బ్రాతఃకాలవాతూలముల్. 62

టీ. సమయాభీరకుమారుఁడు = కాలమనుగొల్లపిల్లవాఁడు (శ్రీకృష్ణుఁడని భావము), ఏపునన్=విజృంభణముతో, తమిస్రారూపనక్తంచరిన్ = చీఁకటిరూపమైనరాక్షస

స్త్రీని, (పూతన నని భావము), కమలారి...పూరముతో-కమలారి = చంద్రుఁడనెడు, స్తనమండల = కుచమండలమందైన, అంక=కళంకమనెడు, విష=గరళముతో, సంక్రాంత =మిళితమైన, ప్రభా = కాంతియను, దుగ్ధపూరముతోన్ = క్షీరప్రవాహముతో, రూపఱన్=నశించునట్లు, చేయన్ = చేయఁగా, శోషిలుచున్ = మూర్ఛనందుచు, తారల్=కనుగ్రుడ్డులు; నక్షత్రములు, సోలన్=వివశమై వ్రాలఁగా, సాంద్రముగాన్ = దట్టముగా, ఊర్చెన్=నిట్టూర్పువిడిచెను, అనంగన్ = అనునట్లు, ప్రాతఃకాలవాతూలముల్=ప్రభాతవాతములు, పెల్లు=విస్తారముగా, ఎసఁగెన్=ఒప్పెను.

భా. గరళాంకితమగు స్తనముపోల్కి కళంకసహితమగుచంద్రుఁ డుంట చీఁకటి పూతనభాతి నొప్పెననియు, విషమిశ్రదుగ్ధపూరము చందమునఁ గళంకయుతచంద్రకాంతిపూరము పొల్చుట పూతనా స్తనమునుండి వెలువడు పాలవెల్లువవలె నమరెననియుఁ, గాలవశమునఁ జీఁకటులు తారకలును దొలఁగుట కృష్ణుఁ డాపూతనావిషమిశ్రదుగ్ధప్రవాహముం బీల్చి యారాక్షసీప్రాణములఁ గ్రోలి మూర్ఛనందింప నామె వివశయై కనుగ్రుడ్డుల వ్రాల్చుటవలెఁ బొల్చెననియుఁ, బ్రభాతవాతముల పెల్లెసంగుట మరణకాలమున విడిచిన పూతనాప్రాణవాయువులవలె మించెననియు భావము.

విశే. తారలను తారలనిశ్లిష్టరూపకము చేయవలెను. అలం. రూపకోత్ప్రేక్షలు.

క. మంచునఁ దోఁగినపల్లవ, సంచయము భవద్వియోగసంతాపరుద
చ్చంచలనయనాబాష్పక, ణాంచితబింబోష్ఠలీల నలరె నుపేంద్రా! 63

టీ. ఉపేంద్రా=(ఇంద్రునితమ్ముఁడవగు) కృష్ణా, మంచునన్ = హిమమున, తోఁగిన=మునింగిన, పల్లవసంచయము = చిగురులమొత్తము, భవత్...లీలన్-భవత్= నీసంబంధమైన, వియోగ=విరహముచేనైన, సంతాప=దుఃఖముచే, రుదత్=ఏడ్చుచున్న, చంచలనయనా=స్త్రీలయొక్క, బాష్పకణ = కన్నీటిచుక్కలతో, అంచిత = కూడుకొనిన, బింబోష్ఠ=దొండపండువంటి వాతెరలయొక్క, లీలన్=విలాసముతో, అలరెన్= మించెను.

విశే. యువతులవాతెరల చిగురులతోఁ బోల్చుట సహజము. హిమకణాంచితమైన చివురులను బాష్పకణాంచితమైన యువతులవాతెరలుగా నెంచు టెంతయుఁ దగియున్నది. మఱియు నేఁడు కృష్ణుఁడు సత్యాగృహముననే నిల్చియుంటఁ, బెఱవనితలకు విరహదుఃఖము సంభవించుటయు, దానఁ గన్నీరొలికిఁ బెదవులపైఁబడి మంచునీటఁ దోఁగాడు చివురుల ననుకరించుటయుఁ, సంభవించెనని గ్రహించునది. అలం. నిదర్శనము.

తే. కమ్మకస్తురిగుళికలు తమ్మిలేమ
నిదురమంపునఁ బుక్కిట నించి మేలు
కాంచి వేకువ నుమిసె నాఁ గమలముకుళ
కోటరంబుల నెలదేఁటికొదమ లెగసె. 64

టీ. తమ్మిలేమ=పద్మమనువనిత, కమ్మకస్తురిగుళికలు=పరిమళించుకస్తురిఘుటికలను, నిదురమంపునన్ = నిద్రయొక్కమైకముచే, పుక్కిటన్=పుక్కిలియందు, నించి=ఇడికొని, మేలుకాంచి=లేచి, వేకువన్ = వేఁగుఁబోకను, ఉమిసెన్=ఉమ్మివైచెను, నాన్= అనఁగ, కమలముకుళకోటరంబులన్ = తామరమొగ్గలనడుమనుండి, ఎలదేఁటికొదములు= లేఁబ్రాయంపుమగతుమ్మెదలు, ఎగసెన్ = వెలువడియె.

భా. తామరమొగ్గలనడుమ నెసఁగు లేఁబ్రాయంపుమగతుమ్మెదలు పద్మమను యువతి రేయి తాను బుగ్గనిడికొనినట్టియు, నిద్దురమైకమున నమలుటను మఱచుటం జేసి యెప్పటియాకృతితోడనే యొప్పునట్టియు, వేగుఁబోక లేచి యుమ్మివైచినట్టియు, కస్తురిగుళికలేమొ యన్నట్లొప్పెనని భావము. అపుడపుడే పద్మములు వికసించుచుండుటం జేసి యందు రాత్రి తగుల్కొనియున్నతుమ్మెదలు వెడలి పైకి వచ్చుచుండెనని తాత్పర్యము. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

మ. వినవయ్యెం గృకవాకుకూజితము లుద్వేలంబులై సూరసూ
తనవోద్యత్కరకుంచికావిఘటిత*ధ్వాంతారరక్రక్రియా
స్వనము లైకైరవిణీప్రసూనపృథుకస్వాపక్రియాలోలిక
ల్దినకృన్మార్గనివారణత్వరితమందేహోగ్రసింహధ్వనుల్. 65

టీ. సూర...స్వనములు-సూరసూత = సూర్యునిసారథియగు ననూరునియొక్క, నవ=క్రొత్తగా, ఉద్యత్=ఎగయుచున్న, కర=కిరణములను, కుంచికా=తాళపుఁజెవిచేత, విఘటిత=తెఱవఁబడిన (నశింపఁజేయఁబడిన), ధ్వాంత=చీఁకటియనెడు, అరర = తలుపు గడియసంబంధమైన, క్రక్రియాస్వనముల్ = కఱకఱవ్యాపారముగలచప్పుడులైనట్టియు, కైరవిణీ...లోలికల్ -కైరవిణీ = కలువతీఁగలయొక్క, ప్రసూన=పూవనెడు, పృథుక= శిశువుయొక్క, స్వాపక్రియా = నిద్రపుచ్చుటయందలి, లోలికల్ = నాలికను బెదరుపులమూలలకుఁ దాఁకించిచేయు 'లుచ్, లుచ్' అనుధ్వనులైనట్టియు, దినకృత్... ధ్వనుల్ -దినకృత్=సూర్యునియొక్క, మార్గ=త్రోవను, నివారణ=అడ్డగించుటయందు, త్వరిత=వేగముగల, మందేహ = మందేహులను పేరుగలరాక్షసులనెడు, ఉగ్రసింహ=

* ధ్వాంతారరక్రేంక్రియా.

భయంకరసింహములయొక్క, ధ్వనుల్=గర్జలైనట్టియు, కృకవాకుకూజితములు = కోడి కూఁతలు, ఉద్వేలంబులై=అధికములై, వినయ్యెన్=వినఁబడెను.

భా. వేగుఁబోకనైన కోడికూఁత లనూరుఁడు తనకిరణరూపమగుహస్తములం దైన, తాళపుఁజెవిచేఁ జీఁకటి యనుపేటికం దెఱవ నపుడు జనించిన యావెట్టెతలుపు సంబంధమగుకఱకఱశబ్దమో యనునట్లును, గలువనిసువుల నిద్రఁబుచ్చుఁ గైరవిణు లొనర్చు దవుడచప్పుడులో యనునట్లును, సూర్యునిమార్గ మడ్డగింప నేతెంచిన మందేహులను రాక్షససింహములగర్జలో యనునట్లును మించెనని భావము.

విశే. ప్రభాతమునఁ జీఁకటులు విఱిగి పాఱుటయుఁ, గలువలు ముకుళించుటయు, మందేహులనురాక్షసులు సూర్యు నడ్డగించి బాధించుటయు సంభవించును. వానినే కవి పైరీతిని జమత్కరించి వర్ణించెను. మందేహులనురాక్షసులు సూర్యు నడ్డగింతురనియుఁ, ద్విజదత్తార్ఘ్యములచే సూర్యుఁడు వారిని జయించుననియుం శ్రుతులు నుడువును. చూ. 2 ఆ. 54 ప.

తే. రాజు వీడెత్తి చనినఁ దారకభటాలి
యంబరాభోగనిజ*శిబిరాంగణమునఁ
గాలుకొల్పినపావకజ్వాల లనఁగఁ
బ్రాచిఁ గనుపట్టె నవసాంధ్యరాగరుచులు. 66

టీ. రాజు=చంద్రుఁడు, (రాజు) వీడెత్తి=శిబిరమెత్తికొని, చనినన్=పోఁగా, తారకభటాలి = నక్షత్రములను భటులమొత్తము, అంబర...అంగణమునన్=అంబర=ఆకాశముయొక్క, అభోగ = విస్తృతియనెడు, నిజశిబిర = తమవిడిదలప్రదేశముల యొక్క, అంగణమునన్ = తావునందు, కాలుకొల్పిన = ప్రజ్వలింపఁజేసిన, పావకజ్వాలలు=అగ్గిమంటలు, అనఁగన్ = అనురీతిని, ప్రాచిన్=తూర్పున, నవసాంధ్యరాగరుచులు = క్రొత్తలగుసంధ్యాకాలపు టెఱ్ఱనికాంతులు, కనుపట్టెన్=చూపట్టెను.

భా. తమరాజు శిబిర మెత్తికొనిపోఁగాఁ దారకభటాలి తమవిడిదలప్రదేశముల రగుల్కొల్పినయగ్నిమంటలో యనునట్లు ప్రాభాతికసంధ్యారాగములు చెలఁగెనని భావము. చంద్రుఁ డస్తంగతుఁడుగా నక్షత్రములును మాయమగుటయుఁ, బ్రభాత కాలారుణకాంతు లెసంగుటయు సైజములు. వానినే కవి యీరీతిని జమత్కరించి వర్ణించెను. అలం. ఉత్ప్రేక్ష.

---

* శిబిరాంచలమునఁ.

తే. కమలినీజృంభికలకు దిక్కాంత లెల్ల
హస్తతాళంబు లొనరించి రనఁగఁ జెలఁగె
లలిత కాసారకూలకులాయచలిత
శకునపక్షజపటపటస్వనము లధిప. 67

టీ. కమలినీజృంభికలకున్ = పద్మినీసంబంధమైన యావులింతలకు, దిక్కాంత లెల్లన్ = దిశాంగనలెల్లను, హస్తతాళంబులు = కరతాళములు (చిటికెలు), ఒనరించిరి = చేసిరి, అనఁగన్ = అనునట్లు, లలిత...స్వనములు - లలిత = సొగసైన, కాసార = సరస్సుల యొక్క, కూల = ఒడ్డులందైన, కులాయ = గూఁడులందు, చలిత = సంచరించునట్టి, శకున = పక్షులయొక్క, పక్షజ = ఱెక్కలనుండి పుట్టిన, పటపటస్వనములు = పటపటధ్వనులు, చెలఁగెన్ = ఒప్పెను.

భా. ప్రభాతమునఁ గమలినులు వికసింపఁదొరఁకొనుటయుఁ, బక్షులు ఱెక్కలం దులుపుకొనుచు లేచుటయు నైజములు. వానినే యీక్రిందిరీతిని గవి చమత్కరించెను. ఆవులింత కల్గునపుడు చిటికెలవేయుట యాచారము. ప్రకృతము కమలిని యావులించుడు దిశాంగనలు చిటికెలువేయుగతిని దీరస్థ శకుంతపక్షధ్వనులు చెలఁగె నని భావము. అలం. ఉత్ప్రేక్ష.

సీ. యామినీసమయంబు నాశాతటప్రదే
 శంబుఁ బ్రసన్నభావంబు నొందెఁ
బ్రియచుంబితాంగనాబింబాధరంబులు
 నుడురాజు నపరాగయుక్తిఁ దోఁచె
నఖిలవస్తువులుఁ బ్రాగచలకూటవిటంక
 తలములు నతిరోహితంబు లయ్యె
నుత్తుంగపురగోపురోపరిస్థలులు సా
 రసములు నాత్తసౌరభము లయ్యెఁ
తే. దరుణగోతర్ణకంబులు సురపథాంత
రంబులును విచ్యుతప్రగ్రహంబు లయ్యె
నియమపరతంత్రభూదేవచయముఁ గౌశి
కవ్రజంబు సమాధియోగమునఁ బరఁగె. 68

టీ. యామినీసమయంబున్ = నిశాసమయమును, ఆశాతటప్రదేశంబున్ = దిగంతప్రదేశములును, ప్రసన్నభావంబున్ - ప్ర + సన్న = అత్యంతము క్షీణమైన, భావ

మును=ధర్మమును, అనఁగా నత్యంతక్షీణభావమునని రాత్రిపరమగు నర్థము. ప్రసన్న భావంబుల్=నైర్మల్యమును, అనఁగాఁ బ్రకాశమునని దిక్తటప్రదేశపరమైన యర్థము. ప్రియచుంబితాంగనాబింబాధరంబులున్ = ప్రియులచే ముద్దుపెట్టుకొనఁబడిన యువతుల దొండపండువంటివాతెఱలును, ఉడురాజును=చంద్రుఁడును, అపరాగయుక్తిన్ - అపరాగ = పోయినరక్తిమయొక్క-కూడికతో అని యధరపరము. అపరాగ = పశ్చిమాద్రియొక్క, యుక్తిన్=కలయికతో, (అపర+అగ) అని చంద్రపరము. అఖిలవస్తువులున్ = సమస్తపదార్థములును, ప్రాగచలకూటవిటంకతలములు=పూర్వాద్రిశిఖరాగ్రప్రదేశములును, అతిరోహితంబులు - అ+తిరోహితంబులు = మఱుఁగుపడినవిగానివై, అయ్యెన్ అని వస్తుపరము. అతి+రోహితంబులు = మిగుల నెఱ్ఱనైనవి. అయ్యెన్ అని యద్రిశిఖరాగ్రపరము. ఉత్తుంగపురగోపురోపరిస్థలులున్ = ఎత్తైన పట్టణప్రాకారముయొక్క పైభాగములును, సారసములున్=పద్మములును, ఆత్తసౌరభములు = ఆత్త+సౌర+భములు, ఆత్త=పొందఁబడిన, సౌర=సూర్యసంబంధమైన, భములు=కాంతిగలవి, అని పురగోపురోపరిస్థలపరము. ఆత్త=పొందఁబడిన, సౌరభములు=పరిమళముగలవి అని పద్మపరము. తరళగోత్రకంబులున్ = చపలములగు నాలదూడలును, సురపథాంతరంబులున్=ఆకాశమధ్యములును, విచ్యుతప్రగ్రహంబులు-విచ్యుత=వదలుపఁబడిన, ప్రగ్రహంబులు=మెడకట్టుపలుపులుగలవి అని గోత్రకపరము, విచ్యుత=పోయిన, ప్రగ్రహములు=శుక్రుఁడు మున్నగు గొప్పగ్రహములుగలవి అని సురపథాంతరపరము. నియమపరతంత్రభూదేవచయమున్=నియమాసక్తులగు బ్రాహ్మణులసమూహమును, కౌశికవ్రజంబున్=గుడ్లగూబలగుమియు, సమాధియోగమునన్ = మనోలయరూపమగు యోగవిశేషముతో అని భూదేవపరము. సమాధి=నిశ్చలత్వముయొక్క, యోగమునన్ = సంబంధముతో, పరఁగెన్=ఒప్పెను. అని కౌశికవ్రజపరము.

భా. రాత్రి క్షీణించెననియు, దిగంతములు ప్రకాశవంతము లయ్యెననియు, యువతులవాతెఱలరక్తిమ వదలెననియుఁ, జంద్రుఁడు చరమాద్రిశిఖరముం జేరెననియు, సమస్తవస్తువులు సుగోచరములగుచుండెననియుఁ, నద్రిశిఖరము లరుణకాంతిని బరఁగెననియుఁ, బట్టణప్రాకారాగ్రములు సూర్యకాంతిఁగల్గి యొప్పెననియుఁ, బద్మములు వికసించి పరిమళము గలవయ్యెననియుఁ, నాలదూడలమెడకట్టులఁ దల్లిపాలం గుడువ వదలుపఁబడెననియుఁ, నాకాశమున గ్రహరాజములు మాయమయ్యెననియుఁ, బ్రాహ్మణులు సమాధియోగమునఁ బరఁగుచుండిరనియుఁ, గుడ్లగూబలు నిశ్చలముగ నిద్రఁజెందుచుండెననియుఁ భావము.

విశే. నియమ మనఁగా శౌచస్నానతపోదానాదిరూపమగు శాస్త్రవిహితకర్మానుష్ఠానము. అలం. శ్లేషానుప్రాణితతుల్యయోగిత.

మ. కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగంబులం గ్రమ్మినం
గుముదాంతఃస్థితలక్ష్మి యెండవడసోఁకు న్సైఁపఁగా లేక ప
త్రముల న్మాటుగఁ జేసి కప్పుకొనియెం దత్కాలసంకోచన
క్రమదంభంబున రాజవల్లభ లసూర్యంపశ్య లౌదు ర్గదా. 69

టీ. కమలాప్తోన్నమదంశుజాలములు-కమలాప్త=సూర్యునియొక్క, ఉన్నమత్=దీర్ఘముగవ్యాపించు, అంశు=కిరణములయొక్క, జాలములు=సమూహములు, దిగ్భాగంబులన్ = దిక్ప్రదేశములందు, క్రమ్మినన్ = వ్యాపింపఁగా, కుముదాంతఃస్థితలక్ష్మి=కలువనడుమనున్నలక్ష్మీదేవి, ఎండవడసోఁకుల్ = ఆతపతాపముయొక్క స్పర్శలను; అనఁగాఁ దీక్ష్ణాతపస్పర్శననుట. సైఁపఁగాన్=సహింపఁగా, లేక=సమర్థురాలుగాక, తత్కాలసంకోచనక్రమదంభంబునన్-తత్కాల = ఆసమయమునందైన, సంకోచనక్రమ=మూసికొనురీతియను, దంభంబునన్=మిషచే, పత్రములన్=రేకులను, మాటుగన్=అడ్డుగ, చేసి=చేసికొని, కప్పుకొనియెన్ = మఱుఁగుపఱచుకొనెను. రాజవల్లభలు = రాజభార్యలు, అసూర్యంపశ్యలు = సూర్యునిజూడనివారు; ఎండకన్నెఱుఁగనివారు. ఔదుర్గదా = అగుదురుకదా! అని రాణులపరము. రాజదారలు=చంద్రభార్యలు; అనఁగాఁ గుముదినులనుట. అసూర్యంపశ్యలు = సూర్యునిజూడ నోడువారగుదురుగదా! అని కుముదినీపరము.

భా. ఎండసోఁకునఁ గుముదములు ముకుళించుట సైజము. దానినే కవి యీ క్రిందిరీతిని జమత్కరించెను. సూర్యాతపతీక్ష్ణస్పర్శమున కోర్వలేక కుముదిని ముకుళించుట యనువ్యాజమున రేకులం దనకు మాటుగఁ జేసికొని తనరూపమును మఱుఁగుపఱచుకొనెనని భావము. రాజదారలు సూర్యుంజూడ నోడుదురుగాన, రాజభార్యయగుకుముదినియుఁ దా సూర్యుంజూడ నిచ్చగింపక తనరూపును మఱుఁగుపఱచుకొనెననియుఁ దాత్పర్యము. అలం. శ్లేషోత్థాపితార్థాంతరన్యాసము. అపహ్నుతి.

చ. కొలకొలమంచు మేఁతలకు గూఁడులు వెల్వడుపక్షిరావము
లక్కలమృదువాక్యవైఖరులుగా నలవేకువపూవుఁబోఁడి వే
డ్కలు దళుకొత్త దోహదమిడం దొలిగుబ్బలికొండగోఁగు పూ
గొల యలరించె నాఁ బొడిచెఁ గోకనదాప్తుఁడు పాటలద్యుతిన్. 70

టీ. కొలకొలమంచున్=కొలకొలమని; ఇది ధ్వన్యనుకరణము. మేఁతలకున్ = ఆహారములకు, గూఁడులన్=గూఁడులనుండి, వెల్వడు=బయటికివచ్చు, పక్షిరావముల్=

పక్షులధ్వనులు, అలవేకువపూఁబోఁడి = ఆవేకువయనుయువతి, కలమృదువాక్యవైఖరులు=మధురములైన మృదులములైన మాటలయొక్క రీతులు, కాన్=సంభవించునట్లుగా, వేడ్కలు=ఉత్సాహములు, తళుకొత్తన్=ప్రకాశించునట్లు, దోహదము = పుష్పించుటకై చేయువ్యాపారము, ఇడన్ = చేయఁగా, తొలిగుబ్బలికొండగోఁగు = తూర్పుమలయనెడికర్ణికారము, పూగొల=పుష్పగుచ్ఛమును, అలరించెన్ = ప్రకాశింపఁజేసెను, నాన్=అనునట్లు, కోకనదాప్తుఁడు = పద్మాప్తుఁడగుసూర్యుఁడు, పాటలద్యుతిన్=ఎఱ్ఱనికాంతితో, పొడిచెన్=ఉదయించెను.

భా. వేకువయనువనిత పక్షులారావము లనుపల్కుల కలధ్వనులు చెలంగ దోహదమొనర్ప తూర్పుమలయను కర్ణికారము పుష్పించెనోయన నరుణకాంతులతోడ నరుణకిరణుఁ డుదయించెనని భావము.

వ్యా-విశే. 'సల్లాపతః కర్ణికారః' అనునుక్తిననుసరించి కర్ణికారము వనితలసల్లాపరూపమగు దోహదముచేఁ బుష్పించునని గ్రహింపవలెను. 'కొలకొల+అంచు' ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల ముగాగమంబగు. 'కొలకొలమంచున్' ఇట్లే సలసలమను మొదలగునవి. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

## శ్రీకృష్ణుని ప్రయాణసన్నాహము.

వ. అని యివ్విధంబునం బలుకుమాగధులమధురవాక్యంబు లాకర్ణించుచు మేలుకాంచి యప్పంచశరగురుం డహర్ముఖోచితకృత్యంబులు నిర్వర్తించి పురోహితవృద్ధామాత్యసహితంబుగా నాస్థానమంటపంబున కరిగి యుగ్రసేనవసుదేవబలభద్రాదిగురుజనంబులకు నమస్కరించి సాత్యకిసారణప్రభృతిసోదరుల నాదరించి ప్రద్యుమ్నసాంబానిరుద్ధాదికుమారవర్గంబు మ్రొక్కులు గైకొని యదువృష్ణికురుభోజాంధకప్రముఖు లగుబంధుసందోహంబుల సంభావించి సింహాసనాసీనుండై తగువారి నుచితాసనంబుల నుండ నియమించి పేరోలగంబుండి కార్యత్వరాసముత్సాహదోహలితాంతరంగుం డై పతంగపుంగవుం దలంచుటయును. 71

టీ. అని, ఇవ్విధంబునన్=ఈరీతిగ, పలుకు = పల్కుచున్న, మాగధులమధురవాక్యంబులు = స్తుతిపాఠకులయొక్క తియ్యనిమాటలను, ఆకర్ణించుచున్ = వినుచు, అప్పంచశరగురుండు-ఆ+పంచశరగురుండు = ఆమన్మథునకుఁ దండ్రియైనశ్రీకృష్ణుఁడు, అహర్ముఖోచితకృత్యంబులు = ప్రాతఃకాలమునకుఁ దగినకార్యములను, నిర్వర్తించి =

చేసి, పురోహితవృద్ధామాత్యసహితంబుగాన్ = పురోహితులతోడను వృద్ధబ్రాహ్మణుల తోడను గూడునట్లుగా, ఆస్థానమంటపమునకున్=సభాస్థానమునకు, అరిగి=చని, ఉగ్రసేనవసుదేవబలభద్రాదిగురుజనంబులకున్ = ఉగ్రసేనుఁడు వసుదేవుఁడు బలభద్రుఁడు మొదలగు పెద్దలకు, నమస్కరించి, సాత్యకిసారణప్రభృతిసోదరులన్ = సాత్యకి, సారణుఁడు మొదలగుతమ్ములను, ఆదరించి=గౌరవించి, ప్రద్యుమ్నసాంబానిరుద్ధాదికుమారవర్గంబుమ్రొక్కులు = ప్రద్యుమ్నుఁడు, సాంబుఁడు, అనిరుద్ధుఁడు మొదలగుకుమారుల సమూహముయొక్క నమస్కారములను, కైకొని = స్వీకరించి, యదువృష్ణిభోజాంధకప్రముఖులగు = యదువులు, వృష్ణులు, భోజులు, అంధకులు మొదలైన (ఇవి యాదవకులభేదములు), బంధుసందోహంబులన్ = చుట్టాలసమూహమును, సంభావించి = మన్నించి, సింహాసనాసీనుండై = సింహాసనమునఁ గూర్చున్నవాఁడై, తగువారిన్=అర్హులను, ఉచితాసనంబులన్ = (వారివారికి) తగినయాసనములను, ఉండన్ = ఉండఁగా, నియమించి=ఆజ్ఞాపించి, పేరోలగంబుండి = పెద్దసభయందుండి, కార్య...అంతరంగుండై-కార్య=(పారిజాతమును నాకమునుండి తెచ్చుటయను) కార్యమందలి, త్వరా = వేగముచేనైన, సముత్సాహ=అధికోత్సాహముచే, దోహలిత=మిగులఁ జలితమగు, అంతరంగుండై=మనస్సుగలవాఁడై, పతంగపుంగవున్ = గరుత్మంతుని, తలంచుటయున్ = తలంపఁగా.

వ్యా-విశే. భావార్థకటవర్ణకము యుంవర్ణపరకంబై యానంతర్యార్థకమగును. 'తలంచుటయును.' పేరు+ఓలగము=పేరోలగము.

సీ. వజ్రంబునకు నీఁక వైచినబలశాలి
గజకచ్ఛపాశనఘాతుకుండు
జననిదాస్యంబు నీఁగినకులశ్రేష్ఠుండు
దుర్లభామృతపశ్యతోహరుండు
కమలాప్తుసారథిగారాబుఁదమ్ముండు
గశ్యపకృతపుణ్యకర్మఫలము
సకలశకుంతౌఘసామ్రాజ్యధౌరేయుఁ
డహిమృగయావ్యసనాకులుండు
తే. సింహపాళెంబు లేర్చుముకంటితూపు
గలిగి నిపాతితరోహిణస్కంధుఁ డనిల

మానసాతీతవేగసంపద్ఘనుండు
తార్క్ష్యుఁ డేతెంచె దానవధ్వంసికడకు. 72

టీ. వజ్రంబునకుఁ=వజ్రాయుధమునకు, ఈఁక = వెండ్రుకను, వైచిన=వేసిన, బలశాలి=బలిష్ఠుఁడు, గజకచ్ఛపాశనఘాతుకుండు-గజకచ్ఛప = గజకచ్ఛపులను వారు, అశన=ఆహారముగాఁగల, ఘాతుకుఁడు = హింసయొనర్చువాఁడు; అనఁగా వజ్రాయుధముం దృణీకరించినవాఁడనియు, శాపవశమున గజకచ్ఛపరూపములందాల్చిన విప్రుల నమయించినవాఁడనియుం భావము. అమృతముం దెచ్చునపుడు వజ్రాయుధమున కీతఁడు లోఁబడకుండుటం జేసి వజ్రాయుధమున కీఁక యిడినవాఁడని యెన్నవలెను. 'విభావసుఁడు, సుప్రతీకుఁడు' అను నిర్వురు విప్రసోదరులు శాపవశమున గజకచ్ఛపరూపములందాల్చిరనియును, వారి నీతఁ డాహారముగఁ గొనెననియు నాంధ్రభారతాదిపర్వమున ద్వితీయాశ్వాసమునఁ గలకథ నిచట ననుసంధింపవలయును. జననిదాస్యంబుఁ = తల్లిబానిసతనమును, ఈఁగిన=పోఁగొట్టిన, కులశ్రేష్ఠుండు = వంశశ్రేష్ఠుఁడు, దుర్లభామృతపశ్యతోహరుండు = పొందరానియమృతమును జూచుచుండఁగనే దొంగలించినవాఁడు; అనూరుని శాపముచేఁ దనతల్లియగువినత సవతియైనకద్రువ కూడిగముచేయుచుండఁగా,స్వర్గమునకేగి యమృతముంగొనివచ్చి మాతృదాస్యముం బాపె ననుకథ నిచ్చో ననుసరింపవలెను.ఎల్లరుం జూచుచుండఁగనే యమృతము నపహరించుటం జేసి పశ్యతోహరుఁ డయ్యెను. కమలాప్తసారథిగారాబుఁదమ్ముండు = సూర్యుని తేరుగడుపువాఁడగు ననూరుని ప్రియానుజుఁడు, కశ్యపకృతపుణ్యాకర్మఫలము = కశ్యపమహామునియొక్క పుణ్యంపుఁబనులఫలము. సూర్యప్రియానుజన్ముండును కశ్యపమౌని పుణ్యాకర్మలఫలమునని భావము. పెక్కు పుణ్యకర్మల నాచరింపఁ దత్ఫలమై యీతఁ డుదయించెనని తాత్పర్యము. సకల... ధౌరేయుండు - సకల=సమస్తమైన, శకుంత + ఓఘ = పక్షిసమూహముయొక్క, సామ్రాజ్య = అధిపత్యముయొక్క, ధౌరేయుండు = భారమును వహించినవాఁడు, అహి...కులుండు - అహిమృగయా = పాముఁవేటయను, వ్యసన=దుష్టకృత్యమందు, ఆకులుఁడు=లోలుఁడు; పక్షిరాజనియుఁ బాములంజంపుటయం దాసక్తుఁడనియు భావము. మింటిపాళెంబులు = ఆకాశముననైనపల్లెలను (త్రిపురములను), ఏర్చు=దహించెడు, ముక్కంటితూపు = శంకరునిబాణమైన విష్ణునియొక్క, గతి = తెక్కు; ఈశ్వరుఁడు త్రిపురముల నాశమొనర్చుతఱిని నారాయణుని బాణముగఁ జేసికొనెననియు, నపుడు గరుడుఁ డాబాణమునకు తెక్కుయయ్యెననియుఁ బురాణములు తెల్పును. నిపాతితరోహిణస్కంధుఁడు = పడఁద్రోయంబడిన రోహిణవృక్షముయొక్క స్కంధముగలవాఁడు. గజకచ్ఛపముల రోహిణవృక్షముశాఖపై నిల్చి తినునపు డారోహిణవృక్షశాఖలు గరుడునిభారమును

స్ఫురదనోపక రూఢిననుభారతగాథ నిచ్చో ననుసంధింపవలయును. మానసాతీతవేగసంప ద్ఘనుండు-మానస=మనస్సును, అతీత = అతిక్రమించు, వేగసంపత్ = వేగసంపదగల, ఘనుండు=గొప్పవాఁడు; మనోవేగమునుమించు గమనవేగముగలవాఁడని తాత్పర్యము. తార్క్ష్యుఁడు=గరుడుఁడు, దానవధ్వంసికడకున్ =(రాక్షసనాశకరుఁడగు శ్రీకృష్ణునిదరికి, ఏతెంచెన్=వచ్చెను.

వ్యా-విశే. గరుడుఁ డొనర్చినకృత్యముల కనురూపముగుగతి నిందుఁ దద్విశేష ణములంతటను నిల్పఁబడినవి. వజ్రాయుధమును దృణీకరించినయోధుఁడుగాన నాతని బలశాలియని పేర్కొనెను. ఇట్టే యంతటను సారస్యముం గ్రహించునది. పక్షతో హరతీతి పక్షతోహరః-కృద్వృత్తి.

క. మిన్నుననుండి భరంబునఁ, బన్నగపతితలలు చదియఁబడ ధారుణిమీఁ
ద న్నిలిచి వైనతేయుఁడు,వెన్నునిపదములకు వినయవినతియొనర్పన్.

టీ. మిన్నుననుండి = ఆకాశముననుండి, భరంబునన్ = భారముచే, పన్నగపతి తలలు=శేషునితలలు, చదియఁబడన్ = అదుమఁబడునట్లుగా, ధారుణిమీఁదన్ = భువి పైని, నిలిచి, వైనతేయుఁడు = వినతాపత్యముగరుడుఁడు, వెన్నునిపదములకున్=శ్రీ కృష్ణునిపాదములకు, వినయవినతి = అడఁకువతోఁగూడిన నమస్కారము, ఒనర్పన్ = చేయఁగా.

భా. పదవిన్యాసభరముకతన శేషునితల లదుమంబడునట్లుగ గరుడుఁడు భువిపై నిల్చి సవినయముగఁ గృష్ణునకు నమస్కారమొనర్చెనని భావము.

విశే. వెన్నుఁడు. ప్ర. విష్ణుః. అలం. అతిశయోక్తి.

చ. మునిపతిరాకయుం గుసుమముం దన కిచ్చినలాగు రుక్మిణీ
వనితకుఁ దా నొసంగుటయు వంచనఁ బొంచినబోటి సత్యకుఁ
మనమెరియంగఁ జెప్పుటయు మానినికోపము వేఁడికొంటయుం
దనదుప్రతిజ్ఞయుం దెలిపెఁ దార్క్ష్యున కెంతయు నాదరంబునన్. 74

టీ. మునిపతిరాకయున్ = నారదమునివచ్చుటయును, కుసుమమున్ = పారి జాతపుష్పమును, తనకున్, ఇచ్చినలాగున్ =ఇచ్చినవిధమును, రుక్మిణీవనితకున్, తాను, ఒసంగుటయున్ = ఇచ్చుటయును, వంచనన్ =కపటముతో, పొంచిన = దాఁగియున్న, బోటి= చెలి, సత్యకున్, మనము, ఎరియంగన్ =మండునట్లుగ, చెప్పుటయున్, మానిని కోపమును = సత్యభామయొక్కయాగ్రహమును, వేఁడికొంటయున్ (తాను) ప్రార్థిం చుటయును, తనదుప్రతిజ్ఞయున్ = తానొనర్చినశపథమును (పారిజాతముం గొనివత్తు

నని చేసినశపథమనుట), ఎంతయున్=మిక్కిలి, ఆదరమునన్=ప్రేమతో, తార్క్ష్యునకున్ =గరుడునకు, తెలిపెన్=తెలియఁజేసెను. (శ్రీకృష్ణుఁడనుట).

ఉ. సంతసమంది జాదులు ప్రసాదము నయ్యె నటంచుఁ బొంగి నా
గాంతకుఁ డంబుజోదర! బలాసురవైరి మదీయపక్షముం
బంతముగొన్నవాఁ డశనిపాతమున న్విను నాఁటనుండియు
న్వంత మనంబులోఁ జనదు నాపగ నీఁగెద నేఁడు నీకృపన్. 75

టీ. నాగాంతకుఁడు = సర్పనాశకుఁడగుగరుడుఁడు, సంతసము = సంతోషము, అంది=పొంది, జాదులు ప్రసాదమున్ = జాజిపూవులు భగవత్ప్రసాదమును; ప్రసాదమననిచో దైవార్చనంజేసి తలనుధరింపనొసంగెడు సుమమనియర్థము. అయ్యెన్ =దొఱకెను, అటంచున్=అట్లనుకొనుచు, పొంగి=ఉబ్బి, అంబుజోదర=కృష్ణ! బలాసుర వైరి=దేవేంద్రుఁడు, అశనిపాతమునన్ = వజ్రాయుధపువ్రేఁతచే, మదీయపక్షమున్ = నావైపున (నాఱెక్కను), పంతమున్ = చలమును (పంతముతో), కొన్నవాఁడు = స్వీకరించినవాఁడు, విను=వినుము, నాఁటనుండియున్ = నాఁడుమొదలుకొని, వంత = దుఃఖము, మనములోన్ = మనస్సులో, చనదు=పోదు, నేఁడు, నాపగన్ = నాశత్రుత్వమును, నీకృపన్=నీదయచే, ఈఁగెదన్ = నశింపఁజేసికొందును; తీర్చికొందుననుట.

భా. కృష్ణుఁ డట్లన జాజిపూవులును మఱియు నవి దేవపూజాకుసుమములును' నై దొఱికినట్లుగ గరుడుఁడు సంతసించి, దేవ! వజ్రపాతమున నాపక్షమును బంతమూని కొన్నవాఁడౌట నింద్రునిపై నాకుఁగలకోపము నేఁటికిని నామదిని మెఱుగుచునేయుండును. నేఁడు నీదయంజేసి యాకోపముం దీర్చికొందునని పల్కెనని భావము.

విశే. 'దెప్పి తన్నినట్లును, దేవుని మొక్కినట్లును నగు' నను మున్నగుసామెతల వలె 'జాదులు ప్రసాద' మనునదియు నొకసామెతయే. శ్రీకృష్ణకార్యము సాధింప నేగుటయుఁ దన పగతీర్చికొనుటయు సంభవించుంగాన గరుడుఁడు, జాదులు ప్రసాదము సంభవించినట్లనుకొనెనని యెన్నవలయును. ప్రభువగు శ్రీకృష్ణుని కార్యసాధనము జాదులుగను, దా నింద్రునిపైఁగల పగతీర్చికొనుట ప్రసాదముగను గరుడుఁ డూహించెనని గ్రహించునది.

వ్యా-విశే. అంబుజ+ఉదరుఁడు = పద్మ ముదరమునఁగలవాఁడు. బలాసురవైరి- బల+అసుర+వైరి = బలుఁడనురాక్షసునకు శత్రువు.

చ. అనుటయు నంతవాఁడవె కదా యని మిక్కిలి గారవించి య
వ్వనరుహలోచనుండు దగువారి సుహృజ్జనబంధుకోటి రాఁ

బనిచి నిజప్రయాణమును బట్టణరక్షయుఁ జెప్పి వారిచే
ననుమతిగాంచి యెక్కె విహగాధిపుఁ దానును సత్యభామయున్.76

టీ. అనుటయున్ = అనఁగానే, అవ్వనరుహాలోచనుండు = ఆశ్రీకృష్ణుఁడు, అంత ...డవికదా = అంతటివాఁడవేకదా, అని, మిక్కిలి, గారవించి, తగువారిన్ = అర్హు..., సుహృజ్జనబంధుకోటిన్ = మిత్రులను బంధుసమూహమును, రాన్ = వచ్చుటకు, ...= ఆనయిడి; అనఁగా రావించియనుట, నిజప్రయాణమును = తనపయనమును, ...రక్షయున్ = పట్టణరక్షణమును, చెప్పి, వారిచే, అనుమతిన్ = అంగీకారమును, ...= పొంది, తానును, సత్యభామయున్, విహగాధిపున్ = గరుడుని, ఎక్కెన్ = ...రోహించెను.

వ్యా-వి శే. వనరుహాలోచనుఁడు = పద్మాక్షుఁడు. తాను శబ్దము ప్రయుక్తమగుటం ... నదనుకూలముగనే క్రియ యేకవచనమునఁ బ్రయుక్తమయ్యెను.

ఉ. ఆవిహగావతంసము నిజాంసముపైఁ బ్రియభామతోడ నిం
ద్రావరజుండు నిల్చుటయు నాతతపక్షమహానిలంబు లం
భోవహపంక్తిఁ దూలములపోలికఁ దూల్పఁగఁ దద్దిశాముఖుం
డై వినువీథికి న్నెగసె నద్భుతకారిమనోజవంబునన్. 77

టీ. ఆవిహగావతంసము = ఆపక్షిశ్రేష్ఠుఁడగుగరుఁడుఁడు, నిజాంసముపైన్ = ...భుజముమీఁద; అనఁగా మూఁపువైననుట. ఇంద్రావరజుండు = ఉపేంద్రుఁడు, ప్రియ ...తోడన్ = ప్రియాంగనతో, నిల్చుటయున్ = నిల్వఁగా, ఆతతపక్షమహానిలం ... = విస్తృతములైన ఱెక్కలవలనిగొప్పగాలులు, అంభోవహపంక్తిన్ = మేఘ ...ని, తూలములపోలికన్ = దూదులవలె, తూల్పఁగన్ = ఎగురఁగొట్టఁగ, తద్దిశా ...ముఖుండై = ఆయింద్రునిదిక్కున కభిముఖుండై, అద్భుతకారిమనోజవంబునన్ = ఆశ్చ...ర్యము గలుగఁజేయు మనోవేగముతో, వినువీథికిన్ = ఆకాశమార్గమునకు, నెగసెన్ = ...

క. ఇరుగ్రేవల నందక శా
ర్ఙ్గరథాంగగదాయుధములు రాఁ దోడఁగ ఖగే
శ్వరపక్షజనితవాతాం
కురపూర్తిని శంఖ మపుడు ఘుమఘుమ మ్రోసెన్. 78

టీ. ఇరుగ్రేవలన్ = రెండుప్రక్కలను, నందకశార్ఙ్గరథాంగగదాయుధములు = ... ఆయుధచతుష్టయము, రాఁదోడఁగెన్ = వచ్చుచుండెను. ఖగేశ్వర...

పూర్తిని-ఖగేశ్వర=గరుడునియొక్క, పక్ష=తెక్కలవలన, జనిత=పుట్టిన, వాతాంకుర= పిల్లగాలియొక్క, పూర్తిక్ =నిండుటచే, శంఖము = నందకము, అపుడు, ఘుమఘుమ= మ్రోసెక్ =శబ్దించెను.

విశే. నందకము = శ్రీవిష్ణునిశంఖము, శార్ఙ్గము=ఆతనిధనువు, రథాంగము= చక్రము, గదా=ఆతనిగద.

తే. అంబుధరజాలముక్తంబు లయినజలక
ణములు సాత్రాజితీకైశికమునఁ బొలిచె
గగనతలలక్ష్మి పోరచిగాఁగ నిడినఁ
జాల నొప్పారు మౌక్తిక స్తబక మనఁగ. 79

టీ. అంబుధరజాలముక్తంబులైన జలకణములు = మేఘసమూహమునుండిజారిన యుదకబిందువులు, సాత్రాజితీకైశికమునక్ =సత్యభామయొక్క కేశబంధముపై, గగన తలలక్ష్మి = ఆకాశలక్ష్మి, పోరచిగాఁగక్ =కానుకగా, ఇడినక్ =ఉంపఁగా; ఈయఁగా, చాలక్ =మిగుల, ఒప్పారు=సొగసగుమౌక్తిక స్తబకము=ముత్తియములగుత్తి, అనఁగక్ = అనునట్లు, పొలిచెక్ =ఒప్పెను. అలం. ఉత్ప్రేక్ష.

భా. ఆకాశమార్గమున నరుగునపుడు మేఘములందుండి సత్యాకేశబంధము పైఁబడిన నీటిబొట్టులు గగనలక్ష్మి కానుకగానిడిన ముత్తెములగుత్తి యనం దనరెనని భావము.

క. తళతళని మెఱుఁగుఁదీఁగలు
గలుగుఘనాఘనచయంబు గనుఁగొనఁగా నిం
పొలయించెఁ బసిఁడికామల
నలరెడునీలములగొడుగు లనఁగా హరికిన్. 80

టీ. తళతళని = తళతళమనిప్రకాశించు, మెఱుఁగుఁదీఁగలు = తీఁగలంబోలు సన్నని మెఱుంగులు, కలుగు=కల, ఘనాఘనచయంబుల్ =వార్షికమేఘబృందములు, కనుఁ గొనఁగాక్ = చూచుటకు, పసిఁడికామలక్ =బంగరుకాడలతో; కఱ్ఱలనుట. అలరెడు= ఒప్పెడు, నీలములగొడుగులు = ఇంద్రనీలచ్ఛత్రములు, హరికిక్, అనఁగాక్, ఇంపొల యించెక్ =సొంపుం జేకూర్చెను. మేఘము లింద్రనీలచ్ఛత్రములవలెను మెఱుఁగుం దీఁగలు గొడుగు బంగరుకఱ్ఱలవలెను నొప్పెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

క. కమలదళాక్షుని దేహా
ద్యమదలిసాంద్రచ్ఛవిప్రవాహము పొలిచెం

దమతంద్రి భానుఁ గనుఁగొన
యమునానది గగనవీథి కరిగెడు ననఁగన్. 81

టీ. కమల...ప్రవాహము, కమలదళాక్షుని = శ్రీకృష్ణునియొక్క, దేహ = శరీరమునుండి, ఉద్వమత్ = వెడలివచ్చునట్టి, అతిసాంద్ర = కడుదట్టమైన, ఛవి = కాంతియొక్క, ప్రవాహము = వెల్లువ, తమతంద్రికిన్ = తమజనకుఁడైన, భానున్ = సూర్యుని, కనుఁగొనన్ = చూచుటకై, యమునానది, గగనవీథికి = ఆకాశమార్గమునకు, అరిగెడున్ = పోయెడు, అనఁగన్, పొలిచెన్ = ఒప్పెను.

విశే. శ్రీకృష్ణుని నీలశరీరమునుండి వెడలు నీలంపుఁగాంతిపూరములు నల్లని యమునాప్రవాహమువలె మించుటంజేసి యమునానదిగఁ గవి తలంచెను. సూర్య తనయ యమున యగుట ప్రసిద్ధము. కాన దండ్రిగారిం గాంచ యమున వినువీథి కరుగు చున్నట్లు కవియెంచుట యెంతయుఁ దగియున్నది. అలం. ఉత్ప్రేక్ష.

చ. ఖగకులనాథుపక్షములగాడ్పు సహింపఁగ లేక రజ్జుప
న్నగములు దేరిక్రిందికిఁ జన న్సరసీరుహమిత్రురథ్యముల్
నొగలఁ దొలంగి నిల్వ నరుణుండు రయంబునఁ జక్కఁ గట్టుచున్
గగనపథంబునం దటిమెఁ గాలవిలంబన మందకుండఁగన్. 82

టీ. ఖగకులనాథుపక్షములగాడ్పున్ = గరుడునిరెక్కలయొక్కగాలిని, సహింపఁగన్ = సైఁచుటకు, లేక = చాలక, రజ్జుపన్నగములు = త్రాళ్లైన పాములు, తేరిక్రిందికిన్ = రథముక్రిందికి, చనన్ = పోఁగా, సరసీరుహమిత్రురథ్యముల్ = సూర్యరథాశ్వములు, నొగలన్ = కూబరముల; కాఁడిమానికాధారమై బండి మొదలగువాని మొదటనుండెడు నిడుపాటిమ్రాను నొగయని శబ్దరత్నాకరము. తొలంగి = తొలఁగి, నిల్వన్ = నిల్చి పోఁగా, అరుణుండు = అనూరుఁడు, (సూర్యసారథి), చక్కన్ = చక్కఁగా, కట్టుచున్, కాలవిలంబనము = కాలముయొక్కజాగు, అందకుండఁగన్ = పొందకుండఁగ, గగన పథంబునన్ = ఆకాశమార్గమున, తటిమెన్ = త్రోలెను.

క. నతిసేసె వైనతేయుండు, గతిభేదములోన నన్నుఁగనుఁగొని యతఁడున్
*గతిలోననదీవించినఁ, జతురతకు న్మెచ్చిరపుడు సత్యయుహరియున్. 83

టీ. వైనతేయుండు = గరుడుఁడు, గతిభేదములోనన్ = గమనభేదములోనె, అన్నన్ = అనూరుని, కనుఁగొని = కాంచి, నతి = నమస్కారము, చేసెను. అనఁగా గరు డుఁడు తన గమనభేదమునందే యన్నకుఁ జేయునమస్కారమును సూచించెనని భావము.

---

* మతిలోనన.

తన వివిధములగుగతులలో నమస్కారసూచకన మ్రగతి నపు డాతఁ డవలంబించెనని తాత్పర్యము. అతఁడుఁ=అనూరుఁడును, గతిలోనన=గమనములోనె, దీవించినఁ = ఆశీర్వదింపఁగా; అనూరుఁడును గరుడుని యట్లే రథగమనభేదమూలమున నాశీర్వదించెనని భావము. అనఁగా నాశీర్వాదసూచకగతిభేదము నపు డాతఁ డగపఱచెనని తాత్పర్యము. చతురతఁ = అన్నదమ్ములచాతుర్యమునకు, అపుడు, సత్యయుఁ, హరియుఁ మెచ్చిరి.

క. మురమర్దనుఁ డివ్విధమున, గరుడునిపై గగనపథముగడచి యరుగుచుం
దరళాయతాక్షి కిట్లను, సరసస్మితవచనరచనచాతురి మెఱయన్. 84

టీ. మురమర్దనుఁడు = మురాసురునిమర్దించిన శ్రీకృష్ణుఁడు, ఇవ్విధమునఁ = ఈరీతిగ, గరుడునిపై, గగనపథముఁ=ఆకాశమార్గమును, కడచి=దాఁటి, యరుచుఁ= పోవుచు, సరసస్మితవచనరచనచాతురి = మనోహరములగు చిఱునగవుతోడిమాటల యొక్క నేర్పు, మెఱయఁ=ప్రకాశించునట్లు, తరళాయతాక్షికిఁ = చంచలములగు దీర్ఘములైన కన్నులుగలదానికి; సత్యకనుట; ఇట్లు, అనుఁ=అనెను.

కృష్ణుఁడు సత్యభామకు మేరువును వర్ణించి చెప్పుట.

చ. కువలయపత్త్రనేత్ర! కనుఁగొంటివె కన్నులపండువయ్యె రెం
డవవినతాతనూభవునియందమునం గమనీయకాంచన
చ్ఛవికవచీకృతంబు కులిశక్షతపక్షము నైనరత్నసా
నువు నిజయామికీకృతివినోదపరాయణచంద్రభానువుల్. 85

టీ. కువలయపత్త్రనేత్ర = నల్లకలువరేకులంబోలు కన్నులుగలదాన! సత్యభామ యనుట. రెండవవినతాతనూభవునియందమునఁ=రెండవగరుడుని చక్కఁదనముతోడ, కమనీయ...కృతంబుఁ-కమనీయ=సొగసైన, కాంచనచ్ఛవి=బంగరుకాంతిచే, కవచీకృతంబుఁ=వర్మముకలదిగాఁ జేయఁబడినదియు; కప్పఁబడినదనుట. కులిశక్షతపక్షముఁ= వజ్రాయుధముచే నఱుకఁబడిన ఱెక్కలుగలదియును,నిజ...భానువుల్-నిజ=తమసంబంధమైన, యామికీకృతి = జాములవంతునఁ గాచునట్టివాని వ్యాపారముయొక్క (అనఁగాఁ దలారికృత్యమనుట.) వినోద=వేడుకయందు, పరాయణ=ఆసక్తమగు, చంద్రభానువుల్= చంద్రసూర్యులుగలదియును, ఐన, రత్నసానువుల్ = మేరుపర్వతమును, కనుఁగొంటివె= చూచితివే, కన్నులపండువు=నేత్రోత్సవము, అయ్యెన్=సంభవించెను.

భా. ఓ సత్యభామ! బంగరునాకృతిని రెండవగరుడునింబోలుదాని, కాంచన కాంతిగ్రనావృతమైనదాని, వజ్రాయుధముచేఁ గృత్తమైన ఱెక్కలుగలదాని, విడువక చంద్రసూర్యులు తలవరులవలెఁగాచుదాని, నేత్రపర్వమగుదాని బంగరుకొండను గనుము.

విశే. మేరుపర్వతశిఖరము నాశ్రయించి గ్రహజ్యోతిశ్చక్రములు ప్రవర్తిలునని పురాణములు నుడువును. రత్నసానువు:—రత్నమయములైన చఱియలుగలది.

సీ. జీర్ణపర్ణద్రుసంకీర్ణాహిమణివిభామాయాకిసలవంచ్యమానపికము
శశికాంతరుచిమృషాసలిలసంస్ఫాలనశ్లథవిషాణోద్విగ్నసైరిభంబు
గోమేధికప్రభాంకురమిథ్యామధుద్రవలిలిక్షామిళద్భల్లుకంబు
నీలగండప్రస్తరాళీకగజభేదశీర్యన్నఖక్షుబ్ధసింహకులము

తే. గారుడాశ్మచ్ఛవిచ్ఛటాకపటయవస
పూలికాచర్వణవ్యగ్రబాలమృగవి
లంఘ్యమానాబ్జరాగశిలావితాన
కూటదావాగ్ని యీమరుత్కుధర మబల! 86

టీ. అబల=ఓసత్యా! జీర్ణపర్ణ...పికము-జీర్ణ=పండిన, పర్ణ=ఆకులుగల, ద్రు=చెట్లులందు, సంకీర్ణ=వ్యాపించిన, (అనఁగా నున్నయని భావము.)అహి=పాములయొక్క, మణి=రత్నములయొక్క, విభా=కాంతులనెడు, మాయాకిసల = కృత్రిమములగుచిగురులచే, వంచ్యమాన = మోసపుచ్చఁబడుచున్న, పికము=కోయిలలుకలది; మేరునగమునందలి వృక్షములయాకులు పండి రాలెననియుం, నట్టివృక్షముల సర్పములు చేరుటంజేసి యాసర్పముల తలలందలి మాణిక్యములకాంతులు చివురులభ్రాంతి నచటికోయిలలకుఁ గలుఁగఁజేయుచున్నవనియుం భావము. శశికాంత...సైరిభంబు-శశికాంత = చంద్రకాంతమాణిక్యములయొక్క, రుచి=కాంతియనెడు, మృషాసలిల = అసత్యోదకమున, సంస్ఫాలన=లెస్సగాకొట్టుటచేత, శ్లథ=జాఱిన, విషాణ=కొమ్ములుగలవగుటచే, ఉద్విగ్న=అవ్యవస్థములైన, సైరిభంబు=అడవిదున్నలుగలది; మేరుపర్వతమునందలి చంద్రకాంతమాణిక్యముల కాంతింగాంచి యెనుబోతు లుదకమనుభ్రమంజెంది కొమ్ములతోఁ గ్రుమ్ముటకతన, విషాణములు విశ్లథములై వేదనపాలయ్యెనని భావము. గోమేధిక...భల్లుకంబు-గోమేధిక = గోమేధికరత్నములసంబంధమైన, ప్రభా=కాంతులయొక్క, అంకూర=మొలకలనెడి, మిథ్యామధుద్రవ = అసత్యమగు తేనెనీటియొక్క, లిలిక్షా = నాకుటయందలికోర్కతో, మిళత్=కూడిన, భల్లుకంబు = ఎలుఁగుబంట్లుగలది; గోమేధికరత్నప్రభలంగాంచి తేనెయనుభ్రాంతినంది యెలుఁగుబంట్లు నాకుటకుఁ జేరనని

భావము. నీలగండ...సింహకులము-నీల = నీలరత్నములయొక్క, గండప్రస్తర = గండశిలలనెడు, అళీకగజ = అసత్యపు టేనుఁగులయొక్క, భేద=భేదించుటచే, శీర్యత్ = వదలిన, నఖ=గోళ్లుకలవాటచే, క్షుబ్ధ=కలఁతనొందుచున్న, సింహకులము=సింహసమూహముకలది; సింహములు నల్లని నీలరత్నగండశిలలంగాంచి యేనుఁగులను భ్రాంతినంది వానిని భేదింప గోళ్లు బ్రద్దలై జారి కలఁతనొందుచున్నవని భావము. గారుడాశ్మ... దావాగ్ని-గారుడాశ్మ = గరుడపచ్చలరాళ్లయొక్క, ఛవిచ్ఛటా=కాంతులగుంపనెడు, కపటయవసపూలికా = అసత్యములగు తృణములకట్టలను, చర్వణ = భుజించుటయందు, వ్యగ్ర=ఆసక్తములైన, బాలమృగ=పిల్లలేళ్లచేత, విలంఘ్యమాన=దాఁటఁబడుచున్న, అబ్జరాగశిలావితాన = పద్మరాగమాణిక్యపు రాళ్లగుమియనెడు, కూటదావాగ్ని = కృత్రిమమైన దవానలముగలది; గరుడపచ్చలకాంతులగుమిం గాంచి పిల్లలేళ్లు తృణపూలికలను భ్రాంతినంది యవ్వానిం భుజించునాసక్తిమెయి దవానలభ్రాంతి నొదవించు పద్మరాగరత్నశిలల నుల్లంఘించుచుండెనని భావము.

ఈమరుత్కుధరము = ఈదేవతలకొండయగు మేరువు.

విశే. మేరుపర్వతమున నుత్తమములగు రత్నములు గలవనియు, వివిధములగు మృగము లున్నవనియుఁ గవి తెల్పినాఁడు. సీసపాదములన్నియు గీతమంతయు నొక్కొక సిద్ధసమాసముతో నడిపినాఁడు. అలం. భ్రాంతిమదలంకారము. ఉదాత్తము. రూపకము.

ఉ. వంచనఁ బొంచి చేరువకు వచ్చిన చంద్రునిజింక నేసి హ
ర్షించియుఁ దత్సుధారసనిషేచనచే నది చావకున్కి వీ
క్షించియు నేటు దప్పె నని చేవిలునమ్ములుఁ బాఱవైచి ల
జ్జించి చరించుచుండుదురు చెంచెత లగ్గిరిసానుభూములన్. 87

టీ. చెంచెతలు=శబరకాంతలు, వంచనన్=వంచనతో, పొంచి = దాఁగి, చేరువకున్=దగ్గరకు, వచ్చిన=ఏతెంచిన, చంద్రునిజింకన్ = చంద్రునిదైనజింకను (చంద్రునందైన లేడినని భావము), ఏసి=శరప్రయోగముచేసి, హర్షించియున్=సంతసించియు, తత్సుధారసనిషేచనచేన్-తత్ = ఆచంద్రునియొక్క, సుధారస = అమృతరసముయొక్క, నిషేచనచేన్ = తడుపుటచేత, అది=ఆజింక, చావక, ఉన్కిన్=ఉండుటచే, వీక్షించియున్=చూచియు, ఏటు=దెబ్బ, తప్పెను, అని, చేవిలునమ్ములున్ = చేతనున్న ధనుర్బాణములను, పాఱవైచి=విసరివైచి, లజ్జించి=సిగ్గునంది, అగ్గిరిసానుభూములన్ = ఆమేరుగిరియొక్క సానుప్రదేశముల, చరించుచున్ = సంచరించుచు, ఉండుదురు.

భా. శబరకాంతలు చంద్రునిలేడింగాంచి బాణమునేసి చచ్చెనదియని తొలుదొల్త సంతసించిరిగాని యది యాచంద్రామృతరసాసేకమునం జావకుండుటకుఁ బిదపనెంతయుం వగచుచు చేతనున్నవిల్లమ్ములు పాఱవైచి తమ లక్ష్యగ్రహణాపాటవమును దలంచుకొని చింతిలి యప్పర్వతసానుప్రదేశముల విహరించుచుందురని భావము. అలం. అతిశయోక్తి.

విశే. అగ్గిరివరమున కనతిదూరముగనే చంద్రుఁడు పోవుచుండుననని సూచించినాఁడు. చంద్రునందలిమచ్చ నిట్లు కవులు లేడిగను, వరాహముగను నూహించుట సహజము.

వ. వెండియు నప్పసిండికొండ గండశైలమండలంబుల నుద్దండ వేదండంబు లొండొండ గండతలంబు లొరసికొన నిండిన మదజలాంజనమషిం గొని వనదేవతోప*భుక్తతాటంకతాళీదళంబులం బ్రియసందేశంబులు లిఖియించు గంధర్వసౌగంధికగంధులవలన, నత్యంతనిర్మలస్ఫటికాధిత్యకలం గానవచ్చు పాతాళవాతాశిప్రతిబింబంబులం గనిమును తమకఱచిన యురగంబులం బాఱ విడిచి వానిం దమచంచుపుటంబులం బొడిచియు గరుదంచలంబుల నడఁచియుఁ బదంబులం దాఁచియు నేచినకోపంబుల విఫలప్రయత్నంబు లగు బాలశిఖావళంబులం గని తమవరులకుం జూపి పరిహసించు గరుడతరుణీనివహంబులవలన, నెలయేటిచిలుపచిలుపనీరు పగలు గగనమణి ధగధగని కిరణముల మిగుల నెగ లెగయు రవికాంతశిలాతలంబులం దెకతెక లుడుకెత్తి జాలువాఱఁ గరంగిన కఱ్ఱజవ్వాదికొలంకులం బడి కెలంకులం దేలి తెట్టువలు గట్టి చపలకపికులచలితతటతరుపతిత కుసుమవిసర పరిమళపరంపరా వాసితంబై ఘుమఘుమం బిసాళింప నలందుకొని రతిశ్రమంబు లపనయించుయక్షపక్ష్మలాక్షులవలనఁ, గేసరికిశోరనఖముఖవిదారితకుంభంబై నవనగజంబును వనగజదంతఘాతయాతనాభ్రాంతవరాహంబును వరాహదంష్ట్రాటంకఖండితకీచకనిచయంబును గీచకశిఖాజర్జరితపర్జన్యంబును బర్జన్యోదరపరిచ్యుతశంఖశుక్తిసంఘంబును నొక్కయెడన పడఁ దత్తదుత్పన్నంబు లగుమౌక్తికంబుల వేలువేలు నేఱి పేరులు గ్రుచ్చు సాధ్యమిథ్యామధ్యలవలనను, నభిరామం

* భుక్తముక్తతాటంక.

బై; మఱియు నొక్కచోట సురపతి తఱుచు మెఱుఁగు లడరు
కఱకుభిదురముఁ గొని తఱిమి యెఱకలు విఱుగ నఱికినయెడల
సెలలకు నిడిన జలగలపోలుపునం జఱుల నెరగొని పొరలు జరదజగర
నికరంబులును, ఖచరగణ గోష్ఠిస్థానంబులం బఱచినరత్నకంబళంబుల
విధంబున విశాలశిలాతలంబుల నిద్రించుశార్దూలంబులును, మృగాంక
మండలంబు సగము కబళించిన రాహుగ్రహాభూమికలచందంబున
నందంద తిరుగుబొల్లిమోరభల్లూకంబులును గలిగి; సుధర్మాప్రదేశం
బునుంబోలె శక్రపురమహిళాలి *కుచచందనసుగంధాగురువాత
పోతమేదురంబును, జలనిధియునుంబోలె నీలనలపనసకీలితతుంగసేతు
సహితంబును, వల్లకియునుం బోలె లలితప్రవాళకకుభంబును, భారతం
బునుంబోలె శతపర్వచమత్కృతంబును, సమరతలంబునుంబోలెఁ
గలితానేకపాటనంబును, శబ్దశాస్త్రంబునుంబోలె ధాతుగణ విద్యో
తితంబును, సంగీతంబునుంబోలె నిషాదభరితంబునయి, గ్రావనిబద్ధ
ఘనౌఘంబయ్యును నగ్రావనిబద్ధఘనౌఘంబై, గవయస్థానం బయ్యును
నగవయస్థానంబై, వైణవారావాసితంబయ్యు నవైణవారావాసి
తంబై, మెఱయు నిది; మఱియును. 88

టీ. వెండియుఁ = మఱియు, అప్పసిండికొండ = ఆబంగరుకొండయొక్క (మేరువు), గండశిలామండలంబులన్ = పెద్దరాళ్లగుంపునందు, ఉద్దండవేదండంబులు = విజృంభించునేనుఁగులు, ఒండొండన్=అన్యోన్యము, గండతలంబులు = చెక్కులప్రదేశములు, ఒరసికొనన్=రాచుకొనఁగా, నిండిన=పూర్ణమైన, మదజలాంజనమషిన్ = దానోదకమనెడిమసిని (కాటుకరసము), కొని=స్వీకరించి, వనదేవతా...దళంబులన్ = వనదేవతా=వనదేవతలచే, ఉపభుక్త=అనుభవింపఁబడిన, తాటంక = కర్ణాభరణములైన, తాళీదళంబులన్ = తాటియాకులందు, ప్రియసందేశంబులు=ప్రియులకుఁబంపువార్తలు, లిఖించు=వ్రాయునట్టి, గంధర్వసౌగంధికగంధులవలనన్ = గంధర్వస్త్రీలవలనను, (సౌగంధికగంధి = కలువపరిమళముంబోలు పరిమళముగలది స్త్రీ.) ఇంతవఱకు శొకవాక్యము. అభిరామంబై యనుదానితో దీనికన్వయము. గంధర్వాంగనలు గజముల మదజలమును సిరాతో వనదేవతలు కర్ణాభరణములుగ నుపయోగించికొని విడిచిన తాళపత్రములఁ బ్రియసందేశముల నందు వ్రాయుచుండిరని భావము. మత్తిలినయేనుఁగు లందుఁ గలవ

* కుచలికుచచందన.

నియుం, వనదేవత లందలివస్తువుల నాభరణములుగఁ జేసికొని సవిలాసముగ సంచరింతు రనియు, గంధర్వాంగన లందు లీలమీఱ విహరింతురనియుఁ దాత్పర్యము. అత్యంత... అధిత్యకలన్-అత్యంత=మిక్కిలి, నిర్మల=స్వచ్ఛములైన, స్ఫటిక=స్ఫటికవికారములైన, అధిత్యకలన్ = గిరిశిఖరభూములందు, కానన్+వచ్చు = కనఁబడునట్టి, పాతాళ వాతాళిప్రతిబింబంబులన్ = పాతాళమందలినాగముల మాఱురూపులను, కని=చూచి, మును=తొల్లి, తమకఱచిన=తాము నోటఁబట్టుకొనిన, ఉరగంబులన్=పాములను, పాఱ విడిచి=పాఱవైచి, వానిన్ = ఆప్రతిబింబములను, చంచుపుటంబులన్ = దొప్పలవంటి ముక్కులచేత, పొడిచియున్, గరుదంచలంబులన్ = ఱెక్కలకొనలచేత, అడఁచి యున్=అడఁగఁజేసియు, పదంబులన్=పాదములచే, తాఁచియున్=తన్నియు, ఏచిన= వృద్ధినందిన, కోపంబులన్ = ఆగ్రహములతో, విఫలప్రయత్నంబులు = సఫలముగాని ప్రయత్నముగలవి, అగు = అయినట్టి, బాలశిఖావళంబులన్ = లేనెమిళులను, కని = కాంచి, తమవరులకున్=తమపతులకు, చూపి=అగపఱచి,పరిహసించు=పరిహాసమొనర్చు నట్టి, గరుడతరుణీనివహంబులవలనన్=గరుడయువతులసమూహమువలనను; అయ్యద్రి స్ఫాటికోపరిభూములఁ బాతాళనాగములరూపులు ప్రతిఫలింప నవ్వానిఁగని యధికరోష మున బాలశిఖావళములు తాము మున్ను నోటఁగఱచి పట్టికొనినపాములఁ బాఱవైచి యానాగప్రతిబింబములను నిజసర్పములుగా భావించి ముక్కులతోఁబొడిచి,ఱెక్కలతో నడఁచి, పాదములతోఁ దన్ని విఫలప్రయత్నములుగలవిగాఁగ, నక్కొండయందుండు గరుడాంగన లాశిఖావళములఁ దమప్రియులకుం జూపి పరిహసించుచుండిరని భావము. అగ్గిరివరమున నచ్ఛములగు స్ఫాటికప్రదేశములు గలవనియుం, నెమిళులు, గరుడాంగన లును నందు విహరించుచుందురనియుఁ దాత్పర్యము. సెలయేటిచిలుపచిలుపసీరు = కొండ యేటి యత్యల్పజలము, పగలు=దినభాగమున, గగనమణిధగధగనికిరణములన్ = సూ ర్యుని ధగధగాయమానమగురశ్ములచే, సెగలు=వేడులు, ఎగయు=పైకివచ్చు, రవికాంత శిలాతలంబులన్ = సూర్యకాంతపురాళ్లయొక్క ప్రదేశముచేత, తెకతెక=కుతకుతమని, ఉడుకెత్తి=కెరలి మఱఁగి, జాలువాఱన్=పాఱునట్లు, కరంగిన = ద్రవీభవించిన, కట్టి జవ్వాదికొలంకులన్ = నల్లనిజవ్వాదిచెరువులందు, పడి, దీనికిఁ గర్త సెలయేటిచిలుప చిలుపసీరు. కెలంకులన్=ఒడ్డులందు, తేలి, తెట్టువలు = పెఱలు, కట్టి, చపల...వాసి తంబై-చపల=చంచలములైన, కపికుల=కోఁతులగుమిచే, చలిత=కదల్పఁబడిన, తటతరు= ఒడ్డులందలివృక్షములనుండి, పతిత=పడిన, కుసుమవిసర = పుష్పసమూహముయొక్క, పరిమళపరంపరా = సుగంధసమూహముచే, వాసితంబై=పరిమళింపఁజేయఁబడినదై, ఘుమ ఘుమన్ = ఘుమఘుమమనునట్లు, పిసాళింపన్=పరిమళింపఁగా, అలంకుకొని=పూసికొని,

రతిశ్రమంబులు=సంభోగమువలని యాయాసములను, అపనయించు = పోఁగొట్టుకొను నట్టి, యక్షపక్ష్మలాక్షులవలనన్ = యక్షాంగనలవలనను; పగలు సూర్యునితీక్ష్ణములైన కిరణములచేతఁ జంద్రకాంతమాణిక్యములనుండి మంట లెగసెననియు, నాజ్వాలల సోఁకున నల్లని జవ్వాదివెరువులు కఱఁగి జాలువాఱెననియు, నట్టి కొలఁకులందు నెలయేటి యత్యల్పోదకము పడి వెలుగట్టి తీరతరువులందలి చపలకపికులముచే రాల్పఁబడిన సుమముల పరిమళముచేఁ బరిమళింపఁజేయఁబడెననియు, నట్టి సుగంధనిర్ఝరసలిలము నలందికొని యక్షాంగనలు రతిశ్రమ మపనయించుకొనుచుండిరనియు భావము. అప్పర్వత శ్రేష్ఠమున మనోజ్ఞములగు జవ్వాదికొలఁకులు, చంద్రకాంతశిలలు గలవనియు, నందు యక్షాంగనలు విహరించుచుందురనియుఁ దాత్పర్యము. కేసరికిశోర...కుంభంబైన-కేసరి కిశోర=సింహపుఁబిల్లలయొక్క, నఖముఖ=గోళ్లకొనలచే, విదారిత=బ్రద్దలుచేయఁబడిన, కుంభంబైన = శిరోభాగముకలదైన, వనగజంబును = అడవియేనుఁగులును, వనగజ... వరాహంబును-వనగజ = అడవియేనుఁగులయొక్క, దంతఘాత=దంతములపోటుచేనైన, యాతనా=బాధచే, భ్రాంత=కలఁగెడు, వరాహంబును=అడివిపందియును, వరాహ... నిచయంబును-వరాహ = అడవిపందులయొక్క, దంష్ట్రాటంక = ఉలులవంటికోరలచే, ఖండిత=నఱుకఁబడిన, కీచకనిచయంబును = బొంగువెదుళ్లసమూహమును, కీచక... పర్జన్యంబును-కీచకశిఖా = బొంగువెదుళ్లకొనలచే, జర్జరిత=కలంపఁబడిన, పర్జన్యంబును= మేఘములును, పర్జన్యోదర ..సంఘంబును-పర్జన్య = మేఘములయొక్క, ఉదర=మధ్య భాగమునుండి, పరిచ్యుత=పడినట్టి, శంఖశుక్తిసంఘంబును=శంఖములయు ముత్తెపుఁజిప్ప లయు సమూహమును, ఒక్కయెడన=ఒకేస్థలమున, పడన్=పడఁగా, తత్తదుత్పన్నంబు లగు=వానివానినుండిపుట్టునట్టి, మౌక్తికంబులన్ = ముత్తెములను, వేఱువేఱన్ = కలసి పోకుండునట్లు, ఏఱి, పేరులు=హారములు, గ్రుచ్చు=కూర్చునట్టి, సాధ్యమిథ్యామధ్యల వలనను = సాధ్యులవనితలవలనను; ఆపర్వతమున సింహకిశోరనఖములచే వ్రయ్యలైన కుంభములుగల యేనుఁగులును, హస్తిదంతములపోఁటులచే వ్యథనందు నడవిపందులును, నడవిపందుల వాడికోరలచే బ్రద్దలుచేయఁబడినవెదుళ్లును, వెదుళ్లకొనలచే విదారింపఁబడిన మేఘములనుండి జాఱిన శంఖశుక్తిసమూహమును నొక్కచోఁగూల, నానాపదార్థము నుండి పుట్టి పడిన మంచిముత్తెముల నొకజాతిదానితో నొకటి కలయకుండురీతి సాధ్య స్త్రీలు హారములు కూర్చుచుందురని భావము. అనఁగా నందు మంచిముత్తెములు విస్తారముగ లభించుననియు, నవ్వాని హారములుగఁ గూర్చి యలంకరించికొని సవిలాసముగ సాధ్యాంగనలు విహరింతురనియు,సింహగజవరాహాదు లందుఁ గలవనియుఁ దాత్పర్యము. "కరీంద్రజీమూతవరాహశంఖమత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని" అనువాక్యము ననుస

రించి మంచిముత్తెములు, గజేంద్రములనుండియు, మేఘమునుండియు, వరాహముల నుండియు, శంఖములనుండియు, ముత్తెపుఁజిప్పలనుండియు, వెదుళ్లనుండియు మున్నగు వానినుండి పుట్టునని యెన్నవలయును. అభిరామంబై=మనోహరమై, లలనలతో నొప్పు. మీఁదివాక్యములన్నింటితో దీని కన్వయము. మఱియుఁన్, ఒక్కొకచోటన్=ఒక్కొక స్థలమున, తఱచుమెఱుఁగులు = దట్టములగుకాంతులు, అడరు=వ్యాపించునట్టి, కఱకు భిదురముఁన్ = వాఁడియగువజ్రాయుధమును, కొని=పట్టి, తఱిమి=తోలి, యొఱకలు = ఱెక్కలు, విఱుగన్=విఱుగునట్లు, నఱికినయెడలన్=నఱికినచోటులందు, సెలలకున్= పుండుబెజ్జములందు, ఇడిన=ఉంచిన, జలగలపోలుపునన్ = జలగలతీరున, (జలగ=ఉదక సర్పవిశేషము), చఱులన్ = గిరిప్రాంతప్రదేశములందు, ఎరన్ = ఆహారమును, కొని = గ్రహించి, పొరలు=దొర్లుచుండు, జరదజగరనికరంబులును = ముసలికొండచిలువగుము లును; ఎరగొని యగ్గిరిప్రాంతదేశమున దొర్లుచుండు కొండచిలువలు, దేవేంద్రుఁడు వజ్రా యుధమున నఱ్కొండ ఱెక్కలందఱిగి యావ్రణరంధ్రముల రక్తముం బీల్పనిడిన జల గలోయనునట్లు పొల్చెనని భావము. ఖచర...స్థానంబులన్-ఖచరగణ=సురలయొక్క, గోష్ఠీస్థానంబులన్ = మాటలాడుకొనుచోటులందు, పఱచిన, రత్నకంబళంబులవిధం బునన్ = రత్నకంబళులతీరున, విశాలశిలాతలంబులన్ = విశాలములైనఱాళ్లప్రదేశము లందు, నిద్రించు=శయనించెడి, శార్దూలంబులును=బెబ్బులులును; పఱపైనఱాళ్లనిద్రించు చున్నవ్వెన్నెమెకములు వివిధవర్ణములనెసఁగు రత్నకంబళులవలె నున్నవనియు, నాకంబళులు సురలు స్వేచ్ఛగఁ గూర్చుండి మాటలాడుకొనుటకై పఱుపఁబడిన ట్లమరియున్నవనియు భావము. మృగాంకమండలంబున్ = చంద్రమండలంబును, సగము=సంగోరు, కబళిం చిన=మ్రింగిన, రాహుగ్రహభూమికలచందంబునన్ = రాహుగ్రహవేషములవిధమున, అందంద=అచ్చటచ్చట, తిరుగు=సంచరించునట్టి, బొల్లిమోరభల్లూకంబులును = తెల్పు ముట్టెగల యెలుఁగుబంటులును; బొల్లిమోర సంగోరుమ్రింగిన చంద్రబింబమువలెను, తక్కిన నల్లనిభాగము రాహుగ్రహమువలెను నొప్పియుండుటంజేసి, భల్లూకములు సగముమ్రింగిన చంద్రమండలముగల రాహుగ్రహములవలెఁ బొల్చియున్నవని గ్రహిం చునది. కలిగి=కలదై, కర్త. మేరువు. 'కలిగి' అను దీనికిఁ బూర్వమునఁగల ద్వితీయాం తము లన్నింటితో నన్వయము. సుధర్మాప్రదేశంబుచుంబోలెన్ = దేవసభాప్రదేశము వలె (దేవసభకు సుధర్మ యని పేరు. శక్ర...మేదురంబును-శక్రపుర = ఇంద్రపట్టణ మండలి, (అమరావతి), మహిళాలి = స్త్రీసమూహముయొక్క, కుచ = స్తనములందైన చందనసుగంధాగురు = చందనము పరిమళించునట్టి యగురునుగల, వాతపోత=పిల్లగాలు లచే, మేదురంబును = బలసినదియు, అని యింద్రసభాపరమగునర్థము. అనఁగా నింద్ర

సభయందు సురాంగనల కుచములందలి సుగంధద్రవ్యముల సుగంధమునువహించిన పిల్ల గాలు లోలయుననని భావము. శక్ర=అంకుడుచెట్లు, పుర=గుగ్గులువృక్షములు, మహిళా=ప్రియంగులతలు, లికుచ=నిమ్మచెట్లు, చందన=మంచిగంధపుఁజెట్లు, సుగంధాగురు = పరిమళించు నగురువృక్షములు, (వీనిచేతను), వాతపోత=పిల్లగాలులచేతను, మేదురంబు = సాంద్రమైనది. అని మేరుపరమగునర్థము. జలనిధియునుంబోలెన్ = సముద్రమువలె, నీలనలపనసకీలితతుంగ సేతుసహితంబును = 'నీలుఁడు, నలుఁడు, పనసుఁడు' అను ప్లవంగమవీరులచేఁ గట్టఁబడు నెత్తైన యానకట్టతోఁ గూడినది. అని సముద్రపరమగునర్థము. నీలనల=నల్లనిగడ్డితోడను, పనస=పనసచెట్లతోడను, కీలిత=కూడియున్న, తుంగ=చిన్నగుట్టలతోడను, సేతు=నీటికట్టలతోడను, సహితంబును=కూడినదియు, అని మేరుపరమగునర్థము. వల్లకియుంబోలెన్=వీణవలె, లలితప్రవాళకకుభంబును - లలిత = సొగసైన, ప్రవాళ=దండమును, కకుభంబును=ముఖమునుగలది. అని వీణాపరము. లలిత=సొగసైన, ప్రవాళ=చివురలుగల, కకుభంబును=అర్జునవృక్షములుగలదియు, అని మేరుపరము. వీణాదండమునకుఁ బ్రవాళమనియుం, వీణాముఖమునకు కకుభమనియుఁ బేర్లు. భారతంబునుంబోలెన్ = భారతమువలె, శతపర్వచమత్కృతంబును - శతపర్వ = నూఱుపర్వములచే, (నూఱులక్షణములు లేక నూఱుప్రస్తావనలు), చమత్కృతంబును=మనోహరమైనది. అని భారతగ్రంథపరము. శతపర్వ=నూఱుగనుపులుగల వెదుళ్లచే, చమత్కృతంబును=మనోహరమైనది. అని మేరుపరము. సమరతలంబునుంబోలెన్=యుద్ధరంగమువలె, కలితానేకపాటనంబును-కలిత=ఒప్పుచున్న, అనేక=అనేకులయొక్క, పాటనంబును = బ్రద్దలుచేయుట కలదియు అని సమరతలపరము. కలిత=ఒప్పెడు, అనేకప = ఏనుఁగులయొక్క, అటనము = సంచారముగలది. అని మేరుపరము. శబ్దశాస్త్రంబునుంబోలెన్ = వ్యాకరణశాస్త్రమువలె, ధాతుగణవిద్యోతితంబును-ధాతుగణ = భ్వాదిధాతుగణములచే, విద్యోతితంబును=ప్రకాశితమును, అని వ్యాకరణపరము. ధాతుగణ=గైరికాదిధాతుసమూహముచే, విద్యోతితము=ప్రకాశితము, అని మేరుపరము. సంగీతంబునుంబోలెన్=సంగీతమువలె (గానమువలె), నిషాదభరితంబును - నిషాద=స్వరభేదముచే, భరితంబును = పూర్ణమైనదియుం, అని గానపరము. నిషాద=కిరాతులచే, భరితంబును = నిండినది, అని మేరుపరము. గ్రావనిబద్ధఘనౌఘంబయ్యును-గ్రావ = కొండలందు (శిఖరములందనుట), నిబద్ధ=కూర్పఁబడిన, ఘనౌఘము=మేఘబృందముగలది, అయ్యును = అయినను, అగ్రావనిబద్ధఘనౌఘంబై - అగ్రావని=ఎదుటిభూమిని, బద్ధ=కూర్పఁబడిన, ఘన=గొప్పదైన, ఓఘంబై=ఉదకప్రవాహముగలదై, గవయస్థానంబయ్యును=గవయమృగములకు స్థానమైనను, అగవయస్స్థానంబై-అగ = వృక్షములకును, వయః=పక్షులకును, స్థానంబై=తావై, వైణ

వారావాసితంబయ్యును-వైణవ = బొంగువెదుళ్లయొక్క, ఆరావ=ధ్వనికి, ఆసితము = స్థానము, అయ్యున్=అయినను, నవైణ...వాసితంబై - నవ = క్రొత్తయైన, శ్వేతయైన, ఏణవార=జింకలగుంపుకు, ఆవాసితంబై=వాసస్థానమై, ఇది=ఈమేరువు, మెఱయున్ = ప్రకాశించును. మఱియును.

విశే. ఇందు, సుధర్మాప్రదేశమను వాక్యము మొదలుకొని నిషాదధరితమనువాక్యమువఱకుఁగల వాక్యములలో సభంగాభంగరూపమగు శ్లేషయు, గ్రావనిబద్ధమనువాక్యము మొదలుకొని, ఏణవారావాసితంబై అనువాక్యమువఱకుఁగల వాక్యములలో విరోధాభాసమును వెలయుచున్నవి.

సామజముగాన వేదండమను పేరు హస్తికిఁగల్గెను. వేద+అండ=వేదండ, వాతాసి =గాలిని దినునది గానఁ బామునకు వాతాసిపేరువచ్చెను. ఉరగము = వక్షముతోఁ బ్రాకునుగాన దీనికీపేరు కల్గెను. గగనమణి=ఆకాశమునకు మాణిక్యముపోలిక నొప్పువాఁడు గాన రవికీనామముకల్గె. మిథ్యామధ్యలు=లేనినడుముగలవారు. అనఁగా సన్ననినడుముగలవారనుట.

ఉ. కిన్నరకంఠి! చూచితివె కిన్నరులం గలధౌతభూధరా
భ్యున్నతశృంగభాగముల నుత్పలగంధులుఁ దాముఁ గల్పకో
త్పన్నమధుప్రసంగతులఁ బాడెద రింద్రునిమీఁదిగీతముల్
కిన్నర లొయ్యనొయ్యఁ బలికించుచుఁ దారతరస్వనంబులన్. 89

టీ. కిన్నరకంఠి = వీణాస్వరముంబోలు స్వరముగలదాన (సత్య!) కలధౌత... భాగములన్-కలధౌతభూధర = బంగరుకొండయగు మేరువుయొక్క, అభ్యున్నత = ఎత్తైన, శృంగ=శిఖరములయొక్క, భాగములన్ = ప్రదేశములందు, ఉత్పలగంధులు= స్త్రీలు, కల్పకోత్పన్నమధుప్రసంగతులన్-కల్పక = కల్పవృక్షములనుండి, ఉత్పన్న = పుట్టిన, మధు = మద్యముయొక్క, ప్రసంగతులన్ = ఉత్కృష్టమగు సంబంధముచే, కిన్నరలు=వాద్యవిశేషములను, ఒయ్యనొయ్యన్ = మెల్లమెల్లఁగా, పలికించుచున్ = మీటుచు, తారతరస్వనంబులన్ = మిక్కిలి హెచ్చైనస్వరములతో, ఇంద్రునిమీఁది గీతముల్ = ఇంద్రాంకితములగుపాటలను, పాడెదరు = పాడుచున్నారు. చూచితివె = కంటివే!

భా. ఓసత్యభామ! కల్పవృక్షసంబంధమైన మద్యములం ద్రావి యామైకమునఁ దమ ప్రభువగునింద్రునిమీఁది పాటలను బాడుచున్నా రదె గంటివే యని శ్రీకృష్ణుఁడు సత్యభామంగూర్చి పల్కెనని భావము.

ఉ. ఆయతభూర్జపత్త్రముల నామరధేనుదధిప్రయుక్తపా
థేయము లారగించి వడ దేఱఁగ శీతలకల్పకద్రుమ
చ్ఛాయల నిల్చినిల్చి సరసంబులు వల్కుచు వెండికొండకుం
బాయక కూడి యేగెదరు భామిని! చూడుము సిద్ధపాంథులన్. 90

టీ. ఆయతభూర్జపత్త్రములన్ = పొడవైన భూర్జవృక్షపుటాకులందు, అమరధేను దధిప్రయుక్త పాథేయములు-అమరధేను = సురలసంబంధమైనయావుయొక్క, దధి= పెరుఁగుచే, ప్రయుక్త=కల్పితములైన, పాథేయములు=దారిబత్తెములను, ఆరగించి= భుజించి, వడ తేఱఁగన్ = శ్రమతీరుటకై, శీతలకల్పకద్రుమచ్ఛాయలన్ = చల్లని కల్పవృక్షములనీడలందు, నిల్చి నిల్చి=ఉండియుండి, సరసంబులు = సరసములగుమాటలు, పల్కుచు=ఆడుచు, పాయక=ఒండొరులనెడఁబాయక, కూడి=కలిసి, వెండికొండకున్ = కైలాసమునకు, ఏగెదరు=పోయెదరు. సిద్ధపాంథులన్ = సిద్ధులను, బాటసారులను, చూడుము. భుజించి, కూడి, నిల్చి మున్నగు నసమాపకక్రియలకు, సిద్ధపాంథపదమే కర్తయని గ్రహించునది.

భా. ఓసత్యభామ! సిద్ధు లదె తాము తెచ్చికొన్న వేల్పుటావుపెరుఁగుతోఁ జేయఁబడిన దారిబత్తెముల విశాలభూర్జపత్త్రముల నిడికొని కల్పవృక్షములనీడల శ్రమమపనయించుకొని గుమికూడి కైలాసమున కేగుచున్నవారు గనుమని భావము.

శా. ఏణీశాబవిలోలనేత్ర! కనుఁగొంటే వీరు విద్యాధరు
ల్మాణిక్యోజ్జ్వలరత్నకుండలులు సంబద్ధాసిధేను ల్రణ
ద్వీణాపాణులు చంద్రికామలశిరోవేష్టు ల్త్రిపుండ్రాంకితు
ల్నాణీయస్తరతారహారులు శివధ్యానైకనిష్ఠాపరుల్. 91

టీ. ఏణీశాబవిలోలనేత్ర! = బాలకురంగమువలెఁ జలించు నేత్రములుగలదాన! మాణిక్యోజ్జ్వలరత్నకుండలులు = రత్నములచేఁ బ్రకాశించు రత్నకుండలములుగలవారు, సంబద్ధాసిధేనుల్-సంబద్ధ=కట్టుకొన్న, అసిధేనుల్=కత్తులుగలవారు, రణద్వీణాపాణులు =ధ్వనిచేయువీణియలు హస్తములందుఁగలవారు, చంద్రికామలశిరోవేష్టుల్=వెన్నెలవలె స్వచ్ఛమైన తలపాగకలవారు, త్రిపుండ్రాంకితుల్=భస్మముచేఁ దీర్చిన మూఁడురేకలచేఁ జిహ్నితులైనవారు నాణీయస్తరతారహారులు-నాణీయ=మిక్కిలి గొప్పవగు, తారహారులు = ముత్యాలహారములుగలవారు, శివధ్యానైకనిష్ఠాపరుల్ = శివధ్యానమను ముఖ్యమగునియమమునం దాసక్తిగలవారు, వీరు, విద్యాధరులు, కనుఁగొంటే=చూచితివే.

భా. ఓకురంగలోలవిలోచన! వారే విద్యాధరులు రత్నకుండలాలంకృతులై కత్తులంగట్టుకొని, వీణియలంబూని, తెల్లనితలపాగల ధరించి నొసటఁ ద్రిపుండ్రములం దిద్దికొని, గొప్ప ముత్తియంపుంజేరులందాల్చి శివధ్యానమను ముఖ్యమగునిష్ఠయందే కేవల మాసక్తిగల్గి కైలాసమునకుం బోవుచున్నారదే గనుము.

వ్యా-వి శే. అణీయన్+తర-అణీయస్తర=మిక్కిలి సూక్ష్మమైనది. న+అణీయస్తర= నాణీయస్తర=సూక్ష్మముకానిది. 'అణు' అనుపదమునకుఁ దరప్ప్రత్యయరూపము 'అణీయన్' దీనిపై మఱల తరప్ప్రత్యయముచేసి కవి ప్రయోగించుట యుచటివిశేషము.

మ కనుఁగొంటే సకలేందుబింబముఖి! యీగంధర్వులం బంకజా
సనగేహిన్యుపదిష్టగీతరచనాసర్వంకషప్రజ్ఞులం
గనదుత్తుంగవిమానచారులఁ దురంగగ్రీవుల న్నిర్జరీ
జనతానృత్తసహాయలాలసుల యక్ష[1]గ్రామవాస్తవ్యులన్. 92

టీ. సకలేందుబింబముఖి = పూర్ణచంద్రవదన ! పంకజాసన...ప్రజ్ఞులన్ - పంకజాసనగేహినీ=సరస్వతిచే (బ్రహ్మపత్ని), ఉపదిష్ట=కఱపఁబడిన, గీత = గానముల యొక్క, రచనా=తిరుగఁబాడుటయందు, సర్వంకష = సంపూర్ణమైన, ప్రజ్ఞులన్=బుద్ధి కలవారలను, కన...చారులన్-కనత్=ప్రకాశించునట్టి, ఉత్తుంగ = ఎత్తైన, విమాన = విమానములందు, చారులన్ = సంచరించువారిని, తురంగగ్రీవులన్ = హయగ్రీవులను, నిర్జరీ...లాలసులన్ - నిర్జరీ = దేవతాస్త్రీలయొక్క, జనతా = సమూహముయొక్క, నృత్త=నాట్యములయొక్క, సహాయ = తోడ్పాటువిషయమున, లాలసులన్ = ఆసక్తి గలవారిని, యక్షగ్రామవాస్తవ్యులన్=యక్షులగుంపుతోనుండువారిని, ఈగంధర్వులన్= ఈగంధర్వులను, కనుఁగొంటే=చూచితివే.

విశే. సకలేందు = కళలన్నింటితోఁ గూడినచంద్రుఁడు.

సీ. యక్షులు [2]వీర లోయతివ! మేళము గూడి
పాడుచుండుదురు దిక్పాలసభల
గుహ్యకు [3]ల్వీర లోకొమ్మ! హాస్యరసాధి
నాయకు ల్భృంగీశనర్మసఖులు
గరుడులు [4]వీర లోతరుణి! విష్వక్సేన
పరిచితు ల్మాగారిపరమహితులు

1 గ్రావవాస్తవ్యులన్. 2 వీరుగో యతివ !. 3 వీరుగో కొమ్మ !. 4 వీరుగో తరుణి!

చారణు [1]లీవ్వర లోసతి! విచిత్రకథేతి
హాసజ్ఞు లఖిలలోకాధ్వనీను
తే. లమరపతిఁ గొల్వఁ జనువార లతివ! యెపుడు
నుబుసు వుత్తురు వివిధోపయోగ్య [2]కళల
మనలఁ జూచెద రాశ్చర్యమగ్ను లగుచు
వీరిఁ గనుఁగొంటె గంభీరవేదిగమన! 93

టీ. ఓయతివ=ఓవనిత! వీరలు=వీరు, యక్షులు. మేళము=జత, కూడి, దిక్పాల సభలన్ = దిక్పతులసభలందు, పాడుచుండుదురు=గానము చేయుదురు. ఓకొమ్మ=ఓస్త్రీ! వీరలు, గుహ్యకులు, హాస్యరసాధినాయకుల్ = హాస్యరసాధిపతులు, భృంగీశనర్మసఖులు = భృంగీశుని రహస్యమిత్రులు, ఓతరుణి=ఓయువతి, వీరలు, గరుడులు. విష్వక్సేనపరిచితులు = విష్వక్సేనుని స్నేహితులు, నాగారిపరమహితులు = గరుడునకుఁ బ్రియమిత్రులు, ఓసతి=ఓపతివ్రత! వీరలు, చారణులు. విచిత్ర...హాసజ్ఞులు-విచిత్ర=మిక్కిలి చిత్రములైన, కథా=కొంచెము సత్యమైన కల్పితకథలను, ఇతిహాస=ప్రాచీనచరిత్రములను, జ్ఞులు=తెలిసినవారు, అఖిలలోకాధ్వనీనులు=అన్ని లోకములందు సంచరించువారు, అమరపతిన్=దేవేంద్రుని, కొల్వన్=సేవించుటకు, చనువారలు=పోవుచున్న వారు,అతివ=సత్యా! ఎపుడు=ఎల్లపుడు, వివిధోపయోగ్యకళలన్ = అనేకవిధములగు నుపయుక్తములైన విద్యలచే, ఉబుసు=పనిలేని కాలమును, పుత్తురు=గడుపుదురు. ఆశ్చర్యమగ్నులు = ఆశ్చర్యమున మునిఁగినవారు, అగుచున్, మనలన్, చూచెదరు=చూచుచున్నారు. గంభీరవేదిగమన-గంభీరవేది = మదగజమువంటి, గమన=నడకగలదాన! వీరిన్, కనుఁగొంటె=చూచితివె!

విశే. తోలూడినను, రక్తము కారినను, మాంస మూడివచ్చినను, దన్నుఁదా నేది యెఱుంగక మత్తిలి తిరుగునో, బహుకాలమునకుఁగాని యేది శిక్షితమై వశము కాదో యట్టియేనుఁగును గంభీరవేది యందురు.

లయగ్రాహి.—

అంగన! కనుంగొను మనంగహరమాళితట
రంగనటి జహ్నుమునిపుంగవవిశాలో
త్సంగశిశువుం గపిలునింగలపుఁజూపుసెక
లం గలయునాసగరువంగడము మోక్షో

1 వీరుగో సతి. 2 కథల.

త్తుంగమణిసౌధమునకుం గడపుఁ దాప గగ
నాంగణమహీతలభుజంగనిలయంబుల్
జంగగొను నేర్పరిఁ బతంగజయనుంగుఁజెలి
యం గనఖలాచలయుగంగ సురగంగన్. 94

టీ. అనంగ...నటిన్ - అనంగహర=మన్మథహంతయగు నీశ్వరునియొక్క, మౌళితట=శిరోభాగమనెడు, రంగ=నాట్యభూమియందు, నటిన్=నర్తకియైనదానిని, జహ్నుముని...శిశువున్ - జహ్నుమునిపుంగవ = జహ్నువను ఋషిశ్రేష్ఠునియొక్క, విశాలోత్సంగ=పఱపైనతొడయందలి, శిశువున్ = పాపయైనదాని, కపిలు...సెకలన్ - కపిల=కపిలమహామునియొక్క, ఇంగలపుఁజూపు = అగ్నికణములరూపమగు దృష్టియొక్క, సెకలన్=మంటలందు, కలయు=కలసిపోయిన, ఆసగరువంగడమున్ = ఆసగరునివంశమును, మోక్షోత్తుంగమణిసౌధమునకున్ = మోక్షమనెడి యెత్తైనమేడకు, కడపు = చేర్చునట్టి, తాప=నిచ్చెనయైనదాని, గగనాంగణమహీతలభుజంగనిలయంబుల్ = స్వర్గమర్త్యపాతాళములను, జంగగొను=లంఘించునట్టి, నేర్పరిన్=నేర్పుకలదాని, పతంగజయనుంగుచెలియన్ - పతంగజ = సూర్యతనయయగుయమునకు, అనుంగుచెలియన్ = ప్రియసఖియైనదాని, కనఖలాచలయుగంగన్ = కనఖలయనుకొండతో, యుక్ = కూడిన, అంగన్=శరీరముగలదాని, సురగంగన్=మందాకినిని, అంగన, కనుంగొనుము=చూడుము.

విశే. ఈశ్వరుఁడు భగీరథునిప్రార్థనంజేసి గంగను మౌళిఁ దాల్చుటకతన నందు గంగ విహరించుటకల్గెను. దాన నీశుమౌళి గంగానర్తనమునకు రంగమయ్యె. జహ్నుముని యుద్రేకమున వచ్చు గంగం ద్రావి మఱల దానిం దాఁబుట్టించుటంబట్టి గంగ జహ్నుసుతయై జాహ్నవీనామమునందెను. వేయిమంది సగరసుతులు యాగపశువును వెదకం బాతాళమువఱకు భూమిం ద్రవ్వి పాతాళముం జొరఁబాఱి యచ్చోఁ గపిలమునివరుని నేత్రాగ్నిజ్వాలల దగ్ధులైరి. వారిని గంగోదకమునందడిపి యుత్తమగతింబొందింప భగీరథుఁడు యత్నించి గంగం బుడమికిఁదెచ్చి కృతకృత్యుఁడయ్యె. గంగ సగరసుతుల నుత్తమగతి నొందించుటకతన సగరవంశమువారిని మోక్షమనుసౌధము నెక్కించుటలో నిచ్చెన యయ్యెను.

విష్ణుపాదమునుండి వెలువడినగంగ మ్రాకుచీలిక లయ్యెననియు, నందొకపాయ స్వర్గమున, నొకటిభువిని, నొకటి పాతాళమునఁబడి ప్రవహించెనని పురాణములుచెప్పును గాన, గంగ ముల్లోకముల జంగగొనునదయ్యెను. యమునానదింగూడి ప్రవహించునది గానఁ బతంగజప్రియసఖియయ్యె. కనఖలాచలమనుకొండ గంగాద్వారమునఁ గలదు.

ఆందోళతీర్థమున గంగ యావిర్భవించుటంజేసి గంగ కనఖలాచలయుంగంగ యయ్యెను. ఇది లయగ్రాహి యనువృత్తము. ఇరువదియారుఛందములలోఁ బుట్టినదిగాని నిది యిరువదియారక్షరముల కెక్కుడగ నక్షరములుగలపాదము గల్గియుండును. ఇట్టివానికి లక్షణకర్త లక్కతమునసే 'ఉద్ధురమాలావృత్తములు' అని పేరిడినారు. దీని ప్రతిపాదమునకు 39 మాత్రలుండును. ప్రతిపాదము, భ,జ,స,న,భ,జ,స,న,భ,య, అను గణములతో నడుచును. ప్రతిపాదమునను, 11,21,31, మాత్రలపైఁ బ్రాసయతి యుండును. యతి వేయరాదు. ప్రాసయతియే నిల్పవలెను.

మ. అవె దివ్యర్షినికేతనంబు లనసూయారుంధతీకర్ణపూ
రవివృద్ధార్భకకృష్ణసారగతిసంరంభంబు లింద్రద్రుమో
ద్భవనానావిధవల్కలాంచితబహిర్ద్వారప్రదేశంబు లా
హవనీయాదిహుతాశధూమపటలశ్యామీభవత్ప్రాంతముల్. 95

టీ. అనసూయా...సంరంభంబులు - అనసూయా = అత్రిపత్నియొక్కయు, అరుంధతీ=వసిష్ఠునిభార్యయొక్కయుం, కర్ణపూర = కర్ణాభరణములైన బాలతృణాదులచేత, వివృద్ధ=పోషింపఁబడిన, అర్భక=పిల్లలుగల, కృష్ణసార = నల్లనిచాఱలుగలలేళ్ల యొక్క, గతి=నడకయొక్క, సంరంభంబులు = త్వరలుగలవియుం; అనసూయారుంధతులు తాము కర్ణాభరణములుగఁ జేసికొనినతృణాదుల నాహారముగనిడి పిల్లలేళ్లఁ బ్రేమతోఁ బెంచుచుండ నాపిల్లలతల్లులగుజింక లవ్వారియాశ్రమముల స్వేచ్ఛగ విహరించుచున్నవని భావము. ఇంద్రద్రుమ...ప్రదేశంబులు-ఇంద్రద్రుమ = కల్పవృక్షమునుండి, ఉద్భవ=పుట్టిన, నానావిధ=వివిధములైన, వల్కల=నారచీరలతో, అంచిత=ఒప్పుచున్న, బహిర్ద్వారప్రదేశంబులు = వాకిటిలతలములుగలవి, ఆహవనీయాది...ప్రాంతముల్ - ఆహవనీయాది=ఆహవనీయము మొదలైన, హుతాశ=అగ్నులయొక్క, ధూమపటల = పొగలగుమిచే, శ్యామీభవత్ = నల్లనగు, ప్రాంతముల్ = సమీపప్రదేశములుగలవి, దివ్యర్షినికేతనంబులు = దేవర్షులగృహములు, అవె=అవిగో.

విశే. 'ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని' అని అగ్నులు ముత్తెఱంగులు. అలం. స్వభావోక్తి.

ఉ. అచ్చరపువ్వుఁబోండ్లు సరసామృతధారయుఁ గల్పవాటియుఁ
లచ్చియుఁ జందమామయుఁ దలంపులమానికముంఁదలంపఁ బై

పెచ్చులు దీనికి న్నెమరువెట్టుచు నందినియట్టు నాకుచుం
బచ్చికఁ [1]బండి యున్న యది భామిని! వేలుపుటావుఁ జూచితే. 96

టీ. అచ్చరపువ్వుఁబోండ్లున్ = అప్సరస్త్రీలును, సరసామృతధారయున్ = సరసమగునమృతంపుధారయు, కల్పవాటియున్=కల్పవృక్షపంక్తియు, లచ్చియున్ = లక్ష్మియును, చందమామయున్ = చంద్రుఁడును, తలంపులమానికమున్ = చింతామణియు, తలంపన్ = ఆలోచింపఁగ, దీనికిన్ = ఈకామధేనువునకు, పైపెచ్చులు = కొసరులు, నందినియట్టున్ = నందినియను తనదూడయొక్క కంఠమును, నాకుచున్, నెమరువెట్టుచున్ = నెమరువేయుచు, పచ్చికన్ = పచ్చికగలనేల, పండి = శయనించి, ఉన్నయది, భామిని = సత్య, వేలుపుటావున్ = సురలయావగు కామధేనువును, చూచితే = కాంచితివే.

వ్యా-విశే. అచ్చరలు, అమృతము, కల్పవృక్షములు, లక్ష్మి, చందమామ, చింతామణి, కామధేనువు-ఇవన్నియుం సముద్రముననే పుట్టినవి. కాని యీకామధేనువునకుఁ దక్కినవన్నియుం కొసరులే యగుచున్నవి. అనఁగా దీనితో నయ్యవేవియు సాటినొందఁ జాలవనిభావము. పైపెచ్చు = కొసరు; అనఁగా బ్రధానముగ నొకవస్తువుంగొని పిదప నాకొన్నదానికై కొసరుగాఁ బుచ్చుకొనిన చిల్లరవస్తువు. అచ్చర. ప్ర. అప్సరాః. పువ్వుఁబోఁడి = పుష్పమువలె మనోజ్ఞమైన యొప్పిదముగలది. రూ. అ. పూవుఁబోఁడి. పువుఁబోఁడి. పూఁబోఁడి.

చ. కనకమహీధ రేంద్రు నలిక[2]స్థితపర్వత రాజపట్టబం
ధనమును బోనికోటయు ఘనంబగు తన్మకుటంబుకైవడిం
దనరెడువైజయంతమును దవ్వులఁ గానఁగవచ్చెఁ జూచితే
యనిమిషరాజధాని యిది హాయనమాత్రకురంగలోచనా! 97

టీ. హాయనమాత్రకురంగలోచనా = ఒక్కసంవత్సరముమాత్రమే వయసుకల లేడివంటి కన్నులుగలదాన, కనకమహీధరేంద్రు...బంధమునుబోని - కనకమహీధరేంద్రు = మేరుగిరివరముయొక్క, అలిక = ఫాలప్రదేశమున, స్థిత = ఉన్నటువంటి, పర్వతరాజపట్టబంధనమునుబోని=పర్వతరాజత్వమును బ్రకటించుపట్టముయొక్క కట్టును బోలిన, కోటయుం = కోటయును, ఘనంబగు = గొప్పదైన, తన్మకుటంబుకైవడిన్ = ఆపర్వతరాజుయొక్క కిరీటమువలె, తనరెడు=ఒప్పునట్టి, వైజయంతమును = వైజయంత మను మేడయు, దవ్వులన్ = దూరమునుండి, కానఁగవచ్చెన్ = కాన్పించెడిని. ఇది, అనిమిషరాజధాని = దేవేంద్రముఖ్యపట్టణమగునమరావతి, చూచితే = చూచితివా?

---

1 దండి; లేఁడి. 2 స్థలసుస్థిరపట్టసూత్రబంధనమును.

భా. మేరుపర్వతశిఖరముననున్న దేవేంద్రునికోట పర్వతరాజునొసటఁ గట్టిన పట్టబంధమువలెను, నాతనిప్రాసాదమగు వైజయంత మప్పర్వతరాజుశిరమునఁ బ్రకాశించు కిరీటమువలెను, నొప్పుచున్నవని భావము.

విశే. రాజునొసటఁ బట్టాభిషేకాదులఁ బట్టముంగట్టుట యాచారము. అనిమిషులు = ఱెప్పపాటులేనివారు. జయంతము-ఇది యింద్రునిమేడపేరు.

ఉ. శ్రీలఁ జెలంగు నీసురపురిం గమనీయమహానుభావతం
బోలఁగ లేక యోటములఁ బొంది భజింపఁగ వచ్చినట్టు లు
త్తాలదుకూలకల్పితపతాకలతోఁ గడు నొప్పు నన్యది
క్పాలపురంబులో యనఁగఁ బార్శ్వములం దివిషద్విమానముల్. 98

టీ. శ్రీలన్ = సిరులచే, చెలంగు = ఒప్పునట్టి, ఈసురపురిన్ = ఈయమరావతిని, కమనీయమహానుభావతన్ = సొగసైనగొప్పమహిమవిషయమున, పోలఁగన్ = సాటిచెందుటకు, లేక = చాలక, ఓటములన్ = అపజయములను, పొంది, (దిక్పాలపురంబులు), భజింపఁగన్ = సేవించుటకై (అమరావతిని) వచ్చినట్టులు = వచ్చినరీతిగ, ఉత్తాల...పతాకలతో-ఉత్తాల = మిక్కిలిపొడవైన, దుకూల=పట్టుబట్టలచే, కల్పిత= నిర్మింపఁబడిన, పతాకలతోన్ = ధ్వజములతోడ, కడున్ = మిక్కిలి, ఒప్పు=ప్రకాశించు, అన్యదిక్పాలపురంబులో = ఇతరదిక్పాలురపట్టణములో, అనఁగన్=అనునట్లు, పార్శ్వములన్ = కెలంకులందు, దివిషద్విమానములు = సురలవిమానములు, ఒప్పును.

భా. అమరావతీపార్శ్వములఁగల దేవవిమానములు సురపురిమాహాత్మ్యమున కోడి దానిని సేవింపవచ్చిన యన్యదిగీశులపట్టణములో యనున ట్లొప్పెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

చ. మరలక జన్యభూమి నణుమాత్రభయంబును లేనివీరు ల
ధ్వరము లనేకము ల్విధియుతంబుగఁ జేసినభూసురేంద్రు లు
ద్ధురభవపాశబంధములఁ ద్రుంచినయోగికులావతంసు లీ
సురపుర*కామినీవదనచుంబనమాత్రకృతార్థమానసుల్. 99

టీ. జన్యభూమిన్=యుద్ధరంగమున, మరలక=వెనుదీయక, అణుమాత్రభయంబును = స్వల్పమైనభయమును, లేని = లేనట్టి, వీరులు = శూరులు, అధ్వరములు = యజ్ఞములు, అనేకములు = పెక్కులు, విధియుతంబుగన్ = యథావిధిగ, చేసిన = ఒనర్చిన, భూసురేంద్రులు=బ్రాహ్మణశ్రేష్ఠులు, ఉద్ధుర...బంధములన్-ఉద్ధుర=మిక్కిలి బలముకలవైన, భవపాశబంధములన్=సంసారరజ్జువులకట్టులను, త్రుంచిన=త్రెంపినొన్న,

* ధారికావదన.

యోగికులావతంసులు=మునికులశ్రేష్ఠులు, ఈసుర...మానసుల్-ఈసురపురకామినీ = ఈ స్వర్లోకస్త్రీలయొక్క, వదనచుంబనమాత్ర = మోము ముద్దుగొనుటమాత్రముచేతనే, కృతార్థ=ధన్యమైన, మానసుల్=మదిగలవారు.

భా. యుద్ధభూమిని వెను చూపక పోరాడి ప్రాణముల గోల్పోవువారును, యథావిధి యజ్ఞములాచరించిన మహీసురవరులును, సంసారపాశములకట్టులఁ ద్రెంపికొన్న మునిపుంగవులును, దేవకాంతలమోముల ముద్దుగొనుట మాత్రముననే తమ్ము తాము ధన్యులంగాఁ దలంచుకొందురు. అనఁగాఁ వైకృత్యముల కిదే ఫలమని తాత్పర్యము.

వ్యా-విశే. 'ఈసురపురి' అను సమాసపదమునందలి 'ఈ' అనునది 'సురపురి' అను సిద్ధసమాసైకదేశమగుపదముతో నన్వయించుచున్నది. సమాసైకదేశమగుపదముతో నన్వయించుగలిని విశేషణము నిల్పుటకే ఏకదేశాన్వయమందురు. ఇయ్యదొకదోషముగా లక్షణకర్తలు భావింతురు. తెనుఁగునఁ గొన్నియెడల నియ్యదదుష్టమని లక్షణకర్తలు మహాకవిప్రయోగప్రదర్శనపురస్సరముగ నెన్నిరి. సంస్కృతవ్యాకరణకర్తలుగూడ 'దేవదత్తస్య గురుకులం' అను నిట్టి యుదాహృతు లేకదేశదోషదూషితములు గావని చెప్పిరి. ప్రకృత మిందు 'ఈ' యనుదానిని "సమాసఘటితం బీశబ్దమెుక్కొకచో సూచనార్థమగు" అను ప్రౌఢవ్యాకరణసూత్రముననుసరించి సూచనార్థకముగ నెన్నఁదగునని [illegible]చును. మఱియు మహాకవిప్రయోగముల 'అ. ఈ' అనునవి సిద్ధసమాసమధ్యగతపదములతో నన్వయించుట చూపట్టును. కావున నిది యదుష్టమని చెప్పనొప్పును. లేదా [illegible]దు 'యోగికులావతంసులుర్' అని మూఁడవపాదపుఁదుదిని బాఠము నంగీకరించి [illegible] [illegible]దోషమునకుఁ దావేలేదు. కాని శ్రీకృష్ణుఁడు సత్యకెదుటగలవానిఁ జూపుచున్న [illegible]డు గాన నిచ్చో 'ఈసురపురి' అనియుంటయే సరసమని యెన్నవలసియుండును.

[illegible]. సారంగాక్షుల*చూపుచోఱగముల న్జగ్గొండల న్మోహదు
ర్వారావర్తముల న్మునింగి దరిఁ జేరన్రాక యుప్పొంగు సం
[illegible]ంభోనిధి సత్క్రియాతరణి నిశ్శంక న్సముత్తీర్ణుఁడై
[illegible]డు స్సజ్జననావికుండు మదిరాక్షీ! యీపురద్వీపమున్. 100

టీ. మదిరాక్షీ = మదముకప్పిన కన్నులుగలదాన! సజ్జననావికుండు = సత్పురు[illegible] [illegible]డుపువాఁడు, సారంగాక్షులచూపుచోఱగముల్ = లేడికన్నులంబోలు [illegible] [illegible]లయొక్క దృష్టులను చేఁపలగుంపునందును, చన్గొండలన్=కుచములను [illegible], మోహదుర్వారావర్తముల్ = మోహమను నని వార్యములగు సుడు

* [illegible]చోఱగముల్

లందును, మునింగి=మునిఁగి, దరిన్=ఒడ్డును, చేరన్=చేరుటకు, రాక=వీలులేక, ఉప్పొంగు=వృద్ధినందునట్టి, సంసారాంభోనిధిన్ = సంసారమనుసముద్రమును, సత్క్రియాతరణిన్=సత్కర్మలనుపడవచే, నిశ్శంకన్=నిర్భయముగా, సముత్తీర్ణుఁడై = దాఁటినవాఁడై, ఈపురద్వీపమున్ = ఈపట్టణమనుదీవిని, చేరును=పొందును.

భా. ఓసత్యభామ! సముద్రమునఁబడినవాఁడు చేఁపలకును, గొండలకును, సుడులకును జిక్కి యొడ్డుఁజేరక చింతించుగతిని మనుజుఁడు, వనితలదృష్టులను చేఁపలకును, జన్నులనుకొండలకును, మోహమనుసుడులకును వశుఁడై సంసారమను సాగరమును దాఁటఁజాలకయుండు. అట్టివానిని దరిం జేర్ప సత్కర్మకలాపము తరణి యగును. అత్తరణిమూలమున నీభవసాగరముందాటి యవ్వాఁ డీపురమనుదీవినే చేరుంజుమా! సత్కర్మకలాపమే స్వర్గముం జేర్ప వలఁతి యని తాత్పర్యము. అలం. రూపకము.

క. అని నాకపురమహత్త్వము
వనితకుఁ దెలుపుచును హర్షవశమానసుఁడై
దనుజకులవైరి చని యొ
య్యనఁ గాంచనమేదినీధరాగ్రక్షోణిన్. 101

టీ. అని, దనుజకులవైరి = రాక్షసవంశశత్రువు, నాకపురమహత్త్వమున్=స్వర్గపట్టణమాహాత్మ్యమును, వనితకున్ = సత్యభామకు, తెలుపుచును, హర్షవశమానసుఁడై=సంతోషాయత్తచిత్తుఁడై, చని=అరిగి, ఒయ్యనన్ = మెల్లఁగ, కాంచనమేదినీధరాగ్రక్షోణిన్ = బంగరుకొండయొక్కశిఖరముల ప్రదేశములందు, 103 వ పద్యముతో నన్వయము.

చ. పతగవిభుండు మింటిపయి భంజలికామురళీ*సుడాల వ
ల్గితముల రా నెదుర్పడిన ఖేచరవర్గము లోసరించి య
ద్భుతముగ మ్రొక్క లేనగవుతోఁ గనుఁగొంచు వదాన్యుఁడై చికీ
శితఖురటంకచంద్రకితసిద్ధసరిత్తటమార్గసీమలన్. 102

టీ. పతగవిభుండు=గరుత్మంతుఁడు, మింటిపయిన్ = ఆకాశముపై, భంజలికామురళీసుడాలవల్గితములన్ = "భంజలిక, మురళి, సుడాల" అనుగతివిశేషములచే, రాన్=రాఁగా, ఎదుర్పడిన ఖేచరవర్గములు = ఎదురుగావచ్చు దేవతలసమూహములు, ఓసరించి=ఒదిగి (ప్రక్కఁబాఱి), అద్భుతమున్ = అచ్చెరువుగ, మ్రొక్కన్=నమస్కరింపఁగా, లేనగవుతోన్ = మందహాసముతో, కనుఁగొంచున్=చూచుచు, వదాన్య...

---

* సృతాల.

శిమలక్-వదాన్య = మిక్కిలి దానముచేయునట్టి, నైచికీ=ఆవుయొక్క (కామధేనువు యొక్క), శిత=వాఁడియైన, ఖురటంక = డెక్కలను నులులచేత, చంద్రకిత=నెమలిపురి కన్నుల యాకారముగల గుండ్రనిజాడకలదిగాఁ జేయఁబడిన, సిద్ధసరిత్తట = గంగాతీర మందలి, మార్గసీమలక్=బాటలతలములందు, ముందటిపద్యముతో నన్వయము.

విశే. భంజలిక-మురళి మొదలగునవి యశ్వగతివిశేషములు. ఏనను నెవరి కయ్యది వాహనమగునో యద్దాని వారి వారువముగనే భావించి యీగతివిశేషముల దానియందు వర్ణించుట నైజమయ్యె.

క. సరసబిసవిసరముహు*రా,హరణోద్ధురహంససంసదారవదీర్ఘీ
కరణచణగంధవహములు, శరీరములసేద దేర్పఁ జనుదెంచె రహిన్.

టీ. సరస ..గంధవహములు-సరస = రసవంతములగు, (వాఁడని), బిసవిసర = తామరతూఁడులసమూహమును, ముహుః=మాటిమాటికి, ఆహరణ=తినుటచేత, ఉద్ధుర= విజృంభించునట్టి, హంససంసత్ = హంసలగుంపుయొక్క, ఆరవ=ధ్వనులను, దీర్ఘీకరణ= పొడిగించుటయందు, చణ=సమర్థములైన, గంధవహములు = కమ్మగాలులు, శరీరముల సేదక్ = ఒడలులయాయాసమును, తేర్పక్=పోఁగొట్టఁగా, రహిక్ = ఆనందముతో, చనుదెంచెక్ = వచ్చెను. కర్త. దనుజకులవైరి. 101-102-103 పద్యముల కొకే యన్వ యము.

విశే. 'ముహురాహరణ' అనుచో 'ముహురుద్ధరణ' అను పాఠము గానంబడి యెడి, 'ఉద్ధరణ=పెల్లగించుట' అని యాపక్షమునవర్థము. తామరతూండ్ల నాహరించు హంసములయారవముల వృద్ధినొందించునదనుటంజేసి యీవాయువు పద్మాకరములమీఁది నుండియే యేతెంచుచున్నదని విశదమగుచున్నది. పద్మాకరములపైనుండి వచ్చుటకతన గాలియందు శైత్యము, సౌరభ్యమును గలవని విశదమయ్యెను. హంసలకు మిగుల సంత సము సంభవింపఁజేయుచున్న హంస లధికముగ నారావములు గావించుట పొసఁగదు గావునను, నట్టిసంతోషమునకు మందమారుతమే కారణముగానోపుటకతనను, హంస సంసదారవపదముచే మాంద్యమును సూచితమయ్యెను.

శా. సన్మూర్ధక్షమ! ధీనిబంధనవిధాసంక్రందనాచార్య! శూ
రమ్మన్యాచలవజ్రపాత! జగతీరక్షాంబుజాక్షా! శర
ధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యాప్రోద్భవాతీరభా
గుమ్మగ్గూరి శివంసముద్రపురవప్రోన్మూలనాడంబరా! 104

---

* రుద్ధరణో.

టీ. సమర్దక్షమ = యుద్ధమందుశక్తుఁడా! ధీనిబంధనవిధాసంక్రందనాచార్య-ధీ=బుద్ధియొక్క, నిబంధన=ఏర్పాటుయొక్క, విధా = రీతివిషయమున, సంక్రందనాచార్య = బృహస్పతియైనవాఁడా! శూరమ్మన్య... పాత-శూరమ్మన్య=శూరులమని యనుకొనువారలనే, అచల=కొండలను, వజ్రపాత = వజ్రాయుధప్రహారమైనవాఁడా! జగతీరక్షాంబుజాక్షా = భూపాలనమున విష్ణువైనవాఁడా! శరధ్యమ్మార్గస్థ...డంబరా-శరధి=సముద్రముయొక్క, అమ్మార్గస్థ-అప్=నీళ్లయొక్క, మార్గ = జాడను, స్థ=ఉన్నట్టియుఁ, దశాస్య=రావణునియొక్క, రాజ్య=రాజ్యముతో, సమ = తుల్యమైనట్టియు, సహ్యా = సహ్యాపర్వతములయందు, ప్రోద్భవ=పుట్టినదగు కావేరీనదియొక్క, తీర=ఒడ్డును, భాక్ = పొందినట్టియుఁ, ఉమ్మత్తూరు శివంసముద్రపుర = 'ఉమ్మత్తూరు, శివంసముద్రపురము' అనెడు పట్టణములయొక్క, వప్ర=ప్రాకారమును, ఉన్మూలన = పెల్లగించుటయొక్క, ఆడంబరా=విజృంభణముగలవాఁడా!

వ్యా-విశే. ఇందుఁ గృష్ణరాయల దక్షిణదేశవిజయము ప్రకటితమైనది. శూరమ్మన్య' రూ. అ. శూరమాని.

క.. తిరుమలదేవీవల్లభ!, కరుణామయహృదయ! రాజకంఠీరవ! యీ
శ్వరనరసభూపురందర, వరనందన! బాసదప్పవరగండాంకా! 105

టీ. తిరుమలదేవీవల్లభ = తిరుమలదేవికిఁ బ్రియుఁడా! కరుణామయహృదయ= దయాప్రచురమగు మదిగలవాఁడ! రాజకంఠీరవ=రాజసింహ! ఈశ్వరనరసభూపురందర వరనందన = ప్రభువగు నరసరాజను భూలోకదేవేంద్రునియొక్క యుత్తమపుత్త్రుఁడా! బాసదప్పవరగండాంకా! 'బాసదప్పవరగండ' అనెడు బిరుదముగలవాఁడా!

స్రగ్విణి.—
నాగమాంబాధిభూనారసింహాత్మజా!
భోగలీలాపరాభూతసంక్రందనా!
త్యాగవిద్యానిషద్యాయితప్రాభవా!
సాగరాంతక్షమాసంపదేకాస్పదా! 106

టీ. నాగమాంబా...త్మజా-నాగమాంబా = నాగమాంబయొక్క, అధిభూ = అధిపతియైన (పతియైన), నారసింహ = నరసింహరాజునకు, ఆత్మజా = కుమారుఁడైన వాఁడా! భోగ...సంక్రందనా-భోగలీలా = భోగములవిలాసముచే, పరాభూత = తిరస్కృతమైన, సంక్రందనా = దేవేంద్రుఁడుగలవాఁడ! త్యాగ...ప్రాభవా - త్యాగ విద్యా=దానవిద్యకు, నిషద్యాయిత=అంగడియైన, ప్రాభవా = మహిమగలవాఁడ! సాగ

గాంత...స్పదా - సాగరాంత = సముద్రము తుదిగాఁగల, క్షమా=భూమియందలి, సంపత్ = ఐశ్వర్యములకు, ఏక=ముఖ్యమైన, ఆస్పదా=స్థానమైనవాఁడా.

విశే. ఇది స్రగ్విణీవృత్తము. 4 రగణము లొక పాదమునకుండును. ఇట్లే తక్కిన మూఁడుపాదము లుండును. ప్రతిపాదమున మూఁడవగణము మొదటియక్షరము యతి స్థానము.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన పారిజాతాపహరణంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



# తృతీయాశ్వాసము.



మహితగేహా! యుత్కల
భూమీధవదర్పహరణభుజసార! సుధా
ధామకులజలధికౌస్తుభ!
రామాపాంచాల! కృష్ణరాయనృపాలా! 1

టీ. శ్రీ...గేహా-శ్రీ=సంపదలతో, మహిత=కూడియున్న, గేహ=గృహముకలవాఁడ!, ఉత్కల...సార - ఉత్కలభూమీధవ=ఉత్కలదేశపురాజుయొక్క, దర్ప=గర్వమును, హరణ = నశింపఁజేయునట్టి, భుజసార = భుజములబలముగలవాఁడ, సుధాధామ...కౌస్తుభ-సుధాధామకుల=చంద్రవంశమనెడి, జలధి=సముద్రమునకు, కౌస్తుభ=కౌస్తుభరత్నమైనవాఁడా! రామాపాంచాల=స్త్రీలకుఁ బాంచాలజాతిపురుషుఁడైనవాఁడా!, కృష్ణరాయనృపాలా=కృష్ణరాయభూపా!

తే. అవధరింపుము జనమేజయక్షితీశ,వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
గగనగంగాప్రతీరోపకంఠభూమి, నల్లనల్లన నేతెంచునవసరమున. 2

టీ. అవధరింపుము=సావధానముగ నాకర్ణింపుము. అమ్మౌనివల్లభుండు = ఆమునిశ్రేష్ఠుఁడగు వైశంపాయనుఁడు, జనమేజయక్షితీశవరునకు = జనమేజయుఁడను రాజశ్రేష్ఠునకు, ఇట్లు=ఈరీతిగ, అనున్=అనెను. గగన...భూమిన్=గగనగంగా - మందాకినియొక్క, ప్రతీర=ఒడ్డుయొక్క, ఉపకంఠభూమిన్ = సమీపప్రదేశమున, అల్లనల్లనన్=అంతంత, ఏతెంచు=వచ్చునట్టి, అవసరమునన్=సమయమున (కృష్ణుఁడుకర్త.)

ఉ. అంతకు మున్న నారదమహామునిచే మఘవుండు కంసదై
త్యాంతకురాక దా నెఱిఁగి యభ్రమువల్లభు నెక్కి సంభ్రమా
క్రాంతమనస్కుఁడై యెదురుగాఁ జనుదెంచె జయంతుఁడుం దిశా
కాంతులు మేనకాదిగణికానివహంబులు వెంటఁ గొల్వఁగన్. 3

టీ. అంతకున్ మున్న = అంతకుఁబూర్వమే, మఘవుండు=ఇంద్రుఁడు, నారదమహామునిచే, కంసదైత్యాంతకురాకన్ = శ్రీకృష్ణునిరాకను, తాన్=ఎఱిఁగి, అభ్రము

నల్లభుఁ బైరావతమును ('అభ్రము' అనునది యైరావతముభార్యపేరు), సంభ్రమాక్రాంతమనస్కుఁడై = త్వరచే నాక్రమింపఁబడిన మదిగలవాఁడై, జయంతుఁడున్ (ఇంద్రునికుమారుఁడు) దిశాకాంతులున్=దిక్పతులును, మేనకాదిగణికానివహంబున్ = మేనక మొదలైన దేవవేశ్యలసమూహమును, వెంటన్, కొల్వఁగన్=సేవింపఁగా, ఎదురుగాన్, చనుదెంచెన్=వచ్చెను.

స్వర్గమున శ్రీకృష్ణు నింద్రాదులు సేవించుట.

చ. అమరవిభుండు దూరముననంబుజనాభునిఁ గాంచి సంభ్రమో
ద్గమమునఁ జేతియంకుశముఖంబునఁ గుంభములూఁది కుంచితా
గ్రిమచరణంబున న్మదకరిన్ డిగి యంసవిలంబికల్పచే
లము నడుమ న్బిగించుచు నిలానిహితాత్మశిరఃకిరీటుఁ డై. 4

టీ. అమరవిభుండు = దేవేంద్రుఁడు, దూరమునన్, అంబుజనాభునిన్=శ్రీకృష్ణుని, కాంచి=చూచి, సంభ్రమోద్గమమునన్ = త్వరయొక్క పైకిలేచుటచే, చేతియంకుశముఖంబునన్=హస్తమునందలి యంకుశాగ్రముచే, (ఏనుఁగును గుంభమునదిమి వశీకరించికొనుసాధన మంకుశము), కుంభములు=కుంభస్థలములను (ఏనుఁగుతల నడుమం గలపల్లమున కిరువంకలనుండు నెత్తైన రెండుప్రదేశములను రెండుకుంభములుగా వ్యవహరించుటచే రెండు కుంభములని బహువచనము ప్రయుక్తమయ్యెను.) ఊఁది = అణఁచిపట్టి, కుంచితాగ్రిమచరణంబునన్ = వంచఁబడిన ముందటికాలియందుండి, మదకరిన్=ఐరావతమును, డిగి=దిగి, (ఏనుఁగు ముందటిపాదము నువంచఁగాఁ బిదప నేనుఁగుపైనున్నవాఁడా పాదముపైనుండి క్రిందికిదిగుట సహజము), అంసవిలంబికల్పచేలమున్ =భుజములనుండి వ్రేలాడు కల్పవృక్షసంబంధమగువస్త్రమును, నడుమన్=మధ్యమందు, బిగించుచున్ = బిగియునట్లుకట్టుచు, ఇలా... కిరీటుఁడై-ఇలా=భూమియందు, నిహిత = ఉంచఁబడిన, ఆత్మశిరః=తనయొక్క, కిరీటుఁడై = కిరీటముగలవాఁడై, (అనఁగా శిరసు భువినంటునటుల నమస్కరించెననుట.)

భా. ఇంద్రుఁడు దూరమునుండియే శ్రీకృష్ణుంగాంచి యంకుశాగ్రముచే నైరావతము శిరసునదిమి యది మోఁకాలు వంచఁగా నద్దానినుండి దిగి భుజముపైనుండువస్త్రమును నడుమునకుఁ గట్టి తనవెంటఁ దనయుఁడును, దిక్పతులును, దేవవేశ్యలును రాఁగ, నెదురేగి శిరస్సు భూమినంటునట్లు నమస్కరించెను.

టి. నడుమునకు వస్త్రమునుగట్టి నమస్కరించునాచారము విజయనగరరాజుల కాలములందు మర్యాదయైయుండినట్లు తెలియవచ్చెడిని. ఇట్లే విజయనగరరాజులకాలమున మహీభృత్తులు ప్రవర్తించిరి కాన నిది తప్పక యప్పటియాచారమే యననొప్పును.

చ. జడిగొని సమ్మదాశ్రుకణజాలము లొల్కఁగ రోమహర్షముల్
బడిబడి మేనఁ బాదుకొన భక్తినివేశతరంగితాత్ముఁడై
యడుగులమీఁద వ్రాలె దివిజాగ్రణి తత్కుశలంబు నెమ్మితో
నడిగెడురీతి మౌళికుసుమాగతషట్పదపంక్తి మ్రోయఁగన్. 5

టీ. దివిజాగ్రణి=ఇంద్రుఁడు, జడిగొని = ధారగొని, సమ్మదాశ్రుకణజాలము = ఆనందబాష్పబిందుసమూహములు, ఒల్కఁగన్=జారఁగా, రోమహర్షముల్=హర్షమువలనిపులకలు, మేనన్=శరీరమున, బడిబడి=వరుసగా, పాదుకొనన్ = నిల్వఁగా, భక్తినివేశతరంగితాత్ముఁడై = భక్తియొక్కపొందికచేత నుప్పొంగినమదిగలవాఁడై, తత్కుశలంబున్=ఆ శ్రీకృష్ణునిక్షేమమును, నెమ్మితోన్=ప్రేమతో, అడిగెడురీతిన్=ప్రశ్నించుగతిని, మౌళికుసుమాగత...పంక్తి-మౌళి = శిరస్సునందలి, కుసుమ = పుష్పములనుండి, ఆగత=వచ్చిన, షట్పద=తుమ్మెదలయొక్క, పంక్తి = వరుస, మ్రోయఁగన్ = ధ్వనిచేయఁగా, అడుగులమీఁద=పాదములపైని, వ్రాలెన్=ఒరఁగెను.

భా. ఇంద్రుఁ డపు డానందబాష్పధారలొలుక, సంతసమునఁ బులకలు మైజాదుకొన, శిరసున నలంకారముగ నునిచికొనినపుష్పములనుండి యేతెంచు తుమ్మెదలయూరవము శ్రీకృష్ణునికుశలము నడుగు మాటలసద్దువలె నొప్ప, భక్తిమీఱ శ్రీకృష్ణునియడుగులపైఁబడెను. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. ఆదనుజాపహర్తయు భుజార్గళము ల్వేసఁ జాఁచి యంచితా
మోదవికాసవన్నయనముగ్ధసరోరుహపంక్తిఁ బూజ ల
త్యాదరలీలఁ జేయునమరాధిపుఁ గౌఁగిటఁ జేర్చె నూతనాం
భోదము సానుమచ్ఛిఖరము న్రభసంబునఁ గప్పుకైవడిన్. 6

టీ. ఆదనుజాపహర్తయున్=ఆరాక్షసాంతకుఁడగుకృష్ణుఁడును, భుజార్గళముల్=గడియలంబోలుభుజముల, వెసన్=శీఘ్రముగా, చాఁచి, అంచితా...పంక్తిన్-అంచిత=ఒప్పుచున్న, ఆమోద=సంతోషముచేత, వికాసవత్=వికాసముగల, నయన = నేత్రములనే, ముగ్ధ=సుందరమైన, సరోరుహపంక్తిన్ = పద్మములచాలుచే, (అని నేత్రపరము) అంచిత=ఒప్పుచున్న, ఆమోద=పరిమళముగలవియు, వికాసవత్ = వికాసముగలవియు నగు, నయనముగ్ధసరోరుహ=కన్నులనెడు సుందరములైన పద్మములయొక్క, పంక్తిన్=చాలుచే, (అని పద్మపరము.) పూజలు=అర్చనలు, అత్యాదరలీల=మిగుల గౌరవముతో, చేయు=ఒనర్చునట్టి, అమరాధిపున్=దేవేంద్రుని, నూతనాంభోదము = క్రొత్తమేఘము (వార్షికమేఘమనుట), సానుమచ్ఛిఖరమున్=పర్వతశిఖరమును, రభసంబునన్=శీఘ్రముగ, కప్పుకైవడిన్=అచ్ఛాదించురీతిని, కౌఁగిటన్=కౌఁగిలియందు, చేర్చెన్.

విశే. సహస్రాక్షుఁడుగాన నేత్రపద్మముల చాలసెను. సానుమచ్ఛిఖరముపగిది దేవేంద్రుఁడును నంబోధముపలె శ్రీకృష్ణుఁడును నుండిరని యెన్నునది. అలం. శ్లేషోత్థాపితరూపకము. ఉపమ.

మ. అనలుం డంజలిసేసె నంతకుఁడు సాష్టాంగంబు గావించె మ్రొ
క్కె నిశాచారి ప్రచేతసుండు దెలచెం గేల్మోడ్చె సారంగవా
హనుఁ డర్థేశుఁడు వందనం బిడియె నీహారాంశుకోటీరుఁడున్
వినతుండయ్యె యదుప్రవీరునకు నుద్వేలప్రమోదంబునన్. 7

టీ. అనలుండు=అగ్నిదేవుఁడు, యదుప్రవీరునకున్ = యదువంశోత్తమవీరుఁడగు శ్రీకృష్ణునకు, ఉద్వేలప్రమోదంబునన్ = అధికమగుసంతోషముతో, అంజలి = దోసిలిని, చేసెన్=ఒనర్చెను. అనఁగా నమస్కరించెననుట. యముఁడు, సాష్టాంగము = సాష్టాంగనమస్కారము, గావించెన్=చేసెను. నిశాచారి = నైరృతుఁడు, మ్రొక్కెన్, ప్రచేతసుండు=వరుణుఁడు, తెలచెన్=నమస్కరించెను. సారంగవాహనుఁడు = లేడి వాహనముగాఁగలవాయువు, కేల్మోడ్చెన్ = అంజలియొనర్చెను. అర్థేశుఁడు = ధనపతియగు కుబేరుఁడు, వందనంబు=నమస్కృతి, ఇడియెన్=పెట్టెను, నీహారాంశుకోటీరుఁడున్-నీహారాంశు=చంద్రుఁడు, కోటీరుఁడు = కిరీటమునఁగలవాఁడు, ఈశానుఁడు, వినతుండయ్యెన్=నమ్రుఁడయ్యెను.

విశే. నిశాచారి = రాత్రిసంచరించువాఁడు = రాక్షసుఁడు = నైరృతి. సాష్టాంగము:—వక్షము, శిరస్సు, దృష్టి, మనస్సు, మాట, పాదములు, చేతులు, జానువులు ఇవి యష్టాంగములు. వీనితోఁజేయు నమస్కృతి సాష్టాంగము.

శా. వారిం జూచి రథాంగపాణి సరసవ్యాహారలీల న్దర
స్మేరాపాంగవిలోకనక్రియల సంప్రీతాత్ములం జేసి గో
త్రారీ! రమ్ము గజమ్ము నెక్కుమని నాగారాతిపై నెక్కెఁ దా
నారంభాకరచామరానిలము మార్గశ్రాంతి దూలింపఁగన్. 8

టీ. రథాంగపాణి = చక్రము హస్తమందుఁగల శ్రీకృష్ణుఁడు, వారిన్ = ఆ నమస్కరించువారిని, చూచి, సరస...లీలన్-సరస=రసయుక్తమైన, వ్యాహార = మాటల యొక్క, లీలన్=విలాసముచేతను, దరస్మేర...క్రియలన్-దరస్మేర = మందహాసయుక్తములైన, అపాంగవిలోకన = క్రేఁగంటిచూపులయొక్క, క్రియలన్ = వ్యాపారముల చేతను, సంప్రీతాత్ములన్ = సంతుష్టినందింపఁబడిన మదిగలవారినిగా, చేసి, గోత్రారీ =

కొండలకు శత్రువగు నోయింద్రా! రమ్ము, గజమ్మున్ =ఏనుఁగును, ఎక్కుము, అని, నాగారాతిపైన్ = పాములకుశత్రువగు గరుడునిపై, తారా...నిలము-తారా, రంభా, అను నప్సరస్త్రీలయొక్క, కర=హస్తములందలి, చామర = వింజామరములసంబంధమైన, అనిలము=గాలి, మార్గశ్రాంతిన్ =మార్గాయాసమును,తూలింపఁగన్ =పోఁగొట్టఁగ, ఎక్కెన్ =అధిష్ఠించెను.

భా. శ్రీకృష్ణుఁడు తనకు నమస్కరించు కొండఱను సరసంపుఁబలుకుల చేతను, కొండఱను క్రేఁగంటిచూపుల ప్రసారముల చేతను గారవించి, యింద్రుని గజము నెక్కుమని యానయిడి, రంభాద్యప్సరసలు తన్ను వింజామరములుపట్టి వీచుచు సేవింప నెలమి తోడ గరుడు నధిష్ఠించెను.

క. తక్కినదిశాధినాథులు, నెక్కిరి నిజవాహనముల నెసఁగె హుడుక్కా
ఢక్కాపటహధ్వానము,లక్కజముగఁ బొంగి నింగి యఱచినభంగిన్.

టీ. తక్కిన=మిగిలిన, దిశాధినాథులున్ = దిక్పతులును, నిజవాహనములు = స్వవాహనములను, ఎక్కిరి, హుడుక్కా...ధ్వానములు - హుడుక్కా, ఢక్కా, పటహ అను వాద్యవిశేషములయొక్క, ధ్వానములు=శబ్దములు, పొంగి=నిండి, నింగి = ఆకాశము, అఱచినభంగిన్ =కూసినరీతిని, అక్కజముగన్ =ఆశ్చర్యముగ, ఎసఁగెన్ = అతిశయించెను.

ఉ. ఆయెడ సిద్ధకింపురుషయక్షవసుప్రముఖామరావళిం
బాయఁ దొలంగుమంచు శతమన్యుఁడు సందడిపో బరాబరు
ల్సేయఁగ నల్లనల్ల నతసీకుసుమాసితదేహుఁ డేఁగె వై
హాయసవీథి నారదముఖామరసంయమికీర్తనీయుఁడై. 10

టీ. ఆయెడన్=ఆసమయమున, సిద్ధకింపురుషయక్షవసుప్రముఖామరావళిన్ = సిద్ధులు, కింపురుషులు, యక్షులు, వసువులు మున్నగు దేవతలపంక్తిని, పాయన్ = పాయఁగా, (అనఁగా నడుమ దారియుండునట్లు), తొలంగుము=మఱలుము, అంచున్, శతమన్యుఁడు = నూఱుయజ్ఞములం జేసిన దేవేంద్రుఁడు, సందడి = సమ్మర్దము, పోన్ = పోవునట్లు, బరాబరుల్ = హెచ్చరికలు, చేయఁగన్ =చేయఁగ, అల్లనల్లన్ = మెల్ల మెల్లఁగా, అతసీకుసుమాసితదేహుఁడు = నల్లని యవిసెపూవువలె నల్లనైన శరీరముగల వాఁడు; శ్రీకృష్ణుఁడు, నారదముఖా...సీయుఁడై-నారదముఖ = నారదుఁడు మొదలైన, అమరసంయమి = సురమునులచే, కీర్తనీయుఁడై = నుతిచేయఁబడువాఁడై, వైహాయసవీథిన్=ఆకాశమార్గమున, ఏగెన్=చనెను.

ఉ. అప్పుడు శౌరిఁ జూచు ప్రమదాతిశయంబు హృదంతరంబులం
జిప్పిల సంభ్రమించి కయిసేయు తెఱం గయథాతథంబుగాఁ
*గుప్పనఁ గూరి యొండొరులఁ గూడఁగనీక కడంగి వేలుపుం
గప్పురగందు లెక్కిరి ధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్. 11

టీ. వేలుపుంగప్పురగందులు=దేవతాస్త్రీలు, అప్పుడు=ఆసమయమున, శౌరిన్ = శ్రీకృష్ణుని, చూచు ప్రమదాతిశయంబు = చూడవలెనను సంతోషాతిశయము, హృదంతరంబులన్=మదిలో, చిప్పిలన్=నిండఁగా, సంభ్రమించి=త్వరపడి, కయి సేయు తెఱంగు= అలంకరించికొనురీతి, అయథాతథంబుగాన్ = తాఱుమాఱుగాఁగ, కుప్పనన్=పోకగా, కూరి=కూడి, ఒండొరులన్=వెఱవారిని, కూడఁగనీక=చేరఁగానీక, కడంగి = యత్నించి, ధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్ = ధగధగమని మెఱయుచున్న యెత్తైన హర్మ్యపంక్తులను, ఎక్కిరి.

విశే. యథా స్వీయథాయథమ్. యథాయథము కానిది యయథాయథము.

చ. అలఁదినచందనంబు వృథ యౌఁ జెమరింపఁగ సమ్మదాశ్రులన్
దొలఁచినయట్లు వోయెడుఁ గనుంగవకాటుక బేటులెత్తుఁ జె
క్కుల మకరీవిలాసము గగుర్పొడువ న్హరిఁ జూచువేళ నో
చెలి! కయిసేయకమ్మ యని చేడియయొక్కతె పిల్చె నెచ్చెలిన్. 12

ఇప్పద్యము మొదలుకొని 21-వ పద్యమువఱకు దేవవనితలకు శ్రీకృష్ణుని సందర్శించుటలోఁగల త్వరాతిశయ ముత్సాహము మున్నగునవి వర్ణితము లగుచున్నవి. సంస్కృతాంధ్ర కావ్యములం దిట్టివర్ణనములు సదృశములై సాధారణముగ గోచరించును.

టీ. హరిన్=శ్రీకృష్ణుని, చూచువేళన్ = చూచెడుసమయమున, అలఁదినచందనంబు=రాచుకొనినగంధము, చెమరింపఁగన్ = చెమ్మటపుట్టఁగా,వృథ=వ్యర్థము, ఔన్ = అగును. కనుంగవకాటుక = నేత్రద్వంద్వముయొక్కయంజనము, సమ్మదాశ్రులన్ = ఆనందబాష్పములచే, తొలఁచినయట్లు = కడిగివేసినరీతిని, పోయెడున్ = నశించెడిని, చెక్కులమకరీవిలాసము = చెక్కిళ్లయొక్క మకరికాపత్రరచనలసొగసు, గగుర్పొడువన్ = రోమాంచముజనింప, పేటులెత్తున్=పొరలెత్తును, ఓచెలి=ఓసఖి! కయిసేయకమ్మ= అలంకరించుకొనకమ్మ, అని, ఒక్కతె, చేడియ=వనిత, నెచ్చెలిన్=ప్రియసఖిని, పిల్చెన్=రమ్మని పిల్చెను.

భా. ఓసఖీ! శ్రీకృష్ణునిజూచునపుడు స్వేదము జనింపకమానదు. దాన మైపూఁత కరఁగిపోవును. కాటుక యానందబాష్పధారల కడిగివేయఁబడును. మకరికాపత్రరచ

* కుప్పలఁ గూరి.

నలు పులకలు లేచుట పొరలెత్తును. కావున నలంకరించుకొనుటలోఁ బ్రయోజన మగపడదు. అక్కారణమున నాప్రయత్నము మాని వేగ హరిఁజూడరమ్మని యొకచేడియ తనగాదిలిసఖిం బిలిచెను.

వ్యా-విశే. అగు=అవు=ఔ. కయి=కై. కయిసేయకమ్మ = కైసేయకుము+అమ్మ. శ్రీకృష్ణునింజూచునపుడు స్వేదోద్గమము, సాత్వికోదయము మున్నగునవి తప్పక కల్గ ననుటంజేసి శ్రీకృష్ణుఁడు సర్వమహాపురుషలక్షణలక్షితుండగు సుందరుండని తెలియ నయ్యెడు.

చ. వనిత యొకర్తు మున్కొని గవాక్షతలంబున నింతులుండుటం
గనుఁగొనఁ జోటు లేమి నొకకార్యముపేరిట బాలనోర్తు వం
చనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్ప్రతిజాలకంబు చే
కొని హరిఁ జూచెఁ గేకిసలుగొట్టుచు బోటులు దాని నవ్వఁగన్. 13

టీ. ఒకర్తు వనిత=ఒకస్త్రీ, మున్కొని=ముందుగొని, గవాక్షతలంబునన్=కిటికీయందు, ఇంతులు=స్త్రీలు, ఉండుటన్=ఉండుటచే, కనుఁగొనన్=(శ్రీకృష్ణుని) చూచుటకు, చోటు=స్థలము, లేమిన్=లేకపోవుటచే, ఒక కార్యము పేరిటన్ = ఒకానొకపని పేరుతో, ఓర్తు, బాలన్=ఒకకన్యను, వంచనన్=మోసముతో, తొలఁగంగన్=మరలి వచ్చునట్లుగా, పిల్చి, రభసంబునన్=శీఘ్రముగ, తత్ప్రతిజాలకంబు=తద్వనిత (కూర్చుండియున్న) గవాక్షదేశమును, బోటులు=(ఇతర)వనితలు, దానిన్ = ఆతావును బోఁగొట్టుకొనినవనితను, కేకిసలు = కరతాళములు, కొట్టుచున్, నవ్వఁగన్=పరిహాసము చేయఁగా, హరిన్=శ్రీకృష్ణుని, చూచెన్.

భా. ఒకవనిత శ్రీకృష్ణునింజూడఁ గిటికీదరి కేగి యందు స్త్రీలు నిండియుంటఁ దావుదొరకమి నొకముగ్ధను బాలిక నొకానొకపని నెపమునఁ బిల్చి యయ్యదాతావు వీడిరాఁగ నాస్థానమును దాఁబోయి యాక్రమించికొని, వంచితయైనబాలికను బెఱవనితలు చప్పటులుగొట్టి పరిహసించుచుండఁగా శ్రీకృష్ణునిం గాంచెను.

వ్యా-విశే. ఓర్తు, ఒకర్తు, ఒకరిత, ఒకర్త. ఇత్యాదు లూహ్యములు. లేమి - వ్యతిరేకభావంబున మిజేయగును. ఇట్లే రామి, కామి, ఊహ్యములు. బాల గావుననే వంచనకు లోఁబడియెనని సారస్యము నెన్నునది.

ఉ. కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జన మాడి యాడి నీ
లాలక యోర్తు గంధసలిలార్ద్రకచంబులు చన్నుదోయిపై
వ్రాలిన సందిటం బొదివి రాజపథంబున కేఁగుదెంచె గో
పాలకమూర్తిఁ గాన శిఖిబర్హము కానుక దెచ్చెనో యనన్. 14

టీ. ఓర్తు=ఒకతె, నీలాలక=నల్లనిముంగురులుగలది, కాళియ భేదిన్=కాళియుండను సర్పరాజును భేదించిన శ్రీకృష్ణుని, చూచుతమకంబునన్ = చూచుటయందలి తొందరచే, మజ్జనము=స్నానము, ఆడియాడి=చేసిచేసి, గంధసలిలార్ద్రకచంబులు = పరిమళించు నుదకముచేఁదడిసిన తలవెండ్రుకలను, చన్నుదోయిపైన్ = స్తనద్వంద్వముపై, వ్రాలినన్=పడఁగా, సందిటన్=రెండుచేతులమధ్యను, పొదివి = అణఁచిపట్టికొని, శిఖిబర్హము = నెమిలిపింఛము, కానుక=నూడిద, తెచ్చెనో యనన్ = తెచ్చెనో యనునట్లు, గోపాలకమూర్తిన్ = గోపాలకుఁడగు నాకృష్ణునియాకృతిని, కానన్ = చూచుటకై, రాజపథంబునన్=రాజమార్గమున, ఏగుదెంచెన్=వచ్చెను.

భా. ఒకవనిత తా స్నానమాడి యాడి శ్రీకృష్ణునిరాక విని త్వరచే తడియారని కురులను స్తనములపైఁబడుచుండువానిని, సందిటఁబట్టి గోపాలునకు శిఖిపింఛము కానుక దెచ్చుచున్నదో యనురీతిని రాజమార్గమున శ్రీకృష్ణుంజూడ నేతెంచెను.

విశే. గోపాలకమూర్తిని గానవచ్చెడు గాన నవ్వనిత యాతనికిఁ బ్రియమైన శిఖిపింఛము కానుక తెచ్చెనని చెప్పుట యెంతయు హృద్యము. మఱియు నీలాలకములు గంధసలిలార్ద్రములు నెమ్మిపింఛియయమువలె నున్నవని గ్రహించునది. కాన నీలాలకపదము సాభిప్రాయమని యెన్నునది.

ఉ. ఉన్నతసౌధమెక్కి యనృతోదరి యొక్కతె పద్మనాభుఁ జూ
డ న్నిజదేహవల్లికఁ గడల్కొనుసాత్త్వికలీలఁ జూచునా
సన్నసఖీజనంబు గని సౌధశిఖాగమనశ్రమంబునం
గన్నియలార! మేన్బడలెఁ గంటిరె నా కని బొంకె నేర్పునన్. 15

టీ. ఒక్కతె, అనృతోదరి = అసత్యమైననడుముగలది, ఉన్నతసౌధము = ఎత్తైనమేడ, ఎక్కి, పద్మనాభున్ = తమ్మిబొడ్డునంగల శ్రీకృష్ణుని, చూడన్=చూడఁగా, నిజదేహవల్లికన్=తీఁగంబోలు తనశరీరమునందు, కడల్కొను=వ్యాపించునట్టి, సాత్త్వికలీలన్=సాత్త్వికవిలాసమును, (అనఁగాఁ గగుర్పాటుననుట), చూచు = చూచుచున్న, ఆసన్నసఖీజనంబు = సమీపముననున్న చెలికత్తెలగుమిని, కని=చూచి, సౌధ...శ్రమంబునన్-సౌధశిఖ = ప్రాసాదశిఖరమునకు, ఆగమన=వచ్చుటయందలి, శ్రమంబునన్ = ఆయాసముచే, కన్నియలార=ఓకన్యలార! నాకున్, మేను=శరీరము, బడలెను = అలసెను. కంటిరే=చూచితిరే, అని, నేర్పునన్=నైపుణితో, బొంకెను=అసత్యముపలికెను.

భా. ఒక సూక్ష్మమధ్య శ్రీకృష్ణుని గాంచినకతన తనమెయి వ్యాపించిన సాత్త్వికలీల నెత్తైనమేడయెక్కుటచే శరీరమునకుఁ గల్గినశ్రమచేఁ గల్గెనని యాసాత్త్వికలీలం గాంచు, తోడిచేడియలకుఁ దెల్పుచు నద్దాని మఱుఁగుపఱచికొన యత్నించెను.

వి శే. అమృతోదరి కావుననే యమృతముం బల్కఁజాలెనని సారస్యము నెన్నునది. సన్ననినడుము గలిగియుండుటయు దేహము వల్లికవలె నమరియుండుటయు నున్నత సౌధారోహణము శ్రమజనకమయ్యెననుటలోఁ గారణములుగ నెన్నఁదగును. అలం. వ్యాజోక్తి.

ఉ. వేడుక నీకె కాని మఱి వేఱొకయింతికి నైన లేదె ప్రో
 పాడెద *వేల మచ్చర మొకప్పుడు మానక పోయితీవు పెం
 ప్రోడవుగాన నిన్నె కనుఁబో యతఁ డెవ్వరిఁ జూడఁడంచు నో
 నాడె సపత్ని నొక్కతె మురారిఁ గనుంగొనువేళ నీసునన్. 16

టీ. వేడుక=ఉత్సాహము, నీకె, కాని, మఱి, వేఱొకయింతికిన్ = అన్యవనితకు లేదె?, ప్రోపాడెదవు+ఏల = ప్రోసివేయుచుంటివెందులకు? ఈవు, ఒకప్పుడున్ = ఒకసమయమునను, మచ్చరము=మాత్సర్యము, మానకపోయితి = విడిచితివిగావు, పెన్ ప్రోడవు = పెద్దప్రోడవు = మహాప్రౌఢురాలవు, కానన్=కాఁబట్టి, నిన్నె, అతఁడు, కనుఁబో=చూచునుజుమ్ము, ఎవ్వరిన్, చూడఁడు, అంచున్ = అని పల్కుచు, ఒక్కతె, మురారిన్ = మురద్విషుఁడగు శ్రీకృష్ణుని, కనుంగొనువేళన్ = శ్రీకృష్ణుంజూచుసమయమున, సపత్నిన్=సవతిని, ఈసునన్=ఈర్ష్యచే, నోన్ = నొచ్చునట్లుగా, ఆడెన్ = పలికెను.

భా. ఒకవనిత వేడ్కతోఁ గొంచెము ముందున్న సపత్నిం ద్రోసికొనుచు శ్రీకృష్ణునింజూడనుంకింప నామెసవతి యసూయతో, "ఓసీ! ఒకపుడును నీవు మత్సరమును మానలేదు. పెద్దప్రౌఢవుగాన నిన్నే యాతఁడు చూచును గాని వేఱొకతెం జూడఁడు." అని సాధిక్షేపముగ మది నొచ్చునట్లు సపత్నింగూర్చి పలికెను.

వ్యా-వి శే. 'నిన్నేచూచు. వేఱవనితను జూడఁడు.' అనునుక్తి మానవతిమదిని నోవఁజేయునదని యెన్నునది. పో. రూ. అ. పొమ్ము. ఇది నిశ్చయార్థకము. నోన్-నొచ్చుధాతువుక్త్యంతరూపము. రూ. అ. నోవన్. ఊరకే యతినిష్ఠురముగఁ బల్కిన కతన యసూయ తెల్లమగుచున్నది.

చ. అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని మ్రానుపాటుమై
 నెలకొన నున్నచో సడలునీవిక లేఁజెమ రంటి నిల్పె నం
 జలిపరిపూర్ణలాజలను సాధ్వసకంపము దాన చల్లెన
 చ్చెలువకు సాత్త్వికోదయము చేసిన మేలిఁక నేమి చెప్పుదున్. 17

* వేలె.

టీ. ఒక్కతె, అలికులవేణి = తుమ్మెదగుమింపోలు జడగలది, మురారిన్ = శ్రీకృష్ణుని, కనుంగొని=చూచి, ప్రానుపాటు= స్తంభము (నిశ్చలత), మైన్ = శరీరమున, సెలకొనన్=నిల్వఁగా, ఉన్న చోన్=ఉండుసమయమున, సడలునీవికన్ = వదలినవస్త్రగ్రంథిని, లేఁజెమరు=చిఱుచెమ్మట, అంటె=హత్తి, నిల్పెన్=నిలిపెను. సాధ్వసకంపము = భయముచేనైనవణఁకు, అంజలిపరిపూర్ణ లాజలను = దోసిలియందు నిండియున్న పేలాలను, తాన=తానే (స్వయముగానే) చల్లెను. అచ్చెలువకున్=ఆస్త్రీకి, సాత్త్వికోదయము= స్తంభప్రళయరోమాంచాదులపుట్టుక, చేసిన=ఒనర్చిన, మేలు, ఇఁకన్, ఏమి చెప్పుదును?

భా. ఒకవనిత శ్రీకృష్ణుంగాంచి నిశ్చలయై నిల్చియుండెను. అపుడామెకు మేనఁ జెమ్మటయుఁ గంపము నుదయమయ్యెను. అందుఁ జెమ్మట వస్త్రగ్రంథి జాఱినను దానంటుకొని జాఱకుండఁజేసెను.కంప మవ్వనితచేతనున్న లాజలను తనంతతానే యామె కాపనిమూలముననైనశ్రమ కలుగఁజేయక చల్లెను. ఇట్లు స్వేదము కంపము మున్నగు సాత్త్వికము లెంతయు నుపకరించెను. అనఁగా నీవి జాఱినను జెమ్మటయంటియుంట జాఱలేదనియుఁ, బ్రయత్నింపకయే కంపమువలన చేతనున్నలాజలు చల్లఁబడెననియు భావము.

వ్యా-విశే. స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథువు, అశ్రువు, వైస్వర్యము, అనునీయెనిమిదియు సాత్త్వికములు. అ+చెలువ=అచ్చెలువ.

క. మదవతి యొకతె పరాకునఁ
బదాంగదము కంకణముగఁ బాణిఁ దొడిగె న
య్యదువల్లభుఁ గనుఁగొనుచుం
దుదిఁ నదియును మేను వొంగి తుత్తుము రయ్యెన్. 18

టీ. ఒకతె, మదవతి=మదముగలపడఁతి, పరాకునన్=ఏమఱుపాటుతో,అయ్యదువల్లభున్=ఆశ్రీకృష్ణుని, కనుఁగొనుచున్=చూచుచు, పదాంగదము = కాలియందెను, కంకణముగన్=హస్తాభరణమగునట్లు (కడియమగునట్లు) పాణిన్ = హస్తమున, తొడిగెన్=ధరించెను. తుదిన్=అంతమున, అదియును = ఆకంకణముగా హస్తమునకుఁ దొడిగినకాలియందెయుం, మేను=శరీరము, పొంగి=ఉబ్బి, తత్తుమురు=చిన్నచిన్నముక్కలు, అయ్యెన్.

భా. ఒకతె కాలియందెను చేతికిఁ గంకణముగా నిడఁగ నది శ్రీకృష్ణుని జూచుట కతన శరీర ముబ్బుటంజేసి తునియలయ్యెను. అనఁగా శ్రీకృష్ణసందర్శనజాత సంతోషాతిశయమున మే నుబ్బెననియు, నక్కతన నంతకుమున్ను వదలుగనున్న యందియ యప్డిఱుకై యుండనవకాశము చాలక తునియలయ్యెననియుం భావము.

వ్యా-విశే. మదవతి కావుననే పరాకునఁ బదాంగదము చేతికిఁ దొడుగుటయు, శ్రీకృష్ణుఁ గాంచినంతనే యుబ్బినశరీరముగలదగుటయుఁ సంభవించెనని సారస్యము సెన్ను నది. తుమురు + తుమురు=తుత్తుమురు. ఆమ్రేడితము పరమగుడందదుకు ప్రభృతులు యథా ప్రయోగముగ గ్రాహ్యములు.

చ. దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెఱివేణి యీసునబలె న్విరిపూవులఁ జల్లెఁ జల్లె లో
చనములు సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందువుల్
చనుఁగవ సల్లె సంభ్రమవశత్రుటితామలమౌక్తికావళుల్. 19

టీ. ఒకతన్వి=ఒకయువతి, దనుజవిరోధిమీఁదన్ = రాక్షసవిరోధియగు కృష్ణునిపై, కరంబునన్=చేతిచే, లాజలు=పేలాలు, ఎత్తి=సేకరించి, చల్లినన్, నెఱివేణి= మనోహరమగు కొప్పు, ఈసునన్ బలెన్ = ఈర్ష్యచేతనువలె, విరిపూవులన్=వికసించిన పుష్పములను, చల్లెన్. లోచనములు=నేత్రములు, సమ్మదాశ్రువులన్=ఆనందబాష్పములను, చల్లెన్. లలాటము=నుదురు, ఘర్మబిందువుల్=చెమ్మటబొట్టులను, చల్లెన్. చనుఁగవ = స్తనములజంట, సంభ్రమ......వళుల్ - సంభ్రమవశ = తొందరపాటుచే, త్రుటిత=తెగిన, అమల=స్వచ్ఛమైన, మౌక్తికావళుల్ = మంచి ముత్తియములవరుసను, చల్లెన్.

భా. ఒకానొకతన్వి శ్రీకృష్ణునిపై లాజలఁ జేతితోఁ జల్లఁగా, నామె కొప్పును నేనుమాత్రము చల్లలేనా? యామెకంటెవేగముగ నేచల్లెదనను నీసుమై వికసించినపూవులం జల్లెననియు, నాపై నేత్రము లానందబాష్పములం జల్లెననియు, నంత నెన్నుదురు ఘర్మకణములం జల్లెననియు, నాపిదప స్తనద్వంద్వము సంభ్రమమున తెగినముత్యముల చాలుం జల్లెననియు భావము.

విశే. అత్తన్వి లాజలం జల్లినపిదప మదనపరవశయగుట, నామెకొప్పువీడి యందలి సుమములు రాలెననియు, లోచనములు బాష్పోదయముతో సంకలితములయ్యెననియు, సాత్వికోదయముకతన నెన్నుదురు చెమ్మటందడిసెననియు, స్తనసంభ్రమాదులకతన ముత్తియములుహారములనుండి తెగి పడియెననియుం నెన్నవలయును. ఇందు కాముకీధర్మము ప్రకాశితము. పేలాలు, విరిపూవులు, బాష్పకణములు, చెమటబొట్టులు, ముత్తియములు ఇవి పరస్పర మచ్ఛములగుట సదృశములని కవి యెన్నెను అలం. సముచ్చయము.

చ. జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ నొక్కవేలుపుం
జిలుకలకొల్కి రాచిలుకచేఁ బిలిపించిన సత్యభామ కా

కలికితెఱంగు శౌరి కడకన్నులసన్నలఁ జూపెఁ గోపక
న్దళికలుషాయితాక్షివలనంబుల నాసతి దన్నదల్పఁగన్. 20

టీ. ఒక్క వేలుపుంజిలుకలకొల్కి=ఒక దేవవనిత; సురాంగన, జలరుహనేత్రుఁన్ = పద్మనాభుని, కాంచి = చూచి, సరసత్వము = శృంగారరసము, మీఱఁగన్ = అతిశయించునట్లుగా, రాచిలుకచేన్ = చిలుకమిన్నచేత, పిలిపించినన్ = పిలుచునట్లు చేయఁగా, శౌరి=శ్రీకృష్ణుఁడు, ఆకలికితెఱంగున్=ఆస్త్రీయొక్క జాడను, సత్యభామకు, కడకన్నులసన్నలన్ = కన్గొనలసంజ్ఞలచే, ఆసతి=ఆవేల్పుపడఁతి, తన్ను=శ్రీకృష్ణుననుట. కోప...వలనంబులన్=కోపకందళ=కోపాంకురములచే, కలుషాయిత=కలఁతనందు, అక్షి=నేత్రములయొక్క, వలనంబులన్=చాలనములచే, అదల్పఁగన్=భయపెట్టుచుండ, చూపెన్=అగపఱచెను.

భా. ఒకవేల్పుజాణ శ్రీకృష్ణుని సరసముగఁ బెంపుడుచిలుకమిన్నచేఁ బిలిపింప నావనితజాడను, దన్నావేల్పుపడఁతి కోపాంకూరముల కలఁతనందిన నేత్రములచాలనమున భయపెట్టుచుండ, సత్యకు శ్రీకృష్ణుఁ డగపఱచెనని భావము.

విశే. చిలుక 'కృష్ణ! కృష్ణ!' యని పల్కుట సైజము. మఱియుఁ బిల్వుమని ప్రోత్సహింపఁ దనకు నిసర్గసిద్ధమగుమాటనే ముద్దుగఁ బల్కెనని యెన్నునది. ఎంతటిమోహమున్నను బెఱవనితకుఁ దనమోహపుఁజేయిదమును బయలుపఱుప మానిను లిచ్ఛగింప కుండుట సహజము. అందును దనమోహమునకుఁ దావలమైనవాఁడే తనభార్యతోఁ దనమోహపుఁగృత్యమును బయలుపఱచునపుడు మానిని సహించుట యరిది. కావుననే యవ్వేలుపుజాణ శ్రీకృష్ణు నదల్చినది. శ్రీకృష్ణుఁ డిట్లు సురాంగనాకృత్యమును సత్యకుఁ జూపుట తనసౌందర్యమహిమాప్రకాశనార్థమును, దన్మూలమున సత్యానురాగము నింకింత యతిశయింపఁ జేయుటకొఱకును నైనదని యెన్నవలెను.

క. అనిమిషపురజాలకములు
వనితాజనతామయములు వనితలహృదయం
బను రాగరసమయం బ
య్యనురాగము శౌరిమయము నయ్యెడ నయ్యెన్. 21

టీ. అనిమిషపురజాలకములు=అమరావతీపురమునందలి గవాక్షములు, వనితాజనతామయములు=స్త్రీజనసమూహముచేఁ బూర్ణములైనవి. వనితలహృదయంబు=స్త్రీలమది అనురాగరసమయంబు=శృంగారరసపూర్ణము. (అనగాఁ బ్రేమచే నిండినవనుట) అయ్యను

రాగము=అప్రేమ, శౌరిమయముఞ్=శ్రీకృష్ణమయమును, అయ్యెన్; దీనికన్ని వాక్యము లతో నన్వయము.

భా. అమరావతీనగరమునందలి యిండ్లగవాక్షములెల్లను స్త్రీలతో నిండియున్న వనియుఁ, నాస్త్రీ లనురాగపూర్ణలై యొప్పిరనియుఁ, నయ్యనురాగము శ్రీకృష్ణమయమై పరఁగెననియు భావము. అనఁగా నందలిస్త్రీలెల్లరు శ్రీకృష్ణవిషయకానురాగమునఁ బూర్ణలై పరఁగిరని తాత్పర్యము.

చ. కనుఁగొన వేడ్కలం బొడము కౌయ్వల నచ్చర లీసడించుట
ల్వినుచు దరస్మితం బొలయ వెన్నుఁడు రాజపథంబు దాఁటి య
య్యనిమిషనాథుగేహబహిరంగణభూస్థలి డిగ్గె వైనతే
యుని మణిచిత్రవేత్రకరహుంకృతి దిక్కులు పిక్కటిల్లఁగన్. 22

టీ. కనుఁగొనన్=చూచుటకై, వేడ్కలన్=ఉత్సాహములచేత, పొడము=పుట్టు నట్టి, కౌయ్వలన్=అనురాగములతో, ఈసడించుటల్=నిందించికొనుటలను, వినుచు, వెన్నుఁడు=శ్రీకృష్ణుఁడు, దరస్మితంబు=మందహాసము, ఒలయన్=వ్యాపింపఁగా, రాజ పథంబున్=రాజమార్గమును, దాఁటి = అతిక్రమించి, అయ్యని...స్థలిన్-అయ్యనిమిష నాథు = దేవేంద్రునియొక్క, గేహ=ఇంటియొక్క, బహిరంగణభూస్థలిన్ = ముంగిలి వాకిలియందు, మణిచిత్రవేత్రకరహుంకృతిన్=మణిఖచితములైన చిత్రములగు బెత్త ములఁ బట్టుకొన్నవారియొక్క హుంకారముచే, దిక్కులు = దిశలు, పిక్కటిల్లఁగన్= బ్రద్దలుకాఁగ, వైనతేయుని=గరుడుని, డిగ్గెన్=దిగెను. గరుడునుండి యని యర్థము.

వ్యా-విశే. విష్ణుఁడు-వి. వెన్నుఁడు. వైనతేయునివలననుండి దిగెను. ఉండిపదము పరమగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికమునగు. వైనతేయుని డిగ్గెను.

క. ఆదరమున శతమన్యుఁడు
కైదండ యొసంగ యామకరిదానఝరీ
మేదురకక్ష్యాత్రితయము
నాదనుజవిరోధి గడచి యటఁ జని యెదుటన్. 23

టీ. ఆదరమునన్=ప్రేమతో, శతమన్యుఁడు=ఇంద్రుఁడు, కైదండ=చేయూఁత, ఒసంగన్=ఈయఁగా, ఆదనుజవిరోధి=శ్రీకృష్ణుఁడు, యామ... త్రితయమున్-యామ కరి=జాముకావలియేనుఁగులయొక్క, దానఝరీ=మదప్రవాహముచే, మేదుర=సాంద్ర మైన, కక్ష్యాత్రితయమున్=మూఁడుకక్ష్యలను, కడచి=అతిక్రమించి, అటన్=అచ్చో టికి, చని, ఎదుటన్=ముందుపద్యముతో నన్వయము.

శ్రీకృష్ణుఁ డదితినిఁ జూచుట.

సీ. తొడలపైఁ జాఁచిన యడుగుఁగెందమ్ముల
నొయ్యనఁ బౌలోమి యొత్తుచుండఁ
బార్శ్వభాగంబునఁ బంకేరుహాసను
కామినీరత్నంబు కతలు సెప్పఁ
బనిఁబూని యంతంత వినయావనతవృత్తి
సప్తర్షి కాంతలు సంచరింప
వీజనచామరవీటీకరండాది
కములు దిక్పతిసతీగణము దాల్ప
తే. విమలచింతామణీమయవేదిమీఁదఁ
గల్పకలతాంతకల్పితతల్పసీమ
నధివసించిన నిఖిలలోకైకవంద్య
నమరమాతృకశుక్తి నయ్యదితిఁ గనియె. 24

టీ. తొడలపైన్ = ఊరువులపైని, చాఁచిన, అడుగుఁగెందమ్ములన్ = పాద పద్మములను, ఒయ్యనన్ = మెల్లఁగా, పౌలోమి = ఇంద్రునిభార్యయగుశచి, ఒత్తుచుండన్, పార్శ్వభాగంబునన్ = ప్రక్కను, పంకేరుహాసను కామినీరత్నంబు = బ్రహ్మభార్యయగు సరస్వతి, కతలు = కథలు, చెప్పన్, పనిఁబూని = ఆజ్ఞననుసరించి, అంతంతన్ = దగ్గఱ దగ్గఱ, వినయావనతవృత్తిన్ = అడఁకువచే నమ్రమైనరీతితో, సప్తర్షి కాంతలు = సప్తర్షులభార్యలు; అరుంధత్యాదులు. సంచరింపన్ = తిరుగాడఁగా, వీజనచామర వీటీకరండాదికములు = విసనకఱ్ఱ చామరము తాంబూలపుఁబేటిక మొదలగువానిని, దిక్పతిసతీగణము = దిక్పాలురభార్యలు, తాల్పన్ = పట్టుకొనఁగా, విమలచింతామణీమయవేది మీఁదన్ = స్వచ్ఛమైన చింతామణి ప్రచురమైన యరుఁగుపైని, కల్పకలతాంతకల్పిత తల్పసీమన్ = కల్పవృక్షసుమములచే నిర్మితమైన శయ్యాప్రదేశమును, అధివసించిన = అధిష్ఠించినట్టి, నిఖిలలోకైకవంద్యన్ = ప్రజలెల్లరిచే నమస్కరింపఁదగినదానిని, అమరమాతృకశుక్తిన్ = దేవతలను ముత్తెములకు ముత్తెపుఁజిప్పయైనదానిని; దేవతలం గన్న తల్లి యనుట. అయ్యదితిన్ = ఆయదితియను దేవమాతను, కనియెన్ = చూచెను.

భా. పౌలోమి తొడలపైనిడిన తనపాదపద్మముల మెల్లన పట్టుచుండఁగా, సరస్వతి నానావిధకథలం జెప్పుచుఁ దన్నలరించుచుండఁగా, సప్తర్షులభార్యలు [illegible] సేవావృత్తిఁబూని యాజ్ఞాపరలై దగ్గఱ మెలంగుచుండఁగా, వీవన, చామరము, తాంబూలకరండము మున్నగువానిం బూని సప్తర్షికాంతలు సంచరించు

చుండఁగా, జింతామణి ప్రచురమైనవేదికపై నేర్పఱుపఁబడిన కల్పవృక్షసుమశయ్య నదితి గూర్చుండెననియు, నట్టిదేవమాతను శ్రీకృష్ణుఁడు చూచెననియు భావము.

వి శే. సర్వసురాధిపతియగు నింద్రునకు భార్య శచి. అదితి కామె పెద్దకోడలు. ఆమె యత్తగారి యడుఁగుందమ్ముల నొత్తునట్లు చెప్పుట యామెశీలమునకేగాక యదితి పెద్దతనమునకును వన్నెయే యగును. వాగ్దేవి కానఁ గతలు చెప్పుచు నత్తనలరించుట యుచితము. సప్తర్షికాంతలు, దిక్పతీ సతీగణము, సేవావృత్తి నూనినట్లు చెప్పుట కతన నదితిదగు కోడండ్రసంబంధమైన వశీకరణమును, గోడండ్ర కత్తయెడలఁగల భక్తియు సూచితములయ్యె. చింతామణివేదిని కల్పసుమశయ్య నధిరోహించుట వైభవ సూచకము.

వ్యా-వి. శయ్యయం దధివసించె ననుటకుమాఱుగా శయ్య నధివసించెననుట అధిపూర్వక శీఙ్ స్థాధాతువులయాధారము కర్మసంజ్ఞకమగు ననువ్యాకరణసూత్రము ననుసరించియే యని గ్రహించునది. సప్తర్షులు:—కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు.

మ. కని సత్యారమణీయుతంబుగ నమస్కారంబు గావించి భౌ
మనిశాటాహృతకుండలద్వయము నాత్మస్వర్ణచేలాగ్రబం
ధనమున్వీడ్చి యొసంగ నందుకొని మోదంబంది యానందనం
దను దీవించుచుఁ జెంగట న్నిలిపెఁ జింతారత్నపీఠంబునన్. 25

టీ. కని=చూచి (శ్రీకృష్ణుఁడు కర్త.) సత్యారమణీయుతంబుగన్=సత్యభామా సంయుతముగా, నమస్కారంబున్, కావించి=చేసి, భౌమనిశాటాహృతకుండలద్వయమున్=భూమిసుతుండైన నరకాసురుఁడను రాత్రించరునిచే నపహృతమైన కుండలముల జంటను, ఆత్మస్వర్ణచేలాగ్రబంధనమున్ = తనబంగరుబట్టచెఱఁగుముడిని, వీడ్చి=విప్పి, ఒసంగన్=ఈయఁగా, అందుకొని=పుచ్చుకొని (అదితి కర్త) ఆనందనందనున్=ఆనంద కుమారుని, దీవించుచున్=ఆశీర్వదించుచు, చెంగటన్=సమీపమున, చింతారత్నపీఠంబునన్=చింతామణీపీఠమున, నిలిపెన్=కూర్చుండఁజేసెను.

వి శే. కుండలములజంట నదితి కొసంగెడినెపమున నే శ్రీకృష్ణుఁడు స్వర్గమునకే తెంచెనుగాన, కడుసరియగు కార్యసాధననిపుణుండును నగు శ్రీకృష్ణుఁడు తొలుదొల్త నాకృత్యము నే నిర్వర్తించి, తనకదితిపైఁ గలభక్త్యతిశయమునుగూడఁ బ్రకాశిత మొనర్చుకొనియెను.

అదితి శౌరియవతారముల వర్ణించుట.

క. మే నిమిరి శిరసు మూర్కొని
దానవపరిపంథి! యెంత ధన్యనొ నియత
ధ్యానపరు లయినమునులుం
గానని నినుఁ గంటి మంటి గతకల్మష నై. 26

టీ. మే=శరీరమును, నిమిరి = చేతితోఁ రాచి, శిరసున్=తలను, మూర్కొని = ఆఘ్రాణించి, (కర్త అదితి) దానవపరిపంథి = రాక్షసశత్రువవగుకృష్ణా! ఎంతధన్యనొ?= ఎంతకృతార్థనొ?, నియతధ్యానపరులు=నియమముతోఁగూడినధ్యానమునం దాసక్తులగువారు, అయిన, మునులున్, కానని=చూడలేని, నినున్, కంటిన్=చూచితిని గతకల్మషనై=పోయిన పాపములు గలదాననై, మంటిన్=బ్రదికితిని.

విశే. మే నిమురుట శిరసు మూర్కొనుటయు వాత్సల్యాతిశయసూచకములని గ్రహింపవలయు. తల్లులు తమపిల్లలవిషయమున నిట్లు ప్రవర్తించుట నైజము.

ఉ. సర్గమొనర్తు బ్రహ్మ యన సత్కృపఁ బెంతు జనార్దనుండు నా
భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్జగంబు నై
సర్గికలీల నొక్కమఱి సౌఖ్యము నొందుదు కేవలంబు దో
రర్గళభూషణీకృతరథాంగ! నినుం గొనియాడ నేర్తునే. 27

టీ. దోరర్గళ...రథాంగ-దోరర్గళ = గడియలంబోలుచేతులకు, భూషణీకృత = ఆభరణముగాఁజేయఁబడిన, రథాంగ = చక్రాయుధముగలవాఁడ!, బ్రహ్మ=సృష్టికర్త, అనన్=అనునట్లుగా, సర్గము=సృష్టిని,ఒనర్తు=చేయుదువు, జనార్దనుండు=విష్ణువు,నాన్= అనునట్లు, సత్కృపన్=మంచిదయతో, పెంతు = పోషింతువు. భర్గుఁడు=ఈశ్వరుఁడు, అనంగన్=అనునట్లు, క్రమ్మఱఁగన్=మఱలను, పారణ=మ్రింగుట, చేయుదువు = ఒనర్తువు. మఱి=మఱియు, నైసర్గికలీలన్ = సహజమగువిలాసముతో, కేవలంబున్ = నిజరూపివై, సౌఖ్యమున్=సుఖమును, ఒందుదు = పొందుదువు. నినున్, కొనియాడన్= నుతింపఁగా, నేర్తునే=చాలుదునే?

భా. ఓకృష్ణ! సృష్టికర్తవై సృజించువాఁడవు నీవె; విష్ణువవై పాలించువాఁడవు నీవె; శివరూపివై సంహరించువాఁడవు నీవె; కేవలమాత్మారాముండవై సహజలీల సుఖించువాఁడవు నీవె; ఓత్రిమూర్తిరూపీ! నిన్గొనియాడ నేఁజాలనని భావము.

విశే. పరమాత్ముఁ డొక్కఁడే యామూయిరూపముల సృష్టిస్థితిలయములఁ గావించునని శాస్త్రములు నుడువును. ఈవిషయమును కాళిదాసు కుమారసంభవమున

రెండవసర్గ నిట్లే "తిసృభిస్త్వమవస్థాభి ర్మహిమాన ముదీరయన్, ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః" అని ప్రతిపాదించి యున్నాఁడు.

ఇదిమొదలుకొని విష్ణుని యవతారములు వర్ణితములగును. ఇందందు మొదటిదగు మత్స్యావతారము వర్ణితము.—

ఉ. వాలముతాఁకున న్గిరులు వజ్రనిపాతము సంస్మరింపఁ బె
న్వాలుగవై మహార్ణవమునం దొలుఁబల్కులదొంగరక్కసున్
వాలికవంకవాఁడిగఱి వ్రచ్చి వెస న్నిగమాలిఁ దమ్మిపూఁ
జూలికిఁ దెచ్చి యీవె త్రిదశుల్గొనియాడ మురాసురాంతకా! 28

టీ. మురాసురాంతకా = ఓ మురద్వేషీ! వాలముతాఁకున్ = తోఁకదెబ్బచే గిరులు = పర్వతములు, వజ్రనిపాతమున్ = వజ్రాయుధపుదెబ్బను, సంస్మరింపన్ = జ్ఞప్తికి దెచ్చుకొనఁగన్, పెన్వాలుగవై = పెద్దచేఁపవై, మహార్ణవమునన్ = పెద్దసముద్రమున, తొలుఁబల్కుల దొంగరక్కసున్ = వేదచోరుఁడగురాక్షసుని, వాలికవంకవాఁడిగఱిన్ = దీర్ఘమైన ప్రక్కనున్న తీక్ష్ణమైన ఱెక్కచేత, వ్రచ్చి = చీల్చి, వెసన్ = శీఘ్రముగా, నిగమాలిన్ = వేదములసమూహమును, తమ్మిపూఁజూలికిన్ = పద్మోద్భవునకు; బ్రహ్మకు, తెచ్చి, త్రిదశుల్ = దేవతలు, కొనియాడన్ = నుతింపఁగా, ఈవె = ఒసంగవే!

భా. మత్స్యరూపి యగువిష్ణుని తోఁకతాఁకుడు సముద్రమందలి గిరులకు వజ్రాయుధప్రహారమును జ్ఞప్తికి దేఁగ నవ్వేదచోరుని రక్కసుని వాఁడిఱెక్కచేఁ జీల్చి వేదరాశి నజునకు సురలు నుతింప నొసంగెనని భావము.

వ్య-విశే. సోమకుఁడనునసురుఁడు వేదములనపహరించి సముద్రమున డాఁగఁగా నాతని శ్రీమహావిష్ణువు మత్స్యరూపముం దాల్చి సంహరించి వేదముల బ్రహ్మకు మఱల నిచ్చెననుపురాణగాథ ననుసంధింపవలెను. ఇచ్చుము + ఎ = ఇచ్చునకు సర్వంబునకీ యగును. ఎదాదులు పరంబగునపుడు ముజ్ నకు వుజీ రుజీ యగు. ఈవె. అలం. స్వభావోక్తి.

చ. సురనికరంబు రక్కసులుఁ జుట్టములై యమృతాభిలాష మం
దరగిరిఁ జిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి ని
ర్భరగతిఁ ద్రచ్చుచో నడుగువట్టినతద్గిరి యెత్తవే ఘలీ
పరివృఢమూర్తివై కపటపద్మముఖీత్వవిమోహితాసురా! 29

టీ. ఇందుఁ గూర్మావతారము వర్ణితము.—కపటపద్మముఖీత్వవిమోహితాసురా! = కృత్రిమస్త్రీత్వముచే మిగుల వివేకశూన్యులుగఁ జేయఁబడిన రక్కసులుగలవాఁడ,

సురనికరంబుల్ = త్రిదశసమూహమును, రక్కసులుల్ = రాక్షసులును, చుట్టములై = బంధువులై (పరస్పరము మిత్రులై యనుట), అమృతాభిలాషన్ = అమృతమందలి కోర్కితో, మందరగిరిన్ = మందరపర్వతమును, చిల్వరాచతరిత్రాటన్ = పాపరాజగు వాసుకిరూపమైన కవ్వంపుఁద్రాటితో, బిగించి = బిగియఁగట్టి, పయగపయోధిన్ = పాల కడలిని, నిర్భరగతిన్ = భారశూన్యమైనరీతితో (అనాయాసముగా ననుట), త్రచ్చుచోన్ = మథించునపుడు, అడుగుపట్టిన = మునిఁగి క్రిందఁజేరిన, తద్గిరిన్ = ఆమంథరమును, ధులీపరివృఢమూర్తివై = మేటికూర్మరూపముం బొందినవాఁడవై, ఎత్తవే = ఉద్ధరింపవే!

విశే. అమృతమును సురలకును, నసురులకును బంచిపెట్ట మోహినీరూపముం దాల్చి యసురులవంచించుటం జేసి, యీసందర్భమున నక్కథాంశమును సూచించు 'కపట పద్మముఖీత్వవిమోహితాసురా!' అనుసంబుద్ధి నిల్పుట యెంతయుఁ సరసము. చిలు = చీలిన, వా=నోరుగలది. లేక, చిలు - చిలుము = విషముగల, వా=నోరుగలది. చిల్వ. నలువ. మొ.

క. విలయోల్బణజలనిధిప
ల్వలమున నిల ముసుఁగ నేకలమ వై దంష్ట్రాం
చలమునఁ దాల్పవె నీ వా
బలిసద్మము దూఱి భుజగపర్యంకశయా! 30

టీ. ఇందు వరాహావతారము వర్ణితము.—భుజగపర్యంకశయా = శేషతల్పమున శయనించినవాఁడా! విలయోల్బణ...పల్వలమునన్ - విలయ = ప్రళయకాలమున, ఉల్బణ=ఉప్పొంగిన, జలనిధి=సముద్రమనెడు, పల్వలమునన్ = నీటిగుంటయందు, ఇల= భూమి, మునుఁగన్, ఏకలమవై=వరాహమవై, దంష్ట్రాంచలమునన్ = కోఱకొనచే, నీవు, ఆబలిసద్మమున్ = ఆపాతాళమును, దూఱి=చొచ్చి, తాల్పవె=ధరింపవా!

విశే. ఒక్కొకపద్యముతో నొక్కొకయవతారమును వర్ణించుచు నీసందర్భమున వరాహావతారమునుమాత్రము రెండుపద్యములతో వర్ణించుటకు హేతువు చింత్యమనఁ దగును. మఱియు వృత్తములతో నవతారములు వర్ణితములైన యీసందర్భము విశదీకరించుచుంట నడుమంగల యీచిన్నికందపద్యము ప్రక్షిప్తమైయుండు నేమోయని సందియము పొడమించెడిని.

చ. పెకలి యజాండకర్పరము బీఁటలువాఱఁగ మేనువెంచి యా
మకరనికేతనోదరనిమగ్నమహీమహిళాలలామఁ గే

తకముకుళాగ్రసంగతమదభ్రమరీసమరీతి గాఁగఁ గో
మ్ముకొనఁ దగిల్చి యెత్తఁ గిటిమూర్తిని దాల్చితిగా జనార్దనా! 31

టీ. జనార్దనా=ఓకృష్ణా! అజాండకర్పరము = బ్రహ్మాండభాండము, వెకలి = పగిలి, బీఁటలువాఱఁగన్=బద్దలగునట్లుగా, మేను=శరీరమును, పెంచి=విజృంభింపఁజేసి, ఆమకర...లలామన్-ఆమకరనికేతన = ఆసముద్రముయొక్క, ఉదర = నడుమను, నిమగ్న=మునిఁగిన, మహీ=భూమియను, మహిళాలలామన్ = స్త్రీరత్నమును, కేతక... రీతి-కేతకముకుళ = మొగలిమొగ్గయొక్క, అగ్ర=శిఖరమును, సంగత=కూడియున్న, మదభ్రమరీ=మత్తిలిన యాఁడుతుమ్మెదతో, సమ=తుల్యమైన, రీతి=విధము, గాఁగన్= సంభవించునట్లుగా, కొమ్ముకొనన్ = దంతాగ్రమునందు, తగిల్చి = లగ్నముగాఁజేసి, ఎత్తన్=ఉద్ధరించుటకు, కిటిమూర్తిని=వరాహాకృతిని, తాల్చితిగా=ధరించితివిగదా!

భా. సముద్రమున మునింగిన భూమీరామను బల్లుకొన నుద్ధరించునదనునఁ బల్లు తెల్లఁగను, భువి నల్లఁగను నుంటంజేసి, కేతకీముకుళాగ్రముననుండు మదభ్రమరింబోలి యున్నదనిభావము. భువియందు స్త్రీత్వ మారోపితమగుటంజేసి, భువి కాఁడుతుమ్మెదతో సామ్యము నిరూపితము. అలం. రూపకోపమలు.

చ. *సట లిట మానురోరి! హరిసర్వమయుండట యంచుఁ బట్టితోఁ
జిటచిటలాడి యిందుఁ గనఁజేయుము నీవని దైత్యుఁడాడినం
బటపట రాతికంబ మిరువాయలుగా నరసింహమూర్తివై
కుటిలనఖాగ్రకుంచికల గ్రువ్వవె వానియురఃకవాటమున్. 32

టీ. ఇందు నరసింహావతారము వర్ణితము.—సటలు=కుశలోక్తులు; నేర్పుమాటలనుట. ఓరి, మానుర=వదలుర, ఓరి: ఇది ప్రహ్లాదునిగూర్చి తండ్రి పల్కినసంబుద్ధి. హరి=శ్రీవిష్ణువు, సర్వమయుండటె = సర్వవ్యాపియా! అంచు, పట్టితోన్ = కుమారుఁడగు ప్రహ్లాదునితో, చిటచిటలు=కోపోక్తులు, ఆడి=పల్కి, ఇందున్ = ఈ స్తంభమున, నీవు, కనన్=అగపడునట్లుగా, చేయుము; కనఁబఱపుమనుట. అని, దైత్యుఁడు = హిరణ్యకశిపుఁడు, ఆడినన్=పలుకఁగా, పటపట=ఇది ధ్వన్యనుకరణము, రాతికంబము=శిలాస్తంభము, ఇరువాయలుగాన్ = రెండుచెక్కలుకాఁగా, నరసింహమూర్తివై=నరమృగరాజరూపధారివై, కుటిలనఖాగ్రకుంచికలన్-కుటిల=వక్రములైన, నఖాగ్ర = గోళ్లకొనలనెడు, కుంచికలన్=తాళపుఁజెవులచే, వానియురఃకవాటమున్ = వానిగుండెయను తలుపును, గ్రువ్వవే=గ్రుచ్చి తెరువవే?

* సట లివి.

వ్యా-వి శే. రౌద్రరసోచితమగు దీర్ఘసమాసభూయిష్ఠమగురచన యిందులేకున్నను, పరుషాక్షరయుతమగురచన పొసఁగియుండుటంజేసి సందర్భము సంగతమేయగు. మఱియు శార్దూలాదులవృత్తములఁ బొందుపఱుపక చంపకమునునిల్పుట చింత్యము. కాని పరుషాక్షరరచనయే రసప్రకాశనసమర్థమైయుంట వృత్తనియమముం గవి పరిత్యజించెనేమో యని యూహ పొడమెడిని. రా: ఇది వచ్ఛధాతు మధ్యమపురుషరూపమున మువర్ణకము లోపింప మిగిలినరూపము. ఇది చెప్పరా. చేయురా. ఇత్యాదులకొనందవిలిప్రేమను నీచత్వమునుగూడ బోధించునదగునని తోఁచెడిని. కాని నిజముగ నరయు చేయుము, రమ్ము. అనియే యిట్టివాని కర్థముగ నెన్నఁదగునని తోఁచెడిని.

మ. నను నాకశ్యపకామినీమణులలోన న్ధన్యఁగాఁ జేయ మ
త్తనయవ్యాజము దాల్చి వామనునిచందాన న్బలి న్మట్టవే
ఘనమార్గోన్నమితాంఘ్రిపద్మమునకుం గంజాప్తుఁ డంశువ్రజం
బనుకింజల్కపరంపర ల్మెఱయ నుద్యత్కర్ణికం బోలఁగన్. 33

టీ. ననున్, ఆకశ్యపకామినీమణులలోనన్ = ఆకశ్యపమౌని భార్యారత్నములలో 'దితి అదితి' అను నిర్వురుభార్యలలోననుట. ధన్యఁగాన్ = కృతార్థురాలనుగా, చేయన్ = చేయుటకు, మత్తనయవ్యాజము = నాకొమరుఁడనుమిషను, తాల్చి = వహించి, వామనునిచందానన్ = పొట్టివానివిధమున, ఘన...పద్మమునకున్ - ఘనమార్గ = మేఘమార్గమగు నాకాశమునకు, ఉన్నమిత = ఎత్తఁబడిన, అంఘ్రిపద్మమునకున్ = పాదపద్మమునకు, అంశువ్రజంబు = కిరణసమూహము, అను = అనునట్టి, కింజల్కపరంపరల్ = కేసరములపంక్తులు, మెఱయన్ = ప్రకాశింపఁగా, కంజాప్తుఁడు = సూర్యుఁడు, ఉద్యత్కర్ణికన్ = ప్రకాశించుతామరగద్దెను, పోలఁగన్ = అనుకరింపఁగా, బలిన్ = బలిచక్రవర్తిని, మట్టవే = త్రొక్కవే.

వి శే. ఆకసమునకుఁ జాచినచరణము సరసిజమువలెనుంట నద్దానికి సూర్యకిరణములు కింజల్కములవడువును సూర్యుఁడు తామరలోనుండు మిద్దెగతిని గూర్చుటఁ బద్మత్వము పూర్ణముగ సంపాదితమయ్యెను. అలం. రూపకోపమలు.

మ. ఘనదోర్దండనటత్కుఠారమున వీఁక న్రాజహంసాలిఁ దు
త్తునియల్సేసియుఁ గ్రౌంచరంధ్రమునఁ దోడ్తో రాజహంసాలి మే
దినికిం దెచ్చితి కార్తవీర్యభుజపంక్తిం జక్కఁ గావించి తం
బునిధిం గ్రొత్తగ నాశ్రమంబునకు నిమ్ముం గొంటివీవమ్మునన్. 34

టీ. ఇందుఁ బరశురామావతారము వర్ణ్యము.—ఈవు = నీవు, ఘనదోర్దండనటత్కుఠారమునన్ = ఘన=గొప్పదగు, దోర్దండ=దండమువంటిచేతియందు, నటత్=చలించుచున్నట్టి, కుఠారమునన్=గొడ్డలిచేత, వీఁకన్ = పరాక్రమమున, రాజహంసాలిన్=రాజశ్రేష్ఠులను, తుత్తునియల్ = ముక్కముక్కలు, చేసియుం=ఒనర్చియు, క్రౌంచరంధ్రమునన్ = క్రౌంచపర్వతబిలమునందుండి, తోడ్తోన్ = వెనువెంటనే; వరుసగాననుట. రాజహంసాలిన్ = రాయంచలపంక్తిని, మేదినికిన్=భువికి, తెచ్చితి=తీసికొనివచ్చితివి. కార్తవీర్యభుజపంక్తిన్ = కార్తవీర్యార్జునుని భుజములచాలును, చక్కగావించితి = నఱికితివి. అంబునిధిన్ = సముద్రమునందు, క్రొత్తగ, ఆశ్రమంబునకున్ = నివాసమునకునై, అమ్మునన్=బాణముచే, ఇమ్మున్=స్థానమును, కొంటివి=స్వీకరించితివి.

విశే. పరశురాముఁడు ముయ్యేడుమాఱులు రాజశ్రేష్ఠులఁ దునిమెను. విలువిద్యావిషయమునఁ గుమారస్వామియందలి యీసుచేఁ గ్రౌంచాచలమును భేదించి బిలమునొనర్చి రాయంచలకు మానససరోవరమునకై రాకపోకలకు మార్గముం గల్పించెను. కార్తవీర్యార్జునుని సహస్రభుజములను భేదించెను. బాణప్రయోగమున సముద్రమునుదకముం దొలఁగఁద్రోసి యాశ్రమ మచ్చో నేర్పఱచుకొనెను. పైనివ్రాసిన యాతనిచర్యలంగొని కవి యీగతిని వర్ణించెను. రాజహంసలం దుత్తునియల్సేసియుం రాజహంసాలిన్ గ్రౌంచాచల రంధ్రమునుండి భువికి రావించుట విచిత్రమును విరుద్ధమును నగువిషయము. రాజశ్రేష్ఠులఁ దునిమి రాయంచలఁ దానొనర్చిన క్రౌంచరంధ్రమార్గమునుండి భువికి రావించెనని పరిహారము. అలం. విరోధాభాసము.

మ. అరవిందాననఁ గోలుపోయిన యవజ్ఞావాప్తిచే వీరవా
నరసైన్యప్రకరంబు నేలి జలధి న్బంధించి లంకాపురీ
శ్వరకంఠాటవి నేర్చి రౌప్యగిరిలజ్జాపంకముం గీర్తిని
ర్ఝరపూరంబులచేఁ దొలంచితిగదా రామాభిధానంబునన్. 35

టీ. ఇందు శ్రీరామావతారము వర్ణితము.—అరవిందాననన్=పద్మముఖియగు సీతను, కోలుపోయిన=నష్టపడిన, అవజ్ఞావాప్తిచే = అవమానప్రాప్తిచేత, వీరవానరసైన్యప్రకరంబున్=శూరులగు కపిసేనాసమూహమును, ఏలి = పాలించి, జలధిన్=సముద్రమును, బంధించి=కట్టి; అనఁగా సముద్రముపై సేతువుంగట్టియనుట. లంకాపురీశ్వరకంఠాటవిన్ = రావణునియొక్క కంఠములనెడునడవిని, ఏర్చి = దహించి, రౌప్యగిరిలజ్జాపంకమున్ = కైలాసముయొక్క సిగ్గనుబురదను, కీర్తినిర్ఝరపూరంబులచేన్ = కీర్తియనెడుసెలయేటి వెల్లువలనీటిచే, రామాభిధానంబునన్ = రాముఁడనుపేరితో, తొలంచితిగదా = కడిగితివిగదా!

విశే. తొల్లి రావణునిచేఁ గైలాసము పెకలింపఁబడుటకతనఁ గైలాసమునకు సిగ్గు కల్గెననియు, నట్టి సిగ్గును బురదను శ్రీరాముఁడా రావణుని సంహరించి తనకుఁగల్గిన యశఃపయఃపూరాంబులఁ గడిగివేసెననియు తాత్పర్యము. అలం. రూపకము.

చ. అలుకఁ బ్రలంబదానవుని ప్రాణము గొంటి కళిందనందనా
సలిలభరప్రవాహరభసంబు మరల్చితి పట్టిఁ బ్రోవ నాఁ
గలిమొన హస్తినాపురి పెకల్చితి కౌరవవీరులెల్ల బె
గ్గిల నల రేవతీరమణికిం బతివై యదువంశమౌక్తికా! 36

టీ. ఇందు బలరామావతారము వర్ణితము. యదువంశమౌక్తికా = యదువంశమను వెదురునకు ముత్యమైనవాఁడా! అలరేవతీరమణికిన్ = ఆరేవతీదేవికి, పతివై = భర్తవై, అలుకన్ = కోపముతో, ప్రలంబదానవుని ప్రాణమున్ = ప్రలంబాసురుని జీవమును, కొంటివి = స్వీకరించితివి; చంపితివనుట. కళింద...రభసంబున్ - కళిందనందనా = యమునానదియొక్క, సలిలభర = నీళులభారముకల్గిన, ప్రవాహ = వెల్లువయొక్క, రభసంబున్ = వేగమును, మఱల్చితి = త్రిప్పితివి, పట్టిన్ = సుతుని, ప్రోవన్ = రక్షించుటకై, నాఁగలిమొనన్ = లాంగలాగ్రమున, హస్తినాపురిన్ = హస్తినాపట్టణమును, కౌరవవీరులెల్లన్, బెగ్గిలన్ = భయపడఁగా, పెకల్చితి = పెల్లగించితివి.

విశే. లక్షణను దుర్యోధనుని చెల్లెలం బరిగ్రహించి సాంబుఁడు పారిపోవుచుండ దుర్యోధనాదులు వానిం జెఱఁబెట్టఁగా, బలరాముఁడాతని విడువఁగోరెననియు, దుర్యోధనాదు లందుల కంగీకరింపక మీఁదు మిక్కిలి యాతని దూఱిరనియు, నక్కతన బలరాముఁడు కోపించి హస్తినాపురిని నీటఁగలుపనెంచి నాఁగేటిపాతమునఁ దలక్రిందుగాఁ జేసెననియు భాగవతము నుడువును.

మ. త్రిపురస్త్రీలఁ బతివ్రతామణుల సారెం బుంశ్చలీవర్తనం
బుపదేశం బొనరించి బేల్పఱిచి వధ్యుల్గాని తద్భర్తలన్
ద్విపచర్మాంబరుచూపుటింగలమున న్త్రోచి పాటింపవే
కపటశ్రీజినరూపము న్భువనరక్షాజాగరూకేక్షణా! 37

టీ. భువనరక్షాజాగరూకేక్షణా! = లోకముల రక్షించుటయందు మేల్కొనియుండు కన్నులుగలవాఁడా! పతివ్రతామణులన్ = పాతివ్రత్యసంపన్నలగు స్త్రీరత్నములైన, త్రిపురస్త్రీలన్ = త్రిపురాసురపట్టణములందలి వనితలను, సారెన్ = మాటిమాటికి, పుంశ్చలీవర్తనంబు = జారత్వమును, ఉపదేశంబు = బోధించుట, ఒనరించి = చేసి, బేల్పఱిచి = వంచించి, వధ్యుల్ = చంప శక్యమైనవారలు, కాని = కానట్టి, తద్భర్తలన్ = ఆత్రిపుర

స్త్రీలపతులను, ద్వీపచర్మా...టింగలమునన్ - ద్వీపచర్మ=ఏనుఁగుచర్మము; గజాసురచర్మ మనుట. అంబరు=వస్త్రముగాఁగలశివునియొక్క, చూపుటింగలమునన్ = నేత్రాగ్నియందు; శివునకు మూఁడవ కన్నగ్నిరూపమగుట ప్రసిద్ధము, వే=శీఘ్రముగ, ఇది కళ. త్రోసి=పడఁ ద్రోసి, కపటశ్రీజినరూపమున్ = కృత్రిమమగుశోభాయుక్తమైన బుద్ధరూపమును, పాటింపవే=తాల్పవే, ఇందు బుద్ధావతారము వర్ణ్యము.

విశే. మున్ను 'తారకాక్షుఁడు, కమలాక్షుఁడు, విద్యున్మాలి' అను మూఁగురు దానవులు తపమొనర్చి యవధ్యతనజునివలనఁ బడసి త్రిపురముల నిర్మించికొని తాము దమపత్నులును వేదవిహిత ధర్మానుష్ఠానపరులై దేవతలఁబీడించుచు నవధ్యులై యుండ, విష్ణువు కృత్రిమ బుద్ధసన్న్యాసిరూపమున నారక్కసులకు దురాచారములఁగఱపి యవ్వారి జాయలకు జారత్వ ముపదేశించి చెఱిపి భగ్నసద్ధర్ములనుగా నొనర్చెననియుఁ, బిదప నష్ట సదాచారులగువారి నీశ్వరుఁడు తన మూఁడవకంటిమంటచే దేవతలసాహాయ్యమునఁ ద్రిపురములతోడం గూల్చెననియు, భాగవతపద్మపురాణములు చెప్పుచున్నవి. కావున నిందు వర్ణితుఁడైన బుద్ధుఁడు విష్ణ్వంశసంభూతుఁడు కాని కపిలవస్తునగరమున మాయా శుద్ధోదనుల కుదయించినవాఁడు గాఁడని విశదమగుచున్నది. కొందఱు శౌద్ధోదనియే దశావతారములలోఁ జేరిన బుద్ధుఁడని తలంతురదియుందుఁ బొసఁగదు. మఱియుం బలరాముని స్థానమునఁ గృష్ణునవతారదశకమునఁ జేర్తురు.కొండఱు బలరాముం జేర్తురు. ఏదియెట్లున్నను బలరాముం జేర్చుటయే ప్రాచీనసంప్రదాయము. ఇందు యుక్తిమాత్రము చింత్యము.

గణసమకదండకము.—

యదుతిలక! జగత్త్రయీనిర్మితిప్రక్రియాకర్మఠేందిందిరోద్భాసినాభీ
సరఃపద్మ! పద్మాసతీపాదపీఠాకృతిప్రస్ఫురత్కౌస్తుభాంకూరితాలీక
బాలాతపద్యోత! సద్ద్యోతరంగిణ్యుదక్షాళితైణాంకభృత్పాంసులక్లిష్ట
వేల్లజ్జటాజాల! జాలంధరోడ్యాణమూలాఖ్యబంధత్రయీబంధసం
ధుక్షితస్పర్శనస్పర్శ నిర్గ్రంథితగ్రంథిషట్కాంతరోన్నిద్రకద్రూసుత
శ్రీముఖజ్వాలవల్లీపరిస్రంసమానేందు నిష్యందసర్వాంగనిష్పంద
యోగీంద్రహృద్వేదికావాస! యీవాసవాదుల్సరోజాసనున్ ము
న్నుగాఁజేసి 'సర్వంసహాభీరుభారంబుఁ బోఁద్రోయవే' యంచుఁ బ్రార్థిం
చిన న్దేవకీదేవిగర్భంబునందుద్భవంబంది బాహుద్వయద్వంద్వమున్నం
దకస్యందనాంగాబ్జకౌమోదకీశార్ఙ్గముఖ్యాయుధవ్రాతముం బీతకౌశే

యము న్వత్సభాగంబున న్మించు శ్రీవత్సముం జూపినం దల్లి భీతిల్లుచుం
'గావు కావంగదే' యన్న నీవంతలోఁ గావు కావంచు నేడ్పు ల్దలిర్పం
గసుంగందవై తండ్రియత్నంబున న్నందగోష్ఠంబునందున్నచో ప్రేత
యై చేఁతిపాల్గోల్ప నేతెంచునా పూతనా భూతనారీకుచం బగ్రహస్తం
బునంబట్టి తత్ప్రాణనిర్యాణశంఖంబుపూరించుచందంబునం గ్రుక్కల
న్నొక్కుమక్కించియు [1]న్బండి రాకాసిఁ గీలూడఁగాఁ దన్నియు న్వెన్న
వేమాఱు గొల్లాడఁగా గొల్లయిల్లాండ్రు నందారవిందాస్యతో ఱట్టు
గావించిన న్నిక్కపుంబట్టివే యంచు నిన్బట్టి చట్రోలితోఁ గట్టిన
న్దిట్టవై కిట్టి పెన్మద్దిమద్దు ల్వడం ద్రోచియు న్శైశవంబు న్విడం
బింపవే, లేఁగలు న్గోపబృందంబు బృందావనారణ్యవాటిన్నటింపం
జలత్కాకపక్షంబుతో బర్హిబర్హావతంసంబుతో మంజుగుంజాఫలో
ద్దామదామంబుతోఁ దానమూనక్రియాశంసివంశంబుతో నేపుదీపించు
[2]నీప్రోపు ప్రేపాపలం గ్రేపుల న్వైపరీత్యంబుగాఁ బాపి యాపద్మజుం
డొక్కచోడాఁచిన న్వానిరూపంబు నీవై పునస్సృష్టి నా స్రష్టగర్వంబు
ఖర్వంబుగాఁ జేయవే, తోయవేగోచ్చలద్వీచికామర్దళధ్వానమాగు
బ్బగా నుబ్బునం గేళిఁ గాళిందలోఁ గాళియాహిస్ఫటారంగమధ్యం
బునం దాండవం బాడవే, తోడిగోపాలకశ్రేణికి న్నీకు జన్నంబుల
న్మీఁదుగా నున్న యన్నంబుల న్వంచితాత్మేశలై పంచలం జల్దు లందీ
మునిస్త్రీలకు న్నీలఁ గైవల్యముం గొల్ల యీవే, పెనుంజిల్వయై బల్వి
డిం జంగిలి న్మ్రింగుదైతేయువాత న్వడిం జొచ్చి మైపెంచి తత్కా
యము న్రెండు వాయ ల్వడంజించి గోపంక్తిఁ బోషింపవే, గుంపులై
యింపులం గూడి యాభీరులా దేవతానేతకు న్జాతర ల్సేయ వారించి
తత్పూజన ల్నీవు గైకొన్న మేకొన్న పేరల్కతోఁ బుష్కలావర్త
కాబ్దంబులం బంపఁగా నంపజాలంబుగాఁ గొండలుర్లంగ వర్షించినం
గాందిశీకత్వముం బొందునామందలం బ్రోవ గోవర్ధనం బెత్తవే, మత్త
వేదండ ముద్వృత్తి నెత్తమ్మిపూవెత్తురీతి న్నిలింపానిశారిష్టదారిష్ట
మాయాబలీవర్దముం బట్టి మర్దించితంచు న్వాడి న్మ్యాకలాశ్వాకృతిం
డాసినం గేశిజీవానిలంబు ల్భుజాదందశూకంబునం గ్రోలి నీ

1 బండిపెన్రక్కసుం గండడంగించియున్. 2 నీ కాపుప్రేపాపలన్.

యౌవనోద్యద్భుజాగర్వముం జూపవే, శరదభినవసాంద్రచంద్రప్రభా
ధౌతభాస్వత్కళిందాత్మజాసైకతోత్సంగవీథిం [1]త్రిభంగ్యాకృతి
న్నిల్చి యాకుంచితభ్రూవిలాసంబుతో మోము వామాంసముం జేరఁగా
శోణదంతచ్ఛదాంతంబున న్వేణునాళంబు సంధించి రంధ్రాంతరన్యస్త
హస్తాంగుళీపల్లవాగ్రంబు లల్లాడ మ్రోయించిన న్ముక్తరోమంథ
నిష్పందగోబృందము న్వ్యక్తగోవర్ధనగ్రావనిష్యందము న్మందమం
దాంశుమన్నందనావేగముం గందళన్నీరసారణ్యజీర్ణాగముం గాఁ
గదంబించు తత్పంచమారావమున్ వించు నయ్యుంచువిల్కానికిం జిక్కి
రాధాదిగోపావరోధాంగన ల్డాసిన న్రాసక్రీడ మాయాసముల్లాసి
వై సౌఖ్యవారాశి నోలార్పవే, దర్పితాశేషదోషాచరాధీశదుస్సా
ధమై యున్న నీవిక్రమక్రీడ వీక్షింప నక్రూరుచే మామ పిల్పించినం
బోవుచోఁ ద్రోవ భావాతిగంబైన నీదివ్యరూపంబుఁ జూపం బరి
భ్రాంతుఁడై యున్న మన్నింపవే వాని నీవానిఁగా, భోజభూజాని
యుద్వేజనం బందఁ దద్రాజధానిం బ్రవేశించి యేతెంచుచో ముం
దటం జందనాలేపము న్దర్శనం బిచ్చిన న్గుజ్జుప్రాయాలికి న్సజ్జకంబైన
యందంబు నొందింపవే, యాగపూజార్చితంబైన కోదండము న్ఖండ
ఖండంబుగాఁ జేయుచుం దద్ధనుర్దండరక్షాభటస్తోమము స్తంబులం
బెల్లుగా డొల్లఁగా వ్రేయుచు న్మల్లగర్జాభుజాస్ఫాలనాభీలమై యుల్ల
సడ్డిండిమారావవాచాలమై నిగ్రహాయాతరక్షోభటోదగ్రమై
యున్న యయ్యుగ్రసేనాత్మజాస్థానిఁ జొత్తేరఁ దత్తోరణక్షోణి
నాధోరణుం డుద్ధతిం బైపయిం గొల్పినం బట్టవేనుంగుఁ జెండాడి
గండప్రవద్దానపంకంబునం బుండ్రముం గుంభనిర్ముక్తముక్తావళిం
గర్ణదామంబును న్గట్టి రక్తంబునం బట్టమై పూఁతయుం బ్రాఁతిగాఁ
బూసి తద్దంతకాండంబు కేలన్గదాదండమై యుండఁగా జెట్టివై గిట్టి
చాణూరుజానూరువుల్మాఱుమాఱు ల్వడిం ద్రిప్పి నీ వప్పళింప
న్భయభ్రాంతుఁడై పాఱ నుంకించు నక్కంచుఁ గంసుం ద్రిలోకీనృ
శంసు న్నియుద్ధక్రియాపద్ధతిం గిక్కస న్గొంతుక్రొ [2]ల్నొక్కవే,
దేవతాదుందుభివ్రాతధింధింధిమిధ్వానగాన స్వరోత్కర్షహర్షం

1 త్రిభంగీగతిన్. 2 ల్నొక్కి మక్కించి నల్దిక్కులన్ దేవతాదుందుభివ్రాత.

బులం గల్పకద్రుప్రసూనాతివర్ణంబులం బెల్లుగా నెల్లలోకంబు లుల్లాసముం బొందఁగా వానిరాజ్యంబునం బూజ్యుఁగా నుగ్రసేనుం బ్రతిష్ఠాపితుం జేయవే, దుష్టనష్టాదశాక్షౌహిణీవాహినీదుర్మదాంధు న్జరాసంధు భీమాపదేశంబునం జేసి శాసించి కౌంతేయుచే రాజసూయంబు సేయించుచో జాత్యసూయుఁ న్నయంజేది చేదిక్షమావల్లభుం డెంతయుం ద్రుళ్లినం బ్రల్లదం బాడినం బల్లెరం బెత్తి చిత్రంబుగాఁ దచ్ఛిరఃకర్తనప్రౌఢి వర్తించి ధాత్రి న్వృథావాసుదేవప్రథాచండ శౌండీరు నప్పౌండ్రుఁ జక్రాహతిం జక్కుగాఁ జేసి యీశానుఁ బోర న్మహాసేననాగానవవ్యూహసన్నాహము ల్వీడ వెన్నాడి బాణాసుర స్ఫారబాహాసహస్రచ్ఛిదాకేళిమై వాలి లోకంబుఁ బాలింపవే, ఘోర భౌమాసురగ్రామణీశిక్షకా! కౌరవాకర్షితద్రౌపదీరక్షకా! ఖేదసందగ్ధసాందీపసూనుప్రదా! వేదశాఖాశిఖాంచత్పవిత్రాళత్పదా! మాధవా! సత్యభామాధవా!

టీ. దండకము కృష్ణావతారవర్ణనము.—యదుతిలక = యదువంశశ్రేష్ఠ, జగత్త్రయీ...సరఃపద్మ-జగత్త్రయీ=మూఁడులోకములయొక్క, నిర్మితిప్రక్రియా=సృజించుటయందు, కర్మఠ=ఆసక్తుఁడగు బ్రహ్మయనెడు, ఇందిందిర=తుమ్మెదచే; బ్రహ్మచేననుట. ఉద్భాసి=ప్రకాశించు, నాభిసరఃపద్మ = బొడ్డనెడుకొలఁకునందలి తమ్మిగలవాఁడ! పద్మనాభుని నాభిపద్మమున బ్రహ్మపుట్టుటంజేసి యాతఁడాతని నాభిపద్మమునఁ దుమ్మెదభాతి నుండెననియు నాతనినాభి లోఁతైకొలఁకువలె నమరియుండెననియు భావము. పద్మాసతీ...ద్యోత-పద్మాసతీ=లక్ష్మీదేవియొక్క, పాదపీఠాకృతి = పాదవిన్యాసపీఠముయొక్క యాకారముతో, ప్రస్ఫురత్=ప్రకాశించు, కౌస్తుభ=కౌస్తుభమాణిక్యమునుండి, అంకురిత=మొలకలెత్తిన, అళీక=కృత్రిమములైన, బాలాతప = లేయెండలనెడు, ద్యోత = కాంతిగలవాఁడ! శ్రీవిష్ణునియురమునఁగల కౌస్తుభమందుండు లక్ష్మికిఁ బాదపీఠమువలె నుండెననియు, నద్దానికాంతులు లేయెండలంబోలి మించుచుండెననియు భావము. పద్యో...జాల-పత్=పాదమునందైన, ద్యోతరంగిణీ=ఆకాశగంగాసంబంధమైన, ఉద=నీటిచే, క్షాళిత=కడిగివేయఁబడిన, ఏణాంకభృత్=జింకచిహ్నముగాఁగల చంద్రునిభరించునట్టి శివునియొక్క, పాంసుల=ధూళిచేనిండిన, క్లిష్ట=చిక్కువడిన, వేల్లత్=చలించుచున్న, జటాజాల=జడలసమూహముగలవాఁడ! తొల్లిఁదొల్త, గంగ విష్ణుపాదమున నుద్భవించి పిదప నీశ్వరునిశిరసునఁ బడి క్రమముగ ముల్లోకముల వ్యాపించెను. దానంజేసి గంగోదకము శివునిపాంసులజటాజూటమును శుభ్రపఱుపఁజాలెనని గ్రహించునది. జాలంధర...

ఆవాస-జాలంధరోడ్యాణ మూలాఖ్యబంధత్రయీ = 'జాలంధరము, ఉడ్యాణము, మూలము' అను పేరులుగల మూఁడుబంధములయొక్క, బంధ = నిర్బంధముచే, సంధుక్షిత=విజృంభితమైన, స్పర్శన=గాలియొక్క, స్పర్శ=తాఁకుటచే, నిర్గ్రంథిత = ముడిలేనిదిగాఁ జేయఁబడిన; విప్పఁబడినయనుట. గ్రంథిషట్క=ఆఱుగ్రంథులయొక్క; మూలాధారాది షట్చక్రములయొక్కయనుట. అంతర = నడుమను, ఉన్నిద్ర = మేల్కొనియున్న, కద్రూసుత=సర్పముయొక్క; కుండలినీశక్తియొక్కయనుట. శ్రీముఖ = శోభాయుక్తమైన మొగమునందైన, జ్వాలవల్లీ=కాంతిలతనుండి, పరిస్రంసమాన=అంతట జాఱుచుండు, ఇందునిష్యంద = అమృతముచేనైన సర్వాంగనిష్పంద = సయస్తావయవముల స్థైర్యముగల, యోగీంద్ర=యోగిశ్రేష్ఠులయొక్క, హృద్వేదికా=మనఃపీఠములు,ఆవాస=వాసస్థానములుగాఁ గలవాఁడా! జాలంధరాదిబంధముల నిర్బంధవశమున గాలి రేఁగి తాఁకుటకతన గ్రంథిషట్కము విప్పఁబడుననియు,దాన నాగ్రంథిషట్కమున నడుమంగల కుండలినీశక్తి మేల్కొనుననియు,నపుడద్దానినుండి యమృతము జాఱుననియుఁ,దదాస్వాదపరాయణులై యోగులు నిశ్చలులైయుందురనియు, నట్టి యోగులమదులను బరమాత్మఁడు తావుగాఁగొనియుండుననియు భావము. 'మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము,విశుద్ధము,ఆజ్ఞ'అని షట్చక్రములకుఁ బేరులు. ఇందే గ్రంథిషట్కముండునని యెన్నవలయును. బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగంథి-మున్నగునవి గ్రంథులకుఁ బేరులు. ఈవాసవాదుల్ =ఈదేవేంద్రాదులు, సరోజాసనున్ =బ్రహ్మను, మున్నుగాన్ = ముందగునట్లుగా, చేసి = ఒనర్చి; బ్రహ్మను ముందిడికొని యనుట. సర్వంసహాభీరుభారంబున్ = భూమియను భయపడినదానియొక్కబరువును, పోన్ = పోవునట్లుగా, త్రోయవే=తొలఁగింపవే, అంచున్ =అనుచు, ప్రార్థించినన్ =వేఁడఁగా, దేవకీదేవిగర్భంబునన్ = దేవకీదేవియొక్కకడుపున, ఉద్భవంబు=పుట్టుకను, అంది=పొంది, బాహుద్వయద్వంద్వమున్ =నాలుగుచేతులును, నందక...వ్రాతమున్ -నందక=నందకమనుకత్తియు,స్యందనాంగ=చక్రమును, అబ్జ=శంఖమును, కౌమోదకీ=కౌమోదకియనుగదయు, శార్ఙ్గ=శార్ఙ్గమనుధనువును, ముఖ్య=మొదలగు, ఆయుధవ్రాతమున్ = ఆయుధములసమూహమును, పీతకౌశేయమున్ =పీతాంబరమును, వత్సభాగంబునన్ = వక్షస్స్థలమున, మించు = ప్రకాశించునట్టి, శ్రీవత్సమున్ = శ్రీవత్సమనులాంఛనమును, చూపినన్ = అగపడఁగా, తల్లి=దేవకీదేవి, భీతిల్లుచున్ = భయపడుచు, కావు కావంగదే = రక్షింపవె రక్షింపవే, అన్నన్ =అనఁగా, నీవు, అంతలోన్, కావుకావంచున్ =కావుకావుమనుచు; శిశురోదనధ్వన్యనుకరణము.ఏడ్పుల్ =రోదనములు, తలిర్పన్ =ఒప్పఁగా, కసుగందవై = పసిపాపవై, తండ్రియత్నంబునన్ =తండ్రియొక్కప్రయత్నముచే, నందగోష్ఠంబునన్

=నందునియావులసాలలో, ఉన్నచో=ఉండునపుడు, వ్రేతయై=గొల్లదియై, చేఁతిపాలు =చేదుపాలు; విషక్షీరమనుట. క్రోల్వన్ = త్రావించుటకై, ఏతెంచు = వచ్చిన, ఆపూతనాభూతనారీకుచంబు=ఆ పూతనయను రాకాసిపడఁతియొక్క స్తనమును, అగ్రహస్తంబునన్ =చేతికొనచే, పట్టి, తత్ప్రాణనిర్యాణశంఖంబు = ఆవనితయొక్క ప్రాణములు పోవునపుడైనచిందమును, పూరించుచందంబునన్ =నిండించువిధమున, గ్రుక్కలన్ =ఊర్పులను, నొక్కి=అణంచి, మక్కించియున్ =చంపియు, బండిరాకాసిన్ =శకటాసురుని, కీలు=సంధి, ఊడగాన్ =వదలునట్లుగా, తన్నియున్ , వెన్నన్ =నవనీతమును, వేమాఱు=పలుమాఱు, కొల్లాడఁగాన్ = దొంగిలింపఁగా, గొల్లయిల్లాండ్రు = గోపికలు, నందారవిందాస్యతోన్ = నందునిపద్మముఖితో, ఱట్టు=నింద, కావించినన్ = చేయఁగా, నిక్కపుఁబట్టివే=నిజముగ సుతుఁడవే, అంచున్ , నిన్ , పట్టి=పట్టుకొని, చట్రోలితోన్ = ఱాతిరోటితోడ, కట్టినన్ =బంధింపఁగా, దిట్టవై=శూరుఁడవై, కిట్టి=సమీపించి, పెన్మద్దిమద్దుల్ = గొప్పవగుజంటమద్దులను; యమళార్జునులనుట. పడన్ , త్రోచియున్ , శైశవంబున్ = బాల్యమును, విడంబింపవే = అనుకరింపవే. దేవకీదేవి యనుపదము మొదలుకొని యింతవఱ కేకవాక్యము. ఇందు దేవకికి శ్రీకృష్ణుఁ డుదయించి తన నిజరూపముంజూపుట, నందునింటి కంపఁబడుట, పూతనను జంపుట, శకటాసురుని హతునిఁ గావించుట, నవనీతమును ముచ్చిలుట, తల్లి రోటంగట్టఁగా దానింగిట్టుట, యమళార్జునుల భంజించుట మున్నగు శ్రీకృష్ణుని శైశవవిలాసములు వర్ణితములయ్యెను. లేఁగలున్ = ఆలదూడలును, గోపబృందంబున్ = గోపాలకసమూహమును, బృందావనారణ్యవాటిన్ = బృందావనమనెడి యడవియొక్క ప్రదేశమున, నటింపన్ = సంచరింపఁగా, చలత్కాకపక్షంబుతోన్ = కదలునట్టి పిల్లజుట్టుతోను, బర్హిబర్హావతంసంబుతో = నెమలిపించెమురూపమగు శిరోభూషణముతోడను, మంజు...దామంబుతోన్ -మంజు= అందమైన, గుంజాఫల=గురిగింజలయొక్క, ఉద్దామ = అధికమైన, దామంబుతోన్ = దండతోను, తానమానక్రియాశంసివంశంబుతోన్ = స్వరాంతరప్రవర్తనావ్యాపారమును బ్రకటించు పిల్లనగ్రోవితోను, ఏపు=అతిశయమును, దీపించు=ప్రకాశింపఁజేయు, సిప్రోపు=సిరక్షణముగల, వ్రేపాపలన్ =గొల్లపిల్లలను, క్రేపులన్ =ఆలమందలను, వైపరీత్యంబుగాన్ = వ్యత్యస్తమగునట్లుగా; అనఁగా వేఱుపడునట్లుగా, పాసి=ఎడఁబాయఁజేసి, ఆపద్మజుఁడు=ఆబ్రహ్మ, ఒక్కచోన్ = ఒకానొకప్రదేశమున, డాచినన్ = దాపఁగా, వానిరూపంబు = ఆ గోపాలకులయొక్కయు నాలమందలయొక్కయు స్వరూపము, నీవై=నీవేయయి, అనఁగా నీవే గోపాలకులయుఁ, క్రేపులయు రూపును ధరించినవాఁడవై యనుట. పునస్సృష్టిన్ = ప్రతిసృష్టిచేతను, అస్పష్టగర్వంబున్ =

ఆబ్రహ్మగర్వమును, ఖర్వంబుగాన్=హ్రస్వమైనదిగా, చేయవే=ఒనర్పవే. బ్రహ్మ గోపాలురను మందలను దాచివేసి మాయముచేయఁగా, శ్రీకృష్ణుఁడు తానే వానిరూపముందాల్చి పునస్సృష్టియొనర్చి సృష్టికర్తయగు బ్రహ్మగర్వము నడంచెనని భావము. తోయవేగ... ధ్వానము-తోయవేగ = ఉదకవేగముచేత, ఉచ్చలత్=లేచిన, వీచికా = తరంగములనెడు, మర్దళ=మద్దెలలయొక్క, ధ్వానము=ధ్వని, అగుబ్బుగాన్ = అతిశయింపఁగా, ఉబ్బునన్=సంతోషముతో, కేళిన్=విలాసముతో, కాళిందిలోన్ = కాళిందియనుమడుపులో, కాళియాహి...మధ్యంబునన్ - కాళియాహి = కాళియమను నాగముయొక్క, స్ఫటా=పడగలనెడు, రంగ=నాట్యభూమియొక్క, మధ్యంబునన్=నడుమను, తాండవంబు=నృత్యమును, ఆడవే=చేయవే.తోడిగోపాలకశ్రేణికిన్=నీతోఁ గలిసిమెలిసియున్న గోపాలురకును, నీకున్, జన్నంబులన్=యజ్ఞంబులందు, మీఁదుగాన్=ముదుపుగా, ఉన్న=ఉంచిన, అన్నంబులన్, వంచితాత్మేశులై=మోసపుచ్చిన పతులుగలవారై, పంచలన్=గృహపార్శ్వదేశముల, చల్దులు, అందీన్=అందింపఁగా; ఇది శబ్దపల్లవమనియందురు. ముని స్త్రీలకున్=మునిపత్నులకు, లీలన్=విలాసముతో, కైవల్యమున్=మోక్షమును, కొల్ల=అనివార్యముగా, ఈవే=ఒసంగవే. మునిపత్నులు తమ పతులకుందెల్పక దేవతలకై ముడుపుగానుంచిన యన్నములం దెచ్చి శ్రీకృష్ణునకును, నాతనితోడిగోపాలురకును నొసంగ వాని నారగించి వారికి మోక్షముం గృపచేసెనని భావము. సర్వదేవతాస్వరూపుఁడును, యజ్ఞపురుషుఁడును నగు శ్రీకృష్ణుఁ డిట్లొనరించుటలో వింతయేమి? తత్ప్రీణనమునకేగదా యజ్ఞాదు లేర్పడినవి. పెనుంజిల్వయై=పెద్దపామయి, బల్విడిన్ = ఉద్ధతితో, జంగిలిన్=ఆలమందను, మ్రింగు, దైతేయునివాతన్ = రాక్షసునినోటను, వడిన్=వేగముగ, చొచ్చి=ప్రవేశించి, మై=శరీరమును, పెంచి=వృద్ధినందించి, తత్కాయమున్ = అసర్పరూపియగు రక్కసునిశరీరమును, రెండువాయల్ = రెండుచీలికలు, పడన్=పడునట్లుగా, చించి=చీరి, గోపంక్తిన్=ఆలచాలును, పోషింపవే = రక్షింపవే. గుంపులై=సమూహములై, ఇంపులన్=ప్రేమలతో, కూడి=కలసి, ఆభీరులు = గొల్లలు, ఆదేవతానేతకున్=ఆదేవేంద్రునకు, జాతరల్ = ఉత్సవములు, సేయన్, వారించి = వలదని, తత్పూజనల్ = అయ్యర్చనలను, నీవు, కైకొన్న=స్వీకరింపఁగా, మేకొన్న=అంగీకృతమైన, పేరల్కతో=పెద్దకోపముతో, పుష్కలావర్తకాబ్దంబులన్ = పుష్కలావర్తకములను మేఘములను, పంపఁగా, అంపజాలంబుగాన్=బాణసమూహమగునట్లుగా, కొండలు, ఉర్లంగన్ = పెకలింపఁబడునట్లు, వర్షించినన్, కాందిశీకత్వమున్=భయపడి పాఱిపోవుటను, పొందు=పొందిన, ఆమందలన్=ఆలమందలను, ప్రోవన్ = రక్షించుటకొఱకై, గోవర్ధనంబున్ = గోవర్ధనమనుకొండను, ఎత్తవే=పైకెత్తితివిగావా! గొల్ల

ల్లెల్ల దేవేంద్రున కుత్సవం బొనర్ప నెంచి సర్వసంభారములం గూర్చికొని సిద్ధముగనుండ శ్రీకృష్ణుఁడు వారి నింద్రునకై జాతర సేయవలదని వారించి తత్సంభారములను, దత్పూజన ములను, దత్తానమునఁ దానే పొందఁగా నింద్రుఁడు కోపించి పుష్కలావర్తముల ననిపి మహోపద్రవముగ వర్షింపించినఁ గోవులుం గోపకులును గాందిశీకులుగాఁగ గోవర్ధనము గొడుగువడువున నెత్తి దాని క్రింద గోవులను గోపకులనునుంచి రక్షించెనని తాత్పర్యము. మత్తవేదండము=మదగజము, ఉద్వృత్తిన్=ఉద్ధతితో, నెత్తమ్మిపూవు = మనోజ్ఞమగు పద్మమును, ఎత్తుకొంటిన్=ఉద్ధరించుగలిని. నిలింపా...పర్వమున్ - నిలింప = దేవతలకు, అనిశ=ఎల్లప్పుడును, అరిష్ట=ఆపత్తును, ద=ఇచ్చునట్టి, అరిష్ట=అరిష్టమను పేరుగల, మాయా బలీవర్దమున్ = కృత్రిమవృషభమును, పట్టి, మర్దించితి=కొట్టితివి, అంచున్, ఐడిన్ = శీఘ్రముగ, శూకలాశ్వాకృతిన్ = మదించినయశ్వము నాకారముతో, డాసినన్ = సమీపింపఁగా; రూ. అ. దాయం. దకారమునకు డకారముకల్గె. కేశిజీవానిలంబుల్ = కేశియనురాక్షసుని ప్రాణవాయువులను, భుజాదండశూకంబునన్ = చేయియనుసర్ప ముచే, క్రోలి=త్రావి, నీయాపనోపద్యద్భుజాగర్వమున్ = నీసంబంధమైన ప్రాయమువలన నుదయించిన భుజములమదమును, చూపవే=అగపఱుపవే! సర్పము వాయుభక్షకమగుటం జేసి ప్రాణవాయుభక్షణసమర్థనార్థము భుజమునందు సర్పత్వమారోపితమయ్యెను. శరదభి నవ...వీథిన్-శరత్=శరత్కాలముచే, అభినవ=నూతనమైనదియు, సాంద్ర = తఱచైనదియునగు, చంద్రప్రభా=వెన్నెలచే, ధౌత=తెల్లనైన, భాస్వత్ = ప్రకాశించునట్టి, కళిందాత్మజా=యమునానదియొక్క, సైకత=ఇసుకతిన్నెయొక్క, ఉత్సంగవీథిన్ = అంకభాగమున, త్రిభంగ్యాకృతిన్ = మువ్వంకయైనయాకారముతో, నిల్చి = ఉండి, ఆకుంచితభ్రూవిలాసంబులతోన్ = గడిపంకబొమలయొక్కఅందముతో, మోము = ముఖము, వామాంసమున్ = ఎడమబుజమును, చేరఁగా=చెందఁగా, శోణదంతచ్ఛదాంతంబునన్=ఎఱ్ఱనైన పెదవియొక్కకొనచే, వేణునాళంబున్=పిల్లనగ్రోవిని, సంధించి= పట్టి, రంధ్రాంతర...గ్రంబులు-రంధ్రాంతర = బిలములమధ్యలందు, న్యస్త = ఉంచఁబడిన, హస్త=చేతులయొక్క, అంగుళీపల్లవ = చిగురులంబోలు వ్రేళులయొక్క, అగ్రంబులు=కొనలు, ఆహ్లాదన్=చలింపఁగా, మ్రోయించినన్ = వాగునట్లుచేయఁగా, ముక్త...బృందమున్-ముక్త=విడువఁబడిన, రోమంథ = నెమరుకలదియు, నిష్పంద = చలింపనిదియునగు, గోబృందమున్ = ఆవులసమూహమును, వ్యక్త...నిష్యందమున్ - వ్యక్త=ప్రకటితమగు, గోవర్ధనగ్రావ = గోవర్ధనపర్వతపురాలయొక్క, నిష్యందమున్ = స్రవించుటయును, మంద...వేగమున్-మందమంద = మిగుల మందమైన, అంశుమన్నందనా=సూర్యునికూఁతురగు కాళిందియొక్క, వేగమున్=త్వరయును, కందళత్......

గమున్ - కందళత్=మొలకలెత్తు (చిగుర్చు), నీరసారణ్యా = ఎండినయడవియందలి, జీర్ణాగమున్ = ముసలిమ్రాఁకులుగలదియు, కాన్ = అగునట్లుగా, కదంబించు = వాసించునట్టి, తత్పంచమారావమున్ = ఆ వేణునాదసంబంధమగు పంచమధ్వనిని, వించున్=ఆకర్ణించుచు, అయ్యించువిల్కానికిన్ = ఆమన్మథునకు, చిక్కి = వశలై, రాధాదిగోపావరోధాంగనల్ = రాధ మున్నగు గోపాలురభార్యలు, డాసిరన్ = చేరరాఁగా, రాసక్రీడన్=రాసక్రీడచే, మాయాసముల్లాసివై = మాయానందముగలవాఁడవై, సౌఖ్యవారాశిన్=సుఖసముద్రమున, ఓలార్పవే=ఈఁదఁజేయవే. శరచ్చంద్రికచే మిగుల ధవళితమైన యమునాపులినోర్విని శ్రీకృష్ణుఁడు ముప్పంకగానిల్చి గళీవంకబొమలమర మోము వామాంసమున నమరిచి పెదవులందు మురళినమర్చి మురళీబిలముల వ్రేళులు చలింపఁ బంచమనాదమెలర్ప వాయింప, నాలమందలు నెమరువేయుటమాని నిశ్చలములై నిల్చెననియు, గోవర్ధనగిరిశిలలు కరంగెననియు, యమునాప్రవాహవేగముంగూడ మిగుల మెల్లనయ్యెననియు, మ్రోఁకులు చిగిర్చెననియు, రాధాదిగోపాంగనలు మన్మథవశలై యాతనికడ కేతెంచిరనియు, వచ్చినవారలను రాసక్రీడావిశేషమునఁ గృత్రిమానందపరవశుఁడై యానందాబ్ధి నోలలాడించెననియు భావము. అనఁగా శ్రీకృష్ణుని మురళీగానమాధురిని రాలు గరఁగెననియు, నావులుగూడ పరవశములయ్యెననియు, గోపికలు మన్మథవశలైరనియు, యచేతనమగు యమునాప్రవాహముంగూడఁ బరవశమయ్యెననియు, మ్రోఁకులుగూడఁ జిగిర్చెననియుఁ దాత్పర్యము. గోపికలసమూహమున నొక్కొక్కద్వంద్వముతో శ్రీకృష్ణుఁడు తానొక్కఁడే పలురూపములందాల్చి మండలాకృతినివిహరించుట రాసక్రీడావిశేషముగాఁ దెలియుచున్నది.దర్పితా...దుస్సాధమై-దర్పిత=గర్వితులైన, అశేష=సమస్తమైన, దోషాచరాధీశ = నిశాచరపతులకును, దుస్సాధమై=సాధింపరానిదై, ఉన్న, నీవిక్రమక్రీడన్=నీపరాక్రమక్రీడను, వీక్షింపన్=చూచుటకై, అక్రూరుచే=అక్రూరుఁడనువానిచే, మామ = మామయగుకంసుఁడు, పిల్పించినన్=పిలిపింపఁగా, పోవుచోన్=ఏగునపుడు, త్రోవన్=మార్గమున, భావాతిగంబు = ఊహింపరానిది, ఐన, నీదివ్యరూపంబున్ = నీమంగళరూపమును, చూపన్ = అగపడఁగా, పరిభ్రాంతుఁడై=విమోహితుఁడై, ఉన్నన్=ఉండఁగా, వానిన్ = ఆయక్రూరుని, నీవానిఁగా=నీభక్తునిఁగా, మన్నింపవే=గారవింపవే. కంసుఁడు శ్రీకృష్ణుని పరాక్రమముం జూడ నక్రూరునిచేఁ బిలిపింపఁగా శ్రీకృష్ణుఁడేగుచు దారిలో నక్రూరునకుఁ దన దివ్యరూపముం జూపెననియు, దాన నాతఁడు భ్రాంతుఁడుగా వాని మన్నించెననియు భావము. భోజభూజాని=కంసుఁడు, ఉద్వేజనంబు = భయమును, అందన్ = పొందునట్లుగా, తద్రాజధానిన్ = ఆతని ముఖ్యపట్టణమగుమధురను, ప్రవేశించి = చొచ్చి,

ఏతెంచుచోన్=వచ్చునపుడు, చందనాలేపమున్ = చందనపంకమును, దర్శనంబు = కానుకగా, ఇచ్చినన్=ఒసఁగఁగా, కుబ్జప్రియాలికిన్ = కుబ్జయను గృహిణికి, సజ్జకంబైన=మనోజ్ఞమైన, అందంబున్ = సొగసును, ఒందింపవే = పొందునట్లు చేయలేదా! చందనాలేపము గానుకగా నొసంగఁ గుబ్జకు సుందరరూపముం గృష్ణుఁడు కృపచేసెనని భావము. యాగపూజార్చితంబైన = యజ్ఞార్చనచేఁ బూజితమైన, కోదండమున్=ధనువును, ఖండఖండంబుగాన్ = తుత్తునియలుగా, చేయుచున్, తద్ధను...మస్తంబులన్-తద్ధనుర్దండ = ఆకోదండముయొక్క, రక్షా=రక్షించుటకల, భటస్తోమ = భటసమూహములయొక్క, మస్తంబులన్=శిరస్సులను, వెల్లిగాన్ = అధికముగా, డొల్లఁగాన్ = జాఱునట్లు, వ్రేయుచున్=కొట్టుచు, మల్ల...భీలమై-మల్ల = జెట్టులయొక్క, గర్జా = సింహనాదములతోడను, భుజాస్ఫాలన=భుజముల యప్పళించుటలతోడను, ఆభీలమై = భయంకరమై, ఉల్లసత్...వాచాలమై-ఉల్లసత్ = ఒప్పుచున్న, డిండిమారావ=డిండిమమను వాద్యవిశేషముయొక్క ధ్వనిచే, వాచాలమై = ధ్వనించుచున్నదై, నిగ్రహో...దగ్రమై-నిగ్రహ=శిక్షించుటకై, ఆయాత=వచ్చిన, రక్షోభట = రక్షకభటులచే, ఉదగ్రమై=అధికమైనదై, ఉన్న, అయ్యుగ్రసేనాత్మజాస్థానిన్ = ఆకంసుని యాస్థానభూమిని, చొత్తేరన్=ప్రవేశింపఁగా, తత్తోరణక్షోణిన్ = ఆసభాభవనబహిర్ద్వారప్రవేశమున, ఆఘోరణుండు=మావటీఁడు, ఉద్ధతిన్ = అతిశయముతో, పైపయిన్ = మీఁద మీఁద, కొల్పినన్=పురికొల్పఁగా, పట్టపేనుంగున్ = పట్టపుగజమును; కువలయాపీడమనుదానిని, చెండాడి=చంపి, గండ...పంకంబునన్-గండ=చెక్కిళులనుండి, స్రవత్=జాఱుచున్న, దాన=మదమను, పంకంబునన్=బురదచే, పుండ్రమున్=తిలకమును, కుంభనిర్ముక్తముక్తావళిన్=కుంభస్థలమునుండి జాఱినముత్తెములసమూహముచే, కర్ణదామంబునున్ = చెవులకలంకారమగుదండను, కట్టి = కూర్చికొని, రక్తంబునన్=ఆయేనుఁగునెత్తుటిచే, పట్టె=సాంద్రమగు, మైపూఁతయున్=శరీరలేపమును (చందనపుఁబూఁతవంటిదానినను ట), ప్రాఁతిగాన్=సొగసుగా, పూసి=పూసికొని, తద్దంతకాండంబు=ఆయేనుఁగుయొక్క దండముంబోలుదంతము, కేలన్=హస్తమున, గదాదండమై=గదరూపమగు నాయుధవిశేషమై, ఉండఁగాన్, జెట్టివై = మల్లుఁడవై, చాణూరు=చాణూరుని, జానూరువుల్ = మోఁకాళ్లనుదొడలను, నూఱుమాఱుల్ = నూఱుపర్యాయములు, వడిన్ = శీఘ్రముగ, త్రిప్పి=గిరగిరఁద్రిప్పి, గిట్టి=చంపి, నీవు, అప్పళింపన్=చఱువఁగా; భుజోర్వ్యాస్ఫాలనమొనర్పఁగాననుట. భయభ్రాంతుఁడై = భయముచేఁ దెలివితప్పినవాఁడై, పాఱన్ = పాఱిపోవుటకు, ఉంకించు=యత్నించునట్టి, అక్రూరించున్=ఆరాక్షసుని, కంసున్ = కంసుని, త్రిలోకీనృశంసున్ = ముల్లోకములకు హింసకుఁడైనవానిని, నియుద్ధక్రియా

పద్ధతిన్ = బాహుయుద్ధవ్యాపారముయొక్క మార్గమున, కిక్కసన్ = మిక్కిలి నొక్కుటచేత, గొంతుక్రోల్ = కంఠనాళమును, నొక్కవే = అదుమవే!, దేవతా... హర్షంబులన్ - దేవతా = సురలసంబంధమైన, దుందుభివ్రాత = దుందుభులను వాద్యవిశేషములగుమియొక్క, ధింధింధిమిధ్వాన = ధింధింధిమియనుధ్వనితోఁగూడిన, గానస్వర = గీతస్వరములయొక్క, ఉత్కర్ష = అతిశయముచేనైన, హర్షంబులన్ = సంతోషములతో, కల్పకద్రు... వర్షంబులన్ - కల్పకద్రు = కల్పవృక్షసంబంధమైన, ప్రసూనాతివర్షంబులన్ = పుష్పరూపములగు విపులమైనవర్షములచే, పెల్లుగాన్ = అధికముగా, ఎల్లలోకంబులున్ = సమస్తలోకములు (అనఁగా వానియందలిజనులనుట), ఉల్లాసమున్ = సంతోషమును, పొందఁగాన్ = పొందునట్లుగా, వానిరాజ్యంబునన్ = ఆకంసునిరాజ్యమున, పూజ్యుఁగాన్ = పూజింపఁదగువానినిగా, ఉగ్రసేనున్ = ఉగ్రసేనుఁడను కంసునితండ్రి ప్రతిష్ఠాపితున్ = నెలకొల్పఁబడినవానినిగా, చేయవే = ఒనర్పవే. కంసునిరాజధానిం బ్రవేశించునపుడు బహిర్ద్వారమున మావటీఁడు మదగజముం గువలయాపీడముం దనపైఁ బురికొల్ప శ్రీకృష్ణుఁ డద్దానిం జంపి దానిమదమునఁ దిలకమును దిద్దికొని దాని కుంభస్థలమునందలి ముత్యములఁ గర్ణపూరముగఁ జేసికొని దానిరక్తము మైపూఁతగనొనర్చి దాని దంతముం గదాదండముగఁ జేకొని భయదమైన కంసాస్థానభువిం జొచ్చి చాణూరుని మల్లుని మడియఁ జేసి కంసుని కంఠనాళమును నొక్కి చంపి యాతనిపట్టణమున నాతని తండ్రి నుగ్రసేనుం దేవదుందుభులు మ్రోయం బ్రతిష్ఠించెనని భావము. దుష్టున్ = దుర్మార్గుని, అష్టాదశాక్షౌహిణీవాహినీదుర్మదాంధున్ = పదునెనిమిది యక్షౌహిణులపరిమాణముకల సేనచేనైన దుష్టమైనగర్వముచే గ్రుడ్డివాఁడైనవానిని; పదునెనిమిదక్షౌహిణులు గలవని గర్వించి కన్నుగాననివాఁడనుట. జరాసంధున్ = జరాసంధుఁడనువానిని, భీమాపదేశంబునం జేసి = భీమునిమిషచే, శాసించి = చంపి, కౌంతేయుచేన్ = ధర్మరాజుచే, రాజసూయంబు = రాజసూయమనుయజ్ఞంబును, చేయించుచోన్ = ఒనరింపఁజేయునపుడు, జాత్యసూయన్ = జాతియందైనయసూయచే; తానుత్తమక్షత్రియుండనని యుఁ గృష్ణుఁడు కాఁడనియు ననునీర్ష్యచే ననుట. భయంబు = వెఱపును, ఏది = విడిచి, చేదిక్ష్మావల్లభుండు = చేది దేశాధీశుఁడగు శిశుపాలుఁడు, ఎంతయున్ = మిక్కిలి, త్రుళ్లునన్ = మిడిసిపాటుచే, ప్రల్లదంబు = దుష్టాలాపములు, ఆడినన్ = పలుకఁగా, పన్నైరంబు = పన్నైరముం గోలుచక్రమును, ఎత్తి = పైకెత్తి, తచ్ఛిరఃకర్తనప్రౌఢిన్ = ఆతని తలనఱుకుటయందలి ప్రౌఢత్వముతో, వర్తించి = ఒప్పి, పదునెనిమిదక్షౌహిణులు తనకుఁ గలవని గర్వించియున్న జరాసంధుని శ్రీకృష్ణుఁడు భీమునిచేఁ జంపించి శత్రుశూన్యముగ భువినొనర్చి శత్రుజయా

నంతరమునఁ జేయఁదగినరాజసూయ మనుయాగముం గౌంతేయాగ్రజుచేఁ గావించి యం దర్ఘ్యప్రదానవిషయమునఁ దన్నర్హునిగ నెన్నికొనఁగా శిశుపాలుఁడు తన్నుత్తమ క్షత్రియుఁడవుగావని దుర్భాషలాడినఁ, జక్రాహతి నాతని తలం దునిమెనని భావము. రెండుశకలములుగ నుదయించినవానిని జర యను దేవత సంధించి యొకటిగఁ జేయుటం జేసి జరాసంధనామ మా చేదీశునకుఁ గల్గెను. అక్షోహిణియనియు నోకారమధ్యముగఁ గవు లుపయోగించియున్నారు. 'సహస్రాక్షోహిణు లట్లు మీరు చూడరె యెందున్' అని తిక్కన. ఇరువదియొకవేయియు నెనిమిదినూర్లడెబ్బదిరథములును, నన్నియేగజము లును, నరువదియేనువేయిలయారునూర్లపదిగుఱ్ఱములును, నొకలక్షయుఁ దొంబదిమూఁడు వేయిలమూఁడువందలయేఁబది కాల్బలమును గల్గినవాహిని యక్షోహిణినాఁబడునని యాది పర్వము. రాజసూయము=రాజులఁజంపినకారణముగాఁ జేయునది. ధాత్రిన్ = భువిని, పృథావాసు......శౌండీరున్-పృథా=వ్యర్థముగా, వాసుదేవ=వాసుదేవుఁడను, ప్రథా =ప్రసిద్ధిగల, చండ=దుష్టుఁడైన, శౌండీరున్ = గర్వితుఁడైనవానిని, అప్పౌండ్రున్ = ఆపౌండ్రకుఁడనువానిని, చక్రాహతిన్ = సుదర్శనమనుచక్రంపుదెబ్బచే, చక్కఁగా = ముద్దగా, చేసి; చంపి యనుట. శ్రీకృష్ణుఁడు వసుదేవాపత్యముగాన వాసుదేవుఁ డను పే రాతనియెడల నన్వర్థమగును. పౌండ్రకుఁ డట్లుగాక తగనిరీతిని దావాసుదేవుఁ డనుతన నామముం దాల్చి దుష్టుఁడై పరగుచుంట శ్రీకృష్ణుఁ డాతనిం జంపెనని తాత్పర్యము. పోరన్=యుద్ధమున, మహాసేన...వ్యూహములు-మహాసేన=కుమారస్వామియొక్కయు, నాగానన=గజాననునియొక్కయు, వ్యూహసన్నాహము=సేనాసన్నివేశప్రక్రమములు, వీడన్=విచ్చిపోవునట్లుగా, ఈశానున్=శంకరుని, వెన్నాడి=తఱిమి, బాణాసుర... కేళిమైన్ - బాణాసుర = బాణుఁడనురక్కసునియొక్క, స్ఫార=విస్తారమైన, బాహా సహస్ర=వేయిచేతులయొక్క, ఛిదాకేళిమైన్=నఱకుటయనునాటచేత, వాలి=మించి, లోకంబు=జగమును, పాలింపవే=రక్షింపవే. శ్రీకృష్ణసుతుఁ డనిరుద్ధుఁ డుషాసఖి యగు చిత్రలేఖ దగుమంత్రబలమున బాణతనూజయైన యుషయనుకన్యకదగునంతిపురంబు నకుఁ గొనిపోఁబడి యామెతోడం గూడియుండ నంత నామెకు గర్భమొదవఁ దత్క న్యాసఖులు భయపడి బాణున కావిషయమును నివేదించిరి. అంత నారాక్షసరా జనిరుద్ధుఁ గారాగారమున నిరుద్ధుఁ జేసెను. శ్రీకృష్ణుఁ డాతని విడువ మని కోరినను నాతఁడు విడువ కుండెను. బాణునితపమునకు మెచ్చి శివుఁ డాతనివాకిటఁ గాపరియై యుండువాఁడు గాన శ్రీకృష్ణాదులం బాణునిపై దండెత్తినపుడు శివుఁడు తనభక్తునకుఁ గుమారస్వామి తోడను గజముఖునితోడను బ్రమథగణసమేతుఁడై తోడుసూపెను. అయ్యదనున జన్య మున శ్రీకృష్ణుఁ డాకుమారబలమును గజముఖునిబలమును గాందిశీకమొనర్చి యాశు

నోడించి బాణుంజంపి యుషానిరుద్ధులం గొని పురికేగి వారికిఁ గల్యాణమొనర్చె ననుకథ యిచట ననుసంధింపఁదగును. ఘోరభౌమాసురగ్రామణీశిక్షకా!=భయంకరుఁడైన భూమిసుతుండైన నరకాసురుం డనురాక్షసశ్రేష్ఠుని శిక్షించినవాఁడా! కౌరవాకర్షిత ద్రౌపదీరక్షకా!=కౌరవునిచే నీడ్వంబడుద్రౌపదిని రక్షించినవాఁడా! ఖేదసందగ్ధసాందీపసూనుప్రదా=దుఃఖముచేఁ బరితప్తుఁడైన సాందీపునకుఁ గుమారునొసంగినవాఁడా, (ఉజ్జీవింపఁ జేసినవాఁడనుట.) వేదశాఖాశిఖాంచత్ప్రవాళత్పదా = వేదములను కొమ్మలయొక్క యగ్రముల నొప్పునట్టిచిగుళ్లవలె నాచరించుపాదములుగలవాఁడ; వేదాంతవేద్యుఁడని భావము. మాధవా=శ్రీకృష్ణా(లక్ష్మీపతీ!) దీనిచే రుక్మిణీపతిత్వము సూచితము. సత్యభామాధవా=సత్యభామకుఁ బతియైనవాఁడా.

విశే. ఇందు శ్రీకృష్ణునిశైశవాద్యవస్థలం దగుకృత్యములు సరసముగ వర్ణితములు. అందు ముఖ్యముగ దుష్టశిక్షణ మిందు సూచితమగుటం జేసి, యాతనివిష్ణుత్వమును సమర్థితమగుచున్నది. దీనిం దండకంబండ్రు. ఇది యుద్ధరమాలావృత్తములలోఁ జేరును. తొలుఁదొల్త నగణములు రెండు నిల్పి పిదప నన్నియుం రగణములేనిల్పుట యొకలక్షణము. ఒక నగణము తొలుతను, బిదప నన్నియుఁ దగణములే నిల్పుట వేఱొకపక్షము. అన్నియుఁ దగణములే నిల్పుట యొండొకపక్షము. ఇందేదేని స్వీకరింపనగును. ఈదండకమునఁ దొలుత రెండునగణములును బిదప రగణములును నిల్పఁబడినవి. కాన మొదటవ్రాసినలక్షణమునకే యియ్యది లక్ష్యమగుచున్నది. సమానమగు గురులఘువులు గలరగణములతోనే కూర్పఁబడినదౌట దీని గణసమకదండక మనఁ జనును. మనోహరములగు ననుప్రాసాదిశబ్దాలంకారములతోడను స్వభావోక్త్యాద్యర్థాలంకారములతోడను, మృదుమధురపదసందర్భముతోడను, నిది హృద్యంబై వెలయుచున్నది. ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకుం దాయాయాసందర్భముల మనోజ్ఞమై యమరియున్నది.

కృష్ణుఁడు వైజయంతమున విడియుట.

చ అని కొనియాడి విశ్వభువనైకధురంధర! నేఁడు రేపు నీ
వనితయు నీవు నిచ్చట నవశ్యము మజ్జనభోజనాదిపూ
జనములు గైకొన న్వలయు సమ్మతిమై నని పల్కు దేవతా
జననికి మ్రొక్కి యియ్యకొని జంభవిరోధి మొగంబుఁజూచినన్. 39

టీ. అని, కొనియాడి = నుతించి, విశ్వభువనైకధురంధర = సమస్తప్రపంచమునకు ముఖ్యుఁడైనభారవాహకుఁడా; నీవనితయున్, నీవున్, నేఁడున్ = ఈదినము

నను, రేపున్ = మఱుచటిదినమునను, ఇచ్చుటన్, అవశ్యమున్ = తప్పక, మజ్జన భోజనాదిపూజనములు = స్నానము భోజనము మున్నగుసపర్యలు, సమ్మతిమైన్ = అంగీకారముతో, కైకొనన్ వలయును = స్వీకరింపవలెను, అని, పల్కన్ = అనఁగా, దేవతాజననికిన్ = దేవతలకుఁ దల్లియైనయదితికి, మ్రొక్కి=నమస్కరించి, (కృష్ణుఁడు కర్త), ఇయ్యకొని=అంగీకరించి, జంభవిరోధిమొగంబున్ = జంభశత్రువగు నింద్రుని మోమును, చూచినన్=విలకింపఁగా.

భా. సుగమము.

వ్యా-విశే. మెయి. మయి. మై. ఇవి తృతీయాప్రత్యయార్థకములు.

చ. అమరవిభుండు సేరి వినయానతుఁడై విడిపట్టు వైజయం
తమునను జిత్తగింపు మన నవ్వుచుఁ దద్బలదైత్యవైరి హ
స్తము గయిదండ గొంచు గిరిశప్రముఖాఖిలలోకపాలకుల్
క్రమమునఁ జేరి కొల్వఁ జని కాంచెఁ దదున్నతసౌధరాజమున్.40

టీ. అమరవిభుండు = దేవేంద్రుఁడు, చేరి=సమీపించి, వినయావనతుఁడై=అడఁకువచేనమ్రుఁడై, విడిపట్టు=విడిదల, (బస) వైజయంతమునన్ = వైజయంతమనుప్రాసాదమున, ఇంద్రుడుండుమేడ కిది పేరు. చిత్తగింపుము = అనుగ్రహింపుము. అనన్, నవ్వుచున్, తద్బలదైత్యవైరిహస్తమున్ = ఆబలాసురశత్రువగు నింద్రునిచేతిని, కయిదండ=ఊఁత, కొంచున్=స్వీకరించుచు, గిరిశప్రముఖాఖిలలోకపాలకుల్=ఈశానుఁడు మొదలగులోకపాలురు, క్రమమునన్=వరుసగా, చేరి=సమీపించి, కొల్వన్ = సేవింపఁగా, చని=ఏగి, తదున్నతసౌధరాజమున్=అయ్యింద్రునిసౌధశ్రేష్ఠమును, కాంచెన్ = చూచెను.

భా. సుగమము.

వ్యా-వి. కయి. రూ. కై. కయి=చేతికి, దండ-ఆశ్రయము = కైదండ.

## వైజయంతవర్ణనము.

వ. అదియును నామరసరిదుపహృతహేమతామరసస్తోమతోరణదామ రామణీయకసూచితసౌదామనీవిలసితంబును, గనత్కనకకింకిణీకుల సంకులక్వాణముగ్ధమధురాలాప నృత్యన్నిజాపత్యమూర్త్యావహ పార్శ్వప్రవర్తమాన విమానసంతానంబును, నర్థిజనాభిమతదానార్థసంగ్రహాసంశయాపాదిసమస్తవస్తుప్రతిబింబసంభావితశేఖరీకృతచింతారత్నంబును, నక్షీణ సహస్రాక్షమణిగవాక్షావళీసాక్షా

త్కృత నాకలక్ష్మీకటాక్ష వీక్షావిశేషంబును, ననర్ఘమణిస్తంభ ప్రతిబింబితనృత్యదప్సరస్సహస్ర ప్రదర్శ్యమాన లాస్యావలోకన సారస్యాగతగృహదేవతాశత సన్నిధానంబును, పులోమనముచి జంభపాకవృత్రబలప్రముఖదైత్యవిధ్వంసనసన్నద్ధ శతమన్యుజన్య సన్నాహానుకారిచిత్రకర్మవిచిత్రితభిత్తిభాగంబును, వళితరుచిరరుచి నిరంతరస్ఫాటికకూటాంతర విశ్రాంతైరావతోచ్చైశ్శ్రవస్సూచ్యమానక్షీరసాగరస్నానక్రమంబును, దరంగితమణి [1]భృంగారకవీటికాకరండతాలవృంతచామరదర్పణకళాచికాపాదుకాది పరికరప్రపంచసంచితకరాంచల [2]విశ్వకర్మనిర్మిత యంత్రపాంచాలికాసంచయవంచితపరమార్థపరిచారికాసార్థంబును, నిరంతరసంతానానోకహదుకూలమయపతాకాశతాకారితాకాశగంగాచటులతర తరంగావతరణంబును,సమంతతస్తంతన్యమానతోయకర్మాంతికనిర్ముక్తమందారవిటపిమకరందగంధసలిలసేకాతిరేకశీతలమణివేదికాప్రదేశంబును, బహిర్ద్వారవితర్దికాప్రకోష్ఠప్రతిష్ఠాపితాష్టాపదఖట్వాస్తీర్ణ హరిచందనసాలబాలపల్లవోల్లసితసంధ్యారాగసంధానంబును, నవిరళకల్పప్రసవరజఃపటలపటవాసపాంసువాసిత కౌశేయవితానపటీప్రకటీకృతచంద్రాతపపరిపాటికంబు నగుచుఁ, జతురతరశచీకరవిరచితంబులై మణికుట్టిమతలప్రతిబింబితతారకాకుటుంబంబుల విడంబించు పారిజాతకుసుమోపహారంబులవలన, స్వాహాబాహాంచలావాహితంబులై మహారజతపాత్రంబులఁ జిత్రంబులుగా వెలుంగునారాత్రికాదీపకళికలవలన, యమకామినీధూమోర్ణాతీర్ణంబులై విస్తీర్ణంబుగా నెగయు మలయజకాలాగురుధూపధోరణులవలన, యాతుధానావరోధవధూవిధీయమానంబులై విలసిల్లు గృహప్రవేశసమయసముచితబలివిధానసంవిధానంబులవలనఁ, బాశధరమత్తకాశినీసూత్రితంబులై విలోకనపాత్రంబులగు లలితప్రవాళలతావందనమాలికలవలనఁ, బవమానమానవతీసియుక్తంబులై బాలికాజనంబులకరతలంబులం బరిభ్రమించు కర్పూరతాలవృంతంబులవలన, నరధర్మసధర్మిణీనిర్మితంబులగునిధానకల్పిత శంఖపద్మమకరాకారరంగవల్లీమతల్లికలవలన,

---

1 భృంగారుదుకూలవీటికా. 2 కాంచనమయయంత్ర.

నయనోత్సవం బాపహిలం బ్రవేశించి వాసవవహ్నివైవస్వతవాసతే యీచరణవరుణవాయువసువల్లభనామదేవుల వరుస వీడ్కొల్పి సత్యభామాసహితుండై యథోచితకృత్యంబు లాచరించి యనంతరంబ. 41

టీ. ఈగద్యమున దేవేంద్రుని వైజయంతమను ప్రాసాదము వర్ణితము.—అమర సరిత్......విలసితంబును-అమర = సురలసంబంధమైన, సరిత్ = నదినుండి; అనఁగా మందాకినినుండి యనుట, ఉపహృత=తీసికొనిరాఁబడిన, హేమతామరసస్తోమ=బంగరు పద్మములసమూహములచేనైన, తోరణదామ=తోరణమాలికలయొక్క, రామణీయక = అందముచే, సూచిత=ప్రకటితమగు, సౌదామనీ = మెఱుఁగులయొక్క, విలసితంబును= ప్రకాశముగలదియు; ఆవైజయంతమున హాటకపద్మనిర్మితములగు తోరణములు గట్టఁబడె ననియు, నయ్యవి వెఱుంగుందీవలంబోలి తళతళలాడుచుండెననియుఁ దాత్పర్యము. కన త్కనక...సంతానంబును. కనత్ = ప్రకాశించునట్టి, కనకకింకిణీకుల = బంగరుచిఱు గంటలగుమియొక్క, సంకుల=క్రమహీనమైన, క్వాణ=మ్రోఁతలనెడు, ముగ్ధ=మనోజ్ఞమైన, మధుర=తీయని, ఆలాప=పలుకులతో, నృత్యత్ = నాట్యమొనర్చునట్టి, నిజా పత్య=తనసంతానములయొక్క, మూర్తి=ఆకృతులను, ఆవహ=ధరించుచున్న (అనఁగాఁ దనసంతానముల భ్రాంతినొదవించునదనుట), పార్శ్వ = కెలఁకులందు, ప్రవర్తమాన = ఒప్పుచున్న, విమానసంతానంబును = విమానసమూహముగలదియు; వైజయంతపార్శ్వ భాగముల విమానము లుంపఁబడెననియు, వానికి బంగరుఁజిఱుగంటలు నిబద్ధములై యొప్పుననియు, నాబంగరుచిఱుగంటలు పలువిధముల శబ్దించుచుండుననియు, నట్టిశబ్ద ముల వెదఁజల్లుబంగరుఁజిఱుగంటలతో మించు నవ్విమానములు మధురాలాపములతోడ నృత్యమొనర్చు వైజయంతపుసంతానములవలె నొప్పెననియు భావము. అనఁగా విమాన ములు వైజయంతసదృశములై యుండెననితాత్పర్యము. అర్థిజన...చింతారత్నంబును- అర్థిజన=యాచకులకు, అభిమత=కోర్కులను, దాన = ఇచ్చుటకొఱకైన, అర్థసంగ్రహ= వస్తుసంపాదనమును, సంశయ=సందేహమును, ఆపాది=కలుగఁజేయు, సమస్తవస్తు=సకల పదార్థములయొక్క, ప్రతిబింబ = ప్రతిరూపములచే, సంభావిత=ఒప్పుచున్న, శేఖరీ కృత = శిరోభూషణముగాఁజేయఁబడిన, చింతారత్నంబును = చింతామణిగలదియు, ఆవైజయంతపుశిఖరమున నలంకారముగఁ జింతామణి యమర్పఁబడియుండెననియు నందు సర్వవస్తువులుఁ బ్రతిఫలించుచుండెననియు, నావస్తుప్రతిబింబములు చింతామణి యర్థుల నభిమతార్థములం దనుపసేకరించిన వివిధపదార్థములో యనునట్లు మించెననియు భావము. అక్షీణ......వీక్షావిశేషమును-అక్షీణ = అధికమైన, సహస్రాక్షమణి=ఇంద్ర

నీలమాణిక్యములచేసైన, గవాక్షావళీ=కిటికీలవరుసచే, సాక్షాత్కృత = కనుల కగపడునట్లు బడినదిగాఁ జేయఁబడిన, నాకలక్ష్మీ=స్వర్గలక్ష్మియొక్క, కటాక్షవీక్షావిశేషంబును=క్రీఁగంటి చూపుల యతిశయముగలదియు; ఆప్రాసాదమున నింద్రనీలమణినిర్మితగవాక్షము లనేకములు గలవనియుం, వానినుండివెడలు నల్లనికాంతులు నాకలక్ష్మీకటాక్షములవడువున నున్నవనియుం భావము. స్త్రీలకటాక్షములను నల్లగానుండునట్లు వర్ణించుట కావ్యప్రసిద్ధ విషయము. అనర్ఘ...సన్నిధానంబును-అనర్ఘ = అమూల్యములైన, మణిస్తంభ=మణి నిర్మితస్తంభములయందు, ప్రతిబింబిత=ప్రతిఫలించిన, నృత్యత్ = నర్తనమొనర్చునట్టి, అప్సరస్సహస్ర = అసంఖ్యాకలగునచ్చరలచే, ప్రదర్శ్యమాన=చూపఁబడు, లాస్య = నృత్యభేదముయొక్క, అవలోకన=చూచుటయందలి, సారస్య = రసికతచే, ఆగత = ఏతెంచినట్టి, గృహదేవతాశత = లెక్కలేనియిలువేల్పులయొక్క, సన్నిధానంబును = సాక్షాత్కారముగలదియు; ఆమేడయందలి రత్నకంబముల నాట్యమొనర్చునచ్చరలు ప్రతిఫలించిరనియు, నవ్వారియా ప్రతిబింబములు, నర్తనమొనర్చు నచ్చరల నాట్యవిశేషముంజూడ నేతెంచిన యిలువేల్పులోయన మించెననియు భావము. పులోమ... భాగంబును=పులోమ, నముచి, జంభ, పాక, వృత్త, బల, ప్రముఖ=మొదలగు, దైత్య= రాక్షసులను, విధ్వంసన=చంపుటయందు, సన్నద్ధ=సంసిద్ధుఁడైన, శతమన్యు = ఇంద్రుని యొక్క, జన్యసన్నాహ=యుద్ధప్రయత్నమును, అనుకారి=అనుకరించునట్టి, చిత్రకర్మ= చిత్తరువుంబనులచే, విచిత్రిత=విచిత్రముగాఁ జేయఁబడిన; అనఁగా నట్టిపటములచే నలంకృతమైనయనుట. భిత్తిభాగంబును=గోడలప్రదేశముగలదియు, దేవేంద్రుఁడుపులోమాది రక్కసులఁజంప సిద్ధముగనున్న రీతిని జిత్రములంజిత్రించి గోడల నాచిత్రములచే నలంకరించిరని భావము. వళితరుచిర...స్నానక్రమంబును-వళిత=గుండ్రముగా వ్యాపించు, రుచిర=మనోహరమైన, రుచి=కాంతులచే,నిరంతర=దట్టమై,స్ఫాటికకూట=స్ఫటికవికార ములగు శిఖరములయొక్క, అంతర=నడుమను, విశ్రాంత=విశ్రమించియున్న, ఐరావత= ఇంద్రునిపట్టపేనుఁగుచేతను, ఉచ్చైశ్శ్రవస్=ఇంద్రునిగుఱ్ఱము చేతను,సూచ్యమాన=ప్రకాశితమగుచున్న, క్షీరసాగరస్నాన = పాలకడలియందలిస్నానముయొక్క, క్రమంబును= ప్రకారముగలదియు;వైజయంతమను నాప్రాసాదపుశిఖరములుస్ఫటికమయములైయుండె ననియు,వానినుండి తెల్లనికాంతులు వలయాకృతిని సాంద్రముగవ్యాపించియుంట నప్ప్రదేశముక్షీరసముద్రముపలెనుండెననియు, నట్టు శుభ్రకాంతులచే దంతురితమైనప్రదేశ మునశయనించిన ఐరావతమునుచ్చైశ్శ్రవమును బాలకడలిలో స్నానమొనర్చువానివలె నున్నవనియుంభావము. తరంగితమణి......సార్థంబును-తరంగిత=చలితములగు,మణిభృంగారక=మణినిర్మితములైనజారీలు, వీటికాకరండ=తాంబూలపేటికలు, తాళవృంత=వీవ

నలు, చామర=వింజామరములు, దర్పణ=అద్దములు, కళాచికా=తమ్మపడిగెలు, పాదుకా=పావలు, ఆది=మొదలగు, పరికర=ఉపకరణములయొక్క, ప్రపంచ=సమూహముతో, సంచిత=కూడియున్న, కరాంచల=హస్తాగ్రములుగల, విశ్వకర్మనిర్మితయంత్రపాంచాలికా=విశ్వకర్మచే సృజింపఁబడిన యంత్రపుబొమ్మలయొక్క (మఱబొమ్మలనుట)సంచయ=గుంపుచే, వంచిత = మోసపుచ్చఁబడిన, పరమార్థపరిచారికా = నిజమైనపరిచారికలయొక్క, సార్థంబును=సమూహముగలదియు; మణిభృంగారకాదుల చేతఁబూనియున్న విశ్వకర్మనిర్మితములైన యంత్రపుత్రిక లందుఁగలవనియు, వానిచేతనున్న నాయాయామణిభృంగారకాదులు యంత్రబలమునఁ గదలుచుంట నవ్వానింగాంచి నిజపరిచారికలు వంచిత లగుచుండిరనియు భావము. అనఁగా వానింగాంచి యవియే నిజపరిచారికలే మోయని భ్రమపడిరని భావము. నిరంతర...అవతరణంబును-నిరంతర=సాంద్రమైన, సంతానోకహ = కల్పవృక్షములసంబంధమైన, దుకూలమయ = తెల్లపట్టుబట్టలవికారమైన, పతాకాశత=లెక్కలేని జెండాలచే, ఆకారిత=పిలువఁబడిన, ఆకాశగంగా = మిన్నేటియొక్క, చటులతర = మిగులఁ జలించునట్టి, తరంగ=కెరటములయొక్క, అవతరణంబును=దిగుటగలదియు; వైజయంతమునకుఁ గట్టిన తెల్లని పట్టుటెక్కెములు చలించుచు మిన్నేటి నాహ్వానించునవివలె నుండెననియు, నవ్వానియాహ్వానము ననుసరించి మిన్నేరలలవడిమీఱ నేతెంచునట్లు పైపైనెగురు మందాకినీతరంగములు మించెననియు భావము. సమంతతః...ప్రదేశంబును-సమంతతః = అంతటను, తంతన్యమాన=విస్తృతినొందింపఁబడుచున్నదియు, తోయకర్మాంతిక = నీటి నాయాయిప్రదేశములకుఁ బాఱునట్లు చేయుభృత్యులచేత, నిర్ముక్త=విడువఁబడినదియునగు, మందారవిటపిమకరంద = కల్పవృక్షమరందములనెడు, గంధసలిల= పరిమళోదకముయొక్క, సేకాతిరేక=తడుపుటయొక్కయతిశయమున, శీతల=చల్లనైన, మణివేదికాప్రదేశంబును = మణినిర్మితములగు నరుఁగులతావులుగలదియు; వైజయంతపార్శ్వములఁగల మణివేదికలను నీరుగట్టువారు కల్పవృక్షమకరందమను సుగంధజలమున నత్యంతము తడుపుటంజేసి యవి మిగుల చల్లనై యుండెనని భావము. బహిర్ద్వార...సంధానంబును - బహిర్ద్వార = బయటిద్వారములయందలి, వితర్దికా=వేదికలుగల, ప్రకోష్ఠ=ముంగిళ్లయందు, ప్రతిష్ఠాపిత = నెలకొల్పఁబడిన, అష్టాపదఖట్వా = బంగరుమంచములందు, ఆస్తీర్ణ=పఱుపఁబడిన, హరిచందనసాలబాలపల్లవ=కల్పవృక్షసంబంధమైన లేఁజిగుళ్లచే, ఉల్లసిత=ప్రకాశితమైన, సంధ్యారాగసంధానంబును = సంజ యొఱుపుయొక్కకూర్పుగలదియు; అవ్వైజయంతపు ముఖద్వారములందలి తిన్నెలుగల ముంగిళ్లయందు బంగరుమంచములు గలవనియు, నందుఁ గల్పకబాలపల్లవములు పఱుపఁబడియుండెననియు, నవ్వానినుండి ప్రచురించు కెంపు

చాయలు సంజమెఱుంగులం గూర్చుచున్నట్లుండెననియుఁ భావము. అవిరళ...పరిపాటి కంబును-అవిరళ=సాంద్రమైన, కల్పప్రసవ=కల్పవృక్షపుష్పములయొక్క, రజఃపటల=పరాగసమూహమనెడు, పటవాస = పరిమళద్రవ్యములయొక్క, పాంసు = ధూళిచే, వాసిత=పరిమళింపఁజేయఁబడిన, కౌశేయ = దుకూలముచేనైన, వితానపటీ = చాందినీబట్టలచేత, ప్రకటీకృత = ప్రకాశితమైన, చంద్రాతప=వెన్నెలయొక్క, పరిపాటికంబును = రీతిగలదియు, అగుచున్; ఆమేడయందుఁ గల్పకసుమపరాగమను పరిమళద్రవ్యముచే వాసితములైన దుకూలములచే మేల్కట్లు సవరింపఁబడెననియు, నవి ధవళములగుటం జేసి వెన్నెలవలెనుఁ బ్రకాశించుచుండెననియుఁ భావము. చతురతర...వలనన్-చతురతర = మిగులఁ గుశలములైన, శచీకర=ఇంద్రునిభార్యయగు శచియొక్క చేతులచేత, విరచితంబులై = చేయఁబడినవియుం, మణికుట్టిమతల=మణినిర్మితభూతలములందు, ప్రతిబింబిత=ప్రతిఫలించెడు, తారకాకుటుంబంబులన్ = నక్షత్రసమూహమును, విడంబించు = అనుకరించునవియునగు, పారిజాతకుసుమోపహారంబులవలనన్ = కల్పవృక్షసుమరూపములైన కానుకలవలనను; ఆవైజయంతమునందలి మణినిర్మితభూతలములందు శచి నేర్పుమీఱ కల్పసుమములఁ జల్లెననియు నాకుసుమములు మణిభూములఁ బ్రతిఫలించిన నక్షత్రసమూహములవలె నొప్పియుండెననియు భావము. ఇదిమొదలుకొని గలవలనలంతమందుఁగల పంచమ్యంతవాక్యములకు 'నయనోత్సవం బావహిలంజేయన్' అను దానితో నన్వయమని తెలియునది. స్వాహా...వాహితంబులై-స్వాహా = అగ్నిభార్యయగు స్వాహాదేవియొక్క, బాహా=చేతులయొక్క, అంచల=కొనలచేత,ఆవాహితంబులై =ఉంపఁబడినవై, మహారజతపాత్రంబులన్ = గొప్ప బంగరుపాత్రములందు, చిత్రంబులుగాన్ = ఆశ్చర్యముగా, వెలుంగు=ప్రకాశించు, ఆరాత్రికాదీపకళికలవలనన్ = మొగ్గలంబోలు నారతిదివ్వెలవలనను, ఆవైజయంతము నగ్నిభార్యయగు స్వాహాదేవి బంగరుపళ్లెరముల హారతిరూపములగు కర్పూరదీపికలనిడెనని తాత్పర్యము. అగ్నిభార్య తేజోరూపముల నిల్పినట్టు చెప్పుట హృద్యము. ఇట్లే సురపతిభార్యయుం హారములనిడెననుట సరసము. యమకామినీ...వితీర్ణంబులై-యమకామినీ = యమునిజాయయగు, ధూమోర్ణా=ధూమోర్ణాదేవిచేత, వితీర్ణంబులై=నిల్పఁబడినవై, విస్తీర్ణంబుగాన్=విశాలముగ, ఎగయు=వ్యాపించెడు, మలయజ = చందనసంబంధమైనట్టియు, కాలాగురు = నల్లయగరుసంబంధమైనట్టియు, ధూప=ధూపములయొక్క, ధోరణులవలనన్=పద్ధతులవలనను; యమపత్ని ధూమోర్ణాదేవి యాప్రాసాదమునఁ జందనకాలాగురుధూపముల నెలకొల్పెనని భావము. యముఁ డసితుఁడు. వానిపత్ని ధూమోర్ణ. కాన నల్లనిధూపధూమముల నామె యిడినట్లు తెల్పుట సముచిత మనఁదగును. యాతుధాన...విధీయ

మానంబులై-యాతుధాన =నిర్ఋతియొక్క, అవరోధవధూ = అంతఃపురస్త్రీచేత; భార్యచేతననుట. విధీయమానంబులై=పరికల్పితములై, విలసిల్లు=ప్రకాశించెడు, గృహప్రవేశసమయసముచిత=ఇంటఁ బ్రవేశించునదనునకర్హములైన, బలివిధాన=బలులుంచుటలయొక్క, సంవిధానంబులవలన్=కూర్పులచేతను; నిర్ఋతిభార్య గృహప్రవేశసమయార్హములైన బలుల వానైజయంతమునఁగూర్చెనని తాత్పర్యము. యాతుధానునిభార్యకీకృత్య మెంతయుం నర్హమేగదా! బలులనుగైకొనువానిభార్యకు బలిప్రదానకౌశలము గల్గుట సైబముగదా! పాశధర...సూత్రితంబులై-పాశధర = వరుణునియొక్క, మత్తకాశినీ=కామినిచే. సూత్రితంబులై=గ్రువ్వఁబడినవై, విలోకనపాత్రంబులగు = దర్శనీయములైన; మనోజ్ఞములనుట. లలిత=సొగసైన, ప్రవాళలతా=పగడపుఁదీఁగలచేసైన, వందనమాలికలవలన్ = తోరణములవలనను; వరుణునిభార్య పవడములతోరణములచే వైజయంతము నలంకరించెనని తాత్పర్యము. పవడములనీవలం సముద్రముననుండును. వరుణుఁడు జలాధిదేవత. కాన నట్టివానిభార్య యిట్టికృత్యమును నిర్వర్తించినట్లుచెప్పుట సుసంగతము. పవమానమానవతీనియుక్తంబులై=వాయుదేవునిభార్యచే నాజ్ఞాపింపఁబడినవై, బాలికాజనంబుల కరతలంబులన్=కన్యలహస్తతలములందు, పరిభ్రమించు = చలించుచున్న, కర్పూరతాలవృంతంబులవలన్=కర్పూరపు వీవనలవలనను; వాయుదేవునిభార్య యాజ్ఞాపింపఁగా బాలికాజనముల చేతులందలి కర్పూరపువీవనలు తిరుగుచున్నవని తాత్పర్యము. వాయుదేవునిభార్యను దాళవృంతచలనమున శాసకురాలనుగాఁజెప్పుట యెంతయుసరసము. నరధర్మసధర్మిణీనిర్మితంబులగు=కుబేరునిభార్యయగు బుద్ధిచేఁ గల్పింపఁబడినవగు, నిధానకల్పిత=నిధులనుండి కూర్పఁబడిన, శంఖపద్మమకరాకారరంగవల్లీమతల్లికలవలనను=శంఖపద్మమకరాకృతులుగల శ్రేష్ఠములగు ముగ్గులవలనను; కుబేరునిభార్య యీప్రాసాదమును శంఖపద్మ మకరాకృతులుగల ముగ్గులం ఘటించి యలంకరించెనని భావము. శంఖపద్మాదినిధులకధిపతి కుబేరుఁడు. ఆతనిభార్య శంఖ పద్మాకృతులంబోల్చు ముగ్గులం ఘటించెననుట మిక్కిలి సరసము. ఈశానునిభార్య నిందుఁ జేర్కొనకుండుటకుఁ గారణము మృగ్యము. నయనోత్సవంబు = కన్నులపండువు, అవహిలన్=సంభవింపఁగా, ప్రవేశించి=చొచ్చి, వాసవ......వామదేవులన్-వాసవ=ఇంద్రుఁడు, వహ్ని=అగ్ని, వైవస్వత=యముఁడు, వాతతేయాచరణ = నిశాచరుఁడగునిర్ఋతి, వరుణ = వరుణుఁడు, వాయు=వాయువు, వసువల్లభ=ధనపతి యగుకుబేరుఁడు, వామదేవుఁడు=ఈశానుఁడు, వీరలను; అనఁగా నష్టదిక్పతులననుట. దిక్పాలురసతులను దిక్పతులను జేర్కొనుటచో బ్రాగ్దిగధిపతి యగునింద్రునిభార్యను దొల్తఁ జేర్కొని పిదపఁ బ్రదక్షిణక్రమము ననుసరించి తక్కినవానిం జేర్కొనెనని గ్రహించునది. కవు లీదిక్కులంగూర్చి కాని తత్పతులం

గూర్చి కాని యేమేని చెప్పవలసివచ్చినపు డిట్లే క్రమము ననుసరించుట సహజము. తొలిదిక్కు న కధిపతియు సర్వదిక్పాలకాధీశుఁడును నగునింద్రు మొట్టమొదట చెప్పుట యుచితముగదా! తరువాతఁ దక్కుంగలవారి నపసవ్యమగు క్రమమున నుత్తర దిశ ననుసరించి చెప్పుటకంటె సవ్యక్రమమునఁ బ్రదక్షిణవిధిని దక్షిణదిశ ననుసరించి తెల్పుటయే సరసమని కవు లెన్నినట్లు తోఁచెడిని. వరుసన్ = క్రమముగా, వీడ్కొల్పి= సెలవిచ్చి పంపి, సత్యభామాసహితుండై = సత్యభామతోఁ గూడినవాఁడై, యథోచిత కృత్యంబులు= అర్హములైన కార్యములను, ఆచరించి= చేసి, యనంతరంబ=తరువాత.

విశే. ఇక్కవితల్లజుఁడు ముక్కుతిమ్మన తాఁగవ్వారంగాంచిన విద్యానగర ప్రభు వర్యుని కృష్ణరాయని వాసపౌధమగు మలయకూటపునందము నీగతిని బ్రకటించియుండు నేమోయని యూహ వొడమెడు.

శా. ఆరామప్రియసోదరుం డపుడు దివ్యారామ మంభోరుహా
క్షీ! రమ్యం బదె చూతమే యని ఘృతాచీమేనకామంజుఘో
షారంభాహారిణీముఖత్రిదివయోషారత్నముల్ గొల్వ రా
నారూఢోత్సవచిత్తుఁడై గగనకుల్యాతీరదేశంబునన్. 42

టీ. ఆరామప్రియసోదరుండు = బలరాముని యనుంగుందమ్ముఁడు, అపుడు = యథోచితకృత్యముల నాచరించినపిదప, అంభోరుహాక్షీ! = పద్మములవంటి నేత్రములు గల సత్యభామా, రమ్యంబు = మనోహరమగు, దివ్యారామము = సురలయుపవనమగు నందనము, అదె=అదిగో, చూతమే=తిలకింతమే (ఉభయకర్తృకము) అని, ఘృతాచీ... రత్నముల్ = ఘృతాచి, మేనకా, మంజుఘోష, రంభ, హారిణి, ప్రముఖ=మొదలైన, త్రిదివయోషారత్నముల్ = దేవతాస్త్రీమతల్లికలు, కొల్వ= సేవించి, రాన్=రాఁగా (వెంటనంటిరానునట) ఆరూఢోత్సవచిత్తుఁడై=పొందఁబడిన సంతోషముగల మదిగల వాఁడై, గగనకుల్యాతీరదేశంబునన్=ఆకాశ గంగానదియొక్క తీరతలమున, 41 పద్య మందలి 'డాయం జనియెన్' అనుదానితో నన్వయము.

విశే. కల్పకోత్పాటనరూపముఖ్యోద్దేశమునకు బీజము నిల్పఁబడినది. మఱియు స్వర్గవైభవాతిశయాలోకమునను మనోజ్ఞవైజయంతవాసమునను దావచ్చినపనిని మఱువ లేదని సత్యకీమూలమునఁ దెల్పుచు నామెయందుఁ దనకుఁగల రాగాతిశయమును శ్రీకృష్ణుఁడు కవెల్లడించెనని గ్రహించునది. సామాన్యముగఁ గుల్యయన నలంతినీటికాలువ యగుం గాని యిందు నదీపరముగఁ బ్రయుక్తమగుట వింత.

క. చందనహారిచందనమకరందసరిద్బిందుశీకరప్రమదవనేం

ఇందిర పక్షస్పందన, కందళితమరుత్కిశోరకంబులు పొలయన్. 43

టీ. చందనహరి...కిశోరకంబులు-చందన = మంచిగంధపుఁజెట్లయొక్కయు, హరిచందన = కల్పవృక్షములయొక్కయు; లక్షణచేఁ దత్పుష్పములయొక్కయనుట. మకరందసరిత్ = తేనెయేఱులం దైన, బిందు = కణములయొక్క, శీకర=తుంపురులుగల్గి నట్టియు, ప్రమదవనేందిందిర = ఉపవనమునందలి తుమ్మెదలయొక్క, పక్షస్పందన= ఱెక్కలకదలిక చే, కందళిత = మొలకలెత్తినవియు; అనఁగా నుద్భూతములైనవనుట. మరుత్కిశోరకంబులు=పిల్లగాలులు (వాతపోతములు) పొలయన్ వ్యాపింపఁగా,

వి శే. తేనెయేఱులకణములు గల్గినదనుటచే శైత్యమును, నా తేనెకణములు హరిచందనచందనవృక్షములసంబంధమైనవనుటచే సౌరభ్యమును, భ్రమరపక్షచలమున మొలకలెత్తినవనుటచే మాంద్యమును ప్రకటీకృతములయ్యెనని యెన్నునది. ఏకసమాసమునఁ గాలి నిట్లు వర్ణించుట ప్రబంధకర్తల సంప్రదాయమై యున్నది.

సీ. రంభామహోరోజకుంభపరీరంభకుసుమితప్రత్యగ్రకురవకంబు
మంజుఘోషావక్త్రకంజాతచకచకస్తబకితచంపకక్ష్మారుహంబు
హారిణీముఖప్రసూనాసవార్పణకోరకితలతావేల్లితకేసరంబు
నుర్వశీనవయావకోజ్జ్వలాంఘ్రినివేశపుష్పితకంకేళిభూరుహంబు
తే. మేనకామోదనిశ్వాసమృదుసమీర
కుట్మలితసిందువారంబు కుధరధరుఁడు
ప్రియసియుఁ దాను నల్లన డాయఁ జనియె
వైవతాధీశనందనోద్యానసీమ. 44

టీ. ఇందు నందనోద్యానము వర్ణితము.—రంభా...కురవకంబు-రంభా = రంభ యను నచ్చరయొక్క, మహోరోజకుంభ = కుంభములంబోలు గొప్పస్తనములయొక్క, పరీరంభ=ఆలింగనముచే, కుసుమిత=పుష్పించిన, ప్రత్యగ్ర=నూతనమైన, కురవకంబు= ఎఱ్ఱగోరంటచెట్లుగలదియు; వనిత యాశ్లేషించిన గోరకము పుష్పించుననుట కావ్యప్రసిద్ధవిషయము. అనఁగా స్త్ర్యాలింగనము కోరకమునకు దోహదమని యెన్నవలయును. మంజుఘోషా...క్ష్మారుహంబు - మంజుఘోషా=మంజుఘోష యనునప్సరసయొక్క, వక్త్రకంజాత = ముఖపద్మముయొక్క, చకచక = కాంతులతళతళలచేత, స్తబకిత= పుష్పగుచ్ఛములుగలదిగాఁ జేయఁబడిన, చంపకక్ష్మారుహంబు = సంపెఁగచెట్లు గలదియు; స్త్రీముఖకాంతిప్రసారము చంపకమునకు దోహదమని తెలియుచున్నది.

హారిణీ... కేసరంబు-హారిణీ=హారిణి యనునప్సరసయొక్క, ముఖ = మొగమునందైన; అనఁగా నోటియందున్న యనుట. ప్రసూనాసవ = సుమమద్యముయొక్క; పూలరసమున నిర్మితమయిన మద్యమనుట. అర్పణ=ఇచ్చుటచేత; అనఁగా నోటినుండి యుమియుటచే ననుట. కోరకిత=మొగ్గలొడిగిన, లతావేల్లిత=తీఁగలచేఁ జుట్టఁబడిన, కేసరంబు=పొగడ చెట్లుగలదియు; అందలిపొగడచెట్లు హారిణీముఖమద్యార్పణమున మొగ్గలెత్తెనని భావము. ముఖమద్యార్పణము పొగడకు దోహదమని తెలియవచ్చెడి. ఉర్వశీ...భూరు హంబు-ఉర్వశీ=ఉర్వశియను దేవవేశ్యయొక్క, నవ=క్రొత్తదగు, యావక = లాక్షారస ముచే, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, అంఘ్రి=పాదములయొక్క, నివేశ = ఉంచుటచేత; అనఁగాఁ దన్నుటచేత ననుట. పుష్పిత=పూచినట్లొనర్పఁబడిన, కంకేళిభూరుహంబు = అశోకవృక్షములుగలదియు; అందున్న యశోకము లుర్వశీచరణాహతిని గుసుమితము లయ్యెనని భావము. స్త్రీపాదాహతి యశోకదోహదము. మేనకా...సిందువారంబు - మేనకా = మేనకయనునచ్చరయొక్క, ఆమోదనిశ్వాస = సుగంధముగు నిట్టూర్పునెడు, మృదుసమీర=పిల్లగాలిచే, కుట్మలిత=మొగ్గలొడిగిన, సిందువారంబు = వావిలిచెట్లుగల దియు; అందలి వావిలిచెట్లు సుగంధమేనకామృదుముఖమారుతప్రసారమున మొగ్గలెత్తె నని భావము. స్త్రీముఖమారుతప్రసారము సిందువారదోహదము. దైవతాధీశనందనో ద్యానము = ఇంద్రునినందనవనమును, అపుడు = అయ్యెదనున, కుధరధరుఁడు = గోవర్ధన ధారియగు శ్రీకృష్ణుఁడు, ప్రేయసియుఁన్=సత్యయు, తానున్, అల్లనన్ = మెల్లఁగా, డాయన్, చనియెన్=సమీపించెను. (చేరజనెను.)

మ. మహీభృద్భేదివనాంతసీమమునఁ బద్మాజాని సత్యావధూ
సహితుం డై యనిమేషవారవనితాసందోహము ల్గొల్వఁగా
విహరింపం జను దెంచినాఁ డనుచు సేవింపంగ వర్షాశర
న్మిహికాశీతవసంతఘర్మ ఋతువు ల్నిండెం దదుద్యానమున్. 45

టీ. పద్మాజాని = లక్ష్మీదేవిభార్యగాఁగల శ్రీకృష్ణుఁడు, మహీభృద్భేదివనాంతసీమమునన్=కొండలభేదించిన యింద్రునియొక్క నందనారామప్రదేశమున, సత్యావధూ సహితుండై = సత్యభామతోఁ గూడినవాఁడై, అనిమేషవారవనితాసందోహముల్=దేవ వేశ్యాసమూహములు, కొల్వఁగాన్ = సేవింపఁగా, విహరింపన్, చనుదెంచినాఁడు = వచ్చినవాఁడు, అనుచున్, సేవింపంగన్, వర్షాశరన్మిహికాశీతవసంతఘర్మ ఋతువుల్= వర్షా, శర, ద్ధేమంత, శిశిర, వసంత, గ్రీష్మములను నాఱుఋతువులు, తదుద్యానమున్= ఆనందనోద్యానమును, నిండెన్.

భా. శ్రీకృష్ణుని నందనోద్యానమున సత్యాయుతుఁడై విహరించువానిని సేవింప షడృతువులందు సాక్షాత్కరించెనని భావము. షడృతువులు నేకకాలమున సాక్షాత్కరించినట్లు వర్ణించుట కావ్యప్రసిద్ధవిషయము.

వ్యా-విశే. సిద్ధములగు బహువ్రీహిసమాసముల జాయాశబ్దములోని యకారము నకు నియమునదాదేశమగు.

సీ. కనుపట్టె నొకచోట ఘనఘనాఘనరంగ
విద్యున్నటీనాట్యవిలసనములు
చూపట్టె నొకచాయ వాపికాజలజాత
జాలవాచాలహంసవ్రజంబు
తిలచూపె నొకవంక దరదళత్సేవంతి
కాగంధినీహారకణభరములు
పొడచూపె నొకచక్కిఁ బుష్పితఫలినీల
వంగవాసితశైత్యవైభవములు
తే. నెఱసె నొకయెడఁ దామ్రపర్ణీజలార్ద్ర
చందనాచలపవమానకందళములు
మొనసె నొకకడ సామిసంఫుల్లమల్లి
పాటలీచంపకోత్పలప్రౌఢిమములు. 46

టీ. ఒకచోటన్ = ఒకానొకచోట, ఘనఘనా...విలసనములు-ఘన = గొప్పదైన, ఘనాఘన=వార్షికమేఘమనెడు, రంగ=నాట్యభూమియందు, విద్యున్నటీ=మెఱుపనెడు నర్తకియొక్క, విలసనములు=ప్రకాశములు, కనుపట్టెన్=అగపడెను; వర్షర్తుధర్మమిందు సూచితము. ఒకచాయన్=ఒకవైపున, వాపికా...వ్రజంబు-వాపికాజలజాతజాల=దిగ్ఘికలందలి పద్మసమూహములందు, వాచాల = ధ్వనిని జేయుచున్న, హంసవ్రజంబు=హంసలసమూహము, చూపట్టెన్=అగపడెను; దీర్ఘికాపద్మములందు శబ్దించునంచగుము లొకవైపున నగపడెనని భావము. ఇందు శరద్ధర్మము సూచితము. ఒకవంకన్=ఒకదిక్కున, దరదళత్......భరములు-దరదళత్ = కొంచెముగావికసించిన, సేవంతికా = చేమంతిపూవుల చే గంధి=పరిమళముగల, నీహారకణభరములు = మంచుబొట్టుల యతిశయములు, తిలచూపెన్=అగపడెను; కొంచెము విడినచేమంతిపూల గంధముగల్గిన మంచుబొట్లొకచో నగపడెనని భావము. హేమంతర్తుధర్మ మిందుఁ బ్రకాశితము. ఒకచక్కిన్=ఒకప్రదేశమున, పుష్పిత ..వైభవములు-పుష్పిత = పుష్పించిన, ఫలినీ=ప్రేంకణవృక్షములచేతను, లవంగ=లవంగవృక్షములచేతను, వాసిత=పరిమళము గలదిగాఁజేయఁబడిన,

శైత్య=చల్లఁదనముయొక్క, వైభవములు=విభవములు, పొడసూపెన్ = కనఁబడెను; ప్రేంకణలవంగవృక్షములు పూచినవై సుగంధసాంద్రములగు చల్లందనములఁ గల్గించె నని తాత్పర్యము. ఇందు శిశిరర్తుధర్మము ప్రకటీకృతము. ఒకయెడన్ = ఒకచో, తామ్రపర్ణీ......కందళములు-తామ్రపర్ణీ=తామ్రపర్ణి యనునదియొక్క, జల=ఉదకముచేత, ఆర్ద్ర=తడిసిన, చందనాచలపవమాన = మలయమారుతముయొక్క, కందళములు = మొలకలు; అనఁగాఁ బిల్లగాలులనుట. నెఱసెన్ = వ్యాపించెను; ఇందువసంతధర్మము ప్రకాశితము. ఒకకడన్ = ఒకదిక్కున, సామి......ప్రౌఢిమములు - సామి= సంగోరు, సంఫుల్ల=వికసించిన, మల్లి=మల్లియొక్కయు, పాటలీ = పాటలికుసుమముల యొక్కయు, చంపక=సంపెఁగపూవులయొక్కయు, ఉత్పల=నల్లకలువలయొక్కయు, ప్రౌఢిమలు=అతిశయములు, మొనసెన్=చేరెను. ఇందు గ్రీష్మర్తుధర్మము విశదీకృతము. ఇట్లాఱుఋతువులు నొక్కచో సాక్షాత్కరించియుండుట నందు శ్రీకృష్ణుఁడు గాంచె.

క. మలయానిలసంగతిఁ జూ
తలతికలంకూరజాలదౌహృదవతు లై
యలయిక సడలించినసొ
మ్ములకై వడిఁ బాండుపత్త్రములు వెస జాఱెన్. 47

టీ. చూతలతికలు = మామిడితీఁగలు, మలయానిలసంగతిన్ = మలయమారుత సంబంధముచే, అంకూరజాలదౌహృదవతులై = మొలకలసమూహములను గర్భధారణ లక్షణములుగలవారై, అలయికన్ = ఆయాసముచే, సడలించిన = జార్చిన; ఊడ్చిన యనుట. సొమ్ములకైవడిన్ = ఆభరణములవిధమున, పాండుపత్త్రములు = పండిన తెల్లని యాకులు, వెసన్=శీఘ్రముగా, జాఱెన్=రాలెను.

విశే. మామిడులు వసంతప్రాదుర్భావమునఁ బాండుపత్త్రముల రాల్చి చిగురు దొడుగఁగా, వాని చిగురుదొడుగుటను మలయమారుతుని కూడికచేనైన గర్భధారణ చిహ్నములుగాను, బాండుపత్త్రములరాల్చుటను నాయాసముచేనైన భూషణముల సడల్చుటగాను, గవి నిరూపించి లతికాశబ్దస్త్రీలింగసారస్యమును సరసముగఁ బోషించెను. అలం. ఉత్ప్రేక్ష.

క. గురివెంటఁ జైత్రుఁ డొందఁగఁ
గర మలుక న్నావి యపుడు కఱచిన నునువా
తెరమీఁదఁ గాననగు పలు
వరుస యన న్ననలు పల్లవముపై మొనసెన్. 48

టీ. గురువెందక్ = గురివెందచెట్టును; మాధవియని సంస్కృతనామము, చైత్రుఁడు=వసంతుఁడు, ఒందఁగన్ = పొందఁగా, కరము=మిక్కిలి, అలుకన్=కోపముతో, మావి=మామిడి, అవుడుకఱచినన్ = పెదవికఱవఁగా, నునుచాతెఱమీఁదన్= నున్ననైన పెదవిపైని, కానఁగు=అగపడునట్టి, పలువరుస = దంతములచాలు, అనన్= అనునట్లుగా, పల్లవములపైన్ = చిగుళ్లపైని, ననలు = పుష్పములు, మొనసెన్= వ్యాపించెను.

భా. లోకమున నొకవనిత తనకాంతుఁ డన్యాంగనాసక్తుఁడుగాఁ గాంచి, యధికకోపమునఁ బెదవిఁగొఱుకునట్లు మామిడి, వసంతుఁడు మాధవిం జెనకఁగాఁ, గోపమున నవుడుగఱఁచెననియుఁ, బెదవిఁగఱచునపు డందు దంతపంక్తి యేర్పడుట సహజము గావున జిగురువాతెఱను, ననలను దంతపంక్తి చెలంగెననియుం భావము. అనఁగా వసంతసంబంధమున గురువెందలును జూతములును జిగిర్చి పుష్పించెనని తాత్పర్యము.

విశే. ఇందు నెఱ్ఱనిజిగురును బెదవిగాను, దానిపైమించుననలను దంతపంక్తిగాను భావించుట యెంతయు హృద్యము. మావిని ఖండితనాయికగా నిందుఁ బేర్కొనెనని యెన్ననది. 'గురివెంద, మావి' అను స్త్రీసమములసారస్య మిందు మనోజ్ఞమగురీతిని బ్రకాశితము. అలం. ఉత్ప్రేక్ష.

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో
యిల చంచునఁ జించి క్రోల్చె నీరీతి వియో
గులగుండియ లవియింపుదు
బలువిడి నని మరునియెదుటఁ బచరించె ననన్. 49

టీ. కోయిల=పికము, తలిరాకుగుత్తిన్ = చివురుజొంపమును, తమిన్ = అనురాగముతో, చంచునన్=ముక్కుతో, ఈరీతిన్=ఈప్రకారముగ, వియోగులగుండెలు= విరహులహృదయములను, బలువిడిన్ = ఉద్ధతితో, అవియింపుదున్ = బ్రద్దలుచేయుదును, అని, మరునియెదుటన్=మన్మథునియెదుట, పచరించెన్=ప్రకటించెను. అనన్= అనునట్లుగా, చించి=చీల్చి, క్రోల్చెన్=మూసెను.

భా. కోయిలవసంతమునఁ జిగుళ్లనుజీల్చి వానిరసముం ద్రావి కూయుట సహజము. అట్టిదానికృత్యమును గవి యిట్లుత్ప్రేక్షించినవాఁడు. కోయిల చిగుళ్లంజీల్చుట యట్లే విరహులహృదయములం జీల్తునని మన్మథునకుఁ దెల్పుచున్నట్లుండెనని భావము. వసంతమునఁ బికకూజితశ్రవణమున విరహులు మిగుల బాధనందుట కావ్యప్రసిద్ధవిషయము. పికకూజిత ముద్దీపనభావముగదా. అలం. ఉత్ప్రేక్ష.

చ. మలయసమీరణచ్యుతసమంచితపాండుపలాశలైనపా
దులనునుసోఁగతీఁగలు యదుప్రభునిం దలపించె బాలచా
పలహృతతీరవస్త్రలయి పంకరుహాకరమధ్యసీమలన్
నిలిచినముగ్ధగోపరమణీరమణీయవిలాసరేఖలన్. 50

టీ. మలయ .....పలాశలైన - మలయసమీరణ = మలయమారుతుని చేత, చ్యుత=జాఱిన, పాండుపలాశలైన = పండుటాకులుగల, పాదులనునుసోఁగతీఁగలు= పాదులందలి నున్ననైన పొడవైనతీఁగలు, బాలచాపల హృతతీరవస్త్రలయి-బాల=చిన్నవానియొక్క, చాపల=చపలత్వముచేత; అనఁగాఁ జిన్నతనపుఁ జపలత్వముచేతననుట. హృత=దొంగిలింపఁబడిన, తీర=ఒడ్డునందలి, వస్త్రలు=బట్టలుగలవారలు, అయి, పంకరుహాకర మధ్యసీమలన్=సరస్సుల మధ్యప్రదేశములందు, నిలిచిన=నిలిచియున్న, ముగ్ధగోప...రేఖలన్-ముగ్ధ=సుందరులైన, లేక యితికర్తవ్యతా మూఢులైనయనియుం ననవగును. గోపరమణీ=గోపికలయొక్క, రమణీయ = మనోహరమైన, విలాస=లీలలుగల, రేఖలన్=ఆకృతులను, తలపించెన్=జ్ఞప్తికిఁదెచ్చెను.

భా. మలయమారుతప్రసారమున నానందనమునందలి పాదులందైన పాండుపర్ణములనురాల్చినతీవలు శ్రీకృష్ణునకు, బాల్యచాపలమునఁ దాను తీరవస్త్రములం దొంగిలింపఁ గమలాకరమధ్యదేశముల నిల్చియున్న గోపికాబృందమును జ్ఞాపకమునకుం దెచ్చెనని భావము.

విశే. పండుటాకుల రాల్చినతీవలు వివస్త్రలగుగోపికలవలెను, పాదులందుండుట కమలాకరమధ్యదేశముల నిల్చుటవలెను నుండెనని గ్రహించునది. అలం. ఉత్ప్రేక్ష. స్మరణము.

సీ. పరువంబు గాక చొప్పడనిమామిడి తేనె
లాన నాసాస నట్టాడునవియుఁ
దమకించి చిగురాకు గమిచి నోరొగరైనఁ
గడఁగి గొజ్జఁగనీటఁ గడుగునవియు
సంపంగెపాదరింటిచక్కి గోరఁటఁ గాంచి
యుసురంచు *మగిడి నోరూరునవియుఁ
గలిగొట్టుపసరుమొగ్గలఁ గోర్కి పొలివోయి
మునుపటిమొల్లల మూఁగునవియు

* మగిడియుం నొఅలునవియుఁ.

ఆ నగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలసూపెఁ
బూపుదనుక నెల్లచోటఁ దోఁట
యందుఁ దాము యగుచు నమ్మరునెలగోలు
పోఁజూ లనఁగఁ జూడ్కిపండు వగుచు. 51

టీ. పరువంబుగాక = పరిపక్వముగాక, చొప్పడని = వలనుగాని; ఆనవీలులేని యనుట, మామిడితేనెలు = చూతమరందములను, ఆనన్ = గ్రోలుటకై, ఆసాసన్ = ఆశగానియాశతో; అనఁగా పనికిరానియాశతో ననుట. అల్లాడునవియు = మిక్కిలి పరిభ్రమించునవియు; అనఁగా మామిడిపూవులు లెస్సగ వికసింపకుండుటంజేసి యందలి మరందమాన వీలులేమిని వానిఁ గ్రోలంజాలకయు, నట్లని వాని విడువ నిచ్ఛపుట్టకయు నటియాడసతోఁ దుమ్మెదలు తిరుగుచుండెనని భావము. తమకించి=త్వరపడి, చిగురాకున్ = పల్లవమును, కమిచి=ఆక్రమించు; కొఱికియనుట. నోరు, ఒగరు=చేదు, ఐనన్ = కాఁగా, కదఁగి=పూని, గొజ్జఁగనీటన్ = గులాబినీటిచే, కడుగునవియున్ = ప్రక్షాళనముచేసికొనునవియును; అనఁగాఁ గొన్నితుమ్మెదలు పుష్పోద్భవము గాకుండఁగనే వేగిరపాటునఁ గిసలయములం గొఱికెననియు, దాన వానినోళ్లు చేదెక్కెననియు, నట్టి చేదైననోళ్లను గొజ్జఁగినీటఁ జేదువోవుటకై కడుగుకొనుచుండెననియు భావము. తుమ్మెదలు త్వరచేఁ జిగుళ్లంజీల్చియు నందు మరందములేమి వీడి గొజ్జఁగినీటిని గంధిలమగుదాని నానుచుండెనని గ్రహించునది. సంపెంగపొదరింటిచక్కిన్ = చంపకనికుంజప్రదేశమందైన, గోరంటన్ = గోరంటచెట్టును, కాంచి=చూచి, ఉసురంచున్ = ఉసురనుచు; అనఁగా భయముచే నుపయోగింపఁ బనికిరాదయ్యెఁగదా యని నిట్టూర్పువిడుచుచనుట. మగుడన్ = మరల, నోరూరునవియున్ = నోటినుండి నీరుగార్చునవియును; ఏదేనివస్తువును దినవలెననుగోర్కెయుండి యది యగపడి లభింపనపుడు నోటినుండి నీరూరుట సైజము. సంపెంగవాసనతుమ్మెదలకుఁ బ్రాణాపాయముగల్గించునది. కురవకము సంపెంగపొంతనుంటచే నప్పటికి భ్రమరములు పోఁజాలక యయ్యో గోరంటపూవులమరందము గ్రోల వీలులేకపోయెఁగదాయని నోట నీరూర నుస్సురనుచుండెనని భావము. కలిగొట్టుపసరుమొగ్గలన్ = పాటలవృక్షసంబంధమైన పూవమొగ్గలందలి; పసరుమొగ్గలనఁగాఁ బరిపాకదశనందని మొగ్గలనుట. కోర్కి=కాంక్ష, పొలివోయి=పోయి, మునుపటిమొల్లలన్ = పూర్వపు మొల్లపూవులందే, మూఁగునవియున్ = క్రమ్మునవియు; అనఁగాఁ దుమ్మెదలు కలిగొట్టుమొగ్గలయందును మరందముం గ్రోల నేఁగెననియు, నవి యప్పటికి వికసింపక పసరుగ్రక్కుచుండుటం జేసి మగిడి తాము మున్నెచ్చటి మరందముం గ్రోలినవో యామొల్లపూవులనే చేరెననియు భావము. అగుచున్, తేఁటికదుపులు = తుమ్మెదమందలు,

ఆమనిన్ = వసంతకాలమున, చూపుదనుకన్ = దృష్టివ్యాపించునంతవఱకు, తామె, ఆగుచున్ = ఉండుచు, అమ్మరునెలగోలుపౌఁజులు = ఆమన్మథునియొక్క కొత్తలసేయుసేనలు; అనఁగా వీరాలాపములతోడ ముందు నడచుసేనలనుట. అనఁగన్ = అనునట్లు, చూడ్కిపండువు = నేత్రోత్సవము, ఆగుచున్, ఎల్లచోటన్ = సర్వప్రదేశములందును, తోఁటయందున్ = ఆనందనారామమున, తలసూపెన్ = అగపడెను; ఎచట దృష్టినిడిన యచటఁ దుమ్మెదమందలే యుండుటం జేసియు, మఱియు దృష్టి వ్యాపించునంతవఱ కవియే కన్పట్టుచుండుటం జేసియు, వసంతునిపరివారమును మన్మథసైన్యముగాఁ జెప్పుటకు కవిసంప్రదాయసిద్ధమగువిషయ మగుటం జేసియుఁ, దుమ్మెదదొమ్మిమూఁకలను మన్మథునెలగోలుపౌఁజులుగఁ గవి నిరూపించినవాఁడని గ్రహించునది. అలం. స్వభావోక్తి. పౌఁజులనుచోట నుత్ప్రేక్ష.

క. నందప్రియనందనుఁ డా
నందన మఖిలర్తునందనం బయి నయనా
నంద మొనరింప నమరీ
బృందంబులు గొలువఁ జనుచుఁ బ్రియసతి కనియెన్. 52

టీ. నందప్రియనందనుఁడు = నందుని గారాబుకొమరుఁడు శ్రీకృష్ణుఁడు, ఆనందనము = ఆనందనారామము, అఖిలర్తునందనంబు = సమస్తర్తులచేతను సంతోషదాయకంబు, ఐ = అయి; షడ్రుతుసమావేశమున నానందదాయకంబగుచున్నదనుట. నయనానందము = నేత్రములకు సంతోషమును, ఒనరింపన్ = చేయఁగా, అమరీబృందంబులు = దేవవధూటీసమూహములు, కొలువన్ = సేవింపఁగా, చనుచున్ = పోవుచు, ప్రియసతికిన్ = ప్రేయసికి సత్యభామకు, అనియెన్; సత్యభామనుగూర్చి పల్కెననుట. అలం. వృత్త్యనుప్రాసము. సుకరప్రాసము.

చ. సరసిజనేత్ర! చూచితె వసంతుఁడు నీవనవాటికారమా
తరుణియుఁ బాణిపీడనవిధానసమయంబునఁ గేలుదోయి నొం
డొరుపయి సమ్మదంబు లిగురొత్తఁగ మాటికిఁ జల్లు సేసఁబ్రా
ల్నెరసె ననంగ వ్రాలెఁ గుహళీవిగళన్నవకోరకావళుల్. 53

టీ. వసంతుఁడున్, ఈవనవాటికారమాతరుణియున్ = ఈనందనవన శ్రీయను యువతియును; ఈనందనవనప్రదేశపుశోభయను వనితయనుట. పాణిపీడనవిధానసమయంబునన్ = పాణిగ్రహణవిధానకాలమున; పెండ్లిజరుగుసమయమున ననుట. కేలుదోయిన్ = రెండుచేతులతోడను, ఒండొరుపయిన్ = ఒకరిమీఁదనొకరు, సమ్మదంబులు =

[illegible]ములు, ఇగురొత్తఁగన్ = మొలకెత్తఁగా, మాటికిన్ = వేమఱు, చల్లు=చల్లుకొన్న, సేసఁబ్రాలు=శుభాక్షతలు, నెరసెన్ = వ్యాపించెను, అనంగన్ = అనునట్లుగా, కుహళీ...వళుల్ = [illegible]పోత్తులనుండి, విగళత్ = జాఱిన, నవ=క్రొత్తవైన, కోరక=మొగ్గలయొక్క, [illegible] = [illegible]లు, ప్రాలెన్ = క్రిందఁబడెను. సరసిజనేత్ర = తమ్మికంటీ!, చూచితె=కనుఁగొంటివా!

భా. [illegible]కపోత్తులనుండి నేలఁజాఱిన నూతనకోరకములు, నందవనశ్రీవసంతుల [illegible]కాలమున నానూతనదంపతు లొండొరులపైఁ బోసికొనినట్టియుఁ, నేలఁబడి వ్యాపించినట్టియు శుభాక్షతలంబోలి యొప్పెనని భావము.

వి శే. పూగుత్తులనుండి పూఁచినసుమములు జాఱును గాని నూతనకోరకములు [illegible] గానఁ, గుహళీశబ్దమునకుఁ బోకపోత్తని యర్థముచెప్పుటయే యుచితమని [illegible]. మఱియు నిందు వసంతతరుణీశబ్దసారస్యము ననుసరించి యుంపలీవివాహవే[illegible]చితపద్ధతిని నిరూపితమయ్యెనని యూహింపఁదగును. ఇదిమొదలు 57-వ పద్యమువఱకును శ్రీకృష్ణుని సరసోక్తులు వర్ణితములు. అలం. ఉత్ప్రేక్ష.

చ. చిలుకలు వాఁడిచంచువులఁ జించినచో లవలీదళంబులన్  
ఫలరసరేఖ లంటి కనుపట్టెడుఁ జూడుము చైత్రుఁ డీలతా  
[illegible]లనలగండదర్పణతలంబులఁ గుంకుమపత్త్రభంగముల్  
చెలువుగ వ్రాసెనో యన నలిప్రకరాద్వయవాదకైశికా! 54

టీ. అలిప్రకర...కైశికా-అలిప్రకర = తుమ్మెదగుంపుతో, అద్వయ = అభేద[illegible], వాద=పలుకునట్టి, కైశికా=కొప్పుగలదాన, లవలీదళంబులన్ = లవలీపత్త్రములందు, చిలుకలు, వాఁడిచంచువులన్ = సూదిముక్కులతో, చించినచోన్ = చీల్చిన చో[illegible]టులందు, లేక, చీల్చునపుడనియు నర్థము చెప్పనొప్పును. ఫలరసరేఖలు=పండ్లరసము [illegible]పన్నులు, అంటి=అంటుకొని, చైత్రుఁడు = వసంతుఁడు, ఈలతాలలనలగండదర్పణతలంబులన్ = ఈతీవలను విలాసినుల యద్దములవంటి చెక్కుటద్దావులందు, కుంకుమపత్త్రభంగముల్ = కుంకుమచే రచితమైన మకరికాదిపత్త్రరచనలను, చెలువుగన్ = అందముగ, వ్రాసెనో=దిద్దెనో, అనన్ = అనునట్లుగా, కనుపట్టెడున్ = అగపడెడి, [illegible]ము=పలకింపుము.

భా. చిలుకలు పండ్లను మొదట ముక్కులతోఁ జిదిమి పిదపఁ దద్రసయుక్తమైన ముక్కులతో లవలీదళములం జీల్పఁగా, నాదళములం దాముక్కులందంటియున్న ఫలరసమును [illegible], నట్లు దళములనంటి నిల్చిన ఫలరసరేఖలు వసంతుఁడు లతావనితల

చెక్కిళ్లనువ్రాసిన కుంకుమపత్త్రరచనలవలె నున్నవనియు భావము. చిలుకలు ఫలములను ముక్కుతోఁబొడువఁగా వానినుండి చిప్పిలిజాఱినరస మాఫలవృక్షముల నల్లుకొనియున్న లవలీలతలయాకులపైఁ బడియుండెననియు, నవి వసంతుఁడు లతాలలనల చెక్కిళులనొనర్చిన కుంకుమపత్త్రరచనలవలె మించెననియైనను భావము చెప్పనొప్పును. లవలీదళములను ఫలరస మంటియుండుముక్కుతోఁ జిలుకలు పొడిచినకతన ఫలరసచిహ్నము లేర్పడె ననుటకన్న లతలు చెట్టుల కల్లికొనియుండుట సహజమగుటంజేసియుఁ, బండ్లకు బిల మేర్పడినఁ దద్రసము చిప్పిలి జాఱుట నైజమగుటంజేసియు, ఫలరసము లవలీపల్లవముల జాఱి యంటెననుటయే యుచితమని తోఁచెడి. ఊరకె లవలీపల్లవచ్ఛేదన మంగీకరింపనేల?

వ్యా-విశే. లవలీపల్లవములు తెల్లగాఁదళతళలాడుచుండుననివర్ణించుటయు వానిని వనితాగండదేశముల కుపమానములుగఁ బేర్కొనుటయు గవులసంప్రదాయమైయున్నది. ''లవలీపల్లవపాండురంబులగుగల్లక్షోణులన్'' అని పాండురంగమాహాత్మ్యము. లవలీపల్లవములు తెల్లనివిగావుననే దర్పణములవంటిచెక్కిళులకు సమానములుగాఁ గల్గినవని గ్రహించునది. పరికింపఁగా లవలీపల్లవములనఁగాఁ దములపుటాకులని విశదమగుచున్నది. అందుఁ బండుతములపుటాకు లిచ్చోఁ గ్రహింపనగును. అలం. ''గండదర్పణములం లతాలలనలు'' అనుచో రూపకము. లవలీపల్లవములందలి ఫలరసములఁ గుంకుమమకరికాపత్త్రరచనలఁగా నూహించుటంజేసి యుత్ప్రేక్ష.

ఉ. పాదపనూతనాంబుధరపంక్తివిముక్తమరందవర్షసం
పాదితశక్రగోపములభావము నందుచు నోయదృష్టసిం
హోదరసన్నివేశ! కడు నొప్పెడు దాడిమబీజము ల్మదో
న్మాదితరాజకీరవదనత్రుటితోరుఫలచ్యుతంబులై. 55

టీ. ఓయదృష్టసింహోదరసన్నివేశ = ఓకానరానిసింహమధ్యముంబోలు నడుము కూర్పుగల సత్యభామ, మదోన్మాది......చ్యుతంబులై-మద = మదముచే, ఉన్మాది= మత్తిలిన, రాజకీర=చిలుకమిన్నలయొక్క, వదన=నోళ్లచేత, త్రుటిత = త్రుంపఁబడిన, ఉరు=గొప్పవైన, ఫల=పండ్లనుండి, చ్యుతంబులై=జాఱినవై, దాడిమబీజముల్=దానిమ్మగింజలు, పాదప......భావమున్-పాదప = వృక్షములనెడు, నూతనాంబుధరపంక్తి= క్రొత్తమేఘములచాలునుండి, విముక్త=విడువఁబడిన, మరందవర్ష=పూఁదేనెయనెడు వర్షముచే, సంపాదిత=సమకూర్పఁబడిన, శక్రగోపములభావమున్=ఇంద్రగోపములను పురుగులధర్మమును; అనఁగా నారుద్రపురుగులవిధముననుట. అందుచున్=పొందుచు, కడున్=మిక్కిలి, ఒప్పెడున్=ప్రకాశించెడు.

భా. [illegible]రాచిలుకలు ముక్కులచే దాడిమఫలములఁ ద్రుంపఁగా వానినుండి [illegible]బీజములు వానకారునఁ దోఁచు నింద్రగోపముల పోల్కినుంట నయ్యవి [illegible]యము జలదమాలికచేఁ గూర్పఁబడిన యింద్రగోపములేమో యన్నట్లుండెనని [illegible]. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

క. [illegible]గు మెఱుఁగు వాతెఱ
కలకంఠవిటుండు గముపఁగాఁ జూతలతా
లలన విదిర్చెను గంటివె
[illegible]లికంకణముఖరవిటపహస్తముల సతీ! 56

టీ. సతీ = ఓపతివ్రతా! కలకంఠవిటుండు = కోకిలయనువిటుఁడు, తలిరాకు [illegible] తెఱన్ = చిగురుటాకను ప్రకాశించు పెదవిని, కముపఁగాన్ = ఆక్రమింపఁగా, [illegible] గొఱుకఁగాననుట. చూతలతాలలన = మామిడితీవయనువిలాసిని, అలికంకణముఖర ......హస్తములన్ - అలి=తుమ్మెదలనెడు, కంకణ=హస్తాభరణములచే, ముఖర=ధ్వనించుచున్న, విటప=శాఖలనెడు, హస్తములన్ = చేతులచే, విదిర్చెన్ = తొలఁగించెను.

భా. మామిడిచివురుందినఁ గోయిల వచ్చియు నళిఝుంకారయుతములగు తచ్ఛా[illegible] చలనమునకుభయపడి మెసవుటమానిపోయెనని తాత్పర్యము. పైనివ్రాసినవిషయమును [illegible], చివురును వాతెఱగాను, నలులఁ గంకణములుగాను, వానిధ్వనిని గంకణారావముగాను, [illegible]ములహస్తములుగాను రూపించి, మామిడితీవకు స్త్రీత్వమొసంగి స్త్రీని జేసి, కోయిలను విటునిగా నెన్ని దానికి పురుషత్వమారోపించి పురుషుం జేసి, కోయిల చిగురునాక్రమించు [illegible]ను భుజంగుఁడు పెదవి గఱచుటగా నెన్ని, తుమ్మెదరొదల నొప్పుశాఖాచలనమును [illegible]మిని గంకణధ్వనులెసంగు చేతులతోఁ బెదవిఁగఱచువానిఁ ద్రోయుటనుగాఁ బల్కి, సరసముగఁ గామినీకాముకవ్యాపారముగ మార్చి వర్ణించెను. ఇందు ముగ్ధావ్యాపారము ప్రకాశితము. వాయి + తెర = వాతెఱ. అలం. రూపకము.

చ. తనుఁ గనుఁద్రామి యొండొకలతం బతి వేఱొకతేఁటిబోటిపా
త్తున విరిదేనె *గ్రోలఁ గని తూలుచు సంపఁగితావివెల్లిలోఁ
గనలునఁ గూలఁబోవునలికామినిసాహస మేమి సెప్ప న
య్యనుఁగుఁబ్రియుండు నెచ్చెలులు నాఁగినమానదరాళకుంతలా! 57

టీ. అరాళకుంతలా = వక్రములగునలకములుగలదాన; సత్య! కుటిలాలకములుగల్గుట స్త్రీలకొకవన్నెగాఁ గవులు వర్ణించుట సైజము. పతి=భర్తయైన పురుషభృంగము, తనున్, కనుఁద్రామి=వంచించి; కనుమొఱఁగియనుట. ఒండొకలతన్ = వేఱొకలతయందు,

---

*గ్రోలఁగ యెదుర్పడి.

వేఱొకతేఁటిబోటి పొత్తునన్=మఱొక భ్రమరాంగనయొక్క స్నేహముతో, విరిదేనెన్=పుష్పాసవమును, క్రోలన్ = త్రావుచుండఁగా, కని=చూచి, తూలుచున్=వంతచేఁదడబాటునందుచు, సంపఁగితావివెల్లిలోన్=చంపకపరిమళప్రవాహమున,కనలునన్=కోపముతో, కూలన్=పడుటకు, పోవు=ఏగునట్టి, అలికామినిసాహసము=భ్రమరాంగనయొక్క సాహసమును, చెప్పన్ ఏమి = చెప్పుటకేమున్నది. అయ్యనుఁగుఁబ్రియుండున్ = ఆ వేఱొంక భ్రమరిపొత్తునఁ దేనెఁద్రావు నాభ్రమరిభర్తయును, నెచ్చెలులున్ = చెలికత్తెలును, ఆఁగినన్=అడ్డగించినను, మానదు=విడువదు.

భా. ఒకపురుషభ్రమరము తనజాయను వీడి వేఱొకయాఁడుతుమ్మెదతోఁ బుష్పమరందముం గ్రోలుచుండఁగా, నామగతుమ్మెదజాయ యాజాడంగాంచి మానక్రోధములగ్గలముగాఁ దాజీవితముం ద్యజింపఁ జంపకగంధప్రవాహమునఁ బడఁబోవుచుండెననియు, దానిమగఁడగు కొదమతుమ్మెదయు, దానిచెలులును వలదని యెంతవారించినను నది యాయత్నమును విడువకుండెననియు భావము. చంపకగంధము సారంగప్రాణాపాయకరమనుట సహజము. తుమ్మెదలిచ్చోటఁజొచ్చుటకు ప్రాణములమీఁదియాసనుగూడ వీడి సంచరించుచున్నవని ఫలితార్థము.

విశే. శ్రీకృష్ణుఁ డీమూలముగ స్త్రీలకుఁగలసాహసము, పట్టుదల మున్నగువానిని సత్యకుసూచించుచు, నీవును నిట్టిదానివే యనునంశమును నిపుణముగఁ దెలియఁబల్కెనని యెన్నునది. పారిజాతమును రుక్మిణికొసంగినకతమున సత్య శ్రీకృష్ణునిపై నలుకఁబూనుట యనుసత్యావృత్తాంతమిందు శ్రీకృష్ణుఁడు సత్యకు సాకూతముగఁ దెలియఁజేసెనని గ్రహించునది.

ఇందు "గ్రోలఁ గని తూలుచు" అనుచో "గ్రోలఁగ నెదుర్పడి" అను పాఠాంతరమగపడు. అప్పుడు "క్రోలఁగన్=త్రావఁగా,ఎదుర్పడి=ఎదురై" అని యర్థముచెప్పవలెను. అనఁగా భ్రమరి యెచటనుండియో వచ్చుచు నెదురై చూచెనని భావము.

చ. అనుచుఁ బ్రియాంసపీఠి నిజహస్తతలంబున నూఁది గల్పకా
వనిజదుకూలమార్జనల వంజులపుష్పమరందసేచనన్
దనదువిహారవైఖరికి నందనదేవత యాయితంబు సే
సినగతి నొప్పుదివ్యవనసీమ ముదంబున సంచరించుచున్. 58

టీ. అనుచున్=పల్కుచు, శ్రీకృష్ణుఁడు కర్త. ప్రియాంసపీఠిన్ = ప్రేయసియొక్క విశాలమగుమూఁపును, నిజహస్తతలంబునన్ = తనచేతితో, ఊఁది=పట్టుకొని; అనఁగా మూఁపునఁ జేయిడియనుట. కల్పకావనిజదుకూలమార్జనలన్-కల్పకావని=కల్ప

కల్పకదుకూలములనుండి, జ-పుట్టిన, దుకూల=పట్టుబట్టలచేనైన, మార్జనలన్=తుడుచుటలచేతను, వంజులపుష్పమరంద సేచనన్-వంజులపుష్ప = అశోకకుసుమములసంబంధమగు, మరంద=తేనెయొక్క, సేచనన్=తడుపుటచేతను, తనదువిహారవై ఖరికిన్ = తన విహారప్రకారమునకు, నందన దేవత=నందనవన దేవత, అయితంబు=సిద్ధము, చేసినగతిన్ = చేసిన రీతిగ, ఒప్పు=ఒప్పునట్టి, దివ్యవనసీమన్=దేవవనతలమున, ముదంబునన్ = సంతోషముతో, సంచరించుచున్=తిరుగుచు.

భా. కల్పకదుకూలములచేఁ దుడువఁబడి యశోకసుమమరంద సేచనమున మించు నక్కరణము శ్రీకృష్ణవిహారమునకై తగురీతినందనవన దేవత సిద్ధము చేసినట్లుండెననియు,నందనవనమునందు జేతితోనూఁది శ్రీకృష్ణుఁడు విహరించెననియు భావము. భుజముపైఁ జేయి నుంచుకొనుట కూర్మిని సూచించునదియు శృంగారపుకేళిని బ్రకటించునదియు నగును.

శా. అర్చిష్మత్ప్రతిమప్రతాప! మహనీయత్యాగ! దైత్యాభియా
త్యర్చోద్యచ్చతురర్ణవాంతసకలజ్యాభోగ! జాగ్రద్యశ
శ్చర్చాసాంద్ర*దిగంగనాంగ! మదనశ్యామాసహాయేంద్రభూ
వర్చస్స్తేనశరీరమోహితజగద్వామా! కళామానసా! 59

టీ. అర్చిష్మత్ప్రతిమప్రతాప=సూర్యునితోసాటియైనప్రతాపముగలవాఁడ,మహనీయత్యాగ=గొప్పయీవిగలవాఁడ, దైత్యాభియాతి...భోగ - దైత్యాభియాతి=రాక్షసవైరియగు విష్ణునియొక్క, అర్చా=పూజచేత, ఉద్యత్=సంభవించిన, చతురర్ణవాంత=నాలుగుసముద్రములుహద్దుగాఁగల్గిన, సకలజ్యా=సమస్తభూమియొక్క, భోగ=అనుభవముగలవాఁడ, జాగ్రత్......దిగంగనాంగ-జాగ్రత్=సర్వోత్కృష్టమున్న, యశః = కీర్తియొక్క, చర్చా = మైపూఁతచే, సాంద్ర=దట్టములైన, దిగంగనాంగ=దిక్సతుల యవయవములుగలవాఁడ, మదన......జగద్వామా - మదన=మన్మథునియొక్కయు, శ్యామాసహాయ=నిశాసహాయుండగుచంద్రునియొక్కయు, ఇంద్రభూ=ఇంద్రునికొడుకగు జయంతునియొక్కయు, వర్చః=తేజస్సులకు, స్తేన=దొంగయైన, శరీర=శరీరముచే, మోహిత=మోహింపఁజేయఁబడిన, జగత్=లోకమునందలి, వామా=వనితలుగలవాఁడ, కళామానస=విద్యాయుక్తమైన మదిగలవాఁడ.

భా. కృష్ణరాయఁడు సూర్యతుల్యప్రతాపుఁడనియు, మహాదాతయనియు, విష్ణుపూజానుసంధానమున సంప్రాప్తమైనరాజ్యవైభవము గలవాఁడనియు, దిగంతవ్యాప్తకీర్తిగలవాఁడనియుఁ, జంద్రకంతుజయంతులకన్నఁ జక్కనివాఁడగుట నాతనింజూచి స్త్రీలు మోహమునుం జెందుచుందురనియుం భావము.

* దిగంతరాళ!

విశే. చతురర్ణవపరీతభూవలయమంతయుం వశపడకున్నను వశపడునట్లు చెప్పుట యతిశయోక్తి. ప్రతాపవిషయమున సూర్యునితోఁబోల్చుట సామాన్యముగఁ గవిసంప్రదాయమూట నిచ్చో 'అర్చిష్మత్' పదమునుండి యగ్నియనునర్థ ముద్ధరింప వీలున్నను నట్లొనర్పలేదు. అగ్ని కాంతికి సూర్యుఁడేగదా కతము.

క. విదళితకాళింగమదా,స్పదసింధురకుంభరత్నశర్కరిలారా
దుదయగిరికొండవీటీ, పదవీస్థల! మండలీకభాస్కరబిరుదా! 60

టీ. విదళిత...పదవీస్థల - విదళిత = బ్రద్దలుచేయఁబడిన, కాళింగ = కళింగ దేశాధిపతిసంబంధమైన, మదాస్పద = మదమునకుఁదావులైన; అనఁగా మదించినవనుట. సింధుర = ఏనుంగులయొక్క, కుంభ = కుంభస్థలములందలి, రత్న = రత్నములచే; ఏనుఁగుకుంభముల బొంగువెదుళ్లను మంచిముత్తెములుండుననుట కవిసంప్రదాయమగుట, నిచ్చో రత్నపదమునకు మంచిముత్తెములని యర్థము. మఱియుం నవరత్నములలో మంచి ముత్తెమొకటియగుట రత్నపదవ్యవహార మవిరుద్ధము. శర్కరిల = కఱకుటిసుకగలదిగాఁ జేయఁబడిన, ఆరాత్ = సమీపమునందున్న; అనఁగాఁ బట్టణసమీపమున నున్నవనుట. ఉదయగిరికొండవీటిపదవీస్థల='ఉదయగిరి','కొండవీడు'అనుపట్టణముల ప్రదేశములుగల వాఁడ; అనఁగాఁ గృష్ణరాయఁ డుదయగిరికొండవీడుల ప్రాంతదేశములఁ గళింగరాజపాలితములగు నారాజులసంబంధమైన మదపుటేనుంగుల కుంభములంజీల్చి యందలి ముత్తెములచే నిసుకగలవానినిగాఁ జేసెనని భావము. యుద్ధభూములు పట్టణబాహ్యములనుండుట సహజముగదా. మండలీకభాస్కరబిరుదా = 'మండలీకభాస్కర' అను బిరుదము గలవాఁడ.

వ్యా-విశే. సిద్ధసమాసమునఁ జొనుప్పుచు నందుఁ బట్టణనామమగు కొండవీడు పదము నావవిభక్తికముగాను 'కొండవీటీ' అని యీకారాన్త స్త్రీలింగశబ్దముగాను బ్రయోగించుట వింత. లేదా కొండవీటీశబ్దమే ప్రాతిపదికమనవలెను.

పంచచామరము.—

మరుద్వృధాతటస్థశత్రుమండలీగళాంతర
క్షరన్నవాసృగాపగాభిసారికాదృతాంబుధీ!
మరుత్పతిస్వరుక్షతిక్రమత్రుటత్కుభృద్వర
స్ఫురద్ధ్వనిప్రవృద్ధయుద్ధపుంఖితానకార్భటీ! 61

టీ. మరుద్వృధా...అంబుధీ-మరుద్వృధా=కావేరియొక్క, తటస్థ = తీరమందున్న, శత్రుమండలీ=శత్రుసమూహముయొక్క, గళాంతర = కంఠమధ్యమునుండి,

[illegible]గుచున్న, నవార్భక్=క్రొత్తనెత్తురనెడు, అపగా=నదీరూపమైన, అభిసారికా=[illegible]చుండుబోవు స్త్రీలచే, ఆదృత = ఆదరింపఁబడిన; సంతోషపెట్టఁబడినవాఁడనుట. అంబుధి=సముద్రుఁడుగలవాఁడ, మరుత్పతి...అనశార్భటీ-మరుత్పతి = దేవేంద్రునియొక్క, స్వరు=వజ్రాయుధసంబంధమైన, క్షతి = దెబ్బలచే, క్రమ=క్రమముగా; అనఁగా నొకటితరువాత నొకటియనుట. త్రుటత్ = నేలఁగూలుచున్న, కుభృద్వర = పర్వతశ్రేష్ఠములయొక్క, స్ఫురత్=ప్రకాశమానమగు; అనఁగా వెలికివెడలినదనుట. ధ్వని=ధ్వనులవలె, ప్రవృద్ధ=అతిశయించిన, యుద్ధ=యుద్ధమునకు సంబంధించిన, పుంఖ[illegible]=సక్రమముగా నొప్పునట్టి భేరీవిశేషములయొక్క, ఆర్భటీ=మ్రోఁతలుగలవాఁడ.

భా. కృష్ణరాయఁడు గావేరీతీరస్థశత్రుసమూహముం గూల్చి వారి క్రొన్నెత్తురుటేరులచే సముద్రు నుప్పొంగించెననియు, వజ్రాయుధహతిచే గుబాలున నేలంగూలు పర్వతముల యారావములవలె నాతని జయభేరీధ్వను లెసఁగెననియుం భావము.

వి. సముద్రుఁడు నదీపతియౌట నతనిం గాంతునిగాను, వానిం జెందఁబోవు రక్తనదుల నభిసారికలగాను గవి పేర్కొనుట యుచితమనఁదగును. ఇది పంచచామర గుణవృత్తము. దీని కొకపాదమునకు, జ. ర. జ. ర. జ. గ. అనుగణము లుండును. దశమాక్షరము యతిస్థానము. ఇట్టే తక్కుంగలపాదములుండును. దీనినడకగూడ వర్ణ్యమగు భేరీధ్వనినే యనుకరించుచున్నది.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది నంది సింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన పారిజాతాపహరణంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము.



శ్రీవేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ! చిన్నమదేవీ
జీవితనాయక! కవితా
ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా! 1

టీ. శ్రీవేంకట...హృదయ-శ్రీవేంకటగిరివల్లభ=శ్రీవేంకటాచలేశునియొక్క, సేవా=అర్చనయందు, పరతంత్ర=ఆసక్తమైన, హృదయ = మనస్సుగలవాఁడ, చిన్నమదేవీజీవితనాయక = చిన్నమదేవీప్రాణేశ్వరుఁడా, కవితాప్రావీణ్యఫణీశ = కవిత్వనైపుణివిషయమున శేషునిబోలువాఁడ, కృష్ణరాయమహీశా=కృష్ణరాయభూమీశ.

భా. కృష్ణరాయఁడు తిరుమలేశుండగు వేంకటేశ్వరుని గొల్చుటయందే మిగుల నాసక్తిగలవాఁడనియుఁ, జిన్నమదేవికిఁ బ్రియుఁడనియుఁ, గవిత్వనైపుణిని శేషు ననుకరించువాఁడనియుం భావము. కృష్ణరాయని కవితానైపుణి యిందుఁ బ్రకాశితము.

## పారిజాతము.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
వనవిహారంబు సలుపుచు వచ్చి వచ్చి
పారిజాతంబు గాంచి సంభ్రమ మెలర్ప. 2

టీ. అవధరింపుము, జనమేజయక్షితీశవరునకున్, అమ్మౌనివల్లభుండు=ఆమునిశ్రేష్ఠుఁడు, ఇట్లనున్=ఇట్లనెను. వనవిహారంబు, సలుపుచున్=చేయుచు, వచ్చివచ్చి;కొంత దవ్వు వచ్చియనుట. కృష్ణుఁడు కర్త. పారిజాతంబున్ = పారిజాతవృక్షమును, కాంచి=చూచి, సంభ్రమము=త్వర, ఎలర్పన్=అతిశయింపఁగా, ముందటిపద్యముతో నన్వయము. శ్రీకృష్ణునికర్తవ్యాభినివేశ మీసందర్భమునఁ గవి తెల్లముగావింప నెంచినవాఁడుగానఁ బ్రారంభముననే సంభ్రమ మెలర్పనని బీజమును నాటినాఁడు.

మ. అసురారాతివిఘాతి సత్యఁ గని కాంతా! చూచితే పారిజా
తము భూమీరుహచక్రవర్తి త్రిజగత్సంపూజ్యసౌరభ్యకీ
ర్తి మరుల్లోక మలంకరించునది గౌరీనాథు జూటస్థలం
బు మృగాంకుండు రమామనోరమునురంబుం గౌస్తుభంబుంబలెన్. 3

టీ. అసురారాతివిఘాతి = రాక్షసహంతయగు శ్రీకృష్ణుఁడు, సత్యన్ = సత్యభామను, కని=చూచి, కాంతా! భూమీరుహచక్రవర్తి = వృక్షరాజమైనదియుం, త్రిజగత్సంపూజ్యసౌరభ్యకీర్తి = ముల్లోకములచేతను నర్చింపఁదగిన పరిమళమను కీర్తిగలదియుం, గౌరీనాథుజూటస్థలంబున్ = శివుని మౌళిభాగమును, మృగాంకుఁడు=చంద్రుఁడును, రమామనోరమునురంబున్ = విష్ణువక్షస్స్థలంబును, కౌస్తుభంబుం బలెన్ = కౌస్తుభమాణిక్యమువలెను, మరుల్లోకమున్=స్వర్గమును, అలంకరించునది = అలంకరించునది, పారిజాతమున్=పారిజాతవృక్షమును, చూచితే=చూచితివా?

ఇందలి 'కని' అను నసమాపకక్రియకు 11-వ పద్యమునందలి 'నావుడున్' అను దానితో నన్వయము.

భా. కౌస్తుభము విష్ణువక్షస్స్థలము నలంకరించువిధిని జంద్రుండు శంకరుని మౌళిభాగమును విభూషించువిధమున స్వర్లోకము నలంకరించునదియు, ముల్లోకములవారిచేఁ గొనియాడఁదగు పరిమళమను కీర్తిగలదియు, వృక్షములలో నెల్ల నుత్తమమైనదియుఁ గల్పనగమని భావము.

వి శే. ఇందుఁ బారిజాతమునకు నిల్పఁబడినవిశేషణములు తద్ఘనతను వెల్లడింపసమర్థములై సత్యభామకుఁ దద్విషయకాభిలాష నతిశయింపఁజేయుచున్నవి. ఇది మొదలు కొని 11-వ పద్యమువఱకుఁ గల శ్రీకృష్ణసంభాషణ మిట్లే పారిజాతవృక్షమహిమాప్రకాశకమై సత్యకుఁ దద్విషయమగుకోర్కి నతిశయింపఁజేయునదై తచ్ఛీలప్రకాశనబీజభూతమై యొప్పుచున్నది.

వ్యా-వి శే. కౌస్తుభంబుంబలెన్. ఇది సమస్తపదము. 'ఉపమేయము ప్రథమాంతమగునప్పుడు బలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయగు' అను ప్రౌఢవ్యాకరణసూత్రము ననుసరించి బలెపరముగా నామమగుకౌస్తుభమునకుఁ బ్రథమవచ్చె. పిదప "ప్రథమాంతములమీఁద వోలెబలెపోనిశబ్దములు ద్రుతపూర్వకంబులు విభాషనగు" అను సూత్రమునుంచి 'బలె' అనుదానికి పూర్వము 'ను' కల్గి తరువాత ద్రుతకార్యము బిందుపూర్వకమై రూపము సిద్ధించె. అలం. ఉపమ.

క. తరుణీ! యీతరుశాఖాంతరలోలదుకూలమారుతము లింద్రాణీ
పరివారవారసతులకుఁ, బరువపువిరికోర్కెఁ బొడముబడలిక నడఁచున్

టీ. తరుణీ=యువతీ! ఈతరు...మారుతములు-ఈతరు=పారిజాతముయొక్క, శాఖాంతర=కొమ్మలనడుమను, లోల=కదలుచున్న, దుకూల=పట్టుబట్టలచేనైన, మారుతములు=గాలులు, ఇంద్రాణీపరివారవారసతులకున్ = శచీదేవియొక్క పరిచారికలగు దేవవేశ్యలకు, పరువపువిరిఁగోఁతన్ = వికసించినపూవులను గోయుటచే, పొడము = పుట్టిన, బడలికన్=ఆయాసమును, అడఁచున్=పోఁగొట్టును.

విశే. 'ఏషాం పల్లవమంశుకాని' అని శక్తిభద్రుని యాశ్చర్యచూడామణి శ్లోకపాదమున ననుసరించి కల్పకపల్లవములే దుకూలములని యెన్నవలసియున్నది. ఇందలి 'ఈ తరుశాఖా' అను సమాసమునందు మొదటఁగల 'ఈ' శబ్దము మారుతపదమునకే విశేషణమని గ్రహింపవలయును. అట్లైనచో నిం దేకదేశాన్వయమునకుఁ దావు గలుగదు.

ఉ. మానిని! దీనిరత్నకుసుమస్తబకమ్ముల కాంతిఁ గమ్మఁబూఁ
దేనియ యంచుఁ గ్రోలఁ జనుదెంచినయాయెలదేఁటిదాఁటు లో
నూనినడప్పి మూఁగఁబడి యున్నతచంచలచంచుకోటిచే
నానెడుఁ జూడు మందగరుదంచలఝుంకృతు లుల్లసిల్లఁగన్. 5

టీ. మానిని = ఓమానవతీ! ఇది సాభిప్రాయము. దీనిరత్నకుసుమస్తబకమ్ములకాంతిన్ = ఈకల్పవృక్షసంబంధమైన మాణిక్యపుష్పగుచ్ఛముల ప్రభను, కమ్మఁబూఁదేనియ=కమ్మనిమకరందము, అంచున్=తలంచుచు, గ్రోలన్=త్రాగుటకు, చనుదెంచిన = వచ్చిన, ఆయెలదేఁటిదాఁటు=ఆ లేఁదేంట్లసమూహము, లోన్=లోపల, ఊనిన=పుట్టియున్న, డప్పిన్=దప్పిచే (తృషచేనని యర్థము), మూఁగఁబడి, ఉన్నత...కోటిచేన్-ఉన్నత=దీర్ఘమైన, చంచల=కదలుచున్న, చంచు=ముక్కులయొక్క, కోటిచేన్=కొనలచేత,మంద...ఝుంకృతులు-మంద=మెల్లనైన, గరుదంచలఝుంకృతులు=ఱెక్కలకొనలయొక్క ఝుంకారధ్వనులు, ఉల్లసిల్లఁగన్ = ప్రకాశితముగాఁగ, ఆనెడున్=తాగును, చూడు=చూడుము.

భా. ఎలదేఁటిగుమి కల్పవృక్షరత్నపుష్పగుచ్ఛకాంతిం గాంచి కమ్మని మరందమను భ్రాంతిని దృషతో దానిం గ్రోల నేతెంచి యల్లనల్లన ఱెక్కలాడించుచుఁ జంచుకోటిచే నానుచున్న వడి కాంచుమని భావము.

విశే. విశేషణముల నిగాగమమునకు బిందువును సున్నసోఁకునఁ బరుషము సరళమునయ్యెను. కమ్మఁబూఁదేనె. అలం. భ్రాంతిమత్తు.

క. ఈతరుశాఖల ప్రేలెడు, మేతోడవులకాంతిలోన మెలఁగెడుపక్షి
వ్రాతము నెఱుఁగరు నిర్జర, కాతరలోచనలు పలుకఁగా వినకున్నన్.

టీ. ఈతరుశాఖలన్=ఈచెట్టుకొమ్మలందు, వ్రేలెడు=వ్రేలాడునట్టి, మేలొడవుల కాంతులందున్=శరీరాలంకారముల కాంతిలో, మెలఁగెడు=సంచరించునట్టి, పక్షివ్రాతమున్=పక్షులసమూహమును, నిర్జరకాతరలోచనలు=దేవతాస్త్రీలు, (కాతరలోచన=భీతనేత్ర) పలుకఁగాన్=శబ్దమొనర్పఁగా, వినకున్నన్=వినకపోయినచో, ఎఱుంగరు=తెలిసికొనఁజాలరు.

భా. కల్పవృక్షశాఖలందు శరీరాభరణములు గలవనియుం, నందునివసించుపక్షులును వానిపోల్కి కలిగియేయుండుటం జేసి యివి యాభరణము లియ్యవి పక్షులనిపోల్చుకొనుటకు వీలులేకపోయెననియుం, నైనను బక్షులు కలకలధ్వనులు గల్గియుంటం జేసి దేవతాస్త్రీలు మైతొడవులను తెలిసికొనఁజాలిరనియుం భావము.

క. తనపాదుజలములోనం, గనుపట్టెడునీడ నీనగము విలసిల్లున్
మనకన్నమున్న తా నే,దినికిం డిగి యేగుచున్న తెఱఁగునఁ దరుణీ!

టీ. తరుణీ=యువతీ! తనపాదుజలములోనన్=తనయొక్క యాలవాలమునందలి నీటిలో, కనుపట్టెడు=అగపడునట్టి, నీడన్=ప్రతిబింబముచే, ఈనగము = ఈకల్పకము, మనకన్నమున్న=మనకన్నముందుగానే, తాను, మేదినికిన్=భూమికి, డిగి==దిగి, ఏగుచున్న తెఱఁగునన్=పోవుచుండువిధమున, విలసిల్లున్=ప్రకాశించుచున్నది.

భా. ఆలవాలోదకమునఁ బ్రతిఫలించిన కల్పవృక్షాకారము సత్యాశ్రీకృష్ణులకన్న ముందుగానే కల్పకము భువికిఁ బోవుచున్నట్లున్నదని భావము.

విశే. కల్పకము భువికిఁ గొనిపోవుట తప్పదనునంశమును సత్యకు సూచించియుబ్బుఁ గల్గించుటకును, నామెకుఁ దద్గ్రహణవిషయమున సంభ్రమాతిశయమును బుట్టించుటకును నిట్లు శ్రీకృష్ణుఁడు ప్రసంగించెనననఁదగును.

ఉ. వారణరాజయాన! సురవల్లభుఁ డాశచి నంకపీఠముం
జేరిచి సోగవెండ్రుకలఁ జిక్కులు వాపి వియన్నదీనవాం
భోరుహనాళసూత్రములఁ బొందుగ దీనిలతాంతము ల్సరు
ల్గా రచియించి నించుఁ గుతుకంబున వీఁగు మెఱుంగు క్రొవ్వెదన్. 8

టీ. వారణరాజయాన=గజరాజగమన; (సత్య) సురవల్లభుఁడు=దేవేంద్రుఁడు, ఆశచిన్=ఆశచీదేవిని, అంకపీఠమునన్=ఊరుదేశమును, చేరిచి = పొందించి, సోగవెండ్రుకలన్=పెన్నెఱులందైన, చిక్కులు = మెలికలు, పాపి = పోఁగొట్టి, వియన్నదీనవాంభోరుహ నాళసూత్రములన్=మిన్నేటిక్రొత్త తమ్మికాడలదారములందు, పొందుగన్=ఒప్పునట్లుగా, దీనిలతాంతముల్ = ఈకల్పవృక్షపుష్పములు, సరుల్ = దండలు, కాన్=అగునట్లు, రచియించి = చేసి, (దండలనుగ్రుచ్చి) కుతుకంబునన్ = సంతోష

ముతో, వీఁగుమెఱుంగుక్రొవ్వెదర్ = గొప్పదై తళతళలాడుకొప్పునందు, నించుర్ = నింపును. (ముడుచుననుట.)

విశే. ఇట్టిభాగ్యము నీకెపుడు గల్గునోయని సత్యను శ్రీకృష్ణుఁ డువ్విళులూరింప నిట్లు ప్రసంగించెనని గ్రహించునది.

మ. విను మింతుల్దిలకంబుఁ జంపకముఁ గ్రోవిన్సిందువారంబుఁ బ్రేం
ఖనమున్మామిడి గోఁగుఁ బొన్నఁ బొగడం గంకేళి నూహించి క
న్గొన మోమెత్తఁగఁ గౌఁగిలించుకొన మూర్కొంచుఁ బాడఁ జేనంటఁ బ
ల్కన నగం గల్లుమియంగఁ దన్న ననుచుం గల్పాగమాయావిరుల్. 9

టీ. ఇంతుల్ = స్త్రీలు, తిలకంబుర్, చంపకముర్ = సంపెఁగను, క్రోవిర్, సిందువారంబుర్, ప్రేంఖనముర్, మామిడిఁ, గోఁగుర్, పొన్నర్, పొగడర్, కంకేళిర్, ఈచెట్టులను, ఊహించి = మదిందలంచికొని, క్రమముగా, కన్గొనర్ = చూడఁగా, మోమెత్తఁగర్ = మొగమెత్తఁగా, కౌఁగిలించికొనర్ = ఆశ్లేషింపఁగా, మూర్కొనర్ = ఆఘ్రాణింపఁగా, పాడర్ = గానముసేయఁగా, చేనంటర్ = చేతితోఁ దాఁకఁగా, పల్కనర్ = మాటాడఁగా, నగర్ = నవ్వఁగా, కల్లు+ఉమియంగర్ = కల్లునుమ్మఁగా, తన్నర్ = కాలిచేఁదన్నఁగా, కల్పాగము = కల్పవృక్షము, ఆయావిరుల్ = (వారుదేని నూహించి పైఁజెప్పినరీతిని దోహదమాచరింతురో) యావృక్షసుమములను, ననుచుర్ = పుష్పించును.

విశే. ఇందుఁ గ్రమముననుసరించి వృక్షవాచకశబ్దముల నొక్కొక్క యసమాపకక్రియతో సంబంధింపఁజేసి యన్వయము నరయునది. కాఁగా, తిలకవృక్షమునకు వీక్షణము, సంపెఁగకు ముఖరాగము, గోరంటకాలింగనము, సిందువారమునకు ముఖానిలము, ప్రేంఖనమునకు గానము, మామిడికిఁ గరస్పర్శము, కర్ణికారమునకు సల్లాపము, పొన్నకు నవ్వు, పొగడకు ముఖార్పితమద్యము, అశోకమునకుఁ జరణతాడనమును దోహదవిశేషములని తెలియుచున్నది. ఆయావృక్షము లాయాయాసమయములందే పుష్పించుట ఫలించుట కలదు. కాలముకాని కాలమునఁ బుష్పింపవలెను. ఫలింపవలెనన్న పైనిచెప్పిన దోహదముల నాదరింపవలెనని తాత్పర్యము. ఈదోహదవిశేషములు స్త్రీకృతములే గావలెనని యందురు. కల్పవృక్షము తక్కినచెట్లవలెఁగాక యేవృక్షమును మదిఁ దలంచి దోహద మొనర్తురో యావృక్షములసుమముల దలఁచినక్షణముననే ప్రసాదించునని గ్రహించునది. అనఁగా నన్నివృక్షములరూపమును దానే దాల్చి యాయాసుమముల నుద్భవింపఁజేయునని యెన్నునది. అలం. యథాసంఖ్యము.

చ. కనఁ దిలకంబుఁ గేసరముఁ గల్లుమియ న్రహిఁ బాడఁ బ్రేంకనం
బు నిమురఁ మావి నవ్వ సురపొన్న ముఖాంబుజ మెత్తఁ జంపకం
బు నెఱిఁ గవుంగిలం గోరవి మూర్కొన వావిలి దన్న వంజుళం
బు నుడువ గోఁగునై తరుణి! పూఁచు సురద్రుమ మిన్ని పువ్వులన్. 10

టీ. కనన్ = చూడఁగా, తిలకంబున్ = తిలకవృక్షమును, కల్లు = మద్యము, ఉమియన్ = ఉమ్మఁగా, కేసరమున్ = పొగడచెట్టును, రహిన్ = మధురముగా, పాడన్ = గానము సేయఁగా, ప్రేంకనంబున్ = ప్రియాళువృక్షమును, నిమురన్ = కరస్పర్శనము చేయఁగా, మావిన్ = మామిడియు, నవ్వన్ = హసింపఁగా, సురపొన్న = సురపొన్న చెట్టును, ముఖాంబుజము = మోముఁదామర, ఎత్తన్ = ఎత్తఁగా; అనఁగా ముఖరాగ ద్రవసారమునననుట. చంపకంబున్ = సంపెఁగచెట్టును, నెఱిన్ = పూర్ణముగా, కవుంగిలన్ = ఆలింగనము చేయఁగా, గోరవి = గోరంటయును, మూర్కొనన్ = ఆఘ్రాణింపఁగా, వావిలి, తన్నన్ = పాదాహతియొనర్ప, వంజుళంబున్ = అశోకమును, నుడువన్ = మాటలాడఁగా, గోఁగును, ఐ = అయి; అనఁగా మీఁదనుడివిన చొప్పున దోహదమొనర్ప, ఆయా దోహదవిశేషముల కనురూపముగ నాయాచెట్టులు తానేయైయనుట. తరుణి = యువతి, సురద్రుమము = కల్పవృక్షము, ఇన్నిపువ్వులన్ = ఇన్నిచెట్టులపూవులను, పూఁచున్ = పుష్పించును.

విశే. పూర్వపద్యమున నాయావృక్షములందలంచి దోహదమొనర్చిన నాయావృక్షసుమములను గల్పొగమొసంగునని వర్ణితమయ్యెననియు, నిందు నాయావృక్షముల మదిం దలంపకయే యాయావృక్షములకు సంబంధించిన దోహదములనుమాత్ర మొనర్చుటకతనఁ గల్పవృక్ష మాయావృక్షసుమములఁ బ్రసాదించునని వర్ణితమయ్యె ననియుం గ్రహించునది. పూర్వపద్యమున నుక్తములైన దోహదవిశేషములే యిందుఁ జేర్కొనఁబడినవి.

ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను నేల తామసం
బీవిబుధాధినాయకమహీరుహముం బెకలించి లోకసం
భావిత మైననీపలుకుఁ బంతము సెల్ల మదీయగేహ కే
ళీవనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా! 11

టీ. నావుడున్ = అనఁగానే, శ్రీకృష్ణుఁడు కర్త. సత్యభామ, నిజనాథునకున్ = తనపతికి, ఇట్లు, అనున్ = అనెను. జీవితేశ్వరా = ప్రాణేశ్వరా! తామసంబు = ఆలస్యము, ఏల = ఎందులకు?. ఈవిబుధాధినాయక మహీరుహమ్మున్ = ఈదేవేంద్రుని

చెట్టును; కల్పవృక్షమనుట. పెకలించి=పెల్లగించి, లోకసంభావితమైన = లోకపూజ్యమైన, నీపలుకున్=నీమాటను, పంతమున్ = శపథమును; ప్రతిజ్ఞయనుట. చెల్లన్ = సాఁగఁగా, మదీయకేళీవనవాటిన్ = నా క్రీడావనప్రదేశమున, వేడుక=సంతసము, తలిర్పఁగన్=ఒప్పునట్లు, నిల్పుము=స్థాపింపుము.

విశే. "నీపలుకును లోకులు గౌరవింతురు. కాన నిపుడు నీవాడినమాటను దక్ష్యముగాఁ జేసికొని శ్రీకృష్ణుఁడు సత్యసంధుఁడనుమాట నిల్పఁబెట్టుకొనుము. మఱియు నీమూలమునఁ గృతకృత్యుఁడవై సత్యప్రతిజ్ఞుఁడవు గమ్ము" అని సత్యభామ శ్రీకృష్ణునుత్సుకుంజేయ, నిట్లు ప్రసంగించెను. శ్రీకృష్ణుఁడామెశీలమును గనుఁగొననాడిన పూర్వపద్యములందలిమాటలు వెనువెంటనే యామె త్వరపాటుగల స్వభావమును వలచినదానిని సాధించువిషయమున నామెకుఁగలపట్టుదలను బ్రకటింప సమర్థములయ్యె. మఱియు నామె యీకృత్యమును నెఱవేర్పనపుడు నీపలుకు లోకసంభావితము గాఁజాలదనియు నీవకృతప్రతిజ్ఞుఁడ వనుదూఱుకుఁ దావల మగుదువనియుఁగూడ సూచించుచు, నిర్బంధించి యాతనిచేఁ దనపనిని జక్కఁబెట్టించికొన యత్నించెననియుఁ దోఁచెడును.

మ. అనినం గైటభదైత్యవైరి దరహాసాంకూరము ల్మోవిపై
మొనయం గొండొక నిల్చి యివ్వనమున న్మోదంబుతో నిర్జరీ
జనము ల్గొల్వఁగఁ గ్రీడ సల్పి భవదిష్టం బేను గావింతు నం
గన! యంచాతరురత్నగుచ్ఛ మిడియెం గర్ణావతంసంబుగన్. 12

టీ. అనిన్ = అనఁగా, సత్యకర్త. కైటభదైత్యవైరి = కైటభాసురశత్రువగు శ్రీకృష్ణుఁడు, దరహాసాంకూరముల్=చిఱునగవు మొలకలు, మోవిపైన్=అధరముపై, మొనయన్ = వ్యాపింపఁగా, కొండొక = కొంచెము సేపు, నిల్చి, అంగన=కాంతా! ఇవ్వనమునన్=ఈయారామమున, మోదంబుతో = సంతోషముతో, నిర్జరీజనముల్ = దేవతాస్త్రీలు, కొల్వఁగన్=సేవింపఁగా, క్రీడ, చల్పి=చేసి, భవదిష్టంబు = నీకోర్కిని, ఏను, కావింతున్=ఒనర్తును, అంచున్, ఆతరురత్నగుచ్ఛము = ఆకల్పకరత్న పుష్పస్తబకమును, కర్ణావతంసంబుగన్=కర్ణాభరణముగ, ఇడియెను=పెట్టెను.

విశే. శ్రీకృష్ణునకు మందహాసముగల్గుటలో సత్యత్వరపాటును నామెపూర్వోక్తమార్గమునఁ దన్ను నిరోధించుటయుఁ గారణములుగా గ్రహించునది.

ఉ. ఈపగిది న్మురారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి నిర్జరేం
ద్రోపవనస్థలంబునఁ బయోరుహనేత్రయుఁ దానుఁ జేరి పు
ష్పాపచయప్రమోదభరితాత్మకుఁడై చిదిమె న్లతాంతముల్
గోపవధూకుచస్తబకలోలనిశాతనఖాంకురంబులన్. 13

టీ. ఈభంగిన్ = ఈరీతిగా, మురారి=మురద్వేషి శ్రీకృష్ణుఁడు, హృదయేశ్వరిన్ = ప్రాణేశ్వరిని, ఊఱడన్ = ఆశ్వాసమునందునట్లుగా, పల్కి=అడి, నిర్జరేంద్రోపవనస్థలంబునన్ = దేవేంద్రుని యారామప్రదేశమున, పయోరుహనేత్రలున్ = పద్మనేత్రలైన దేవతాస్త్రీలును, తామున్, చేరి=గుమికూడి, పుష్పాపచయ......త్మకుఁడై= పుష్పాపచయ = పూవులను కోయుటయందైన, ప్రమోద = సంతోషముచే, భరిత= పూర్ణమైన; నిండినయనుట. ఆత్మకుఁడై = మనస్సుగలవాఁడై, గోప......అంకురంబులన్ -గోపవధూ=గోపికా స్త్రీలయొక్క, కుచస్తబక=పూగుత్తులంబోలు స్తనములందు, లగ్న=ఆసక్తములైన, నిశాత=తీక్ష్ణములైన; వాఁడియైనయనుట. నఖ=గోళ్లయొక్క, అంకురంబులన్=కొనలచేత, లతాంతములన్=పూవులను, చిదిమెన్=గిల్లెను.

విశే. గోళ్లను గోపవధూకుచస్తబకలోలము లనుటకు సారస్యము చింత్యము. శృంగారాతిశయసూచకము. లతాంతము=లతయొక్క తుదినుండునది. పూవే తుదినుండునదిగాన దాని కీపేరు గల్గెను.

మ. ఎలదేఁటుల్ దమవాలుఁగన్గవలపై నిందీవరభ్రాంతిచే
మెలఁగం జేరలఁ గప్పుకో నలవి గామిం *జీఁదఱం జెంది యి
చ్ఛలఁ గాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుషత్వంబు న
య్యలిభీతి న్ముకుళీకృతాక్షి యగుసత్యాకాంత నీక్షించుచున్. 14

టీ. నిర్నిమేషజలజాస్యల్ = అనిమిషస్త్రీలు; దేవతాస్త్రీలనుట. ఎలదేఁటుల్ = లేఁబ్రాయంపుఁదుమ్మెదలు, తమవాలుఁగన్గవలపైన్ = తమదీర్ఘములగు కన్దోయిలమీఁద, ఇందీవరభ్రాంతిచేన్ = నల్లకలువపూవులను భ్రమచేత, మెలఁగన్ = సంచరింపఁగా, చేరలన్ = చాఁచినతమచేతులచేత, కప్పుకోన్ = కప్పుకొనుటకు, అలవి=శక్యము, కామిన్=కాకుండుటచే, చీఁదఱన్=చీకాకును, చెంది=పొంది, ఇచ్ఛలన్=మనస్సులందు, అయ్యలిభీతిన్=ఆతుమ్మెదలవలనిభయముచే, ముకుళీకృతాక్షి = మూసికొనఁబడినకన్నులుగలది, అగు=అగునట్టి, సత్యాకాంతన్ = సత్యభామను, ఈక్షించుచున్= చూచుచు, మానుషత్వంబున్=మనుష్యధర్మమును, కాంక్షించిరి=కోరిరి.

భా. అట్లు పుష్పాపచయ మొనర్చు ననిమిషాంగనల నేత్రములను గాంచి తుమ్మెదగములు నల్లకలువపూవులను భ్రమంజెంది యందు వ్రాలంజొచ్చెననియు, తద్బాధ వారించికొనఁ జేరలకుమీఱి తమనేత్రములుండుటచేతఁ జేరలచేఁ గప్పికొన శక్యముగామింజేసియుఁ గనులు మూఁతపడనివారగుటంజేసియుఁ, నాసురాంగన లసమర్థ

* లజ్జలం.

లైరనియు, నట్టిభ్రమరబాధను సత్యాకాంత యపుడు కనులమూసి వారించికొనుటం గాంచి మనుష్యులకువలెనే తమకును గనులుమూఁతవడుట సంభవించిన బాగుండును గదా యని తలంచిరనియు భావము.

విశే. ఇట్లు చెప్పుటకతనఁ గనులు నల్లకల్వలవలెఁ జేరలకు మించియున్నవని విశదమయ్యెను. ఇందనిమిషకాంతలు మానుషత్వమును గాంక్షించిరిగాని పొందఁజాలక పోయిరనుట తెల్లము. ఇప్పట్టును మనుచరిత్రకర్త యనిమిషాంగనకు మానుషత్వమును మనుష్యభావనచే సంఘటించి సంస్కరించెనని తోఁచెడిని.

ఉ. అంబరచారిపంకజదళాక్షులు చంపకపుష్పరేణుజా
లంబులయందు సర్వశుభలక్షణరేఖలఁ బొల్చునట్టి పీ
తాంబరుపాదపంకజము లంటినతావులు ద్రొక్క నోడి పా
ర్శ్వంబుల సంచరింతురు పరస్పరకేళివచఃప్రసంగతిన్. 15

టీ. అంబరచారిపంకజదళాక్షులు = ఆకసమునసంచరించెడి సురాంగనలు; దేవతలకు భువిపైఁ బాదములు మోపకుండుట సహజము. దాన దేవతలంబరచారులనుట. చంపకపుష్పరేణుజాలంబులయందున్ = సంపెఁగ పుప్పొడులందు, సర్వశుభలక్షణరేఖలన్ = ఎల్లశుభచిహ్నముల యాకృతులతోడను, పొల్చునట్టి = ఒప్పునట్టి, పీతాంబరుపాదపంకజములు = శ్రీకృష్ణుని యడుగుఁదమ్ములు, అంటిన=లగ్నమైన, తావులు=స్థలములు, త్రొక్కన్ = మట్టుటకు, ఓడి=జంకి, పరస్పరకేళివచఃప్రసంగతిన్=అన్యోన్యవినోదాలాపప్రసక్తితో, పార్శ్వంబులన్=కెలఁకులందు, సంచరింతురు= తిరుగుదురు.

వృషభగతిరగడ.—

కొమ్మ! వేగిర మేటికే కొనగోర గోరఁటవిరులు గిల్లుము
తమ్మిపువ్వులమీఁద జలములదార తారక యుండఁ జల్లుము
మృగవిలోచన! మేను చులుకన మేలమే లత నిటులు ప్రేయఁగ
వగవ నేటికిఁ జూడుమీ గోరువంకవంకఁ బ్రియుండు డాయఁగ
నలుగ నేటికి ముదుపుమీ చెలువార వారణయాన! మొల్లలు
పొలఁతి! సైఁపవు మాకు నీకయ పోలుఁబో లులివడినకల్లలు
పన్నిదం బిడఁ బ్రేంకనమునఁ బాడి పాడి దొలంగి తెచ్చితిఁ
బొన్నమొగ్గలఁ గంటసరి పూఁబోఁడి పోఁడిమిగాఁగ గ్రుచ్చితి
వదుగ నేటికి దీనివిరులు దురాశ రా శఫరీవిలోచన!

[illegible] బంగము నిండెం దుడువు రసాలసాలమరందసేచనం
[illegible]! సురపొన్నలకు నీచాయం జాయలం బల్క నేటికి
[illegible]! [illegible]యకు వేగపడి పూంబాళం బాళము గాదు నేంటికి
[illegible]! పలుమఱు దిగిచిచూచుట మానుమా నులివడియె దండలు
[illegible] చనుం డింక నేల యీయొలమావి మావిహరించుదండలు
[illegible] తుచ్ఛములు పలుమఱు బాల బాలకి యన్నం దిట్టితి
[illegible]లసగమనముం జూపి చెలి! నీ వంచ వంచన నేసి పట్టితి
[illegible] బుగులుగొనంగం దొడంగె ఘృతాచి తాంచితె యీయశోకము
[illegible] తేనియ కంచుం బలికెదు రంభ! రంభలలో ననేకము
సనలు వేండిన మొఱంగి తప్పదు నాలి నాలికుచంబు ముట్టకు
మనయు ప్రాణపదంబుగాం దలం తీవ తీవ తలంగ మెట్టకు
మంజుఘోష! సువర్ణలత లనుమానమా నందనవనంబున
సంజ దిది యొలదేంటి కన నే మఱచె మఱచెదమే మనంబున
నమృతమధురములైనఫలరసమాని మానిని! త్రుళ్లె శుకములు
గుమురులగు లేమావిచిగురులు గోయం గోయని కూసెం బికములు
గుమగుమని వాసనల గేదంగికొమ్మ కొమ్మకు నందె దోంటికి
రమణి! గొజ్జంగిపొదలు గడు దూరమ్ము రమ్ము చలమ్ము లేటికి. 16

టీ. ఇందు సరసాలాపములు మీఱ యువతులు పుష్పాచయ మొనర్చుట వర్ణితము.- [illegible]మ్మ=ఓపసిత, వేగిరము=త్వర, ఏటికే=ఎందులకే? కొనగోరన్=గోటికొనచే, గోరంట [illegible]రులు=గోరంటపూవులు, గిల్లుము=కోయుము. తమ్మిపువ్వులమీందన్ = పద్మములపైని, [illegible]లములదార=నీళ్లధార, తారకయుండన్ = చేరకుండునట్లుగా, చల్లుము. నీరు కర్మ. [illegible]మృగవిలోచన = లేడికన్నులంబోలు కన్నులుగలదాన! మేను=శరీరము, చుఱుకనన్= [illegible]ద్చునట్లుగా, లతన్=తీవను, ఇటులు=ఈరీతిగ, వ్రేయంగన్=కొట్టంగా, మేలమే= [illegible]సమా! వగవన్ = విచారింపంగా, ఏటికిన్ = ఎందులకు? గొరువంకవంకన్= [illegible]రువంకపక్షివైపు, చూడుమీ! ప్రియుండు=మనోహరుఁడు, డాయంగన్ = సమీ[illegible]పింపంగా, అలుగన్=కోపింపంగా, ఏటికిన్, వారణయాన = గజగమనా! చెలువారన్= [illegible]అందముగునట్లుగా, మొల్లలు = మొల్లపూవులు, ముడువుమీ=కొప్పునం దుఱుమవమ్మా! [illegible]=ఓపసిత, మాకు, సైంపవు = ఇష్టపడవు. నీకయ=నీకే, లులివడినకల్లలు = నీచ[illegible]ములైన యసత్యపుమాటలు, పోలుంబో = సరిపడునుజుమ్ము. పన్నిదంబు = పందెము,

ఇడన్ = పెట్టఁగా, పాడిన్ = న్యాయమును, తొఱంగి=వీడి, పాడి = గానముచేసి, ప్రేంకనమునన్ = ప్రియాళుపుష్పమును, తెచ్చితిన్. పొన్న మొగ్గలన్ = పొన్న మొగ్గలతో, కంటసరిన్ = కంఠాభరణరూపమగుహారమును, పూఁబోఁడి = పుష్పమువలె మనోజ్ఞమైనదాన, పోఁడిమిగాఁగన్ = ఒప్పిదమగునట్లుగా, గ్రుచ్చితివి = కూర్చితివి. శఫరీవిలోచన = మీననేత్ర! దీనివిరులు=దీనిపూవులు, దురాశన్ = తగనియాసతో, అడుగనేటికిన్? రా=రమ్ము. జడన్ = జడయందు, పరాగము=పుప్పొడి, నిండెన్= పూర్ణమయ్యెను. రసాలసాలమరందసేచనన్ = తీయమామిడి పూఁదేనియచే, తుడుపుము=పోఁగొట్టుము. చామరో=ఇంతిరో, సురపొన్నలకున్ = పొన్నపూవులకై, ఈచాయన్=ఈరీతిగా, చాయలన్=వేఱువేఱుమార్గములతో, పల్కన్, ఏటికిన్? భామ=వనితా, వేగపడి=త్వరపడి, పూఁబాళన్ = పూగుత్తిని, కోయకు=కోయకుము. నేఁటికిన్=ఈరోజునకు, పాళము = పరిపక్వమైనది, కాదు. మగువ=కాంతా, పలుమఱున్ = మాటిమాటికి, తిగిచి=తీసి, చూచుట, మానుమా = విడువుమా!, దండలు= పుష్పమాలలు, నులివడియెన్ = చిక్కుపడెను. మగిడి=మరలి, చనుఁడు = పొండు. ఇఁక నేల=ఇంక నెందులకు? ఈయెలమావి = ఈలేమామిడిచెట్టు, మావిహారించుదండలు= మేము విహరించుటకుఁ దావులు.పలుమఱున్=మాటిమాటికి, తుచ్ఛములు=నీచపుమాటలు, పలుకకు=ఆడకుము. బాల! బాలకి=బాలకి యని, అన్నన్, తిట్టితి = దుర్భాషలాడితివి. అలసగమనమున్=మందగమనమును, చూపి=అగపఱచి, చెలి! నీవు, అంచన్=హంసను, వంచనచేసి=వంచించి, పట్టితి=పట్టుకొంటివి. తావి=పరిమళము, బుగులుకొనంగన్ = దట్టముగ వ్యాపించునట్లు, తొడంగెన్=పూనెను. ఘృతాచి! ఈయశోకమున్=ఈయశోకవృక్షమును, తాచితె=తన్నితివే? తేనియకున్=మరందమునకై, రావే=రమ్ము, అంచున్, పలికెదు = పలికెదవు. రంభ! రంభలలోన్ = అరఁటులలో, అనేకము = విస్తారము. ననలు=పూవులు, వేఁడినన్=కోరఁగా, నాలిన్=కపటముతో, అప్పుడు, మొఱఁగితి = దాఁగితివి. నాలికుచంబున్=నానిమ్మను,ముట్టకుము=అంటకుము.ఎనయు ప్రాణపదంబుగాన్ =ప్రాణతుల్యముగ, ఈవ=నీవే, తలఁతు=తలంతువు, తీవ=తీఁగను, తలంగన్=తొలఁగునట్లు, మెట్టకు=త్రొక్కకుము. మంజుఘోష!, నందనవనంబునన్=నందనోద్యానమున, సువర్ణలతలు=బంగారుతీవలు, అనుమానమా=సందేహమా? అనుమానపదమునకు సంస్కృతమున నూహాయర్థము. తెలుఁగున సందేహమను నర్థమునఁగూడ నిది ప్రయుక్తమయ్యె. ''అనుమానము లేక తిరిగెనతఁడెల్లెడలన్'' అని తిక్కన. చూ. ఉద్యో. ప. ఇది, ఎలదేఁటికిన్=లేఁదేఁటికి, అంజదు=భయపడదు, అనన్=అనఁగా, ఏమి, అఱచెన్ = శబ్దించెనో, మనంబునన్=మదియందు, మఱచెదమే=విస్మరింతుమే. మానిని=మానవతీ!, శుక

...=చిలుకలు, అమృతమధురములైన=సుధవలెఁ దీయనైన, ఫలరసము=పండ్లరసమును, ...=..., గ్రోలెన్=గంతులిడెను. గుమురులగు=జొంపములగు, లేమావిచిగురులు=లేత ...చిగుళ్లను, కోయన్=త్రుంపఁగా, పికములు=కోయిలలు, కోయని, కూసెన్ = ... . గేదఁగికొమ్మ=మొగిలిచెట్టుశాఖ, గుమగుమనివాసనలన్=కమ్మనిపరిమళములతో, ...(అ) స్త్రీకి, దోఁటికిన్=అందనివానిం గోయ నుపకరించుకొంకికఱ్ఱకు, అందెన్. ...యని వ్యవహారము. రమణి=కాంతా! గొజ్జఁగిపొదలు = గులాబీపొదలు, కడు ...=మిగులదూరము. చలమ్ములు=పంతములు, ఏటికిన్, రమ్ము.

వి శే. ఇందు రమణుల యాలాపములు నైజముగ వర్ణితములు. వ్యవహారమునఁ ...రము సంబంధశూన్యముగఁ బల్కురీతి యిందుఁ దెల్లముచేయఁబడినది. దీనిని ...గడ యందురు. దీని ప్రతిపాదమునకును 28 లఘువు లుండును. 15-వ లఘువు ...స్థానము. రెండురెండేసిపాదముల కంత్యప్రాసమును, రెండేసియక్షరములకు ఛేకా ...ప్రాసమును గపుల ప్రయోగముల నగపడెడిని. రెండేసిపాదములకుఁ బ్రాసైక్యము వృత్త ...ములలో వలెనే యిందుండవలెను. అలం. స్వభావోక్తి.

మ. అనుచుం గాంతలు వల్లికారచితడోలాందోళనప్రక్రియం
గనకాంభోరుహ[1]కర్ణికాహృతిఁ బరాగక్షేపలీలాగతిన్
వనకేళీపరతంత్రవృత్తిఁ [2]దిరుగ న్మార్తాండబింబంబు ని
ల్చె నభోమధ్యమునం గఠోరకిరణశ్రేణీదురాలోకమై. 17

టీ. అనుచున్=ఇట్లు మాటలాడుకొనుచు, కాంతలు=స్త్రీలు, వల్లికా......ప్ర...యన్ - వల్లికా=తీఁగలచే, రచిత=కూర్పఁబడిన, డోలా=ఉయ్యాలలయందు, ఆందోళన=ఊఁగుటయొక్క, ప్రక్రియన్=వ్యాపారముచేతను, కనకాంభోరుహ...... ...హృతిన్ - కనకాంభోరుహ=బంగరుపద్మముల సంబంధమైన, కర్ణికా=మిద్దెలయొక్క, ఆహృతిన్=ఆకర్షణముచేతను, 'కందుకాహతిన్' అని పాఠము కొన్నిప్రతులలోఁ జూడ ...యి. అపక్షమున, "కనకాంభోరుహకందుక=బంగరుపద్మనిర్మితమైన బంతులయొక్క, ఆహతిన్=దెబ్బచే" అని యర్థము. బంగరుతమ్ముల నిర్మితములైన బంతుల నాడుటచేనైన ...చే ననిభావము. పరాగ......గతిన్-పరాగ=పుప్పొడియొక్క, క్షేప = చిమ్ముట ...యొక్క, లీలా=విలాసముయొక్క, గతిన్=రీతిచేతను; పుప్పొడిని బరస్పరము మీఁదఁ ...కొనుటచే నని భావము. వన......వృత్తిన్-వన=ఉద్యానవనమునందైన, కేళీ=ఆటల ...యందు, పరతంత్ర=ఆసక్తమైన, వృత్తిన్=వ్యాపారముతో, తిరుగన్=సంచరింపఁగా, మార్తాండబింబంబు=సూర్యబింబము, కఠోర...దురాలోకమై-కఠోర = తీక్ష్ణములైన,

1. కందుకాహతిఁ. 2. నరుగన్.

కిరణ=రశ్ములయొక్క, శ్రేణీ=పంక్తిచేత, దురాలోకమై=చూడశక్యముగానిదై, నభోమధ్యమునన్ = ఆకాశమునడుమను, నిల్చెన్ = ఉండెను; మట్టమధ్యాహ్న మయ్యెనని భావము.

భా. ఆదేవకాంత లట్లు ప్రసంగించికొనుచుఁ దీవయుయ్యేలలూఁగుచు, మిన్నేటి బంగరుఁదమ్ముల గద్దెలనాహరించుచు, బుప్పొడుల నొండొరులపైఁ జల్లికొనుచు వనవిహారమునందె యేకాగ్రచిత్తలై విహరించుచుండ, సూర్యుఁడు గగనమధ్యదేశము నందెనని భావము.

చ. వదలిననీవిబంధముల వాడినమోముల జాఱుకొప్పులం
జెదరినపత్త్రభంగములఁ జిక్కులుగొన్న మణీసరంబులం
బొదలినయూర్పుఁదెమ్మెరలఁ బుప్పొడిఁ గెంపగు వాలుఁగన్నులం
ద్రిదశమృగాయతాక్షులు రతిశ్రమఖిన్నలఁ బోలిరందఱున్. 18

టీ. వదలిన నీవిబంధములన్=జాఱినబట్టకట్టుముడులచేతను, వాడిన మోములన్=మ్లానములైన ముఖములచేతను, జాఱుకొప్పులన్=వీడినకేశబంధములచేతను, చెదరిన పత్త్రభంగములన్=చెదరిపోయిన మకరికాది పత్త్రరచనలచేతను, చిక్కులుగొన్న మణీసరంబులన్=చిక్కుపడినమణిహారములచేతను, పొదలినయూర్పుఁదెమ్మెరలన్ = ఒప్పిన నిట్టూర్పుగాడ్పులచేతను, పుప్పొడిన్=పుష్పపరాగముచే, కెంపగు = ఎఱ్ఱనైన, వాలుఁగన్నులన్=దీర్ఘములైన నేత్రములచేతను, త్రిదశమృగాయతాక్షులు = దేవతాస్త్రీలు, అందఱున్=ఎల్లరును, రతిశ్రమఖిన్నలన్=సంభోగమువలని యాయాసముచేఁ గుందిన వనితలను, పోలిరి=అనుకరించిరి.

విశే. పోఁకముడులు వీడుట, మోము వాడుట, మకరికాపత్త్రములు చెదరుట, మణిహారములు చిక్కుపడుట, నిట్టూర్పులు నిగుడుట, జాగరణముకతనఁ గన్నులెఱ్ఱపడుట యనునీధర్మములు రతిశ్రమవలన సంభవించున వగుటంజేసియుఁ, బ్రకృతము దేవకాంతలయం దీలక్షణములు చూపట్టుచుండుటంజేసియు, సురకాంతలు రతిశ్రమఖిన్నలను బోలిరని కవి యూహించినాఁడు. మణిశబ్ద మీకారాంతముగను సంస్కృతమునఁ గలదుగాన మణీసరంబులని కవి ప్రయోగించెను. రతిశ్రమఖిన్నలనుగా దేవకాంతలను భావించుటకుఁ బైనున్న తృతీయాంతములెల్లను హేతువులగుచున్నవి.

క. బెడిదమగు *నెండతాఁకునఁ
దొడిమలు వసివాడి ననలు దొరఁగె లతల నె

* నెండసోఁకునఁ.

లేఁ బనివనదేవతామేనం
బొడమిన తేఁగస్తుఁజెమటబొట్టు లనంగన్. 19

టీ. కోపనమగు=తీక్ష్ణమగు; భయంకరమైన యనిభావము. ఎండతాఁకునన్ = ఎండదెబ్బచే, "సోఁకునన్" అని పాఠాంతరము. అపుడు "సోఁకునన్=స్పర్శముచే" అని యర్థము. ఇందు విశేషార్థమేమియు నగపడదు. తొడిమలు=మూఁడికలు; వృంతము లని యర్థము. పసివాడి=మిక్కిలివాడి, ననలు=పూవులు, లతలన్=లతలనుండి, ఎల్లెడన్=అన్నిచోటులందును, వనదేవతమేనన్=వనదేవతాశరీరమున, పొడమిన = పుట్టిన, తేఁగస్తుఁజెమటబొట్టులు = పరిమళించు చిఱుచెమ్మటబిందువులు, అనంగన్ = అనునట్లు, రాఁగెన్=జాఱెను.

భా. కఠోరాతపాహతిని వృంతములు పసివాడుటకతన లతలనుండి జాఱుపూవులు వనదేవతాగాత్రమునుండి జాఱు పరిమళించు చిఱుచెమటబొట్టులవలె నొప్పియుండెనని భావము.

వి శే. కవి వనస్థలిని వనదేవతగను జాఱుగంధసుమములను వాసితమగు స్వేదబిందువులంగాను భావించెనని గ్రహించునది.

శా. తూఁగెం జల్లనిగాడ్పు లేమి ఫణిసందోహంబు పేరాఁకటన్
లోఁగెం దప్తసరోజశీధురసముల్ గ్రోలన్మదాళిచ్ఛటల్
గ్రాఁగెన్ *న్నీరుగఁ గాంచనాచలతటీగండోపలవ్రాతముల్
డాఁగెన్ బల్వలపంకసీమ బకజాలత్రస్తపాఠీనముల్. 20

టీ. ఫణిసందోహంబు=పాములగుంపు, చల్లనిగాడ్పు=చల్లనిగాలి, లేమిన్=లేకపోవుటచే, పేరాఁకటన్=మిక్కిలియాఁకలితో, తూఁగెన్=ఒఱఁగెను. మదాళిచ్ఛటల్=మత్తిలినతుమ్మెదగుంపులు, తప్తసరోజశీధురసముల్ = క్రాఁగిన తమ్ములమరందములను, గ్రోలన్=త్రాగుటకు, లోఁగెన్ = భయపడెను. కాంచనా......వ్రాతముల్-కాంచనాచల=మేరుపర్వతముయొక్క, తటీ=ప్రదేశములందైన, గండోపలవ్రాతముల్=గండశిలాసమూహములు, నీరుగన్=ద్రవమగునట్లు, క్రాఁగెన్=సంతప్తములయ్యెను. 'సీఱుగన్' అను పాఠ మిచటఁ గననగు. కాంచనాచలశిలలు భస్మమయ్యె ననుటకంటె నీరయ్యెననుటయే యుక్తము గాన సీభస్మమయ్యెనను నర్థమిచ్చు పాఠము సరసముగాదని చెప్పనగును. బకజాలత్రస్తపాఠీనముల్=కొంగలవలన భయమందిన చేఁపలు, పల్వలపంకసీమన్=పడియలందున్న బురదలందు, డాఁగెన్=దాఁగెను.

భా. కఠోరకిరణుని మట్టమధ్యాహ్నసమయమునందైన తీక్ష్ణాతపస్పర్శమున గాలి స్తబ్ధమయ్యెననియు, నట్టి వేఁడిగాలి నాస్వాదింపఁజాలక వాయుభుక్కులు సర్పములు

---

* సీఱుగఁ.

క్షుద్బాధను గుందుచుండెననియు, మదాళులు తమ్ములమరందము సంతప్తమగుటఁ గ్రోలం జాలక భయమందుచుండెననియు, మేరుశిలలు తప్తములై ద్రవీభవించుచుండెననియుఁ, గొంగలు తమ్ముఁ జంప నొడ్డునఁ గనుపెట్టికొనియుండుటం జేసియు (నీరు సలసలమని తెఱలుచుండుటం జేసియుఁ) నీటిలోఁ దిరుగఁజాలక పడియలందలి బురదలందుఁ జేపలు దాఁగుచుండెననియుఁ భావము. అలం. స్వభావోక్తి.

చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱక ల్విరియంబడ బోర మోవ నెం
డినవదనంబులం దెఱచి నిక్కినయఱ్ఱులు దల్లడించుటల్
గనఁబడ నూరుపుల్దళముగా నిగుడ న్వడఁ[1]గంది యీ రెలుం
గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతములయ్యెడ నిల్చె మ్రాఁకులన్. 21

టీ. శకుంతములు=పక్షులు, కనుఁగవ=నేత్రద్వంద్వము, మ్రాన్పడంగన్=నిశ్చేష్టతనందఁగా, ఎఱకలు=ఱెక్కలు, విరియంబడన్=విడినట్లుపడిపోఁగా, బోర=వక్షఃస్థలము, మోవన్=అంటఁగా, (చెట్టుకొమ్మకనుట) ఎండినవదనంబులన్=(దప్పిచే)శుష్కించిన నోళులను, తెఱచి=విప్పి, నిక్కినయఱ్ఱులు=మీఁదికెగసిన కంఠములు, తల్లడించుటల్=పరితపించుటలు, కనఁబడన్=వెల్లడికాఁగా, ఊరుపుల్=నిట్టూరుపులు, దళముగాన్=సాంద్రముగా, నిగుడన్=ప్రసరింపఁగా, వడన్=ఎండవేఁడిమిచే, కంది=వివర్ణమై, ఈ రెలుంగునన్=సన్నని కంఠధ్వనితో, తమవానిన్=సజాతిపక్షులను, పిల్చుచున్, అయ్యెడన్=అమట్టమధ్యాహ్నకాలమున, మ్రాఁకులన్=చెట్లులందు, నిల్చెన్=నిల్చియుండెను. అలం. స్వభావోక్తి.

చ. ఒకయెడఁ జక్రవాకము పయోరుహమిత్రుని వేఁడియెండ చేఁ
దెకతెకఁ గ్రాఁగు తమ్మివిరితేనియ ఱెక్కలఁ జల్లనార్చి కాం
తకుఁ [2]దనుపార నిచ్చెఁ బరితాపము వాయ మృణాళవల్లరీ
శకలము మూఁటికిం గమిచి చంచుపుటంబున [3]నందనిచ్చుచున్. 22

టీ. ఒకయెడన్=ఒకచోటున, చక్రవాకము=పురుషరథాంగము, పయోరుహమిత్రుని వేఁడియెండచేన్=అంభోజబంధువగు సూర్యునివేఁడియైన యెండచేత, తెకతెకన్=సలసలమని, క్రాఁగు=మరుగునట్టి, తమ్మివిరితేనియన్=పద్మమకరందమును, ఱెక్కలన్=ఱెక్కలచే, చల్లన్=చల్లనగునట్లుగా, ఆర్చి=ఆరఁజేసి; చల్లార్చియనుట. కాంతకున్=ప్రియురాలికి, తనుపారన్=తృప్తియగునట్లుగా, పరితాపము=సంతాపము, పాయన్=పోవుటకై, మృణాళవల్లరీశకలమున్=తామరతూఁటి తీవయొక్క ముక్కను, చంచుపుటంబునన్=ముక్కుకొనచే, కమిచి=ఆకర్షించి, మూఁటికిన్=వేమఱు, అందన్ ఇచ్చుచున్=అందించుచు, ఇచ్చెన్=ఒసఁగెను; పద్మమరందముననుట.

1. గుంది. 2. దనివార. 3. నంది యిచ్చుచున్.

వి॥. పురుషవిహంగ మిందనుకూలనాయకుఁడుగను, స్త్రీవిహంగము స్వాధీనపతి కగును ... కాని యీయనురాగము తిర్యగ్గతమగుటకతన దీని నాలంకారికులు ... గణించిరి. శ్లో. ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్ మ్లేచ్ఛగతోఽపివా, ... సక్తిశ్చేద్రసాభాసస్త్రిధా మతః'' అని ప్రతాపరుద్రీయము. అలం. స్వభావోక్తి.

సీ. ... గ్లాని( బడలినయభ్రమువును
నిజక రాగ్రజలంబుల నెఱయఁ జల్లి
శ్ర వణాయుగతాలవృంతసంజాతశీత
వాతములఁ దేర్చె గీర్వాణవారణంబు. 23

టీ. గీర్వాణవారణంబు=సురహస్తియగు నైరావతము, ఆతపగ్లానిన్ = ఎండ ... యాయాసముచే, బడలిన=ఆయాసపడిన, అభ్రమువును=''అభ్రము'' అనుతన భార్యను, నిజకరాగ్రజలంబులన్ = తనతొండము కొనయందలినీటిని, నెఱయన్= పూర్ణముగా; అంతటననుట. చల్లి, శ్రవణ...పోతములన్-శ్రవణయుగ = రెండుచెవు ..., తాలవృంత=విసనకఱ్ఱలవలన, సంజాత=పుట్టిన, శీతవాతములన్=చల్లనిగాలుల ..., తేర్చెన్=పోయిన యాయాసముగలదానిగాఁ జేసెను.

వి॥. ఇందును దిర్యగ్గతశృంగారమే వర్ణితముగాన నిదియుం రసాభాసమే యగును. అలం. స్వభావోక్తి.

క. అపుడు జగత్పతి సత్యా
చపలాక్షియుఁ దాను వెడలె జలకేలికి న
య్యుపవనతరుకుసుమలతా
తపత్త్రములు పూని వేల్పుఁదరుణులు గొల్వన్. 24

టీ. అపుడు=ఆసమయమున, జగత్పతి=లోకనాథుఁడు శ్రీకృష్ణుఁడు, సత్యా ... యున్ = సత్యభామయును, తానున్, అయ్యుపవనతరుకుసుమలతాతపత్త్ర ములు = ఆయుద్యానమందలి చెట్లులందైన పుష్పలతలను గొడుగులను, పూని = పట్టి, వేల్పుఁదరుణులు=దేవతాస్త్రీలు, కొల్వన్ =సేవింపఁగా, జలకేళికిన్ =జలక్రీడకు, వెడ లెన్ =... యలుదేరెను.

వ్యా-విశే. ఇందుఁ దాను శబ్దము ప్రయుక్తమయ్యెఁగానఁ గ్రియ యేకవచనము గా ... ప్రయుక్తమయ్యెను.

చ. చనుఁగవపెం(కము న్జఘనచక్రభరంబును మోవలేక యొ
య్యనఁ బదపంకజంబు లలసాలసవైఖరి మోపుచున్ జనా

ర్దనుభుజ మూఁతగాఁగ వనితామణి యేఁగెఁ బరస్పరాంగమే
ళనమున రోమహర్షముకుళవ్రజ మొండొరుమేన నిండఁగన్. 25

టీ. వనితామణి=కాంతారత్నమగు సత్యభామ, చనుఁగవ ప్రేఁకమున్ = స్తన ద్వంద్వపుభారమును, జఘనచక్రభరంబున్ = చక్రాకారమగు కటియొక్క భారమును, మోవన్ = మోయుటకు, లేక=శక్తురాలుగాక, ఒయ్యనన్ = మెల్లమెల్లఁగా, పదపంకజంబులు=పాదపద్మములు, అలసాలసవైఖరిన్ =మందమందమగురీతితో, మోపుచున్ = భువియందుంచుచు, జనార్దనుభుజము=శ్రీకృష్ణునిభుజము, ఊఁత=అవలంబము, కాఁగన్, పరస్పరాంగమేళనమునన్ =ఒండొరుల శరీరములకలయికచే, ఒండొరుమేనన్ = ఒండొరులశరీరములందు, రోమహర్షముకుళవ్రజము = మొగ్గలంబోలు గగుర్పాటుగుములు, నిండఁగన్ =పూర్ణముగాఁగ, ఏగెన్ = వెడలెను.

విశే. ఇందు సత్యా సౌకుమార్యము తీవి యంగసౌష్ఠవము సూచితములు.

చ. ఇనకరతాపవేదన సహింపఁగలేక నిజోదకంబులన్
మునిఁగి వినీలకుంతలసమూహము నారఁగ విచ్చెనాఁగ వీ
చినికరచాలనం దరులఁ జేరిన జొంపపునాఁచుఁదీఁగలం
దనరు నభోనదిం గనియె దానవలోకవిరోధి యత్తఱిన్. 26

టీ. ఇనకరతాపవేదనన్ = సూర్యునికిరణములచేనైన సంతాపమువలని దుఃఖమును, సహింపఁగన్ =ఓర్చుటకు, లేక=చాలక, నిజోదకంబులన్ =తననీళ్లను, మునిఁగి, వినీలకుంతల సమూహమున్ =మిగులనల్లనైన తన తలవెండ్రుకల గుంపును, ఆరఁగన్ = ఎండుటకు, విచ్చెన్ =విప్పెను, నాఁగన్ = అనునట్లుగా, వీచినికరచాలనన్ = తరంగ సమూహముల చలనముచే, దరులన్ =ఒడ్డులను, చేరిన = పొందిన, జొంపపు నాఁచుఁదీఁగలన్ =గుబురగు నాచుఁదీఁగెలచే, తనరు = ఒప్పునట్టి, నభోనదిన్ = మిన్నేటిని, అత్తఱిన్ = అసమయమున, దానవలోకవిరోధి = రాక్షసుల గుంపునకు శత్రువైన శ్రీకృష్ణుఁడు, కనియెన్ =చూచెను.

భా. అలలచలనముచే నొడ్డులందుఁ జేరిన నాచుజొంపములు తీక్ష్ణాతపబాధకుఁ దాళఁజాలక తననీటఁ దానమాడి మిన్నేరు తడియారవిప్పిన కొప్పే మోయన నొప్పెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

తే. కాంచి చేరంగఁ జని మధుకైటభారి
రత్నసోపానకలితమార్గముల డిగ్గి

గలుగలుగయుఁ దాను వేలుపుఁగొలను దఱిసె
నొండొరుల కేలుఁదమ్ముల నూఁత గొనుచు. 27

టీ. కాంచి = చూచి, మధుకైటభారి = మధుకైటభశత్రువగు శ్రీకృష్ణుఁడు, చేరఁగన్ = దగ్గఱఁగా, చని=ఏగి, రత్నసోపానకలితమార్గములన్ = రత్ననిర్మితములైన మెట్లుగలుగు త్రోవలనుండి, డిగ్గి=దిగి, కులసతియున్ = భార్యయగు సత్యభామయు, ఒండొరుల కేలుఁదమ్ములన్ =ఒకరిహస్తపద్మము నొకరు, ఊఁత=అవలంబము, గొనుచున్ = స్వీకరించుచు, వేలుపుఁగొలనున్ = దేవసరస్సును; మందాకిని ననుట. దఱిసెన్ =సమీపించెను.

విశే. ఇందు ''తఱిసిరి'' అని పాఠమగపడెడి. ఇందుఁ దాను శబ్దము ప్రయుక్తమగుటం జేసి ''తఱిసె'' అని క్రియ యేకవచనముగానే యుండవలయును. కాన ''తఱిసిరి'' అను పాఠము ప్రామాదిక మనంజనును. వియద్గంగ నదియైనను దానిం గొలనుగాఁ గవి పేర్కొనియున్నాఁడు. ఇట్లే కవులు దేవతలు జలక్రీడ సేయునదియౌటం గావలయుం దానిని 'దేవదీర్ఘిక, దేవసరస్సు' అని వ్యవహరించుట సంప్రదాయమైనది.

చ. తొడవులు పుచ్చి నిర్జరవధూటులు వేలుపుమ్రాని *చీనిపా
వడలు ధరించి దేహరుచివైభవము ల్నవమల్లికారుచిం
దొడర నితంబచక్రములతో నెఱివాలు మెఱుంగుఁగప్పుఁబె
న్జడ లొరయంగఁ దద్గగనశైవలినిం దగఁ జొచ్చి రందఱున్. 28

టీ. నిర్జరవధూటులు=సురయువతులు, తొడవులు = ఆభరణములను, పుచ్చి = వదలించి, వేలుపుమ్రాని చీనిపావడలు = కల్పవృక్షసంబంధమైన సన్ననివలువలను, ధరించి=కట్టి, దేహరుచి వైభవముల్ = దేహకాంతి విభవములు, నవమల్లికారుచిన్ = క్రొత్తమల్లీ సుమములయొక్క కాంతిని, తొడరన్=ఎదిరింపఁగా, నెఱివాలు మెఱుంగుఁగప్పు పెన్జడలు- నెఱి=మనోహరమైన, వాలు=దీర్ఘములైన, మెఱుంగు = తళతళలాడునట్టి, కప్పు=నల్లందనముగల, పెన్ జడలు=పెద్దజడలు, నితంబచక్రములతోన్ =గుండ్రనగు జఘనములతో, ఒరయంగన్ =రాపాడఁగా, అందఱున్ = ఎల్లరును, తద్గగనశైవలినిన్ =ఆమందాకినీ నదిలో, తగన్ =ఒప్పునట్లుగా, చొచ్చిరి=ప్రవేశించిరి.

విశే. దేవకాంతలు తెల్లని దేహప్రభ గలవారనియుఁ, గటిదేశమువఱకు వ్రేలాడు దీర్ఘమైన కొప్పుగలవారనియుఁ దెలియనగును. పూర్వపద్యమునందువలెనే యిందును మిన్నేటిని 'శైవలిని' యని కవి వ్యవహరించినాఁడు. నదియందు నాచుం

* చీని పావడలు.

డుట పద్మములుండుట మొదలగునవి కానము. సరసులనుండుట సహజము. కాని కావ్యములమాత్రము నదీవర్ణనమున నిట్టివిషయములు గాననగును. కాన నిట్టివానిని గవిప్రౌఢోక్తిసిద్ధములుగా నెన్నవలయునని తోఁచెడిని.

మ. మరుదంభోరుహనేత్ర లంబరధునీమధ్యంబున న్నిల్వ ని
ష్ఠురతత్పీనపయోధరాహతి జలస్తోమంబు నల్వంకలం
దెరల న్నాభిచయంబు లోఁగొనియె దానిం జాలగాంభీర్యశీ
లురు సంక్షోభము నొందువారి నెచటన్ లోఁగొంచు వర్తింపరే. 29

టీ. మరుదంభోరుహనేత్రలు = దేవతాస్త్రీలు, (అంభోరుహనేత్రలు = తమ్మిరేకులంబోలు కనులుగలవారు) అంబరధునీమధ్యంబునన్ = మిన్నేటినడుమను, నిల్వన్ = ఉండఁగా, తత్పీనపయోధరాహతిన్ = వారి బలిసిన స్తనములదెబ్బచే, జలస్తోమంబు=జలరాశి, నల్వంకలన్=నాలుగుదిక్కులకు, తెరలన్=మఱలఁగా, దానిన్ = ఆజలమును, నాభిచయంబు = బొడ్డులగుమి, లోఁగొనియెన్=లోపలికిఁ జేర్చుకొనెను; ఐక్యపఱచుకొనెననుట. చాలన్=మిక్కిలి, గాంభీర్యశీలురు = గంభీరభావముగలవారు, (లోఁతుగలవని నాభిపరమగు నర్థాంతరము) సంక్షోభమున్=కలఁతను, ఒందువారిన్ = పొందినవారిని, ఎచటన్=ఎచ్చోటనైనను, లోఁగొంచున్ = తమలోఁ జేర్చుకొనుచు; అనఁగాఁ దమప్రాపు నొసంగియనుట. లోపలికిఁ జేర్చుకొనుచని నాభి పరార్థాంతరము. వర్తింపరే=మెలంగరా ?

భా. లోకమున గంభీరభావులకుఁ గలఁతలొందినవారిఁ దమయాశ్రయమొసంగి తమలోఁ జేర్చికొని రక్షించుట నైజము. కావుననే గంభీరభావముగల (లోఁతైన) సురస్త్రీలనాభులును స్తనహతిచేఁ జెదరి కలఁతనంది పాఱిన జలరాశిం దమలోఁ జేర్చికొని యరసినవని భావము.

విశే. నాభి గాంభీర్యము వ్యంగ్యము. అలం. అర్థాంతరన్యాసము.

చ. ఘనకుచకుంభము ల్బయలుగా విబుధాలయవారభామినీ
జనకరిణీసమూహములు సల్లె యదూద్వహకుంజరంబుపై
వనజవనీపరాగపరివాసిత మైననభస్తరంగిణీ
ఘనతరభంగతోయకణికాచయము ల్గరపుష్కరంబులన్. 30

టీ. విబుధాలయ వారభామినీ జనకరిణీ సమూహములు=దేవవేశ్యా సమూహములను నాఁడునేనుంగుగుంపులు, ఘనకుచకుంభముల్=గొప్పవైన స్తనములనెడు కుంభస్థలములు, బయలుగాన్=ప్రకాశమగునట్లుగా, యదూద్వహకుంజరంబుపైన్=శ్రీకృష్ణుఁ

[illegible] దుగయేనుఁగుపై, వనజవనీపరాగ పరివాసితమైన=పద్మసమూహముల సంబంధమైన [illegible]చేఁ బూర్ణముగాఁ బరిమళింపఁ జేయఁబడిన, నభస్తరంగిణీ...చయముల్=నభస్త[illegible]=ఆకాశగంగాసంబంధమైన, ఘనతర=మిగులగొప్పవైన, భంగ=తరంగముల సంబం[illegible]మైన, తోయకణికా=ఉదకబిందువులయొక్క, చయముల్=సమూహమును, కర[illegible]రంబులన్=చేతులనుకరిహస్తాగ్రములచేత, చల్లెన్=చిమ్మెను.

విశే. పుష్కరశబ్దమునకు నేనుఁగుతొండము చివరయేగాక పద్మమును నర్థ[illegible]జేసియు, హస్తములకుఁ బద్మసామ్యము ప్రసిద్ధమగుటంజేసియు, నద్దాని నేకదేశ[illegible]రూపకముగాఁ దలంచిన పద్మములంబోలు హస్తములను తొండములకొనలచే[illegible] నర్థము లభించును. ఇట్లే పూర్ణకుంభములను స్తనములను సాటిచేయుంట సహజ[illegible]జేసి యచ్చోఁగూడఁ బైనివ్రాసిన ప్రకారముగఁ దలంచినఁ గుంభములంబోలు [illegible]ములనెడు కుంభస్థలములని యర్థము సిద్ధించును. కుంజరశబ్దము శ్రేష్ఠవాచకమగుట[illegible]స్థలమునఁగూడ యదుశ్రేష్ఠుఁడైన శ్రీకృష్ణుఁడను పురుషగజమను నర్థము లభించెను. [illegible]గుతల కిరువంకలనుండు నెత్తైన రెండుప్రదేశములను రెండు కుంభములుగాఁ [illegible]లు పర్ణించియున్నారు. కావుననే స్తనద్వంద్వమునకవి సాటియగుటయుఁ గుంభము [illegible]బహువచనముగా వ్యవహృతమగుటయుఁ బొసంగెను. "ఘనకుచకుంభముల్ దొరసి [illegible]సి యొప్పునకై యసూయమై" అని యెఱ్ఱాప్రగడ నృసింహపురాణము. "[illegible]కుంభహస్తయుతుల్, నగజాచారుకుచోరువై ఖరులఁ దెల్పన్" అని వసుచరి[illegible]. అలం. రూపకము.

[illegible] వారణయానలు కరముల
నీ రడిచినరవము మురజనిస్వనముగఁ జె
న్నారఁగఁ బద్మిను లాడెను
వారిజహస్తముల మధుపవలయము లులియన్. 31

టీ. పద్మినులు = పద్మలతలు, (పద్మినీజాతి స్త్రీలని యర్థాంతరము) వారణ[illegible]=గజగమనలగు సురస్త్రీలు, కరములన్=హస్తములచే, నీరడిచినరవము = నీటిని [illegible] బుట్టినచప్పుడు, మురజనిస్వనముగన్ = మద్దెల మ్రోఁతకాఁగా, చెన్నా[illegible]=అందముగా, వారిజహస్తములన్ = పద్మములనే చేతులందు, (వారిజములవంటి [illegible]లందని యర్థాంతరము) మధుపవలయములు=తుమ్మెదలను కంకణములు. (వలయా[illegible] తుమ్మెదలను కంకణములనియుఁ గ్రహింపనగును.) ఉలియన్ = శబ్దింపఁగా, [illegible]=నాట్యము చేసెను.

భా. సురతరుణులు నీటిని జేతితోఁ గొట్టఁగా నా నీటనున్న తామరతీవల గములును, దామరలును జలించెనని భావము.

వి శే. నీటిని జేతితో నడచునపుడు పుట్టిం ధ్వనిని మద్దెలమ్రోఁతగను, నీరజముల హస్తములుగాను, మధుపములఁ గంకణములుగాను రూపించి పద్మినీశబ్దమువలనఁ గల్గు నర్థాంతరము నాధారముగఁగొని, పద్మినీనాట్యమును గవి విశదీకరించినాఁడు. తుమ్మెదలను గంకణములుగా రూపించుటచేత నీకంకణములు నల్లనివని చెప్పవలసియున్నది. దాన నియ్యవి యింద్రనీలనిర్మితములో యని యూహింపవలసియున్నది. లేక వలయాకృతి నొక్క దానినిబట్టియే కంకణత్వ మూహించెనోయని యనుమానింపవలసి యున్నది. లోకమునందలి స్త్రీనాట్యము గమ్యము. అలం. రూపకము.

క. ప్రోడతనంబులు మీఱఁగఁ
జేడియ లడుగులును మొగముఁ జేతులు మెఱయ
న్వేడుక నీఁదఁగ నపు డా
మ్రేడితజలజాత మయ్యె మిన్నే టెల్లన్. 32

టీ. చేడియలు=సురతరుణులు, ప్రోడతనంబులు = ప్రౌఢత్వములు, మీఱఁగన్ = అతిశయించునట్లుగా, అడుగులును=పాదములును, మొగమున్=ముఖమును (మొగములని యర్థము) చేతులున్=హస్తములును, మెఱయన్=ప్రకాశింపఁగా, వేడుకన్= సంతోషముతో, ఈఁదఁగన్=ఈఁతకొట్టఁగా, అపుడు=ఆసమయమున, మిన్నేటెల్లన్= మందాకినియంతయు, ఆమ్రేడితజలజాతము=ద్విగుణముగాఁ జేయఁబడిన పద్మములుగలది, అయ్యెన్=ఆయెను.

భా. పాదమునకును, మోమునకును, జేతులకును, బద్మముల సాటిచేయుట సహజము. ప్రకృతము నీటనీఁదులాడు స్త్రీలపాదములు మొగములు చేతులు నీటఁ దేలి తమ్ములంబోలి యున్నవగుటంజేసి యాకాశగంగయందుఁ బద్మములు ద్విగుణీకృతములైనట్లు తోఁచెనని భావము.

వి శే. నీటనీఁదులాడునపుడు పాదాదులు తేలియే యుండునీఁత వెలికలఁబడి యీఁదునీఁతగా నెన్నవలసియున్నది. బోరగిలఁబడి యీఁదునీఁతయందు హస్తపాదముల కొకమాఱు మునుంగుటయు నొకమాఱు తేలుటయు సంభవించునుగాన నపుడామ్రేడిత జలజాతత్వము సరిగా సరిపడదని తోఁచెడిని. అలం. ఉపమగమ్యము.

తే. తామరల వ్రేటులాడుచోఁ దరుణులెత్తు
కరరుహాంకితబాహువల్లరులు వోలిచె

బిరుదవర్ణావళీపరిస్ఫురిత మైన
పల్లవాస్త్రజయస్తంభపటలి యనఁగ. 33

టీ. తామరలన్=పద్మములచే, వ్రేటులాడుచో = (పరస్పరము) కొట్టుకొను
నపుడు, తరుణులు = యౌవతులు, ఎత్తు=పైకెత్తిన, కరరుహాంకిత బాహువల్లరులు-
కరరుహ=గోళ్లచే, అంకిత=చిహ్నితములైన, బాహువల్లరులు = తీఁగలంబోలు బాహు
వులు, బిరుద...స్ఫురితమైన-బిరుదవర్ణ=బిరుదాక్షరములయొక్క, ఆవళీ=పంక్తులచే,
పరిస్ఫురితమైన = ప్రకాశింపఁజేయఁబడిన, పల్లవాస్త్ర...పటలి-పల్లవాస్త్ర=మన్మథుని
యొక్క, జయస్తంభ=విజయసూచకములగు స్తంభములయొక్క, పటలి = సమూహము,
యనఁగన్=అనునట్లు, పొలిచెన్=ఒప్పెను.

భా. తామరలచే నన్యోన్యము కొట్టుకొనునపుడు పైకెత్తిన తెల్లనిగోళ్లతో నొప్పు
బాహువులు మన్మథుని విజయసూచకములగు స్తంభములంబోలి యొప్పెనని భావము.
బాహులు స్తంభములవలెను నందలిగోళ్లు బిరుదాక్షరములవలెను ఒప్పెనని తాత్పర్యము.
అలం. ఉత్ప్రేక్ష.

చ. దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుక
న్యానవపంకజాతనివహంబులఁ గందుకకేళి సల్పుచు
న్మేనఁ దదబ్జపత్త్రములు నిండఁగ నంటిన నొప్పు నెంతయుం
దానును పేంద్రుఁడౌట నయనంబులు పెక్కులు దాల్చెనో యనన్. 34

టీ. దానవవైరి = రాక్షసవైరి యగు శ్రీకృష్ణుఁడు, జహ్నుకన్యానవపంకజాత
నివహంబులన్=మిన్నేటి క్రొత్తతమ్ములగుంపునందు (అనఁగా జాహ్నవియందు దపుడపుడే
పుట్టిన పద్మసమూహముననుట) కందుకకేళి=బంతులాట, సల్పుచున్=చేయుచు,
మేనన్=శరీరమున, తదబ్జపత్త్రములు=ఆకందుకరూపములైన పద్మములరేకులు, నిండఁ
గన్=నిండునట్లు, అంటినన్=అంటుకొనఁగా, తానున్, ఉపేంద్రుఁడు=ఉపేంద్రుఁడను
పేరుగలవాఁడు; ఇంద్రునితమ్ముఁడు, ఔటన్=అగుటచే, పెక్కులు=అనేకములు, నయ
నంబులు=నేత్రములు, తాల్చెనో=ధరించెనో, అనన్=అనునట్లు, ఎంతయున్=మిక్కిలి,
ఒప్పెన్=ఒప్పెను.

భా. తామరరేకులను గన్నులకు సాటిగాఁ జెప్పుట ప్రసిద్ధము. ఇంద్రుఁడు
వేయికన్నులవేలుపు. శ్రీకృష్ణుఁడు బంతులాడునపుడు మేనెల్ల నంటిన పద్మదళములతో
సహస్రాక్షుఁడగు నింద్రునివలె నుండెననియుఁ, దానునింద్రునకుఁ దమ్ముఁడును నుపేంద్రుం
డును గాన నట్టిరూపము నాతఁడు కోరి ధరించిన ట్లుండెననియుఁ దాత్పర్యము. అలం.
ఉత్ప్రేక్ష.

తే. తనమనోవల్లభునిభుజాస్తంభ మూఁది
సలిలవిహరణ మొనరించె సత్యభామ
యలసవైఖరి వీచిడోలాంతరావి
హారసంగతనవరాజహంసి యనఁగ. 35

టీ. సత్యభామ, తనమనోవల్లభుని భుజాస్తంభము=తనమనోహరుని స్తంభము వంటి భుజమును, ఊఁది=పట్టి, అలసవైఖరిన్=మందమైనరీతితో, వీచి...హంసి-వీచిడోలా=తరంగము లనెడు నుయ్యేలలయొక్క, అంతర=మధ్యభాగములందైన, విహార=విహారములతో, సంగత=కూడియున్న (తరంగడోలికావిహారాసక్తమైన యనుట) నవరాజహంసి=క్రొత్తరాజహంసాంగన, అనఁగన్=అనునట్లు, సలిలవిహరణము = జలక్రీడ, ఒనరించెన్=చేసెను.

భా. శ్రీకృష్ణునిభుజ మూఁతగాఁగొని జలక్రీడయొనర్చు సత్యభామ యలసభావ మలర తరంగడోలికలఁ గ్రీడాసక్తమగు రాజహంసాంగనపగిది నొప్పెనని భావము. అలం. ఉత్ప్రేక్ష. 'వీచిడోలా' అనుచో రూపకము.

క. అవతంసితశైవల యై, వివలద్వేణి యయి కోకవిస్ఫుటకుచ యై
దివిషన్నది నాకపురీ, ధవలాక్షులలోన *నన్యతమ యనఁ బొల్చెన్.

టీ. దివిషన్నది=మిన్నేరు, అవతంసిత శైవలయై = శిరోభూషణముగఁ జేయఁబడిన నాఁచుగలదై; మిన్నేరునకుఁ బైని దేలియాడు శైవలము శిరోభూషణమువలె నున్నదని గ్రహించునది. వేణిప్రవాహముగాన దానిపైఁగలనాఁచు శిరోభూషణమయ్యెనని యెన్నునది. సురవనిత లానదిని దేలియాడుట వారిశిరసుల నాఁచు లగ్నమయ్యెనని యెన్నవలయు. ఇట్లే యిందలివిశేషణములు సురవనితా సురనదీ సాధారణములు. వివలద్వేణియయి=పాఱుప్రవాహముగలదై యని నదీపరము. వీడినకొప్పుగలదియని సురవనితాపరము. కోకవిస్ఫుటకుచయై = చక్రవాకములనెడు తెల్లమగు స్తనములుగలది యని నదీపరము. చక్రవాకములవంటి ప్రస్ఫుటమగు స్తనములుగలదియని సురవనితాపరము. నాకపురీ ధవళాక్షులలోనన్=దేవతాస్త్రీలలో, అన్యతమ=ఒకతె, అనన్=అనునట్లుగా, పొల్చెన్=ఒప్పెను.

భా. నాకవనితలు జలక్రీడకతనఁ గొప్పునంటిన నాఁచుగలవారును, జడలు వీడినవారును, బయల్పడిన కుచములుగలవారును నైరనియు, సాదృశ్యమునుబట్టి మిన్నేరును నట్టిదేయగుటంజేసి యన్నదియు నాదేవతాస్త్రీలనే బోలి వారిలో నొక్కతెవలె

* నన్యతమయుంబోలెన్.

నొప్పెనని యుం దాత్పర్యము. జడకు ప్రవాహమును, గుచములకుం జక్రవాకములను పోల్చి చేయుంట సహజము గదా.

విశే. సాంచును, శిరోభూషణముగాం జెప్పుటం జేసి దమనము మున్నగుతృణముల రూపమగుశిరోభూషణమునే గవి భావించెనని యెన్నవలయును. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

చ. పరిగినహారరత్నముల పెల్లున నొక్కెడం దామ్రపర్ణి యై
నెరసినసోగపెన్నెఱులనిగ్గున నొక్కెడ భానుకన్య యై
గురుకుచలిప్తమైన నవకుంకుమ నొక్కెడ శోణ యై నభ
శ్చరనది యొప్పె దివ్యజలజాతముఖు ల్జలకేళి సల్పఁగన్. 37

టీ. దివ్యజలజాతముఖుల్ = సురవనితలు, జలకేళి = జలక్రీడ, సల్పఁగన్ = చేయఁగా, పెరిగిన = త్రెగిపడిన, హారరత్నముల పెల్లునన్ = ముత్యాలహారముల సంబంధమైన ముత్తెములయొక్క యాధిక్యముచే, ఒక్కెడన్ = ఒకచోటను, తామ్రపర్ణియై = తామ్రపర్ణీనదియై (తామ్రపర్ణి నదీరూపముగలదై యనుట.) నెరసిన సోగపెన్నెఱుల నిగ్గునన్ = వ్యాప్తములైన నిడుదలైన పెద్దశిరోజముల కాంతిచే, ఒక్కెడ = ఒక ప్రదేశమున, భానుకన్యయై = యమునానదియై (తత్స్వరూపముగలదై యనుట.) గురుకుచలిప్తమైన = లావైన స్తనములందుఁ బూయఁబడిన, నవకుంకుమన్ = క్రొత్తకుంకుమముచే, ఒక్కెడన్ = ఒకతావున, శోణయై = శోణనదియై, (శోణనదీరూపముం దాల్చినదై యనుట.) నభశ్చరనది = ఆకాశగంగ, ఒప్పెన్ = ప్రకాశించెను.

భా. సురవనితలు జలకేళి యొనర్చునపుడు వారి ముత్యాలహారములు త్రెగి వానినుండి ముత్తెము లొక్కెడ రాలిననియుఁ, దామ్రపర్ణీనది ముత్తెముల కాకరమని నానుడిగలదుగాన దానిననుసరించి యామ్ముత్తెములతోడి తావుగలయన్నది తామ్రపర్ణివలె నొప్పెననియు, దేవభామినుల శిరోజముల యసితకాంతు లొకతావున వ్యాపించి జలమును నల్లగాఁజేయ నన్నది నల్లనియుదకముగల యమునను బోలెననియు, దివ్యకాంతలకుచలిప్తమైన క్రొత్తకుంకుమము జలకేళివేళ కరఁగి యొక్కెడ జలము నెఱ్ఱగాఁజేయ నెఱ్ఱనియుదకముతోఁ గూడిన యాయాకాశగంగ యెఱ్ఱనినీటితో గూడు శోణనదిగతి నొప్పెననియు భావము.

విశే. నవరత్నములలో ముత్తెమును నొకటిగాన ముత్యమునకు రత్నశబ్దమును వాడెనని గ్రహింపనగును. మఱియుం నట్టిరత్నములు గలహారము ముత్యములహారమే యనియుం జెప్పవలెను. "తామ్రపర్ణీసమేతస్య ముక్తాసారంమహోదధేః" అను కాళిదాస సూక్తిననుసరించి తామ్రపర్ణీనది ముత్తెములకాకరమని యెన్నవలసియున్నది. దాన నీ

పద్యమందలి హారమణిశబ్దములు ముక్తాహార ముక్తాఫలము లర్థముగాఁగలవనియే యెన్న వలెను.

అలం. తనగుణము వీడి పరనదీగుణమును వియన్నది దాల్చినట్లు వర్ణించుటకతనఁ దద్గుణాలంకారము. ఒక్కమిన్నేటినే తామ్రపర్ణీ యమునా శోణలుగా వర్ణించుటంబట్టి యుల్లేఖాలంకారము. "తద్గుణస్స్వగుణత్యాగాదన్యోత్కృష్టగుణాహృతిః ఏకస్య బహుధోల్లేఖః......" అని యలంకారలక్షణములు.

చ. అలకలు నాసికామణియు నన్నువకౌనుఁ గుచద్వయంబుఁ గుం
డలములుఁ జంచలింప జతనంబున హస్తము లూఁది జీర్కుబం
డల దిగజాఱి రొండొరుకడం దరలాక్షులు దోనివింట బిం
జలు గొన నేయుపుష్పశరుసంపెఁగవాలికతూపులో యనన్. 38

టీ. తరళాక్షులు=సురచపలనయనలు, అలకలు=కురులును, నాసికామణియున్=ముక్కురతనమును, అన్నువకౌనున్=సన్నని నడుమును, కుచద్వయంబున్=స్తనద్వయమును, కుండలములున్=కర్ణాభరణములును, చంచలింపన్ = సంచలింపఁగా, జతనంబునన్=యత్నముతో, హస్తములు=చేతులు, ఊఁది=పట్టుకొని, జీర్కుబండలన్ = జరుగుడుతాలమీఁద, ఒండొరుకడన్=ఒకరివెనుకనొకరు, దోనివింటన్ = వంగినధనువుచే, పింజలుగొనన్=ఒకదానినొకటి యంటునట్లుగా (పుంఖానుపుంఖముగ ననుట.) ఏయు= ప్రయోగించు, పుష్పశరుసంపెఁగవాలికతూపులో = మన్మథుని సంపెఁగపూవుల రూపమగు దీర్ఘములగు బాణములో, అనన్=అనునట్లు, దిగజాఱిరి=క్రిందికి జాఱిరి.

భా. సురవనిత లొకరిచేతుల నొకరు పట్టుకొని జరుగుడుబండపైనుండి క్రిందికి జాఱిరని భావము. జరుగుడుబండపైనుండి క్రిందికి నొకరితరువాత నొకరంటి జాఱుచుండుటంజేసియు జాఱునపుడు చలనము నవ్వారుగల్గియుండుటంజేసియు, స్త్రీలను మన్మథబాణములుగాఁ బల్కుట కవిసంప్రదాయప్రసిద్ధవిషయ మగుటంజేసియు, సురవనితలు సంపెఁగపూవుజిగినిబోలు శరీరకాంతి గలవారగుటంజేసియుఁ, బుంఖానుపుంఖముగఁ జలించుచుఁబోవు మన్మథుని సంపెఁగవాలికతూపులంబోలి యొప్పిరని తాత్పర్యము.

మ. బలివిధ్వంసియుఁ బెక్కుభంగుల మరుత్పద్మాకరాంతంబునన్
సలిలక్రీడ యొనర్చి నిర్భరమదస్తంబేరమప్రక్రియన్
వెలలే నృత్యయుఁ దాను మజ్జనవిధావిభ్రాంతకౌటిల్యకుం
తలసంక్రాంతనితంబలై దివిజకాంతారత్నము ల్గొల్వఁగన్. 39

టీ. బలివిధ్వంసియు = బలినడఁచిన శ్రీకృష్ణుఁడును, పెక్కుభంగులన్ = పలురీతులతో, మరుత్పద్మాకరాంతంబునన్ = దేవసరోమధ్యమున, సలిలక్రీడ = జలక్రీడ,

మునిగి=చేసి, నిర్ఝర.....ప్రక్రియన్-నిర్ఝర = స్వేచ్ఛగాఁదిరుగు, మదస్తంబేరమ = గంధపుటేనుఁగుయొక్క, ప్రక్రియన్=ప్రకృష్టవ్యాపారముతో, సత్యయనన్ = సత్యభామను కూడను, తానున్, మజ్జన.....నితంబలై-మజ్జనవిధా=స్నానవిధిచే, విభ్రాంత = తిరుగఁబడిన (అనఁగా వ్యత్యస్తములైనయనుట.) కౌటిల్య=వక్రములైన, కుంతల = తలవెండ్రుకలచే, సంక్రాంత=ఆక్రమింపఁబడిన, నితంబలై=పిఱుఁదులుగలవారై, దివిజ కాంతారత్నముల్ = దేవతాస్త్రీమతల్లికలు, కొల్వఁగన్ = సేవింపఁగా, వెలలెన్ = విడలెను.

వ్యా-విశే. స్తంబేరమనఁ దృణములందుఁ గ్రీడయొనర్చునదని వ్యుత్పత్త్యర్థము గాని యుచ్చోచ్చమాత్ర మయ్యర్థ మీశబ్దమునకు సరిపడదనియు నేనుఁగను సామాన్యార్థమే గ్రాహ్యమనియుఁ దోఁచెడిని. లేదా నాఁచుతీవలంటియున్న శ్రీకృష్ణుఁడు తృణక్రీడాసక్తమైన యేనుఁగువలె నున్నవాఁడనియేని గ్రహింపవలెను. వెలలెను: రూ. అ. విడలెను.

తే. నెఱులఁ దడియార్చి క్రొవ్విరు లుఱిమి మేనఁ
గలపము లలంది తొడవు లంగములఁ బూని
కల్పవృక్షదుకూలాంశుకములు గట్టి
రంగనలు మారునాఱతోఁడియలుఁగు లనఁగ. 40

టీ. నెఱులన్=తలవెండ్రుకలను, తడియార్చి = చెమ్మనారఁజేసి, క్రొవ్విరుల్ = క్రొత్తపూవులను, తుఱిమి = ముడిచి, మేనన్=శరీరమున, కలపములు = చందనాది సుగంధలేపములను, అలంది=రాచుకొని, తొడవులు=అలంకారములు, అంగములన్ = అవయవములందు, పూని=ధరించి, కల్పవృక్షదుకూలాంశుకములు = కల్పవృక్షసంబంధమైన పట్టుబట్టలను, అంగనలు=సురవనితలు, మారునాఱతోఁడియలుఁగులు = మన్మథుని యొక్క యొఱతోనున్న ములుకులు, అనఁగన్ =అనునట్లు, కట్టిరి=ధరించిరి.

భా. చందనాదిచర్చలచేతను దుకూలములచేతను నాచ్ఛాదితగాత్రులైన దేవతాస్త్రీలు ఒఱతోడి మన్మథబాణములవలె మించిరని భావము. మన్మథబాణములు సుమములగుటంజేసి కుసుమములవలె మృదువైన శరీరములుగలవారని తాత్పర్యము.

విశే. కల్పవృక్షశాఖాంతరములందు దుకూలము లున్నవిధము 3 ఆ. 41 గద్యమునందలి 'నిరంతరసంతానోకహదుకూలమయపతాకా' అనుపదము మూలముగను, 4 ఆ. 4 పద్యమునందలి ''ఈతరుశాఖాంతరలోలదుకూలమారుతము' లను పదముమూలముగను సూచితమయ్యెను.

చ. జలరుహపత్త్రనేత్త్రుఁడును సత్యయుఁ దాను ననర్ఘ్యదివ్యభూ
షలు ధరియించి నిర్జరనిశాకరబింబముఖుల్ భజింపఁ ద
ద్బలపరిపంథిబాహుపరిపాలిత మైనపురంబు సొచ్చె ని
శ్చలతరనేత్రపౌరజనసంతతి హర్మ్యము లెక్కి చూడఁగన్. 41

టీ. జలరుహపత్రనేత్రుఁడును=పద్మాక్షుఁడును, సత్యయుఁన్, తానున్, అనర్ఘ్య దివ్యభూషలు=అమూల్యములగు మణిమయాలంకారములను, ధరియించి, నిర్జరనిశాకర బింబముఖుల్=సురచంద్రవదనలు, భజింపన్=సేవింపఁగా, తద్బలపరిపంథిబాహుపరిపాలిత మైన=ఆబలరిపుండైన దేవేంద్రునిబాహువులచే రక్షిత మైన, పురంబున్=పట్టణమును; సురనగరినమరావతిననుట. నిశ్చలతరనేత్రపౌరజనసంతతి = అనిమేషులగు పట్టణవాసుల సమూహము; స్వర్గమునందలివారెల్లను ననిమిషులే. ప్రకృతము శ్రీకృష్ణుంజూడ నుత్సుకులై యుంట నిశ్చలతరనేత్రులైరని గ్రహింపవలయును. హర్మ్యములు=మేడలు, ఎక్కి= అధిరోహించి, చూడఁగన్, చొచ్చెన్=ప్రవేశించెను.

## సూర్యాస్తమయాదివర్ణనము.

క. దినరాజు త్తఱిఁ బంకజ,వనములఁ జరియించు కాంతివర్గము దానున్
వనధి జలకేళి సలుపఁగఁ, జనియె నన న్వారుణీదిశాతటిఁ బొల్చెన్.

టీ. దినరాజు=పగటిరాజు; సూర్యుడు, అత్తఱిన్ = ఆసమయమున, పంకజవన ములన్=పద్మవనములందు, చరియించు=సంచరించునట్టి, కాంతివర్గము=ఛాయాసమూహ మును, తానున్, వనధిన్=సముద్రమున, జలకేళి=జలక్రీడ, చలుపఁగన్=చేయఁగా, చనియెన్=ఏగెనో, అనన్ = అనునట్లు, వారుణీదిశాతటిన్ = పశ్చిమదిక్తటమున, పొల్చెన్=ఒప్పెను.

భా. చాయలు సూర్యభార్యలు. ప్రకృతము స్త్రీలతోఁగూడి జలకేళియొనర్చిన శ్రీకృష్ణునిగాంచి తానును దనవనితలతో పశ్చిమాంభోధియందు జలకేళిసవరింప నేఁగెనో యనునట్లు ప్రతీచీదిశ నొప్పెనని భావము అనఁగా పడమటిదిక్కును రవి యస్తమింపఁ జేరెనని తాత్పర్యము.

తే. వేల్పుఁజిగురాకుఁబోఁడులవీఁగుఁజన్నుఁ
గవలపైఁ గుంకుమచ్ఛాయ గడలుకొలిపి
పసిఁడిగట్టున కొకవింత [1]మిసిమి నించి
నెఱసెఁ [2]గడసావిముదుసలి తెఱపయొండ. 43

1 పసిమి. 2 గడసారిముదుసలితఱపిరొండ.

టీ. వేల్పుఁజిఱుఁరాకుఁబోఁడులవీఁగుఁజన్నుఁగవలపైనన్ = సురతరుణుల బరువైన స్తనద్వంద్వములమీఁద, కుంకుమచ్ఛాయ = అరుణమైనకాంతిని, కడలుకొలిపి = వ్యాపింపఁజేసి, పసిఁడిగట్టునకున్ = బంగరుకొండకు, ఒకవింతమిసిమి = ఒకవింతయగు తేటును, నించి = నింపించి, కడసావి......యెండ-కడ = తుదియైన, సావి = కాలమునందలి, ముదుసలి = వృద్ధమైన, తెలుప = తైక్ష్ణ్యములేని, ఎండ = ఆతపము; అనఁగా సాయంసమయమునయైన బాలాతపమనుట. నెఱసెన్ = వ్యాపించెను.

విశే. 'మిసిమి'యనుచోఁ 'బసిమి'యని పాఠమగపడెడి. అపుడు పసిమి యనఁగాఁ బసుపుఁదనకని యర్థమని గ్రహించునది. వేల్పువనితల స్తనములు తెల్లనివౌట నందుఁ బడిన బరతాతపమరుణముగ నుండెననియు, బంగరుకొండ పసుపుకాంతులుగలదౌట నందుఁ బ్రపుగొనిన ముసలియెండ నొకవింతజిగిని దానికిఁ గల్గించెననియు గ్రహింపవలెను.

ఆ. వేల్పుగట్టుగవుల వెలువడి వడ దేఱఁ
జదలువాఁకనీట జలకమాడి
వైజయంతహర్మ్యవలభినీడంబులఁ
గ్రందుకొనియెఁ గిన్నరద్వయములు. 44

టీ. వేల్పు......గవులన్-వేల్పుగట్టు = దేవతల కొండయగు మేరువుయొక్క, గవులన్ = గుహలనుండి, వెలువడి = బయలుదేరి, వడ = తాపము, తేఱన్ = పోవునట్లుగా, చదలువాఁకనీటన్ = మిన్నేటిజలమున, జలకమాడి = స్నానము చేసి, కిన్నరద్వయములు = కిన్నరమిథునములు, వైజయంతహర్మ్యవలభినీడంబులన్ = వైజయంతమను ప్రాసాదము యొక్క కొణిగెగూడులందు, క్రందుకొనియెన్ = గుంపులుగాఁ జేరెను.

క. ఘనసాంధ్యరాగవినతా
తనయగరుత్సమితికడిఁదితాఁకున ధర వ్రా
లినగగనఫణిఫణామణి
యన రవిమండలము పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. 45

టీ. ఘన......తాఁకునన్-ఘన = గొప్పదైన, సాంధ్యరాగ = సంజకెంజాయయను నట్టి, వినతాతనయగరుత్సమితి = వినతాసుతుండగు గరుడుని ఱెక్కల గుమిసంబంధమైన కడిఁది తాఁకునన్ = క్రూరమైన దెబ్బచే, ధరన్ = భూమియందు, వ్రాలిన = పడిన, గగనఫణిఫణామణి = ఆకాశమను సర్పముయొక్క పడగయందలి మాణిక్యము, అనన్ = అనునట్లుగా, రవిమండలము = సూర్యమండలము, పశ్చిమాంబుధిన్ = పడమటిసంద్రమున, క్రుంకెన్ = అస్తమించెను.

వి శే. గరుడుని తెక్కలెత్తినివాట సంజకెంజాయను గరుడపక్షములుగా నెన్నుట సరసము. గగనమును ఫణిగా రూపించుటనుబట్టి యియ్యది కృష్ణసర్పముగా నెన్నదగును. గరుడవిక్రమమూలకమగు భావికథాంశము సూచితము.

మ. మరుదీశద్విపదానశోభ శిఖిధూమ్యారోచిఁ గీనాశకా
సరదేహప్రభ *రాక్షసాసిలతికాంచద్దీధితి న్వారిధీ
శ్వరకేతుద్యుతి మాతరిశ్వహరిణచ్ఛాయన్ ధనాధ్యక్షునీ
లరుచిన్ ధూర్జటికంఠకాంతిఁ దమముల్ప్రాపించె దిగ్భిత్తులన్. 46

టీ. మరుదీశ...శోభన్-మరుదీశ = దేవేంద్రునియొక్క, ద్విప = ఏనుఁగైన యైరావతముయొక్క, దాన=మదముయొక్క, శోభన్ = కాంతివంటి కాంతితోడను, శిఖి...రోచిన్-శిఖి = అగ్నిహోత్రునియొక్క, ధూమ్యా = పొగగుంపుయొక్క, రోచిన్ = తేజస్సువంటి తేజస్సుతోడను, కీనాశకాసరదేహప్రభన్ = యముని యెనుపోతుయొక్క శరీరకాంతివంటి కాంతితోడను, రాక్షస...దీధితిన్-రాక్షస=నైరృతుని యొక్క, అసిలతికా=లతవంటి కత్తియొక్క, అంచత్=ఒప్పునట్టి, దీధితిన్=ప్రభవంటి ప్రభతోడను, వారిధీశ్వరకేతుద్యుతిన్ = వరుణునియొక్క టెక్కెముయొక్క శోభవంటి శోభతోడను, మాతరిశ్వహరిణచ్ఛాయన్ = వాయుదేవుని లేఁడియొక్క కాంతివంటి కాంతితోడను, ధనాధ్యక్షునీలరుచిన్ = కుబేరుని నీలముల ప్రభవంటి ప్రభతోడను, ధూర్జటికంఠకాంతిన్=ఈశానుని కుత్తుకశోభవంటి శోభతోడను, తమముల్= చీఁకట్లు, దిగ్భిత్తులన్=దిక్కులగోడలందు; అనఁగా దిక్తటములందనుట. ప్రాపించెను = వ్యాపించెను.

వి శే. అష్టదిక్కుల నాక్రమించినచీఁకటి యాయాదిగీశుల నల్లనివస్తువుల కాంతులుగాఁ గవి యూహించుట సరసము. యమవాహనము మహిషము. వాయువాహనము జింక. అలం. రత్నావళి.

మ. వనజశ్రీధనపశ్యతోహరుఁడు జీవంజీవజీవంబు ప
చ్చనివిల్కానికి మామ చల్వగని పశ్యత్ఫలజాటాగ్రమో
హనరత్నంబు సుధాకరుం డపుడు ప్రాగద్రిస్థలీవీథి నో
య్యనఁ దోతెంచె వియత్తటీకషణలీలానీతశంఖాకృతిన్. 47

టీ. వనజశ్రీ...హరుఁడు-వనజశ్రీ = పద్మములశోభయనెడు, ధన=ధనమునకు, పశ్యతోహరుఁడు = చూచుచుండఁగనే దొంగిలించువాఁడు, జీవంజీవజీవంబు = చకోర

* రాక్షసాళితిలకాం.

[illegible] ప్రాణమైనవాఁడు, పచ్చనివిల్కానికిన్=మన్మథునకు, మామ=మేనమామయు, [illegible]గని=శైత్యములకు గనియైనవాఁడు, పశ్యత్...రత్నంబు-పశ్యత్ఫాల = చూచునట్టి [illegible]గురుగలవాఁడగు నీశ్వరునియొక్క; అలికమున నేత్రముగలవాఁడుగాన నీశుఁడు పశ్య[త్ఫా]లుఁడయ్యె. జూటాగ్ర=జడలముడికొనయందు, మోహనరత్నంబు = సుందరమైన [illegible]మైనవాఁడు, సుధాకరుండు = చంద్రుఁడు; అమృతమునకు స్థానమైనవాఁడు. [అప్పుడు]=ఆసమయమున, వియత్తటీకషణ...కృతిన్-వియత్తటీ = గగనదేశనందు, కషణ [illegible]=ఒరయుటవిలాసముచే, ఆనీత=పొందింపఁబడిన, శంఖ=శంఖముయొక్క, ఆకృతిన్ = [ఆకా]రముతో, ప్రాగద్రిస్థలీవీథిన్ = తూరుపుకొండదేశమున, ఒయ్యనన్ = మెల్లఁగా, తోఁతెంచె=తోఁచెను; అగపడెను.

విశే. మన్మథుఁడు లక్ష్మీపుత్త్రుఁడు. లక్ష్మికిఁ జంద్రుఁడన్న. కావున, మన్మథునకుఁ [చ]ంద్రుఁడు మామయయ్యె.

క. ఆరాత్రి సత్యఁ గూడి ము
రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
భూరాజ్యసౌఖ్యనిద్రా
పారీణత నుండుచోఁ బ్రభాతం బయ్యెన్. 48

టీ. ఆరాత్రి=ఆరేయి, సత్యన్, కూడి, మురారి=శ్రీకృష్ణుఁడు, ముదంబు = సంతోషము, ఎసఁగన్=అతిశయింపఁగా, వైజయంతమునన్ = దేవేంద్రప్రాసాదమున, మనోభూరాజ్యసౌఖ్యనిద్రాపారీణతన్ = మన్మథరాజ్యసుఖనిద్రాపూర్తితో, ఉండుచోన్=ఉన్నచో, ప్రభాతంబు = ప్రాతఃకాలము, అయ్యెన్.

✓సీ. మొగుడుఁదమ్ములఁ జిక్కుమగ తేఁటియలుఁగులు
సడలిపోఁ జేయు విశల్యకరణి
కాలవశంబునఁ గడచన్న వాసర
శ్రీఁ గ్రమ్మఱించు సంజీవకరణి
రే యనువాలునఁ బాయ లైనరథాంగ
తతుల హత్తించు సంధానకరణి
తిమిరంబుచే సొంపు సమసిన దిశలకు
వన్నియ నొసఁగు సౌవర్ణ్యకరణి
తే. మించుబీఱెండయగ్నిఁ బుట్టించునరణి
కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి

తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగసరణిఁ
బ్రాఁజదువుమానికంబులబరణి తరణి. 49

టీ. మొగుడుఁదమ్ములన్ = ముకుళించినపద్మములందు, చిక్క = చిక్కికొన్న, మగతేఁటియలుఁగులు = కొదమతుమ్మెదలను బాణాగ్రములను, సడలిపోన్ = వదలిపోవునట్లుగా, చేయు = చేయునట్టి, విశల్యకరణి = విశల్యకరణియను నోషధీవిశేషము. (విశల్యకరణి=శల్యములను నిశ్శేషముగ నూడఁదీయునది.) విశల్యకరణియను నోషధివిశేషము శల్యములఁ బెఱికివేయుపగిదిని సూర్యుఁడు ముకుళించినపద్మములందుఁ జిక్కిన తేఁటులనుసడలించునని భావము. అనఁగా సూర్యోదయముకాఁగానే పద్మములువికసించుట సహజమగుట నపు డందున్న తేంట్లు వెలుపలికి వెడలునని తాత్పర్యము. కాలవశంబునన్ = కాలగతిచేతను, కడచన్న=నశించిన, వాసరశ్రీన్=దినలక్ష్మిని, క్రమ్మఱించు=మఱలించునట్టి; అనఁగా నుజ్జీవింపఁజేయునట్టి యనుట. సంజీవకరణి = సంజీవకరణియను నోషధివిశేషము. (సంజీవకరణి = మృతుని బునర్జీవితుంజేయునది), సంజీవకరణి చచ్చినవానిని దిరుగ బ్రతికించుపగిదిని సూర్యుఁడు గతించిన దినలక్ష్మిని దిరుగ నుజ్జీవింపఁజేయునని భావము. సూర్యుఁ డుదయింపఁగనే దినశోభ తేజరిల్లునని తాత్పర్యము. రే = రాత్రి, అను=అనెడు, వాలునన్=కత్తిచేత, పాయలు = చక్కలు, ఐన, రథాంగతతులన్ = చక్రవాకసమూహములను, హత్తించు = అంటఁజేయునట్టి, సంధానకరణి=సంధానకరణియను నోషధివిశేషము. (సంధానకరణి = విడినవానిం గలుపునది) సంధానకరణి విడినవానిని గలుపువిధమున సూర్యుఁడు రాత్రిని బాయలైన రథాంగములఁ గలుపునని భావము. అనఁగాఁ జక్రవాకములకు రాత్రి వియోగదాయక మగుటంజేసి రథాంగములను బాయలుగాఁ జేయువిషయమున రేయిని గత్తిగాను, నట్లు పాయలుగా నేర్పడినవి మఱల సూర్యోదయముకాఁగానే కలిసికొనుటంజేసి సూర్యుని సంధానకరణిగాను గవి పేర్కొనెనని గ్రహింపవలెను. తిమిరంబుచేన్ = చీఁకటిచేత, సొంపు = అందము, సమసిన = పోయిన, దిశలకున్=దిక్కులకు, వన్నియన్=శోభను, ఒసంగు = ఇచ్చునట్టి, సౌవర్ణకరణి=సౌవర్ణకరణియను నోషధివిశేషము. (సౌవర్ణకరణి = సువర్ణశోభను గలుగఁజేయునది.) సౌవర్ణకరణి పోయిన సువర్ణశోభను మరలఁ గల్గించుగతిని సూర్యుఁడు చీఁకటిచే నందముచెడినదిక్కులకు శోభను గల్గించెనని భావము. సూర్యుఁ డస్తంగతుఁడుగాఁ జీఁకటి వ్యాపించి దిశలశోభను దిరోహితమొనర్చెననియు, సూర్యుఁ డుదయింపఁగనే దిశ లెప్పటియట్లు శోభావంతము లయ్యెననియుఁ దాత్పర్యము. సూర్యుఁడు దిక్కులకు శోభను మఱలఁ గల్గించినకతన నాతనిని సౌవర్ణకరణిగాఁ గవి పేర్కొనెను. మించు = అతిశయించునట్టి, చిఱెండయగ్నిన్ = తీక్ష్ణాతపమనునగ్నిని, పుట్టించు=ఉద్భవింపఁజేయు,

యగ్ని=అగ్నిమంథనదారువు. అగ్నిని మథించుదారువునుండి యగ్ని యుద్భవిల్లుపగిదిని సూర్యునినుండి తీక్ష్ణాతప ముదయించెనని భావము. అగ్నింబోలు తీక్ష్ణాతపము సూర్యుని నుండి యుద్భవించునుగాన సూర్యుని మంథనదారువుగాఁ గవి పేర్కొనెను. కలుషఘోరపయోరాశిన్ = పాపమను భయంకరమైన సముద్రమును, కడపు = దాఁటించునట్టి, తరణి=ఓడ. ఓడ సముద్రమును దాఁటించి దరిఁజేర్చునట్లు సూర్యుఁడు పాపములనుండి మనుజుని విముక్తుంజేసి మోక్షపారముంజేర్చునని గ్రహించునది. దరిఁజేర్చువాఁడుగాన సూర్యుని నోడగాఁ గవి పేర్కొనెను. ప్రాఁజదువుమానికంబులబరణి = వేదములను మాణిక్యములకు బరణియగువాఁడు. అనఁగా వేదస్వరూపుఁడనుట. తరణి=సూర్యుఁడు, ప్రాచీమహీధరోత్తుంగశిరణిన్ = తూర్పుకొండయొక్క యెత్తైనత్రోవయందు, తోఁచెన్=అగపడెను; ఉదయించె ననుట.

వ్యా-విశే. ఇం దంత్యానుప్రాసనియమ మన్ని పాదములందును గననగును. అలం. ఒక్క-సూర్యుని యన్నివిధములుగ నెన్నుటంజేసి యుల్లేఖాలంకారము.

పారిజాతాపహరణము.

క. హరి యపుడు పారిజాతా
హరణోద్యోగమున నందనారామము ని
ర్భరగతిఁ జొచ్చె విహగవర
పరివృఢుపయి నెక్కి సత్యభామయుఁ దానున్. 50

టీ. హరి=శ్రీకృష్ణుఁడు, అపుడు=ఆసమయమున; సూర్యోదయకాలమున ననుట. సత్యభామయున్, తానున్, పారిజాతాహరణోద్యోగమునన్ - పారిజాత=పారిజాతవృక్షముయొక్క, ఆహరణ=హరించుటయందైన, ఉద్యోగమునన్ = ప్రయత్నముతో, విహగవరపరివృఢుపయిన్=పక్షిరాజగు గరుడునిమీఁద, ఎక్కి=అధిరోహించి, నందనారామమున్=నందనవనమును, నిర్భరగతిన్=పూర్ణమగుగతితో, చొచ్చెన్=ప్రవేశించెను.

చ. సకలసురైకవంద్యుఁ డగుచక్రధరుం డిదె నేఁడు దన్ను ను
ర్వికిఁ గొనిపోవ వచ్చె నని వెక్కస మైనమనఃప్రభూతకౌ
తుకమునఁ బోలె సంభ్రమముతో నటియించె నభీష్టవస్తుదా
యకతరుచక్రవర్తి యపు డాతతవాతవిధూతశాఖ మై. 51

టీ. సకలసురైకవంద్యుఁడగు = దేవతలెల్లరకు ముఖ్యముగ నమస్కరింపఁదగినవాఁడగు, చక్రధరుండు = చక్రముధరించు శ్రీకృష్ణుఁడు, ఇదె=ఇదిగో, నేఁడు=ఈదినమున, తన్నున్, ఉర్వికిన్=భూమికి, కొనిపోవన్=తీసికొనిపోవుటకు, వచ్చెన్, అని,

వెక్కసమైన=అధికమైన, మనః ప్రభూతకౌతుకమునఁబోలెన్=మది నుదయించిన సంత సము చేతవలెను, అభీష్టవస్తుదాయకతరుచక్రవర్తి=కోరినవస్తువులనిచ్చెడు వృక్షశ్రేష్ఠము, అపుడు=ఆసమయమున, ఆతతవాతవిధూతశాఖమై= విస్తారమైనగాలిచేఁ గదలునట్టి కొమ్మలుగలదై, సంభ్రమముతో, నటియించెన్=చలించెను.

భా. సురవంద్యుఁ డమ్మహాత్ముఁడు శ్రీకృష్ణుఁడు తన్ను భువికిఁ దీసికొనిపోవునను నధికసంతసమున నావృక్షరాజము నటించెనో యనునట్లు గాలిచేఁ గదలు కొమ్మలుగల్గి యుప్పెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

క. శౌరి యిదె పారిజాతముఁ
గోరికఁ గొని చనుచు మనలఁ గొనిపోఁడని లోఁ
గూరిననెవ్వగఁ దక్కిన
భూరుహములు మధురసాశ్రుపూరము నించెన్. 52

టీ. శౌరి=శ్రీకృష్ణుఁడు, ఇదె=ఇదిగో, పారిజాతమున్, కోరికన్=కాంక్షతో, కొని=స్వీకరించి, చనుచున్=పోవుచు, మనలన్, కొనిపోఁడు=తీసికొనిపోఁడు, అని, లోన్=మనస్సులో, కూరిన=కూడినట్టి, నెవ్వగన్=సంపూర్ణమైనదుఃఖముచే, తక్కిన భూరుహములు=తక్కినచెట్లు, మధురసాశ్రుపూరమున్=పూఁదేనెయను కన్నీటిప్రవాహమును, నించెన్=నిండించెను.

మ. సురలోకాభిమతప్రదానసమతాసూయన్బలెం గంసఘ
స్మరుఁ డత్యుద్ధతిఁ బారిజాతధరణీజాతంబు గోవర్ధనో
ద్ధరణప్రస్తుతమైనహస్తమున నుత్పాటించి లీలాగతిఁ
గరుడస్కంధముమీఁద నిల్పి నిలిపెం గౌతూహలంబింతికిన్. 53

టీ. కంసఘస్మరుఁడు=కంసహంతయగు శ్రీకృష్ణుఁడు, సుర...సూయన్బలెన్- సురలోక=దేవతలసమూహమునకు, అభిమత=కోరికలను, ప్రదాన = ఇచ్చుటయందైన, సమతా=సమత్వముచేతనైన; అనఁగాఁ దానును గల్పకమువలెనే దేవతలకు సర్వాభిమతములనొసంగువాఁడనుట. అసూయన్ బలెన్=ఈర్ష్యచేతవలెను, అత్యుద్ధతిన్=మిక్కిలి గర్వముతో, పారిజాతధరణీజాతంబున్ = పారిజాతభూరుహమును, గోవర్ధనోద్ధరణ ప్రస్తుతమైన=గోవర్ధనగిరినెత్తుటచే నుతింపఁబడునట్టి, హస్తమునన్ = చేతితో, ఉత్పాటించి=పెల్లగించి, లీలాగతిన్=సవిలాసముగా, గరుడస్కంధముమీఁదన్ = గరుడుని మూఁపుపై, నిల్పి=ఉంచి, ఇంతికిన్ = సత్యభామకు, కౌతూహలంబు = సంతోషము, నిలిపెన్=నెలకొల్పెను. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. జలరుహనాభుఁ డిట్లు రభసంబున నందనపారిజాతముం
బలిమిఁ బెకల్చి యెత్త విటపంబుల వ్రేలుదుకూలపల్లవం
బులు [1]వడిఁ బట్టి యీడ్చుఁ గొనిపోవఁగనీక పెనంగులీలఁ గ
ల్పలతిక లెల్ల వల్లభలు ప్రాణవిభుం బెడఁబాయ నేర్తురే. 54

టీ. జలరుహనాభుఁడు = పద్మము నాభియందుఁగల శ్రీకృష్ణుఁడు, ఇట్లు = ఈరీతిగా, రభసంబునన్ = వేగముతో, నందనపారిజాతమున్ = నందనవనమందలి కల్ప వృక్షమును, బలిమిన్ = బలముచే, పెకల్చి = పెల్లగించి, ఎత్తన్ = మీఁదికెత్తఁగా, కల్పలతిక లెల్లను = కల్పవృక్షపుఁదీఁగలన్నియు, విటపంబులన్ = శాఖలందు, వ్రేలు = వ్రేలాడు నట్టి, దుకూలపల్లవంబులు = పట్టుబట్టలరూపమైన చిగుళ్లను, వడిన్ = శీఘ్రముగ, పట్టి = పట్టుకొని, కొనిపోవఁగన్ = తీసికొనిపోవుటకు, ఈక = అవకాశమొసంగక, పెనంగులీలన్ = అడ్డగించువిధమున, ఈడ్చున్ = వెనుకకులాఁగెను. వల్లభలు = భార్యలు, ప్రాణవిభున్ = ప్రాణనాథుని (భర్తననుట), పెడఁబాయన్ = విడుచుటకు, నేర్తురే = చాలుదురా?

భా. శ్రీకృష్ణుఁడు పారిజాతమును పెల్లగించి పైకెత్త నావృక్షము నాశ్రయించి యల్లికొనియున్న తీఁగలన్నియు నందలి దుకూలపల్లవములం బిగియఁబట్టి వెనుకకీడ్చె ననియు, నట్లవి వెనుకకు లాఁగుట శ్రీకృష్ణుఁ డావృక్షమును దీసికొనిపోకుండ నడ్డ గించుటవలె నున్నదనియు, లోకమున భార్యలు ప్రాణనాథు నెడఁబాయఁజాలనట్లు లతి కలు కల్పనగమును దమనాథుని వీడఁజాలక యట్లొనర్చెననియు భావము.

విశే. లతికాశబ్ద స్త్రీలింగసారస్యము ననుసరించియుఁ, గల్పవృక్షశబ్ద పుంలింగ సారస్యమును గమనించియు, లతికాకల్పనగ సంబంధమును బరికించియు భార్యాభర్తృ భావమును గవి యూహించెనని గ్రహించునది. అలం. అర్థాంతరన్యాసము. ఉత్ప్రేక్ష.

చ. గరుడునితెక్కలం బొడము గాడ్పులసోఁకునఁ దక్కువేలుపుం
దరువులుఁ బెల్లగిల్లి గగనంబునఁ దోడన వెంట నంటి రా
నరిగెడుపారిజాత [2]హరణాచరణవ్యసనైకలోలు నా
హరిఁ గని యడ్డమై పలికి రచ్చటినందనపాలు రందఱున్. 55

టీ. గరుడునితెక్కలన్ = గరుడునితెక్కలనుండి, పొడము = పుట్టినట్టి, గాడ్పుల సోఁకునన్ = గాలులతాఁకుచే, తక్కువేలుపుందరువులున్ = మిగిలిన దేవవృక్షములును, అనఁగా "మందారము, పారిజాతము, హరిచందనము, సంతానము, కల్పవృక్షము" అను నైదింటిలో మొదటి నాల్గుననుట. పెల్లగిల్లి = పట్టువదలి, గగనంబునన్ = ఆకాశమున,

1 బిగఁబట్టి. 2 మహిజాహరణవ్యస.

తోడసన=తనతోడసె, వెంటన్, అంటి=అనుసరించి, రాన్=రాఁగా, అరిగెడు=చను నట్టి, పారిజాత...లోలున్-పారిజాత = కల్పవృక్షముయొక్క, హరణ = హరించుట యొక్క, ఆచరణ=చేయుటయనెడు, వ్యసన = కష్టకార్యమున, ఏక = ముఖ్యముగా, లోలున్=ఆసక్తుఁడైన, ఆహరిన్=ఆశ్రీకృష్ణుని, కని=చూచి, అచ్చటినందనపాలురు = అచ్చోఁగల నందనవనరక్షకులు, అందఱున్=ఎల్లరును, అడ్డమై, పలికిరి.

చ. తగునె యదుప్రవీర! యిటు ధార్త్యము నీవొనరించి యీమరు
 న్నగము హరించి వంచనఁ జనన్ దివిజాగ్రణి దీని నిచ్చె ద
 క్కుగ నిజకాంతకాకుసుమకోమలయాజ్ఞ భయంబునొందుఁ దేఁ
 టిగములు దీనిచెంగట నటింపను [1]పువ్వులతావిఁ గ్రోలఁగన్. 56

టీ. యదుప్రవీర = ఓయాదవవీరుఁడా!, ఇటు=ఈరీతిగ, నీవు, ధార్త్యమున్= ధూర్తత్వమును; దుండగమునసుట. ఒనరించి=చేసి, ఈమరున్నగమున్ = ఈదేవతరు వును, హరించి=దొంగిలించి, వంచనన్ = మోసముతో, చనన్ = పోవుట, తగునె = న్యాయమా?, దివిజాగ్రణి=దేవేంద్రుఁడు, దీనిన్=ఈపారిజాతమును, నిజకాంతకున్= తనభార్యయగు శచీదేవికి, దక్కుగన్ = స్వాధీనమగునట్లు, ఇచ్చెన్. ఆకుసుమకోమల యాజ్ఞన్=ఆపూఁబోఁడియాజ్ఞచే, తేఁటిగములు=భ్రమరబృందములు, దీనిచెంగటన్= ఈవృక్షసమీపమున, నటింపను = తిరుగుటకును, పువ్వులతావిన్ = పుష్పపరిమళమును, గ్రోలఁగన్=అనుభవించుటకును, భయంబున్=భీతిని; వెఱపునసుట. ఒందున్=పొందును.

విశే. ఈపద్యము కొన్నిప్రతులలోఁ గానవచ్చెడినని భారతి వ్రాయుచున్నది. కానఁ దదనుసారముగ వ్యాఖ్యవ్రాయఁబడినది.

*క. అట్టిసురతరువు నెఱుఁగక
 చుట్టపుమేలమునఁ గొంచు సుఁరిగెడుమది నీ
 కెట్టు జనియించె మరలం
 బెట్టుము బలభేది విన్న మేలే నీకున్. 57

టీ. అట్టి సురతరువున్ = అరీతినున్న కల్పవృక్షమున్; అనఁగా దేవేంద్రుఁడు తనభార్యకిచ్చినట్టియు, నామెయాజ్ఞచేఁ దేఁటిగుంపులుకూడఁ జేరనరుగనట్టియుం ననుట. ఎఱుఁగక=తెలిసికొనక; తెలివిమాలి యనుట. చుట్టపుమేలమునన్ = బంధుహాస్యముచే, కొంచున్ = స్వీకరించుచు, సురిఁగెడు = మాయమయ్యెడు, మది = మనస్సు, నీకున్, ఎట్టు = ఏలాఁగున, జనియించెన్ = పుట్టెను?, మరలన్=తిరుగ, పెట్టుము=స్థాపింపుము.

---

1 నిందులతావిఁ. * ఈపద్యము కొన్నిప్రతులలోఁ గనఁబడదు.

౦ల భేది=దేవేంద్రుఁడు, విన్నన్ = వినినచో, నీకున్, మేలే=మేలా ? నీకు మేలు లేదనుట.

ఉ. నా విని సత్యభామ వదనంబున లేనగ వంకురింప నే
మే వచియింపఁ బూనుహృదయేశ్వరునిం గరసంజ్ఞ మాన్చి చ
న్నోవల జాఱుకొంగు సవరించుచు వీడినకొప్పుఁ బల్మఱుం
జే వెడదోఁపుచుం బలికెఁ జెంగొవచూపులు క్రేళ్లు దాఁటఁగన్. 58

టీ. నాన్=అనఁగా, విని, సత్యభామ, వదనంబునన్ = మోమున, లేనగవు = మందహాసము, అంకురింపన్=పుట్టఁగా, ఏమేన్=ఏదోనొకదాని, వచియింపన్=పల్కుటకు, పూను=సిద్ధమైన, హృదయేశ్వరునిన్ = ప్రాణనాథుని; శ్రీకృష్ణుని, కరసంజ్ఞన్= హస్తసంజ్ఞచే, మాన్చి=మానునట్లు చేసి; అనఁగా మాటలాడకుండనొనర్చియనుట. చన్నోవలన్ = స్తనపార్శ్వములందు, జాఱు=సడలునట్టి, కొంగున్=చెఱఁగును, సవరించుచున్ =చక్కదిద్దికొంచు, వీడినకొప్పున్ =సడలినకొప్పును, బల్మఱున్ = మాటిమాటికి, చేన్= హస్తముతో, వెడదోఁపుచున్=ఇంచుకదిద్దికొనుచు, చెంగొవచూపులు=ఎఱ్ఱనిచూపులు, క్రేళ్లుదాఁటఁగన్=గంతులువేయుచుండఁగా, పలికెన్.

విశే. చన్గొంగును సవరించుకొనుట వీడినకొప్పును వెడదోఁపుకొనుటయు బదులు పల్కుటయందలి సంభ్రమము నుద్ధతిని బ్రకటించుచున్నవి. చెంగొవచూపులు కోపాతిశయసూచకములు. శ్రీకృష్ణుని మాటలాడనీయక తానే యుద్యానపాలకులతోఁ బ్రసంగించుట కుద్యమించుటకతన సత్య దిట్టతనమును గర్వమును బ్రకాశితము లయ్యెను.

సీ. వినుఁడు సురేశ్వరువనపాలకులు! వార్ధిఁ
బొడమినయీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు
తొడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె [1]నతఁడె చేకొనుఁగాక
[2]తెకతేర యిది యేమి యొకరిసొమ్మె
యిదె నాదువిభునిచే నీవదాన్యనగంబు
నొడియించికొని యేగుచున్నదానఁ
తే. బలుకు లేటికిఁ దా వీరపత్ని యేని
మీ శచీదేవి తనదుప్రాణేశుఁడైన

1 నతఁ డిచ్చఁగొనుఁగాక. 2 తెకతెక.

మఘువు నిటఁ బంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుటె పో వాసితనము. 59

టీ. సురేశ్వరువనపాలకులు=ఓ దేవేంద్రుని యుద్యానమును రక్షించెడువారలార!, వినుఁడు=ఆలకింపుఁడు, వార్ధిన్=సముద్రమున, పొడమిన = పుట్టిన, ఈదివ్యభూరుహము నకున్ = ఈసురతరువునకు, ఇంద్రాణి = ఇంద్రునిభార్యశచి, ఎవ్వతె?, ఇంద్రుండున్, ఎవ్వఁడు? శచికిఁగాని యింద్రునకుఁగాని యిం దధికార మేమికలదనుట. తోడియిందిరను= ఈకల్పవృక్షముతోడఁబుట్టినలక్ష్మిని, కౌస్తుభమున్ = కౌస్తుభమాణిక్యమును, ఎవ్వఁడు = ఏ శ్రీకృష్ణుఁడు, అధిపుఁడై=ప్రభువై; స్వామియై, ధరియించెన్ = తాల్చెనో, అతఁడె= ఆ శ్రీకృష్ణుఁడె, చేకొనున్ + కాక = స్వీకరించుఁగాక. ఈకల్పకముతోడఁ జనించినలక్ష్మిని గౌస్తుభమణి నెవం డు స్వామియై గ్రహించె నాతఁడే యీకల్పకమునుగూడఁ జేకొన నర్హుఁడని భావము. తెకతేర=అచ్చముగా, ఇది=ఈకల్పకము, ఒకరిసొమ్మె+ఏమి=ఒకరి ధనమా? ఇదె=ఇదిగో, నాదువిభునుచేన్ = నాస్వామిచేత, ఈవదాన్యనగంబున్ = ఈయీవులవృక్షమును, ఒడియించికొని=హరించికొని, ఏగుచున్నదానన్ = పోవుచున్న దానను, పలుకులు=మాటలు, ఏటికిన్=ఎందులకు? మీశచీదేవి=మీయింద్రునిభార్యయైన శచీదేవి, తాను, పీరపత్నియేని = పీరుఁడు భర్తగాఁగలదైనచో, తనదుప్రాణేశుఁడైన = తనప్రాణనాథుఁడైన, మఘువున్=దేవేంద్రుని, ఇటన్=ఇచ్చటికి, పంపి=పంపించి, సత్య భామావిధేయువలనన్ = సత్యభామకువిధేయుఁడైన కృష్ణునివలన, మరలంగన్ =తిరుగ, కొనుటె=స్వీకరించుటె, వాసితనము పో=పౌరుషము సుమ్ము.

వ్యా-విశే. నావిభునిచే నేను హరించికొనిపోవుచుంటిననుటయు, సత్యభామా విధేయుఁడని శ్రీకృష్ణుని తనచేత నున్నవానినిగాఁబల్కుటయు, సత్యకు మగనిపైఁగల స్వాతంత్ర్యమును సూచించుచున్నవి. తక్కుంగలయుక్తులు గర్వాతిశయప్రకాశకములు. వినుఁడు సురేశ్వరువనపాలకులు:—ఇచ్చో "మధ్యమపురుషయోగంబునం దారగా గమంబు విభాషనగు" అనుపద్ధతి ననుసరించి 'వినుఁడు' అను మధ్యమపురుష క్రియా యోగము వనపాలకులను సంబుద్ధికిఁ గలుగుటంజేసి వనపాలకులను సంబుద్ధి కారగా గమంబు గలుగదయ్యెను. రూ. అ. వినుఁడు వనపాలకులార!

క. అని పలికినగర్వోక్తులు, విని వనపాలకులు చాల విస్మితు లగుచుం
జని చెప్పిరంతయును ద్వారనిమిషపతికిం బులోమజాన్వితునకున్.

— యుద్ధోద్యోగము. —

టీ. అని, పలికిన=ఆడిన, గర్వోక్తులు=గర్వముతోఁగూడిన మాటలు, విని, వన పాలకులు = ఉద్యానరక్షకులు, చాల, విస్మితులు=ఆశ్చర్యమునందినవారు, అగుచున్,

తారు=వారు, చని=పోయి, అంతయుఁ = జరిగినదెల్లను, పులోమజాన్వితునకుఁ = శచీదేవితోఁ గూడియున్న వానికి, అనిమిషపతికిఁ=దేవేంద్రునకు, చెప్పిరి.

విశే. సత్యమాటలనుండియె గర్వ ముట్టిపడుచుండుటంబట్టి గర్వము సుప్రకాశితము. ఆఁడుది దిట్టతనమువహించి భయమువీడి యింద్రునిఁజనిగూర్చి సరకుసేయక తమయెదుట నట్లు పల్కినందులకు వారాశ్చర్యమునొందిరని యెన్నవలయును. పులోమజాన్వితునిగా నింద్రునిఁజేర్కొనుట శచీసమక్షమునఁ బరిభవమునందె సురపతి యతిక్రోధమునందుటకై యని యెన్నఁదగును.

శా. ఆమాట ల్విని పాకశాసనుఁడు రౌద్రాకారుఁ డై పేర్చి యే
మేమీ కృష్ణుఁడు *మందలోఁబలెనె తానింద్రద్రుమోత్పాటనం
బీమై నిచ్చటఁ జూపవచ్చె నిది మేలే తార్క్ష్యుఁ డైన న్మదీ
యామోఘాశనిపాత మిట్టిదని యాహా తెల్పఁడాయెం జుమీ. 61

టీ. ఆమాటలు=ఆసత్యభామ పల్కినట్లుగాఁ జెప్పినపల్కులు, విని, పాకశాసనుఁడు=పాకాసురశిక్షకుఁ డగుదేవేంద్రుఁడు; ఇది శూరత్వసూచకము. రౌద్రాకారుఁడై; మూర్తీభవించిన రౌద్రమువలె నున్నవాఁడనుట. పేర్చి = అతిశయించి, ఏమేమీ— ఏమి+ఏమీ; ఇది పల్కుల నాలకించినపిదప గలసంభ్రమమును సూచించును. కృష్ణుఁడు, మందలోఁబలెనె = ఆలమందలోపలెనె, తాను, ఇంద్రద్రుమోత్పాటనంబుఁ = కల్పవృక్షముయొక్క పెల్లగించుటను; ఇంద్రద్రుమమన మద్దిచెట్టుగాన నర్జునవృక్షముయొక్క పెల్లగించుటనియుం నర్థాంతరము. ఈమైఁ = ఈవిధముగా, ఇచ్చటఁ, చూపఁ = అగపఱచుటకు, వచ్చెఁ, ఇది=ఈకృత్యము, మేలే=మంచిదా? తార్క్ష్యుఁడైనఁ=గరుడుఁడైనను, మదీయా... పాతము-మదీయ = నాసంబంధమైన, అమోఘు= వ్యర్థముగాని, అశని=వజ్రాయుధముయొక్క, పాతముఁ=దెబ్బ, ఇట్టిది=ఈవిధమైనది, అని, తెల్పఁడాయెఁ+చుమీ=తెల్పలేదుసుమ్మీ? ఆహా=ఆశ్చర్యము.

భా. శ్రీకృష్ణుఁ డాలమందలో నింద్రద్రుమమును బెల్లగించుటవలె నిందును నింద్రద్రుమోత్పాటనమును జేయనే తెంచెను. ఇది సుకరమా? తనకు మేలుగలుగఁ జేయునా? ఇక్కార్యమునఁ గొంకవలయుఁబాల్గొనిన యాగరుడుఁడేని తనస్వామితో నా వజ్రాయుధపుదెబ్బ యిట్టిదని తెల్పఁడాయెఁగదా? ఆశ్చర్యము.

విశే. నిక్కముగ నివి యిట యింద్రునిగర్వోక్తులని యెన్నఁదగును. యమళార్జునభంజనమును శ్రీకృష్ణుఁ డొనర్చెను. అర్జునవృక్షమున కనఁగా మద్దికి సురద్రుమమనియు నామాంతరము. కాన నింద్రద్రుమోత్పాటనంబనుచో శ్లేషము.

* మందలోనబలె.

మ. అని పౌలోమిమొగంబుఁ జూచి వినుమో యబ్జాస్య! నీకింతమా
త్రన విన్నంబడ నేల పోదు నిదె సత్యాగర్వభారంబు ది
వ్యనగంబు న్విడిపించి వత్తు నని సాహంకారుఁడై లేచి చ
య్యన శుద్ధాంతగృహంబు వెల్వడి సుధర్మాస్థానమధ్యస్థుఁడై. 62

టీ. అని, పౌలోమిమొగంబున్ = శచీదేవిమోమును, చూచి, ఓయబ్జాస్య= ఓపద్మముఖీ, వినుము. నీకున్, ఇంతమాత్రన = ఇంతమాత్రముచేతనే, విన్నంబడన్= దైన్యమునుబొందుట, ఏల=ఎందులకు? ఇదె=ఇదిగో, పోదున్=వెళ్లెదను, సత్యాగర్వ భారంబున్ = సత్యభామయొక్క గర్వసంబంధమైనబరువును, దివ్యనగంబున్ = సుర తరువును, విడిపించి=వదలించి, వత్తును=వచ్చెదను, అని, సాహంకారుఁడై = అహంకార ముతోఁ గూడినవాఁడై, లేచి, చయ్యనన్=శీఘ్రముగా, శుద్ధాంతగృహంబున్=అంతః పురమునుండి, వెల్వడి = వెడలివచ్చి, సుధర్మాస్థానమధ్యస్థుఁడై = సుధర్మయను కొలువు కూటముయొక్క నడుమ నున్నవాఁడై, ముందటి పద్యమునందలి 'పట్టినన్' అనుదాని తోడ నన్వయము.

ఉ. తానఁటె పారిజాతవసుధారుహముం గొనిపోవువాఁడు క
న్గానఁడు యాదవుండనుచుఁ గన్నులు వేయును జేవురింప వై
శ్వానరధర్మదైత్యవరవారిధిపానిలయక్షనాయకే
శానులదిక్కు చూచి కులిశంబు కరంబునఁ బూఁచి పట్టినన్. 63

టీ. తానఁటె=తానా? ఇది యింద్రుని యలక్ష్యభావమును సూచించును. పారిజాత వసుధారుహమున్=పారిజాత భూరుహమును, కొనిపోవువాఁడు = తీసికొని పోవువాఁడు, యాదవుండు = యదువంశోద్భవుఁడు; శ్రీకృష్ణుఁడు, ఇది కులహీన సూచకము. కన్గానఁడు=కన్నుఁ దెలియనివాఁడు; మదాంధుఁడనుట. అనుచున్, కన్నులు, వేయును=సహస్రమును, చేవురింపన్=ఎఱ్ఱవారఁగా, వైశ్వానర...దిక్కు-వైశ్వానర= అగ్నిదేవుఁడు, ధర్మ = యముఁడు, దైత్యవర = నిరృతి, వారిధిప=వరుణుఁడు, అనిల= వాయుదేవుఁడు, యక్షనాయక = కుబేరుఁడు, ఈశాన=ఈశానుఁడు, వీరలయొక్క, దిక్కు=వైపు, చూచి, కులిశంబున్ = వజ్రాయుధమును, కరంబునన్ = హస్తమున, పూఁచి=పూని, పట్టినన్=ధరింపఁగా, ముందటిపద్యముతో నన్వయము.

విశే. యుద్ధము సేయఁదలంచినవాఁడుగాన నింద్రుఁ డాస్థానముం జేరి యష్టదిక్పా లుల సమ్మతినందుట యుచితమే.

ఉ. కోణపరంపరాహతులఁ గూరినవేదననో సమస్తని
ర్మాణభృతిప్రణాశకరు మాధవునిం జెనకంగఁ బోవుగీ
ర్వాణులఁ బోకుఁ డంచు మొఱవైచెనొకోయన మ్రోసెనంత ని
స్సాణము పాకశాసనుహజారమునం గదనాభిశంసి యై. 64

టీ. కోణపరంపరాహతులన్=వాద్యవిశేషములను గొట్టునట్టికఱ్ఱల గుమియొక్క దెబ్బలచేతను, కూరిన=పొందిన, వేదననో-వేదనన్+ఓ=బాధచేతనో, సమస్త...... కరున్-సమస్త=స్థావరజంగమరూపమైన సర్వపదార్థములయొక్క, నిర్మాణ = సృష్టిని, భృతి=పోషణమును, ప్రణాశ=వినాశమును, కరున్=చేయువానిని, మాధవునిన్=శ్రీకృష్ణుని, చెనకంగన్=తాఁకుటకు, పోవు=ఏగునట్టి, గీర్వాణులన్=దేవతలను, పోకుఁడు=వెళ్లవలదు, అంచున్=అనుచు, మొఱవైచెనొకోయనన్ = మొఱ్ఱపెట్టెనోయనునట్లు, అంతన్=ఆసమయమున, నిస్సాణము=భేరి; యుద్ధమునకేగుటకుఁ బూర్వము మ్రోగించు జయభేరి యనుట. పాకశాసనుహజారమునన్=దేవేంద్రుని యింటిముందర, కదనాభిశంసియై=యుద్ధసూచకమై; యుద్ధమును నిందించునదైయనియు నర్థాంతరము. మ్రోసెన్=శబ్దించెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. అపుడాబద్ధఖలీనకాశ్వచయమై యందూపరిభ్రంశిత
ద్విపమై దివ్యరథాగ్రకేతుపటసంధిత్సామిళత్సూతమై
యపరాభూతభుజావలేపభటవీరాలాపమై జంభవై
రిపురం బంతయు మందరక్షుభితవార్ధింబోలె ఘూర్ణిల్లుచున్. 65

టీ. అపుడు=ఆసమయమున, ఆబద్ధ......చయమై-ఆబద్ధ=కట్టఁబడిన, ఖలీనక=కళ్లెములుగల, అశ్వచయమై=గుఱ్ఱములగుంపుగలదై, అందూ......ద్విపమై-అందూ=గొలుసులనుండి, పరిభ్రంశిత=విడువఁబడిన, ద్విపమై=ఏనుఁగులుగలదై, దివ్య......సూతమై-దివ్యరథాగ్ర=సురరథములకొనలందు, కేతుపట = టెక్కెములను, సంధిత్సా = కూర్పవలెననుకోర్కెతో, మిళత్=చేరిన, సూతమై=సారథులుగలదై, అపరాభూత... ఆలాపమై-అపరాభూత=జయింపఁబడని, భుజావలేప = భుజముల గర్వముగల, భట = యుద్ధభటులయొక్క, వీరాలాపమై = శూరోక్తులుగలదై, జంభవైరిపురంబు+అంతయున్=ఇంద్రుని యమరావతియెల్లను, ఘూర్ణిల్లుచున్ = ధ్వనించుచు, మందరక్షుభిత వార్ధిన్=మందరపర్వతముచేఁ గలఁతనందింపఁబడిన సముద్రమును, పోలెన్=అనుకరించెను. అలం. ఉపమ.

ఉ. నీయనుజన్ముఁడ న్సఖుఁడ నీకని యింటికి వచ్చి జంభదై
తేయవిరోధిచే నపుడు తేజము లన్నియుఁ గాంచి చేసె న

న్యాయము పారిజాతహరణంబునఁ గృష్ణుఁడు మంచిచుట్ట మౌ
రా యని పల్కఁగా జనపరంపరచే విని రెల్లవారలున్. 66

టీ. నీయనుజన్ముఁడన్ =నీతమ్ముఁడను, సఖుఁడన్ =మిత్రుఁడను, నీకున్+అని = నీకౌ అకైయని, యింటికిన్ =గృహమునకు, వచ్చి, జంభదైతేయవిరోధిచేన్ = జంభవైరి యగు నింద్రునిచే, అపుడు=అవచ్చినసమయమున, తేజములు=ప్రాభవములు, అన్నియున్ =ఎల్లయును, కాంచి = పొంది. (అనఁగా నింద్రకృతములగు మర్యాదలనెల్ల పొందియనుట.) కృష్ణుఁడు, అన్యాయమున్ = అధర్మమును, పారిజాతహరణంబునన్ = కల్పవృక్షహారణముచే, చేసెన్ = ఒనర్చెను. ఔరా=ఆశ్చర్యము. మంచిచుట్టము = మేలైనబంధువే, అని, పల్కఁగాన్, జనపరంపరచే=జనసమూహముచే, ఎల్లవారలున్, వినిరి.

వ. అత్తఱిం దత్తఱంబునం దత్తడులం బల్లింపకయ నెప్పరంబున నెక్కం బోవువారును, గృష్ణుండు కృష్ణుఁడని పొనగపున్యంబుగాఁ బలుకుచు నేమేమి యెక్కడెక్కడ నని యడుగువారికిఁ దెలివిపడ నుడువం దడవు లేక పారిజాతంబు పారిజాతం బని పలుకుచు రణసంభ్రమంబునం బరిభ్రమించువారును, గణయకంపణముసలముద్గరపరిఘుపరశ్వథంబులనియెడు బహువిధప్రహరణాహరణవిపర్యాసంబున శస్త్రశాలాంతరంబునం గలహించువారును, మరుదధిప మలినపథ మహిషరథ మాంసాశన మకరాకరేశ మాతరిశ్వ మనుష్యధర్మ మహేశ్వరులకు మానవుం డీ డగు నే యని యనువారును, గత్తు లంకించువారును, రిత్త జంకించువారును, సంగడీలం జీరువారును, సంగరభీరులం గేరువారును, వాహనంబులఁ దఱుమువారును, సాహసంబుల నఱుమువారును నై వీరావేశంబున రాజద్వారంబునం దొట్టి రయ్యవసరంబున. 67

వ. అత్తఱిన్ =ఆసమయమున, తత్తఱంబునన్ =సంభ్రమముతో, తత్తడులన్ = గుఱ్ఱములను, పల్లింపకయ=జీనుకట్టకుండనే, నెప్పరంబునన్ =శీఘ్రముగ, ఎక్కన్ =అధిరోహించుటకు, పోవువారును=వెడలువారును, కృష్ణుండు, కృష్ణుఁడు+అని, పొనగపున్యంబుగాన్ =దిరుగఁ దిరుగనగునట్లు, పలుకుచున్, ఏమేమి? ఎక్కడ? ఎక్కడ?ఎక్కడ నేమి జరిగెననుట. అని, అడుగువారికిన్, తెలివిపడన్ =తెలియునట్లు, నుడువన్ =చెప్పుటకు, తడవు=అవకాశము, లేక, పారిజాతంబు, పారిజాతంబు, అని, పలుకుచున్, రణసంభ్రమంబునన్ =యుద్ధపుఁదర్వరచే, పరిభ్రమించువారును=తిరుగువారును, కణయ... పరశ్వథంబులు-కణయ=కుంతవిశేషము, కంపణ=ప్రవరణవిశేషము, ముసల = రోఁకలి,

ముద్గర=ఇనుపగుదియ, పరిఘు=ఇనుపకట్లగుదియ, పరశ్వథంబులు = గండ్రగొడ్డలి, అని యెడు=అనునట్టి, బహువిధ......విపర్యాసంబునన్-బహువిధ = అనేకవిధములైన, ప్రహరణ=ఆయుధములయొక్క, ఆహరణ = తీసికొనుటయందలి, విపర్యాసంబునన్ = తారుమారుచే, (వ్యత్యాసముచేననుట. అనఁగా నొకరు గ్రహింపవలసినదాని నొండొకరు గ్రహించుటచేనని భావము.) శస్త్రశాలాంతరంబునన్ = ఆయుధగృహమధ్యమున, కల హించువారును, మరుదధిప......మహేశ్వరులకున్-మరుదధిప=దేవేంద్రుఁడు, మలిన పథ=కృష్ణవర్త్మ; అగ్ని, మహిషరథ=ఎనుపోతు రథముగాఁగల యముఁడు, మాంసాశన= మాంసముభోజనముగాఁగల నిరృతి, మకరాకరేశ = సముద్రాధిపతియగు వరుణుఁడు, మాతరిశ్వ=వాయువు, మనుష్యధర్మ=కుబేరుఁడు, మహేశ్వర = ఈశానుఁడు, వీరలకు, మానవుండు=మనుష్యుఁడు, ఈఁడు=సాటి, అగునే, అనియనువారును, దిక్పతులను మకా రాదిపదములతో వ్యవహరించుట సరసము. కత్తులు=ఖడ్గములను, అంకించువారును = జళిపించువారును, రిత్త=పట్టి, జంకించువారును=భయపెట్టువారును, సంగడీలన్=మిత్రు లను, చీరువారును=పిలుచువారును, సంగరభీరులన్=యుద్ధమునకు భయపడువారలను, కేరువారును=తిరస్కరించువారును, వాహనంబులన్=గుఱ్ఱములు మొదలైనతామెక్కిన వానిని, తఱుమువారును = త్వరగాఁదోలువారును, సాహసంబులన్ = తెంపరితన ములచేత, అఱుమువారును = విజృంభించువారును, ఐ, వీరావేశంబునన్ = వీరుల యావేశముతో, రాజద్వారంబునన్ = రాజగృహద్వారదేశమున, తొట్టిరి = కూడిరి, అయ్యవసరంబునన్.

విశే. ఇందు యోధులచర్యలం సహజముగ వర్ణితములు.

ఇదిమొదలుకొని డెబ్బదిరెండవపద్యమువఱకు నమంగళసూచకములగు కొన్ని కృత్యములు వర్ణితములు.

తే. గలితశృంఖల లయ్యు న కాలనిద్ర
గనుఁగవలఁ గ్రాలఁ దమయంతఁ గదలవయ్యె
దారుణాధోరణప్రయత్నమునఁ గాని
నముచిమథనునివీట శుండాలఘటలు. 68

టీ. నముచిమథనునివీటన్=నముచిశాసకుఁడగు దేవేంద్రుని నగరమున, శుండాల ఘటలు=ఏనుఁగుల గుంపులు, గలితశృంఖలలు=జార్పఁబడిన గొలుసులుఁగలవి, అయ్యున్= అయినను, అకాలనిద్ర=కాలముగాని కాలమునగల్గిననిద్ర, కనుఁగవలన్=నేత్రద్వంద్వ ములందు, క్రాలన్=ప్రకాశింపఁగా, దారుణ...యత్నమునన్+కాని-దారుణ=క్రూర

మైన, ఆధోరణ = మావటివానియొక్క, ప్రయత్నమునన్ కాని=యత్నముచేతఁగాని; అనఁగా మావటీఁ డంకుశముచేఁ గఠినముగఁబొడిచి బాధింపకున్న ననుట. తమయంతన్ = స్వయముగా, కదలవయ్యెన్.

క. పోరిఁబోరి నెగయుచు ప్రెుగ్గుచు
ధరణీస్థలిఁ బొరలఁబడుచుఁ దలకొని శిక్షం
బొరసిన వయ్యు హయంబులు
భరియింపవు కొంతతడవు పల్యాణంబుల్. 69

టీ. పోరిఁబోరిన్=మాటిమాటికి, ఎగయుచున్ = ఎగురుచు, ప్రెుగ్గుచున్ = వ్రాలుచు, ధరణీస్థలిన్, పొరలన్+పడుచున్=తలక్రిందుగాదొర్లుచు, తలకొని=పూని, శిక్షన్=దండనమును, పొరసినవి=పొందినవి, అయ్యున్=అయినను; అనఁగాఁ క్రమశిక్షితపూర్వము పొందిన వైననుట. హయంబులు=గుఱ్ఱములు, కొంతతడవు=కొంతసేపు, పల్యాణంబుల్=జీనులను, భరియింపవు=ధరింపవు.

ఉ. డాసి పురోహరిన్మణివిటంకమునం దనమేనినీడ ను
ల్కాసమదృష్టిఁ జూచి కినుకం బ్రతివీరుఁడ యంచు వ్రేసి బా
హాసి విభిన్నమై పడఁ దదర్థముఁ జేకొని వచ్చెఁ గల్పవృ
క్షాసవపానమత్తుఁ డమృతాంధసుఁ డొక్కఁడు జన్యకేలికిన్. 70

టీ. కల్పవృక్షాసవపానమత్తుఁడు=కల్పవృక్షసంబంధమైన మద్యముయొక్క త్రావుటచే మదించినవాఁడగు, ఒక్కఁడు, అమృతాంధసుఁడు=అమృతమే యాహారముగాఁగల యమరుఁడు, డాసి=సమీపించి, పురో......విటంకమునన్=పురః=ఎదుటనున్న, హరిన్మణి=ఇంద్రనీలమణిబద్ధమైన, విటంకమునన్=గువ్వగూడునందు, తనమేనినీడన్=తన శరీరముయొక్క ప్రతిబింబమును, ఉల్కాసమదృష్టిన్=కొఱవితోసమానమైనచూపులో; అనఁగాఁ గోపారుణమైనచూపుతోననుట. చూచి, కినుకన్ = కోపములో, ప్రతివీరుఁడ=తన్నెదిరించువాఁడనె, అంచున్, వ్రేసి=కొట్టి, బాహాసి = చేతఁగలకత్తి, విభిన్నమై=ముక్కలైనదై, పడన్=జాఱఁగా, తదర్థమున్ = ఆకత్తియొక్క సంగోరుముక్కను, చేకొని=స్వీకరించి, జన్యకేళికిన్=యుద్ధక్రీడకు, వచ్చెన్=ఏతెంచెను.

భా. ఒకయమరుఁడు కల్పవృక్షమద్యముచే మదించి యెదుటనున్న యింద్రనీల విటంకమునఁ బ్రతిఫలించిన తనప్రతిబింబముంగాంచి తన్నెదిరించు ప్రతివీరుఁడని బ్రమసి చేతనున్న కత్తితోఁ గొట్టి యాకత్తి యక్కతన రెండుముక్కలుగాగ నద్దాని సంగోరు ముక్కనుజేఁకొని యుద్ధమున కేతెంచెనని భావము.

విశే. ఇందుత్సాహము లెస్సగ సూచితము. మఱియుఁ గత్తి ముక్కలగుట యుద్ధాపజయరూపావశకున సూచకము. అలం. భ్రాంతిమంతము.

తే. కారణము లేక యూరకె నారి దెగిన
విడిచిపెట్టక రణరసావేశ మొదవఁ
బట్టి కోదండదండంబు పరిఘు గాఁగ
విసరుచును వచ్చె వేఱొండు వేల్పుజోదు. 71

టీ. వేఱొండు=మఱియొక, వేల్పుజోదు = సురయోధుఁడు, కారణములేక = హేతువులేకయే, ఊరకె, నారి=అల్లెత్రాడు, తెగినన్=భిన్నమైనను, విడిచిపెట్టక=పరిత్యజింపక, కోదండదండంబు కర్త. రణరసావేశము=జన్యోత్సాహము, ఒదవన్=పుట్టఁగా కోదండదండంబున్=ధనుర్దండమును, పట్టి=పూని, పరిఘుగాఁగన్=గుదియయగునట్లుగా, విసరుచున్=చిమ్ముచు, వచ్చెన్=ఏతెంచెను.

భా. కారణములేకయె యల్లెత్రాడు త్రెగఁగా నొకవేల్పుజోదు కోదండదండమునే గదవలెఁ జేఁబూని విసరుచు జన్యమునకు వచ్చెనని భావము.

వ్యా-విశే. కారణములేకయె నారితెగుట యపశకున సూచకము. జోదు; యోధశబ్దభవము.

క. గొనయంబు [1]నెక్కఁ ద్రోచిన
గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మినతమకం
బున విల్లు విడిచి వేఱొక
యనిమిషభటుఁ డనికి వెడలె నడిదముఁ గొనుచున్. 72

టీ. గొనయంబున్=అల్లెత్రాటిని; నారిననుట. ఎక్కన్ = మీఁదికెగయునట్లు, త్రోచినన్=త్రోసినను, గనయంబునకున్=వింటికొప్పునకు, ఎక్కకున్నన్ = ఎక్కక పోఁగా, క్రమ్మిన=మూఁగిన, తమకంబునన్=త్వరచే, విల్లున్=ధనువును, విడిచి, వేఱొక యనిమిషభటుఁడు=మఱియొకసురభటుఁడు, అడిదమున్=కత్తిని, కొనుచున్ = స్వీకరించుచు, అనికిన్=యుద్ధమునకు, వెడలెన్=బయలుదేరెను.

వ్యా-విశే. గొనయము గనయమున కెక్కకుంట యపశకునము. గొనయము. ప్ర. గుణము.

ఉ. పట్టఁదలంచెనేని [2]కరపద్మయుగంబు వశంబు గాక లోఁ
బుట్టినబాష్పగద్గదికఁ బోకు మనం బలు కెత్తలేక పైఁ

1 కొంతఁ... కెక్కకున్నఁ. 2 పదపద్మయుగంబు.

జుట్టిన నెయ్యపుంబదనుచూపులచే సతి వెంట నంటి త
న్బట్టఁగఁబట్టఁగా నొకసుపర్వుఁడు వచ్చె రణాభిలాషి యై. 73

టీ. ఒకసుపర్వుఁడు=ఒకయమరుఁడు, పట్టన్=పట్టుకొనుటకు, తలంచెనేని=ఉద్దేశించినను, కరపద్మయుగంబు=తామరలంబోలుఁ జేదోయి, వశంబు=స్వాధీనము, కాక=కాని; అనఁగా నమరకాంత చేతులతోఁ దనప్రియునిబట్టి పోకుండ నిర్బంధించుటకు నామెచేతు లామెకు స్వాధీనము గావయ్యెననుట. లోన్=లోపలను, పుట్టిన, బాష్పగద్గదికన్=కన్నీటిచేనైన డగ్గుత్తికచే, పోకుము=వెడలకుము, అనన్=అనుటకు, పలుకెత్తలేక=మాట బైటికి వెడలఁజేయఁజాలక; అనఁగాఁ గన్నీటియలజడింగలిగిన డగ్గుత్తికచేఁ బోవలదని యనఁజాలకయనుట. పైన్=వెలుపల, చుట్టిన=అల్లికొనిన, పదనుచూపులచేన్=వాఁడిచూపులతోడ, సతి=భార్య, వెంటన్=వెంబడిని, అంటి = తవిలి, తన్ = తన్నును, పట్టఁగన్+పట్టఁగన్=అత్యంతము పట్టుకొనఁగా; ద్విరుక్తిసంభ్రమసూచకము. రణాభిలాషియై=యుద్ధకాంక్షియై, వచ్చెన్.

విశే. యుద్ధమున కేగునపుడు వనిత వలదనియడ్డుపడుట యపశకునము. "పదపద్మయుగంబు" అని పాఠము కొన్నిప్రతులలోఁ గాననగును. అపుడు నాయికకు నాయకునిఁ బట్టఁగాఁ గాళ్లురావయ్యెనని యెన్నవలెను. గ్రహణవిషయముగానఁ జేతులురావయ్యెననుటయే యుచితమని యెంచి కరపాఠమే వ్యాఖ్యాతమయ్యె.

క. సురవీరుఁ డొకఁడు సతిచే
దురమునకు ననుజ్ఞ వేఁడి తొల్లిటియలుకం
జిరకాలదుర్లభం బగు
పరిరంభము గాంచి వెడలెఁ బ్రమదం బెసఁగన్. 74

టీ. ఒకఁడు, సురవీరుఁడు, సతిచే=భార్యచేతను, దురమునకున్ = యుద్ధమునకు, అనుజ్ఞన్=ఆజ్ఞను, వేఁడి=కోరి, తొల్లిటియలుకన్ = పూర్వపుఁ బ్రణయకలహముచే, చిరకాలదుర్లభంబు+అగు = చాలకాలములభింపనట్టి, పరిరంభమున్ = ఆలింగనమును, కాంచి = పొంది, ప్రమదంబు = సంతోషము, ఎసఁగన్=ఒప్పఁగా, వెడలెన్ = బయలుదేరెను.

విశే. యుద్ధమున కేగునపుడు భార్య నాలింగనమొనర్చుటయు నపశకునముగా నెన్నవలయును.

చ. నను నని సేయఁ బంపు ఖగనాథునిసోఁగపసిండితెక్కలు
కుక్కనఁ గొని కర్ణపూరమునకు న్రభసంబునఁ దెత్తు నేను నీ

కని తన కడ్డమై నిలుచునచ్చరతో య్యాలి నూఱడించి పో
రున కరుదెంచె వేల్పుఁగొమరుం[1]డొకరుండురుదండహస్తుఁడై. 75

టీ. వేల్పుఁగొమరుండు ఒకరుండు=ఒక దేవయువకుఁడు, ననుక్=నన్నును, అని=యుద్ధము, చేయక్=చేయుంటకు, పంపుము=అనుపుము. ఖగనాథుని సోఁగపసిండితెక్కలు=గరుడుని నిడుదలగు బంగరుతెక్కలను, ఉక్కునక్=బలముచే, కొని=స్వీకరించి, కర్ణపూరమునకుక్=కర్ణాభరణమునకై, రభసంబునక్ = శీఘ్రముగ, తెత్తును, నేను, నీకుక్, అని, తనకుక్, అడ్డమై, నిలుచు=నిల్చినట్టి, అచ్చరతొయ్యలిక్ = అప్సరసను, ఊఱడించి=ఆశ్వాసించి; ఓదార్చియనుట. ఉరుదండహస్తుఁడై=గొప్పదండము హస్తమునందుఁగలవాఁడై, పోరునకుక్=యుద్ధమునకు, అరుదెంచెక్=వచ్చెను.

భా. ఒకయప్సరస తనమగని యుద్ధమునకుఁ బోవలదని యడ్డమై నిల్వ నాయమరుఁడు నీకుఁ గర్ణాభరణముగ గరుడుని బంగరుతెక్కలంగొని శీఘ్రమ వత్తునని యోదార్చిగదందాల్చి యుద్ధమునకేగెనని భావము.

వి శే. భార్య యుద్ధమునకేగుమగని వలదని యడ్డమై నిల్చుట యపశకునము. గరుడుఁడు స్వర్ణపక్షుఁడుగాన బంగరు తెక్కలనుటయు వానిని గర్ణపూరములుగా నుపయోగింప నర్హత ను జూపుటయుం సముచితంబు.

ఉ మానసవేగరథ్యమును మాతలిసారథికంబు నగ్రసం
దానితనీలనీరదపతాకము నైనరథంబుపై శచీ
జాని పులోమవృత్రబలజంభశర[2]ప్రవిఘాతకారణం
బైనతనుత్రముం దొడిగె నాహవదోహలమానసంబునక్. 76

టీ. మానసవేగరథ్యమును = మనోవేగమువంటి వేగముగల గుఱ్ఱములు గలదియును, మాతలిసారథికంబుక్=మాతలి సారథిగాఁగలదియు, అగ్ర......పతాకముక్= అగ్ర=శిఖరములందు, సందానిత=కూర్పఁబడిన, నీలనీరద=నల్లమబ్బనెడు, పతాకముక్= టెక్కముగలదియును, ఐన=అయినట్టి, రథంబుపైక్=అరదముమీఁద, శచీజాని = శచిభార్యగాఁగలయింద్రుఁడు, పులోమ......కారణంబు-పులోమవృత్రబలజంభ = పులోముఁడు, వృత్రాసురుఁడు, బలాసురుఁడు, జంభుఁడు అనువారలయొక్క, శర=బాణములయొక్క, ప్రవిఘాత=నాశమునకు, కారణంబు=హేతువు, ఐన, తనుత్రముక్=కవచమును, ఆహవదోహలమానసంబునక్ = యుద్ధమందుఁ గోర్కిగలమదితో, తొడిగెక్=ధరించెను.

---

1. ఢొకఁడుద్ధురఖడ్గహస్తుఁడై. 2. ప్రతిఘాతకారణం.

వ్యా-విశే. బహువ్రీహిని జాయాశబ్దమునకు నిఙ్ వచ్చునుగాన "శచీజానిః" అని రూపమేర్పడెను. ఇట్లే "భూజానిః. సీతాజానిః" అనునవి యేర్పడును. తనుత్రము= శరీరమును రక్షించునది. రూ. అ. తనుత్రాణము.

సీ. గతి ముచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాము
నిడినకైవడిఁ గాలికడియ మమర
నల దేవమణికిఁ గావలి యిడ్డప్రహరి నా
గళమున ఘంటికావళులు మెఱయఁ
బన్నగారికి *నెదుర్పడ వెండిఱెక్కలు
ధరియించె ననఁగఁ బక్కెర సెలంగఁ
బారిజాతాహృతిప్రభవరోష మనంగ
గతిరోధజనితఫూత్కృతులు నిగుడ
తే. ఖురముఖక్షుణ్ణకాంచనక్షోణిరజము
పర్వ సంధ్యారుణేందుబింబంబుఁ బోల
వాహకోత్తముఁ డైన రేవంతుఁ డమర
వల్లభునిమ్రోల నుచ్చైశ్శ్రవంబు నిలిపె. 77

టీ. ఇం దింద్రవాహనమగు నుచ్చైశ్శ్రవము వర్ణితము - గతిన్=గమనమును, ముచ్చిలఁగన్=దొంగిలించుటకై, వేచు=కనిపెట్టుకొనియున్న, గాలిన్=వాయువును, త్రావఁగన్=త్రాగుటకై, పామున్=సర్పమును, ఇడినకైవడిన్=ఉంచినరీతిగ, కాలికడియము=కాలియందె, అమరన్=ఒప్పుచుండఁగా; ఉచ్చైశ్శ్రవము గాలినతిక్రమించిన వేగముగలదికాన గాలి దీనిగమనమునకు రోసి యాగతివేగమును దొంగిలింపఁ గనుపెట్టుకొనియుండుననియు, నట్లుగాలి దీనిగతిని దొంగిలింపకుండ వాయుభక్షకమగు సర్పమును నిల్పిరో యనునట్లు కాలియందెయున్నదనియు భావము. సర్పము వాయువునుభుజించి నశింపఁజేయుఁ గాన గాలిబాధ యాగుఱ్ఱమునకుఁగలుఁగదని యాశయము. దీన నింద్రుని గుఱ్ఱము వాయువేగమునుమీఱిన గతివేగముగలదని ధ్వనితమయ్యెను. అలదేవమణికిన్= ఆగుఱ్ఱపు మెడమీఁదనుండు దేవమణి యను నామముగల మంగళప్రదమగుసుడికి, కావలి= కాపు, ఇడ్డ=పెట్టిన, ప్రహరినాన్=ప్రాకారమోయన్నట్లు, గళమునన్ = కంఠమున, ఘంటికావళులు=ఘంటలపంక్తులు, మెఱయన్=ప్రకాశించుచుండఁగా; అయ్యుచ్చైశ్శ్రవంబు మెడపైనున్న దేవమణియను శుభప్రదమగుసుడిని గాపాడఁబెట్టిన ప్రాకారమో

* నెదుర్పడి పైఁడిఱెక్కలు...ఫక్కెరలుసెలఁగ; నెదుర్పడ వేఁడిఱెక్కలు.

యన్నట్లు మెడను ఘంటలవలయములు మెఱయుచున్నవని భావము. మెడను సుడి యుండుట యుత్తమాశ్వలక్షణమని యశ్వశాస్త్రము. పన్నగాశికిన్=గరుడునకు, ఎదుర్పడన్=ప్రతిఘటించుటకు, వెండిఱెక్కలు=రౌప్యపక్షములను, ధరియించెన్, అనఁగన్=అనునట్లుగా, పక్కెర=మీఁదనున్నవ్రేలాడునంగీ, చెలంగన్ = ఒప్పఁగా; గరుడుఁడు సువర్ణపక్షుఁడు. ఆసువర్ణపక్షునితోఁ బ్రతిఘటింపఁ దాఁదలంచినదిగానఁ దత్సామ్యమునకై తాను వెండిఱెక్కల సవరించెనో యనునట్టంగీ యమరెనని భావము. పారిజాతా...రోషము-పారిజాత=కల్పవృక్షముయొక్క, ఆహృతి=ఆహరణముచే, ప్రభవ=పుట్టిన, రోషము=కోపము, అనంగన్=అనునట్లు, గతిరోధజనితపూత్కృతులు=గమననిరోధముచేఁబుట్టిన పూత్కారములు, నిగుడన్=వ్యాపించుచుండఁగా; గమననిరోధముచేఁగల్గిన పూత్కారములు కల్పకాహరణముచే నైనకోపము నానొప్పెనని భావము. ఖుర.....రజము-ఖుర=డెక్కలయొక్క, ముఖ=అగ్రములచే, క్షుణ్ణ=నలఁగిన, కాంచనక్షోణి=బంగరు నేలయొక్క, రజము = పరాగము, పర్వి = వ్యాపించి, సంధ్యారుణేందుబింబంబున్=సంధ్యాసమయమున నెఱ్ఱనైనచంద్రబింబమును, పోలన్=అనుకరింపఁగా; ఉచ్చైశ్శ్రవము తెల్లనిదిగానఁ జంద్రునివలె నున్నదనియుఁ బ్రకృతము దేవభూమియగు బంగరుకొండ యందు డెక్కలతాఁకున రేఁగినపరాగము మెయిని గ్రమ్ముటంజేసి సంధ్యారుణ చంద్రబింబముంబోలియున్నదనియుఁ దాత్పర్యము. వాహకోత్తముఁడైన=శ్రేష్ఠుఁడైన గుఱ్ఱపు రౌతగు, రేవంతుఁడు=రేవంతుఁడనువాఁడు, అమరన్=ఒప్పునట్లుగా, వల్లభునిమ్రోలన్=విభుఁడగు నింద్రునెదుట, ఉచ్చైశ్శ్రవంబున్, నిలిపెన్=నిలువఁబెట్టెను.

అలం. సీసపాదముల నుత్ప్రేక్షలు. గీతపాదమున నుపమ.

శా. చండస్థూలరదద్వయద్వయమహాస్తంభంబులంబూని యు
ద్దండస్ఫారపతాకికాసహితమై దానచ్ఛటాచిత్రవ
ద్గండాభోగవిశాలకుడ్యములచేఁ *గన్పట్టునద్దేవతా
శుండాలం బరుదెంచె సంగరరమాశుద్ధాంతసౌధంబనన్. 78

టీ. చండ...స్తంభంబులన్-చండ=తీక్ష్ణములైన; అనఁగా వాఁడియైన యనుట. స్థూల=బలసిన, రదద్వయద్వయ = నాలుగుదంతములనెడు, మహాస్తంభంబులన్=గొప్ప స్తంభములను, పూని=ధరించి, ఉద్దండ.....సహితమై-ఉద్దండ = భయంకరమైన, స్ఫార=విస్తారమైన, పతాకికా=టెక్కెములతో, సహితమై=కూడినదై, దాన...కుడ్యములచేన్-దానచ్ఛటా = మదజలములచేత, చిత్రవత్ = చిత్రమైనవర్ణముగల, గండాభోగ=చెక్కిళులవైశాల్యమనెడు, విశాలకుడ్యములచేన్ = విశాలములగు గోడలచేతను,

* గన్పట్టియద్దేవతా.

కన్పట్టు=చూపట్టునట్టి, అద్దేవతాశుండాలంబు = ఆసురగజమగు నైరావతము, సంగర రమాశుద్ధాంతసౌధంబు = యుద్ధలక్ష్మియొక్క యంతఃపురపుమేడ, అనన్ =అనునట్లుగా, అరుదెంచెన్ =వచ్చెను.

విశే. దంతములను స్తంభములు, పతాకలు, దానచ్ఛటాచిత్రితగండములనెడు కుడ్యములు గల్గియుండుటంజేసి, యైరావతము రణలక్ష్మీశుద్ధాంతసౌధమువలె నున్నదని యెన్నవలయును. ఐరావతము నాలుగుదంతములు గలదనుట సుప్రసిద్ధము. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

ఉ. ఏడుకరంబుల న్వరుస నెత్తినతోమర శక్తి చాప శ
స్త్రీడమరుస్రువవ్యజనదివ్యమహత్తరసాధనంబు లా
మ్రేడితకాంతితో నిజశరీరరుచిం బచరింప వచ్చె న
య్యేడికరాచతత్తడిపయిన్ హుతవాహుఁ డుదగ్రమూర్తియై. 79

టీ. హుతవాహుఁడు = హవ్యవాహనుఁడగు నగ్ని, ఏడుకరంబులన్ = ఏడు చేతులచేతను, వరుసన్ = క్రమముగా, ఎత్తిన, తోమర...సాధనములు - తోమర, శక్తి, చాప, శస్త్రి, డమరు, స్రువ, వ్యజనములను, దివ్య = దేవసంబంధములైన, సాధనంబులు=ఆయుధములు, ఆమ్రేడితకాంతితోన్ = రెట్టింపైన తేజస్సుతో, నిజశరీర రుచిన్ =తనశరీరకాంతిని, పచరింపన్ =చేయఁగా, అయ్యేడికరాచతత్తడిపయిన్ = ఆ శ్రేష్ఠమగు మేఁకయనెడు గుఱ్ఱముమీఁదను, ఉదగ్రమూర్తియై=భయంకరమగు నాకృతి గలవాఁడై, వచ్చెన్.

వ్యా-విశే. అగ్ని యేడుచేతులుగలవాఁడనుటయు, మేషవాహనుఁడనుటయుఁ బ్రసిద్ధము. సమాసమున రాజుశబ్దములోని జు కారము చకారముగా మారును. "ఏడికరాచతత్తడిపయిన్" అలం. స్వభావోక్తి.

శా. బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులింగాలికి
న్సాహాయ్యంబు ఘటించి కోపరసఘూర్ణన్నేత్రదీప్తుల్పయో
వాహాంతర్గతవైద్యుతప్రభల *లేవంజోప వాహద్విష
ద్వాహోత్తంసము నెక్కి పోరికడ రెన్వైవస్వతుండుద్ధతిన్. 80

టీ. వైవస్వతుండు=యముఁడు, బాహా...స్ఫులింగాలికిన్-బాహా = భుజములందు, సంభృత=భరింపఁబడిన, కాలదండ=యమదండమునుండి, జనిత=పుట్టిన, స్ఫార = విస్తారమైన, స్ఫులింగ=మిణుఁగురులయొక్క, ఆలికిన్ =పంక్తికి, కోప...దీప్తుల్-కోప

* లేవం బాధ.

[illegible]ఘగితము చే, ఘూర్ణత్ = మిగులఁ దిరుగుడుపడుచుండు, నేత్ర=కన్నులయొక్క, [illegible] = [illegible], సాహాయ్యంబుక్ = సహాయమును; అనఁగాఁ దోడ్పాటుననుట. [illegible], పయో...ప్రభలక్-పయోవాహ = మేఘమునందు, అంతర్గత = [illegible], విద్యుత=మెఱుపుసంబంధమైన, ప్రభలక్=కాంతులను, లేవంజోపక్ = [illegible], వాహద్విషత్...త్తంసముక్-వాహద్విషత్ = ఎనుపోతనెడు, వాహో [illegible] = వాహనశ్రేష్ఠమును, ఎక్కి=అధిష్ఠించి, ఉద్ధతిక్=గర్వముతో, పోరికిక్ = [illegible], [illegible] = విజృంభించెను.

[illegible] ఇందు మూఁడవపాదమున "లేవంజోపక్" అనుదానికి బదులుగ "తేవం [illegible]" [illegible] పాఠము గానంబడియెడి. కోపఘూర్ణితనేత్రకాంతులు మేఘలీనవిద్యు [illegible] లను లేవనెత్తెననుటకన్న యసితుండైన వారికి మేఘమువడువున నొప్పుయము [illegible] నరుణదీధితులు మేఘాంతర్గతవిద్యుత్ప్రభల తేవనే యనఁగా తీవనే [illegible] యుత్తమని తోఁచెడుఁ గాన "తేవంజూపక్" అనుపాఠమే సరసమని [illegible].

[illegible] వాహద్విషత్-అశ్వశత్రువు = మహిషము. వైద్యుత్=విద్యుత్సంబంధ [illegible]. అలం. స్వభావోక్తి. ఉపమ గమ్యము.

[illegible] కారులు గామరూపధరు లాఖిలక్రియా*పాదనో
[illegible] ల్పుణ్యాజను ల్భజింపఁ గుముదస్తంబేరమం బగ్రతో
[illegible] బల్లన గట్టి రా నసిరుచిస్ఫూర్తు ల్విజృంభింప సం
[illegible] మెచ్చం బలలాశి యేఁగె మనుజస్కంధాంత రారూఢుఁడై. 81

[illegible] బలలాశి=మాంసాశియగునిర్బృతి, భీమాకారులు=భయంకరమైన రూపములు [illegible], కామరూపధరులు = ఇచ్చవచ్చినయాకృతుల ధరింపఁజాలువారు, అఖిల [illegible]ద్దాముల్-అఖిలక్రియా = భయంకరవ్యాపారమును; అనఁగా యుద్ధ [illegible]. ఆపాదన=చేయుటయందు, ఉద్దాముల్=అధికులు, పుణ్యాజనులు = [illegible], భజింపక్ = సేవింపఁగా, కుముదస్తంబేరమంబు = కుముదమను పేరుగలవాని [illegible], అగ్రతోభూమిక్=ఎదుట, పల్లన=జీను, కట్టి, రాక్ = రాఁగా, అసిరుచి [illegible] = [illegible] మెఱుంగులవికాసములు, విజృంభింపక్ = అతిశయింపఁగా, మనుజ [illegible] రారూఢుండై=మనుష్యునిమూఁపునడుమఁ గూర్చున్నవాఁడై, సంగ్రామేచ్ఛక్ [illegible], ఏగెక్=వెడలెను.

---

* [illegible]ద్దాముల్.

విశే. "అఖిలక్రియాపాదన" అనుచో "నాఖిలక్రియాంపారగ" యనుపాఠ మగపడెడు. అపుడు యుద్ధవ్యాపారపారమునందినవారని యర్థము చెప్పవలెను. పుణ్యజనుఁడు=రాక్షసుఁడు. "యాతుధానః పుణ్యజనః" అని యమరము. నిరృతియేనుఁగు కుముదము. క్రమముగాఁ బ్రాగాద్యష్టదిశలందుండుగజములు "ఐరావతః పుండరీకో వామనః కుముదోఽంజనః, పుష్పదంత స్సార్వభౌమ స్సుప్రతీకశ్చ దిగ్గజాః" అనునవి యని యమరుఁడు నుడువును గాన నాయాదిక్కులందలి గజము లాయాదిక్పతులవని యెన్నవలయును. నిరృతి నరవాహనుఁడనుట ప్రసిద్ధము. అలం. స్వభావోక్తి.

చ. మకర కుళీర కచ్ఛప సమానము లైనముఖంబుల న్భయా
నకరస ముప్పతిల్లఁ గెలన న్నిజకింకర*దైత్యదానవ
ప్రకరము గొల్వ బాహుశిఖరంబునఁ బాశము పూని వార్ధినా
యకుఁ డని కేగుదెంచెఁ గలహంసతురంగరథాధిరూఢుఁడై. 82

టీ. వార్ధినాయకుఁడు=సముద్రాధిపతివరుణుఁడు, మకరకుళీర...ముఖంబులన్ = మకర=మొసలి, కుళీర=ఎండ్రకాయ, కచ్ఛప=కూర్మము, అనువీనికి, సమానములైన = సదృశములైన, ముఖంబులన్=మొగములందు, భయానకరసము = భయజనకమగు రసము, ఉప్పతిల్లన్=పుట్టఁగా, కెలనన్=పార్శ్వమున, నిజకింకరదైత్యదానవప్రకరము= తనభటులైన దైత్యులయు దానవులయు సమూహము, కొల్వన్=సేవింపఁగా, బాహుశిఖరంబునన్ = భుజశిఖరమున, పాశమున్=పాశమను నాయుధవిశేషమును, పూని= పట్టి, కలహంసతురంగరథాధిరూఢుఁడై = రాయంచ గుఱ్ఱముగాఁగల రథము నెక్కినవాఁడై, అనికిన్=యుద్ధమునకు, ఏగుదెంచెన్=వచ్చెను.

విశే. వరుణునకు రాయంచ వాహనము. అలం. స్వభావోక్తి.

ఉ. అంగసుగంధము ల్నిజభటాలిపథశ్రమముల్ హరింప ను
త్తుంగగదాపరిభ్రమవిధూతము లై ఘనము ల్దిగంతమా
తంగవిశాలకర్ణములఁ దార్కొని చామరలీలఁ జూప సా
రంగహయంబు నెక్కి సమరంబున కేగె సమీరుఁ డుద్ధతిన్. 83

టీ. సమీరుఁడు = వాయుదేవుఁడు, అంగసుగంధముల్ = శరీరపరిమళములు, నిజభటాలిపథశ్రమముల్ = తనభటుల మార్గాయాసమును, హరింపన్=పోఁగొట్టఁగా, ఉత్తుంగ...విధూతములై-ఉత్తుంగ=ఎత్తైన, గదా=గదయను నాయుధముయొక్క, పరిభ్రమ=త్రిప్పుటచే, విధూతములై = ఎగఁజిమ్మఁబడినవై, ఘనముల్ = మేఘములు,

* వీరదానవ.

దిగంతమాతంగవిశాలకర్ణములన్ = దిగంతములందైన యేనుంగులయొక్క విశాలమైన చెవులందు, తార్కొని=తగిలి, చామరలీలన్ = చామరములవిలాసమును, చూపన్ = కనఁబఱుపఁగా, సారంగవాహయంబున్ = కురంగవాహనమును, ఎక్కి, ఉద్ధతిన్ = గర్వములో, సమరంబునకున్ =యుద్ధమునకు, ఏగెన్.

వి. శే. గదావిధూతములై దిగ్గజకర్ణములం దవిలిన మేఘములు చామరములలీలం ధరించెనని గ్రహించునది. వాయువు కురంగవాహనుఁడనుట ప్రసిద్ధము. అలం. స్వభావోక్తి. ఉపమ గమ్యము.

క. నలకూబరమణికంఠులు,బలములఁ నడపింప నర్థపతి తురగముపై
ధళధళితచంద్రహాసో,జ్జ్వలితభుజుండగుచు నడచె వాసవుప్రోలన్.

టీ. అర్థపతి = కుబేరుఁడు, నలకూబరమణికంఠులు = నలకూబరుఁడను తన తనయుఁడును మణికంఠుఁడును, బలములన్ = సేనలను, నడపింపన్ = నడుచునట్లు చేయఁగా, ధళధళితచంద్రహాసోజ్జ్వలితభుజుండగుచున్ = తళతళమని మెఱయుచున్నట్లు చేయఁబడినకత్తిచే బ్రకాశితమగు బాహువుగలవాఁడగుచు, వాసవుప్రోలన్ =ఇంద్రుని ప్రక్క, నడచెన్.

అలం. స్వభావోక్తి.

ఉ. ఆననసీమఁ గ్రోధజనితారుణదీధితి ఫాలభాగనే
త్రానలకీలలం బెనుప హస్తమున న్నిశితత్రిశూలముం
బూని మదించి అంకె లిడుపోఁటరి గిబ్బలతేని నెక్కి యీ
శానుఁడు వచ్చెఁ బారిషదసైన్యముతో రణకౌతుకంబునన్. 85

టీ. ఈశానుఁడు=ఈశానుఁడనుదిక్పతి, ఆననసీమన్ = ముఖప్రదేశమునందైన, క్రోధజనితారుణదీధితి=కోపమువలనఁబుట్టిన యెఱ్ఱనికాంతి, ఫాలభాగనేత్రానలకీలలన్ = లలాటమునందైన నేత్రసంబంధమగునగ్నియొక్క మంటలను, పెనుపన్ = వృద్ధినందింపఁగా, హస్తమునన్ = చేతియందు, నిశితత్రిశూలమున్ = వాఁడియైన త్రిశూలమును, పూని, మదించి=మత్తిలి, అంకెలు=బొబ్బలు, ఇడు=పెట్టునట్టి, పోఁటరిగిబ్బలతేనిన్ = శూరుఁడైనవృషభాధిపుని, ఎక్కి=అధిష్ఠించి, పారిషదసైన్యముతో = ప్రమథగణముల తోడ, రణకౌతుకంబునన్ =యుద్ధోత్సాహముతో, వచ్చెన్.

వి. శే. ఈశానుఁడు శివాంశసంభూతుఁడగుట నాతనిని శివసదృశాకారధర్మములు గలవానినిగ భావించి వర్ణించుట సహజము. అలం. స్వభావోక్తి.

ఉ. ఆయుధగర్భితంబు లగునంజలు లెత్తి పులోమకన్యకా
నాయక! యేన యేన యని నాకనివాసులు మ్రొక్కి సూరెలం
బాయక కొల్చి రా దిగధిపాలురతో నలనందసూనుఁ డా
హా యిటు సేయునేయని మహాహమికంబలుమాఱు పల్కుచున్. 86

టీ. నాకనివాసులు=స్వర్గవాసులు సురలు, ఆయుధగర్భితంబులు = ఆయుధము లతోఁగూడినవి, అగు=అగునట్టి, అంజలులు=దోసిళులు, ఎత్తి=పైకెత్తి, పులోమకన్యకానాయక=ఓపౌలోమీపతీ!, ఏన ఏన=నేనే నేనే, అని, మ్రొక్కి = నమస్కరించి, సూరెలన్=పార్శ్వములందు, పాయక=చేరి, కొల్చి=సేవించి, రాన్=రాఁగా, దిగధిపాలురతోన్=దిక్పాలురతోను, అలనందసూనుఁడు=ఆశ్రీకృష్ణుఁడు, ఆహా = అయ్యో, ఇటు=ఈరీతిగ, చేయు నే=ఒనర్చునే, అని, మహాహమికన్=గొప్పదైనగర్వముతో, పలుమాఱు=మాటిమాటికి, పల్కుచున్ = అనుచు, ఇంద్రుఁ డనికి వెడలెనని ముందటిపద్యములతో నన్వయము.

వ్యా-విశే. మహాత్+అహమిక=మహాహమిక.

చ హరిహయుఁ డాహరింగెలుచునాసయు మోసము నాక యీగతిం
బురి వెడలంగ నవ్విభునిమ్రోల మరుద్వసువిశ్వరుద్రభా
స్వరతుషితాదిక త్రిదశవర్గము ముప్పదిమూఁడుకోటులు
ద్ధురగతి నేగుదెంచె రణధూర్వహగర్వము లుల్లసిల్లఁగన్. 87

టీ. హరిహయుఁడు=ఇంద్రుఁడు, ఆహరిన్=ఆశ్రీకృష్ణుని, గెలుచునాసయున్= జయించునాశయు, మోసము=ప్రమాదము, నాక=అనక; అనఁగా శ్రీకృష్ణుని గెల్చుట దుస్సాధమని మదినెన్నక యనిభావము. ఈగతిన్=ఈరీతిగ, పురిన్ = పట్టణమునుండి, వెడలంగన్ = బయలువెడలఁగ, అవ్విభునిమ్రోలన్ = ఆదేవేంద్రునిపార్శ్వమున, మరుద్వసు......వర్గము-మరుత్తులు, వసువులు, విశ్వులు, రుద్రులు, భాస్వరులు, తుషితులు, ఆదిక=మొదలైన, త్రిదశవర్గము=సురసమూహము, ముప్పదిమూఁడుకోటులు=ముప్పది మూఁడుకోట్లసంఖ్యగలవారు, ఉద్ధురగతిన్=గర్వగమనములో, రణధూర్వహగర్వములు= యుద్ధభారమును మోయుగర్వములు, ఉల్లసిల్లఁగన్=ప్రకాశింపఁగా, ఏగుదెంచెన్ = వచ్చెను.

విశే. మరుద్వసాద్యులు సురలతెగలభేదములు. ఇందుఁ ద్రిదశవర్గపదము కర్త యగుటం జేసి వారు ముప్పదిమూఁడుకోటుల సంఖ్యగలవారైనను, మహాత్ములైనను, దత్సమూహముం దెలియఁబల్కు వర్గశబ్దమమహద్వాచకమగుటం జేసి, క్రియ యమహత్కర్తృక

మగునపుడు నిల్చురీతినే నిల్పఁబడెను. "ఏగుదెంచెన్" అని. ఇట్టిచోటుల "త్రిదశవర్గ మేగుదెంచిరి" అనియుఁ బాక్షికముగ రూపముండనగును. "మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్యయుక్తంబయ్యెఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాషనగు" అని ప్రౌఢవ్యా. శబ్దప. 17 సూ.

శా. అర్వారోహణచాతురీవిలసనాహంకారదుర్వారతన్
సర్వాంగీణములైన మైమఱువులు *న్శస్త్రీకృపాణంబులున్
గర్వాలాపవిడంబముల్మెఱయ జోకం జిత్రసేనాదిగం
ధర్వుల్వజ్రికిఁ దోడుసూపిరి పురద్వారప్రదేశంబునన్. 88

టీ. చిత్రసేనాదిగంధర్వుల్=చిత్రసేనుఁడు మొదలైనగంధర్వులు, అర్వారోహణ......దుర్వారతన్-అర్వారోహణ=గుఱ్ఱమునెక్కుటయందలి, చాతురీ=నైపుణియొక్క; అనఁగా స్వారిచేయు నేర్పుయొక్కయనుట. విలసన = విలాసమువల్లనైన, అహంకార=గర్వముయొక్క, దుర్వారతన్=అనివార్యత్వమును, సర్వాంగీణములైన = ఎల్లయవయవములంగప్పియున్న, మైమఱువులున్ = శరీరాచ్ఛాదనములు కవచములును, శస్త్రీకృపాణంబులున్ = చురకత్తులును ఖడ్గములును, గర్వాలాపవిడంబముల్=గర్వపుమాటల యతిశయమును, మెఱయన్=ప్రకాశింపఁగా, జోకన్ = పరాక్రమముతో, పురద్వారప్రదేశంబునన్ = పట్టణబహిర్ద్వారదేశమున, వజ్రికిన్ = వజ్రాయుధముగలయింద్రునకు, తోడుసూపిరి=సహాయులైరి.

ఉ. హేమధరాధరంబు చలియింప వెసన్ బహుకోటిసంఖ్యలై
యామరసైన్యము ల్నడచునప్డు డనంతసితోష్ణవారణ
స్తోమనిరోధ మందియును దోడనె దిక్కులు గప్పె నయ్యెడం
జామరవాయునున్నములు సాంద్రహిరణ్మయభూపరాగముల్. 89

టీ. హేమధరాధరంబు=బంగరుకొండ; మేరువనుట: ఇది సురాలయముగదా! చలియింపన్=కదలునట్లుగా, వెసన్=శీఘ్రముగ, బహుకోటిసంఖ్యలై = అనేకకోటులసంఖ్యగలవై; అనఁగా లెక్కకుమిక్కిలియైయనుట. ఆమరసైన్యముల్=సురసైన్యములు, నడచునప్డు, అనంతసితోష్ణ......నిరోధము-అనంత=లెక్కలేని, సిత = తెల్లనైన, ఉష్ణవారణస్తోమ=గొడుగులగుంపుయొక్క, నిరోధము=అడ్డగింపును, అందియున్ = పొందినప్పటికిని, తోడనె=వెనువెంటనె, చామరవాయునున్నములు=చామరములగాలులచే

* బంచత్కృపాణంబులున్.

గాఁజిమ్మఁబడినట్టి, సాంద్రహిరణ్మయభూపరాగముల్ = దట్టమైనబంగరునేలసంబంధమైనధూళులు, అయ్యెడన్ = ఆసమయమున, దిక్కులు = దిశలు, కప్పెన్ = ఆవరించెను.

వ్యా-విశే. గొడుగులచే నాచ్ఛాదితమైనను జామరములగాలులచే రేఁగిన స్వర్ణపరాగములు దిశలనావరించెనని యెన్నునది. అమరాణామిదమ్ = ఆమర. అణ్.

ఉ. దారుణభంగి నొండొకటి దాఁకెడునస్త్రముఖంబులన్ఘణా
త్కారము*లుల్లసిల్ల బెడిదంబుగఁ బుట్టినసందడిం బుర
ద్వారము నిర్గమించె సురవల్లభుసేనలు భర్గజూటకాం
తారముఖంబున న్వెడలుదైవతసింధుఝరంబులో యనన్. 90

టీ. దారుణభంగిన్ = భయంకరమగురీతితో, ఒండొకటిన్ = అన్యోన్యమును; ఒకటినొకటియనుట. తాఁకెడు = అంటునట్టి, అస్త్రముఖంబులన్ = అస్త్రాగ్రములనుండి, ఘణాత్కారములు = ఘణఘణధ్వనులు, ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా, బెడిదంబుగన్ = భయంకరముగ, పుట్టినసందడిన్ = జనించినకలకలముతో, సురవల్లభుసేనలు = ఇంద్రుని బలములు, భర్గ.....ముఖంబునన్-భర్గ = ఈశ్వరునియొక్క, జూట = జడలముడియను, కాంతార = అడవియొక్క, ముఖంబునన్ = అగ్రమునుండి, వెడలు = బయలుదేరిన, దైవతసింధుఝరంబులోయనన్ = సురనదీప్రవాహములోయన్నట్లు, పురద్వారమున్ = పట్టణద్వారమునుండి, నిర్గమించెన్ = వెలువడెను.

విశే. ఇందు రెండవపాదమున "ఉల్లసిల్లన్" అనుచో "ఉప్పతిల్లన్" అను పాఠమగపడును. "ఉప్పతిల్లు" అనఁగాఁ బుట్టుట. శస్త్రముఖముల ఘణాత్కారములుల్లసిల్లెననుటకంటె నుప్పతిల్లెననుటయే సరసమని తోఁచెడి. అందే "పుట్టిన" అనుచో "తొట్టిన" యనుపాఠ మగపడు. ఇం దధికవిశేషము గానరాదు. అలం. ఉత్ప్రేక్ష.

శా. బాణద్విణ్మథితాంబుధిధ్వనికళాపాణింధమానీకని
స్సాణస్వానభిదేలిమాద్రితట! నిస్సామాన్యచాపాగమ
ద్రోణాచార్య! సురీసమూహవరణోద్యుక్తాహితశ్రేణిని
శ్రేణీభూతకృపాణ! మాంసలభుజాశేషాహిపత్యుద్ధరా! 91

టీ. బాణ.....తట-బాణద్విట్ = బాణాసురశత్రువగు విష్ణునిచే, మథిత = తఱువఁబడిన, అంబుధి = సముద్రముయొక్క, ధ్వనికళా = శబ్దవిద్యలను, పాణింధమ = వృద్ధినందించుచున్న, అనీక = సేనలయొక్క, నిస్సాణస్వాన = వాద్యవిశేషముల మ్రోఁతల

* లుప్పతిల్ల బెడిదంబుగఁ దొట్టిన.

...యు=...గుండెదాఁమే పగులఁబాఱు, అద్రితట = పర్వతప్రదేశములుగలవాఁడ, ...ద్రోణాచార్య-నిస్సామాన్య = అనితరసాధారణమైన; ఇతరులకలవిగాని ... ధనుర్విద్యయందు, ద్రోణాచార్య=ద్రోణాచార్యునివంటివాఁడ, సురీ ...కృపాణ-సురీనమూహ=దేవతాస్త్రీలగుంపునకు, వరణ=వరించుటకు; పెండ్లి ...నుట. ఉద్యుక్త=సంసిద్ధమైన, అహితశ్రేణి=శత్రుపంక్తికి, నిశ్రేణీభూత=నిచ్చెన ...కృపాణ=కత్తిగలవాఁడ, మాంసల.....ధరా-మాంసల=బలిసిన, భుజా=భుజము ..., ...మహీపతి=ఆదిశేషుని, ఉద్ధరా=ఉద్ధరించినవాఁడా!, కాపాడినవాఁడాయనుట; ...యన్నిటను కృష్ణరాయనికి సంబుద్ధులు.

భా. కృష్ణరాయలు దిగ్విజయార్థమేగునపుడు సేనలలోనఱచిన జయభేరులమ్రోఁతలు సముద్రమగ్నసమయమునసైన ధ్వనులనుగూడ మించియున్నవనియుఁ, కృష్ణరాయలు ధనుర్విద్యావిషయమున ద్రోణుంబోలువాఁడనియుఁ, శత్రుకోటిని యుద్ధమునందుఁ ... దేవతాస్త్రీభోగమును వారికిఁగూర్చునదగుట శ్రీకృష్ణరాయలకత్తి శత్రులు సురస్త్రీలంగలిసికొనుటకు మీఁదికినంపుసాధనమగు నిచ్చెనవలె వెలయుచున్నదనియుఁ, బలిసిన భుజములందు భువినుంచి కృష్ణరాయలు పాలించువాఁడౌటంజేసి యాదిశేషునకు భువిని మోఁచువ్యాపారము శూన్యమయ్యెననియుఁ, దానఁ గృష్ణరాయలు శేషు నుద్ధరించినవాఁడయ్యెననియుఁ భావము.

విశే. ప్రకృతకథాంశమున కనుగుణమగురీతి నిందుఁ గృష్ణరాయలభేరిమ్రోఁతలు సైన్యములు, వీరత్వము, శత్రునాశము, మున్నగునవి ప్రతిపాదితములై హృదయంగమము లగుచున్నవి.

శా. వాజ్యారోహణనైపుణీనకుల! దోర్వాతంధయారూఢస
ర్వజ్యాచక్ర! రజస్తమశ్చయతమిస్రారూపజన్యాంగణ
ప్రాజ్యోద్గీతయశశ్శశాంక! దళితారాతిక్ష్మాపాలర
క్తాజ్యోదంచదుదారశౌర్యహుతభుగ్వ్యాప్తాఖిలాశాంతరా! 92

టీ. వాజ్యా...నకుల-వాజి=గుఱ్ఱములయొక్క, ఆరోహణ=ఎక్కుటయొక్క, నైపుణీ=నేర్పువిషయమున, నకుల = నకులుఁడవైనవాఁడా; నకులుఁడు పాండురాజు ...కుమారుఁడు. ధర్మజుని తమ్ముఁడు. ఈతఁ డశ్వశిక్షణమున మిగుల నేర్పరియైనయట్లు మహాభారత విరాటపర్వాదులందలి కథాభాగములవలనఁ దెల్లమయ్యెడిని. దోర్వాతం...... ...చక్ర-దోః=బాహువనే, వాతంధయ = సర్పమును, ఆరూఢ=అధిష్ఠించిన, సర్వ = ...సమస్తమైన, జ్యా=భూమియొక్క, చక్ర=వలయముగలవాఁడ, రజస్తమ...శశాంక - రజః=దూళియనెడు, తమః=చీకట్లయొక్క, చయ=గుంపుచే, తమిస్రా = చీఁకటిరేయియొక్క, రూప=రూపమైన; చీఁకటిరేయియాకారమునుధరించిన యనుట. జన్యాంగణ=యుద్ధరంగమునందు, ప్రాజ్య=పూజ్యముగ, ఉద్గీత = హెచ్చుగఁ గొనియాడఁబడుచున్న, యశః=కీర్తియనెడు, శశాంక = చంద్రుఁడుగలవాఁడా! చీఁకటిరేయిం

జంద్రుఁడుదోఁచి సర్వమును బ్రకాశితము సేయఁగలిని, పరాగమను చిమ్మచీఁకటి క్రమ్ముటంజేసి చీఁకటిరేయి ననుకరించు యుద్ధరంగమున గతిగానక చింతించు పగతుర కీతని యశశ్చంద్రప్రశంసయే తారకమయ్యెనని భావము. చంద్రుఁడు చీఁకటిని బాఱఁ ద్రోలంగలి నీతని యశోగానము పగతురను యుద్ధరంగపుఁ గష్టములనుండి విముక్తులం జేసెనని ఫలితము. దళిత...ఆశాంతరా-దళిత = చీల్పఁబడిన. అరాతిక్ష్మాపాల=శత్రు రాజులయొక్క, రక్త=నెత్తురనెడు, ఆజ్య=నేతిచే, ఉదంచత్ = పైకెగసిన; మండిన యనుట. ఉదార=గొప్పదైన, శౌర్య=పరాక్రమమనెడు, హుతభుక్=అగ్నిచే, వ్యాప్త= వ్యాపింపఁబడిన, అఖిల=సమస్తమైన, ఆశా=దిక్కులయొక్క, అంతరా = వెలుపలి భాగములుగలవాఁడ. ఈతనిశౌర్యాగ్ని పగతురనెత్తుటిధార లను నేతిచేఁ బ్రజ్వలితమై దిగంతముల ముట్టెనని భావము. అహితవిదళనమున నీతనిపరాక్రమము దిగంతవ్యాప్త మయ్యెనని ఫలితము.

భా. కృష్ణరాయఁడు నకులునివలె నశ్వశిక్షానిపుణుఁడనియు, నీతనిబాహువు శేషునివలె భువి నక్రమముగ మోసి సుఖపెట్టుచున్నదనియు, యుద్ధరంగమునఁ గల్గిన బహులధూళింగాంచి కర్తవ్యముంగానక వెఱపంది శత్రురాజు లీతనికీర్తిని గానము సేసి యాకష్టములనుండి విముక్తిం గాంచుచుండిరనియు, నరినరపతులఁ జంపుటకతన నీతని శౌర్యము దిగంతవిఖ్యాతమయ్యెననియు భావము.

విశే. వాతంధయ = గాలినిబీల్చునది; పాము. ఇట్టిదే స్తనంధయశబ్దము. స్తనమును బీల్చువాఁడు చంటిబిడ్డ, జ్యా=నేల, భూమి గుండ్రముగనుండుట నైజము గాన జ్యాచక్రమనెను. క్ష్మా=భూమి, భూమిని పాలించువాఁడు గాన రాజు క్ష్మాపాలుఁడయ్యెను. హుతభుక్ = హోమము చేయఁబడినదానిం దినువాఁడు; అగ్ని. కీర్తి తెల్లగా నుండుటయుం, దానిని జంద్రునిగా నెన్నుటయుఁ గవిలోకప్రసిద్ధవిషయములు. శేషుఁడు భూమిని మోచుట పురాణాదిప్రసిద్ధాంశము. తృతీయపాదాదినుపసర్గసంధి యొప్పుటం జేసి యుపసర్గ యతి నియమముననుసరించి యచ్చునకును, హల్లునకును యతి వేయనగుం గాన 'దళి తారాతి' అనుపదమున విఱుఁగునట్టి తకారముపైనుండు అకారము 'ప్రా' అనుదానిపైఁగల అకారమునకు యతియయ్యె. అలం. రూపకము.

క. చండతరమూరురాయర, గండమహాబిరుద! ధాటికారయవిచల
త్కొండపలి కొండవీటీ, మండల! కటకేశసింధుమందరకుధరా. 93

టీ. చండతర......మహాబిరుద-చండతరమూరు రాయరగండ = మహోగ్రమైన 'మూరురాయరగండ' అనెడు, మహాబిరుద = గొప్పబిరుదముగలవాఁడ,' అశ్వపతులు, నరపతులు, గజపతులు' అను మూఁడు తెగలరాజులను జయించినవాఁడౌటఁ గృష్ణరాయల కీబిరుదము గల్గె. ఇది కన్నడపదము. ధాటికా......మండల - ధాటికారయ=దాడియొక్క వేగముచే, విచలత్ = మిగులఁ గంపించునట్టి, కొండపలి కొండవీటీమండల=కొండపల్లి కొండవీడను ప్రదేశములుగలవాఁడ, కటకేశ......కుధరా-

[illegible]కటకాధిపతి యనెడు, సింధు=సముద్రమునకు, మందరకుధరా=మందరపర్వత మైనవాఁడా!

భా. కృష్ణదేవరాయలు మూరురాయరగండ యనుమహాబిరుదము గలవాఁ డనియు, గొండపల్లి కొండవీడుల జయించినవాఁడనియుఁ, గటకాధీశుని గెలిచినవాఁ డనియు భావము.

వి. కొండపలి కొండవీడులందలి కొండపదములు శ్రీకృష్ణరాయని ధాటీ గుఱుము కొండలంగూడఁ జలింపఁజేసెనను జమత్కారార్థమును స్ఫురింపఁజేయుచు నగనములై యొప్పుచున్నవి. ఇదియుఁ బ్రకృతకథానుకూలవిషయప్రకాశకమై సరస ముగ నొప్పుచున్నది.

తోటకము.——

త్వరితాధరితానిలవాజినట, త్ఖురజోరురజోభరగూఢరవి
స్ఫురణా! కరణాధికశూత్కృతిమ,ద్విరదాకరదారణవీరబలా! 94

టీ. త్వరిత......రవిస్ఫురణా-త్వరిత = వేగముచే, అధరిత=క్రిందుగాఁజేయఁ బడిన, అనిల = గాలిగల; అనఁగా వాయువేగమును మీఱినవనుట. వాజి = గుఱ్ఱముల యొక్క, నటత్ = నటించునట్టి; అనఁగాఁ జలించునట్టియనుట: నర్తనమునర్థము భంగ్యంతరమిఁ జలనమే గ్రాహ్యము. ఖురజ=డెక్కలనుండిపుట్టిన, ఉరు = గొప్పదైన, రజో భర=ధూళిసమూహముచే, గూఢ = మఱుఁగుపడిన, రవి = సూర్యునియొక్క, స్ఫురణా= [illegible]గలవాఁడ, కరణా......వీరబలా - కరణ=శరీరములచే, అధిక = అధికములైన; [illegible] గొప్పశరీరము గలవనుట. శూత్కృతిమత్ = శూత్కారముగల, ద్విరదాకర= ఏనుఁగులగుంపును, దారణ=చీల్చునట్టి, వీరబలా=వీరసైన్యములుగలవాఁడ!

భా. కృష్ణరాయల దాడులందశ్వసైన్యములవలన రేఁగినధూళులు సూర్యకాం తినిగూడ మఱుఁగుపఱచెననియుఁ, గృష్ణరాయనిసైనికులు మత్తగజముల విదారింప నెం తయు సమర్థులనియు భావము.

వి. ఈపద్యము నడకచేతను, నర్థముచేతను, జన్యాటోపమును సూచించునదై ప్రకృతకథానుకూలమై హృద్యమైయున్నది. మొత్తముమీఁద నిందాశ్వాసాంత పద్య ములందలి విషయములు యుద్ధవార్తలనే సూచించుచున్నవి. ఇది తోటకవృత్తము [illegible]. దీనికిఁ బ్రతిపాదమునకు నాలుగేసి సగణములుండును. తొమ్మిదవయక్షరము యతిస్థానము.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసారస్వతాభి నంద సందిసింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన పారిజాతాపహరణంబను మహా ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

———

# పంచమాశ్వాసము.



వర్ణనీయ! తిరుమల
దేవీహృదయేశ! యమృతదీధితికులపా
రావారపారిజాత! ధ
రావలయశరణ్యా! కృష్ణరాయవరేణ్యా! 1

టీ. శ్రీవర్ణనీయ=సంపదలచేత వర్ణింపఁదగినవాఁడా! తిరుమలదేవీహృదయేశ = తిరుమలదేవికి భర్తయైనవాఁడ, అమృతదీధితికులపారావారపారిజాత = చంద్రవంశమను సముద్రమునకుఁ గల్పవృక్షమైనవాఁడా, ధరావలయశరణ్య = భూమండలమునకు రక్షకుఁడైనవాఁడా; అనఁగా భూమియందలి ప్రజలకు రక్షకుఁడాయనుట. కృష్ణరాయ వరేణ్యా=కృష్ణరాయశ్రేష్ఠా! 'అవధరింపుము' అని ముందటిపద్యముతో నన్వయము.

విశే. ఇందలి 'అమృతదీధితికులపారావారపారిజాత, తిరుమలదేవీహృదయేశ' అనుపదములు శ్రీకృష్ణుఁడు సత్యాసక్తుఁడై భువికిఁ బారిజాతముం గొని తెచ్చిన యీ యాశ్వాసపుఁగథకు సూచకములై వెలయుచున్నవి. అలం. రూపకము.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
దైవసైన్యంబు లేరీతిఁ దరతరంబ
వెడలి మొన లేర్పరించి యుద్వేలవృత్తి. 2

టీ. అవధరింపుము=సావధానబుద్ధిని వినుము. జనమేజయక్షితీశవరునకున్ = జనమేజయుఁడను రాజశ్రేష్ఠునకు, అమ్మౌనివల్లభుండు = ఆమునిపతి, ఇట్లు, అనున్ = అనెను. దైవసైన్యంబులు = సురసైన్యములు, ఏరీతిన్, తరతరంబ = ఒకటివెనుకనొకటి, వెడలి, మొనలు= ముగ్గరములు, ఏర్పరించి=ఏర్పాటుచేసి, ఉద్వేలవృత్తిన్=అధికమగు వ్యాపారముతో; ముందటిపద్యముతో నన్వయము.

యుద్ధము.

ఉ. వచ్చితి మింక నెందుఁ జనవచ్చు నొహో నిలు పారిజాతపా
టచ్చర! యంచు జంకెలు గడలొ్కనఁ గృష్ణునిఁ జుట్టుముట్టి వై

యచ్చరసేన దాఁకునపు డచ్చల మేమని చెప్ప దిక్కులం
దిచ్చఱతూపుతండములు సింహరవంబులు నిండె నొక్కటన్. 3

టీ. పారిజాతపాటచ్చర = ఓపారిజాతవృక్షమును దొంగిలించినవాఁడ, వచ్చి గిరు, ఝంకక్, ఎందుక్, చనక్, వచ్చుక్=వీలగును. ఒహో = ఓహో, నిలు= నిలుపుము. అంచుక్, జంకెలు=బెదరింపులు, కడలొక్కనక్=వ్యాపింపఁగా, వైయచ్చర సేన=వియచ్చరసైన్యములు; అనఁగా సురబలములనుట. తాఁకునపుడు = ఎదురొక్కను సమయమున, దిక్కులక్=దిశలందు, చిచ్చఱతూపుతండములు = అగ్నినిజిలుకు బాణ ములగుంపులు; ఆగ్నేయాస్త్రములనుట. సింహరవంబులు=సింహనాదములు, ఒక్కటక్= ఒకసమయమునందే, నిండెక్. ఏమి అని చెప్పక్=చెప్పుట కశక్యమనుట.

భా. బెదరింపులతో జేజేలబలగము లేతెంచి యాగ్నేయాస్త్రప్రయోగములను సింహనాదములతోడనే చేసిరని భావము.

ఉ. ఆకమలాయతాక్షి నమరావనిజాతము డించి సంభ్రమ
న్నాకపురీమహారథుల నవ్వుచుఁ గన్గొని యంగుళిత్రగో
ధాకలనంబుతో యదువతంసుఁడు శార్ఙ్గనిబద్ధశేషని
ర్మోకనిచోళముం దిగిచె రోషనటద్భ్రుకుటీవిలాసుఁ డై. 4

టీ. ఆకమలాయతాక్షిక్=ఆపద్మాయతాక్షిని సత్యను, అమరావనిజాతముక్= దేవభూరుహమును గల్పకమును, డించి = దించి, యదువతంసుఁడు=యాదవశ్రేష్ఠుఁడు కృష్ణుఁడు,సంభ్రమన్నాకపురీమహారథులక్=తొందరపడుసురమహారథులను, నవ్వుచుక్, కన్గొని=చూచి, అంగుళి...కలనంబుతోక్-అంగుళి = వ్రేళ్లను, త్ర = రక్షించునట్టి, గోధా=ఉడుముతోలుయొక్క, కలనంబుతోక్=ఆచ్ఛాదనముతో,శార్ఙ్గనిబద్ధ...నిచోళముక్ - శార్ఙ్గ=శార్ఙ్గమనుతనవింటియందు, నిబద్ధ = కూర్పఁబడిన, శేషనిర్మోక=శేషుని కుబుసమనెడి, నిచోళముక్=ఆచ్ఛాదనవస్త్రమును, తిగిచెక్=ఆకర్షించెను; అనఁగా ధనువునకుఁగప్పిన శేషనిర్మోకరూపాచ్ఛాదనమును దొలఁగించె ననుట. రోషనటత్...విలాసుఁడై-రోష=కోపముచే, నటత్=చలించునట్టి, భ్రుకుటీ = బొమముడియొక్క, విలాసుఁడై=అందముగలవాఁడై, తిగిచెనని పూర్వపదముతో నన్వయము.

భా. శ్రీకృష్ణుఁడు సత్యభామను గల్పవృక్షమును నొక్కచో దించి హస్తమున నుడుముతోలుకవచముం దొడిగి కోపమున బొమముడి యమర సర్పనిర్మోకాచ్ఛాదనముం దొలఁగించి ధనువుం జేఁబూని యుద్ధసన్నద్ధుఁడయ్యెనని భావము.

విశే. నవ్వుట హేలాసూచకము.

క. తిగిచి శరాసన మెక్కిం
చి గుణధ్వని చేసి యంసశిరముల దొనలన్
బిగియించి తూపు లొక్కట
నిగిడింపఁ దొడంగె మరుదనీకినిమీఁదన్. 5

టీ. తిగిచి=ఆకర్షించి; అనఁగా నాచ్ఛాదనముం దొలఁగించి, శరాసనము=వింటిని, ఎక్కించి=ఎక్కువెట్టి, గుణధ్వని=నారియొక్క నాదము, చేసి=ఒనర్చి, అంసశిరములన్=భుజశిఖరములందు, దొనలన్=అమ్ములపొదులను, బిగియించి = బిగియఁగట్టి, తూపులు=బాణములు, ఒక్కటన్=ఒక్కమాఱుగా, మరుదనీకినిమీఁదన్ = సురసైన్యముపైని, నిగిడింపన్=వ్యాపింపఁజేయుటకు, తొడంగెన్=ప్రయత్నించెను.

క. భిన్నాసురాస్రములచవి
గన్న మురాహితశిలీముఖము లపు డనిలో
మున్నెఱుఁగని సురవీరుల
క్రొన్నెత్తురుచవియు నెఱిఁగి క్రోలఁ దొడంగెన్. 6

టీ. భిన్నాసురాస్రములచవి = నఱుకఁబడినరాక్షసులనెత్తురులరుచిని, కన్న = పొందిన, మురాహిత శిలీముఖములు=శ్రీకృష్ణునిబాణములు, అపుడు=ఆసమయమున, అనిలోన్ = యుద్ధములో, మున్ను = పూర్వమున, ఎఱుఁగని, సురవీరుల క్రొన్నెత్తురుచవియున్=దేవశూరులక్రొత్తరక్తపురుచియును, ఎఱిఁగి = తెలిసి, క్రోలన్=త్రావుటకు, తొడంగెన్ = పూనెను.

భా. శ్రీకృష్ణునిబాణములు సురరక్షణార్థ మింతకుమున్ను రక్కసులనే వధించిన వాటంజేసి దేవవీరులనెత్తురుచవి వానికిఁ దెలియదు. నేఁడు సురవీరులతో యుద్ధము తటస్థించుటచే సురవీరులనెత్తుటిరుచిగూడ నెఱింగెనని భావము.

చ. అమరహితంబు గోరి యసురాంగకము ల్విదళించునట్టి మా
కమరులఁ [1]ద్రుంపఁగావలసె నక్కట నేఁ డని సిగ్గుఁ జెందుచం
దమునఁ గఠోరశార్ఙ్గజనితప్రదరంబులు వైరిమర్మభే
దములొనరించి యుద్ధవసుధాస్థలిఁ [2]గూడఁగఁబాఱు నయ్యెడన్. 7

టీ. అమరహితంబున్=సురలమేలును, కోరి, అసురాంగకముల్=రాక్షసులయవయవములను, విదళించునట్టి=బద్దలుసేయునట్టి, మాకున్, అమరులన్=దేవతలను, త్రుంపఁగాన్=ఖండింపఁగా, వలసెన్=వచ్చెను. అక్కట=అయ్యో, నేఁడు, అని, సిగ్గు=లజ్జను, చెందుచందమునన్=పొందువిధమున, కఠోరశార్ఙ్గజనితప్రదరంబులు=కఠినమైనశార్ఙ్గమను

1 నొంపఁగా. 2 దూరఁగఁబాఱె.

గుణావుణుండి పుట్టినబాణములు, వైరిమర్మభేదములు = శత్రులయొక్క యువుపట్టులను భేదించునట్టివియును, ఒనరించి=చేసి, అయ్యెడన్ = ఆసమయమున, యుద్ధవసుధాస్థలిన్ = యుద్ధభూమియందు, కూడఁగన్ + పాఱున్ = గుంపులుగాఁ జేరును. అనఁగా శ్రీకృష్ణునిబాణములు సురవీరులమర్మముల విదళించి యుద్ధభూమిం గుమిగాఁ గూలెనని భావము.

విశే. రెండవపాదమున "త్రుంపఁగాన్" అనుచో "నొంపఁగాన్" అనుపాఠమగపడును. దేవతలమరులుగాన నొంపఁగా నను పాఠమే సరసమని తోఁచెడిని. అట్లే నాలవపాదమున "కూడఁగఁ బాఱు"ననుచో "దూరఁగఁబాఱె" అను పాఠ మగపడు. సిగ్గుఁజెందు చందముసు సూచింప దూరఁగఁబాఱె నను పాఠమే సమర్థమగుట నదియే యాదరణీయమని తోఁచెడిని. సిగ్గుఁజెందిన నొరులకంటఁబడఁజాలక దాఁగియుండ యత్నించుట నైజముగదా! మఱియు బాణవేగాతిశయముం దెల్ప దూరఁగఁబాఱె నను పాఠమే సమర్థమగునని చెప్పనగును.

సీ. హరిబాణలూనంబులై వచ్చునమరాస్త్ర
ఖండముల్ దూల్చుఁ బక్షముల జడిసి
యమృతగంధాసక్తమగుచంచుపుటమున
వడి సింధురంబులఁ బొడిచి యెత్తు
నధిపుఁ డేసినఁ బాఱునాశుగంబులకంటె
మునుమున్న చని లక్ష్యముల దళించు
భటులపై హరులపై బహురథాగ్రములపై
నొక్కఁడయ్యును దోఁచుఁ బెక్కుగతుల
తే. నఖముఖంబుల నిఱికి గండ్రలుగఁ జేయు
దివిజబిరుదధ్వజంబు [1]లుద్రేకవృత్తి
నిఖిలలోకాద్భుతావహానిర్నిరోధ
విక్రమస్ఫూర్తి ఖగరాజచక్రవర్తి. 8

టీ. నిఖిల......స్ఫూర్తి-నిఖిల = సమస్తమైన, లోక=జగత్తులకు, అద్భుత=ఆశ్చర్యమును, ఆవహ = కూర్చునట్టి, నిర్నిరోధ = అడ్డులేని, విక్రమ=పరాక్రమము యొక్క, స్ఫూర్తి = వికాసముగల, ఖగరాజచక్రవర్తి = గరుడుఁడు, ఉద్రేకవృత్తిన్ = విజృంభించిన వ్యాపారముతోడను, హరిబాణ లూనంబులై=శ్రీకృష్ణుని బాణములచేఁ దెగినవై, వచ్చు, అమరాస్త్రఖండముల్ = సురలబాణములముక్కలను, పక్షములన్ = ఱెక్కలచేత, జడిసి=వారించి, తూల్చున్ = ఎగురఁగొట్టును. అమృతగంధాసక్తము=అమృతముయొక్క పరిమళమునందుఁ బ్రేమగలది, అగు=అగునట్టి,

1 లుద్వేలవృత్తి.

చంచుపుటమునన్ = ముక్కుకొనచే, వడిన్=శీఘ్రముగ, సింధురంబులన్=ఏనుఁగులను, పొడిచి=గ్రుచ్చి, ఎత్తున్=పైకెత్తును; గరుడుఁడు తల్లిదాస్యముం బాప చంచుపుటమున నమృతముం గొనితెచ్చినవాఁడౌట నాతనిచంచుపుట మమృతగంధాసక్తమని యెన్నవలయును. అధిపుఁడు=తనవిభుఁడు శ్రీకృష్ణుఁడు, ఏసినన్=ప్రయోగింపఁగా, పాఱు=పఱుఁగెత్తు, ఆశుగంబులకంటెన్=బాణములకన్న, "ఆశు గచ్ఛంతీత్యాశుగాః" శీఘ్రముగఁ బోవునవనుట. ఇది యిచ్చోఁ బ్రయుక్తమగుట సరసము. మునుమున్న=ముందే, చని = పోయి, లక్ష్యములన్=గుఱిలను, దళించున్=చీల్చును. ఒక్కఁడయ్యును=అసహాయుఁడైనను,భటులపైన్=భటులమీఁదను,హరులపైన్=గుఱ్ఱములమీఁదను, బహురథాగ్రములపైన్ = అనేకరథములశిఖరములమీఁదను, పెక్కుగతులన్ = పలువర్తనములతో, తోఁచున్=అగపడును; అనఁగాఁ దానొక్కఁడేయైనను విక్రమకౌశలమున నెక్కడఁ జూచినను దానే యగపడుననుట. దివిజబిరుదధ్వజంబులు = సురలయాయాజయచిహ్నములు గలపతాకలను, నఖముఖంబులన్ = గోళ్లకొనలందు, ఇఱికి = ఇఱుకునట్లు చేసి, గండ్రలుగన్ = ముక్కముక్కలుగ, చేయున్=ఒనర్చును.

తే. సర్వతోముఖ మయి పేర్చుశార్ఙ్గిబాణ
వర్షసమ్మర్దదుర్దినవ్యాప్తివలన
నప్పు డెదిరించి పన్నిద్దఱహిమకరులుఁ
గానఁబడలేక తేజోవిహీను లైరి. 9

టీ. సర్వతోముఖమయి=అంతటను వ్యాపించినదై, పేర్చు=విజృంభించిన,శార్ఙ్గి... వ్యాప్తివలనన్ - శార్ఙ్గి = శ్రీకృష్ణునియొక్క, బాణవర్ష = అమ్ములవానయొక్క, సమ్మర్ద=రాపిడిచేనైన, (అనఁగా బాణవర్షమనువానవలనఁ గలిగినయనుట.) దుర్దిన=మేఘచ్ఛన్నదినముయొక్క, వ్యాప్తివలనన్ = క్రమ్ముటవలన, పన్నిద్దఱు+అహిమకరులున్=ద్వాదశాదిత్యులును, అప్పుడు, ఎదిరించి = మార్కొని; శ్రీకృష్ణుననుట. కానఁబడలేక=కనఁబడఁజాలక; అదృశ్యులైయనుట. తేజోవిహీనులు=కాంతిలేనివారు, ఐరి.

భా. మేఘచ్ఛన్నదినమున సూర్యుఁడు తేజోహీనుఁడై యదృశ్యుఁడగుట సహజము. ప్రకృతము శ్రీకృష్ణబాణవర్షముకతన దుర్దినము సంభవించెననియుఁ దానఁ బన్నిద్దఱుసూర్యులును దేజోహీనులై యదృశ్యులైరనియు భావము. ద్వాదశాదిత్యులు శ్రీకృష్ణబాణపాతమున కోర్వంజాలక తేజోవిహీనులై యోడి యదృశ్యులైరని తాత్పర్యము.

విశే. శార్ఙ్గి=శార్ఙ్గమను ధనువుగలవాఁడు, అహిమకరులు = సంతాపముం గలుగఁజేయువారు. ద్వాదశాదిత్యులు:—1. అర్యముఁడు, 2. ధాత, 3. త్వష్ట, 4. పూషుఁడు,

5. [illegible], 6. సవిత, 7. మిత్రుఁడు, 8. వరుణుఁడు, 9. అంశుమంతుఁడు, 10. [illegible], 11. శక్రుఁడు, 12. విష్ణువు.

సీ. చుక్కలరాణివాసములసోయగపుంజనుదోయి త్రెక్కనం
జిక్కన గ్గనుచు నక్కు యదుసింహుఁడు బాణపరంపరాహతిన్
వ్రక్కలు సేయఁ గాఱు రుధిరంబునఁ దోఁగుచు రేవెలుంగు కెం
పెక్కినచాయ నభ్యుదయ మేదియుఁ దాల్చె రణాంగణంబునన్. 10

టీ. చుక్కల......త్రెక్కనన్-చుక్కలరాణివాసముల = నక్షత్రములనెడు రాణులయొక్క, చంద్రుఁడు తారకాభర్తగదా. సోయగపుంజనుదోయి = సుందరమైన స్తనద్వంద్వము యొక్క, త్రెక్కనన్ = రాపిడిచేత, చిక్కనయైన = దట్టమైన; అనఁగా స్తనములరాపిడిచేఁ గఠినమైనదనుట. అక్కు = వక్షస్స్థలమును, యదుసింహుఁడు=శ్రీకృష్ణుఁడు, బాణపరంపరాహతిన్=బాణసమూహములదెబ్బచే, వ్రక్కలు= ముక్కలు, చేయన్=ఒనర్పఁగా; ఛేదింపఁగాననుట. కాఱు = స్రవించునట్టి, రుధిరంబునన్=నెత్తుటియందు, తోఁగుచు = మునుంగుచు, రేవెలుంగు = చంద్రుఁడు, అభ్యుదయము=అభివృద్ధి; ఉదయించుటయని యర్థాంతరము. ఏదియుఁ=విడిచియుఁ; అనఁగా లోకపక్షమున సొంపుచెడియనియుఁ; లోకపక్షమున నుదయించుట లేకున్ననియు భావము. రణాంగణంబునన్=యుద్ధభూమియందు, కెంపెక్కినచాయన్=ఎఱుపెక్కిన కాంతిని; ఎఱ్ఱని కాంతిననుట. తాల్చెన్=ధరించెను.

భా. చంద్రుఁ డుదయించునపు డరుణకాంతిని ధరించుట సహజము. ప్రకృత మభ్యుదయములేకున్నను నరుణకాంతి నాతఁడు ధరించెను. ఇది యెట్లుపొసఁగును? శ్రీకృష్ణబాణములదెబ్బచే తారకారాణుల స్తనద్వంద్వముల యొరయికం గర్కశమైన చంద్రునురము చీలుపఁబడెననియు, నందుండి కాఱురుధిరంబు శరీరమంతటను వ్యాపించుట [illegible] నుదయించుట లేకున్నను ప్రకృత మభివృద్ధిచెడినను, నరుణగాత్రుఁ డయ్యెనని భావము. అనఁగాఁ జెలువేది చందురుండు రక్తసిక్తగాత్రుఁ డయ్యెనని భావము. అలం. విరోధము.

గీ. వోద్య మప్పుడు భవరోగవైద్యుఁ డైన
యంబుజోదరు డాసినయంతమాత్ర
నసురతాసాధ్యగదుఁ డయ్యె యక్షభర్త
సోదిరి రుద్రులు నిర్ముక్తరోగు లైరి. 11

టీ. అప్పుడు, భవరోగవైద్యుఁడైన = సంసార మనురోగమునకు వైద్యుఁడు, అంబుజోదరున్ = శ్రీకృష్ణుని, డాసినయంతమాత్రన్ = సమీపించినంతమాత్రముననే

యక్షభర్త=కుబేరుఁడు: కుత్సితదేహుఁడనియుఁ నర్థాంతరము. ఈపక్షమునఁ ద్వ్యగ్రోగి యనిభావము. అపగతా......గదుఁడు - అపగత=నశించిన, అసాధ్య=జితముకాని, గదుఁడు = గదకలవాఁడు, అపగత=పోయిన, అసాధ్య = సాధ్యముకాని, గదుఁడు= రోగముకలవాఁడు, అనియర్థాంతరము. అయ్యెన్=అయెను, సొరిదిన్ = క్రమముగా, రుద్రులు=ఏకాదశరుద్రులును, నిర్ముక్తశూలులు=విడువఁబడిన త్రిశూలములుగలవారు; పోయిన శూలరోగముగలవారని యర్థాంతరము. ఏరి=అయిరి.

భా. లోకమున నుత్తమవైద్యునిచెంతకుఁ బోఁగానే వివిధరోగములు శూలలు, నివర్తించునటుల సంసారరోగ వైద్యుఁడగు శ్రీకృష్ణుని సమీపింపఁగనే కుబేరుఁడు నిరస్త గదుఁడును, రుద్రులు నిర్ముక్తశూలులును నైరని భావము. అనఁగాఁ గుబేరుని గదధ్వస్త మయ్యెననియుఁ; రుద్రులత్రిశూలములు నిరర్థకము లయ్యెననియుఁ దాత్పర్యము. అలం. శ్లేషము. అతిశయోక్తి.

సీ. నిర్భగ్నశృంగుఁడై నిజవాహనముఁ దాను
వైవస్వతుఁడు లాఘవంబు నొందె
దళితశాతకృపాణదంష్ట్రమై నైరృత
భుజభుజంగస్వామి పొల్లువోయె
నిర్ధూతహేతి యై నిలువు నీఱుగ నగ్ని
దేవుండు నిర్వాణతేజుఁ డయ్యె
భయపలాయనవేళఁ బవమానునకు నాత్మ
జవసత్త్వములకల్మి సఫల మయ్యె
తే. వరుణునకు డాఁగిలొనఁ జోటు వలఁతి యగుట
నుదధినాయకభావంబు నుపకరించె
జలరుహోదరసవ్యాపసవ్యముక్త
నిష్ఠురాస్త్రంబు లొండొండ నిగుడునపుడు. 12

టీ. జలరుహోదర...స్త్రంబులు - జలరుహోదర = పద్మనాభుఁడగు శ్రీకృష్ణుని యొక్క, సవ్యాపసవ్య = కుడియెడమచేతులచేత, ముక్త=విడువఁబడిన, నిష్ఠుర=క్రూర ములైన, అస్త్రంబులు = బాణములు, ఒండొండన్ = ఒకటితోనొకటి, నిగుడునపుడు= వ్యాపించునపుడు; అనఁగా నొకదానినొకటియంటి పుంఖానుపుంఖముగఁ బ్రసరించునపు డనుట. వైవస్వతుండు=యముఁడు, నిజవాహనమున్ = తనవాహనమగు నెనుబోఁతును, తానున్, నిర్భగ్నశృంగుఁడై = శృంగభంగముగలవాఁడై అని యమపరార్థము. విఱిగిన కొమ్ములుగలదైయని మహిషవాహనపరము. శృంగభంగమనఁగా నవమానముగాన యముఁ

[illegible] నిరిచెను, వాహనమగుమహిషమునకుఁ గొమ్ములువిఱిగెననియుఁ దాత్ప [illegible] =ములకఁదనమును, ఒందెన్ =పొందెను. కొమ్ములబరువుత గ్గెనుగాన [illegible]మును బొందెననుట. నైరృతభుజభుజంగస్వామి=నైరృతుఁడను దిశా [illegible], బాహువనెడు సర్పశ్రేష్ఠము, దళిత...దంష్ట్రమై-దళిత = చీల్చఁబడిన, [illegible]డియైనకత్తియనెడు, దంష్ట్రమై=కోరకలదై, పొల్లుపోయెన్ = వ్యర్థ [illegible] కోరఁబెఱికినపామువలె నైరృతుఁడుభుజమునందలి కత్తినిగోల్పోయి [illegible]నుట. అగ్నిదేవుండు, నిర్ఘాత హేతియై=నష్టమైనజ్వాలలుగలవాఁడై; కత్తి [illegible] యర్థాంతరము. నిలువునీఱుగన్ = నిశ్చేష్టుఁడై; నిలిచియున్నపాటుగా [illegible] యర్థాంతరము. నిర్వాణతేజుఁడు = నశించినప్రతాపముగలవాఁడు, ఆరిన [illegible]లవాఁడు, అయ్యెన్. అగ్నిదేవుఁడు తనయాయుధముంగోల్పోయి 'నిస్తేజస్కుఁడై [illegible]డై, మంటలారుట, భస్మరూపముందాల్చుట, యారిపోవుట' యనుసహజధర్మములం [illegible] భావము. భయపలాయనవేళన్=భయముతోఁబరువిడిపోవుసమయమున, పవ [illegible] =వాయుదేవునకు, ఆత్మజవసత్త్వములకల్మి = తనవేగముయొక్కయు, బలము [illegible] నునికి, సఫలము = ఫలవంతమైనది, అయ్యెన్; అనఁగా నుపకరించెననుట. [illegible]లకోర్వంజాలక వాయుదేవుఁడు తనకుఁగలవేగమును బలమును వినియోగ [illegible] పాఱిపోయెనని భావము. వాయువు మహావేగుఁడును మహాబలుఁడునుగదా. [illegible], డాఁగికొనన్ =దాఁగుకొనుటకు, చోటు=స్థలము, వలఁతి = సమర్థమైనది, [illegible] = సంభవించుటంజేసి, ఉదధినాయకభావంబున్ = సముద్రాధిపత్యముగూడ, [illegible] =ఉపయోగపడెను. వరుణుఁడు సాగరాలయుఁడును సాగరస్వామియుఁగాన [illegible]బాణప్రహారముల కోడి యుదధిందాఁగెనని భావము.

వ. మఱియు నమ్మధుమథను సముద్దండ దోర్దండ మండలీకృత శార్ఙ్గ కోదండ నిర్ముక్త నిర్భర క్రూర నారాచ ధారా నిపాతంబున గవాక్షిత [illegible] లగుయక్షులును, చక్రనిర్వక్రవిక్రమ క్రీడలం బరిచ్ఛిన్నకర్ణనా [illegible]ధరు లగువిద్యాధరులును, కౌమోదకీ ప్రహారంబులం జూర్ణీకృత [illegible]మధ్యు లగుసాధ్యులును, నందకాసిధారావిదారణంబునం బ్రత్య [illegible]శిథిలితానువిద్ధులగుసిద్ధులును, బతంగపుంగవ పక్షవిక్షేపణాహ [illegible]ండూలి జర్జరు లగునిర్జరులును, ధైర్యంబులతోడన కంకటంబులు ప్రస్విసం జాలుకఁదనంబు నొంది సాధ్వసోద్రేకంబున భద్రదంతా [illegible]ంబుల డిగ్గ నుఱికి మేరుశిఖరంబులు ప్రాఁకియు రథ్యసారథిసహి

తంబుగా శతాంగంబులు పొడిపొడి యైనం జూరమలు వెలుంగక మాతంగశవంబుల క్రింద సీఁగియు భగ్నచరణంబులై తలకెడవుగం ద్రెళ్లినతురంగకళేబరంబులం గౌఁగిలించుకొని నిర్జీవులుంబోలె గ్రుక్కుమిక్కనక పక్కెరలు పైఁ ద్రోచుకొనియును సంత్యక్తహేతివర్గంబును సర్వతః ప్రధావనమార్గంబును బ్రవర్తితప్రార్థనాలాపంబును బరిధూయమానకేశకలాపంబునుంగాఁ గాందిశీకత్వంబు నొంది తిరుగుడు వడి పాంచజన్యఘోషంబు మున్నుగా దిగంతంబు లంటంబఱచుటయుఁ, బ్రహారమూర్ఛాపరవశు లగుజయంతనలకూబర చిత్రసేనాదులం గనకకమలదళపుటానీయమానంబు లగు నభ్రగంగాపానీయంబుల సేదదేర్చి ఫలకగర్భంబులకుం దార్చి నిజనివాసంబులకుం జేర్చికొనునాప్తసేవకవర్గంబువలనను, విలూనదండంబులై పడిన ధవళచ్ఛత్త్రంబులఁ బ్రఫుల్లపుండరీకంబులని పరిభ్రాంతి నొడియనట్టాడుచు నిపాతితవరుణంబై నింగిఁ బేరెంబు వాఱు వాహనహంసంబువలనను, మేదురమేదగపంకసంకులంబులగురుధిరపల్వలంబులు దఱిసి మజ్జనక్రీడాపరాయణంబై చండి వడిఁ గదలమిం గృతాంతుండు విడిచి పోయిన జిఱికొట్టుచుఁ దిరుగునున్మత్తలులాయంబువలనను, మూర్ఛితక్షపాకరమండలనిర్గతంబై నిర్గళితశృంగం బగులాంఛనమృగంబుం గురంగీశంకం దఱిమికొని వెనువెంటం దిరుగుపలాయితపవమానవిముక్తకురంగంబువలనను, వైనతేయచరణ నఖముఖాఘాతనిపాతితంబులై రణధూళిధూసరితంబు లగురుద్రజటామండలమండన శశిఖండఖండంబులఁ గర్ణపూరంబులుగా నిడుకొనువేడుకం గూడ నొండొరులఁ గడవం *గేరికొను బేతాళబాలికా జనంబులవలనను, గదనరంగం బభిరామం బయ్యె నయ్యవసరంబున. 13

టీ. మఱియుఁ, అమ్మధుమథను...నిపాతంబునన్ - అమ్మధుమథను=ఆమధుసూదనునియొక్క, సముద్దండ=అధికమైన, దోర్దండ=దండముంబోలు చేతియందు, మండలీకృత=గుండ్రముగాఁజేయఁబడిన, శార్ఙ్గకోదండ=శార్ఙ్గమనుధనువునుండి, నిర్ముక్త=విడువఁబడిన, నిర్భర=పూర్ణమైన, క్రూర=భయంకరమైన, నారాచధారా = బాణధారయొక్క, నిపాతంబునన్ = పడుటచేత; అనఁగా నెడతెగని శ్రీకృష్ణబాణముల పాతముచేననుట.

* జేరుకొను.

[illegible]లగు=చిటికెలవలెఁ జేయఁబడిన ఱొమ్ములుఁగలవారగు; అనఁగాఁ జిల్లులుపోయిన [illegible]. యక్షులును, చక్ర...క్రీడలన్-చక్ర = సుదర్శనమనుచక్రాయు[illegible], నిర్వక్ర=అకుటిలమైన, విక్రమ = పరాక్రమముయొక్క, క్రీడలన్ = [illegible], పరిచ్ఛిన్నకర్ణనాసాధరులు=తెగినచెవులను ముక్కులను ధరించినవారగు, విద్యా[illegible], చక్రపుదెబ్బల చేఁ గొందఱకు విద్యాధరులకుఁ జెవులును గొందఱకుముక్కులును [illegible] భావము. కౌమోదకీప్రహారంబులన్ =కౌమోదకి యనుగదయొక్క దెబ్బలచే, [illegible]శిరోమధ్యులు=చూర్ణముగాఁ జేయఁబడిన తలనడుమభాగముగలవారు, అగు= [illegible], సాంధ్యులును, నందకాసిధారావిదారణంబునన్ =నందకమనెడి కత్తియంచుచేనైన [illegible], ప్రత్యవయవశిథిలితానువిద్ధులు=ప్రత్యంగముయొక్క శైథిల్యముతోఁ [illegible], అగు=ఐన, సిద్ధులును; అనఁగా నందకాసిచేనంగము లెల్లవిదారితములగుట; [illegible]లములైనయంగములతోఁ గూడినవారని తాత్పర్యము. పతంగపుంగవపక్షవిక్షేపణా[illegible] =పక్షిశ్రేష్ఠమగు గరుడునియొక్క ఱెక్కలవిక్షేపమువలనిదెబ్బచే,తూలి,జర్జరులు= [illegible], అగు=ఐన, నిర్జరులును, ధైర్యంబులతోడన = ధైర్యముతోఁగూడియే, కంకటం[illegible]=కవచములు, వ్రస్సినన్ = బద్దలుకాఁగా; అనఁగా ధైర్యముతోఁబాటుగఁ గవచ[illegible] శీర్ణములయ్యెననుట. చులుకఁదనంబున్ = లఘుత్వమును; నీచత్వముననుట. కవ[illegible] శరీరభారభూతములు జాఱెనుగానఁ జులకందనము కల్గెననియు గ్రహించునది. [illegible], సాధ్వసోద్రేకంబునన్ =భయాతిరేకముచే, భద్రదంతావళంబులన్ =భద్రగజము[illegible], డిగ్గఁ =దిగునట్లుగా, ఉఱికి= గెంతి; దిగియనుట. మేరుశిఖరంబులు=మేరుపర్వతశిఖరములు, ప్రాఁకియుం=ఎగఁబ్రాఁకియును, రథ్యసారథిసహితంబుగాన్ =గుఱ్ఱములతోడను సారథులతోడను, శతాంగంబులు = రథములు, పొడిపొడి = చూర్ణము, ఐనన్ =కాఁగా, [illegible]=చొచ్చుటకు, మఱువు=రహస్యమగుచోటు, ఎఱుంగక=కానక, మాతంగశవంములక్రిందన్ =చచ్చినయేనుఁగులక్రిందను, ఈఁగియున్ = అణఁగియును, భగ్నచరణం[illegible]=నలుకఁబడినకాళ్లుగలవై, తలకెడవుగన్ = తారుమాఱు మెడలుకలుగునట్లుగా, [illegible]=ఘుపింబడిన, తురంగకళేబరంబులన్ = గుఱ్ఱములశరీరములను, కౌఁగలించికొని= [illegible]గనము చేసికొని, నిర్జీవులుంబోలెన్ = ప్రాణములేనివారువలె, గ్రుక్కుమిక్కనక= [illegible]యక గుటకవేయక, పక్కెరలు=ఏనుఁగు గుఱ్ఱము మున్నగువానివీపుపై వేయఁబట్టు[illegible], [illegible]=తమమీఁద, త్రోచుకొనియును=వైచికొనియును; అనఁగా వానిని గప్పికొని[illegible]. సంత్యక్త హేతివర్గంబును = విడువఁబడిన యాయుధములుగలవారును, సర్వతః[illegible]ంబును=అంతటను బరుగెత్తుత్రోవగలవారును; అనఁగా మార్గమంతటనుబరు[illegible]. ప్రవర్తిత ప్రార్థనాలాపంబును=చేయఁబడిన ప్రార్థనావాక్యములుగల

వారును; అనఁగా విడువుమని వేఁడికొనుచుండిరనుట. పరిధూయమానకేశకలాపంబునున్ = చెదరి చలించు శిరోజములుగలవారును, కాన్ = అగునట్లుగా, కాందిశీకత్వంబున్ = భయముచే నల్దిక్కులకేగుటను, ఒంది = పొంది, తిరుగుడువడి = సంభ్రమమునంది, పాంచజన్యఘోషంబు = శ్రీకృష్ణ విజయశంఖధ్వని, మున్నుగాన్ = ముందుగాఁగ, దిగంతంబులు = దిశలకొసలు, అంటన్ = చేరునట్లు, పఱచుటయున్ = పరుగెత్తఁగా, పైయుపమాపక్రియలకెల్లను పైని బేర్కొనఁబడిన యక్షసాధ్య విద్యాధరాది పదములు కర్తలు. ప్రహారమూర్ఛాపరవశులు = దెబ్బలచేనైన యింద్రియముల తెలివితప్పుటచే నస్వాధీనులు, అగు = ఐనట్టి, జయంతనలకూబర చిత్రసేనాదులన్ = జయంతుఁడు, నలకూబరుఁడు, చిత్రసేనుఁడు మొదలగువారిని, కనకకమలదళపుటానీయమానంబులగు = బంగరుపద్మముల రేకులచేనైన దొప్పలచేఁ దిసికొనిరాఁబడినవైన, అభ్రగంగాపానీయంబులన్ = ఆకాశగంగోదకములచే, సేదదేర్చి = శ్రమ మపనయించి, ఫలకగర్భంబులకున్ = పీఁటలనడుమకు, తార్చి = పొందించి, నిజనివాసంబులకున్ = తమయిండ్లకు, చేర్చికొను = పొందించుకొను, ఆప్తసేవకవర్గంబువలనను = ఇష్టులగు భృత్యులసమూహము వలనను; అనఁగా సేవకులు తమస్వామి కుమారాదులను మిన్నేటి నీటిని దెచ్చి ప్రహారములవలని మూర్ఛఁదేర్చి మెల్లఁగ ఫలకగర్భంబులందార్చి యిండ్లకుఁ గొనిపోయిరనుట. విలూనదండంబులై = శిథిలములైన కఱ్ఱలుగలవై; అనఁగా జాఱినకఱ్ఱ గలవనుట. పడిన = భూమిపైఁబడిన, ధవళచ్ఛత్రంబులన్ = వెల్లగొడుగులను, ప్రఫుల్ల పుండరీకంబులు = వికసించిన తెల్లఁదామరలు, అని, పరిభ్రాంతిన్ = మోహముతో, ఒడియన్ = గ్రహించుటకు, అల్లాడుచు = చుట్టుపట్ల వదలక సంచరించుచు, నిపాతితవరుణంబై = పడఁద్రోయఁబడిన వరుణుఁడుగలదై, నింగిన్ = ఆకసమున, పేరెంబువాఱు = పరుగెత్తుచున్న, వాహనహంసంబువలనను = వాహనమైన హంసవలనను; అనఁగా వరుణవాహన మగు హంసదండములు తెగి భువిఁ ద్రెళ్లిన వెల్లగొడుగులంగాంచి తెల్లతామరలను భ్రమంజెంది తనకుఁదామరలు ప్రియమైనవిగానఁ దనరౌతును వరుణుని దిగఁద్రోసి యావెల్లగొడుగులదరికేగి తిరుగుచుండెనని భావము. మేదురమేదఃపంకసంకులంబులగు = దట్టమగు మేదస్సనెడు బురదచే విస్తారములైన, రుధిరపల్వలంబులన్ = నెత్తుటిగుంటలను, బురదంబోలు మేదస్సుతోడను, నిండిన నెత్తుటిచే నిండిన చిన్నచిన్న పల్లపునేలలనని భావము. తఱిసి = సమీపించి, మజ్జనక్రీడాపరాయణంబై = మునుంగుట యనునాటయందాసక్తిగలదై, చండి = చండితనమునంది, వడిన్ = శీఘ్రముగా, కదలమిన్ = కదలకుండుటచే, కృతాంతుండు = యముఁడు, విడిచి, పోయినన్ = పోఁగా, జిఱ్ఱొట్టుచున్ = బుసకొట్టుచు, తిరుగు = సంచరించు, లులాయంబువలనన్ = ఎనుపోతువలనను;

[illegible] యమవాహనమగు మహిష మాకదనరంగమున నచ్చటచ్చట మేదస్సు [illegible] రక్తముతోడను నిండిన చిన్నచిన్నగుంటలంగాంచి బురదనీటిగుంట లనుభ్రమం [illegible] బురదనీటిగుంటలందు మునుంగు కోర్కి మిక్కుటముగానఁ దనస్వామి [illegible] యగణించినను మొండితనముపూని కదలకయుండెననియు, దాన నాతఁడు దానిని విడిచిపెట్టి పోయెననియుఁ, బిదప నది బుసకొట్టుచు నచ్చోఁ దిరుగుచుండెననియుఁ దాత్పర్యము. మూర్ఛితతమఃపాకరమండల నిర్గతంబై = మూర్ఛనందిన చంద్రునియొక్క గుండెకాయనుండి వెడలినదై, నిర్గళిత శృంగంబగు = జాఱినకొమ్ములు గలదైన, లాంఛనమృగంబున్ = చంద్రలాంఛనమగు కురంగమును; చంద్రునియందలిమచ్చను కొందఱు కురంగముగను గొందఱు భూచ్ఛాయగను మఱికొందఱు వేఱొకరీతిగను చెప్పుచుందురనుట ప్రసిద్ధము. అం దిచ్చోఁ గురంగరూపముననే యది సంభావితమయ్యె నని యెన్నునది. కురంగీశంకన్ = ఆఁడులేడి యనుభ్రమతో, తఱిమికొని = వెంబడించి, వెనువెంటన్ = వెనుక వెనుకను, తిరుగు = సంచరించు, పలాయిత పవమానవిముక్త కురంగంబువలనను = పాఱిపోయిన వాయుదేవునిచే విడువఁబడిన మగలేడివలనను; వాయుదేవునకు లేడివాహనము. ఆతఁ డద్దాని నచ్చో దిగవిడిచి యుద్ధరంగమును వీడి భయమునఁ బాఱిపోయెను. పిదప నది యుద్ధమునఁ గొమ్ములు గోల్పోయిన చంద్ర లాంఛనమగు కురంగముంగాంచి యాఁడులేడికిఁ గొమ్ము లుండకుండుట సహజ [illegible]ంజేసి ప్రకృతము దీనికిఁ గొమ్ములు లేమింజేసి యాఁడులేడియను భ్రమనంది దాని వెంబడించి తిరుగుచుండెనని తాత్పర్యము. వైనతేయ......నిపాతితంబులై- వైనతేయ = గరుడునియొక్క, చరణ = కాళ్ళలందలి, నఖ = గోళ్ళలయొక్క, ముఖ = కొనలయొక్క, ఆఘాత = దెబ్బలచే, నిపాతితంబులై = క్రిందఁ ద్రోయఁబడినవై, రణ ధూళీ ధూసరితంబులగు = యుద్ధమునందలి పరాగముచే ధూమ్రవర్ణముగలవైన, రుద్ర జటామండల మండన శశిఖండఖండంబులన్ - రుద్ర = పదునొకొండుగురగు నీశానులయొక్క, జటామండల = జటామండలములకు, మండన = అలంకారములైన, శశిఖండ = చంద్రకళల సంబంధమైన, ఖండంబులన్ = ముక్కలను, కర్ణపూరంబులు గాన్ = కర్ణాభరణములుగా, ఇడుకొను = పెట్టుకొనునట్టి, వేడుకన్ గూడ = సంతోషముతోఁగూడ, ఒండొరులన్ = ఒకరినొకరు, కడవన్ = అతిక్రమించుటకై, కేరికొను = బేతాళ బాలికాజనంబులవలనను = బేతాళ కన్యాసమూహమువలనను; అనఁగా నేకాదశరుద్రుల జటామండలముల కలంకారములైన శశిఖండములు గరుడ నఖాఘాతములచే ముక్కముక్కలై యుద్ధభూమిని రాలి యందలిధూళిచే దూసరితములయ్యెనని యట్టి యాముక్కలను గర్ణాభరణముగాఁ జేయఁదలంచినవారై యచటి

భూతబాలిక లన్యోన్య మామక్కులకై యహమహమికతో నొకరికన్నముం దొకరు పఱుగిడుచుండిరనియుం భావము. కదనరంగంబు = యుద్ధభూమి, అభిరామంబు= మనోహరమైనది, అయ్యెన్, అయ్యవసరంబున = ఆసమయమునందు; పైనివర్ణించిన ప్రకారము సేవకులు, హంస, మహిషము, కురంగము, బేతాళబాలికలు ప్రవర్తించు టంబట్టి, యుద్ధభూమి మనోహరమయ్యెనని యెన్నునది.

విశే. ఈసందర్భమునఁ గవి నిపుణముగా నీశానుల పరాభవమును సూచించెనుగాని తక్కిన దేవతలకువలె నిష్ఠురముగా వర్ణింపఁడయ్యెను.

చ. హరిహయుఁ డాగ్రహోజ్జ్వలితుఁడై యనిఁ బాఱుదిశాధినాథులన్
దిరుగుఁడు పోకుపోకుఁ డని తిట్టి యదల్చి నవోదయత్పయో
ధరము నలంకరించు తనధన్వ మధిజ్యము చేసి గోత్రభీ
కరముగ బాహు లెత్తి తమకంబున సేనకుఁ జేయివీచినన్. 14

టీ. హరిహయుఁడు=దేవేంద్రుఁడు, ఆగ్రహోజ్జ్వలితుఁడై=కోపముచే నుద్దీప్తుఁడై, అనిన్=యుద్ధమునుండి, పాఱు=పరుగెత్తు, దిశాధినాథులన్=దిక్పతులను, తిరుగుఁడు= మఱలుఁడు, పోకుపోకుఁడు=పోకుఁడుపోకుఁడు, అని, తిట్టి=దూషించి, అదల్చి=భయ పెట్టి, నవోదయత్పయోధరమున్=క్రొత్తఁగానుదయించిన మేఘమును, అనఁగాఁ దొలు కారు మొగులుననుట. అలంకరించు = భూషించు, ఇంద్రధనువు మేఘమునకు శోభను గలుగఁజేయునదియు, సామాన్యముగఁ దొలుకారునఁగల్గునదియుం నగుఁగదా. దానినిఁ బోలునదని తాత్పర్యము. తనధన్వము = తనవింటిని, అధిజ్యము చేసి=ఎక్కుపెట్టి, గోత్ర భీకరముగన్=కొండలకు భయంకరమగునట్లుగా; రాజులకుభయము గలుగునట్లుగాననియుం నర్థాంతరము. బాహులు=చేతులు, ఎత్తి=పైకెత్తి, తమకంబునన్ = సంభ్రమముతో, సేనకున్=సైన్యమునకు, చేయి+వీచినన్=రండని హస్తమెత్తి సంజ్ఞసేయఁగా.

విశే. అధిజ్యము=ఎక్కుపెట్టిననారిగలది.

క. గిరితటముఁ దాఁకి తిరిగెడు
తరంగిణియుఁ బోలె దేవతాపతియాజ్ఞన్
మరలి వియచ్చరవాహిని
మురహరునిం బొదివి ఘోరముగఁ బోరునెడన్. 15

టీ. వియచ్చరవాహిని = దేవసైన్యము; దేవనదియనియుం నర్థాంతరము. గిరితట మున్=పర్వతతటము, తాఁకి=అంటి, తిరిగెడు=మరలునట్టి, తరంగిణియుఁబోలె=నదివలె, దేవతాపతియాజ్ఞన్=దేవేంద్రునియాజ్ఞచే, మరలి=తిరిగి, మురహరునిన్ = శ్రీకృష్ణుని,

[illegible] ఘోరముగన్ = భయంకరముగ, పోరునెడన్ = యుద్ధము సేయునపుడు [illegible]. ఇంద్రుని యాజ్ఞ గిరితటమువలెను, వియచ్చరవాహిని తరంగిణివలెను [illegible] ఇంద్రుని యాజ్ఞాశ్రవణమును, మరలునదివలె సైన్యము మరలుటయు [illegible].

ఉ. *ఝింగను మ్రోంత మ్రోఁగుచును తెక్కలపాములువోలె శౌరిచే సింగిణివింట వెల్లిగొను చిత్రశరంబులు సూతు నొంచి ర థ్యాంగకము ల్దళించుచు నిజావయవంబులఁ దూల్ప దేవతా పుంగవుఁ డోసరించుటయు బోరన నడ్డముసొచ్చె సైన్యముల్. 16

టీ. ఝింగను మ్రోంతన్ = ఝింగనుధ్వనితో, మ్రోఁగుచును = ధ్వనిచేయుచు, తెక్కలపాములువోలెన్ = తెక్కగలసర్పములవలె, శౌరిచేసింగిణివింటన్ = శ్రీకృష్ణుని చేతియందలి సింగిణివింటనుండి, వెల్లిగొను చిత్రశరంబులు = ప్రవహించుచిత్రములైన బాణములు, సూతున్ = సారథిని, నొంచి = నొప్పించి, రథ్యాంగకముల్ = గుఱ్ఱములయవయవములను, దళించుచున్ = చీల్చుచు, నిజావయవంబులన్ = తనయవయవములను, తూల్పన్ = సంచలింపఁజేయఁగా; అనఁగా శ్రీకృష్ణబాణములు ధ్వనిచేయుచుఁ బరంపరగా వెడలి యింద్రునిసారథిని నొప్పించి గుఱ్ఱములయవయవములంజీల్చి యింద్రుని యంగములం గూడ బాధించెననుట. దేవతాపుంగవుఁడు = దేవేంద్రుఁడు, ఓసరించుటయున్ = [illegible]యఁగానే, బోరనన్ = శీఘ్రముగా, సైన్యములు, అడ్డముసొచ్చెన్ = మధ్యపడెను.

కు. మది నొక్కిలించుక శంక లేక సమరోన్మాదంబునం బేర్చి బె ట్టిదమై తాఁకినదేవతారథికకోటిం గిట్టి తూలించెను న్మదవేదండఘటాతమశ్చయనిశమ్మన్యంబుఁ దత్సైన్యమున్ గదచే శార్ఙ్గముచే రథాంగకముచేఁ గంసారి హింసారతిన్. 17

టీ. మదిన్ = మనస్సునందు, ఒక్కించుక = కొంచెమైనను, శంక = సందేహము, లేక; అనఁగా మనము శ్రీకృష్ణుని గెల్వఁగలమా యనువిచారమును మానియనుట. సమరోన్మాదంబునన్ = యుద్ధోన్మత్తతచే, పేర్చి = విజృంభించి, బెట్టిదమై = భయంకరమై, తాఁకిన = ఎదుర్కొనిన, దేవతారథికకోటిన్ = సురరథికులగుంపును; రథములనున్న సురలననుట. ఉన్మద......నిశమ్మన్యంబున్ - ఉన్మద = అధికమదముగల, వేదండఘటా = గజబృందము [illegible], తమశ్చయ = చీఁకటులచే, నిశమ్మన్యంబున్ = రాత్రియనితలంపఁదగినట్టి, తత్సైన్య

*ఝింగున మోము మ్రోయుచును.

మున్ = ఆదేవసైన్యమును, గదచేన్ = కౌమోదకిచేతను, శార్ఙ్గముచేన్ = శార్ఙ్గమనుధనువుచేతను, రథాంగకముచేన్ = సుదర్శనమనుచక్రముచే, కంసారి = శ్రీకృష్ణుఁడు, హింసారతిన్ = హింసయందైనయాసక్తితో; అనఁగా హింసింతునను నుత్సాహముతోననుట. కిట్టి = తొడరి, తూలించెన్ = పాఱఁదోలెను.

ఉ. సైనికు[1]లెల్ల నంత రణసన్నహనం బెడలించి పాఱిన
న్నానయు నచ్చలంబు మది నాటుకొనంగఁ గపోలమండలీ
దానమిళద్ద్విరేఫనినదంబులఘీంకృతి సందడింప వె
ల్లేనుఁగు మీఁద డీకొలిపి యింద్రుఁ డుపేంద్రునిఁ దాఁకెనుద్ధతిన్. 18

టీ. అంతన్, సైనికులెల్లన్ = సేనలోనివారెల్లను, రణసన్నహనంబు = యుద్ధసన్నాహమును, ఎడలించి = సడలించి; అనఁగా యుద్ధయత్నమును విడిచి యనుట. పాఱినన్ = పాఱిపోఁగా, నానయున్ = సిగ్గును, అచ్చలంబున్ = ఆగ్రహమును, మదిన్, నాటుకొనంగన్ = నాటఁగా, కపోల.....నినదంబులన్ - కపోలమండలీ = గండస్థలముల యందైన, దాన = మదముకొఱకు, మిళత్ = చేరిన, ద్విరేఫ = తుమ్మెదలయొక్క, నినదంబులన్ = ధ్వనులతో, ఘీంకృతి = ఘీంకారము, సందడింపన్ = సందడిసేయఁగా; కలిసికొనఁగా ననుట. వెల్లేనుఁగున్ = తెల్లయేనుఁగగునైరావతమును, మీఁదన్ = శ్రీకృష్ణునిపైకి, డీకొలిపి = పురికొలిపి, ఉద్ధతిన్ = గర్వముతో, ఇంద్రుఁడు, ఉపేంద్రునిన్ = ఇంద్రావరజుని శ్రీకృష్ణుని, తాఁకెన్.

క. పునరాగతుఁ డగుమఘవునిఁ
గనుఁగొని తనమ్రోల నున్న కామినినెమ్మో
మున దృష్టి నిలిపి మురమ
ర్దనుఁ డిట్లను హాసగర్భిత[2]క్రోధోక్తిన్. 19

టీ. పునరాగతుఁడగు = తిరుగవచ్చిన, మఘవునిన్ = ఇంద్రుని, కనుఁగొని = చూచి, తనమ్రోలన్ = తనయెదుట, ఉన్న కామినినెమ్మోమునన్ = ఉన్న స్త్రీయొక్క మనోహరమగుముఖమునందు; సత్యమొగమునందనుట. దృష్టి = చూపును, నిలిపి, హాసగర్భితక్రోధోక్తిన్ = నగవుచే గర్భితమైన కోపోక్తితో, ఇట్లనున్ = ఇట్లనెను.

వి శే. సత్యమొగమునఁ జూపునిల్పుటకుఁ దనపౌరుషాతిశయమును, వాసవునిపరాభవమును బ్రేయసికిఁ బ్రకాశింపఁజేయుంటయే ఫలమని గ్రహించునది.

---

1 లివ్విధింగదనసన్నహనం. 2 ప్రౌఢోక్తిన్

ఉ. అచ్చరలేమ లెల్ల నగ నాహవభూస్థలిఁ దానుఁ దోడుగా
వచ్చిన తద్దిశాధిపతివర్గములుం దల లూడఁ బాటియు
మచ్చటులాస్త్రఘట్టన మనంబున నెంచక *నానగేడి యై
వచ్చినవాఁడు చూచితివె వాసవునిం గమలాయతేక్షణా! 20

టీ. అచ్చరలేమ లెల్లన్=అప్సరస్త్రీ లెల్లరును, నగన్ = నవ్వఁగా, ఆహవభూస్థలిన్=యుద్ధభూమియందు, తానున్, తోడుగాన్=సహాయముగా, వచ్చిన, తద్దిశాధిపతివర్గములున్=ఆదిక్పాలురును, తలలు, ఊడన్=ఊడఁగా; అనఁగాఁ దల వెంట్రుకలు రాలఁగా ననుట. పాటియున్=పరుగెత్తియు, మచ్చటులాస్త్రఘట్టనన్=నాసంబంధమైన తీక్ష్ణములగు నస్త్రములరాపిడిని, మనంబునన్=మదియందు, ఎంచక= గణింపక, నానగేడియై=సిగ్గులేనివాఁడై, వచ్చినవాఁడు, కమలాయతేక్షణా = పద్మములవలె దీర్ఘములగు కన్నులుగలదాన! వాసవునిన్=ఇంద్రుని, చూచితివె=చూచితివా.

వ్యా-విశే. వచ్చినవాఁడు: వచ్చెనను నర్థమున వర్తమానకాలికప్రయోగము. "వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు" అని తిక్కన భారతప్రయోగము. "నానగేడియై" అనుచో "నానగండయై" అను పాఠమగపడు. అపుడుకూడఁ బైని వ్రాసిన ప్రకారమే యర్థము. "తలలూడన్" అనుచో "తల" అనుదానికి లక్షణావృత్తి నంగీకరించి శిరోజ మర్థము చేయవలయును. లేదా "తలలూడ" ననుదానికి దలలు వ్రక్కలగుటయని యైనన ర్థము చెప్పవలయును.

ఉ. చూడుము నన్ను నంచు మధుసూదనుఁ డమ్మరిఁ బోసి తద్భుజా
క్రోడము గాఁడ నేసిన నకుంఠితుఁ డై సురరాజు కృష్ణు నీ
రెడుశరంబుల న్ఖగకులేశ్వరు ముప్పదిరెంట నేసెఁ బే
ర్వాడి తదన్యదిక్పతులు గ్రక్కున గంధగజాధిరూఢులై. 21

టీ. చూడుము, నన్నున్, అంచున్; అనఁగా నాప్రతాపముం బరీక్షింపుమనుట. మధుసూదనుఁడు=శ్రీకృష్ణుఁడు, అమ్ము=బాణము, అరిన్=అల్లెత్రాటియందు, పోసి = కూర్చి, తద్భుజాక్రోడము=ఆదేవేంద్రుని భుజమధ్యప్రదేశము, కాఁడన్=గ్రుచ్చుకొనునట్లు, ఏసినన్=ప్రయోగింపఁగా, అకుంఠితుఁడై=మొక్కవోనివాఁడై; అనఁగా నొప్పినందనివాఁడనుట. సురరాజు=దేవేంద్రుఁడు, కృష్ణున్, ఈరేడుశరంబులన్ = ఈరు+ఏడు=పదునాలుగు బాణములచేతను, ఖగకులేశ్వరున్=గరుడుని, ముప్పదిరెంటన్ = ముప్పదిరెండుబాణములచేతను, ఏసెన్, పేర్వాడి = మిగులవాడి, తదన్యదిక్పతులు =

---

*నానగండ యై.

దేవేంద్రునికన్న నితరులగుదిక్పాలురు; అనఁగా దేవేంద్రుఁడు తనపరాక్రమముం జూపుటయుఁ, దాము చూపఁజాలకుండుటయుననుసరించి దిక్పాలురు వసివాఁడిరనుట. గ్రక్కున్=శీఘ్రముగా, గంధగజాధిరూఢులై=మత్తగజములనెక్కినవారై, ముందటిపద్యముతో నన్వయము.

చ. అనలుఁడు రెండు మూఁడు యముఁ డాసురనాథుఁడు నాలుగైదుతో
యనిధిపుఁ డాఱు గంధవహుఁ డర్థపుఁ డేడు మహేశుఁ డెన్మిదిన్
ఘనవిశిఖంబు లేయ మురఘస్మరుఁ డన్నియుఁ ద్రుంచి శార్ఙ్గసం
జనితమహోగ్రభల్లముల జర్జరితాంగులఁ జేసె నందఱన్. 22

టీ. అనలుఁడు=అగ్ని, రెండున్=రెండుబాణములను, యముఁడు, మూఁడున్, అసురనాథుఁడు=నిరృతి, నాలుగు, తోయనిధిపుఁడు=వరుణుఁడు, ఐదు, ఆఱు, గంధవహుఁడు=వాయుదేవుఁడు, అర్థపుఁడు=కుబేరుఁడు, ఏడు, మహేశుఁడు=ఈశానుఁడు, ఎన్మిదిన్, ఘనవిశిఖంబులు=గొప్పబాణములు, ఏయన్=ప్రయోగింపఁగా, మురఘస్మరుఁడు=మురాసురహంతయగు శ్రీకృష్ణుఁడు, అన్నియున్=ఆబాణము లెల్లను, త్రుంచి=ముక్కలుగాఁజేసి, శార్ఙ్గ......భల్లములన్-శార్ఙ్గ=శార్ఙ్గమనుతనధనువునుండి, సంజనిత=పుట్టిన, మహోగ్ర=మిక్కిలిక్రూరములైన, భల్లములన్=బాణములచే, అందఱన్=అదిక్పతులనెల్లను, జర్జరితాంగులన్=వివశమగునవయవములుగలవారినిగా, చేసెన్.

విశే. ఇం దింద్రుని ప్రథమదిక్పతిగా నెంచి ప్రదక్షిణక్రమమున దిక్పాలురు నిర్దిష్టులైరి. అపు డగ్న్యాదిదిక్పాలురకు రెండవదిక్పతి మూఁడవదిక్పతి యనుమున్నగు సంజ్ఞలుగల్గును. దానిననుసరించి యెన్నవదిక్కున కధిపతియైనవాఁ డన్నిబాణములనే ప్రయోగించెనని కవి చమత్కారముగాఁ జెప్పినాఁడు.

ఆ. వేల్పుమ్రానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కి దీర్పఁ జాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవితాపహాశుగముల. 23

టీ. వేల్పుమ్రానియందున్ = కల్పవృక్షమందు, వేడుకపడు = సంతోషపడునట్టి; అనఁగాఁ గల్పవృక్షమునం దాసక్తులైనయనుట. కూర్మిసతులకోర్కి = ప్రియసతులకోర్కిని; శచికి సురద్రుమము ప్రియతమము. సత్యకును బ్రియతమమే. కాన నిర్వురు సతులును గల్పకమునందుఁ గోర్కిగలవారనుట. తీర్పఁజాలి = చక్కఁజేయఁజాలి,

అన్యాయ = అసమయమున, హరియుంజ్ = ఇంద్రుఁడును, హరియుంజ్ = శ్రీకృష్ణుఁడును, ఒకొర్కరుజయింపవలెనను కోర్కి-తో, అసురజీవితాపహారణుగ ణములు = అసుర = రాక్షసులయొక్క-, జీవిత = ప్రాణములను, అపహ = నశింపఁజేయునట్టి, ఆశుగములు = బాణములచేత, పోరిరి = యుద్ధము చేసిరి.

వ్యా-వి శే. ఇందు యుద్ధము చేయునిద్దఱికిని వేరొకటే యనియు, యుద్ధకారణము నొక్కటే యనియు, వారిబాణములస్వభావముగూడ నొక్క-రీతిదే యనియుఁ గవి చమత్కారముగ వచించినాఁడు. ఆశుగ = శీఘ్రముగఁబోవునది.

క. మురహరబలహరు లిట్లాం
దోరుగుశుఁపులఁ గప్పఁబడుట నొదవించిరి త
ద్వసువురఁ గనుఁగొనఁ దివిరెడు
గరుడోరగముఖులకోరికకు విఘ్నంబుల్. 24

టీ. మురహరబలహరులు = మురాసురునిజంపిన శ్రీకృష్ణుఁడును, బలాసురుని సంహరించిన దేవేంద్రుఁడును; అసురసంహారమున నిద్దఱును సములే యనుట. ఇట్లు = ఈ రీతిగ, ఒండొరుగుశుఁపులు = ఒకరిబాణములచే నొకరు, కప్పఁబడుటన్ = ఆచ్ఛాదితులగుటచే, తద్వసువురన్ = తమ్మురిద్దఱను, కనుఁగొనన్ = చూచుటకు, తివిరెడు = యత్నించునట్టి, గరుడోరగముఖులకోరికకున్ = గరుడులు నురగులు మొదలగువారియొక్క-కోరికకు, విఘ్నంబుల్ = అంతరాయములు, ఒదవించిరి = పుట్టించిరి.

భా. గరుడోరగాదులు దేవేంద్రకృష్ణుల యుద్ధకౌశలముం గాంచ దివినుండి చూడఁగను, వారొండొరుబాణముల యాచ్ఛాదనమున వారికిఁ గన్పడకుండిరనియు భావము. అలం. పర్యాయోక్తి.

చ. అలుఁగుల దట్టమై పొడమునగ్నికణంబులు సోఁకి పైగఱుల్
వాలసియుఁ దొంటివేగముడివోక క్రమంబున నొండొకంటిఁ బిం
జలుగొని త్రోచికొంచు శరసంఘము లక్ష్యము దాఁకు విస్మితా
ఖిలసురసిద్ధసాధ్యముగఁ గృష్ణుఁడు జిష్ణుఁడు బోరనయ్యెడన్. 25

టీ. కృష్ణుఁడున్, జిష్ణుఁడున్ = దేవేంద్రుఁడును, పోరన్ = కలహింపఁగా, అయ్యెడన్ = ఆసమయమున, అలుఁగులన్ = బాణములనుండి, దట్టమై = సాంద్రముగా, పొడము = పుట్టునట్టి, అగ్నికణంబులు = నిప్పుకలు, సోఁకి = అంటి, పైగఱుల్ = పైనున్న ఱెక్క-లు, వాలసియున్ = నశించియును; అనఁగాఁ గాలిపోయినవనుట. తొంటివేగము = ఱెక్క-లున్నపుడు గలత్వర, ఉడివోక = నశింపక, క్రమంబునన్ = వరుసగా,

ఒండొకంటిన్ =ఒకటినొకటి, పింజలుగొని=గ్రుచ్చుకొని, త్రోచికొంచున్ = రాపాడుచు, శరసంఘము=బాణసమూహము, విస్మితాఖిలసురసిద్ధసాధ్యముగన్ = ఆశ్చర్యము నందిన సమస్తమైనసురలు, సిద్ధులు, సాధ్యులు నగునట్లుగా, లక్ష్యమున్ = చేరవలసిన చోటును, తాఁకున్ =అంటును.

భా. ఇంద్రోపేంద్రులు ప్రయోగించుకొనుబాణముల రాపిడివలన నగ్నికణములు రేఁగి యాబాణములఱెక్కలు దగ్ధము లయ్యెననియు, ఱెక్క లులేకున్నను నాబాణములు వేగమువీడక పరస్పరము రాపాడుచు నేగి పుంఖానుపుంఖముగ లక్ష్యములందుఁ దగుల్కొనుచుండెననియు, నాకృత్యమునఁ జూచి సురసిద్ధసాధ్యాదిఖచరు లాశ్చర్యము నందిరనియు భావము. అలం. అతిశయోక్తి.

తే. ఘోరముగ మింటఁ బందిరిగొని జగంబు
నంధముగఁ జేయునిరుపురయంపగములు
నొండొకటి దాఁకి క్రొమ్మంట లొదవి తామ
చూర్ణమై పోవ ముద మయ్యెఁ జూపఱకును. 26

టీ. ఘోరముగన్ =భయంకరముగ, మింటన్ =ఆకాశమున, పందిరిగొని=పందిరి వలెనొప్పి, జగంబున్ =లోకమును, అంధముగన్ =గుడ్డిదిగ, చేయు = చేయునట్టి, ఇరుపురయంపగములున్ = ఇంద్రోపేంద్రులబాణసమూహములు; బాణములసమూహము లాకసమున వ్యాపించి పందిరివేసినట్లు గప్పియుంట సూర్యరశ్మి భువిపైఁ బడలేదనియు దాన లోక మంధమయ్యెననుట. ఒండొకటన్ =అన్యోన్యము, తాఁకి = ముట్టి, క్రొమ్మంటలు=క్రొత్తమంటలు, ఒదవి=పుట్టి, తామ=తమకుఁదామే, చూర్ణమై = భస్మమై, పోవన్ =నశింపఁగా, చూపఱకును=చూచువారలకు, ముదము=సంతోషము, అయ్యెన్ = సంభవించెను. అట్టి క్రూరనారాచము లేరి కెట్టిబాధ యొదవించునో యని భయపడుచుండ నవి తామే చూర్ణమగుటంజేసి చూపఱకు సంతసమయ్యెనని భావము.

వ్యా-విశే. అమ్ము+గములు = అంపగములు, సమాసమునఁ గొండొకచో నామ్వాదికనుమ్వాదుల మువర్ణంబులు పవ్వర్ణంబులగును. చూపఱు=ఇది బహువచనము.

క. అలనాటినన్ను మఱచితె
నిలు నిలుమీ తగినయాజ్ఞ నీ కిదె యంచుం
బులుఁగులతేని మహేంద్రుం
డలుఁగుల పెనుగూటఁ జిక్కునట్టుగ నేసెన్. 27

టీ. మహేంద్రుండు = దేవేంద్రుఁడు, అలనాటినన్నున్ = ఆనాఁడు నీతో యుద్ధము చేసిన నన్ను; గరుడుఁ డమృతము నపహరించునపుడు దేవేంద్రుఁ డడ్డుతగిలి

...గాయము చేసినదనుట. మఱచితె = మఱచితివా? నిలునిలుమీ = నిలువుమనిలువుమ, ...లుక, ఖగ=పక్షిగా, తగినయాజ్ఞ=తగినశిక్ష, అంచున్, పులుఁగులఱేనిన్=పక్షీంద్రుఁడగు గరుడుని, అలుఁగులపెనుగూఁటన్ = బాణనిర్మితమైన పెద్దగూడునందు, చిక్కుపట్టుగన్=కట్టువట్టునట్లుగ, ఏసెన్.

విశే. పక్షి గూడునందుండుట నైజముగానఁ బక్షీంద్రమగు గరుడున కలుఁగుల పెను గూఁడే యింద్రుఁ డేర్పఱచెనని చమత్కారము. నిలువుమీ+నిలువుమీ=నిలునిలుమీ, మధ్యమవర్ణమునకు లోపమును గడవ్రాయిలోపంబును గల్గెను. అలం. పరికరము.

మ. అలుకం గంసవిభేది నందకముచే నయ్యస్త్రముల్ద్రుంచి వే
బలుదూపుల్దృఢముష్టిఁ గూర్చి బలభిద్భద్రేభకుంభంబు వ్ర
క్కలుగా నేసినఁ బోరునం దొరఁగె ముక్తాశ్రేణి పైపై హిమా
చలశృంగావతరన్నభశ్చరధునీచంచత్ప్రవాహాకృతిన్. 28

టీ. కంసవిభేది=శ్రీకృష్ణుఁడు, అలుకన్=కోపముతో, నందకముచేన్=నందకమనుకత్తిచే, అయ్యస్త్రముల్ = ఆయస్త్రములను, ద్రుంచి, వే=శీఘ్రముగ, బలుదూపుల్=విస్తారములైన బాణములను, దృఢముష్టిన్ = దృఢమైనముష్టిచే, కూర్చి = సంధించి, బలభిద్భద్రేభకుంభంబు = దేవేంద్రుని మంగళగజముయొక్క కుంభస్థలము; అనఁగా నైరావతకుంభమనుట, వ్రక్కలు=ముక్కలు, కాన్ = అగునట్లు, ఏసినన్, హిమాచల......కృతిన్-హిమాచల = మంచుకొండయొక్క, శృంగ=శిఖరమునుండి, అవతరత్=జాఱుచున్న, నభశ్చరధునీ = మిన్నేటియొక్క, చంచత్ = కంతులిడు, ప్రవాహ=నీటివెల్లువయొక్క, ఆకృతిన్ = రూపమువంటి రూపముతో, పైపైన్ = మీఁదుమీఁదుగా, ముక్తాశ్రేణి=ముత్యములపంక్తి, పోరునన్=పోరుమని, తొరఁగెన్=జాఱెను.

విశే. ఐరావతము తెల్లనిదిగాన దాని తెల్లనగు మంచుకొండతోను, నద్దాని కుంభములనుండి జాఱు తెల్లని మంచిముత్తియములచాలును నప్పర్వతశిఖరమునుండి దిగు మిన్నేటిప్రవాహముతోను బోల్పఁబడినవి. అలం. ఉపమ.

కరీంద్రకుంభములు ముక్తాఫలాశ్రములనుట సుప్రసిద్ధము.

చ. ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడె సాటి వచ్చు నొం
డ్లితరులు వీరిఁ బోలఁగలరే యను చారణసిద్ధసాధ్యసం
స్తుతులు సెలంగె నారణము చూచి రణాశనమాని నింగిపైఁ
గుతుకరసాతిరేకమునఁ గుంచియ వీచి నటించె నయ్యెడన్. 29

టీ. ఇతనికిన్, ఇతండు, సాటి, యగున్, ఈతనికిన్, ఈతఁడె, సాటివచ్చును. ఒండ్లు+ఇతరులు=పరులు, పోలన్=సాటియగుటకు, కలరే, అను, చారణసిద్ధసాధ్యసంస్తుతులు = చారణాదులస్తోత్రములు, చెలంగెన్=ఒప్పెను. ఆరణము, చూచి, రణాశనమౌని = కలహభోజనుఁడు నారదుఁడు, నింగిపైన్=ఆకాశముపైని, కుతుకరసాతిరేకమునన్=సంతోషాతిశయముచే, కుంచియ=నెమిలికుంచెను, వీచి=ఆడించి, అయ్యెడన్=ఆసమయమున, నటించెన్=నాట్యముచేసెను. అలం. అనన్వయము.

సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప
నది శార్ఙ్గితేజంబునందు డిందెఁ
గనలి వృద్ధశ్రవుం డనిలాస్త్ర మేసిన
నది యదూద్వహునూర్పునందు డిందె
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప
నది శౌరివలచూడ్కియందు డిందె
నడరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పయి గొల్ప
నది మురాంతకునాభియందు డిందెఁ
ఆ. బాకదమనముక్తపాశుపతాస్త్రంబు
హరినిజార్ధతనువునందు డిందె
నేమి సేయవచ్చు నీశ్వరుం డఖిలాత్ముఁ
డతని గెల్వఁ దనకు నలవి యగునె. 30

టీ. కినిసి=కోపించి, బిడౌజుఁడు=దేవేంద్రుఁడు, ఆగ్నేయాస్త్రము = అగ్నిదేవతాకమైనయస్త్రమును, అడరింపన్ = విజృంభింపఁజేయఁగా, అది=ఆయస్త్రము, శార్ఙ్గితేజంబునందున్=శ్రీకృష్ణతేజస్సునందు, డిందెన్=లీనమయ్యెను; శ్రీకృష్ణుఁడు సర్వదేవతాత్మకుండగుట తేజోరూపమగు నయ్యస్త్ర మాతనితేజమున లీనమయ్యెననుట. కనలి=కోపించి, వృద్ధశ్రవుండు=ఇంద్రుఁడు, అనిలాస్త్రము = వాయుదేవతాకమగునస్త్రమును, ఏసినన్=ప్రయోగింపఁగా, అది, యదూద్వహునూర్పునందున్=యాదవకులోదారుఁడగు శ్రీకృష్ణునినిట్టూర్పునందు, డిందెన్; సర్వాత్ముఁడగు శ్రీకృష్ణభగవానునియందు వాయురూపమగు నయ్యస్త్ర మాతనివాయువునం దడంగెననుట. అలిగి=ఆగ్రహించి, బలారి=సురపతి, సౌరాస్త్రంబున్=సూర్యదేవతాకమగునస్త్రమును, నిగిడింపన్=వ్యాపింపఁజేయఁగా, అది, శౌరివలచూడ్కియందున్ = శ్రీకృష్ణుని దక్షిణనేత్రమునందు, డిందెన్; సూర్యదేవతాకమగు నయ్యస్త్ర మాతని సూర్యనేత్రమునం దడంగె

...నుట. భగవానుఁడు సూర్యచంద్రనేత్రుఁడగుట పురాణప్రసిద్ధము. అడరి = విజృంభించి, ఇంద్రుండు, బ్రహ్మాస్త్రంబు, పయిఁగొల్పన్ = మీఁదుకొల్పఁగా, అది, మురాంతకునాభియందున్ = శ్రీకృష్ణునిబొడ్డునందు, డిందెన్. బ్రహ్మదేవతాకమగు నయ్యస్త్రము బ్రహ్మోద్భవస్థానమగు నాతనినాభికమలమున నడంగెననుట. కొమరునిప్రతాపము ...ంద్రిపైఁ బోకుండుటయుఁ, గుంఠితమగుటయుం నైజములుగదా! పాక......స్త్రంబు- పాకదమన = పాకాసురశిక్షకుఁడగు దేవేంద్రునిచే, ముక్త=విడువఁబడిన, పాశుపతాస్త్రంబు = శివదేవతాకమగునస్త్రము, హరినిజార్ధతనువునందున్ = శ్రీకృష్ణుని సంగోరు శరీరమునందు, డిందెన్. శివకేశవు లభిన్నులగుటం జేసి శ్రీకృష్ణుఁడు శివస్వరూపుఁడే యగును. మఱియు నిచ్చో భగవంతుని హరిహరస్వరూపముగ కవిభావించుటం జేసి శివదేవతాకమగు నాయస్త్ర మాతని యర్ధాంగశివరూపమున నడఁగెనని యెన్నవలెను. ఏమి, సేయన్, వచ్చున్?=ఏమిచేయుట కింక వీలగును? ఈశ్వరుండు, అఖిలాత్ముఁడు=సర్వస్వరూపుఁడు. అతనిన్=ఆసర్వాత్ముని, గెల్వన్=జయించుట, తనకున్ = దేవేంద్రునకు, అలవి=శక్యము, అగునె=అగునా?

విశే. ఇందుఁ గవి శ్రీకృష్ణుని సర్వాత్మకుఁడును, సర్వస్వరూపుఁడును, హరిహర రూపుఁడునునగు పరమాత్మగా భావించి యిట్టివర్ణనము నొనర్చెనని గ్రహింపవలయును.

చ. తఱిగొని యంతలోన మధుదైత్యహరుండు మహేంద్రుశింజినిం
గొఱనెలతూపునం దునిమి క్రూరతరం బగుభల్ల మొక్కట
న్నఱికినఁ గూలెఁ దద్ఘనఘనాఘనకల్పితమైన టెక్కెయం
బొఱలుచు నోరుగాలి మొదలూడఁగఁ గూలెడుమ్రానికైవడిన్. 31

టీ. తఱి=సమయమును, కొని=పొంది; సమయముచూచియనుట. అంతలోనన్, మధుదైత్యహరుండు=మధుసూదనుఁడు; శ్రీకృష్ణుఁడు, మహేంద్రుశింజినిన్=దేవేంద్రుని వింటినారిని, కొఱనెలతూపునన్=అర్ధచంద్రబాణముచేత, తునిమి=త్రెంపి, క్రూరతరంబగు=మిక్కిలిక్రూరమగు, భల్లమొక్కటన్=బాణమునొకదానిచే, నఱికినన్=ఖండింపఁగా, తద్ఘనఘనాఘనకల్పితమైన=ఆదేవేంద్రునివార్షికమేఘముచేఁ జేయఁబడిన, టెక్కెయంబు=పతాకము, ఒఱలుచున్=ఒరఁగిపోవుచు; అనఁగా వ్రాలుచుననుట. ఓరుగాలిన్=ఝంఝామారుతముచే, మొదలు=మూలము, ఊడఁగన్ = పెల్లగిలఁగా, కూలెడు=భూమిపైఁబడెడు, మ్రానికైవడిన్=చెట్టురీతిగ, కూలెన్=త్రెళ్లెను.

భా. శ్రీకృష్ణునియర్ధచంద్రబాణాఘాతమున నింద్రునిటెక్కెము ఝంఝామారుతముచే పెల్లగిలిపడినతరువువలెఁ ద్రెళ్లెనని తాత్పర్యము,

వ్యా-విశే. కొఱ=కొఱఁతగల. నెల=చంద్రుఁడు, తద్రూపమైనతూపు=అర్ధచంద్రబాణము. టెక్కియంబు. రూ. అ. టెక్కెము.

శా. భుగ్నభ్రూకుటిదుర్ముఖుం డగుచు నాస్ఫోటించుచు న్లోనిరో
షాగ్నిజ్వాలలు బాహ్యనిర్గతము లైన ట్లుత్కటారుణ్యని
ర్మగ్నంబై కనుపట్టులోచనసహస్రం బొప్ప మౌర్వీలతా
భగ్నం బైనశరాస *మున్విడిచి జంభద్వేషి యత్యుగ్రతన్. 32

టీ. జంభద్వేషి=జంభాసురశత్రువగునింద్రుఁడు, భుగ్నభ్రూకుటిదుర్ముఖుండగుచున్ = వంచఁబడినబొమముడిచే వికృతమైనమొగముగలవాఁడగుచు, ఆస్ఫోటించుచున్ = అప్పళించుచు, లోని రోషాగ్నిజ్వాలలు=లోపలనున్న కోపమనెడు నగ్నియొక్కమంటలు, బాహ్యనిర్గతములైనట్లు=వెలుపలికి వెడలివచ్చినవన్నరీతిగ, ఉత్కటారుణ్యనిర్మగ్నంబై= అధికమగు నెఱుపురంగునందు మునింగినదై, కనుపట్టు=అగపడునట్టి, లోచనసహస్రంబు =నేత్రముల వేయి; అనఁగా వేయికన్నులనుట. ఒప్పన్=ఉండఁగా, మౌర్వీలతాభగ్నంబైన=లతనుబోలునారితెగిన, శరాసమున్ = ధనువును, విడిచి, అత్యుగ్రతన్=మిగుల నుగ్రత్వముతో; ముందటిపద్యముతో నన్వయము.

భా. తనధనువునారియుం టెక్కెముం దెగఁగా నింద్రుఁడు బొమముడిని వికృతమైన మొగముగలవాఁడై మదినున్న రోషాగ్నిజ్వాలలు పైకి వచ్చినవో యన్నట్లు కన్నులత్యంతారుణములై యొప్పఁగా నల్లెత్రాఁడు తెగిన యవ్వింటిని వీడి చండుఁడై వజ్రాయుధముంబూనెనని భావము.

విశే. రౌద్రరసమును దదనుగుణమగునారభటియు నిందుఁ గననగును.

చ. కులవసుధాధరావలికిఁ గుంటితనం బొదవించె నెద్ది యా
బలితపుఁగైదువుం గొని సుపర్వకులాగ్రణి వేయుఁగన్నులం
దలకొని కౌస్తుభస్తబకితం బగుశౌరియురంబు సూచిన
న్జలజదళోదరోదకముచాడ్పున నల్లలనాడె లోకముల్. 33

టీ. ఎద్ది=ఏది, కులవసుధాధరావలికిన్=కులపర్వతపంక్తికి, కుంటితనంబున్=గతినిరోధమును; నడువలేకపోవుటనుట. ఇంద్రుఁడు పక్షముల నఱికినకతనఁ బర్వతశ్రేణి సంచరింపశక్తిలేనిదయ్యెను గాన వజ్రాయుధమ్ము పర్వతములకుఁ గుంటితనమును గూర్చినదయ్యెనని భావము. ఒదవించెన్=సంభవింపఁజేసెనో? ఆబలితపుంగైదువున్=ఆబలిష్ఠమైన యాయుధమును (వజ్రాయుధమును), కొని=స్వీకరించి, సువర్వకులాగ్రణి=దేవకులాగ్రణి

* నం ఖుడిగి జంభ.

...ంద్రుఁడు, వేయుంగన్నులన్ = సహస్రనేత్రములచేతను, తలఁకొని = పూని, కౌస్తుభ...గు = కౌస్తుభమణిచే నలంకృతమగు, శౌరియురంబున్ = శ్రీకృష్ణునివక్షస్థ్సలం...ను, చూచినన్ = చూఁడగా, జలజదళోదరోదకముచాడ్పునన్ = తామరాకునడుమ ... సిటివలె, లోకముల్ = జగములు, అల్లలనాడెన్ = సంచలించెను. అనఁగా గడగడ ... రనుట.

విశే. కులపర్వతములు:—1 మహేంద్రము, 2 మలయము, 3 సహ్యము, 4 ... శుక్తిమంతము, 5 గంధమాదనము, 6 వింధ్యము, 7 పారియాత్రము.

ఉ. ఏపుఁడ వౌదు దీనిబలువ్రేటున కోరిచి నిల్చితేని యం
భోరుహనాభ! యంచు సురపుంగవుఁ డప్పుడు లోకభీకరా
కారత నిల్చి భీతిపరికంపితులై సుర లూహ లేది హా
హారవము ల్ఘటింపఁ గులిశాయుధరాజముఁ బూఁచి వైచినన్. 34

టీ. అంభోరుహనాభ = పద్మనాభ! దీనిబలువ్రేటునకున్ = ఈవజ్రాయుధముయొక్క గొప్పదెబ్బకు, ఓరిచి నిల్చితివి + ఏని - ఓరిచినిల్చితేని = సహించితివేని, ఏపుఁడవు = పరాక్రమముగలవాఁడవు, ఔదు = అగుదువు. అంచున్ = అనుచు, సురపుంగవుఁడు = సురశ్రేష్ఠుఁడు దేవేంద్రుఁడు, అప్పుడు = ఆసమయమున, లోకభీకరాకారతన్ = లోకములకు వెఱపుఁగొల్పునాకారముతో, నిల్చి, కర్త సురపుంగవుఁడు. భీతిపరికంపితులై = భయముచే గడగడ వడఁకువారై, సురలు = దేవతలు, ఊహలు = తలంపులు, ఏది = విడిచికొని; అనఁగా నేమిచేయుటకుఁదోఁపక నిశ్చేష్టులై యనుట. హాహారవముల్ = హాహాయనుధ్వనులను, ఘటింపన్ = చేయఁగా, కర్త సురలు. కులిశాయుధరాజమున్ = ఆయుధశ్రేష్ఠమగువజ్రమును, పూఁచి = ధరించి, వైచినన్ = వేయఁగా; అనఁగా ప్రయోగింపఁగాననుట.

విశే. పూఁచి. రూ. అ. పూనిచి, పూంచి, పూన్చి.

మహాస్రగ్ధర.—

శతధారాజాయమానసజ్వలనముఖశిఖాచ్ఛాదితాభ్రస్థలం బై
వితతాభీలధ్వనిశ్రీవిలసనబధిరోద్విగ్నదిగ్వారణంబై
కృతలోకాలోకముఖ్యాఖిలగిరిచలనక్షుబ్ధభూమండలంబై
పతయాళుద్వాదశాత్మప్రఖరతరకరౌపమ్యమై యేగుదేరన్. 35

టీ. శతధారా......స్థలంబై-శతాధారా = నూఱంచులనుండియు, జాయమాన = పుట్టుచున్న, జ్వలనముఖ = అగ్నిముఖములయొక్క, శిఖా = జ్వాలలచేత, ఆచ్ఛాదిత = కప్పఁబడిన, అభ్రస్థలంబై = ఆకాశప్రదేశముగలదై; వజ్రాయుధపు నూఱంచులనుండియు నగ్ని జ్వాలలు వెడలుచున్నవనియు నమ్మంట లాకసమును గప్పినవనియు భావము. వితతా...

దిగ్వారణంబై-వితత = విస్తారమైనట్టి, ఆభీలధ్వని=భయంకరశబ్దముయొక్క, శ్రీ=శోభ మునయొక్క, విలసన=ప్రకాశముచే, బధిర=చెవుడుగలిగినట్టివైన, ఉద్విగ్న = సంక్షోభ పడునవైన, దిగ్వారణంబై = దిగ్గజములుగలదై; వజ్రాయుధవేగమువలని భయంకరశబ్దము వ్యాపించి దిగ్గజములకు చెవుడును గలఁతనుగలుగఁజేసెనని భావము. కృత......భూమండ లంబై-కృత = చేయఁబడిన, లోకాలోక = చక్రవాళపర్వతము, ముఖ్య = మొదలగు, అఖిల=సమస్తములైన, గిరి=కొండలయొక్క, చలన=కదలుటచేత, క్షిప్త = ఎగఁజిమ్మఁ బడిన, భూమండలంబై=భూతలముగలదై; అనఁగా వజ్రాయుధవేగముచేఁ జక్రవాళాది పర్వతములు గదలెననియుఁ దాన భూములు పైకుబికెననియుఁ దాత్పర్యము. పతయాళు ......కరౌపమ్యమై - పతయాళు = పడునట్టిస్వభావముగల; అనఁగాఁ బడుచున్న యనుట. ద్వాదశాత్మ=సూర్యులయొక్క, ప్రకర=సమూహముయొక్క; అనఁగాఁ బన్నిద్దఱు సూర్యులయొక్కయనుట. ఖర = తీక్ష్ణములైన, కర = కిరణములు, ఔపమ్యమై= సాటిగాఁగలదై; అనఁగా నీవజ్రాయుధము భువింబడు ద్వాదశాదిత్యులంబోలి చండతర కిరణంబైయొప్పుననుట. ఏగుదేరన్=రాఁగా; ముందటిపద్యముతో నన్వయము.

విశే. ఇది మహాస్రగ్ధరావృత్తము. ప్రతిపాదమునకును, స. త. త. న. స. ర. ర. గ గణములుండును. తొమ్మిదవ పదునాఱవ యక్షరములు ప్రతిపాదమున యతిస్థానములు. అనఁగాఁ బాదమున రెండుయతిస్థానము లుండునని భావము. ఇందు రౌద్రరసము తదనుగుణమగు నారభటితోఁ గూర్చి వర్ణితమయ్యెను.

మ. కని నెమ్మోమునఁ బిన్ననవ్వు దొలఁకం గంసారి నిశ్శంకఁ దా
ర్క్ష్యుని నడ్డంబుగఁ ద్రిప్పి వేగ రవితేజోదుస్సహస్ఫూర్తిమైఁ
దను డాయ న్శతకోటిఁ గేలిశతపత్రక్రీడఁ బట్టెం గటా
క్షనిరీక్షాగతి నందకత్సరుకిణాంకంబైనహస్తంబునన్. 36

టీ. కని=చూచి; వజ్రాయుధముననుట. నెమ్మోమున=సుందరమగు మొగమున, పిన్ననవ్వు=మందహాసము; చిఱునగవనుట. తొలఁకన్ = చలింపఁగా; మందహాసమున కిదియేమో నను నొప్పించునని యింద్రుఁడు ప్రయోగించెఁగాని యిది నన్నేమిచేయుం నను శ్రీకృష్ణునితలంపునకు సూచకమని తలంపవలయును. కంసారి = శ్రీకృష్ణుఁడు, నిశ్శంకన్ = సందేహములేకుండుటతో, తార్క్ష్యునిన్ = గరుడుని, అడ్డంబుగన్= అడ్డుగా, త్రిప్పి=మఱలించి, వేగన్=త్వరతో, రవి......స్ఫూర్తిమైన్-రవి=సూర్యుని యొక్క, తేజః=కాంతివలె, దుస్సహ=సహింపరాని, స్ఫూర్తిమైన్=ప్రకాశముతోడ, తనున్=తన్ను, డాయన్=చేరరాఁగా; సమీపింపఁగాననుట. శతకోటిన్ = నూఱంచులు గలదానిని; వజ్రాయుధమును, కటాక్షనిరీక్షాగతిన్ = క్రేఁగంటిచూపులయొక్క ప్రసా

గములతో, నందక......కంబైన-నందక=నందకమనెడు కత్తియొక్క, త్సరు=పిడిచే నైన, "త్సరుః ఖడ్గముష్టిః" కిణ=కాయలచే, అంకంబైన = చిహ్నితమైన; నందకము పిడిపట్టుకొనుటచే శ్రీకృష్ణునిచేతఁ గాయలేర్పడెననుట. కాయలేర్పడినచేత నెంతటి వస్తువు పట్టుకొనినను నొప్పిపుట్టకుండుట నైజము. హస్తంబునన్=చేతితో, కేలిశతపత్త్రక్రీడన్=విలాస పద్మక్రీడవలె; అనఁగాఁ జేత విలాసార్థము పట్టినపద్మము నెగురవేసి పట్టుకొనునటుల ననుట. పట్టెన్=గ్రహించెను.

భా. అట్లు భయంకరమై యేతెంచు వజ్రాయుధమును నూఱంచులతో శతపత్త్రమువలె భాసిల్లుదాని శ్రీకృష్ణుఁడు, చిఱునగవొలుక సందియమందక సవిలాసముగఁ గ్రేగంటిచూపులతోడ నందకముపిడితాఁకునఁ గాయలేర్పడినచేతితోఁ గ్రీడాపద్మమును గ్రహించుపగిది గ్రహించెనని భావము.

విశే. ఇందు శ్రీకృష్ణుని మహానుభావత, పరాక్రమాతిశయము మున్నగునవి సంసూచితములు.

సీ. తలలు వీడంగ విద్యాధరు ల్పఱచిరి
గగ్గులకాడ్రై రి ఖచరవరులు
చట్టుపై పోఁక లై చనిరి గంధర్వులు
గరుడులు పంచబంగాళ మైరి
కన్నది కతి గాఁగఁ *గిన్నరు లరిగిరి
పన్నగేంద్రులు పటాపంచ లైరి
పోయినపోక లై పోయిరి సిద్ధులు
దిక్కామొకము లైరి దిగధిపతులు
తే. హరిహయత్రాణనాయత్తు లగుచు వచ్చి
మునులు సంప్రార్థనావచోముఖరు లైరి
పూని తనమీఁద వచ్చుదంభోళి నిట్లు
పంకజోదరుఁ డొడిసి చేపట్టుటయును. 37

టీ. పూని, తనమీఁదన్, వచ్చు, దంభోళిన్=వజ్రాయుధమును, పంకజోదరుఁడు=శ్రీకృష్ణుఁడు, ఒడిసి=కొంచెము పైకెగిరి, చేపట్టుటయును=చేతితోఁ బట్టగా, తలలు=శిరోజములనుట, వీడఁగన్, విద్యాధరుల్, పఱచిరి=పరుగెత్తిరి. ఖచరవరులు=సురశ్రేష్ఠులు, గగ్గులకాడు=కంకులసమూహము; అనఁగా నిస్సారమైనవారనుట. ఐరి, గంధర్వులు,

* గిన్నరుల్ మరిగిరి.

చట్టుపైపోఁకలై=బండరాతిపైఁ బడ్డపక్కులవలె, చనిరి; చెఱి యొకదిక్కున కేగిరనుట. కిన్నరులు, కన్నది=కనుపడిన త్రోవయే, గతి=శరణ్యము, కాఁగన్=అగునట్లుగా, అరిగిరి; అనఁగాఁ దమకంటి కగపడిన త్రోవనే యాధారముగాఁగొని పరుగెత్తిరనుట. పన్నగేంద్రులు=పన్నగశ్రేష్ఠులు, పటాపంచలైరి=చెదరి పాయిపోయిరి. సిద్ధులు, పోయినపోకలై =ఏదారి కనఁబడిన యాదారినే పట్టినవారై, పోయిరి. దిగధిపతులు=దిక్పాలురు, దిక్కామొకములు=దిగంతములను గూర్చి యభిముఖులు; అనఁగా దిగంతములకుఁ బాఱిరనుట. దిక్పతులు దిగంతములకు స్వాశ్రయములకుఁ బరుగిడుట సహజమేగదా. ఐరి. మునులు=ఋషులు, హరిహయత్రాణనాయత్తులు = దేవేంద్రుని రక్షించుటయందు సంసిద్ధులు, అగుచున్, వచ్చి, సంప్రార్థన వచోముఖరులు = వేఁడికోనుమాటలచే ధ్వని యొనర్చువారు, ఐరి; అనఁగాఁ బ్రార్థనావాక్యములఁ బలుకుచుండిరనుట.

ఉ. ముందల పట్టినట్లు తనముఖ్యతరాస్త్రము గొన్న దేవకీ
నందనుఁ జూచి సాధ్వసము నానయుఁ గ్రమ్మఁ గరీంద్రు డిగ్గి సం
క్రందనుఁ డోముకుంద! మురఘస్మర! యేనపరాధి నంచు వే
ముందఱ వచ్చి సాఁగఁబడి మ్రొక్కిన శౌరి కృపార్ద్రచిత్తుఁడై. 38

టీ. ముందల=ముందుతలను, పట్టినట్లు; ఇది యవమానసూచకము. తనముఖ్యతరాస్త్రమున్=తనయొక్క మిక్కిలి ప్రధానమగు నాయుధమును, కొన్న = స్వీకరించిన; తనముఖ్యాస్త్రముం జేతఁబట్టుట తనముందలవట్టిన ట్లింద్రున కయ్యెనని భావము. దేవకీనందనున్=శ్రీకృష్ణుని, చూచి, సాధ్వసమున్=భయమును; ఏమిచేయునో యన్వీరుఁడనుభయమనుట. నానయున్=సిగ్గును, ఓడితినిగదాయనియుం నంతటివానిపైఁ గొలఁదియెఱుంగక తలపడితినని యును సిగ్గు జనించెననుట. క్రమ్మన్ = వ్యాపింపఁగా, కరీంద్రున్= ఐరావతమును, డిగ్గి=దిగి, సంక్రందనుఁడు = దేవేంద్రుఁడు, ఓముకుంద! మురఘస్మర= మురహంత! ఏను, అపరాధిని=తప్పుచేసినవాఁడను, అంచున్, వే=వేగ, ముందఱన్= అభిముఖముగా, వచ్చి, సాఁగన్ = చాఁగునట్లుగా, దండాకారముగా, పడి=ఒరఁగి, మ్రొక్కినన్ = నమస్కరింపఁగా, సాష్టాంగ మొనర్పఁగాననుట. శౌరి=శ్రీకృష్ణుఁడు, కృపార్ద్రచిత్తుఁడు+ఐ = దయచేఁ దడిసిన మనస్సుగలవాఁడై, ముందటి పద్యముతోడ నన్వయము.

ఉ. లెమ్ము సురేంద్ర! నీవలన లేదొకతప్పును నీమఱంద లీ
కొమ్మ వదాన్యభూరుహముఁ గోరినఁ దెచ్చితిఁగాని కొమ్ము నీ
సొమ్మని వజ్రమిచ్చి మధుసూదనుఁ డాతరు వీఁ దలంచినం
గ్రమ్మఱ మ్రొక్కె వాసవుఁడు కందళితప్రమదాంతరంగుఁడై. 39

టీ. సురేంద్ర = దేవేంద్ర! ఈపదము సాభిప్రాయము. సురేంద్రుఁడవగుటకతన సుగద్రుమము నీదేయగును. దానిని నేఁ గొనుట నాది తప్పుగాని నీద్రుమమునకై నీవు తిరోధానము నీదితప్పుగాదనుట. లెమ్ము, సాష్టాంగముగఁబడియున్నవాఁడుగాన లెమ్మనెననుట. నీయెడను=నీపక్షమున, ఒకతప్పును=కొంచెముదోషమును; ఇచట నొకశబ్ద మల్పార్థకము. నీయందలు, ఈకొమ్మ = ఈయువతి, వదాన్యభూరుహము = ఈపులమ్రాను, కోరినన్, ఇచ్చితిని. ఈతరువునుగూర్చి కాంక్ష నాకును లేదుగాన నావలనఁగూడఁ దప్పు లేదనియు భ్రాతల కన్యోన్యవైర ముండకపోవచ్చును గాని భ్రాతృజాయల కన్యోన్యవైరము తప్పక గలుగుననియు, నందు బావగారి పెండ్లమున కట్టివదాన్యభూరుహము కల్గియుండ నా మె తోడికోడలూరకొనకుండుట సహజమాటకతన సత్యాకాంక్షను దీర్పవలసివచ్చుటం జేసి నే నికార్యమునఁ బ్రవర్తించితిననియు శ్రీకృష్ణుఁడీగతిని నిపుణముగఁబల్కెననుట. కాని, నీసొమ్ము=నీధనమును, కొమ్ము=తీసికొనుము, అని, వజ్రము=వజ్రాయుధము, ఇచ్చి, మధుసూదనుఁడు=శ్రీకృష్ణుఁడు, ఆతరవు=ఆకల్పవృక్షకమును, ఈన్=ఇచ్చివేయుటకు, తలంచినన్=ఉద్దేశింపఁగా; తరువును దిరుగనిచ్చుటకతన శ్రీకృష్ణుని యుదారత వెల్లడియగుచున్నది. వాసవుఁడు=దేవేంద్రుఁడు, క్రమ్మఱన్ = మఱల, మ్రొక్కి, కందళిత...... అంతరంగుఁడై-కందళిత = మొలకలెత్తుచున్న, ప్రమద=సంతోషముకల, అంతరంగుఁడై=మదిగలవాఁడై, తరువాతిపద్యముతో నన్వయము.

ఉ. సొమ్మన నెద్ది యే ననఁగ సొమ్మున కెవ్వఁడఁ గర్త వీవు నీ
సొ మ్మఖిలప్రపంచమును శౌరకులంబు నలంకరించు నీ
వమ్మహి నుండునంతకు ననన్యదురాపము పారిజాతభూ
జమ్మును నుండు నన్న వికసన్ముఖుఁడై హరి వీడుకొల్పుచున్. 40

టీ. సొమ్ము, అనన్=అనఁగా, ఎద్ది=ఏది? సొమ్మనఁగా నేదియనుటం జేసి యన్ని సొమ్ములును నీవేయనియు, నన్నిసొమ్ములును నీరూపము లేయనియుఁ దాత్పర్యము. ఏను, అనఁగన్, సొమ్మునకున్, ఎవ్వఁడను? అన్నిసొమ్ములయధికారమును నీదేయగుట నాకు సొమ్మనఁగా నేమియనుట. ఈవు కర్తవు. ఎల్లవానికిననుట. కర్తవుగానఁ గార్యములన్నియు నీవయని భావము. అఖిలప్రపంచమును=సర్వజగత్తును, నీసొమ్ము=నీధనము; జగమంతయు నీదెయనుట. శౌరకులంబున్ = శౌరవంశమును, అలంకరించు=భూషించు, నీవు, అమ్మహిన్=ఆభూమియందు, ఉండనంతకున్=ఉండువఱకును; అనఁగా శౌరివై భువినుండు నంతకాలమనుట. అనన్యదురాపము=ఇతరులకుఁబొందనలవిగానట్టి, పారిజాతభూజమ్మును = పారిజాతవృక్షముగూడ, ఉండును; భువిపైనుండుననుట. అన్నన్, వికసన్ముఖుఁడై = వికసించిన మొగముగలవాఁడై; సత్యప్రతినందీర్పఁగల్గితినిగదా యని సంతసముగలైననుట.

శ్రీకృష్ణుఁడు కర్త. హరికిన్=ఇంద్రుని, వీడుకొల్పుచున్=పోవ ననుజ్ఞ నొసంగుచు, తరువాతిపద్యముతో నన్వయము.

విశే. ఇందు శ్రీకృష్ణభగవానుని కార్యకారణరూపునిగాను, సర్వస్వామిగాను కవి వర్ణించినాఁడు.

శా. గంధర్వోరగసిద్ధసాధ్యవరులం గారుణ్యదృష్టిక్రియా
సంధానంబున వీడుకొల్పి సురభూజంబు న్సతి న్వాహన
స్కంధాగ్రంబున నుంచి విక్రమకళా*సంలబ్ధతత్ప్రేయసీ
సంధాసిద్ధిఁ గృతార్థుఁడై మఱలె నిచ్చ న్వేడ్కలుప్పొంగఁగన్. 41

టీ. గంధర్వోరగ సిద్ధసాధ్యవరులన్ = గంధర్వశ్రేష్ఠులను, నాగశ్రేష్ఠులను, సిద్ధశ్రేష్ఠులను, సాధ్యశ్రేష్ఠులను, కారుణ్యదృష్టిక్రియాసంధానంబునన్ = దయతోఁగూడిన చూపుయొక్క ప్రసారముచేతను, వీడుకొల్పి=సెలవిచ్చిపంపి, సురభూజంబున్ = కల్పవృక్షమును, సతిన్=సత్యభామను, వాహనస్కంధాగ్రంబునన్ = వాహనమగుగరుడుని యొక్క మూఁపుకొనయందు, ఉంచి, విక్రమ...సంధాసిద్ధిన్-విక్రమకళా=పరాక్రమ విద్యచే, సంలబ్ధ=పొందఁబడిన, తత్ప్రేయసీ=ఆభార్యయగుసత్యభామయొక్క, సంధా=ప్రతిజ్ఞయొక్క, సిద్ధిన్ = నెఱవేఱుటచేత, కృతార్థుఁడై = సఫలకార్యముగలవాఁడై, ఇచ్చన్= మదియందు, వేడ్కలు=సంతోషములు, ఉప్పొంగఁగన్=పొంగి పొరలంగా, మఱలెన్.

విశే. ప్రేయసీప్రతిజ్ఞాసిద్ధియే వాంఛితముగాని శ్రీకృష్ణునకు నింద్రుని పరాభవించుటగాని సురభూజము నపహరించుటగాని, కోర్కిగాదని గ్రహింపనగును. ఇచ్చ. ప్ర. ఇచ్ఛ.

ఉ. వాసవుతోడికయ్యమునవార్తలు సెప్పుచు మోముఁదమ్మి ను
ల్లాసము మందహాసముఁ దొలంకఁగ వేలుపుమ్రానిపూవులం
జేసినసొమ్ము లంగములఁ జేర్చి వధూమణి నాదరించుచున్
వాసుకిభోగతల్పుఁడు సువర్ణగిరీంద్రము దాఁటెఁ జయ్యనన్. 42

టీ. వాసవుతోడి కయ్యమునవార్తలు=ఇంద్రునితోనైన యుద్ధమునందలివృత్తాంతములు, చెప్పుచున్, మోముఁదమ్మిన్=ముఖపద్మమున, ఉల్లాసమున్ = వికాసమును, మందహాసమున్=చిఱునవ్వును, తొలంకఁగన్ = చలింపఁగా; సురభూజమును స్వాధీనముగఁజేసికొని ప్రేయసీప్రతిజ్ఞ తీర్పఁగల్గుటకతన నుల్లాసమును, నాకార్యమునకై యింద్రా

* సంరబ్ధి; సంరబ్ధ.

గులతోడి సంగరమున సంభవించిన యాయావిశేషముల విభావన సేయుటకతన మందహాస ముఁగల్గెననుట. వేలుపుమ్రానిపూవులన్ = కల్పవృక్షపుష్పములచే, చేసిన = సిద్ధించిన, సొమ్ములు=నగలు, చేర్చి=కూర్చి, వధూమణిన్=యువతీరత్నమునుసత్యను, ఆదరించుచున్ = గౌరవించుచు, వాసుకిభోగతల్పుఁడు=శేషశయనుఁడు శ్రీకృష్ణుఁడు, చయ్యనన్=శీఘ్రముగ, సువర్ణగిరీంద్రమున్ = మేరుపర్వతవరమును, దాఁటెన్=అతిక్రమించెను.

వ్యా-విశే. వేలుపుమ్రానిపూవులచేఁ జేసినసొమ్ములనఁగా, నాపూవులచేఁ గూర్చిన పుష్పమాలారూపములగు సొమ్ములని చెప్పనగును. మఱియు వేలుపుమ్రానే గాక దాని పుష్పాదులును వాంఛితార్థములనెల్ల నొసంగ సమర్థములగుటంజేసి వానివలన సిద్ధించిన సొమ్ములను రత్నాంగములఁ గూర్చెననియైన గ్రహింపనగును. "వాసవుతోడికయ్యమున వార్తలు" ఇందు సమాసమునఁ దోడవర్ణకమున కిత్వమును సప్తమీతత్పురుషమున సవర్ణకమును గల్గెను. "చేత తోడ వలనల కిత్వంబు సమాసంబునందగును" అని బాలవ్యాకరణము. సప్తమీతత్పురుషంబునందుఁ గొన్నియెడలనవర్ణకంబగు" అని ప్రౌఢవ్యాకరణము.

శ్రీకృష్ణుఁడు పారిజాతముతో నిజనగరి కేతెంచుట.

చ. కనకగిరీంద్రముం గడచి గ్రక్కున రైవతకాద్రిప్రాంత ని
ల్చిన యదువృష్ణిభోజనృపసింహులు సేనలతోడఁ దన్నెదు
ర్కొన నగరంబుఁ జొచ్చె మణిగోపురసంస్థితపౌరభామినీ
జనములు సేసముత్తెములు సల్లఁగ నుల్లసితాంతరంగుఁడై. 43

టీ. కనకగిరీంద్రమున్ = సువర్ణపర్వతమును మేరువును, కడచి=అతిక్రమించి, గ్రక్కునన్=శీఘ్రముగ, రైవతకాద్రిప్రాంతన్=రైవతకపర్వతసమీపమున, నిల్చినన్ = ఉండఁగా, యదువృష్ణిభోజనృపసింహులు = యాదవకులముల తెగలకు సంబంధించిన రాజశ్రేష్ఠులు, సేనలతోడన్, తన్నున్, ఎదుర్కొనన్ = ఎదుర్కొనఁగా, మణిగోపురసంస్థితపౌరభామినీజనములు = మణివికారములైన బహిర్ద్వారములందున్న పట్టణవాసుల భార్యలు, సేసముత్తెములు = శుభాక్షతస్థానీయములగు మంచిముత్తెములను, చల్లఁగన్, ఉల్లసితాంతరంగుఁడై = వికసించిన మనస్సుగలవాఁడై, నగరంబున్ = పట్టణమును, చొచ్చెన్ = ప్రవేశించెను.

విశే. నాకపురినుండి శ్రీకృష్ణుఁడు వచ్చినమార్గమును వర్ణింప మఱలఁ గవి తలంపకుండుటంజేసి యప్రసక్తముగ వర్ణనలఁజొన్పుట కిష్టపడమి తెల్లమయ్యెడి.

తే. పురబహిర్ద్వారములు దాఁటి భుజగశాయి
రాజమార్గంబు దఱియ హేరాళమగుచు

*బుగులుకొనియె ననాఘ్రాత పూర్వకములు
పారిజాతమహీజాతపరిమళములు. 44

టీ. పురబహిర్ద్వారములు = పట్టణంపు వెలుపలిద్వారములను, దాఁటి, భుజగశాయి=శ్రీకృష్ణుఁడు, రాజమార్గంబుక్ = ఘంటాపథమును, తఱియక్=సమీపింపఁగా, అనాఘ్రాతపూర్వకములు = ఇంతకుమున్నెన్నఁడును వాసనచూచినవికానట్టి, పారిజాతమహీజాతపరిమళములు = పారిజాతవృక్షపు సుగంధములు, బుగులుకొనియెక్ = వ్యాపించెను.

విశే. ఇందు "ననాఘ్రాతపూర్వకము" లనుచో "నామోదపూర్వకము" లను పాఠము గాననగును. ఆమోదపూర్వకములు = సంతోషము ముందుగలవి. అనఁగా సంతోషమును ముందుగఁ బుట్టించునవనుట. విని కని యెఱుఁగని పరిమళము లగుటంజేసి దీనికన్నఁ బై పాఠమే సరసమని తోఁచును.

ఉ. ఆమహిజాతముం గనినయంతటిలో ధనధాన్యరాశితో
సామజఘోటికామహితశాలలతో మణిసౌధపంక్తితో
గోమహిషీశతాంగభటకోటులతో మణిభూషణాలితోఁ
దామరతంపరై తనరెఁ దత్పురిఁ గింపచగేహవాటికల్. 45

టీ. ఇందుఁ గల్పకదర్శనమాత్రమునఁగల్గిన సిరివర్ణితము.-తత్పురిక్=ఆద్వారకాపట్టణమందు, కింపచగేహవాటికల్=దరిద్రుల యిండ్లప్రదేశములు, ఆమహిజాతముక్ = ఆవృక్షమును, కనినయంతటిలోక్ = చూచినంతలో, ధనధాన్యరాశితో = ధనసమూహముతోడను ధాన్యసమూహముతోడను, సామజ...శాలలతోక్-సామజ = ఏనుఁగులఁతోడను, ఘోటికా = గుఱ్ఱములతోడను, మహిత=పూజ్యమైన, శాలలతోక్ = స్థానములతోడను, మణిసౌధపంక్తితోక్ = మణివికారములైన మేడలవరుసతోడను, గోమహిషీశతాంగభటకోటులతోక్ = గోవులు భార్యలు రథములు భృత్యులు వీని సమూహములతోడను, మణిభూషణాలితోక్ = మణిమయములైన యలంకారముల వరుసతోడను, తామరతంపరై = ఉత్తరోత్తరాభివృద్ధిగలవై; తామరతీవ లెడతెగక యల్లుకొనునట్లు తనరెనుట. తనరక్=ఒప్పెను.

మ. బెరసె న్సేన నిగిడ్చినట్లు వళు లుబ్బె న్గర్బలాంగంబు లం
కురము ల్వాపె రదంబు లంఘ్రులవడంకు ల్దీఱె వాలారులై

---

* బుగులుకొనియెను నామోదపూర్వకములు.

కరజంబు చిగిరించెఁ గేశవితతు లప్పారె వృద్ధాలికిన్
మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచలన్మందానిలాసంగతిన్. 46

టీ. కల్పకవాయుసంస్పర్శనమువలన జనులకుఁ గల్గినయవస్థ యిందు వర్ణితము.—
తత్తరుచలన్మందానిలాసంగతిన్ = తత్తరు = ఆకల్పవృక్షసంబంధమైన, చలత్ = కదలునట్టి, మందానిల = మందమారుతముయొక్క, ఆసంగతిన్ = సంపూర్ణసంబంధముచే, వృద్ధాళికిన్ = ముసలివారలకు, మేనన్ = శరీరమందు, నిగిడ్చినట్లు = నిట్టవాడిచినవిధముగ, వలులు = ముడుతలు, బెరసెన్ = కూడెను. దుర్బలాంగంబులు = బలహీనములైన శరీరములు, ఉబ్బెన్ = ఉప్పొంగెను; అనఁగా బలిసెననుట. రదంబులు = దంతములు, అంకురములు = మొలకలు, చూపెన్; అనఁగా మఱల మొలచెననుట. అంఘ్రులవడంకుల్ = కాళ్లసంచలనములు, తీఱెన్ = నశించెను. వాలారులై = దీర్ఘములై, కరజంబుల్ = గోళ్లు, చిగిరించెన్ = పల్లవించెను. కేశవితతుల్ = తలవెండ్రుకలగుంపులు, కప్పారెన్ = నల్లనయ్యెను. మరలన్ = తిరుగ, ప్రాయము = యౌవనము, వచ్చెన్. పైని పేర్కొనిన యౌవనధర్మములు గల్గెనని తాత్పర్యము.

✓ క. విన నేర్చిరి బధిరులు గనఁ
గొన నేర్చిరి యంధకులు లఘుత్వము మీఱన్
జన నేర్చిరి వికలాంగకు
లనిమిషతరుకుసుమసౌరభావేశమునన్. 47

టీ. కల్పకపరిమళావేశమునఁ బ్రజలకుఁ గల్గినయవస్థ లిందు వర్ణితములు.—
అనిమిషతరుకుసుమసౌరభావేశమునన్ = కల్పవృక్షపుష్పసంబంధమైన పరిమళముయొక్క చేరికచేత, బధిరులు = చెవిటివారు, వినన్ = ఆలించుటకు, నేర్చిరి = చాలిరి; శక్తులైరనుట. అంధకులు = గ్రుడ్డివారు, కనుఁగొనన్ = చూచుటకు, నేర్చిరి = శక్తులైరి. వికలాంగకులు = వికలమైన యవయవములుగలవారు; అనఁగాఁ గుంటివారు మొదలగు నవయవహీనులు. లఘుత్వము = లాఘవము, మీఱన్ = అతిశయించునట్లుగా, చనన్ = నడచుటకు, నేర్చిరి = శక్తులైరి.

క. విస్మయముగ నీగతి మురఘస్మరుఁడు నికేతనప్రఘాణమున భుజం
గస్మయహరవాహము డిగి, సస్మితముఖుఁడగుచు నరిగెసమ్మోదమునన్.

టీ. మురఘస్మరుఁడు = మురహంత శ్రీకృష్ణుఁడు, ఈగతిన్ = ఈరీతిగ, విస్మయముగన్ = ఆశ్చర్యముగా; పైని మూఁడుపద్యములలోఁ జెప్పినట్లుగ నాశ్చర్యకరములగు పనులు కల్గుటయె యాశ్చర్యమునకుఁ గారణమనుట. నికేతనప్రఘాణమునన్ = ఇంటి

ముంగిలివాకిటను, భుజంగస్మయహరవాహముక్ -భుజంగ = పాములయొక్క, స్మయ= గర్వమును, హర=నశింపఁజేయునట్టి, వాహముక్ = వాహనమును; గరుడవాహనము ననుట. డిగి=దిగి, సస్మితముఖుఁడగుచుక్ = నగవుతోఁ గూడిన మొగముగలవాఁడగుచు, సమ్మోదమునక్=సంతోషముతో, అరిగెక్ = వెడలెను.

విశే. కార్యసిద్ధి వడసి వచ్చినవాఁడగుట మది సమ్మోదమును, మొగమున హాసమును దెలుపుచున్నదని గ్రహించునది.

సీ. వరభక్తి దేవకీవసుదేవులకు మ్రొక్కి
బలభద్రునకు నట్ల ప్రణతి సేసి
గురుపురోహితబంధుకోటికి వినయంబు
గావించి మిత్రులఁ గౌఁగిలించి
సుతసోదరామాత్యతతినతు లందికొని
యాప్తవర్గంబుల నాదరించి
గారవంబునఁ బెక్కుగతుల మన్నించుచు
వినతాతనూభవు వీడుకొలిపి
తే. ప్రేయసియుఁ దానుఁ గూడి తదీయమంది
రమున కేగి సుఖాలాపరచన మెఱయఁ
బ్రతిన వచ్చెఁ గదా యిదె పారిజాత
మనుచు నర్పింప నద్దేవి హర్షమంది. 49

టీ. వరభక్తిక్ =శ్రేష్ఠమగు భక్తితోడ, దేవకీవసుదేవులకుక్, మ్రొక్కి = నమస్కరించి; తల్లిదండ్రులయెడ సంతానమునకు భక్తి యుండవలెఁ గాన నిచ్చో భక్తి యని కవి వ్యవహరించెననుట. బలభద్రునకుక్ = బలరామునకు, అట్ల; భక్తితోడనె యనుట. అగ్రజుఁడు పితృసముఁడు గాన నాతనియెడలను భక్తినే యగపఱచెననుట. ప్రణతి = నమస్కారము, చేసి, గురుపురోహితబంధుకోటికిక్ = గురువునకును బురోహితునకును బంధుసమూహమునకును, వినయంబు = అణఁకువ, కావించి=చేసి; పెద్దలయెడల వినయముచూపవలెఁ గానఁ బెద్దలును బూజ్యులును నగు గురుపురోహితబంధువుల కడకువం జూపెననుట. మిత్రులక్ = సఖులను, కౌఁగిలించి = ఆలింగనమొనర్చి; మిత్రులయెడలఁ బ్రేమను బ్రకటింపవలెఁ గానఁ బ్రేమసూచకమగు నాలింగనమొనర్చె ననుట. సుతసోదరామాత్యతతినతులు = సుతులు నన్నదమ్ములు మంత్రులు వీరలయొక్క నమస్కారములు, కయికొని=అందికొని; పైని నిరూపించినవారు నమస్కార మొనర్పఁ దగినవారగుట నమస్కరించిరని చెప్పుట సరసము. ఆప్తవర్గంబులక్ = ఆప్తులసమూహము

ము, అదరించి=మన్నించి; తనకష్టసుఖములకుఁ దోడ్పడువారి నాదరించుట సహజగుణముం జేసి వారియెడల నాదరముం జూపెననుట హృద్యము. గారవంబునన్=గౌరవమున, పెక్కుగతులన్ = పలువిధముల, మన్నించుచున్=మన్ననసేయుచు, వినతాతనూభవున్ = వినతకొడుకగు గరుడుని, వీడుకొల్పి = సెలవిచ్చి పంపి; తనకు సర్వవిధములఁ దోడ్పడినవారిని మన్నించుట యాచారము గానఁ దన కెల్లభంగుల సాహాయ్యమొనర్చినవానిని మన్నించెననుట సుసంగతము. ప్రేయసియున్ = సత్యయుఁ, తానున్, గూడి=కలిసి, తదీయమందిరమునకున్ = సత్యాగృహమునకు, ఏగి, సుఖాలాపరచన = సుఖకరమగు మాటలకూర్పు, మెఱయన్=ప్రకాశింపఁగా; అనఁగా సరసాలాపములాడుచనుట. ప్రతిన=ప్రతిజ్ఞ, వచ్చెన్+కదా=తీరెఁగదా, ఇదె = ఇదిగో, పారిజాతము, అనుచున్, అర్పింపన్=ఈయఁగా, ఆద్దేవి=ఆసత్య, హర్షము=సంతోషము, అంది = పొంది, తరువాతిపద్యముతో నన్వయము.

విశే. ఇందు వారివారియెడల శ్రీకృష్ణుఁడగపఱచినభక్తిని సముచితరీతిం దగుపదముల విన్యాసముతోడ నిరూపించుటంబట్టి తిమ్మనార్యుముద్దుపల్కురీతియుఁ దూచి మాటలనువేయుం చాతురియుఁ బ్రకాశితములగుచున్నవి.

పారిజాతప్రతిష్ఠ.

తే. ప్రాణవిభుఁ బెక్కుమాఱులు ప్రస్తుతించి
మందిరారామవాటికామధ్యసీమ
దివిజభూమీరుహంబుఁ బ్రతిష్ఠసేసి
యర్హపూజన మొనరించె ననుదినంబు. 50

టీ. ప్రాణవిభున్=ప్రాణనాథుని శ్రీకృష్ణుని, పెక్కుమాఱులు = అనేకపర్యాయములు, ప్రస్తుతించి = స్తోత్రముచేసి, మందిరారామవాటికామధ్యసీమన్ = గృహారామప్రదేశమధ్యభాగమున, దివిజభూమీరుహంబున్=సురతరువగుకల్పవృక్షమును, ప్రతిష్ఠ+చేసి=నాఁటి, అనుదినంబున్ = ప్రతిదినమును, అర్హపూజనము = తగినపూజను, ఒనరించెన్ = చేసెను.

వ. సతులంట ప్రాణనాథులంట సారెకు నైక్యము లైనమోహాసం
గతులంట యేమి సెప్ప బలఘుస్మరుఁబోర జయించి కల్పక
మహీరుహము న్నిజేశ్వరికిఁ గృష్ణుఁడు దానిటఁ దెచ్చెనంచు సం
స్తుతు లొనరించి రొండొరులతో సపత్నులపదియాఱువేవురున్. 51

టీ. సతులఁట=భార్యలఁట, ప్రాణనాథులఁట = భర్తలఁట, సారెకున్ = మాటి మాటికిని, ఐక్యములైన = ఏకీభావమును గూర్చునవియైన; అనఁగాఁ బరస్పరమునకు నత్యంతమైత్రిని గూర్చునవనుట. మోహాసంగతులఁట = మోహామునకు సంబంధించిన వ్యాపారములఁట; అనఁగా లోకమున సతీపతు లనేకులుగలరు. వారి కత్యంతమైత్రి పొసఁగును. దాన ననేక మోహవ్యాపారము కలుగును. కాని యిట్టి యనిర్వాచ్యమైన ప్రేమతో నెసఁగు మోహవ్యాపారములతో నొప్పు భార్యాభర్తలను గానమని తక్కుంగల దేవేరు లాశ్చర్యముపడి మెచ్చుకొనుచున్నారని యెన్నవలయును. చెప్పన్ = చెప్పుటకు, ఏమి; ఏమికలదనుట. బలఘస్మరున్=బలాసురహంతను, పోరన్ = యుద్ధమున, జయించి, కల్పకక్షితిరుహమున్=కల్పభూజమును, నిజేశ్వరికిన్ = తనభార్యకై, తాను, ఇటన్ = ఇచ్చుటకి, తెచ్చె, అంచున్, సవతులు పదియాఱువేవురున్ = పదునాఱువేలమందియైన సపత్నులును, ఒండొరులతోన్ = ఒకరితోనొకరు, సంస్తుతులు = నుతులు, ఒనర్చిరి = చేసిరి. దాంపత్యమనఁగా నిట్లుండవలెనని వారియన్యోన్యప్రేమను శ్లాఘించిరనుట. ఇట నఁట కిలార్థకము.

సీ. విరివిగా నొకవేళఁ బెరిఁగి వీటికినెల్ల
  నిజశీతలచ్ఛాయ నిగుడఁజేయుఁ
బిన్నగా నొకవేళఁ బెనువ్రేలియంత యై
  చూడ్కులకెంతయు వేడ్క సేయు
వింతగా నొకవేళ వివిధభూరుహపుష్ప
  సురభిగంధంబుల *సోడు ముట్టు
వేర్వేఱ నొకవేళ వికచకాంచనరత్న
  పరిపక్వఫలములఁ బరిణమించు
తే. నభిలషించినరూపంబు నభినయించు
నుల్లమునఁ గోరుకోరిక లెల్ల నొసఁగు
సత్యభామాగృహారామనిత్యమైన
పారిజాతంబు విస్మయాస్పది యగుచు. 52

టీ. ఇందుఁ బారిజాతమునునికి వర్ణితము.—విరివిగాన్ =విశాలముగా,ఒకవేళన్ =ఒకానొకసమయమున, పెరిఁగి = వృద్ధిపొంది, వీటికినెల్లన్ =పట్టణమంతకును, నిజశీతలచ్ఛాయన్ =తనచల్లనినీడను, నిగుడన్ + చేయున్ =వ్యాపింపఁజేయును. పిన్నగాన్ =చిన్న

*ఁ జోడు ముట్టు.

[illegible], [illegible]=[illegible]సమయమున, పెనుప్రేలియంతయై = పెద్దప్రేలిపరిమాణముకలదై, [illegible], [illegible]=[illegible]పులకు, ఎంతయున్ = మిక్కిలి, వేడ్కన్ = సంతోషమును, [illegible]. [illegible]గాన్=ఆశ్చర్యముగా, ఒకవేళన్, వివిధ......గంధంబులన్-వివిధ=[illegible]ములైన, భూరుహ=వృక్షములయొక్క, పుష్ప = పూవులయొక్క, సురభి = [illegible]చునట్టి, గంధంబులన్ = పరిమళములచేతను, సోఁడు = బ్రహ్మరంధ్రమును, [illegible]న్=అంటును; అనఁగాఁ బారిజాతము వివిధవృక్షముల పూవులను దానే పుట్టించి [illegible] పరిమళముచేఁ గపాలము నంటుననుట. ఏదియైన నాఘ్రాణించిన నద్దానిగంధము [illegible]సాద్వారమునఁ గపాలమునకుఁ బోవుట సైజముగదా! వేర్వేఱన్ = విభిన్నముగా: [illegible] భేదము సుగమమగునట్లనుట. ఒకవేళన్, వికచ[illegible]ంచనరత్న పరిపక్వఫల [illegible]లన్=మంచిరంగుగల బంగారురూపమైనట్టియు, రత్నరూపమైనట్టియుం బాగుగాఁ [illegible]ండినపండ్లతో, పరిణమించున్ = పరిణామమునందును; అనఁగా మాఱి యొప్పుననుట. [illegible]భిలషించినరూపంబున్ = కోరినరూపమును, అభినయించున్ = తాల్చి నటించును. [illegible]ల్లమునన్=మదియందు, కోరు = వాంఛించునట్టి, కోరికలెల్లన్, ఒసఁగున్=ఇచ్చును. [illegible]త్యభామాగృహారామనిత్యమైన = సత్యభామయొక్క యింటిముంగిటి యుద్యానమున స్థిరమైన, పారిజాతంబు, కర్త. విస్మయాపాది=ఆశ్చర్యమును గలుగఁజేయునది, అగు చున్: పూర్వసీసపాదములతో నన్వయము. సీసపాదములలో విస్మయమును గలుగఁ జేయుటకు హేతువులు నిర్దిష్టములయ్యె.

నారదాగమనము.

వ. ఇవ్విధంబున నభీష్టఫలసిద్ధిసంతోషితస్వాంతులును నిఖిలలోకైక సంస్తూయమానమహామహిమోదాత్తులు నై నిరంతరసౌఖ్యవర్ధిష్ణు లగునాసత్యాకృష్ణులను జూచువేడుకం గ్రమ్మఱ నొక్కనాఁడు నిజతనుప్రభాప్రభావాపహసితశారదనీరదుం డగునారదుం డరుగు దెంచి యాదంపతులు సేయుసత్కారంబులం బరితుష్టి నొంది సుఖోప విష్టుండై యిష్టాలాపసమయంబున నుల్లసితముఖారవిందుం డగుచు నయ్యిందువదనం గనుంగొని. 53

టీ. ఇవ్విధంబునన్=ఈరీతిగ, అభీష్టఫలసిద్ధిసంతోషితస్వాంతులును = కోరిక ఫలము సిద్ధించుటచే సంతోషపడిన మనస్సుగలవారును, నిఖిల......దాత్తులు-నిఖిల= [illegible], లోక=జనులచే, సంస్తూయమాన = నుతింపఁబడుచున్న, మహామహిమ = [illegible], ఉదాత్తులున్=అధికులును, ఐ = అయి, నిరంతర సౌఖ్యవర్ధిష్ణులగు =

అత్యధిక సౌఖ్యముచే వర్ధిల్లువారగు, ఆసత్యాకృష్ణులను, చూచువేడుకన్, కృష్ణుఁడన్ = మఱల, ఒక్కనాఁడు, నిజ.....నీరదుండగు-నిజ=తనయొక్క, తనుప్రభా = శరీర కాంతియొక్క, ప్రభావ=మహిమచే, అపహసిత=నవ్వఁబడుచున్న, శారదనీరదుండగు= శరత్కాలమేఘముగలవాఁడగు, నారదుండు, అరుగుదెంచి=వచ్చి, ఆదంపతులు = ఆ సత్యాకృష్ణులు, చేయు సత్కారంబులన్ = చేసినట్టి సమ్మానములచే, పరితుష్టిన్=సంతుష్టిని, ఒంది=పొంది, సుఖోపవిష్టుండై = సుఖముగఁ గూర్చున్నవాఁడై, ఇష్టాలాపసమయంబునన్=ఇష్టగోష్ఠితోనుండుసమయంబున; అనఁగా నిచ్చవచ్చిన మాటలాడుకొనునపుడనుట. ఉల్లసిత ముఖారవిందుండగుచున్=వికసితమైన ముఖపద్మము గలవాఁడగుచు, అయ్యిందువదనన్=ఆచంద్రవదనను; సత్యను, కనుంగొని=చూచి.

తే. హేమనిభగాత్రి! నీభాగ్య మేమి చెప్ప
జిష్ణుభూజంబు నీపెట్టుచెట్టుఁ జేసి
సవతులన కాదు త్రిభువనేశ్వరి యనంగఁ
బొలుచుపౌలోమి గెలిచితి వలఘుమహిమ. 54

టీ. హేమనిభగాత్రి=బంగారుతో సమానమైన శరీరముగలదాన!, నీభాగ్యము= నీయదృష్టము; నీసంపత్తు. చెప్పన్, ఏమి? అనఁగా ననిర్వాచ్యమనుట. జిష్ణుభూజంబున్=ఇంద్రద్రుమమును; పారిజాతముననుట. నీపెట్టుచెట్టున్ = నీవు నాఁటినచెట్టుగా, చేసి=ఒనర్చి, సవతులన్+అ-సవతులన=సపత్నులనే, కాదు, త్రిభువనేశ్వరి=ముల్లోకములకు రాణి, అనంగన్ = అనునట్లుగా, పొలుచు=ఒప్పునట్టి, పౌలోమిన్=ఇంద్రుని భార్యను శచిని, అలఘుమహిమన్=గొప్పమహిమచే, గెలిచితి=జయించితివి.

విశే. నారదుఁడు నామూలముననే సుమ్ము నీకింతటిభాగ్యము కల్గెనని నిపుణముగఁ బ్రసంగించినాఁడు. మఱియుఁ బుణ్యకవ్రతము సేయఁ బురికొల్పఁ దలంచినవాఁడు గానఁ దన చెప్పినచొప్పున నడుచువారల కెల్లభాగ్యములును గల్గుననియు నిపుణముగఁ దెలియఁ బల్కినవాఁడు.

## పుణ్యకవ్రతము.

చ. అతులితతాపకీనమహిమాతిశయోచిత మైనపుణ్యక
వ్రత మొనరింపఁగా వలయు వారిజలోచన నీవు నయ్యరుం
ధతియును గౌరియు న్నచియుఁ దత్పరబుద్ధి నొనర్చువేళఁ జూ
చితి మును తద్విధం బెఱుఁగఁ జెప్పెద నే నిపుడానుపూర్విగన్. 55

టీ. సరసిజలోచన = పద్మాక్షీ, నీవును, అతులితతావకీన మహిమాతిశయోచిత గుణ=సాటిలేని నీదగు ప్రాభవాతిశయమునకుఁ దగినదైన, పుణ్యకవ్రతము=పుణ్యకమను వ్రతమును; పుణ్యములఁ గలుగఁజేయు వ్రతముగాన దీని కీపేరు గల్గెను. ఒనరింపఁగాఁ దలఁతువేని = చేయవలెను. అయ్యరుంధతియున్, గౌరియున్, శచియున్, సద్బుద్ధిన్ = ఆ పుణ్యకవ్రతమం దాసక్తమైన మదితో, ఒనర్చు వేళన్ = చేయు సమయమున, మును=పూర్వమందు, చూచితిని. నేను, ఇపుడు, తద్విధంబు = ఆపుణ్యక వ్రతమురీతిని, అనుపూర్విగన్=సక్రమముగా, చెప్పెదను.

వి శే. అరుంధతీగౌరీశచులు చేసిరనుటంజేసి వారలవలె నీవును స్వాధీనపతిక వగుటంజేసి చేయవలెనని హెచ్చరించెనని గ్రహించునది.

చ. తెలతెలవారఁ మౌననియతి న్నదికిం జని తీర్థమాడి ని
ర్మలవసనంబు గట్టి నవరత్నవిభూషణము ల్ధరించి మైఁ
గలప మలంది క్రొమ్ముడిని గమ్మవిరు ల్సవరించి యత్తమా
మలకును నాత్మభర్తకు నమస్కృతి నేసి తదీయసమ్మతిన్. 56

టీ. తెలతెలవారన్ = తూర్పు తెలతెలనగుచుండ; అనఁగా నుషఃకాలమున ననుట. మౌననియతిన్ = మాటలాడకుండుట యను నియమముతోడ; మౌనముతోడ ననుట. నదికిన్; చని, తీర్థమాడి=స్నానమొనర్చి (తీర్థము=జలమునందు, ఆడి=మునిఁగి) నిర్మలవసనంబున్=శుభ్రవస్త్రమును, కట్టి, నవరత్నవిభూషణముల్ = తొమ్మిదిజాతుల రత్నములచేనైన యలంకారములను ధరించి, లేదా నూతనరత్నాలంకారములను ధరించియైన చెప్పనగును. మైన్=శరీరమున, కలపము=అంగరాగము; అనఁగాఁ జందనాదులనుట. అలంది=పూసికొని, క్రొమ్ముడిని=క్రొత్తయైన శిరోజములముడియందు, కమ్మవిరుల్ = పరిమళించుపుష్పములు, సవరించి=కూర్చి; అనఁగా ముడిచికొనియనుట. అత్తమామలకున్, ఆత్మభర్తకున్ = తనమగనికి, నమస్కృతి, చేసి, తదీయసమ్మతిన్ = వారి యంగీకారముచే, తరువాతిపద్యముతో నన్వయము.

వి శే. శ్రుతులును, స్మృతులును పత్యనుమతినందక భార్య యేవ్రతమును జేయరాదనియు, నట్లుచేసిన నది విఫలమగుననియుఁ బల్కునుగాన, నిందుఁ బతియనుజ్ఞ నందవలెనని కవి పల్కినాఁడని యెన్నవలెను.

చ. కువలయనేత్ర! తొంటితనకోపము గర్వము మత్సరంబు మా
ని వినయమునుం బ్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున

స్సవతులయిండ్లకెల్లఁ దొలునాఁడు క్రమంబున నేఁగి తద్వ్రతో
త్సవమున కామతించి యతిసంభ్రమలీలలఁ దోడి తేఁ దగున్. 57

టీ. కువలయనేత్ర=కలువకంటీ! తొంటితనకోపమున్ = పూర్వమునఁగల తన కోపమును, గర్వమున్, మత్సరంబున్ = మాత్సర్యమును, మాని=విడిచి, వినయమున్ = అణఁకువయు, ప్రమోదమున్ = సంతోషమును, నిండి, తొలంకెడు = ఒలుకుచున్న, నెమ్మనంబునన్ = నిండుమదితో, తొలునాఁడు=పూర్వదినమున, సవతులయిండ్లకెల్లన్ = సపత్నీగృహములకెల్లను, క్రమంబునన్ = పిన్నపెద్దవరుస ననుసరించి, ఏగి, తద్వ్రతోత్సవమునకున్ = ఆవ్రతోత్సవమునకై, ఆమతించి=ఆహ్వానించి; పిలిచి యనుట. అతి సంభ్రమలీలలన్; అత్యంతోత్సాహవిలాసములతో ననుట. తోడితేన్ = తీసికొని వచ్చుట. తగును.

విశే. ఈవిధానము సత్యాగర్వపరిహారార్థమని యెన్నవలెను.

చ. దినదిన మట్లు తత్పరమతిం బదివేవురు పేరఁటాండ్ర క
ర్చన లొనరించి సారఘనసారసుగంధములు న్విచిత్రనూ
తనపటవస్త్రభూషణవితానము లిచ్చుచు వేడ్కఁ జైత్రశు
ద్ధనవమి యాదిగా నెల వ్రతం బొనరించినయంతమీఁదటన్. 58

టీ. దినదినము=ప్రతిదినము, అట్లు = ఆరీతిగ, పదివేవురు పేరఁటాండ్రకున్ = పదివేలమందియైన ముత్తైదువలకు, అర్చనలు=పూజలు, ఒనరించి = చేసి, సారఘనసార సుగంధములున్ = శ్రేష్ఠమైన పచ్చకప్పురమును బరిమళద్రవ్యములును, విచిత్రనూతన పటవస్త్రభూషణవితానమున్ = విచిత్రములైన క్రొత్తపట్టుబట్టలయు నలంకారములయు సమూహములను, ఇచ్చుచున్, వేడ్కన్ = సంతోషముతో, చైత్రశుద్ధనవమి యాదిగాన్ = చైత్రమాసశుక్లపక్షనవమి మొదలుగా, నెల=మాసము, వ్రతంబు, ఒనరించిన యంతమీఁదటన్=చేసినపిదప. తరువాతిపద్యముతో నన్వయము.

మ. పరమాచారధురీణు నధ్యయనసంపన్ను న్శుభాకారు శా
స్త్రరహస్యజ్ఞు విశిష్టవంశజుఁ బ్రశాంతస్వాంతు సుదృద్ధయా
పరతంత్రు న్విదితాత్ము భూసురవరుం బ్రార్థించి యాచార్యుఁగాఁ
దరళాక్షీ! నియమింపఁగాఁ దగు వ్రతోద్వాసక్రియావేళకున్. 59

టీ. తరళాక్షీ=చపలాక్షీ! పరమాచారధురీణున్ = ఉత్కృష్టమైన వేదవిహిత ధర్మానుష్ఠానముయొక్క భారమును వహించునట్టివానిని; అనఁగా వేదవిహితమగుధర్మములఁ దప్పక యాచరించువాని ననుట. అధ్యయనసంపన్నున్ = వేదాధ్యయనముతోఁ

[illegible]వానిని; అనఁగాఁ జక్కఁగా వేదవేదాంగములఁ జదివికొన్నవానిననుట. శుభా[illegible] = దర్శనీయమైన యాకారముగలవానిని; అనఁగా నంగవైకల్యములేనివాని[illegible] అంగవైకల్యముగలవాఁడు దానయోగ్యుఁడు కాఁడని భావము. శాస్త్రరహస్య[illegible] = ఎల్లశాస్త్రములరహస్యము నెఱింగినవానిని; అనఁగా సత్కార్యప్రవృత్తియుం [illegible] ర్యనివృత్తియుంజేయు శాస్త్రములమర్మముల నెఱింగినవానిననుట. విశిష్టవంశ[illegible] = ఉత్కృష్టశిష్టవంశమునఁ బుట్టినవానిని; అనఁగా వేదవిహితధర్మములం [illegible]దన్మార్గమును వీడక వర్తించు నుత్తమవంశమునఁ బుట్టినవానిననుట. ప్రశాంత[illegible] = మిగుల శాంతమైన మదిగలవానిని; అనఁగాఁ గామక్రోధాదులఁ గలుషితము [illegible]మదిగలవానిననుట. ఉద్యద్దయాపరతంత్రుః = ఉదయించుదయ కధీనుఁడైన [illegible]; అనఁగా నెంతయు దయాళువైనవాని ననుట. విదితాత్ముః = తెలియఁబడిన [illegible]జ్ఞానముగలవానిని; అనఁగా బ్రహ్మజ్ఞానసంపన్నుననుట. భూసురవరుః = బ్రాహ్మణ[illegible]ష్ఠుని, పైని పేర్కొనిన లక్షణములుగలవాఁడే బ్రాహ్మణశ్రేష్ఠుఁ డనిపించుకొనునని [illegible]. ప్రార్థించి= వేఁడి, వ్రతోద్వాసక్రియావేళకుః = వ్రతపరిసమాప్తివ్యాపార[illegible]మునకు; ఉద్యాపనము చేయుసమయమున కనుట. ఆచార్యుఁగాః = గురువుగా; [illegible] వ్రతతంత్రమునందలి యాయాక్రియల నుపదేశించుటకును, నందాయాదానా[illegible] ప్రతిగ్రహించుటకును దగుబ్రహ్మగా ననుట. నియమింపఁగాః = ఏర్పఱుపఁగా, [illegible]; నియమింపవలెననుట.

శా. ఆరీతి న్నియమించి యీవలయు మాద్యద్దంతివాహావళు
ల్నారీరత్నచయం బనర్ఘనవరత్నశ్రేణిగోభూపరీ
వారంబు ల్ధనధాన్యసంతతి రసవ్రాతంబుఁ గర్పూరక
స్తూరీసంకుమదాగురుక్రముకరాసు ల్కోటిసంఖ్యాకముల్. 60

టీ. ఆరీతిః = పైనిచెప్పినచొప్పున, నియమించి, మాద్యద్దంతివాహావళుల్ = [illegible]టిన యేనుఁగులయు గుఱ్ఱములయు సమూహములను, నారీరత్నచయంబు= స్త్రీరత్న[illegible]సమూహమును, అనర్ఘ...వారంబుల్ - అనర్ఘ = అమూల్యములైన, నవరత్న= తొమ్మిది [illegible] రత్నములయొక్క; లేక క్రొత్తరత్నముల, శ్రేణి= పంక్తియు, గో = ఆవులు, [illegible], పరీవారంబుల్ = పరిచారకులును, ధనధాన్యసంతతి= ధనధాన్యముల సమూహ[illegible], రసవ్రాతంబుః = ద్రవద్రవ్యములసమూహమును; అనఁగా నేయి తేనె మొద[illegible]. కర్పూర...క్రముకరాసుల్ - కర్పూర= కర్పూరము, కస్తూరీ= కస్తూరి, [illegible], అగురు, క్రముక= పోఁక (వీనియొక్క), రాసుల్ = కుప్పలు, కోటి

సంఖ్యాకముల్ = కోటిలెక్కగలవానిని; కోట్లకొలఁదియగుట. ఈన్ + వలయున్ = ఒసంగవలెను.

శా. ఏతద్వస్తు సదక్షిణాకముగ నాత్మేశు న్సురానోకహ
స్వీతుంగాఁ దగ ధారవోసి ద్విజుఁ డేయేయర్థము ల్వేఁడినం
జేతఃప్రీతిగ నిచ్చి క్రమ్మఱఁ బతిం జేకొంట యుక్తంబు వి
ఖ్యాతంబై తనరారు నీవ్రతము సాకల్యంబుగాఁ జేసినన్. 61

టీ. ఏతద్వస్తు = ఈవస్తుసమూహము; జాత్యేకవచనము. సదక్షిణాకముగన్ = దక్షిణతోఁ గూడుకొనునట్లుగా; అనఁగా వానికి దక్షిణగాననుట. ఆత్మేశున్ = తనప్రాణ నాథుని; భర్తననుట. సురానోకహాన్వీతుంగాన్ = కల్పవృక్షముతోఁ గూడినవానినిఁగా; అనఁగాఁ గల్పవృక్షముతోఁ గూర్చియనుట. తగన్ = ఉచితమగునట్లుగా, ధారవోసి = ఉదకధారతో దత్తముచేసి, ద్విజుఁడు=బ్రాహ్మణుఁడు, ఏయేయర్థముల్ = ఏయేపదార్థములను, వేఁడినన్ = కోరినను, చేతఃప్రీతిగన్ = మదికి సంతోషము గల్గునట్లుగా, ఇచ్చి; అనఁగా దానముపట్టిన యాచార్యుఁ డేమి కావలెనన్న నవ్వానినిచ్చి వాని మనస్సును సంతోషపెట్టి యనుట. క్రమ్మఱన్ = మఱల, పతిన్ = భర్తను, చేకొంట=పరిగ్రహించుట, యుక్తంబు=అర్హము. ఈవ్రతము, విఖ్యాతంబై=ప్రసిద్ధమై, తనరారున్ = ఒప్పును; ప్రసిద్ధముగా నున్నదానినే చెప్పితిని గాని లేనిదానిం జెప్పలేదనుట. ప్రాణనాథుని సురభూజముతో ధారవోయుపద్ధతి కల్పిత మనుకొను నేమోయని యీమాట యిచ్చోఁ గూర్పవలసివచ్చెను. సాకల్యంబుగాన్ = సంపూర్ణముగా; కొఱంతలేక యనుట, చేసినన్ = చేసినచో, తరువాతిపద్యముతోడ నన్వయము.

క. ధనకనకవస్తుసమితియుఁ
దనయసమృద్ధియును గల్గి తానుం బతియున్
మనమున నఱగొఱ లెఱుఁగక
యనితరసులభైకసుఖము లందుదు రనుచున్. 62

టీ. ఇందు వ్రతమువలని ఫలము పేర్కొనఁబడుచున్నది.—ధనకనకవస్తుసమితియున్ = ధనము బంగారము వివిధవస్తువులు వీనిసమూహమును, తనయసమృద్ధియును = పుత్రసమృద్ధియు, కల్గి, తానున్, పతియున్, మనమునన్ = మదిని, అఱగొఱలు=అఱమఱలు, కొఱంతలు; ఎఱుఁగక=లేక, అనితరసులభైకసుఖముల్ = ఇతరులకుఁ బొందరాని ముఖ్యములైన సుఖములను, అందుదురు=పొందుదురు. అనుచున్.

భా. ప్రతమాచరించిన వనిత ధనధాన్యాది వస్తుసమృద్ధియుఁ, బుత్రసమృ ద్ధియుఁ గల్గి, భావ్చెముకాని పతిప్రేమకుఁ దావలమై, యనన్యదుర్లభములగు సుఖములం బొందునని భావము.

## పుణ్యక వ్రతము.

క. నారదుఁడు పుణ్యకవ్రత,మారూఢిగ నెఱుఁగఁ జెప్ప నవహితమతియై
కోరిక లిగురొత్తఁగఁ ద,త్ప్రారంభ మొనర్చె సత్య ధవునియనుజ్ఞన్.

టీ. నారదుఁడు, పుణ్యకవ్రతము, ఆరూఢిగన్ = ప్రసిద్ధముగ, నెఱుఁగన్ = తెలియునట్లుగ, చెప్పన్, అవహితమతియై=సావధానబుద్ధిగలదై, కోరికలు=వాంఛలు, ఇగురొత్తఁగన్ = పల్లవింపఁగా, సత్య = సత్యభామ, ధవునియనుజ్ఞన్ = భర్తయగు శ్రీకృష్ణుని సెలవుచే, తత్ప్రారంభము = ఆపుణ్యకవ్రతప్రారంభము, ఒనర్చెన్=చేసెను.

విశే. నారదుఁడు పతిసెలవునందవలెనని తెల్పెనుగాన సత్య శ్రీకృష్ణు ననుజ్ఞం బడసినని గ్రహించునది.

సీ. యదువృష్ణికుకురభోజాంధకాదికముగా
*నాత్మీయమైనట్టి యాప్తగణము
సంబంధులైనభీష్మకమహీశాదులు
పదియాఱువేలభూపతులకులము
పాండవకౌరవపాంచాలు రాదిగాఁ
బరమహితంబైనబంధుసమితి
నందాదిగోపాలబృందంబు మఱియును
నెయ్యులై వర్తించునృపచయంబు
గీ. వారివారలచుట్టము లార్వరిసఖులు
గా జగంబునఁ గల్గినరాజలోక
మెంత యంతయు సకుటుంబ మేగుదెంచెఁ
బుణ్యకాఖ్యవ్రతోత్సవాభ్యుదయమునకు. 64

టీ. యదు వృష్ణి కుకుర భోజాంధకాదికముగాన్ = యాదవులు, వృష్ణులు, కుకురులు, భోజులు, అంధకులు మొదలుగా; పైని పేర్కొనినవారలు యదువంశము నందలి యుపశాఖలను సంబంధించినవారనుట. ఆత్మీయమైనట్టి = తనసంబంధమైన, ఆప్తగణము = ఆప్తులసమూహము, సంబంధులైన = వివాహాది సంబంధముగలవారైన;

* నాత్మీయంబైన.

అనఁగా వియ్యము నందినవారనుట. భీష్మకమహీశాదులు=భీష్మకుఁడు మొదలగు రాజులును; భీష్మకుఁడు రుక్మిణితండ్రి. పదియాఱువేల భూపతులకులముꣳ = పదియాఱువేల రాజులసమూహమును; వీరు శ్రీకృష్ణుని పదియాఱువేల పట్టపుదేవేరులతండ్రులు. పాండవ కౌరవ పాంచాలురు=పాండవులు, కౌరవులు, పాంచాలురు, ఆదిగాꣳ=మొదలుగా, పరమహితంబైన=మిగులనిష్టమైన, బంధుసమితి = చుట్టాలగుంపు; పాండవులు కౌరవులును శ్రీకృష్ణునకు మేనత్తకొడుకులుగాన, సహజమిత్రులు మేనత్తకొడుకులు సహజశత్రువు లన్నదమ్ముల బిడ్డలను న్యాయము ననుసరించి వారు పరమహితులనుట. ఆపాండవులకు కూఁతునిచ్చిన వియ్యపువారగుటఁ బాంచాలురు (ద్రుపదుని కొడుకులు మొదలగువారు) నాప్తులే యగుదురు. నందాది గోపాలబృందంబుꣳ = నందుఁడు మొదలైన గోపాలసమూహమును, మఱియును, నెయ్యురై = మిత్రులై, వర్తించు = ప్రవర్తించునట్టి, నృపచయంబుꣳ = రాజసమూహమును, వారివారలచుట్టముల్ = ఆయావారికి బంధువులును, వారిసఖులుꣳ = ఆయావారలమిత్రులును, కాꣳ = అగునట్లు, జగంబునꣳ=లోకమున, కల్గిన=ఉన్న, రాజలోకంబు = రాజసమూహము, ఎంత=ఎంతకలదో, అంతయుꣳ=సర్వమును, సకుటుంబము = కుటుంబముతోఁగూడ, పుణ్యకాఖ్యవ్రతోత్సవాభ్యుదయమునకుꣳ = పుణ్యకమను పేరుగల వ్రతముయొక్క యుత్సవముయొక్క యభివృద్ధికై, ఏగుదెంచెꣳ =వచ్చెను. పైని పేర్కొన్నవారెల్లను భార్యలతోడను, బంధులతోడను, మిత్రులతోడను నేతెంచిరని భావము.

వ్యా—విశే. ఇందు వచ్చినవారిని బేర్కొనుటలోఁ గలక్రమ మతిహృద్యము. నెయ్యము. ప్ర. స్నేహము.

క. నగముల నదులఁ బయోధుల
దిగంతములఁ గాననముల దీవుల మఱియుం
దగునెడలఁ బుణ్యకవ్రత
జగదుత్సవమునకు వచ్చె సంభారంబుల్. 65

టీ. పుణ్యకవ్రతజగదుత్సవమునకుꣳ = పుణ్యకవ్రతమను లోకోత్సవమునకు, నగములꣳ=కొండలనుండియు, నదులꣳ = ఏఱులనుండియు, పయోధులꣳ = సముద్రములనుండియు, దిగంతములꣳ = దిక్కూలములనుండియు, కాననములꣳ = అడవులనుండియు, దీవులꣳ = ద్వీపములనుండియు, మఱియుꣳ, తగునెడలꣳ=తగినతావులనుండియు, సంభారంబుల్ = సామగ్రులు, వచ్చెꣳ; అనఁగా వానినుండి కొనివచ్చిరని భావము.

వ్యా—విశే. దీవి. ప్ర. ద్వీపమ్.

తే. అసురహరునాజ్ఞ రైవతకాద్రిప్రాంత
విస్మయము గాఁగ నిర్మించె విశ్వకర్మ
తననిర్మాణచాతురి కవధి గాఁగ
మణిమయోజ్జ్వల మగుదానమంటపంబు. 66

టీ. విశ్వకర్మ=దేవశిల్పి, అసురహరునాజ్ఞన్ = శ్రీకృష్ణునియాజ్ఞచే, రైవతకాద్రిప్రాంతన్ = రైవతకపర్వతసమీపమున, విస్మయము గాఁగన్ = ఆశ్చర్యకరముగా, తననిర్మాణచాతురికిన్ =తనసృష్టినైపుణ్యమునకు, అవధి=హద్దు, కాఁగన్=అగునట్లుగా; [illegible] నింత కెక్కుడుగా నొండు నిర్మింప వీలులేనియట్లనుట. తన నిర్మాణనైపుణి కిది పరమావధిగాఁ జేసెనని భావము. మణిమయోజ్జ్వలమగు=మణిప్రచురమగుటచేఁ బ్రకాశించు, దానమంటపంబున్=దానము చేయునపు డుండఁదగిన మంటపమును, నిర్మించెన్= సృజించెను.

సీ. చూడ్కికి వ్రేఁక మై సురవిమానములచే
గగనమార్గం బెల్లఁ గ్రిందుకొనియె
మనుజనాయకవరమకుటాగ్రమణులచే
దిగ్భిత్తు లధికచిత్రితము లయ్యె
నానాతు లైనమహామునీశ్వరులచేఁ
బొడవడ దయ్యె భూభువనతలము
సందర్శనాయాతజనభరంబునఁ గ్రింద
భుగ్నస్ఫుటుం డయ్యె భుజగభర్త
తే. సమయబహుముఖముఖరతూర్యములవలనఁ
బ్రహ్మాండంబు ఘోషసంభరిత మయ్యె
సకలలోకమహాశ్చర్యజనక మయిన
పుణ్యకాఖ్యమహోత్సవాభ్యుదయమునను. 67

టీ. సకలలోకమహాశ్చర్యజనకమైన = ఎల్లప్రజలకు మిగుల నాశ్చర్యమును [illegible]నట్టి, పుణ్యకాఖ్యమహోత్సవాభ్యుదయమునను = పుణ్యకమను పేరుగల [illegible]వము యొక్క యభివృద్ధియందు, చూడ్కికిన్=దృష్టికి, వ్రేఁకమై=భారమై, [illegible]ములచేన్ = దేవతలవిమానములచే, గగనమార్గంబెల్లన్ = ఆకాశమార్గ[illegible], క్రిందుకొనియెన్=క్రిక్కిఱిసెను; విమానములపైనుండి సురలెల్లరు నుత్స[illegible]దు రుండిరని భావము. మనుజనాయకవరమకుటాగ్రమణులచేన్ = రాజ

శ్రేష్ఠుల కిరీటములకొనలనుండు మాణిక్యముల చేత, దిగ్భిత్తులు = దిక్కులనుగోడలు; దిక్త
టములనుట. అధికచిత్రితములు = మిగుల చిత్రవర్ణముగలవిగాఁ జేయఁబడినవి.
అయ్యెన్; లెక్కకు మిక్కిలియైన రాజు లేతెంచిరనుట. ఆహూతులైన మహామునీశ్వ
రులచేన్ = పిలువఁబడిన మహర్షులచేతను, భూభువనతలము = భూలోకప్రదేశము,
పొడవడదయ్యెన్ = అగపడదయ్యెను; మహామునీశులసంఖ్యాకు లేతెంచిరనుట. సంద
ర్శనాయాతజనభరంబునన్=చూచుటకు వచ్చిన జనులబరువుచే, భుజగభర్త=శేషుఁడు,
భుగ్నస్ఫటుండు = వంగినపడగగలవాఁడు, అయ్యెన్; భువిని మోయు శేషునితల జనభార
మును వహింపఁజాలక వంగెననుట. అనఁగాఁ ప్రజలసంఖ్యాకులయుత్సవముం జూడవచ్చి
రనుట. సమయబహుముఖముఖరతూర్యములవలనన్ = ఆయుత్సవసమయమున నానా
ప్రకారముగ ధ్వనిచేయు మంగళవాద్యములవలన, పద్మజాండంబు = బ్రహ్మాండము,
ఘోషసంభరితము = ధ్వనితోఁ బూర్ణమైనది, అయ్యెన్; అనఁగా వివిధవాద్యములు
నయ్యుత్సవమున మ్రోగింపఁబడెననుట.

ఉ. దానవభేది సత్యయును దాను యథోచితవృత్తి మంగళ
స్నాన మొనర్చి శుభ్రవసనంబులు గట్టి యనర్ఘరత్నభూ
షానివహంబు పూని హరిచందనచర్చ వహించి వృద్ధస
భ్యానుమతి న్సులగ్నమున నావ్రతదీక్ష వహించె నయ్యెడన్. 68

టీ. దానవభేది=శ్రీకృష్ణుఁడు, సత్యయును, తానున్, యథోచితవృత్తిన్ =
యథార్హమైనవర్తనముతో; అనఁగా నపు డెట్లొనర్పవలెనో యట్లనుట. మంగళస్నానము
=వ్రతదీక్షకుఁ బూర్వమునఁ జేయుస్నానమును, ఒనర్చి=చేసి, శుభ్రవసనంబులు=ధౌత
వస్త్రములను, కట్టి; వ్రతాదుల ధౌతవస్త్రధారణ మవశ్యకర్తవ్యము. అనర్ఘరత్నభూషా
నివహంబున్=అమూల్యములైన రత్నాలంకారముల సమూహమును, పూని = తాల్చి,
హరిచందనచర్చ = హరిచందనపుఁబూఁతను, వహించి; పూసికొనియనుట. వృద్ధసభ్యాను
మతిన్=వృద్ధులగు సభాసదులయంగీకారముచే, అయ్యెడన్ = ఆసమయమున, సులగ్న
మునన్=మంచిలగ్నమునందు, ఆవ్రతదీక్షన్, వహించెన్.

క. వ్రతకల్పోచితదాన,ప్రతిగ్రహార్థముగ నిఖిలపరిషదనుజ్ఞం
గృతనిశ్చయుఁ డై సవినయ,నతిచే సమ్మతిలఁ జేసి నారదమౌనిన్.69

టీ. వ్రతకల్పోచిత...ర్థముగన్-వ్రతకల్ప = వ్రతవిధానమునకు, ఉచిత =
తగిన, దాన = దానమును, ప్రతిగ్రహార్థముగన్ = పుచ్చుకొనుటకుఁగాని, నిఖిలపరిష

[illegible]న్=గరుగ్గమైన సభయొక్క-సమ్మతిచే, కృతనిశ్చయుఁడై=చేయఁబడిన నిశ్చయము [illegible], గర్త. దానవభేది. సవినయనతిచేన్=అడఁకువతోఁ గూడిన నమస్కారముచే, [illegible], సమ్మతిలన్=అంగీకరించునట్లుగా, చేసి=ఒనర్చి, తరువాతి పద్యముతో [illegible].

సీ. [illegible]వతీకరముక్తమణికుంభసంభృత
సౌరభోదకముల జలకమార్చి
హి[illegible]మధామకిరణవిభ్రమవిడంబక శుభ్ర
కౌశేయయుగళంబు గట్ట నిచ్చి
ఘనసార మృగమదగంధబంధుర మైన
గంధసారము మేనఁ గలయ నలఁది
విస్పుమరపరిమళ ప్రసవమాల్యంబులు
ఘనజటాజూటంబు మునుఁగఁ జుట్టి
గీ. లలితమణిమయభూషణావళులు దొడిగి
యిష్టరాజోపచారసంతుష్టుఁ జేసి
ఋత్విజులఁ గాఁగ ధౌమ్యాదిఋషుల నిలిపి
వారిఁ బూజించె సకలోత్సవంబు మెఱయ. 70

టీ. మదవతీ......దకములన్-మదవతీ = యువతులయొక్క, కర = చేతుల నుండి, ముక్త=విడువఁబడిన, మణికుంభసంభృత = మణికలశములందునిండిన, సౌరభోదక ములన్=సుగంధజలముచే, జలకమార్చి=స్నానముచేయించి, హిమధామ......యుగ ళంబున్-హిమధామ=చంద్రునియొక్క, కిరణ=కిరణములయొక్క, విభ్రమ = విలాస ములను, విడంబక=అనుకరించునట్టి, శుభ్ర=తెల్లని, కౌశేయయుగళంబున్ = దుకూల ద్వయమును, కట్టన్=కట్టుకొనుటకు, ఇచ్చి; చంద్రకిరణములంబోలి తళతళ మెఱయు [illegible]పట్టుబట్టల రెండింటిని గట్టుకొనుట కిచ్చిరనుట. ఘనసార......బంధురము-ఘనసార= [illegible]గర్పూరము, మృగమద=కస్తూరి (వీనియొక్క), గంధ = పరిమళముచే, బంధురము = [illegible]గ్గము, ఐన, గంధసారమున్=చందనమును, మేనన్=శరీరమున, కలయన్ = అంత [illegible], [illegible]=రాఁచి; అనఁగాఁ గర్పూరము కస్తూరిచేర్చిన చందనమును శరీరమునకుఁ [illegible]. విస్పుమర......మాల్యంబులు-విస్పుమర = వ్యాపించునట్టి, పరిమళ=సుగం ధగుణుగల, ప్రసవమాల్యంబులు=పుష్పమాలలను, ఘన జటాజూటంబు = గొప్పదగుజటల

గుంపు, ముసుఁగన్ = నిండునట్లుగా, చుట్టి; జటాజూటమగపడనియట్లు పరిమళించు పూలదండలను జుట్టిరనుట. లలితమణిమయభూషణావళులు = సొగసైన రత్నాలంకార ముల సమూహమును, తొడిగి, ఇష్టరాజోపచారసంతుష్టున్ - ఇష్టరాజోపచార=ఇష్టము లగురాజునకొనర్చు నుపచారములవంటి యుపచారములచే, సంతుష్టున్=సంతోషించిన వానినిగా, చేసి; నారదుననుట. ఋత్విజులన్ = వ్రతముచేయించువారు, కాఁగన్ = అగునట్లు, ధౌమ్యాదిఋషులన్ = ధౌమ్యుఁడు మొదలుగాఁగల ఋషులను, నిలిపి, వారిన్, పూజించెన్ = అర్చించెను. సకలోత్సవంబు = సంపూర్ణమగు నుత్సవము, మెఱయన్=ప్రకాశించునట్లుగా, తరువాతి పద్యముతోడ నన్వయము.

శా. భద్రేభంబులమీఁద నెక్కి వెనుకం బ్రద్యుమ్నశైనేయసౌ
భద్రాదు ల్చన ధర్మజప్రముఖభూపశ్రేణితో శౌరి తూ
ర్యద్రాఘిష్ఠరవంబు లుప్పతిలఁ జేర న్వచ్చె సంపన్ననా
నాద్రవ్యం బగు దానమంటపము నంతన్సంభృతానందుఁ డై. 71

టీ. భద్రేభంబులమీఁదన్=మంగళగజములపైని, ఎక్కి, వెనుకన్, ప్రద్యుమ్న శైనేయసౌభద్రాదుల్=ప్రద్యుమ్నుఁడు, సాత్యకి, సుభద్రకొడు కభిమన్యుఁడు మొదలగువారు, చనన్, ధర్మజప్రముఖభూపశ్రేణితోన్ = ధర్మరాజు మొదలగు రాజుల పంక్తితో, శౌరి = శ్రీకృష్ణుఁడు, తూర్యద్రాఘిష్ఠరవంబు = మంగళవాద్యముల మిగుల దీర్ఘములైన చప్పుడులు, ఉప్పతిలన్=ఒప్పుచుండఁగా, సంపన్ననానాద్రవ్యంబు=ఒప్పి యున్న వివిధపదార్థములుగల, దానమంటపమున్, అంతన్, సంభృతానందుఁడై=నిండిన సంతోషముగలవాఁడై, చేరన్+వచ్చెన్=సమీపించెను.

విశే. దీర్ఘశబ్దముపై తమప్ప్రత్యయము చేయఁగల్గిన రూపము ద్రాఘిష్ఠ.

ఉ. ద్రోవదియు న్సుభద్రయును దోఁ జనుదే విభవాగతాన్యపృ
థ్వీవరకామినీమణులు వేడ్క భజింపఁగ సత్యభామ ము
క్తావినిబద్ధపంజరయుతం బగుపల్లకి యెక్కి వచ్చె వ్ర
ద్ధావిసరంబు మున్నుగ వ్రతప్రతిపాదనసావధాన యై. 72

టీ. ద్రోవదియున్=ద్రౌపదియును, సుభద్రయును, తోన్ = తనతోడ, చనుదేన్ = రాఁగా, విభవాగతాన్యపృథ్వీవరకామినీమణులు = వ్రతవైభవమును జూడ వచ్చిన యితరరాజశ్రేష్ఠుల యువతీరత్నములు; ఇతరరాజుల భార్యలనుట. వేడ్కన్= సంతోషముతో, భజింపఁగన్ = సేవింపఁగా, సత్యభామ, ముక్తావినిబద్ధపంజరయుతం బగు = మంచిముత్తెములచేఁ జేయఁబడిన యాచ్ఛాదనముతోఁ గూడినదైన, పల్లకిన్,

వృద్ధాంగనాసమూహము = వృద్ధాంగనాసమూహము, మున్నుగన్ = ముందునడువఁగా, వ్రతవిధానసావధానయై = వ్రతముచు జేయుటయం దవహితమైన బుద్ధికలదై, వచ్చెన్.

## వ్రతదానములు.

ఉ. జలరుహపత్రనేత్ర మునిసత్తమవృద్ధసువాసినీజనం
బులు వెనువెంట రాఁ జని *ప్రమోదముతో వ్రతదానమంటప
స్థలమున నర్చితం బగువదాన్యమహీరుహసార్వభౌమమున్
వలగొని వచ్చి దేవమునివర్యున కిచ్చె యథోచితార్చనల్. 73

టీ. జలరుహపత్రనేత్ర = పద్మదళాక్షియగు సత్యభామ, మునిసత్తమవృద్ధసువాసినీజనంబులు = మునీశులవృద్ధసుమంగలులు; అనఁగా మునీశులభార్యలనుట. వెనువెంటన్ = తనవెంటను, రాన్ = రాఁగా, చని = ఏగి, ప్రమోదముతోన్ = సంతోషముతో, వ్రతదానమంటపస్థలమునన్ = వ్రతసంబంధిదానములంజేయ నేర్పఱుపఁబడిన మంటపప్రదేశమున, అర్చితంబగు = పూజితమైన, వదాన్యమహీరుహసార్వభౌమమున్ = వదాన్యవృక్షచక్రవర్తిని; కల్పకముననుట. వదాన్యమనఁగా విరివిగ దానముచేయునది. ఈవులమ్రాఁకు, వలగొని = ప్రదక్షిణము చేసి, వచ్చి, దేవమునివర్యునకు = సురమునిశ్రేష్ఠునకు నారదునకు, యథోచితార్చనల్ = అర్ఘ్యపూజలు, ఇచ్చెన్; యథోచితముగఁ బూజించెననుట.

విశే. ఇందు రెండవపాదమున "ప్రమోదముతో" అనుచో "ప్రభుత్వముతో" అని పాఠమగపడు. ప్రభుత్వముతో ననఁగాఁ బ్రాభవముతోనని యర్థము. ప్రకృతమున సత్య ప్రాభవముమీఱ వచ్చెననుటకన్నఁ బ్రమోదముతో వచ్చెననుటయే యుచితమగుటం జేసియుఁ, నారదుఁడు వ్రతవిధానముం జెప్పునవసరమునఁ దొంటి తనగర్వాదులను విడువవలెనని యుపదేశించుటంజేసియుఁ గర్వసూచకమగు ప్రభుత్వపదమునకన్నఁ బ్రమోదపద మచటనుంటయే సరసమని తోఁచెడి.

చ. సతులు పదారువేవురును సంగడి రా వదనాంబుజంబునం
గృతకవికాస మచ్చుపడఁ గృష్ణునిపట్టపుదేవి యిందిరా
ప్రతినిధి రుక్మిణీరమణి రాఁ దగ వౌ నని వచ్చెఁ బుణ్యక
వ్రతము గనుంగొనం గమలరాగమణీశిబికాధిరూఢ యై. 74

* ప్రభుత్వముతో.

టీ. సతులు, పదాఱువేవురును; పదారువేలమంది శ్రీకృష్ణునిభార్యలు ననుట. సంగడిన్ =కూడన్, రాన్ =రాఁగా; కలసిరాఁగా ననుట. పట్టపురాణియగుట నీమెవెనుక వారు వచ్చిరని భావము. వదనాంబుజంబునన్ =ముఖపద్మమునందు, కృతకవికాసము= కల్పితమగుసంతోషము; అనఁగాఁ దెచ్చిపెట్టికొన్న సంతసమనుట. అచ్చుపడన్ = తెల్లముగాఁగ; నాథుఁడు సవతికి వశుఁడై యుంటయు, మఱియు నామెమాట మీఱఁ జాలక యెంతయేని కష్టమునకోర్చి యసాధ్యమగు కల్పవృక్షము నామెకు సుసాధ మొనర్చుటయు, రుక్మిణికి సంతసము నొనర్పఁజాలవు. కాని ప్రకృత మామె తనకుఁగల విచారముం గప్పిపుచ్చి లేనిసంతోషమును దెచ్చిపెట్టుకొని విచారములేనిదానివోలెఁ బై కగపడుచు నాదార్యమిమీఱ రుక్మిణి వచ్చుచుండెనని భావము. కృష్ణుని పట్టపు దేవి=కృష్ణుని దేవేరి, ఇందిరాప్రతినిధి = లక్ష్మీదేవికి బదులైనది; అనఁగా మాఱు లక్ష్మీదేవి యనుట. "రాఘవత్వేఽ భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ" అను నభియుక్తోక్తి ననుసరించియు నీమె లక్ష్మీప్రతినిధియే యగునని భావము. రుక్మిణీరమణి, కర్త. రాన్ =వచ్చుట, తగవు=న్యాయము, ఔను, అని, వెల్లు టయే యుచితమనియెంచి యనుట. సత్య తనయింటికే తెంచి పిలుచుటయు, వ్రత ముత్తమమైనదగుటయు, రుక్మిణిరాకకుఁ గారణములని భావము. పుణ్యకవ్రతము, కనుం గొనన్ = చూచుటకు, కమలరాగమణిశిబికాధిరూఢయై = పద్మరాగమణివికారమైన పల్లకి నధిష్ఠించినదై, వచ్చెన్.

విశే. తాను రావన్న తనయసూయ వెల్లడియగును. మఱియు నందలివిశేషములఁ గన్నారఁ గాంచుట సిద్ధింపదు. కావున రుక్మిణి తనపెద్దతనమును స్థిరముగఁ జేయనెంచి కృతకవికాసముతో వచ్చెనని గ్రహించునది. మణిశబ్ద మీకారాంతమును గలదు.

వ. అట్టియెడ నమ్మహావ్రతదానోచితంబుగా వేర్వేఱ నేర్పరింపంబడు సాలంకారధేనుసహస్రంబులు విడువడు నిజవత్సంబులం బిలుచునం భారవంబులవలనం, బ్రత్యేకంబ పర్వతంబులుగాఁ గల్పింపఁబడుకనక రజతతామ్రకాంస్యాదిలోహంబులుం బద్మరాగప్రవాళహారినీలమౌ క్తికమరకతాదిరత్నంబులుం దిలగోధూమయవవ్రీహిమాషముద్గాది ధాన్యంబులుం గనకనిర్మితచ్ఛత్త్రచామరశయ్యావ్యజనపాదుకాద్యుప కరణంబులుం గజతురగస్యందనాదివాహనంబులు మొదలుగాఁ గలుగు దానద్రవ్యంబులను సమకూర్చునధికారులసంభ్రమాలాపంబులవలన, నపూర్వమహోత్సవసంతోషితస్వాంతు లగుదిగంతమహీకాంతుల పర స్పరసరససల్లాపంబులవలన, వివిధ దేశాగతంబులగు రాజలోకశుద్ధాంత

[illegible] గలుగ జడియు వేత్రహస్తులతర్జనస్ఫూర్జనంబులవలన, [illegible]శ్వరతిలకంబుల వికస్వరస్వరంబుల నామ్రేడించు వేదమంత్ర [illegible]ంబులవలన, వైభవాలోకనలంపటులై యాకసంబున గుంపులు గ[illegible]సి నిలింపు లగ్గించుసంస్తవరవంబులవలనం, బటహభేరీ*ఝల్లర్యాది వాదిత్రనాదంబులవలనను, నాసమయం బభ్యర్ణపూర్ణచంద్రోదయ ఘూర్ణమానార్ణవంబునుం గ్రేణిసేయుచుండె నట్టియెడఁ దత్కాల కలంబు వినివారించి నారదుండు సత్యభామ కిట్లనియె. 75

టీ. అట్టియెడన్ = ఆసమయమున, అమ్మహావ్రతదానోచితంబుగాన్ = ఆమహావ్రతముయొక్క దానమునకుఁదగునట్లుగా, వేర్వేఱన్ = వేర్వేఱుగాన్, ఏర్పరింపంబడు = ఏర్పఱుపఁబడ్డ, సాలంకారధేనుసహస్రంబులు = అలంకృతములైన వేలకొలఁదిగోవులు, [illegible]ంపడు = తమ్మువిడిచితిరుగు, నిజవత్సంబులన్ = తమదూడలను, పిలుచు, అంభారవంబులవల[న]న్ = అంభాయనుధ్వనులవలనను, ప్రత్యేకంబ = వేర్వేఱ, పర్వతంబులుగాన్ = కొండలుగా, [క]ల్పింపఁబడు = కల్పింపఁబడినట్టి, కనక...లోహంబులున్ - కనక = బంగారము, రజత = వెండి, తామ్ర = రాగి, కాంస్య = కంచు, ఆది = మొదలైన, లోహంబులును, పద్మరాగ...రత్నంబులున్ - పద్మరాగ = పద్మరాగము, ప్రవాళ = పగడము, హరినీల = ఇంద్రనీలము, మౌక్తిక = ముంచిముత్యము, మరకత = పచ్చ, ఆది = మొదలైన, రత్నంబులున్, తిల...ధాన్యంబులున్ - తిల = నూవులు, గోధూమ = గోధుమలు, యవ = యవలు, వ్రీహి = వడ్లు, మాష = మినుములు, ముద్గ = పెసలు, ఆది = మొదలైన, ధాన్యంబులున్, కనక...పకరణంబులున్ - కనక = బంగారముచే, నిర్మిత = చేయఁబడిన, ఛత్ర = గొడుగులు, చామర = వింజామరలు, శయ్యా = పఱుపులు మంచములు, వ్యజన = విసనకఱ్ఱలు, పాదుకా = పావలు, ఆది = మొదలగు, ఉపకరణంబులున్ = సామగ్రులును, గజ...వాహనంబులు - గజ = ఏనుఁగులు, తురగ = గుఱ్ఱములు, స్యందన = రథములు, ఆది = మొదలైన, వాహనంబులు, మొదలుగాన్, కలుగు, దానద్రవ్యంబులను = దానోచితపదార్థములను, సమకూర్చు = సిద్ధము సేయునట్టి, అధికారుల సంభ్రమాలాపంబులవలనన్ = అధికారులయొక్క త్వరతో నొప్పుమాటలవలనను, అపూర్వమహోత్సవసంతోషితస్వాంతులగు = ఇదివఱ కెన్నఁడు నెఱుంగని మహోత్సవముచే నానందింపఁబడిన మదిగలవారగు, దిగంతమహీకాంతుల పరస్పరసరససల్లాపంబులవలనన్ = దిగంతాధిపతులయొక్క యన్యోన్యసరసవాక్యములవలనను, వివిధదేశాగతంబులగు రాజలోకశుద్ధాంతవర్గంబులకున్ = వివిధములైన దేశములనుండివచ్చిన రాజభార్యల

* ఝల్లరీశంఖతుత్తుంభికాదివాదిత్ర; ఝల్లరీశంఖదుందుభ్యాదివాదిత్ర.

సమూహమునకు, ఎడగలుగఁ=అవకాశముగలుగునట్లు; దారియగునట్లనుట, జడియం= తొలఁగఁజేయు, వేత్రహస్తులతర్జనస్ఫూర్జనంబులవలనఁ = బెత్తములు చేతఁబట్టినవారి యొక్క బెదరింపు టఱపులవలనను, సంయమిశ్వరతిలకంబుల వికస్వరస్వరంబులఁ = మునిశ్రేష్ఠులయొక్క రేఁగినధ్వనులచే, ఆమ్రేడించు = ప్రతిధ్వనించునట్టి, వేదమంత్ర పఠనంబులవలనఁ = వేదమంత్రపాఠములవలనను, వైభవాలోకనలంపటులై = ప్రత్యో త్సవముంజూడ నాసక్తులై, యాకసంబునఁ = ఆకాశమున, గుంపులుకొని = గుమిగాఁ జేరి, నిలింపులు=దేవతలు, అగ్గించు=కొనియాడునట్టి, సంస్తవరవంబులవలనఁ = నుతుల శబ్దములవలనను, పటహ...నాదంబులవలనఁ - పటహ = డప్పులు, భేరీ = డోలులు, ఝల్లరీ=ఖంజరి, ఆది=మొదలగు, వాదిత్ర=వాద్యములయొక్క, నాదంబులవలనఁ = ధ్వనులవలనను, ఆసమయంబు, అభ్యర్ణ...ర్ణవంబునుఁ - అభ్యర్ణ = సమీపమునసైన, పూర్ణచంద్రోదయ = పూర్ణచంద్రుని యుదయముచే, ఘూర్ణమాన = సంక్షోభించు, అర్ణవంబునుఁ=సముద్రమును, క్రేణిసేయుచుండెఁ = పరిహసించుచుండెను. అట్టి యెడఁ=ఆసమయమున, తత్కలకలంబుఁ = ఆకలకలధ్వనిని, వినివారించి=వారించి, నారదుండు, సత్యభామకుఁ, ఇట్లు=ఈరీతిగ, అనియెఁ.

క. వికచాబ్జనేత్ర! యీపు
ణ్యకవ్రతవిధానమునకు నాథుని ధారో
దకపూర్వ మీవలయు ని
య్యకొలుపుమా యిపుడు యాదవాన్వయతిలకుఁ. 76

టీ. వికచాబ్జనేత్ర = వికసించినపద్మములంబోలు కన్నులుగలదాన, ఈపుణ్యక వ్రతవిధానమునకుఁ=ఈపుణ్యకవ్రతవిధికై, నాథునిఁ=భర్తను, ధారోదకపూర్వము= దానజలధారాపురస్సరముగ; ధారాపూర్వకముగ ననుట. ఈవలయుఁ = ఒసఁగవలెను; ధారాదత్తము చేయవలెననుట. ఇపుడు, యాదవాన్వయతిలకుఁ = యాదవవంశశ్రేష్ఠుని శ్రీకృష్ణుని, ఇయ్యకొలుపుమా = అంగీకరింపఁజేయుమీ; సమ్మతిలఁజేయుమని భావము.

సత్యభామ నారదునకుఁ గృష్ణుని దానమిచ్చుట.

చ. అనవుడు సత్యభామ హృదయంబున లజ్జయు సమ్మదంబునుం
బెనఁగొనఁ బ్రాణవల్లభునిఁ బ్రేమరసాలసవీక్షణంబునం
గనుఁగొని మోము వాంచి మధుకైటభమర్దన! చిత్తగించి తే
మునిపతిమాట నావుడును మ్రోవిపయిం జిఱునవ్వుగుర్వఁగఁ. 77

టీ. అనవుడున్ = అనినపిదప, సత్యభామ, హృదయంబునన్ = మదియందు, సిగ్గునన్ = సిగ్గును; నేను నిన్ను ధారాదత్తము చేయుదునని పతితోఁ జెప్పుటకుఁ జాలక సిగ్గుపడుచున్నదనుట. సమ్మదంబునన్ = సంతోషమును; సవతులెరికిని లేనిస్వామ్యము గల్గెడిదనుచుఁ గల్గెఁగదాయని సంతసమందెననుట. పెనఁగొనన్ = ఒకటితోనొకటి చుట్టుకొనఁగా, ప్రాణవల్లభునిన్ = ప్రాణనాథుని, ప్రేమరసాలసవీక్షణంబునన్ = ప్రేమరసముచే మందమైనచూపుచే; అనఁగాఁ బ్రేమసూచకమగు మందమగుచూపుచే ననుట. కనుఁగొని = చూచి; ప్రేమయొల్కుచూపును బ్రసరింపఁజేయుట పతిని లోఁకువగొనుటకని యెన్నదగి. మోము వాంచి = మొగమువంచి; ఇది సిగ్గునకు సూచకము. మధుకైటభమర్దన = మధుకైటభశిక్షకా! శ్రీకృష్ణ! మునిపతిమాటన్ = మునీశుని పల్కును, చిత్తగించితే = అవధరించితివా; వింటివాయనుట. నావుడును = అనినపిదప, మోవిపయిన్ = పెదవిమీఁద, చిఱునవ్వు = చిన్ననవ్వు, ఇగుర్పఁగన్ = ఇగురొత్తఁగా, మొలకెత్తఁగా ననుట. తరువాతి పద్యముతో నన్వయము.

వ్యా-విశే. 'అనవుడున్, నావుడున్, అనుడును' ఇవి యనుధాత్వానంతర్యార్థకరూపములు.

మ. నవచంద్రాలిక! నీకు నేల యనుమానం బాగమోక్తంబుగా
న విచారింపక ధారవోయు మనిన న్లజ్జాభరాక్రాంతలై
సవతు ల్వాంచిరి వక్త్రపంకరుహము ల్సంబంధిభూపాలక
ప్రవరుల్నవ్విరి నర్మగర్భితవచఃప్రాగల్భ్య మేపారఁగన్. 78

టీ. నవచంద్రాలిక = విదియచందురుంబోలునొసలుగలదాన, నీకున్, అనుమానంబు = సందేహము, ఏల = ఎందులకు? ఆగమోక్తంబుగానన్ = శాస్త్రోక్తముగావున, విచారింపక = ఆలోచింపక, ధారవోయుము = ధారాదత్తముచేయుము; ఈవ్రతవిధికి శాస్త్రనియమమట్లున్నదిగాన దీనికై సందేహ మెందులకని నిపుణముగఁ బల్కెననుట. నీవు నన్నాదరికి ధారవోయఁ దలంపలేదు. నేను నీకూరకె యిట్టియధికార మీయలేదు. మన మిర్వుర మాగమమునకు వశులమని భావము. అనినన్ = అనఁగా, లజ్జాభరాక్రాంతలై = లజ్జాభారముచే నాక్రమింపఁబడినవారై, సవతుల్, వక్త్రపంకరుహముల్ = ముఖపద్మములను, వాంచిరి = వంచిరి; తమకేరికి నొసంగనిస్వామ్యమును సత్యకొక్కతె కిచ్చినందులకు సవతులు సిగ్గుపడిరనుట. మఱియుం సత్య సిగ్గుమాలి యడుగుటకును, నాతఁ డందులకియ్యకొనుటకును సిగ్గునందిరనియుఁ గ్రహింపనగును. సంబంధి భూపాలకప్రవరుల్ =

వియ్యంపువారగు రాజులు; భీష్మకాదులనుట. నర్మగర్భితవచఃప్రాగల్భ్యము = పరిహాస ములో నున్న మాటల ప్రౌఢత్వము. వి పారఁగాక్ =అతిశయింపఁగా, నవ్విరి. ఆఁడుదాని మాట మీఱఁజాలక శ్రీకృష్ణుఁడు తన్నామె ధారవోయుట కంగీకరించినందులకు వారికి హాస ముప్పతిలెననుట.

చ. మునిపతియానతిం జకితముగ్ధమృగీతరలాక్షి ప్రాణనా
థునిఁ గనకాంబరాంచలముతోఁ గుసుమాయుధవాగురానిబం
ధనమును బోనిక్రొవ్విరులదండఁ దగులొ్కనఁ జుట్టె వేడ్కఁ గ
ల్పనగముఁ గూడఁ గంకణఝణంఝణమంజులదోర్యుగంబునన్. 79

టీ. చకిత...తరలాక్షి-చకిత=భయపడిన, ముగ్ధ=సుందరమైన, మృగీ = ఆఁడు లేడియొక్క, తరల=చంచలములైన, అక్షి = కన్నులవంటి కన్నులుగలది; సత్యయనుట. మునిపతియానతిన్=మునీశుఁడగు నారదునాజ్ఞచే, కనకాంబరాంచలముతో = స్వర్ణ వస్త్రాంచలముతోడఁ గూడ, ప్రాణనాథునిన్ = భర్తను, కుసుమాయుధవాగురానిబంధన మును బోని=మన్మథునివలయొక్క కూర్పునుబోలినట్టి, క్రొవ్విరులదండన్=క్రొత్త పూవుల దండచే, కల్పనగమున్+కూడన్=కల్పవృక్షముతోఁ గలియునట్లుగా, కంకణ ఝణం ఝణమంజులదోర్యుగంబునన్ = కంకణముల ఝణంఝణ ధ్వనులచే నందమైన హస్త ద్వంద్వముచే, తగులొ్కనన్ = అంటునట్లుగా, చుట్టెన్; కల్పవృక్షముతోఁ జేర్చి శ్రీకృష్ణుని పూలదండతోఁ గట్టెననుట.

విశే. ప్రకృతము శ్రీకృష్ణుఁ డత్తరుణికి వశుఁడై యిట్లు ప్రవర్తించెను గాన నాతని బంధింపనేర్పడిన మాలను మన్మథుని వలగాఁ గవి చెప్పుట సరసము. పోని - వంటి-అట్టి ఇవి సమానార్థకములు.

తే. పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురుపడకుండుయాదవకుంజరంబు
వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టుపడియె. 80

టీ. పరమముని...బంధనమునన్-పరమముని=ఉత్కృష్టులగు ఋషులయొక్క, మానస=మనస్సనెడు, ఆలాన=ఏనుఁగుగట్టు కొయ్యయొక్క, బంధనమునన్=కట్టునందు, కుదురుపడకుండు=ఉండనట్టి; నిలువనట్టి యనుట. యాదవకుంజరంబు=యదువంశోద్భవుఁ డగు శ్రీకృష్ణుఁడను గజము. వికచరాజీవనేత్రచేన్ = వికసించిన పద్మములంబోలు కన్నులుగల సత్యచేత; ఆమెకన్నులవిలాసమునకు లోఁగెనని యభిప్రాయము. వేల్పు

[illegible] =[illegible]మందు, కమ్మంబూవుల దండచేన్ =పరిమళించు పుష్పమాలచేత, కట్టు [illegible] =[illegible]ంపఁబడెను. నిశ్చల మానసులగు ఋషులమదికిఁగూడ నగోచరుఁడగు [illegible] కవనిత చేఁ బూలదండ యనుసాధనము చేఁ గల్పవృక్షమునందు బద్ధుఁడయ్యె [illegible]ము. అలం. అతిశయోక్తి. రూపకము. విరోధము.

వ్యా-విశే. కమ్మంబూవులదండ, 'కమ్మని' అను విశేషణ నిగాగమమునకుఁ [illegible]ందువుకగ్గెను.

చ. బలిదనుజేంద్రుఁ గట్టితని పల్కఁగ విందుము గాని నేఁడు మా
చెలి యిదె పుష్పదామకముచే నినుఁ గట్టఁగఁ గంటి మింక నె
మ్మెలు పచరింపరాదనుచు మేలము లాడెడుసత్యబోట్లు స
న్నల నెసకొల్పుచుం గెలన నవ్విరి ధర్మజ భీమ ఫల్గునుల్. 81

టీ. బలిదనుజేంద్రున్ = బలియను రాక్షసచక్రవర్తిని, కట్టితి = బంధించితి, అని, పల్కఁగన్ = చెప్పఁగా; పురాణము లనుట, విందుము, కాని, నేఁడు, మాచెలి = మావనిత; సత్యయనుట. ఇదె=ఇదిగో, పుష్పదామకముచేన్ = పూలదండచే, నినున్, కట్టఁగన్, కంటిమి=చూచితిమి. ఇంకన్, నెమ్మెలు = టక్కులు, పచరింపరాదు=ప్రకటింపఁగూడదు; ఏనాఁడో బలిచక్రవర్తిని నీవు బంధించితివని విందు మది కల్లయో నిజమో తెలియరాదు, గాని నేఁడు మాసత్య నిను గల్పకమునఁ బూలదండచే బంధింపఁ గన్నారఁగాంచితిమి. ఇఁక టక్కులు చేయకుమనుట. అనుచున్, మేలములు=హాస్యపు మాటలు, ఆడెడు=పల్కుచున్నట్టి, సత్యబోట్లన్=సత్యభామచెలికత్తెలను, సన్నలన్ = సంజ్ఞలచే (నేత్రసంజ్ఞలననుట),ఎసకొల్పుచున్=పురికొల్పుచు;ఇంకను బరిహసింపుఁడని ప్రేరణ సేయుచుననుట. కెలనన్=పార్శ్వమున, ధర్మజభీమఫల్గునుల్=ధర్మరాజు భీముఁడు నర్జునుఁడును, నవ్విరి; బావలుగానఁ బరిహసించుటయుఁ బరిహసింపఁ బోట్లను బురికొల్పుటయు నుచితమే. సన్న. ప్ర. సంజ్ఞ.

మ. సమయజ్ఞుండయి గర్గసంయమి మహాసంకల్పముం జెప్పఁ గ
ల్పమహీజంబు సదక్షిణాకము నిజప్రాణేశుఁ గూడ న్సుప
ర్వమునిశ్రేష్ఠునకిచ్చె దానముగ ధారాపూర్వమవ్వేళఁ 'ద్రు
భ్యమహం సంప్రదదే నమో నమ' యటం చద్దేవి మోదంబునన్. 82

టీ. సమయజ్ఞుండయి=సుముహూర్తకాలము నెఱింగినవాఁడై, గర్గసంయమి = గర్గుఁడను ముని, మహాసంకల్పమున్=వివాహాదులందు దానసమయమున దేశకాలాదులను దురితాదులను నిర్వచించుచుఁ బురోహితుఁడు చెప్పెడు మహాసంకల్పమును,

చెప్పన్ = చెప్పఁగా, సదక్షిణాకము = దక్షిణతోఁ గూడినట్టి, కల్పమహీజంబున్ = కల్ప వృక్షమును, నిజప్రాణేశున్ గూడన్ = తనభర్తనుగూడ, లేదా, సదక్షిణాకము, కల్ప మహీజము, నిజప్రాణేశున్ = తనభర్తను, కూడన్ = కూడినట్లుగా, కర్త మహీజము. అనఁగాఁ దనపతితోఁ గూడిన కల్పవృక్షమును దక్షిణతోఁగూడననుట. సుపర్వముని శ్రేష్ఠునకున్=సురర్షి యగు నారదునకు, అవ్వేళన్=ఆసమయమున, తుభ్యమ్ = నీకొఱకు, అహమ్=నేను, సంప్రదదే=ఇచ్చుచున్నాను. నమోనమః=నమస్కారము. అటంచున్ = అట్లనుచు, అద్దేవి=ఆసత్య, మోదంబునన్=సంతోషముతో, ధారాపూర్వము=జలధార మున్నుగాఁగ, దానముగన్, ఇచ్చెన్. ఇందుఁ బ్రతిగ్రహీతృవాచకమునకు షష్ఠియు నవిరుద్ధంబ.

వ్యా-విశే. నారదుఁడు చెప్పినచొప్పునఁ బ్రాణనాథుఁడు దానముగా నీయఁబడిన వాఁడు, దానముపట్టినబ్రాహ్మణుఁ డేదికోరిన నదియొసంగి మఱలఁ బ్రాణేశుఁడు పొందఁ దగినవాఁడు కాన, నీమఱలఁ బుచ్చుకొనునట్టి దానమున "తుభ్యమహం సంప్రదదే న మమ" అను సామాన్యమంత్రములోని "న మమ=నాది కాదు" అను స్వత్వపరిహారక వాక్యము త్యాజ్యమైయుండుటం జేసి విడువఁబడినది. "నమోనమయటం" చనుచో విసర్గంబున కనుకరణంబున లోపముగల్గి యడాగమము సిద్ధించెను.

ఆ. ధారవోసి మఱియుఁ దద్వ్రతాంగంబుగా
దాన మిచ్చె నపుడు తలిరుఁబోఁడి
మణిసువర్ణధాన్యమయపర్వతంబులు
గోసహస్రవాజికుంజరములు. 83

టీ. ధారవోసి=ధారాదత్తముచేసి, మఱియున్, తద్వ్రతాంగంబుగాన్=ఆవ్రత మున కంగమగునట్లుగా, తలిరుఁబోఁడి=చిగురువలె నొప్పిదమైన యాసత్య, మణిసువర్ణ ధాన్యమయపర్వతంబులు = మణులయు, సువర్ణంబులయు, ధాన్యములయు రాసుల ననుట. గోసహస్రవాజికుంజరములు = వేలకొలఁది యావులను గుఱ్ఱములను నేనుఁగులను, దానము, ఇచ్చెన్.

వ్యా-విశే. తలిరు+మేను, బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకుఁ బోఁడియనిసూరి. చిగురు+పోఁడి. ఉదంతముపై నుమాగమము. ద్రుతకార్యము చిగురుఁబోఁడి. రూ. ఆ. తలిరుంబోఁడి. చిగురుఁబోఁడి. మొ. ఇట్టివే. అలరుఁబోఁడీ త్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులని ప్రౌఢ. పోఁడి=పోఁడిమి ఈపక్షమున మేనునకుఁ బోఁడిరాలేదు. కలదనియర్థము.

క. ఇవ్విధమున దానము గొని
దివ్వలయోగిరపుఁ దపసి చెట్టును గూడం
బువ్వులసరులం జుట్టిన
యవ్విభుని చెఱంగు విడిచి యల్లన నగుచున్. 84

టీ. ఇవ్విధమునన్=ఈరీతిగ, దానమున్, కొని=పుచ్చుకొని, దివ్వలయోగిరపుఁ దపసి=కలహభోజనుఁడగు ముని; నారదుఁ డనుట. చెట్టును, కూడన్ = అంటునట్లుగా, పువ్వులసరులన్=పూలదండలచే, చుట్టిన, అవ్విభుని చెఱంగున్=ఆ శ్రీకృష్ణుని కట్టుబట్ట కొంగును, విడిచి=వదలించి; విప్పియనుట. అల్లనన్=మెల్లగ, నగుచున్ = నవ్వుచు; కలహము మొదటబెట్టినవాఁడును బెంచినవాఁడును నేఁడు గన్నారఁ దత్ఫలముం గాంచిన వాఁడును బొందినవాఁడును నాతఁడేయగుట నిచ్చో నీపదము సాభిప్రాయమగుచున్నది. తరువాతిపద్యముతో నన్వయము.

క. సత్యముగ నిన్ను నిప్పుడు
సత్యాసతి మాకు నిచ్చె సకలామ్నాయ
స్తుత్య! యింక మా యభీప్సిత
కృత్యంబులు సలుపు మనుచుఁ గేళిపరుం డై. 85

టీ. సత్యముగన్ = నిజముగ, నిన్నున్, ఇప్పుడు, సత్యాసతి = సత్యభామ, మాకున్, ఇచ్చెన్. మాశబ్దమిచట శ్రీకృష్ణునిపైఁ దనకుఁగల యధికస్వామ్యము సూచించునది. సకలామ్నాయస్తుత్య = సర్వవేదములచే నుతింపఁదగినవాఁడా! మాయభీప్సితకృత్యంబులు=మాకిష్టములగుపనులను, సలుపుము=చేయుము. అనుచున్, కేళిపరుండై=వేడుకయందాసక్తుఁడై. తరువాతిపద్యముతో నన్వయము.

విశే. ఇదివఱకు నీవు మాకు వశుఁడవుగావు. నేఁడన్నో నిక్కముగ సత్య మాకు దానము చేయుటకతన మాస్వత్వమైతివి. ఇంక మాకాంక్షితముల మోక్షాదుల నొసఁగుమని నారదుఁ డావేదవేద్యుఁ బ్రార్థించెననియుం ధ్వనితమగు. మాకున్+ఇచ్చెన్ = ఇచ్చోఁ బ్రతిగ్రహీతృవాచకమునకుఁ దెనుఁగున షష్ఠియగుట నవిరుద్ధము.

నారదుఁడు కృష్ణునిచేఁ బనులుగొనుట.

సీ. మేళవించినవి సుమ్మీ దీనిమెట్లని
మూఁపలాంసంబున మహతిఁ జేర్చి
పన్నీటిజలము సుమ్మీ తొలంకెడు నని
డాచేత మణికమండలు వొసంగి

యిది జపోచితము సుమ్మీ జతనం బని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిది యని
శార్దూలచర్మంబుఁ *జంకఁ జొనిపి
తే. పొమ్ము పొమ్మని యొకకొంత పోవఁబోవ
రమ్ము రమ్మని మరలఁ జేరంగఁ బిలిచి
కపటనటనాపరుం డైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులుగొనియె. 86

టీ. దీని మెట్లు, మేళవించినవిసుమ్మీ=స్వరానుకూలముగఁ గూర్చినవిసుమా; అని, మాంసలాంసంబునన్=బలిసినభుజముమీఁద; శ్రీకృష్ణునిభుజముపైననుట. మహతిన్ = మహతియను వీణెను, చేర్చి, నారదునివీణకు మహతి యని పేరు. "విశ్వావసోస్తు బృహతీ తుంబురోస్తుకళావతీ, మహతీనారదస్య" అని యమరము. స్వరానుకూలముగ మెట్ల నమర్చితి. అవి స్థానముందప్పనుజుమీ జాగ్రత్తయని చెప్పెననుట. వీణమూఁపుపైనుంపఁదగినది గాన నందే యుంచెనని గ్రహించునది. మిన్నేటిజలముసుమ్మీ=మందాకినీజలముసుమా!, తొలంకెడున్=తొణఁకును, అని, డాచేతన్=ఎడమచేతియందు, మణికమండలువు = మణివికారమైనకమండలువును, ఒసంగి = ఇచ్చి; ఇందాకాశగంగాజలమున్నది. తొణఁకునుజుమీ జాగ్రత్తగాఁ బట్టుకొమ్మని మణికమండలువును శ్రీకృష్ణునిచేతియందుంచెననుట. ఎడమచేత జలపూరణమగుచెంబును ధరించుటయు, నాచమనమొనర్చునపుడు కుడిచేత నెడమచేతితో నీరును వంచుకొనుటయు సహజమగుట నందుంచె. మఱియు మిన్నేటిజలమనుట యిదిజాఱిన మఱిలసులభముగాదని తెల్పుటకని గ్రహించునది.ఇది, జపోచితము సుమ్మీ=జపమునకుఁదగినదిసుమా! జతనంబు=జాగ్రత్త, అని, వలచేతన్=కుడిచేతియందు, పద్మాక్షవలయము=తామరపూసలదండను, ఇచ్చి; ఈమాలజపమున కెంతయుం నుపకరించునది జాగ్రత్తసుమీయని కుడిచేత పద్మాక్షవలయము నిడెననుట.జపకాలమునఁ బవిత్రమైన కుడిచేతనక్షవలయముందాల్చుట సహజముగాన దీనింగుడిచేతఁబెట్టెనని యెన్నునది.ఈశానుఁడు=ఈశ్వరుఁడు, ఇచ్చెఁజుమ్మీ. మాకున్; తనకనుట. ఇది, అని, శార్దూలచర్మంబున్= పులితోలును, చంకన్=కక్షమునందు, జొనిపి=పెట్టి; ఈశ్వరుఁడిది యొసంగె జాగ్రత్త యనుచుఁ జంకను బులితోలుజొనిపెననుట. దర్భాసనము నాయాస్థలములకుఁబోవునపుడు చంకనిడికొనుట సహజమగుట నద్దానిం జంకఁజొనిపెనని యెన్నునది. పొమ్ము. పొమ్ము,

* సందిఁ జొనిపి.

ఁగని, ఒకకొంత=కొంచెముదూరము, పోవన్ పోవన్ = పోఁగా పోఁగా, రమ్ము రమ్ము, ఁగని; రారా పోపోయని యనుట. మరలన్, చేరంగన్=దగ్గఱగా, పిలిచి, కపటనటనాపరుండైన=కృత్రిమంపువర్తనమందాసక్తుఁడైన, కంసవైరిన్=శ్రీకృష్ణుని, పరమముని = నారదుఁడు, నవ్వుటాలకున్=పరిహాసములకై, పనులుకొనియెన్ = సేవచేయించుకొనియెను. రారా పోపో యనువాక్య మెంతయు హాస్యరసాత్మకము.

విశే. ఆతఁడు చెప్పినచొప్పున రమ్మన వచ్చుటయుఁ, బొమ్మనఁ బోవుటయుఁ గపటనటనకు సూచకములు. దేవదేవుని యాయాయవయవములకుఁ దనవస్తువులను నారదుఁడు సోఁకించుటకు నిక్కముగ నాలోచింప నాదేవునిపవిత్రావయవస్పర్శమున నావస్తువులు పవిత్రములగుననియుఁ, నాపవిత్రవస్తుస్పర్శమునఁ దానుగూడఁ బవిత్రుఁడ నగుదుననియుఁ నారదుఁడు భావించుటయే కారణమని యెన్నఁదగును.

మ. నిగమాంతప్రతిపాద్యు నాద్యు నభవు న్నిత్యు న్గుణాతీతు వి
శ్వగురున్ జిన్మయు నవ్యయుం బరము నిశ్శంకం బనుల్గొంచు మా
నిగరిష్ఠుండు కృతార్థుఁ డయ్యె నన సందేహింపఁగా నేల భ
క్తగణాధీనుఁ డనంగ నవ్విభుఁడు లోకఖ్యాతిఁ బెంపొందఁడే. 87

టీ. నిగమాంతప్రతిపాద్యున్=ఉపనిషత్తులచేఁ జెప్పఁబడువానిని, అనఁగా నుపనిషద్వేద్యుఁడనుట; వేదవేద్యుఁడని భావము. ఆద్యున్ = అన్నింటికి మొదలైనవానిని, అభవున్=పుట్టుకలేనివానిని, నిత్యున్=శాశ్వతుని, గుణాతీతున్=సత్వరజస్తమోగుణములనతిక్రమించినవాని; నిర్గుణుననుట. విశ్వగురున్=జగద్గురుని, చిన్మయున్=జ్ఞానరూపుని, అవ్యయున్=నాశరహితుని, పరమున్=సర్వోత్తముని; పరాత్పరుననుట. నిశ్శంకన్ = సందియములేక, పనుల్గొంచున్=పనులనుబుచ్చుకొనుచు; సేవచేయించికొనుచననుట. మానిగరిష్ఠుండు = మానులలో మిగుల గొప్పవాఁడను నారదుఁడు, కృతార్థుఁడు = ధన్యుఁడు, అయ్యెన్; ఏమానులును భగవానునిచేఁ బనులుగొనఁజాలమియుఁ, దానట్టిభాగ్యమును బడయుటయుఁ నారదుని కృతార్థతకుఁ గతములు. అనన్ = అనఁగా, సందేహింపఁగా, ఏల=ఎందులకు?, అవ్విభుఁడు=ఆశ్రీకృష్ణుఁడు, భక్తగణాధీనుఁడు=భక్తులసమూహమునకు వశమైనవాఁడు, అనంగన్ = అనునట్లుగా, లోకఖ్యాతిన్=లోకప్రసిద్ధితో, పెంపొందఁడే=అతిశయింపఁడే; అనఁగా నాతఁడు భక్తవశుఁడను నానుడిగలవాఁడగుట నిపుడు భక్తాగ్రేసరుఁడగు నారదునకు వశుఁడై మెలంగుట చిత్రముగాదని భావము. ఇతరముల మాని సర్వదా భగవానుని ధ్యానించువాఁడే భక్తుఁడు.

చ. అపుడు విరించిసూనుఁడు జనార్దనునెయ్యపువాలుఁగంటిఁ జూ
చి పడఁతి! నీమనోహరునిఁ జేకొను [1]మిచ్చెద నంచుఁ బల్కుచో
నపరిమితప్రమోదభరితాననయై వెస నిచ్చె వేలుపుం
దపసికి నాత్మభూషణవితానము లన్నియు నిష్క్రయంబుగన్. 88

టీ. అపుడు, విరించిసూనుఁడు=బ్రహ్మపుత్త్రుఁడగు నారదుఁడు, జనార్దనునెయ్యపువాలుఁగంటిన్=శ్రీకృష్ణుని ప్రియపత్నిని; సత్యననుట. వాలుఁగంటిన్=విశాలములైన కన్నులుగలదానిని, చూచి, పడఁతి=తరుణీ!, నీమనోహరునిన్ = నీమదినిహరించినవాని; నీప్రియుననుట. చేకొనుము=స్వీకరింపుము, ఇచ్చెదను, అంచున్, పల్కుచోన్=పల్కునపుడు; పల్కఁగాననుట. అపరిమితప్రమోదభరితాననయై=అధికసంతోషముచేఁ బూర్ణమైన మొగముగలదై, వెసన్=శీఘ్రముగ, వేలుపుందపసికి=సురమునికి నారదునకు, ఆత్మభూషణవితానములు+అన్నియున్ = తనయలంకారములనెల్లను; నగలననుట. నిష్క్రయంబుగన్ = మూల్యముగా; మాఱ్పుగాననుట. ఇచ్చెన్. తననగలవినిమయముగ నొసంగి నారదునుండి తనప్రియునిం గ్రహించెనని భావము.

విశే. నీమనోహరుఁడగుట నీవాతనిఁబాసియుండఁజాలవనియు, జనార్దనునెయ్యపువాల్గంటివనుట నాతఁడును నిన్నెడఁబాసియుండలేఁడనియు, దాన మీయిర్వురంగూర్చుటయే నాయాశయమనియుం నారదుఁడు నేర్పుగఁ బల్కెనని యెన్నునది.

క. ఇచ్చి కయికొనియెఁ గ్రమ్మఱ
నచ్చిగురుంబోఁడి విభుని నావైభవమున్
మెచ్చి కురియించి రపుడు వి
యచ్చరు లచ్చెరువుగాఁగ నలరులవానల్. 89

టీ. ఇచ్చి, క్రమ్మఱన్=మఱల, అచ్చిగురుంబోఁడి = ఆపల్లవాంగి; సత్య, విభునిన్=నాథుని, కైకొనియెన్=స్వీకరించెను. వియచ్చరులు = సురలు, ఆవైభవమున్, మెచ్చి, అచ్చెరువుగాఁగన్=ఆశ్చర్యముగా, అలరులవానల్=పుష్పవర్షములు, కురియించిరి. దివినుండి పూలవానలు గురిసెనని భావము.

చ. తనుతరమధ్య యాగమవిధానము తప్పక యుండ మౌనిచే
ననుమతిఁ గాంచి మ్రొక్కి వినయంబున నందఱ నామతించి క
ల్పనగము క్రొవ్విరు ల్కనక [2]పాత్రమునం దగనించి యిచ్చె వా
యనములు రుక్మిణీప్రభృతు [3]లౌసవతుల్పదియాఱువేలకున్. 90

1 మిప్పుడ నీకు నిత్తునా; మిప్పుడ నీకు విల్తునా. 2 పాత్రములం. 3 లైనసతుల్

టీ. తనుతరమధ్య=మిక్కిలిసన్ననైన నడుముగలది సత్యభామ, ఆగమవిధానము =శాస్త్రవిధి, తప్పకయుండక్=తప్పకుండుటకై, మౌనిచేన్=నారదుని చే, అనుమతిన్ = అంగీకారమును, కాంచి=పొంది; "శాస్త్రవిధానము తప్పలేదు. నీవు నీపతి నిట్లుపొందుట శాస్త్రసమ్మతమే. వ్రతము సువ్రతమైనది" అని యాతనిచే ననిపించికొని యనుట. మ్రొక్కి, వినయంబునన్=అడఁకువతో, అంపఁగన్, ఆమంతించి=పిలిచి, కల్పనగము క్రొవ్విరుల్ = కల్పవృక్షపుఁగ్రొత్తపూవులను; అపుడే కోసినవనుట. కనకపాత్రమునన్ = బంగరుపళ్లెరమున, నించి = నింపి, రుక్మిణీప్రభృతులౌసవతుల్పదియాఱు వేలకున్ = రుక్మిణి మొదలగు పదాఱువేలసవతులకును, వాయనములు; బహుమానము లనుట. ఇచ్చెన్.

వ్యా-విశే. "ఒక్కపూవామౌని యీయ రుక్మిణి యపురూపముగఁ దనకొప్పునం దాల్చె. ఇదిగో నేనిపుడు మీకెల్లరకు వలయునన్ని యిచ్చుచున్నదానను" అని సత్య తనవైభవమును గర్వమును సవతులకుఁ బ్రకటించెనని యెన్నునది......'సవతుల్ పది యాఱువేలకున్' ఇచ్చో విశేషణమగుసవతులనుదానికిఁ బ్రథమ "విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమయగునను ప్రౌఢ వ్యా. కారక. 22-వ సూత్రముచే సాధువగును. "అహీనబలసారఘనుల్ మధుకైటభాదిదైత్యపతులకు. తల్లిద్రౌపదితోడన్" అని కవీశుల ప్రయోగములు.

క. ఈచందమున నమానుష
గోచరమహిమాఢ్యుఁడైనగోవిందుని స
త్యాచంద్రముఖీవరు సుర
వాచంయమివరుఁడు చతురవాచాప్రౌఢిన్. 91

టీ. ఈచందమునన్ = ఈవిధముగ, అమానుషగోచరమహిమాఢ్యుఁడైన = మనుష్యులకుఁ దెలిసికొనరాని మహిమతోఁగూడిన, గోవిందునిన్ = శ్రీకృష్ణుని, సత్యాచంద్రముఖీవరున్ = సత్యభామయను చంద్రవదనకు భర్తయైనవానిని, సురవాచంయమివరుఁడు = సురమునిశ్రేష్ఠుఁడు నారదుఁడు, చతురవాచాప్రౌఢిన్ = నిపుణములగుమాటల ప్రౌఢత్వముచే 100-వ పద్యమందలి 'కొనియాడి యరిగె' అనుదానితో నన్వయము.

విశే. పారిజాతప్రబంధకథ కేవలము సత్యకు శ్రీకృష్ణుఁడు స్వాధీనుఁడైయుండుటనే సూచించునదగుట సత్యాచంద్రముఖీవరపదమునే శ్రీకృష్ణునివిషయమునఁ బ్రకృతమునకుఁ దగినరీతినిఁ గవి వాడుట సరసము.

నారదుఁడు కృష్ణుని స్తుతించుట.

అనులోమవిలోమకందము.—

క. *నాయశరగసారవిరయ
తాయనజయసారసుభగధరధీనియమా
మాయనిధీరథగభసుర
సాయజనయతాయరవిరసాగరశయనా! 92

టీ. నాయ......జయసార-నాయ=నీతిని, శర=బాణములను, గ = పొందిన, సార = బలమును, వి = పక్షియొక్క; గరుడునియొక్కయనుట. రయ = వేగమును, తాయన = విస్తరింపఁజేయునట్టి, జయసార = విజయసారముగలవాఁడ! నీతిబాణబల గరుడవేగజాతమైనసారవిజయము తన్నుసాధించిన నీతిబాణబలగరుడవేగములనెంతయుఁ బెంపొందించెననుట. అనఁగా విజయసంభవమువలనఁ దత్సాధనసామగ్రి కెంతయుఁబొంగు సిద్ధించెనని భావము. సుభగ=సుందరుఁడా! ధర.....,నియమా-ధర = కొండనుబోలు, ధీ=బుద్ధియొక్క, నియమా=కట్టుఁబాటుగలవాఁడ; అచలమైన బుద్ధినియమనముగలవాఁడనుట. మా......నిధీ-మా=లక్ష్మికిని, అయ=శుభావహవిధికిని, నిధీ=గనియైనవాఁడా! స్థానభూతుఁడనుట. లక్ష్మీవాసుండును గల్యాణరూపుండునని భావము. రథ.....సుర-రథ=శరీరమును, గ=పొందిన, భ=చంద్రుఁడును, సుర=దివిజులును గలవాఁడ! సర్వదేవాత్మకుండనుట. సాయజ.....రవిర-సాయ=బాణములచే, జ=పుట్టిన, నయ=నీతియొక్క, తాయ=విస్తృతిచే, రవి=జీవులను, ర=ఆకర్షించువాఁడ. దుర్జనులనమ్ములశిక్షించి ధర్మవు నెలకొల్పి ప్రజలమెప్పుగన్నవాఁడనుట. లేదా, సాయజనయ=బాణములవలననైన నీతి గలవాఁడ. దుష్టశిక్షణమున ధర్మమును బాదుకొల్పినవాఁడా యనుట. తాయరవిర = విస్తృతిచే సూర్యునాకర్షించినవాఁడా! వామనావతారమున మిన్నంటురూపముండాల్చిన వాఁడుగాన నిదియుఁ బొసఁగును. సాగరశయనా=సముద్రముశయ్యగాఁ గలవాఁడ.

విశే. సుభగవీర్యభగినీభగవత్యాదిశబ్దములు వ్యుత్పత్త్యర్థమునరసిన గ్రామ్యములుగఁ దోఁపకపోవు. కాని వీనివ్యుత్పత్త్యర్థమును గవిలోకము విచారింపక సుందరాద్యర్థములఁ బ్రయోగించుటంజేసి వీనికట్టిగ్రామ్యత తోఁచెను. ఇట్లు గ్రామ్యతాదోష మేవానికేని యక్కాలపుజనవ్యవహారమునుబట్టి కలుగుట సైజము. జనవ్యవహార మనంతములగు మార్పులనందునదిగానఁ గొలఁదికాల మతిక్రమింపఁ గొన్నిగ్రామ్యశబ్దములకు గ్రామ్యత

* ముద్రితప్రతులలో నీపద్యము గానరాదుగాని భారతి దీనినర్థభ్రమకముగా నుదాహరించుటంజేసి యిందు నిరూపితము.

గాలఁగుటయుఁ, గొత్తఁగఁ గొన్నింటికి గ్రామ్యత కలుగుటయు సంభవించుచుండును. గాన నేనాఁడో యప్పటిలోకవ్యవహారమున సిద్ధించినగ్రామ్యత యనంతరమున నష్టమగుటయుఁ, గవులు విరివిగ వీనిఁ బ్రయోగించుటయుఁ గుదిరె. తనకాలమున కె యట్టిగ్రామ్యత తోఁచునెడలఁ గవి యట్టివానిని వాడునా? ఆంధ్రమహాభారతమునఁ బ్రయుక్తములైన 'ఈక, కుడుచు, ద్రొబ్బు మున్నగునవి నేఁడు గ్రామ్యము లైనవి. గల్లకటిశబ్దాదులు గ్రామ్యములన్న సంస్కృతాలంకారికులమాట సరకుగొనక యాంధ్రకవులం వానిని కబ్బములఁ బ్రయోగించిరి. ఇదంతయు నరయ విరసార్థప్రకాశనవశమున శబ్దమునకైన గ్రామ్యత వ్యవహారవశమునఁ గల్గినదిగానఁ జిరస్థాయిని గానేరదనియుఁ, గాలపరిణామవశమున నాగ్రామ్యత యగ్రామ్యతగాఁ దప్పక మాఱుననియుఁ, గాన నేనాఁడో గ్రామ్యమని యీనాఁడును దాని వాడరాదనుట యసంగతమనియు నిశ్చయింపనగును.

N. B. తృప్తికరముగ దీనియర్థము నుద్ధరింప వీలుచిక్కినదికాదు. సహృదయులు సమర్థులు మున్ముందు ప్రకాశిత మొనర్తురుగాక.

విశే. అర్థభ్రమకమనఁగాఁ బద్యమును దుదినుండి మొదలువఱకు వ్యత్యాసముగాఁ జదివినను నదేప్రకార మేర్పడునట్లు చెప్పుట. ప్రకృత మీకందమును దుదినుండి త్రిప్పి చదివినను మొదటినుండి చదివినట్లే చదువఁబడును గాన నిది యర్థభ్రమక మనఁబరఁగుచున్నది. మఱియు నిందుఁ దొలియర్థమును ద్రిప్పి చదివినచో నుత్తరార్థమును, నుత్తరార్థమును ద్రిప్పి చదివినచోఁ బూర్వార్థమును నేర్పడునుగాన సంగోరునకే యనఁగా నర్థభాగమునకే భ్రమణము గలదుగాన నిది యర్థభ్రమకమను సార్థకనామము నందినది.

**పాదభ్రమకము.**

క. ధీర శయనీయశరధీ, మారవిభానుమతమమత మనుభావిరమా
సారసవనవసరసా, దారదసమతార*తార తామసదరదా! 93

టీ. ధీర=ధైర్యవంతుఁడా! శయనీయశరధీ = శయనార్హమైన సముద్రముగలవాఁడా! జలనిధిశయనుఁడనుట. మార......మమత-మార=మన్మథునియొక్క, విభా = కాంతికి, అనుమత=సమ్మతమైన, మమత=దేహాభిమానముగలవాఁడా! మదనసమతేజుఁడనుట. మనుభావిరమా=మననముచేఁగలుగుసంపదగలవాఁడా! సార......సరసా-సార=శ్రేష్ఠములైన, సవన=యజ్ఞములందు, నవసరసా=నూతనసరసుఁడైనవాఁడా! యజ్ఞహవిర్భోక్తయనుట. దారదసమతారతార = పాదరసమునకు సమానమైన ముక్తాహారములుగలవాఁడా! తామసదరదా=దుర్మార్గులకు భయమునిచ్చువాఁడా! దుష్టశిక్షకుఁడనుట.

విశే. ఇదిపాదభ్రమకము. ఇందుఁగల నాలుగుపాదములలోఁ బ్రతిపాదమును వ్యత్యాసముగా ననఁగాఁ దుదినుండి మొదలునకుఁ జదివినచో నదేపాద మేర్పడును గాన, దీనిని బాదభ్రమక మందురు. ప్రతిపద్యపాదమును ద్రిప్పిచదివినను యథాపూర్వముగ

* హార.

ననఁగా మొదటినుండి చదువునపుడేర్పడురీతి నేర్పడుచో నట్టిరచన పాదభ్రమకమునాఁ బడును. ఇట్టిశబ్దచిత్రములగు రచనలు నిక్కముగ రసప్రతిబంధకము లగుటంజేసి, దండ్యాద్యాలంకారికులు 'తత్తు నైకాంతమధురమతఃపశ్చాద్విధాస్యతే' అని యమకప్రస్తావనయందుఁ జెప్పిరి. కాని యిట్టివానిని గవు లనేకులు తమకబ్బములందుఁ జొనిపియున్నారు. ఆక్రమమునుబట్టి యాలోచింప నేకదేశస్థితములగుటంబట్టి యిట్టిరచనలు కావ్యజీవిత రసప్రతిబంధకములు గాఁజాలవని తలంచిరని తోఁచెడిని. పైనివ్రాసినప్రకారము 'తత్తు నైకాంతమధురమ్' అని వీనినిగూర్చి యనిష్టమునగపఱచిన దండ్యాచార్యుఁడే పలురకములగు ననులోమప్రతిలోమాది యమకభేదములను, నేకాక్షరద్వ్యక్షరాదిరచనావిశేషములను నిరూపించుటంబట్టి చూడఁగా నిట్టిరచనలును గొంతవఱకు హృదయంగమములై యుండుననియే యప్పటికవిపండితలోకపుతలంపని చెప్పవలసియున్నది. అయినను నీరచనలు సామాన్యముగఁ గావ్యగడువులేయని చెప్పుటకు సందియములేదు.

## గోమూత్రికాబంధము.

క. విదళితదైత్యా రమాగృహా,పదసారసవినత దేవ పతగేశహయా
చిదమిత చైత్యశమావహ,మదవారణ విమతభావమతపాశజయా!

వి ళి దై ర గృ ప సా స న దే ప గే హ
ద త త్యా మా హా ద ర వి త వ త శ యా
చి మి చై శ వ మ వా ణ మ భా మ పా జ

టీ. విదళితదైత్య=నఱుకఁబడినరాక్షసులుగలవాఁడ, రమాగృహా=లక్ష్మికిస్థానమైనవాఁడ, పద......దేవ-పదసారస=పాదపద్మములందు, వినత=నతులైన, దేవ=దేవతలుగలవాఁడ, పతగేశహయా = పక్షీంద్రుఁడగు గరుడుఁడు వాహనముగాఁగలవాఁడ, చిదమిత=జ్ఞానముచేనధికుఁడా! చైత్యశమావహ=జీవులకు శాంతినిగూర్చువాఁడ, మదవారణ=మత్తునుదొలఁగించువాఁడ, విమత......జయా-విమతభావ=విరుద్ధభావములను; అనఁగాఁ గామక్రోధాదులననుట. విమతమత = విరుద్ధమతములను; నాస్తికాదిమతములననుట. విమతపాశ = విరుద్ధములగుబంధములను; అనఁగా భయసంశయాదులననుట. జయా=జయించినవాఁడ.

వి శే. పైని నిరూపించినప్రకారము దీనియుద్ధారమును లిఖించి, పద్యపాదములు నాల్గింటిలోను మొదటిరెండుపాదములయందలి యక్షరములను, మొట్టమొదటిచాలుగా

మొదటియక్షరమును, పిదప నొకయక్షరమును వదలి తరువాతియక్షరము నిట్లే నొక్కొక వర్ణమును నడుమనడుమ వదలి వ్రాసి, బంధమునడుమ నావదలినయక్షరములను రెండవ చాలుగాలిఖించి, మూఁడునాలుగుపాదములందలి యక్షరములలోఁ బూర్వమువలెనే మొదటియక్షరము మొదలుకొని యొక్కొక్కటి నడుమ విడుచుచు మూఁడవపంక్తిని క్రిందుగా వ్రాసి మొట్టమొదటియర్ధమును మీఁదినుండి క్రిందుగాను, రెండవయర్ధమును గ్రిందనుండి మీఁదుగాను జదువవలెను. ఇదియె గోమూత్రికాబంధోద్ధారపఠనక్రమము.

శ్లో. "వర్ణానామేకరూపత్వం యద్యేకాంతరమర్ధయోః,
గోమూత్రికేతి తం ప్రాహుర్దుష్కరం తద్విదో విదుః"
అని దండికావ్యాదర్శలక్షణము.

## నాగబంధము.

చ. జలదవితాననీల ఖలసాలకులక్షితివారణేశ ని
శ్చలమునివారపాల సురచారణయక్షనవానుకూల కుం
డలివరహారలోల నరనారదతత్పర భూవిధేయ యు
జ్జ్వలమనునీతిశీలితవశంవద శక్రరమానికేతనా! 95



టీ. జలదవితాననీల=మేఘబృందమువలె నల్లనైనవాఁడా! ఖలసాల......వారణేశ-ఖల=దుష్టులనెడు, సాలకుల=వృక్షసమూహముయొక్క, క్షతి=నాశవిషయమున, వారణేశ=గజేంద్రముంబోలువాఁడా!, "ఖల=దుష్టులగు, సాలకుల = మద్దిచెట్లగుమిని' క్షతి=నశింపఁజేయుటయందు" అనియుఁ జెప్పనొప్పును. నిశ్చలమునివారపాల=నిశ్చలులైన మునిసమూహముల రక్షించువాఁడా! సురచారణయక్షనవానుకూల=సురలు,యక్షులు, చారణులు అనువీరికి నూత్నమైనయనుకూలుఁడా; అనఁగా వీరలకు హితుఁడనుట. కుండలివరహారలోల=సర్పహారుఁడగు శివునియందాసక్తుఁడా! నరనారదతత్పర=నరుఁడు నారదుఁడను ఋషులందాసక్తిగలవాఁడా! భూవిధేయ = భూదేవికి విధేయుఁడవైనవాఁడా; శ్రీవిష్ణువునకు భూదేవి భార్య యగుట ప్రసిద్ధము. ఉజ్జ్వల.....వశంవద-ఉజ్జ్వల = ప్రకాశించునట్టి, మనునీతి=మనుధర్మశాస్త్రమునందలి ధర్మములందు, శీలిత=స్వభావము గలవారికి, వశంవద=స్వాధీనుఁడా; అనఁగా మనువుచేఁ జెప్పఁబడిన ధర్మముల ననుసరించి మెలఁగువారియందుఁ బ్రసన్నుఁడై వర్తిలునసుట. శక్రరమానికేతనా=ఇంద్రలక్ష్మికి స్థానమైనవాఁడా!; అనఁగా స్వారాజ్యమున కుపద్రవముగల్గినపుడెల్లను దాని నేదోయొకయుపాయమున విష్ణువు వారించి తిరుగ సురపతికి దాని నిచ్చువాఁడౌట విష్ణువు శక్రరమానికేతనుఁ డయ్యెనని యెన్నునది.

విశే. అప్పకవి చెప్పిన నాగబంధోద్ధారము.

క. "ఇలతో నెనుబదినాలుగు, నిలయంబులునగు పయోదనిభనీలాంగా
మెలిగొన్నపాము వలె వెలు, పలగుగ్ దలతోఁక నాగబంధంబునకున్."

ఛురికాబంధము.

క. శ్రీవర వరవరహృతభవ,భావన వనజాయతాక్ష పాలితవిబుధా
ధావితదనుభవ నియమిస,భావనచతురా సముద్ధృతార్ణవవసుధా!




టీ. శ్రీవర=లక్ష్మికి పతియైనవాఁడా! వరవర......భావన-వర = సారములైన, వర=వరములచేత, హృత=హరింపఁబడిన, భవభావన=సంసారచింతలుగలవాఁడ, వనజాయతాక్ష=పద్మములవలె దీర్ఘములగుకన్నులుగలవాఁడ, పాలితవిబుధా=రక్షింపఁబడిన దేవతలుగలవాఁడ, ధావితదనుభవ=పఱుగెత్తింపఁబడిన రాక్షసులుగలవాఁడ, నియమి.....

చతురా-నియమి=మునులయొక్క, సభా=సమూహమును, అవన = రక్షించుటయందు, చతురా=నేర్పుగలవాఁడా ! సముద్ధృతార్ణవవసుధా=ఎత్తఁబడినసముద్రమందలిభూమి కలవాఁడ. ఇచట వరాహావతారకథ ననుసంధింపవలెను.

విశే. అప్పకవి చెప్పిన ఛురికాబంధోద్ధారము.

క. "చరణాంత్యవర్ణ మొక్కటి, చరణయుగాద్యమ్ముఁ జేసి సరసులు మువ్వా
రిరుగడలమధ్య మొకటిగఁ, బరుఁజూలఁ గదియింప ఖడ్గబంధం బొనరున్."

## —చక్రబంధము.—

శా. చిత్రాకృత్యభినందితవ్రజమృగాక్షీమధ్యగా యక్షరా
మిత్రోష్ణద్యుతిదిగ్ధచక్ర జనివల్మీకర్ష పా కృష్ణభా
సత్రారాధ్య నుతింతు నిన్ను జగదీశా విక్రమాతిస్థిరా
రాత్రి *నాంచితభామితాబ్జ సదయా రాధానుభావాకరా! 97



టీ. చిత్రా.....వ్రజమృగాక్షీమధ్యగా-చిత్రాకృతి=చిత్రమైన యాకారముల చేత, అభినందిత=సంతోషపెట్టఁబడిన, వ్రజమృగాక్షీ=గొల్లకొమ్మలయొక్క, మధ్యగా=నడుమునుబొందినవాఁడా!; అనఁగా నేవనిత యేరూపముంగోరు నారూపముంభజించి వారి

* శాంచిరభామితా.

నానందింపఁజేయుచు నావనితలంగూడియున్నవాఁడా యనుట. లేదా, "చిత్రాకృతి = చిత్రమైనయాకారముగల రాసక్రీడచే, అభినందిత=సంతోషపెట్టఁబడిన, వ్రజమృగాక్షీ=గొల్లచేడెలయొక్క,మధ్యగా=నడుమనున్నవాఁడా" అనియుఁ జెప్పనగును. అక్షరా=నాశశూన్యుఁడా! మిత్రోష్ణ......చక్ర-మిత్ర=సూర్యునియొక్క, ఉష్ణద్యుతి = తీక్ష్ణకాంతులచే, దిగ్ధ=పూయఁబడిన, చక్ర=చక్రాయుధముగలవాఁడ, జని.....ర్క్ష్మపా-జని=పుట్టుకయనెడు, వల్మీక=పుట్టకు, ఋక్షపా = భల్లూకపతియైనవాఁడ; భల్లూకము పుట్టను బురుగులకై త్రవ్వివేయుట సైజము. కృష్ణభా=నల్లనికాంతిగలవాఁడ, సత్రారాధ్యా=యాగములందుఁ బూజ్యుఁడా! జగదీశా = లోకనాయకా! విక్రమాతిస్థిరా = పరాక్రమముచే ధీరుఁడా! రాత్రీన......తాబ్జ-రాత్రి+ఇన=రాత్రీన=రేరాజైనచంద్రుని యొక్క, అంచిత=ఒప్పుచున్న, భా=కాంతులతో, మిత=తులితమగు, అబ్జ=శంఖముగలవాఁడ, సదయా=దయతోఁగూడినవాఁడ, రాధా...కరా-రాధా=రాధాదేవియొక్క, అనుభావ=కటాక్షాదులకు, ఆకరా=స్థానమైనవాఁడా!

విశే. చక్రబంధోద్ధారము.

మ. "పయిఁబైఁగాఁ బదిచుట్లు నాఱుదళముల్ ప్రాగ్రేఖలందిర్చి స్వా
వ్యాయపత్యావ్యయముఖ్యచిహ్నములు గన్పట్టంగఁ బాదత్రయా
శ్రయరేఖాంత్యపదాశ్రయాదివృతిగా శార్దూలవిక్రీడితా
వ్యాయవృత్తంబు యథాక్రమంబుగ లిఖింపం జక్రబంధంబగున్.

ఇందు మూఁడవచుట్టునఁ "గృష్ణరాయకృతి" యనియు, నాఱవచుట్టున "నంది తిమ్మకవి" యనియుఁ గృతిపతిపేరును గవిపేరును బొందుపఱుపఁబడినవి.

ద్వ్యక్షరికందము.

క. మనమున ననుమానము నూ
నను నీనామ *మనుమనుమననమును నేమ
మ్మున మాన నన్ను మన్నన
మను మను నానామునీనమానానూనా! 98

టీ. నానా......నూనా-నానా=వివిధులైన, మునీన = మునిశ్రేష్ఠులయొక్క, మాన=ప్రమాణమునకు, అనూనా=అధికుఁడా!; ఋషులనెల్లరను మించిన మహిమగలవాఁడనుట. మనమునన్=మదియందు, అనుమానమున్=సందియమును, ఊనను=పొందను; ఇంకయసందియమందననుట. నీనామము=నీపేరు, అను = అనునట్టి, మనుమననమును=

* మును మను; మున మను.

[illegible], [illegible]=నియమముతో, మానక=విడువను. నన్నుక, మన్ననక [illegible], [illegible]=బ్రదుకుము, అను=అనుము. నను గౌరవమున వర్ధిల్లుమని [illegible] భావము.

[illegible] నమలతోఁ దనే నడుపంబడినదిగాన నిది ద్వ్యక్షరికంద మయ్యెను. [illegible] సంస్కృతమున నూహయే యర్థముగాని సందియమను నర్థము లేదు. [illegible] దీనిని బలుచోటుల సందియమనునర్థముననే వాడియున్నారు. "[illegible] [illegible]" అని తిక్కన. ఊహ యనునది నిశ్చయార్థ [illegible] కల్గునదిగాన దీని కీయర్థము నాంధ్రకవులు కల్పించి యుందురని [illegible].

## ద్విశకంద క్రౌంచపదము.

[illegible] అంకురితశ్రీ *సంగభుజాంకా హరిహయమణిమదహరతనువర్ణా
[illegible]కృద్దైత్యాశయ,శంకాజననిజచరిత శయధృతశంఖా! 99

[illegible] [illegible]జనాభా భంజితపంకా పరమపురుష భవపరిభవనామా
శంకరభావా కిసలయసంకాశపదయుగ కలశశరనిధిశయనా! 100

టీ. అంకురిత......భుజాంకా-అంకురిత=మొలచిన, శ్రీసంగ = లక్ష్మీదేవిసంబం[illegible], భుజాంకా=భుజచిహ్నముగలవాఁడా! లక్ష్మి యాశ్లేషించియున్నకతన భుజ[illegible] [illegible]రూపమగు చిహ్నమేర్పడెననుట. హరి......వర్ణా-హరిహయమణి=ఇంద్ర[illegible]ముల యొక్క, మద=గర్వమును, హర=పోఁగొట్టునట్టి, తనువర్ణా=శరీరకాంతి గలవాఁడ; నీలవర్ణుఁ డనుట. సంకట......చరిత-సంకటకృత్ = కష్టమునుగలిగించు, దైత్యాశయ=రాక్షసులయాలోచనలకు, శంకా=సందేహమును, జనన = పుట్టించునట్టి, [illegible] = స్వీయచరిత్రముగలవాఁడ; రాక్షసుల కష్టకార్యములకు నాశకుఁడాయనుట. శయధృతశంఖా = హస్తమునధరింపఁబడినశంఖముగలవాఁడ, పంకజనాభా = పద్మము [illegible]గలవాఁడా! భంజితపంకా=నశింపఁజేయఁబడిన పాపముగలవాఁడా! పరమపురు[illegible]=పురుషోత్తముఁడా! భవపరిభవనామా = సంసారమునవమానించు పేరుగలవాఁడా!; [illegible]న్నామస్మరణమున సంసారదుఃఖము నశించుననుట. శంకరభావా=శివుఁడు మదియందుఁ గలవాఁడా!; శంకరరూపుఁడనియుఁ జెప్పనగును. కిసలయసంకాశపదయుగ=చిగురులతోఁ దుల్యమైన పాదద్వంద్వముగలవాఁడ, కలశశరనిధిశయనా = పాలసముద్రమున శయనించువాఁడా!

* రంగభు.

విశే. ఇది క్రౌంచపదవృత్తము. క్రౌంచపదమునకుఁ బ్రతిపాదమున భ, మ, స, భ, న, న, న, య గణములుండును. పదునొకండవయక్షరము యతిస్థానము. ఇందు రెండు కందపద్యములు గలవు. ప్రథమార్ధము నొకకందముగను, (అనఁగా మొదటి రెండు పాదములనుట) నుత్తరార్ధము నొకకందముగను, (అనఁగాఁ దృతీయచతుర్థపాద ములననుట) జదువఁదగును. ఒకానొకపద్యమున నిట్లు వేఱొకపద్యమునుగాని పద్యము లనుగాని యిముడ్చురచనను గర్భకవిత్వమందురు. ఆశు, బంధ, గర్భ, చిత్రములని కవిత్వములు నాలుగువిధములు. పూర్వోక్తములైన గోమూత్రికాదులు బంధకవిత్వము నాఁబడు. ఇదియు దీనితరువాతిదియు గర్భకవిత్వము నాఁజను. 98 'మనమున ననుమాన మునూనను' అనునది చిత్రకవిత నాఁబరఁగును. తక్కుఁగల ప్రబంధములోనిపద్యముల రచన యాశుకవిత యనఁదగును.

భుజంగప్రయాతగర్భస్రగ్విణి.

వాసుదేవా ఘనస్వచ్ఛకాంతీ రమా
వాస వంశస్వరవ్యక్తవేదక్రమా
రాసలాస్యప్రకారప్రవీణోద్యమా
వాసవాదిస్తుతవ్యక్తనామా నమః. 101

టీ. వాసుదేవా=వసుదేవపుత్త్రుఁడా! ఘనస్వచ్ఛకాంతీ=ఘనమేఘమువంటి స్వచ్ఛమైనతేజస్సుగలవాఁడా! రమావాస=లక్ష్మీదేవికి నివాసస్థానమైనవాఁడా! వంశ...... క్రమా-వంశ=పిల్లనగ్రోవియొక్క, స్వర=ధ్వనిచేత, లేక స్వరవిశేషములచేత, వ్యక్త=తెలియఁజేయఁబడిన, వేదక్రమా = వేదపాఠక్రమముగలవాఁడా, శ్రీకృష్ణపరమాత్మనిపిల్లన గ్రోవినుండిపుట్టిననాదములు వేదపాఠక్రమమునుం బోలియున్నవనుట. రాస......ద్యమా-రాసలాస్య=రాసక్రీడయను నాట్యవిశేషముయొక్క, ప్రకార=రీతియందు, ప్రవీణ= కుశలమైన, ఉద్యమా = యత్నముగలవాఁడా!; రాసక్రీడయందు మిగులనైపుణిగలవాఁడనుట. వాసవాది......నామా-వాసవాది = దేవేంద్రుఁడు మొదలగువారిచే, స్తుత = నుతింపఁబడిన, వ్యక్త=విశదమైన, నామా= పేరుగలవాఁడా! నమః=నమస్కారము.

విశే. స్రగ్విణికిఁ బ్రతిపాదమున నాలుగు రగణము లుండును. సప్తమాక్షరము యతిస్థానము. భుజంగప్రయాతమునకుఁ బ్రతిపాదమున నాలుగుయగణము లుండును. సప్తమాక్షరము యతిస్థానము. ఇందుఁ దుదిఁగల 'నమః' అనుపదమును మొదటఁ జేర్చి చదివినచో భుజంగప్రయాత మేర్పడును. ఇందుఁ బ్రబంధాంత మగుచున్నది కానఁ గవియు నీమూలమున భగవానున కంజలిఘటించెనని గ్రహింపవలెను.

క. అని చిత్రగతుల నవ్విభుఁ
గొనియాడి మునీంద్రుఁ డరిగె గోపవధూటీ
జనతావల్లభుఁడును మి
త్రనికాయముతోడ నిజపురంబున కరిగెన్. 102

టీ. అని, చిత్రగతులన్=చిత్రములగురీతులతో; చిత్రములగు కవిత్వపురీతులతో ననియు నర్థాంతరము. అవ్విభున్ = ఆశ్రీకృష్ణుని, కొనియాడి=నుతించి, మునీంద్రుఁడు=మునిశ్రేష్ఠుఁడు నారదుఁడు, అరిగెన్=వెడలెను. గోపవధూటీజనతావల్లభుఁడును=గోపికాసమూహమునకుఁ బ్రియుఁడైన శ్రీకృష్ణుఁడును, మిత్రనికాయముతోడన్ = మిత్రులసమూహముతోడ, నిజపురంబునకున్=తనపట్టణమునకు; ద్వారకకనుట. అరిగెన్.

చ. నిజపురి కేగుదెంచి ధరణీధరుఁ డప్పుడు భోజరాజధ
ర్మజకురునాథముఖ్యమహిమండలనాథులఁ దక్కుఁగల్గు బ
న్ధుజనులఁ గల్పకద్రుమజనూతనదివ్యవిభూషణాంబర
వ్రజము లొసంగి వీడ్కొని నిరంతరసౌఖ్యరసైకలోలుఁడై. 103

టీ. నిజపురికిన్ = తనపట్టణమునకు, ఏగుదెంచి = వచ్చి, ధరణీధరుఁడు=శ్రీకృష్ణుఁడు, అప్పుడు, భోజరాజధర్మజకురునాథముఖ్యమహిమండలనాథులన్=భోజరాజు, ధర్మరాజు, కౌరవరాజు; (దుర్యోధనుఁడనుట.) మొదలగురాజులను, తక్కుఁగల్గుబంధుజనులన్=తక్కినబంధువులను, కల్పకద్రుమజనూతనదివ్యవిభూషణాంబరవ్రజములు=కల్పవృక్షమునుండి పుట్టిన యపూర్వములైనదివ్యములైనయలంకారములయు బట్టలయు సమూహములను, ఒసంగి = ఇచ్చి, వీడ్కొని = సెలవిచ్చి పంపి, నిరంతరసౌఖ్యరసైకలోలుఁడై=అత్యధికమగుసుఖము ననుభవించుటయందే ముఖ్యముగ నాసక్తుఁడై. తరువాతి పద్యముతో నన్వయము.

క. తలిరులతుదఁ జినుకులు జల
జల వడియఁగ దడిసి మెలఁగుచలికరువలి ను
న్సొలపమున విరియుపరువపుఁ
దొలుమొగడలవలపు దెలుపుతోఁటలలోనన్. 104

టీ. తలిరులతుదన్=చిగుళ్లకొసలనుండి, చినుకులు=నీటిబొట్టులు, జలజలన్=జలజలయనునట్లుగా, వడియఁగన్=రాలఁగా, తడిసి, మెలఁగు=సంచరించునట్టి, చలికరువలి ఉన్సొలపమునన్=చల్లగాలియొక్క మృదుప్రసారముచే, విరియు=వికసించిన, పరువపుఁదొలుమొగడలవలపు=వికసించిన తొలుఁదొల్తలొడిగిన మొగ్గలయొక్క పరిమళమును,

తెలుపు=ప్రకటించు, తోఁటలలోనన్=ఉద్యానములలో 107-వ పద్యమునందలి 'ఓలలాడుచుండెన్' అను క్రియతో నన్వయము.

భా. చెట్టులచిగుళులతుదినుండి నీటిచుక్కలు రాలుచుండెననియు, వానితాఁకున తడిసినగాలి యయ్యుద్యానములందలి తొల్తతొడిగిన పరిపక్వముకుళముల పరిమళమును బ్రకటించుచు వీచుచుండెననియుఁ భావము. చినుకులచేఁ దడిసినదనుటంజేసి చల్లందనము, నున్నొలపమనుటంజేసి మాంద్యమును, బరిమళము ప్రకటించునదనుటంజేసి సౌరభ్యమును సూచితములు. ముఖ్యముగ నీకవీశునచ్చతెనుఁగురచన కిది ముఖ్యోదాహరణముగానోపును. అలంతిజిలిబిలిపలుకులతోడ ముద్దుగ వ్రాయుట విందు వర్ణితము. అలం. వృత్త్యనుప్రాసము.

క. దరదళదంబుజముకుళో,దరదళమిళదళికులచ్ఛదప్రహతిసర
త్సరసరజోధూసరపరి,సరసరసీతీరకుంజసదనస్థలులన్. 105

టీ. దరదళ......స్థలులన్-దర=ఇంచుక, దళత్=వికసించిన, అంబుజముకుళ=తామరమొగ్గలయొక్క, ఉదర=నడుమఁగల, దళ=రేకులందు, మిళత్ = కూడియున్న, అళికుల=తుమ్మెదగుంపుయొక్క, ఛద=ఱెక్కలసంబంధమైన, ప్రహతి = దెబ్బచే, సరత్=జాఱుచున్న, సరస=మరందముతోఁగూడిన, రజః=పరాగముచేత, ధూసర=బూడిదరంగైన, పరిసర = చుట్టుప్రక్కలనున్న, సరసీతీర = సరస్సుగట్టునందలి, కుంజసదన = పొదరిండ్లయొక్క, స్థలులన్ = ప్రదేశములందు 107-వ పద్యమునందలి 'ఓలలాడుచుండెన్' అను క్రియతో నన్వయము.

విశే. ముఖ్యముగ నీకవీశుని మృదుసంస్కృతపదరచన కిది యుదాహరణమగును. అలం. వృత్త్యనుప్రాసము యమకము.

√క. మరకతగోమేదకపు,ష్యరాగవిద్రుమవిదూరసంభవముక్తా
హరినీలవజ్రకురువిం,దరత్నమయకృతకభూమిధరకందరలన్. 106

టీ. మరకత......కందరలన్-మరకతము, గోమేదకము, పుష్యరాగము, పగడము, వైదూర్యము, మంచిముత్యము, ఇంద్రనీలము, వజ్రము, కెంపు అను, రత్నమయ=నవరత్నమయమైన, కృతకభూమిధర=కల్పితములైన కొండలయొక్క, (అనఁగాఁ గ్రీడా పర్వతములనుట.) కందరలన్ = గుహలందు. 107-వ పద్యమునందలి 'ఓలలాడుచుండె'నను క్రియతో నన్వయము.

విశే. ఇందు నవరత్నములుం జేర్పఁబడినవి.

సీ. భోజకన్యాసరిద్రాజహంసము సత్య
భామాశుకీకేళిపంజరంబు
జాంబవతీనిశాచంద్రోదయంబు కా
ళిందీసరోజినీందిందిరంబు
భద్రాకలాపినీప్రావృడంబుదము సు
దంతారసాలలతాపికంబు
మిత్రవిందావనీచైత్రాగమము లక్ష
ణాహారయష్టికానాయకంబు
గీ. షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ సౌఖ్యాంబునిధి నోలలాడుచుండెఁ
గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు. 107

టీ. భోజకన్యా......హంసము-భోజకన్యా=రుక్మిణియనెడు, సరిత్ = నదికి, రాజహంసము=రాయంచయైనవాఁడును; నదికధీనమై రాయంచ వర్తిలుగతిని శ్రీకృష్ణుఁడు రుక్మిణీప్రియుఁడై వర్తిలెనని భావము. ఇందు భార్యలను గవి క్రమమును దప్పక మనోహారముగఁ జేర్కొనెను. సత్య......పంజరంబు-సత్యభామా = సత్యభామయనెడు, శుకీ=ఆఁడుచిలుకకు, కేళిపంజరంబు=విలాసపంజరమైనవాఁడును; చిలుక కట్టుబాటులేని విలాసపంజరమున విహరించుగతిని సత్య శ్రీకృష్ణునింగూడి విహరించుచుండెననుట. జాంబవతీనిశాచంద్రోదయంబును-జాంబవతీ=జాంబవతియనెడు, నిశా=రాత్రికి, చంద్రోదయంబును=చంద్రోదయమైనవాఁడును; చంద్రోదయమున రేయి శోభిల్లి యొప్పునట్లు శ్రీకృష్ణునికూడికను జాంబవతి యత్యంత మొప్పొంగుచుండెననుట. కాళిందీ......దిందిరంబు- కాళిందీ=కాళిందియనెడు, సరోజినీ=పద్మలతకు, ఇందిందిరంబు = తుమ్మెదయైనవాఁడును; తుమ్మెద తమ్మిపరిమళమునకుఁ జొక్కి పద్మలతను బాయకుండుగతిని శ్రీకృష్ణుఁడు కాళిందిని బాయకయుండెననుట. భద్రా......బుదము-భద్రా=భద్రయనెడు, కలాపినీ=ఆఁడునెమిలికి, ప్రావృడంబుదము = వార్షికమేఘమైనవాఁడును; ఆఁడునెమిలి వర్షాకాలమేఘముం గాంచి యానందపరవశయైనగతిని భద్ర శ్రీకృష్ణసందర్శనమున నధికసంతోషము నందెననుట. సుదంతా......పికంబు-సుదంతా=సుదంతయనెడు, రసాలలతా = మామిడిగున్నకు, పికంబు=కోయిలయైనవాఁడును; పికము రసాలమును వీడనియట్లామెం గూడి శ్రీకృష్ణుఁ డుండెననుట. పికము మామిడిచివురు మెసవునదిగాన నాచెట్టునది విడువ

కుండుట సహజము. మిత్రవిందావనీచైత్రాగమము-మిత్రవిందా = మిత్రవిందయనెడు, వనీ=అరణ్యభూమికి, చైత్ర = వసంతర్తువుయొక్క, ఆగమము = రాకయైనవాఁడును; వసంతర్తువుచేరికను నరణ్యభూము లపూర్వమగునందము వహించుగతిని, శ్రీకృష్ణునికూడి కనుమిత్రవింద యధికానందము నందెననుట.లక్షణా......నాయకంబు-లక్షణా=లక్షణ యనెడు, హారయష్టికా = యష్టికవంటిహారమునకు, నాయకంబు=నాయకమణియైనవాఁడును; నాయకమణిచే హారమధికశోభకలదియగుగతిని శ్రీకృష్ణునికూడికను లక్షణ ముద మందెననుట. నాయకమనఁగా హారమధ్యగమణి. పైసీసపాదములందు నాల్గింటను శ్రీకృష్ణునష్టమహిషులు సక్రమముగ నిరూపితలైరి. మీఁదిగీతపాదమునఁ దక్కిన పదాఱువేలగోపికలను శ్రీకృష్ణుఁడు సంతోషపెట్టుట సూచింపఁబడెను. షోడశ......వారణేంద్రము-షోడశసహస్ర = పదాఱువేలమందియైన, కామినీస్తోమ = వలపుఁగత్తెలసమూహమనెడు, ధేనుకా=ఆఁడేనుగులతో, రిరంసా=రమించుకోర్కిగల, మదోత్కట=మదముచేనధికమైన, వారణేంద్రము=గజశ్రేష్ఠమైనవాఁడును; వారణేంద్రము కరిణీబృందములో రమించుగతిని శ్రీకృష్ణుఁడు పదాఱువేలకామినులంగూడి విహరించుచుండెననుట. అనఁగన్=అనునట్లు, కృష్ణుఁడు, అఖిల......వర్తిష్ణుఁడు-అఖిల=సమస్తమును, అవన=రక్షించుటయందు, ఏక=ముఖ్యముగ, వర్తిష్ణుఁడు = ప్రవర్తించుస్వభావముగలవాఁడు, అగుచున్, సౌఖ్యాంబునిధిన్=సుఖసముద్రమున, ఓలలాడుచుండెన్ = ఈఁదులాడుచుండెను. సంపూర్ణానందము నందుచుండెననుట.

విశే. ఇందు 'హరి శ్రీకృష్ణ' అనుమున్నగుపదములతో శ్రీకృష్ణుని బోధింపక సామాన్యముగ 'కృష్ణుఁడు'అని యనుటంబట్టి కృతిపతియగు కృష్ణరాయలను గవి ధ్వనితుం జేయ యత్నించెనని తోఁచెడిని. దానఁ బూర్వదిగ్విజయ మాచరించి యేతెంచి భార్యలతోడ సుఖించు కృష్ణరాయలవ్యాపారము నిందు ధ్వనితమొనర్చెననియుం నూహ పొడమెను. ఇందులకు నిఖిలావనైకవర్తిష్ణుఁడనుపదమును సాహాయ్యము గాఁగలదు. మఱియుం శ్రీకృష్ణుఁడు పూర్వదిక్పతియైన యింద్రునింజయించుట కృష్ణరాయలు పూర్వదిక్పతియైన రాజును జయించుటకు సూచకమగుననియుం భావము పొడమెడు. శ్రీకృష్ణుఁడు తన తలపైఁ దన్నినదాని నభిమతార్థప్రదానమున గౌరవించుట కృష్ణరాయలు ప్రణయాపరాధము గావించిన తిరుమలదేవిని గౌరవించుటకు సూచకమని తోఁచెడి. ఇట్లీకథ యెంతయుఁ గృతిపతిచరిత్రసూచకమై మనోజ్ఞమగుగతిని గవి కూర్చెనేమో యని సందియము జనించెడిని. రిరంసా-ఇది సన్నంతము-రంతుమిచ్ఛా రిరంసా, వర్తిష్ణుః=ఇష్ణుచ్ప్రత్యయాంతరూపము. ఇట్లే 'వర్ధిష్ణుః' అను మున్నగునవి.

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహారసన్మానయుతుఁడు
తే. తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ. 108

టీ. కౌశికగోత్రవిఖ్యాతుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రము నాపస్తంబసూత్రమునను. ఆర్వేలపవిత్రకులుఁడు; ఆర్వేలనియోగిపవిత్రవంశజుఁడనుట. నందిసింగామాత్యునకును, తిమ్మాంబకున్, తనయుండు; తండ్రి సింగన, తల్లి తిమ్మాంబ, ఇంటిపేరు నందియనుట. సకల......చతురుఁడు-సకల=సమస్తమైన, విద్యా=విద్యలయొక్క, వివేక=జ్ఞానమునందు, చతురుఁడు=కుశలుఁడైనవాఁడు, మలయమారుతకవీంద్రునకున్=మలయమారుతబిరుదమందిన ఘంటసింగయకు, మేనల్లుండు=తోఁబుట్టువుకొడుకు, కృష్ణరాయ......యుతుఁడు-కృష్ణరాయ = కృష్ణరాయలనెడు, క్షితీశ = రాజుయొక్క, కరుణా=దయచే, సమాలబ్ధ=పొందఁబడిన, ఘన=గొప్పవియైన, చతురంతయాన=పల్లకీలు, అగ్రహార=జీవనమునకై యిచ్చినగ్రామములు, (ఈరూపమైన) సన్మాన=బహుమానములతో, యుతుఁడు = కూడినవాఁడు; అగ్రహారమనఁగా బ్రాహ్మణులకు జీవనమునకై రాజులిచ్చినగ్రామములు (అగ్ర=బ్రాహ్మణులు, హార=ఆహారము).అగ్రశబ్దము బ్రాహ్మణులు వర్ణములలో మొదటివారుగాన వారిని బోధించును. తిమ్మయార్యుండు = (అయ, అన, అన్న, ఇవి యన్నియుఁ బూజ్యార్థకములేగానఁ దిమ్మన తిమ్మన్న యనికూడ ననఁదగును.) తిమ్మయయనుపూజ్యుఁడు, శివపరాధీనమతి=శివునియందు వశమైనబుద్ధిగలవాఁడు; అనఁగా శివభక్తుఁడనుట. అఘోరశివగురుశిష్యుండు = అఘోరశివుఁడను గురువునకు శిష్యుఁడైనవాఁడు, ఆదివాకరతారాసుధాకరముగన్ = సూర్యుఁడు నక్షత్రములు చంద్రుఁడు నున్నంతకాల ముండునట్లుగా, అంధ్రభాషన్ = తెలుఁగుబాసయందు, పారిజాతహరణము, అను=అనెడు, కావ్యము=ప్రబంధము, ఒనరించెన్=రచించెను.

విశే. కవులు తమగ్రంథములలోఁ గాలము నేలాగో ప్రకటించునలవాటులేమి నీతఁ డిన్ని చెప్పియుం బ్రబంధకాలమును దేటపఱుపఁ డయ్యెను.

శా.*ఏకచ్ఛత్త్రితసర్వభూతల! నృసింహేంద్రక్షమాభృత్తపః
పాకద్యోతితరూప! మౌక్తికతులాభారప్రదానోన్నతా!
కోకస్తన్యసమాస్త్రసన్నిభ! హరిత్కూలంకషోద్యద్యశః
శ్రీకర్ణాటమహీశ! వైరికరిరాట్సింహప్రతాపోదయా! 109

టీ. ఏకచ్ఛత్త్రితసర్వభూతల = ఏకచ్ఛత్త్రముగలదిగాఁ జేయఁబడిన సమస్తమైన భూమిగలవాఁడ; తనయొక్క నియంద నే యుండునట్లు భువినేలెనని. నృసింహేంద్ర......రూప-నృసింహేంద్ర=నృసింహరాజును, క్షమాభృత్=భూపతియొక్క, తపః పాక=తపస్సులపంటచే, ద్యోతిత=ప్రకాశితమైన, రూప=స్వరూపముగలవాఁడా; అనఁగా నరసరాజునోములపంట యనుట. మౌక్తిక......సన్నిభ-మౌక్తిక = ముత్యములచేనైన, తులాభార=తులాభారమనుదానమును, ప్రదాన=ఇచ్చుటయందు,ఉన్నత=గొప్పవాఁడా!; త్రాసునఁ దానొకప్రక్కఁ గూర్చుండి వేఱొకప్రక్కఁ దనయెత్తునకు సరిగ రత్నాదులఁ బోసి వానిని దానమిచ్చుట తులాభారమనంబడును. కోకస్తని......సన్నిభ-కోకస్తనీ= చక్రవాకములంబోలు స్తనములుగలస్త్రీలకు, అసమాస్త్ర=మన్మథునితో, సన్నిభ=సదృశమైనవాఁడా! హరిత్......మహీశ-హరిత్కూలంకష=దిక్కులయొడ్డుల నొరయునట్టి; అనఁగా దిగంతముల వ్యాపించినట్టియనుట. ఉద్యత్=అభివృద్ధినందు, యశః = కీర్తిగల, శ్రీకర్ణాటమహీశ=శ్రీకర్ణాటదేశాధిపతీ! వైరి......దయా-వైరి=శత్రువులనెడు, కరిరాట్=గజరాజములకు, సింహప్రతాప=సింహపరాక్రమముయొక్క, ఉదయా=ఉద్భవమైనవాఁడా!; సింహపరాక్రమోదయముఁగాంచి గజరాజములు భయపడునట్లితని ప్రతాపోదయముంగాంచి రాజులెల్లరు భయపడుచుండిరనుట.

విశే. తులాభారపదముచే సీప్రబంధమందలి పుణ్యకవ్రతకథయు వైరికరిరాట్పదముచే నింద్రవిజయకథయుం సూచితములు.

క. భువనవిజయాఖ్యసంసన్నవరత్నవిభాప్రభాతనలినాప్త! రమా
ధవచరణకమలసేవా, ప్రవణమతీ! వీరరుద్రపర్వతవజ్రీ! 110

టీ. భువన......నలినాప్త-భువనవిజయ=భువనవిజయమనెడు, ఆఖ్య = పేరుగల, సంసత్=సభయందలి, నవరత్నవిభా=నవరత్నములకాంతులకు, ప్రభాతనలినాప్త = బాలసూర్యుఁడైనవాఁడా!; సూర్యోదయమున సూర్యకిరణసంబంధమున మణులు దేదీప్య

* ఏకచ్ఛత్త్రపదావనీతల!

మానములగుట సహజము. కృష్ణరాయలు బాలసూర్యునివగిది నాకొలువుకూటమున వెలుంగ నమ్మణుల కపూర్వశోభ కల్గెనని భావము. రమా......మతీ-రమాధవ=శ్రీవిష్ణుని యొక్క, చరణకమల = పాదపద్మములయొక్క, సేవా=సేవించుటయందు, ప్రవణ = ఆసక్తమైన, మతీ=బుద్ధిగలవాఁడా; శ్రీవిష్ణుభక్తాగ్రేసరుఁడనుట. కవి తా శైవుఁడైనను కృతిపతిప్రీతికై వైష్ణవకథాప్రధానమగు నీకబ్బమును రచించెనని తెల్లమయ్యెడి. వీర రుద్రపర్వతవజ్రీ=వీరరుద్రగజపతియనెడు పర్వతమునకు నింద్రుఁడవైనవాఁడా! ఇందింద్రపదమునుబట్టి యింద్రవిజయము సూచితమనఁదగును.

విశే. కృష్ణరాయనికొలువున నష్టదిగ్గజము లుండిరని కింవదంతి. కాని నవరత్న శబ్దసారస్యము ననుసరించి నవరత్నము లుండిరేమోయని యనుమానము పొడమెడి.

మంగళమహాశ్రీవృత్తము.—

చిత్తజభిదంఘ్రియుగచింతనకళాధిగతజిష్ణుసమవైభవవిశేషా!
విత్తరమణామరగవీతరణిభూజలదవిశ్రుతకరాంబురుహా! గోష్ఠీ
నృత్తమణిరంగతల! నీతిమనురాజనిభ! నిర్భరదయారసపయోధీ!
మత్తగజయూథమదమగ్నసుఖితాళిరవమాన్యగృహమంగళమహాశ్రీ.

టీ. చిత్తజ......విశేషా-చిత్తజభిత్=శివునియొక్క, అంఘ్రియుగ = పాదద్వయముయొక్క, చింతనకళా=ధ్యానవిద్యచేత, అధిగత=పొందఁబడిన, జిష్ణుసమ=ఇంద్ర సదృశమైన, వైభవవిశేషా=విభవవిశేషములుగలవాఁడా; శివధ్యానమునఁ గృష్ణరాయలకు దేవేంద్రవైభవము కల్గెనని భావము. కవి శివభక్తుఁడగుట నిట్లు చెప్పెనుగాని కృష్ణరాయలు వైష్ణవమతావలంబియగుట నిది పొసఁగదు. కాని శివమతమున రాయలకు ద్వేషము లేదనుట కిది సూచకముగానగును. విత్తరమణ......కరాంబురుహా-విత్తరమణ=ధనపతి కుబేరునివలెను, అమరగవీ=సురలయావగుకామధేనువువలెను, తరణిభూ=సూర్యునికొడుకగుకర్ణునివలెను, జలద=మేఘునివలెను, విశ్రుత=ప్రసిద్ధమైన, కరాంబురుహా=హస్తపద్మముగలవాఁడా; అనఁగా వారివలె నడ్డులేకదానము చేయుచునదనిభావము. గోష్ఠీ......రంగతల-గోష్ఠీ=విద్వాంసులగోష్ఠియనెడు, నృత్త=నాట్యమునకు, మణిరంగతల=మణినిర్మిత నాట్యభూమియైనవాఁడా! పండితగోష్ఠులకాస్పదమైనవాఁడనుట. నీతిమనురాజనిభ = ధర్మములవిషయమున మనువునకుఁ దుల్యమైనవాఁడా; మనువువలె సర్వధర్మపరిజ్ఞాతయనుట. నిర్భరదయారసపయోధీ=పూర్ణమైనకృపారసమునకు సముద్రమైనవాఁడా!; మిగుల దయగలవాఁడనుట. మత్త......మహాశ్రీ-మత్త=మదించిన, గజయూథ=గజసమూహ సంబంధమైన, మద=దానోదకమున, మగ్న=మునిఁగినట్టియు, సుఖిత = సుఖపడునట్టి,

అళి=తుమ్మెదలయొక్క, రవ=ధ్వనులచే, మాన్య=పూజ్యమైన, గృహ = భవనసంబంధమైన, మంగళ=శుభమైన, మహశ్రీ=మహాసంపత్తుగలవాఁడా!; అనఁగాఁ గృష్ణరాయని భవనమున మదించినయేనుఁగులు గలవనియు, వానిమదజలమున మునిఁగి తుమ్మెదలు కలరవము లాచరించుచుండుననియు, దాన నాతనిగృహము మంగళములకాకరమై, మహాలక్ష్మితోడ విలసిల్లుననియు భావము.

విశే. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే' అను భాష్యోక్తి ననుసరించి యిచ్చోఁ గవితల్లజుఁడు తిమ్మయ మంగళమహశ్రీ యనుపదము ప్రయోగించియు, శ్రీశబ్దము నంతమున ననుసంధించియు మంగళాంతముగఁ గావ్యమును బరిసమాప్తినొందించుట యెంతయు సరసము. మఱియుఁ దదనుకూలముగ మంగళమహశ్రీవృత్తముం గూర్చుట యెంతయు మనోజ్ఞమగు. మఱియు 'మత్తగజ...మంగళమహశ్రీ' అనుపదసారస్యము ననుసరించిన గజాంతైశ్వర్యసిద్ధిగా నాశీర్వదించినట్లును స్పష్టమగును. ఇంతియగాక కృతిపతి లబ్ధవిజయుఁడై శ్రీలకుఁ దావలమై వివిధసుఖములనుభవించుచు వివిధదానములఁ జేయుచు సుఖముగ నానందాబ్ధి నోలలాడుచుంటయుఁ సూచితము. కావ్యాదిని శ్రీకారమును నంతమున శ్రీకారమును వెలయుటం జేసి, శ్రీకారకరండమున నీకథ యిమిడ్చినట్లు తెల్లమగును.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన పారిజాతాపహరణంబను మహాప్రబంధంబునందు సర్వంబునుం బంచమాశ్వాసము.

పారిజాతాపహరణము సంపూర్ణము.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1933

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 56 | 18 | భాగ్య | భారవి |
| 64 | 9 | డీలుపట | డీలుపడ |
| 65 | 23 | అర్పణచరిత్ర | అర్పణః-చరిత్ర |
| 66 | 15 | కలటు | కలఘు |
| ,, | ,, | జగములవెంటఁగ్ | 'ఇటు జగములవేఁటఁగ్' అను పాఠమగపడు. |
| 73 | 12 | అధీనుఁడగుటను | అధీనుఁడగుటకును, |
| 73 | 17 | N. B. ఈపంక్తి త్యాజ్యము. దీనికి బదులుగ 'సమాసమునఁ జేతతోఁడవలన లకిత్వంబగు.' అనుపద్ధతి నిత్యము కలిగె' అని పాఠకులు చదువవలయును. మఱియుం 'కూడిమాడి'—శబ్దపల్లవము. 'సమసుఖదుఃఖానుభవమర్థము' అను వాక్యము నా క్రిందఁ జేర్చి పఠింపవలయును. | |
| 75 | 18 | విశేష | విశేషణ |
| 78 | 18 | కథను | కథీను |
| 80 | 6 | ష్యంగము | వ్యంగ్యము |
| 84 | 4-5 | ఈతావి | తావియిని |
| ,, | 4 | ఈపాఠము | 1 ఈపాఠము |
| 86 | 17 | వచ్యర్థముభూతంబునలా డ్రూపము | పచ్యర్థమునకు - భూతంబున లిడ్రూపము. |
| 108 | 2 | సిమంత | సీమంత |
| 132 | 4 | క్ష్మి | లక్ష్మి |
| 135 | 6 | ఫాలాక్షా | ఫాలనేత్రా |
| ,, | 29 | పాగ్రామా | ప్రాగ్రామా |
| 211 | 3 | చంసక | చంపక |
| ,, | 7 | నరయు | నరయ- |
| 232 | 21 | వైజయంతము | వైజయంతమున- |
| 234 | 27 | ృష్ణుఁడు | కృష్ణుఁడు- |
| ,, | ,, | కవెల్ల | వెల్ల |
| 246 | 6 | వేఱెంక | వేఱొక |
| 344 | 7 | ఇష్టాగొ | ఇష్టాగో |

# పద్యకావ్యము.

| | రూ. | అ. |
|---|---|---|
| ప్రతి 1-కి | రూ. | అ. |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారివిమర్శతో నున్నది. | 2 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాగితముల మీఁద చక్కఁగా ముద్రించినారము. ... | 4 | 0 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండు సంపుటములు ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు ... | 9 | 0 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, గిల్టుబైండు ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము. ఉళసరిక గీతములు ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనికూర్పు ... | 1 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు. శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు ... | 2 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలుప్రతి ... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| మనుచరిత్ర. సటీక, వావిళ్లరామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్న సైజున మేలు కాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నారము ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు ... | 2 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రకవి ... | 1 | [illegible] |
| లంకావిజయము, (రావణదమ్మీయము) సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము, అనేకనూతనాంశములుగల చక్కని క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరన్న, క్రొత్తకూర్పు ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
29. ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ